# తెలుగులో పరిశోధన

## రజతోత్సవ సంచిక

సమీక్షా వ్యాస సంకలనం

సంపాదక మండలి

దేవులపల్లి రామానుజరావు
పి. ఎస్. ఆర్. అప్పారావు
జి. వి. సుబ్రహ్మణ్యం
ఇరివెంటి కృష్ణమూర్తి





ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

**TELUGULO PARISHODHANA** -ESSAYS ON RESEARCH IN TEL

A Silver Jubilee Souvenir - Published by Andhra Pradesh Sahitya Aka
Hyderabad.



---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రచురణ : 347

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1983

ప్రతులు : 2000

వెల : రూ. 25-00

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
"కళాభవన్", సైఫాబాద్,
హైదరాబాదు - 500 004

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-1

# సంపాదకీయం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి జీవితంలో ఇరువై అయిదు సంవత్సరాలు పూర్తియై సందర్భాన్ని పురస్కరించుకొని రజతోత్సవాల పండుగ ఏర్పాటు చేయవలెనని నిశ్చయించనైనది 1982 ఆగస్టునుండి 1983 ఆగస్టువరకు రజతోత్సవ సంవత్సరంగా ఎన్నుకొని యీ పండుగ సంవత్సరం పొడుగున నిర్వహించవలెనని అకాడమి నిర్ణయించి కార్యక్రమాలను రూపొందించినది దక్షిణ దేశభాషల సాహిత్యాల సమీక్ష చేసే సదస్సుతో పాటు, తెలుగు పుస్తక ప్రచురణ-పంపిణీ సమస్యలకు సంబంధించి చర్చాగోష్ఠి యీ కార్యక్రమంలోని ముఖ్యాంశాలు. ఇందుకు తోడుగ పండితులకు, పరిశోధకులకు, విద్యార్థులకు, భాషాభిమానులకు ఉపయోగించే ప్రామాణికమైన వ్యాస సంకలనాన్ని ప్రకటించవలెనని కూడ అకాడమి నిశ్చయించినది. ఈ నిశ్చయాని ఆచరణ రూపమే యీ సంచిక.

కడచిన 25 సంవత్సరాలలో సాహిత్య అకాడమి బహుముఖమైన, విశిష్టమైన కృషి చేసినది. ఈ కృషి భాషా సాహిత్య రంగాలలో పరిశోధనకు విశేషంగా తోడ్పడినది. మాండలిక వృత్తిపదకోశాలు, ప్రాచీనాంధ్ర కవుల పదప్రయోగ కోశాలు, సామెతల సంపుటం, పదబంధాల సంపుటాలు, ఆంధ్ర క్రియాస్వరూప మణిదీపిక, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం, ప్రాచీనాంధ్ర శాసనాలు, వ్యాస రచనల సూచి, వ్యాస రచయితల సూచి, శాసన పదకోశం మొదలైనవి భాషా రంగానికి సంబంధించినవి. అలభ్యమైన మహాకావ్యాల ప్రచురణ, తెలుగు వ్యాఖ్యాన సహితంగా తెలుగు లిపిలో సంస్కృత నాటకాల, కావ్యాల ప్రచురణ, అలంకార శాస్త్ర గ్రంథాల తెనిగింపు, గద్య చంద్రిక, వ్యాసతోరణం, హాస్యతోరణం, నాటికా పంచవింశతి, నూరు సంవత్సరాల తెలుగు వ్యాసము, తెలుగు నవలల సమీక్షలు, దక్షిణదేశ భాషల సాహిత్య చరిత్రలు మొదలైనవి సాహిత్య రంగానికి సంబంధించినవి. జానపదగేయాలు, ఆంధ్రుల జానపద విజ్ఞానం, కాటమరాజు కథలు మొదలైనవి జానపద వాఙ్మయరంగానికి చెందినవి. తెలుగు వైతాళికులనుగూర్చిన సాహిత్య సభలు, ఆ సభలలో జరిగిన ప్రసంగాల ప్రచురణ, ఆధునిక వాఙ్మయానికి సంబంధించిన సంకలన గ్రంథాల ప్రకటన, వేమన ఆంగ్లానువాదం, ఎక్బాల్ కవితల తెనిగింపు, హిందీలో తెలుగు సాహిత్యాన్ని పరిచయం చేసే సమీక్షాత్మక గ్రంథాల ప్రచురణ, ఉర్దూలో ఆధునిక సాహిత్య సంపుటాల ముద్రణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి చేసిన సర్వతోముఖమైన కృషిలోని భాగాలు. సమకాలిక సృజనాత్మక రచనల ప్రకటనను సాహిత్య అకాడమి ప్రోత్సహించినది.

800 పైగా సమకాలిక రచయితలకు గ్రంథాల ప్రచురణ నిమిత్తం సాహిత్య అకాడమి ఆర్థిక సహాయం గావించినది. తెలుగు-తెలుగు నిఘంటువు, తెలుగు సంస్కృతకోశం, విజ్ఞాన దీపిక రెండు సంపుటాలు, సమానార్థ వ్యతిరేకార్థ పదనిఘంటువు, ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు, అకాడమీ ప్రచురణలలో ఆధునిక అవసరాలకు ఉపకరించే ఉద్గ్రంథాలు. స్థూలంగా పరిశీలించినప్పటికినీ, యీ కృషి బృహత్తరమైనదని చెప్పక తప్పదు. వాస్తవానికి ఇటువంటి కృషి, భారతదేశంలో ఏ సంస్థ పక్షాన జరుగలేదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. ఆర్థిక వనరుల పరిమితులను, నియమావళి పరిమితులను గమనించినప్పుడు ఈ కృషి సర్వతోముఖమైనదే కాక ప్రశంసనీయమైనదని స్పష్టము కాగలదు.

భాషా సాహిత్య రంగాలలో పరిశోధన సాహిత్య అకాడమి లక్ష్యాలలో ప్రధానమైనది. ఇందుకు అనుగుణంగా అకాడమి పక్షాన తగినంత కృషి జరిగినది. కావుననే యీ రజతోత్సవాల సందర్భంగా కడచిన నూరు సంవత్సరాల కాలంలో జరిగిన పరిశోధనను సమీక్షించుకొనడం సముచితం కాగలదని సాహిత్య అకాడమి అభిప్రాయపడి యీ రజతోత్సవ సంచికను తదనుగుణంగా సిద్ధంచేసి ఆంధ్ర పాఠకలోకానికి అందజేస్తున్నది. మన దేశంలో విశ్వవిద్యాలయాల అవతరణ, ఆంగ్ల విద్యాబోధనల ఫలితంగా భారతీయ భాషల పరిశోధనా రంగంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైనది. ఆధునిక కాలంలో పరిశోధన పలుతీరులుగా పురోగమించి విశ్వవిద్యాలయాలలోను, వాని వెలుపలను విస్తరించినది. కొన్ని సంస్థలు, కొందరు పండితులు ఈ రంగంలో అపారమైన కృషి గావించినారు. కొన్ని పత్రికలు ఈ కృషికి చేసిన దోహదం చరిత్రాత్మకమైనది. ఈ కృషి వివిధ సాహిత్య ప్రక్రియలకు, భాషాశాస్త్ర, అలంకారశాస్త్ర, వ్యాకరణశాస్త్రాది అంశాలకు సంబంధించినదిగా ఉన్నది. ఒకమారు ఈ కృషిని వివేచనాత్మకంగా సమీక్షించుకోవలసిన ఆవశ్యకతను సాహిత్య అకాడమి గుర్తించినది. అంతేకాదు, తెలుగులో పరిశోధన భవిష్యత్తునుగూర్చి కూడ కొంత ఆలోచించవలెనని సాహిత్య అకాడమి సంకల్పించినది. ఈ సంకల్ప ఫలితమే ఈ సంచిక. సాధ్యమైనంతవరకు ఈ సంచికను సమగ్ర సుందరంగా ప్రకటించవలెనని సాహిత్య అకాడమి ప్రయత్నించినది. ఈ సంచిక నూరేండ్ల తెలుగు పరిశోధనకు దర్పణమై భవిష్యత్తుకు కరదీపిక కాగలదని ఆశిస్తున్నాను.

దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు,
31-8-1983.

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి రజతోత్సవాల నివేదిక

1982 ఆగస్టు 7 నాటికి సాహిత్య అకాడమి 25 సంవత్సరాలు పూర్తి చేసుకుంటున్నది. రజతోత్సవాల కార్యక్రమాలను రూపొందించడానికి అకాడమి కార్యవర్గం ఒక ఉప సంఘాన్ని ఏర్పాటు చేసినది. ఉప సంఘ సభ్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావుగారు, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి (కార్యదర్శి).

గడచిన 25 సంవత్సరాలలో సాహిత్య అకాడమి తెలుగు సాహిత్య వికాసానికీ, తెలుగు రచయితల ప్రతిష్ఠకూ, తెలుగు పఠితృ లోకానికీ పరిశోధకులకూ పండితులకూ అన్ని విధాలా ఉపయుక్తంగా ఉండే గ్రంథాలను ప్రచురించి ఉపన్యాసాలనూ, సదస్సులనూ ఏర్పాటు చేసి తెలుగు దేశంలోని నలుమూలల రచయితల మధ్య అక్షర సేతువుగా రూపొందుతూ వచ్చింది.

తెలుగు సాహితి వెయ్యేండ్ల పంట. పది శతాబ్దాలలో తెలుగు భాషా సాహిత్యాలు పలు మార్పులకు లోనైనవి. సంస్కృతం నుంచి ఇతర సోదర ద్రావిడ భాషలనుంచి వ్యాకరణాన్ని సాహిత్య శాస్త్రాన్ని ఛందస్సులను పదజాలాన్ని ప్రక్రియలను ఇతివృత్త సంపదను గ్రహించి స్వాయత్తం చేసుకున్నది. ఫారసీ, ఉర్దూ, ఇంగ్లీసు మున్నగు భాషా సాహిత్యాల ప్రభావాలను కూడ ఇటీవల విశేషంగా పులుముకున్నది. ఈ కారణాల వల్ల నేడు సజీవంగా అతి విస్తృతంగా ప్రాచుర్యాన్ని అందుకున్న తెలుగు భాషకు ఆధునిక అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఒక సరికొత్త తెలుగు వ్యాకరణాన్ని సిద్ధం చేయాలని నిఘంటువుల కెక్కని లక్షలాది తెలుగు మాటలను సేకరించి ప్రామాణికమైన, సమగ్రమైన తెలుగు నిఘంటువును సిద్ధం చేయాలని అకాడమి తాను పుట్టిననాడే, 1957 లోనే, ఆలోచనలు ప్రారంభించింది. వివిధ వృత్తులవారి పదకోశాలు మాండలిక పదకోశాలు ప్రామాణికమైన ప్రాచీనాంధ్ర దవుం పద ప్రయోగ కోశాలు ఇప్పుడు జిజ్ఞాసువులకు అలభ్యంగా ఉన్న ప్రాచీన కావ్యాల పరిష్కృత ముద్రిత ప్రతులను విద్వత్ పీఠికలతో వెలయించి ప్రచురించాలని, పాఠకుల కే కాక రచయితలకు కూడా మార్గదర్శకంగా ఉండే పరామర్శ (రిఫరెన్సు) గ్రంథాలను ప్రచురించాలని అకాడమి ఉద్యమించింది. సమకాలీన సాహిత్యంలో, వివిధ ప్రక్రియల్లో వెలువడిన ఉత్తమ గ్రంథాలకు బహుమతులు ఇచ్చి రచయితలకు ఉత్తమాధ్యయనాభిరుచులు కలిగించడానికి అకాడమి ప్రయత్నిస్తూ వచ్చింది. యువకులలో పరిశోధనాసక్తిని ప్రోత్సహించే నిమిత్తం ప్రతి యేటా పోటీలు నిర్వహించి ఉత్తమ పరిశోధన గ్రంథానికి పురస్కృతినిచ్చి చక్కని రచనలు వెలువడేందుకు అనువైన అవకాశాలను కల్పిస్తూ వచ్చింది. ఇంత వరకు దాదాపు నన్నూరు గ్రంథాలను ప్రచురించింది. తెలుగులోనే కాక సంస్కృతంలోను, ఇంగ్లీషులోను, హిందీలోను, ఉర్దూలోను పుస్తకాలను వెలువరించింది.

## ముందుమాట

# తెలుగులో పరిశోధన : తీరుతెన్నులు

"The experience of unique value in literature is basic to any theory concerning the nature of the value. Our shifting theories attempt to do progressively better justice to the experience."[1]

—Rene Wellek and Austin Warren.

* * * *

ఆంధ్ర సాహిత్య చరిత్రలో క్రీ.శ. 19 వ శతాబ్దం పునరుజ్జీవన దశకు ఉషోదయకాలం. ఆంగ్లభాషా సాహిత్య ప్రభావంవలన తెలుగులో నవ్య సాహిత్య ప్రక్రియలు వెలువడి ఆంధ్ర సాహిత్య జీవితానికి క్రొంగ్రొత్త జీవన రుచులను అందించాయి. అలా వెలువడిన ప్రక్రియలలో నవల, నాటకం, వ్యాసం, జీవితచరిత్ర, స్వీయ చరిత్ర మొదలైనవి పేర్కొనదగినవి. ఇవన్నీ పుట్టకపూర్వమే ఈ యుగంలో 'పరిశోధన' పుట్టింది. అది భాషా సాహిత్య రంగాలలో ప్రవృత్తిగానూ, ప్రక్రియగానూ గుర్తింపబడుతున్నది. అందువలన తెలుగులో వెలసిన నవ్య భాషాసాహిత్య ప్రక్రియలలో 'పరిశోధన' మొదటిది.

విమర్శ, పరిశోధన- నవల, కథానికల వంటి ప్రక్రియలు కావు. నవలాదులు సృజనాత్మక ప్రక్రియలు. విమర్శాదులు వివేచనాత్మక ప్రక్రియలు. విమర్శ పరిశోధనలు మొదట ప్రవృత్తులుగా ప్రారంభమై నిర్దిష్ట లక్షణాలను సంతరించుకొని ప్రక్రియలుగా రూపొందుతాయి. పరిశోధనను ఈ దృష్టితో గమనిస్తే మొదట అది పరిశోధనవిధానంగా గోచరిస్తుంది. సామగ్రి సేకరణ, విశ్లేషణ, సమన్వయం, నిర్దిష్ట ఫలితాంశ నిరూపణం అనే విధానంగా మొదట పరిశోధన ప్రారంభమౌతుంది. ఈ విధానమంతా ఒక వ్యాస రూపంగానో, గ్రంథ రూపంగానో, సిద్ధాంత నిబంధన రూపంగానో వెలువడినప్పుడు అది ప్రక్రియాపరమైన రూప సంపత్తిని ధరిస్తుంది. సిద్ధాంతవ్యాసం లేదా పరిశోధన వ్యాసం పరిశోధన యొక్క ప్రక్రియా ప్రతిపత్తి. మెకంజీ, బ్రౌను కాలంలోనే పరిశోధన విధానం ప్రక్రియా రూపాన్ని సంతరించుకొనే ప్రయత్నం చేసింది. అయితే, భాషా పరిశోధన, సాహిత్య పరిశోధనకంటె ముందుగా ప్రక్రియాగౌరవాన్ని పొందింది. కాల్డ్వెల్ కృషి దీనికి చక్కని ఉదాహరణం. పరిశోధనకు శాస్త్ర లక్షణం ముఖ్యం. విమర్శ ఎంత శాస్త్రమో అంత కళ. పరిశోధన కళాస్పర్శకు అతీతమైన శాస్త్ర ప్రకృతి. "The presence of science in any subject changes its character from the casual to causal, from the random and intutive to the systematic, as well as safeguarding the integrity of that subject from external invasions"[2] అన్న Northrop Frye మాటలు పరిశోధన ప్రవృత్తిని నిర్ధరించటానికి ఉపయోగపడతా...

---

1. Theory of Literature (1978), P. 82.
2. Anatomy of Criticism (1978), P. 7.

సత్యాన్వేషణలో స్వప్రమాణ ప్రతిపాదనను సాధించటానికి పరిశోధకుడు ఒక ప్రత్యయాన్ని ఆధారంచేసి శాస్త్ర పద్ధతిని అనుసరించి ఫలితాంశాలను సాధించటమే పరిశోధన ప్రవృత్తి. ఆ ప్రవృత్తితో ఏ విషయాన్నైనా గ్రహించి దాని ప్రామాణిక స్వరూపాన్ని నిరూపించేయగల శాస్త్రీయాన్ని అనుసంధించి వెలువరించే నిర్ధారించే పరిశోధన ప్రక్రియ.

పరిశోధనలో ఎన్నుకొనే విషయం ముఖ్యం. అది పరిశోధన పద్ధతిని, సామగ్రి స్వభావాన్ని, విశ్లేషణ విధానాన్ని, సమన్వయ సంవిధానాన్ని, ఫలితాంశాల ప్రవృత్తిని నిర్ధరిస్తుంది. పరిశోధన ఆధునికజీవితంలోని సర్వరంగాలలోనూ అత్యంత ప్రధాన ప్రవృత్తిగా, ప్రక్రియగా గుర్తింపబడింది. వాఙ్మయరంగంలో ప్రధానంగా అది భాషకు, సాహిత్యానికీ, చరిత్ర సంస్కృతులకూ సంబంధించి వర్తిస్తుంది. అయితే, భాషావిషయకమైన పరిశోధన భాషానిర్మాణ తత్త్వ నిరూపణ లక్ష్యంతో సాగుతుంది; సాహిత్య పరిశోధన సాహిత్యతత్త్వ దర్శన లక్ష్యంతో పురోగమిస్తుంది; చరిత్ర సంస్కృతులకు సంబంధించిన పరిశోధన సామాజిక పరిస్థితుల స్థితి గతి శక్తుల (Static and dynamic forces) కార్యకారణ సంబద్ధమైన పరిస్థితుల, పరిణామాల తత్త్వవివేచన పరంగా సాగి వాటిని చారిత్రకపద్ధతిలో సంపుటీకరించటానికి యత్నిస్తుంది. నాగరక సమాజాలన్నిట్లో ఈ మూడురకాల పరిశోధనలు మానవ వికాసాధ్యయనానికి, అవగాహనకు తోడ్పడతాయని విశ్వసింపబడుతున్నది.

ప్రపంచ భాషా సాహిత్యాలన్నిటిలోలాగానే, తెలుగులో కూడా పరిశోధన విజ్ఞానవికాసానికి కృషిచేస్తూ, నిర్దిష్టమైన లక్ష్యాలతో ముందుకు సాగుతున్నది. పాశ్చాత్య పరిశోధన రంగాలలో మొదట భాషాసాహిత్య పరిశోధనలు ప్రత్యేక ప్రతిపత్తులతో సాగేవి కావు. 'ఫైలాలజీ' అనే పేరుతో పరిశోధన పరిగణింపబడుతుండేది. దాని స్వరూప స్వభావాలను వివేచిస్తూ వ్రాసిన రెనెవెలెక్ మాటలు గమనింపదగినవి. "Historically, it has been used to include not only all literary and linguistic studies but studies of all products of the human mind. Though its greatest vogue was in nineteenth-century Germany, it still survives in the titles of such reviews as *Modern Philology*, *Philological Quarterly*, and *studies in Philology*. Boeckh, who wrote a fundamental *Encyklopadie und Methodologie der Philologischen Wissenschaften* (1877, but based on lectures partly dating back to 1809), defined 'Philology' as the 'knowledge of the known' and hence the study of language and literatures, arts and politics, religion and social customs. Practically identical with Greenlaw's 'literary history', Boeckh's philology is obviously motivated by the needs of classical studies, for which the help of history and archeology seems particularly necessary. With Boeckh, literary study is only one branch of philology, understood as a total science of civilization, particularly a science of what he, with German Romanticism, called the 'National Spirit'. Today, because of its etymology and much of the actual work of specialists, philology is frequently under-

stood to mean linguistics, especially historical grammar and the study of past forms of languages. Since, the term has so many and such divergent meanings, it is best to abandon it.''[3]

తెలుగులో పరిశోధకులు 'ఫైలాలజీ' ని భాషాశాస్త్రపరంగా మొదట వాడినా తరువాత క్రమంగా 'లింగ్విస్టిక్స్' అని వాడటం మొదలుపెట్టారు. భాషాశాస్త్రం ప్రధానంగా వర్ణనాత్మక శాస్త్రం (Descriptive Science), ''వర్ణనాత్మక శాస్త్రం అనటంచేత నిర్మాణం (structure), పరిసరాలు, జాతి నిర్ణయం, కుటుంబ నిర్ణయం మొదలైనవి భాషా శాస్త్రానికి చాల ముఖ్యం. అందుకు విషయ సేకరణం (collection of material or data), వర్గీకరణం (classification), విషయ విశ్లేషణం (analysis) (వ్యాకరణమం-టే అర్థ మిదే), సామాన్యీకరణం (generalisation) ఈ శాస్త్రానికి అంగాలు. ఎటువంటి విశేషణం ముందు చేర్చకుండా భాషాశాస్త్రం అంటే - వర్ణనాత్మక భాషాశాస్త్ర మనే (Descriptive Linguistics) అర్థం. అదే యిప్పుడు ప్రచురం. సమకాలీన భాషను వర్ణించే శాస్త్రం కాబట్టి దీన్ని Synchronic Linguistics అని అంటారు. (భాష యొక్క) పరిణామగతుల్ని నిరూపిస్తే 'చారిత్రక భాషాశాస్త్ర' మౌతుంది. (Historical Linguistics), వివిధ కాలాలలోని భాషను నిరూపించేది కాబట్టి Diachronic Linguistics అని దీనికి పేరు. భాషల సమాన ధర్మాల్ని పురస్కరించుకొని, కొన్ని కుటుంబాలుగా నిర్ణయం చేస్తాం. అటువంటి కుటుంబాలకు చెందిన సోదర భాషలతో (cognate languges) ఒక భాషలోని రూపాల్ని పోల్చి అధ్యయనం చేస్తే అది 'తులనాత్మక భాషాశాస్త్ర' మౌతుంది.''[4]

భాషాశాస్త్ర పరిశోధనం పాశ్చాత్య దేశాలలో 19వ శతాబ్దం నుండి అభివృద్ధి చెందినా, దానికి పునాదులు వేసింది భారతదేశమే. ''It was in India, however, that there arose a body of knowledge which was destined to revolutionise European ideas about language''[5] అన్న బ్లూం ఫీల్డ్ మాటలు గమనింపదగినవి. ''వాస్తవముగా నాధునిక భాషా తత్త్వ శాస్త్రమునకు పునాది హిందూదేశముననే - వైదిక యుగముననే - వేయబడినది. అట్టి భాషాతత్త్వ పరిశీలనమునకు గడంగిన మరియొక పురాతన దేశము గ్రీసు. ఈ దేశమునకు క్రీ.పూ. 3, 4 శతాబ్దముల కాలమున గ్రీకు తత్త్వవేత్తలు భాషా స్వరూపమును గూర్చి, భాషా విభాగములను గూర్చి, విచారింప దొడగిరి. కాని, యూరపు దేశములలో 18వ శతాబ్ది చరమ భాగమున సంస్కృత భాషా జ్ఞానము వారికి కలుగు వరకు, భాషా శాస్త్రము చెప్పుకొనం దగినంత అభివృద్ధి కలుగలేదు. కాని, భారతీయులు క్రీ.పూ. అనేక శతాబ్దముల క్రిందటనే భాషా విషయక చర్చలను, భాషాతత్త్వ పరిశీలనమును ప్రారంభించిరి.''[6] ''ప్రాచీన కాలమున ఈ దేశమున భాషా

3. Theory of Literature (1978) P. 38.
4. డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం - 'భాషాశాస్త్ర పరిచయం' (1982) పు.1.
5. Language (1933). P.10.
6. ''భాషా శాస్త్రము-దాని క్రమాభివృద్ధి'' (వ్యా.) కోరాడ రామకృష్ణయ్య. భారతి (రజతోత్సవ సంచిక) జనవరి 1949. చూడు: సారస్వత వ్యాసములు (3వ సంపుటి) ఆం.ప్ర.సా.అ. (1969), పు. 230-231.

ప్రపంచమున కాల్డ్వెల్లు గారి గొప్ప గ్రంథము ఆదిమ తేజస్సు. శాశ్వతముగా వెలయుగలది. తదనంతరము కాలానుగతములును నూతన పరిశోధనా సంజనితములును అయిన నానా గ్రంథములు సూర్యుని చుట్టు పరిభ్రమించు గ్రహముల పోలిక వెలయుచున్నవి. వీనియందు గురుత్వము దాల్చి యున్నట్టి సర్వతోముఖమైన గొప్ప గ్రంథము మా సోమయాజి గారి ఆంధ్ర భాషా వికాసము. ద్రావిడ భాషాతత్త్వ సిద్ధాంతములకు విజయపతాకను పఱపి దీర్ఘ పరిశోధనా ఫలితమైన విజ్ఞాన తేజస్సును తెలుగుభాషయొక్క మూలమూలలలో ప్రసారపఱచి, ద్రావిడ భాషా పరిశోధన కొక నూతనదశను ఈ గ్రంథము పొందించియున్నది.—''8 ఈ మాటలు రెడ్డిగారు భారత స్వాతంత్ర్యం వచ్చిన రోజున వ్రాసినవి. భాషా పరిశోధన కొక స్వతంత్ర ప్రక్రియా గౌరవాన్ని సంతరించిన గ్రంథం 'ఆంధ్ర భాషా వికాసము'.

తెలుగులో జరిగిన భాషాశాస్త్ర పరిశోధనలను సమీక్షిస్తూ డా॥ కె. కె. రంగనాథాచార్యులు గారు పేర్కొన్న ఈ క్రింది అంశాలు గమనింప దగినవి—9

1. ''19 వ శతాబ్దిలో గ్రంథాలు, ఇతర రికార్డులు ఆధారంగా ప్రత్యేక భాషలకు సంబంధించిన పరిశోధనలను 'Philology' అని, తరువాతి కాలంలో బ్లూమ్‌ఫీల్డ్ మొదలైనవారితో మొదలైన వారి భాషాశాస్త్ర సిద్ధాంతాల ఆధారంగా జరిగిన పరిశోధనలను Linguistics అని పేర్కొనటం జరుగుతున్నది. కాకపోతే బ్లూమ్ ఫీల్డుకు ముందు ప్రాచీన భాషాశాస్త్రం అనీ, బ్లూమ్‌ఫీల్డు తరువాత నవీన భాషాశాస్త్రం అనీ మనం వ్యవహరించవచ్చు.''10

2. ''తెలుగుకు సంబంధించినంతవరకు తెలుగువా రెవరు భాషాశాస్త్రరంగంలో కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించటం జరగలేదు. అభివృద్ధి చెందిన భాషా సిద్ధాంతాలను అనుసరించి తెలుగు భాషకు అన్వయిస్తూ మౌలికమైన పరిశోధనలు చేసినవారు, పరిశోధన పద్ధతులలో కొత్త మార్గాలను చూపినవారు తెలుగువారిలో ఉన్నారు.''11

3. ''తెలుగులో జరిగిన భాషా పరిశోధనను అనేక భాగాలుగా విభజించవచ్చు. చారిత్రిక పరిశీలన (ఇందులో భాగంగా తులనాత్మక పరిశీలన), వర్ణనాత్మక వ్యాకరణాలు, అన్యదేశ్యాలు, మాండలికాలు, భాషాసామాజిక పరిశీలన, అర్థనిర్మాణ శాస్త్రం, గ్రామనామాలు, ఛామ్స్కీనుండి మొదలైన అత్యాధునిక భాషాశాస్త్రం మొదలైన రంగాలలో తెలుగుభాషా పరిశోధన జరిగింది. విదేశాలలో విదేశీయులు తెలుగును గురించి చేసిన పరిశోధనను ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉంటుంది. ఇవికాక సంప్రదాయ వ్యాకరణాల పద్ధతిలో తెలుగు భాషను గురించి చేసిన పరిశోధనలు కూడ ఉన్నాయి. తెలుగులో భాషకు సంబంధించిన పరిశోధనలలో సిద్ధాంత వ్యాసాలుగాని, ఇతర వ్యాసాలుగాని, అధిక భాగం ఇంగ్లీషులోనే ఉన్నాయి. తెలుగు శాఖలలో పూర్వం మొదటి దశలో జరిగినవి తప్ప తక్కినవన్నీ తెలుగులోనే ఉన్నాయి.''12

---

8. ఆంధ్రభాషా వికాసము (1947) ముఖబంధము పు. iv.
9. చూడు : ఇదే సంచికలో (వ్యా.) 'తెలుగులో భాషాశాస్త్ర పరిశోధన.'
10. Ibid., పుట. 208.
11. Ibid., పు. 208.
12. Ibid., పు. 210.

బడిన భాషాశాస్త్రం భద్రిరాజుగారి నుండి లింగ్విస్టిక్స్‌గా పిలువబడుతూ ఒక ప్రత్యేక ప్రతిపత్తిని సంపాదించు కొన్నది. తెలుగు భాషాపరిశోధనలో వినూత్నసిద్ధాంతప్రతిపాదనం జరుగకపోయినా వినూత్న విశ్లేషణ, వస్తుగ్రహణ పద్ధతు లేర్పడటం గమనింపదగిన అంశం.

భాషా పరిశోధన మొదట వ్యక్తుల నాశ్రయించి సాగినా, తరువాత క్రమంగా విశ్వవిద్యాలయాలలో అకాడమీలలో విస్తరిల్లింది. మొట్టమొదటి పిహెచ్.డి., డిగ్రీ భాషా పరిశోధనకు రావటం విశేషం. డా॥ చిలుకూరి నారాయణరావు గారు ''పదకొండవ శతాబ్ది తెలుగు భాష''ను గురించి పరిశోధించి సమర్పించిన సిద్ధాంత వ్యాసా నికి 1929 లో మదరాసు విశ్వవిద్యాలయం డాక్టరేట్ డిగ్రీని సమర్పించింది. ఆ తరువాత డా॥ భద్రిరాజు కృష్ణ మూర్తిగారు పెనిసిల్వేనియా విశ్వవిద్యాలయం నుండి 'తెలుగు వెర్బల్ బేసెస్ - ఎ కంపారిటివ్ అండ్ డిస్క్రిప్టివ్ స్టడీ' మీద సమర్పించిన సిద్ధాంతవ్యాసానికి 1957లో డాక్టరేట్ డిగ్రీ వచ్చింది. ఆ తరువాత చాలావరకు భాషాపరిశోధన వ్యాసాలన్నీ పాశ్చాత్య, భారతీయ విశ్వవిద్యాలయాలలోనే వ్రాయబడ్డాయని చెప్పాలి. స్థూలవిభాగాన్ని బట్టి యింకా చెపితే ఫైలాలజీ పేరుతో జరిగిన భాషా పరిశోధన విశ్వవిద్యాలయ పరిధిలో - అంటే పిహెచ్.డి., డిగ్రీ కొరకు వ్రాసిన సిద్ధాంతగ్రంథాలరూపంలో - జరగలేదు; పండితుల వ్యక్తిగతమైన కృషిద్వారానే జరిగింది. అయితే, 20 వ శతాబ్ది ఉత్తరార్ధంలో విశ్వవిద్యాలయాలలో పరిశోధనావకాశాలు పెంపొందటం, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్ర శాఖ ఏర్పడటం, వివిధ విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలు భాషా పరిశోధనకు ప్రోత్సాహాన్ని కల్పించటం వలన సిద్ధాంత వ్యాసాల రూపంలో పరిశోధన వెలువడటానికి అనుకూలమైన వాతావరణం ఏర్పడింది.

తెలుగులో భాషా పరిశోధన కాలక్రమంలో కొన్ని నిర్దిష్ట ప్రణాళికల నాశ్రయించి సాగుతున్నట్లు స్పష్ట మౌతుంది. పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలో తరిఫీదయి వచ్చిన ఆచార్యులు ఈ రంగంలో పర్యవేక్షణ చేపట్టటం కూడా ఇందుకు కారణం. ఈ కోవలో తెలుగు భాషాధ్యయనం శాస్త్రీయంగా సాగడానికి వారు ప్రాతిపదికలు వేయటంతో పాటు, తెలుగు భాషను గురించి పరిశోధన జరుగవలసిన రంగాలను, పద్ధతులను, లక్ష్యాలను నిర్ణయించి సాధికారంగా పరిశోధనలు జరిగేటట్లు పర్యవేక్షించటంలోనూ ఆ విద్వాంసులు తీసికొన్న - తీసికొంటున్న శ్రద్ధ గణనీయమైనవి. ఒక విధంగా సంఘటిత పరిశోధన ప్రణాళిక భాషాపరిశోధన రంగంలో రూపు కట్టింది.

తెలుగుభాషలో తులనాత్మక భాషాధ్యయనం చారిత్రక పరిణామ దృష్టితో సాగాలని, వర్ణనాత్మక వ్యాకరణ నిర్మాణం జరగాలని, మాండలిక భాషా పరిశోధనం అవసరమని, ప్రామాణిక భాషా స్వరూప నిర్ణయం జీవద్భాషా పరిశీలనలో ముఖ్యమనీ, ప్రామాణిక సమగ్ర నిఘంటు నిర్మాణం జరగాలనీ, సామాజిక భాషా శాస్త్రా ధ్యయనం సమకాలీన సమాజావసరాలకు ముఖ్యమనీ కొన్నిలక్ష్యాలను భాషాతత్త్వజ్ఞులు నిర్ణయించటంతో, ఆయా పరిశోధన శాఖలను విస్తరించినట్లు స్పష్టమౌతుంది. ఇది ఒక బృహత్తర ప్రణాళిక, ఈ భారం వ్యక్తులు, విశ్వ విద్యాలయాలో మాత్రమే నిర్వహించటం కష్టం. అందువలన ఈ శాఖలలో కొన్నింటిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేపట్టింది. సాహిత్య అకాడమీ తలపెట్టిన మహత్కార్యాలలో ఒకటి సమగ్ర నిఘంటువుకు కావలసిన పూర్వరంగ ప్రక్రియలను నిర్వహించే కార్యక్రమాలను చేపట్టటం. దీనికి ఉపలక్షకంగా కవుల పదప్రయోగ కోశా లను తయారు చేయించటం, మాండలిక వృత్తి పదకోశాలను సిద్ధం చేయించటం, సామెతలను, పదబంధాలను,

క్రియా స్వరూపాలను, శాసన భాషను సంబంధించిన కోశాలను రూపొందించటం మొదలైన పరిశోధన కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తున్నది. 'తెలుగు భాషా చరిత్రను' ప్రకటించింది. ఈ ప్రచురణలు భాషా పరిశోధనలో సమష్టి కృషికి తోడ్పడ్డాయి. తెలుగు అకాడమి నిఘంటు నిర్మాణంలో కొంత కృషి చేసింది. సాహిత్య అకాడమీ ప్రచురించిన పదకోశాలనుండి దాదాపు 45 వేల పదాలు నిఘంటువులలో కొత్తగా చేర్చటం జరిగింది. తెలుగు అకాడమి కృషి ప్రశస్తం చేస్తున్నది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఎటిమాలాజికల్ డిక్షనరీని తయారు చేసే పథకాన్ని రూపొందించి ఒక ప్రణాళిక ననుసరించి దాన్ని నడుపుతున్నది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధన కేంద్రాన్ని నిర్వహిస్తూ విలువైన పరిశోధనాంశాలను ప్రకటిస్తున్నది. పండితులకు, పరిశోధకులకు మాత్రమే పనికి వచ్చే ఈ కృషి ప్రజల దగ్గరికి తీసికొని వెళ్ళే యత్నాలు సాగవలసి ఉంది. దానికి అంగబలం, అర్థబలం చేకూర్చవలసి ఉంది కూడా!

## 2

తెలుగులో భాషా పరిశోధనకంటె సాహిత్య పరిశోధన విశేషంగా సాగింది. సాహిత్య పరిశోధన వికాసాన్ని పరిశీలిస్తే అందులో కొన్ని నిర్దిష్టమైన ఘట్టాలు, దృక్పథాలు, పరిణామగతులు స్పష్టంగా గోచరిస్తాయి. అధ్యయన సౌలభ్యం కోసం సాహిత్య పరిశోధన వికాసాన్ని నాలుగు యుగాలుగా విభజించవచ్చు. అవి: 1. ప్రౌఢయుగం (క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం), 2. వీరేశలింగ యుగం (19 వ శతాబ్ది ఉత్తరార్ధం), 3. రాయప్రోలు యుగం (20వ శతాబ్ది పూర్వార్ధం), 4. విశ్వవిద్యాలయ యుగం, (20 వ శతాబ్ది ఉత్తరార్ధం). ఈ యుగాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రవృత్తి కొట్టవచ్చినట్లు కనపడుతుంది. ప్రౌఢ యుగ పండితులు సామగ్రి సేకరణమూ, గ్రంథ పరిష్కార విమర్శ ప్రక్రియకూ విశేషంగా దోహదం కల్పించారు. ఆ ప్రవృత్తి వీరేశలింగ యుగంలో కూడా కొనసాగినా, అంతకంటె విశిష్టంగా కవుల జీవిత చరిత్రలు నిర్మించటానికి, వివిధ సాహిత్యాంశాల మీద పరిశోధనాత్మక వివేచనం విస్తరింప చేయటానికి, తదనుబంధంగా వాఙ్మయచరిత్రలను విజ్ఞాన సర్వస్వాలనూ రూపొందించటానికి విశేషమైన కృషి సాగింది. రాయప్రోలు యుగంలో మొదట సాహిత్య విమర్శలో ప్రయోగాలు మొదలై, అనుశీలన ప్రవృత్తి విస్తరిల్లింది. ఆ తరువాత స్వతంత్ర సాహిత్య సిద్ధాంత దర్శనం, ప్రతిపాదనం జరిగింది. విశ్వవిద్యాలయయుగంలో ప్రక్రియాపరమైన పరిశోధన, సాహిత్యయుగానుశీలనం, కావ్య పరిశోధన, వివిధ సాహిత్యాంశాలపై విశేషపరిశీలనం, తులనాత్మక అధ్యయనం మొదలైన అంశాలు ప్రాధాన్యాన్ని వహించాయి.[18]

నూత్న సిద్ధాంత ప్రతిపాదనం ఉత్తమ సాహిత్య పరిశోధనకు పరమ ప్రమాణం. అయితే, ఏ సాహిత్యంలోనైనా వెలువడిన పరిశోధన వ్యాసాలు గానీ, సిద్ధాంత గ్రంథాలుగానీ, ఒక్కొక్కటి ఒక్కొక్క వినూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం అసాధ్యం. అయితే, వినూత్నమైన అనుశీలన విధానాన్ని గానీ, విశ్లేషణ పద్ధతిని గానీ,వివేచనాత్మక వైఖరిని గానీ,సమన్వయ వైఖరిని గానీ,క్రొత్త వాదాన్నిగాని ప్రకటించి కొన్ని వినూత్నాంశాలను వెలికి తెచ్చి సాహిత్యతత్త్వ వివేకాన్ని, విలువల విశేష వివేచనాన్ని పెంపొందిస్తూ ఉంటాయి. భాషా పరిశోధన వంతా

18. వివరాలకు ఈ సంచికలోని డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం రచించిన 'తెలుగులో సాహిత్య పరిశోధన: నాడు-నేడు' అనే వ్యాసం చూడవచ్చు.

పరిశీలిస్తే తెలుగు పరిశోధకులు వినూత్న సిద్ధాంత ప్రతిపాదనం కంటె విశేష పరిశోధన విధానాలనే ఆవిష్కరించి నట్లు స్పష్టమౌతున్నది కదా! అయితే, సాహిత్య పరిశోధనలో మాత్రం విన్నూత్న సిద్ధాంత ప్రతిపాదనం కూడా జరిగింది. అందువలన భాషా పరిశోధనం కంటె సాహిత్య పరిశోధన ఎక్కవలసిన విజ్ఞాన శిఖరాలను అధిరో హించి చూపించిందన్న విషయం స్పష్టమౌతుంది.

Theory of literature (సాహిత్య సిద్ధాంతం) అనే గ్రంథాన్ని వ్రాస్తూ రెనె వెలక్ (Rene Wellek), అస్టిన్ వారెన్ (Austin Warren) తమ గ్రంథ రచనా ప్రవృత్తిని గురించి ముందు మాటలలో ఇలా పేర్కొన్నారు: "Some continuity it may claim with poetics and Rhetoric (from Aristotle down to Blair, Conpbell, and Kames), systematic treatments of the genres of belles-letters and stylistics, or with books called Principles of Literary Criticism. But, we have sought to unite 'poetics' or literary theory) and 'criticism' (evaluation of literature with 'scholarship' research) 'literary history' (the 'dynamics' of literature in contrast with the 'statics' of theory and criticism).[14] ఒక విధంగా సాహిత్య పరిశోధన గ్రంథాల ప్రవృత్తికి కూడా వీటి రచనా విధానాన్ని అన్వయించుకోవచ్చు. ప్రత్యేకంగా తెలుగు సాహిత్య పరిశోధన గ్రంథాలు గాని వ్యాసాలు గాని అటు సాహిత్య లక్షణాలను, శాశ్వత సాపేక్ష ప్రమాణాలతో సాహిత్యాన్ని అనుశీలించే విధానాలుగా, ఇటు సాహిత్య సిద్ధాంతం లేదా దృక్పథం లేదా సమన్వయం ప్రతిపాదించే పరిశోధన ప్రవృత్తినీ, పరిశోధన విధానాలనూ, సాహిత్య పరిణామంలో గమనింపదగిన గతి స్థైర్యత్వ శక్తుల వివేచనను సంతరించుకొని [illegible] బడుతూ ఉంటాయి. సాహిత్య పరిశోధన శుద్ధ (Pure) రూపంలో వెలువడితే సిద్ధాంత ప్రతిపాదన రూపంగా సాక్షాత్కరిస్తుంది; అనువర్తిత (Applied) రూపంలో వెలువడితే అనుశీలనాత్మకంగా భాసిస్తుంది. [illegible] కులు లక్షణ గ్రంథరూపంలో ఉండే శుద్ధపరిశోధనకంటె విమర్శనాత్మక [illegible] సిద్ధాంత వ్యాసాలనే అభిమానిస్తున్నారు. అందువలన తెలుగులో [illegible] అనుశీలనాత్మక సిద్ధాంత వ్యాస ప్రవృత్తినే భజించింది.

భాషాపరిశోధనకంటె సాహిత్య పరిశోధన సంక్లిష్ట ప్రక్రియ [illegible] కలిగిందని చెప్పాలి. దీనికి బహిరంగ పరిశీలనం ఎంత ముఖ్యమో, అంతరంగ పరిశోధనం అంత అవసరం. ఈ రెండు పద్ధతులనూ ఇంగ్లీషులో The extrinsic approaches to the study of literature అనీ, The instrinsic study of literature అనీ అంటారు. గ్రంథ పరిష్కార విమర్శలూ, కవి జీవిత చరిత్రలూ, వాఙ్మయ చరిత్రలూ, కవి జీవిత కావ్య సమన్వయ విమర్శలూ, మానసికశాస్త్ర, మనోవిశ్లేషణాత్మక విమర్శలూ, సాంఘికాది సిద్ధాంతాలపై ఆధారపడిన పరిశీలనలూ, వివిధశాస్త్ర పద్ధతుల ననుసరించి సాహిత్య సమస్యలను వివేచించే విధానాలూ సాహిత్య విమర్శలో, పరిశోధనలో బహిరంగ పరిశీలనకు సంబంధించినవై ఉంటాయి. రసాలంకార రీతులు, శైలినీ, ప్రక్రియా స్వభావాలను, అనుశీలన విధానాలనూ, కావ్యాంగాలు కావ్యానుభవానికి పోషకంగా వర్తించే శిల్ప విశేషాలను అనుశీలించే విధానాలూ, అంతరంగ సాక్ష్యాలతో తులనాత్మకాధ్యయనం చేసే పద్ధతులు.

14. Preface to the first edition (1948)—Theory of Literature 1978. P. 7.

సాహిత్య విలువలను విశ్లేషించి, వివేచించి, సమన్వయించి రూపొందించే అనుశీలన విధానాలూ మొదలైనవి అంతరంగ పరిశోధనలో భాగాలుగా ఉంటాయి. అంతరంగ బహిరంగ పరిశీలన విధానాల్ని సాహిత్య పరిశోధనలో సిద్ధాంత దర్శన పరమార్థాన్ని సాధించటానికి ఉపకరిస్తాయి. ఆ ప్రయత్నాలు ఆయా పరిశోధనాంశాల ఎంపికను బట్టి, పరిధులను బట్టి, ప్రణాళికా పద్ధతులను బట్టి, పరిశోధకుని దార్శనిక శక్తిని బట్టి తరతమ భేదాలతో రూపొందుతూ ఉంటాయి. పరిశోధన ఎంత గొప్పదైనా పరిశోధకుని శక్తిమీద ఆధారపడి ఉండటం జగద్విదితమైన విషయమే.

సాహిత్య విమర్శకు గాని పరిశోధనకు గాని ప్రాతిపదికగా నిలిచే కావ్యాలకు పరిష్కృత ప్రతులు కావాలి. ప్రాచీన గ్రంథ సేకరణ జరిగిన తరువాత ప్రచురణానికి ముందు గ్రంథ పరిష్కారం అవసరం. ఈ అవసరం మొదట బ్రౌన్యయుగంలో గుర్తింపబడింది. వీరేశలింగ యుగంలో అది విస్తృతంగా సాగింది. దానికి తోడుగా సాహిత్య చరిత్రలు, గ్రంథ పీఠికా విమర్శలు, కర్తృత్వ వాదాలూ, శబ్ద సాధుత్వాసాధుత్వ చర్చలూ వెలువడినాయి. తోడుగా ప్రాచీన లక్షణాల నాధారంగా గ్రంథ స్వరూప స్వభావాలను, విలువలను తేల్చే లాక్షణిక విమర్శ మొదలయింది. ఇవన్నీ పాశ్చాత్య భాషా సాహిత్య ప్రభావాలవలన తెలుగు పండితులలో కలిగిన నూత్న చైతన్యం. నూత్న సాహిత్య ప్రక్రియలన్నీ పాశ్చాత్య ప్రభావ ముద్రితాలే. అయితే, ఈ అంశాలన్నింటినీ పరిశోధించి నిర్ణయాలు తీసుకొనేటప్పుడు ఒక విషయాన్ని మాత్రం మరచిపోగూడదు. ఏ యుగ చైతన్యమైనా ఆ కాలంలో ఆకాశంలోనుంచి ఊడిపడదు. గతంలోనుంచి పరిణామ దశగా సముద్భవిస్తుంది. గతంలోని సాహిత్య ప్రవృత్తి సృజనాత్మకతను కోల్పోయినపుడు నవ్యతకోసం, ప్రగతి సాధన కోసం నూత్న చైతన్యం మొలకెత్తుతుంది. సమకాలీనులు దాన్ని వర్తమానంగా భావించినా, దానికీ గతానికీ భవిష్యత్తుకూ ఒక నిజమైన సంబంధాన్ని సాతత్యాన్ని చారిత్రాత్మకంగా సమీక్షించి పరిశోధకుడు ప్రభావ పరిశీలనం చేయాలి. ఒక విధంగా చరిత్రలోని స్థిరగతి శక్తుల ప్రేరణను వివేచిస్తూ పరిణామ హేతువులను నిర్ధారిస్తూ ప్రభావ పరిశీలనం జరగాలి. ఈ సందర్భంలో "A critic must not only begin but actually stay '*in medias res*' if he is convinced that what books are made into is more important than what they are made out of and the good books are those which outgrow the works they grow out of"[15] అన్న Harold Cherniss మాటలు గమనార్హాలు.

ప్రాచీనాంధ్ర సాహిత్యం మీద సంస్కృత ప్రాకృతాది సాహిత్యాల ప్రభావమే కాక, దేశి భాషా సాహిత్యాల ప్రభావం కూడా ఉంది; అలాగే వీరేశలింగ యుగం నుండి తెలుగు సాహిత్యం మీద ప్రధానంగా ఆంగ్ల భాషా సాహిత్య ప్రభావం ఉంది. బ్రౌన్యయుగంలో తెలుగు కావ్యాలను పాశ్చాత్య పరిశోధన విధానాన్ని అనుసరించి పరిష్కరించటం, వర్గీకరించటం మొదలైన ప్రక్రియలు మొదలైనాయి. ఆ తరువాత ఆంగ్ల ప్రభావ బలంతో ప్రక్రియలే వెలువడినాయి. అంటే, బ్రౌన్యయుగంలో పరిశోధన పద్ధతి ప్రాచుర్యంలోకి వచ్చింది; వీరేశలింగయుగంలో పరిశోధన పద్ధతి నుపయోగించి తెలుగు కావ్యాలను పరిశీలించాలన్న స్పృహ ఏర్పడింది. ఇటువంటి స్థాయిలో వెలువడే కృషిని పరిశోధన ప్రవృత్తి అనే అనాలి. ఆ ప్రవృత్తి ప్రభావ పరిశీలన మార్గంలో శాస్త్రీయంగా, సప్రమాణంగా, చారిత్రక దృక్పథంతో సాగితే పరిశోధన ప్రక్రియగా రూపొందినట్లవుతుంది.

15. cf. Critical Assumptions by K.K. Ruthven 1979 P. 127

అందువలన బ్రౌణ్య, వీరేశలింగ యుగాంలో ప్రధాన లక్షణంగా భాసించే సాహిత్య ప్రభావశీలాన్ని పరిశోధించి సిద్ధాంత వ్యాసాన్ని వ్రాయటం జరిగితే తెలుగులో వెలసిన ప్రభావ పరిశీలనా పరిశోధన స్థాయి కందుకొన్నట్లు. ఇలా, ప్రభావ పరిశీలనాన్ని పరిశోధన స్థాయికి తీసికొని వచ్చి ఒక శాస్త్రీయమైన ప్రక్రియగా గౌరవాన్ని కల్పించిన వారు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారు. వారి సిద్ధాంతగ్రంథం 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' (1956). వారి కృషి ఎంత ప్రామాణికమో వారి దృక్పథం అంత ఆదర్శం. "ఆంగ్ల సాహిత్యమునందు వివిధ సాహిత్యముల ప్రభావము అనంతముగ కనవచ్చును. అంతమాత్రమున దాని విశిష్టతకు భంగము లేనట్లే మన సాహిత్యముపై ఆంగ్ల సాహిత్య ప్రభావము కన్పించినను, దాని వైశిష్ట్యము కేమియు లోపము లేదు"[16] అన్న వారి దృక్పథం ఒక ఆంగ్ల ప్రభావ పరిశీలనకే కాదు, సంస్కృతాది ప్రభావాంశ పరిశోధించటానికి కూడా మార్గం చూపింది.

వీరేశలింగ యుగంలో పరిశోధకులు పెక్కుమంది, రాయప్రోలు యుగంలో విమర్శకులు పలువురు తెలుగు సాహిత్య పరిశోధన రంగంలో కనపడతారు. పరిశోధకులను గురించి ప్రస్తావిస్తూ ఈ సంచికలో డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానందగారన్న మాటలు గమనింపదగినవి - "ఈ సందర్భంగా మనం స్మరించాల్సిన వ్యక్తులు దాదాపు 50 మంది దాకా ఉన్నారు. 'అముద్రిత గ్రంథ చింతామణి' లోవీరి సునిశితమైన ప్రతిభా పాటవాలు దర్శనమిస్తాయి. మానవల్లి రామకృష్ణ కవి (భరతనాట్య శాస్త్రాన్ని, కుమార సంభవాన్ని వెలికి తీయడం, కందుకూరి ఈశ్వరదత్తు (శాసన పద మంజరి), మల్లంపల్లి సోమశేఖర శర్మ ఆంధ్ర చారిత్రకాధారాల్ని వెలికి తీయడం, రాళ్ళబండి సుబ్బారావు (కళింగదేశ చరిత్రము), నేలటూరి వెంకటరమణయ్య విజయనగర చరిత్ర. చిలుకూరి నారాయణరావు గారూ ఈ పని చేశారు); కొమర్రాజు లక్ష్మణరావు పంతులు (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలన ప్రయత్నం, భాషా సాహిత్య వ్యాసాలు); వేటూరి ప్రభాకర శాస్త్రి ("నాగబు" [illegible] చదివినవారు; అన్నమాచార్యుల సంకీర్తనల పరిష్కరణ, చాటు పద్య మణిమంజరి [illegible] పరిష్కరణం). చిలుకూరి వీరభద్రరావు, దిగ్గవల్లి శ్రీనివాసరావు [illegible] ప్రశంసనీయం" (పుట. 36). ఎందరో మహానుభావులు; [illegible] వీరందరూ సిద్ధాంత గ్రంథాలు వ్రాయలేకపోవచ్చును గాని [illegible] రూపొందించటానికి కావలసిన వెలుగు సామగ్రిని, దృక్పథాలను, ఫలితాంశాలను ఒక్కొక్కసారి విలువైన నిర్ణయాలను తమ పరిశోధన కృషి ద్వారా అందించారు. పరిశోధన ప్రవృత్తికి ప్రాణంపోసి ప్రక్రియగా రూపొందటానికి దాన్ని పోషించి పెద్ద చేసిన పరిశోధన ప్రవీణులు వీరు.

రాయప్రోలు యుగంలో సాహిత్య విమర్శ వికాసాన్ని పొందింది. విమర్శ [illegible] సిద్ధాంత రూప [illegible], అనుశీలన ప్రవృత్తులకు పోషకంగా నిలుస్తుందన్న సత్యం ఈ యుగం నిరూపించింది. ఈ యుగంలో రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం, మాధురీ దర్శనం పరిశోధన సాధించే పరమార్థాన్ని [illegible] వారి రమ్యాలోకం; మాధురీ దర్శనం అనే గ్రంథాలు అభినవ కవితా సిద్ధాంత ప్రతిపాదకాలైన [illegible]జనాత్మక పరిశోధక గ్రంథాలు. శుద్ధ పరిశోధన స్వరూపం ఈ గ్రంథాలు స్పష్టం చేస్తాయి.[17]

16. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము (1960). భూమిక. పు. xvi.
17. వివరాలకు చూడు : ఈ సంచికలో 'తెలుగులో సాహిత్య పరిశోధన : నాడు : నేడు' (వ్యాసం).

విశ్వవిద్యాలయ యుగంలో సాహిత్య పరిశోధన ప్రక్రియాస్వరూపాన్ని సంతరించుకోవటమే కాకుండా సాహిత్య ప్రక్రియాపరంగా విశ్లేషించి సాగటం గమనించదగిన అంశం. విశ్వవిద్యాలయాలలో సాహిత్య పరిశోధన కార్యక్రమాలన్నీ సమగ్ర సాహిత్యచరిత్ర నిర్మాణం ధ్యేయంగా సాగుతున్నాయని భావించటానికి బలమైన ఆధారా లున్నాయి. కాలక్రమాన్ని అనుసరించి వ్రాసే చరిత్రలు యుగచైతన్యాన్ని వెలువరిస్తాయి కాని సాహిత్యంలో పరిణామం పొందుతున్న ప్రక్రియల యొక్క నియమాలను పట్టుకోలేవు. సాహిత్యంలో వెలసిన ప్రతి రచనా ఏదో ఒక ప్రక్రియయొక్క లక్షణాలను పొందుపరచుకొని ఉంటుంది. అటువంటి రచనలలో సజాతీయ విజాతీయ లక్షణాలను నివేదించి రచనలను కొన్ని వర్గాలుగా విభజించుకొని, ప్రక్రియలుగా గుర్తిస్తాం. అయితే, వాటి పుట్టుపూర్వోత్తరాలను గమనించినప్పుడు వాటి ప్రధాన లక్షణాలు మొదట్లో ఒకవిధంగా ఉండి, కాలం గడిచేకొద్దీ వివిధ ప్రధానాంశాలు లోపించటం ద్వారా కానీ, రచయితల యొక్క స్వతంత్రాత్మక ప్రవృత్తులలో నుంచివచ్చే విశిష్ట ప్రయోగ నిర్మాణ ప్రతిఫలనంగానీ తొలినాటి ప్రక్రియలు రూపాంతరాన్ని చెందవచ్చు. ఒక్కొక్కసారి ఒక్కొక్క ప్రక్రియ అన్య ప్రక్రియల స్వభావాలను తనలో సంతరించుకోవచ్చు. చివరకు అభినవరూపం దాల్చవచ్చు. అటువంటప్పుడు ప్రక్రియలు నియతరూపాలు భావించటానికి వీలులేదు; పరిణామ స్వభావం కలిగిన రూపాలుగానే గ్రహించాలి. ఒక్కొక్కకాలంలో కొందరు విమర్శకులు తమ కాలంలో వెలువడిన ప్రక్రియలకు గాని, ఒక యుగంలో వెలువడిన ప్రక్రియలకు గాని కొన్ని నిశ్చిత లక్షణాలను నిర్దేశించే యత్నం చేయటం కూడా కనపడుతుంది. కాని, ఆ లక్షణాలు తరువాత వచ్చిన అదే ప్రక్రియలోని అభినవ ప్రయోగాలకు వర్తించకపోవచ్చు. అట్టి పరిస్థితుల్లో విమర్శకులు, పాఠకులు మారుతున్న ప్రక్రియల స్వభావాన్ని గుర్తించి వాటి విలువలను ఎప్పటికప్పుడు నిశ్చయించుకొంటూ అనుశీలన విధానాన్ని రూపొందించుకోవాలి. ఈ సందర్భంలో "Genre criticism may return us to problems shared by readers and critics- especially the problems of identifying literary works' total forms. For genre is an organising principle of the reboundaries by which it is possible to break the hermeneutic circle and to reconstruct old or difficult works. Above all, dealing with changing genres offers frequent reminders that works of literature come to us from literary communities, with which we in our turn have to form a relation"[18]-అన్న Alstair Fowler మాటలు మనం స్మరించదగినవి.

సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణ లక్ష్యంతో సాగుతున్న సాహిత్య పరిశోధన ఎటువంటి చరిత్రను ఉపలక్షిస్తున్నది ? అన్న ప్రశ్న మనకు కలుగుతుంది. మన సాహిత్యచరిత్రలు పారంపర్యానికి సంబంధించినవి. అవి ప్రధానంగా కాలక్రమాన్ని అనుసరించి రాజపోషకుల పేర్లతోనో, యుగ కర్తలైన కవుల పేర్లతోనో, ప్రధాన సాహిత్య ప్రవృత్తుల పేర్లతోనో యుగవిభజనం ఏర్పరచుకొని రచించబడటం చూస్తాం. ఇవన్నీ పారంపర్య బాటలు, ఆధునికులు సాహిత్య చరిత్రను గురించి భావించే విధానాన్ని మనం గమనించాలి. "An individual work of art does not remain unchanged through the course

18. Kinds of Literature 1982). P. 278.

of history. These is to be sure a substantial indentify of structure which has remainded the same throughout the ages. But, this structure is dynamic: it changes throughout the process of history while passing through the minds of readers, critics and fellow artists. The process of interpretation, criticism, and appreciation has never been completelv inturrupted and is likely to continue indefinitely, or at least as long as there is no complete interruption of the cultural tradition. One of the tasks of the literary historian is the disicription of this process. Another is the tracing of the development of works of art arranged in smaller and larger groups, according to common authorships, or genres, or stylistic types, or lingustic tradition and finally inside a scheme of universal literature."[19] ఈ విధమైన సాహిత్య చరిత్రను నిర్మించాలని సాహిత్య పరిశోధకుల ఆకాంక్ష ! ఆ లక్ష్యంలో సాగుతున్నది విశ్వవిద్యాలయాలలో సాహిత్య పరిశోధన. అందే ప్రక్రియా వికాస చరిత్రయే సాహిత్య చరిత్ర రచనలో ఉత్తమ పద్ధతి అన్నమాట! "The history of genres is indubitably one of the most promising areas for the study of literary history."[20] ఈ మాట సత్యం; మన సాహిత్య పరిశోధనకు లక్ష్యం !

విశ్వవిద్యాలయాలు ఈ లక్ష్యంతో వివిధ రంగాలలో, ప్రక్రియలలో, [illegible] కార్యక్రమాన్ని దాదాపు మూడు దశాబ్దాలకు పైబడి నిర్వహిస్తూ ఉంటే, [illegible] ఆ ఉద్యమంలో ఇంతవరకూ వెలువడిన ఫలితాంశాల నన్నింటిని క్రోడీకరించి సమగ్రమైన [illegible] ప్రక్రియా వికాసాన్ని తెలిపే సాహిత్య చరిత్రను నిర్మించాలని సంకల్పించింది. ఈ [illegible] ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం అటువంటి ప్రతిపాదన చేశారు. సమకాలీన సాహితీలోకపు అవసరాలను, సాహిత్య పరిశోధన లక్షించిన ఆ గమ్యాన్ని దృష్టిలో ఉంచుకొని కార్యవర్గం విలువైన తీర్మానాన్ని చేసింది. నిజానికి ఈ ప్రయత్నం సాహసంతో కూడుకొన్నదే! అయినా, ఎప్పుడో ఒకప్పుడు అది ప్రారంభం కావలసిందే. అకాడమీ ఆధ్వర్యంలో ఆ ప్రణాళిక విజయవంతం కావాలని ఆశిద్దాం !

అయితే, ఇటువంటి బృహత్తర ప్రయత్నానికి అనువైన పూర్వరంగం సిద్ధమై ఉన్నదా ? అనే అనుమానం కొందరికి రావచ్చు. అనుమానం అభ్యుదయానికి అర్థంతు. ఒక్కసారి స్థూలంగానైనా ప్రక్రియా పరమైన పరిశోధనను పరిశీలిస్తే అందులో జరిగిన విశేష పరిశ్రమ ప్రామాణిక సాహిత్య చరిత్రను నిర్మించటానికి తగినంత పూర్వరంగాన్ని సిద్ధం చేసిందనే విశ్వాసం మనకు కలుగుతుంది. ఈ నమ్మకాన్ని కలిగించటానికే ఈ సంచికలో ప్రక్రియా పరమైన పరిశోధనకు ప్రత్యేకంగా ఒక భాగాన్నే కేటాయించటం జరిగింది. తెలుగు సాహిత్య పరిశోధనలో వెలువడిన సిద్ధాంత వ్యాసాలలో నూటికి తొంభై పాళ్లు ఈ ప్రవృత్తిని పోషించేవిగా కనబడతాయి.

19. Theory of Literature : 1978 . P. 254-255.
20. Rene Wellek and Austin Warren-Theory of Literature (1976) P. 261.

ఆయా పరిశోధకులు ప్రోవు చేసిన ఆధారాలు, విశ్లేషించిన విధానాలు, సమన్వయించిన వైఖరులూ, అనుసరించిన విధానాలు, వెలువరించిన సిద్ధాంతాలూ సమన్వయాలూ, చరిత్ర నిర్మాణానికి శక్తిమంతమైన ఉపకరణాలు కాగలవు. వందల కొలది సిద్ధాంత వ్యాసాలు వచ్చినా వాటిలో ప్రతిపాదింపబడిన సూక్ష్మ విశేషాలను సమీకరించి, అధ్యయన అధ్యాపనాలలోకి తీసికొని వచ్చే ప్రయత్నాలు కూడా ఇంతవరకు సంఘటితంగా జరగలేదు. ఆ ప్రయత్నంలో తెలుగు అకాడమీ వారు ప్రచురించిన 'తెలుగు పరిశోధన సంహిత' మొదటి మెట్టు. అయినా, అది అసమగ్రమైన యత్నం. ఆ గ్రంథం ప్రచురించే నాటికే వచ్చిన సిద్ధాంతవ్యాసాలు కొన్ని అందులో చేరలేదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రజతోత్సవాల సందర్భంగా ప్రచురిస్తున్న ఈ సంచిక ఆ ప్రయత్నంలో మరొక ముందడుగు. తెలుగు అకాడమీ వారి యత్నం వర్ణనాత్మక గ్రంథసూచి (Descriptive Catalogue) పద్ధతి ననుసరించింది; ఈ సంచిక విషయ సమీకరణ (Collection of Data), చారిత్రాత్మక సమీక్ష (Historical Review) పద్ధతులకు చెందింది. తెలుగు భాషా సాహిత్య పరిశోధనలను గురించి సామాజికుల కొక సమన్వయాత్మక దృక్పథం ఏర్పడటానికి ఇది తోడ్పడుతుంది.

## ౩

పరిశోధకులు ప్రతిపాదించిన సిద్ధాంతాలను, వెలుగులోకి తెచ్చిన విశేషాంశాలను, విస్తరింపజేసిన అవగాహన పరిధినిబట్టి పరిశోధన ప్రక్రియ సాధించిన విజయాలను నిర్ణయించవచ్చు. ఈ విధంగా చూస్తే తెలుగులో ప్రవర్తిల్లిన పరిశోధన ప్రయోజనవంతంగానూ, ఫలవంతంగానూ విస్తరిల్లిందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

పరిశోధన వలని ప్రయోజనాలలో ముఖ్యమైనవి అయిదు : 1. నూత్న సిద్ధాంతాలను గాని, వాదాలను గాని రూపొందించటానికి తోడ్పడటం. 2. పూర్వ సిద్ధాంతాలను గాని, వాదాలను గాని సవరించి, పరిష్కరించి అభినవ దృక్పథంతో సాహిత్యాన్ని గాని, ప్రక్రియలను గాని అనుశీలించటానికి మార్గాలను ఏర్పరచటం. 3. కావ్యాల విలువలను వినూత్న దృక్కోణాలతో నిర్ధరించే పద్ధతులను ప్రతిపాదించటం. 4. సాహిత్యంలోని ప్రయోగాలను, ప్రక్రియలను, వివిధ సాహిత్యాంశాలను విశ్లేషణాత్మకంగా వివేచించటానికి, వివరించటానికి సహాయకారి కావటం. 5. పరిశోధనలో వివిధ శాఖలను ఆవిష్కరించటం. ఈ ప్రయోజన పంచకం తెలుగు సాహిత్య పరిశోధన వలన కూడా సాధింపబడింది; పరిశోధన నిరంతరాన్వేషణయాత్ర వంటిది కాబట్టి దానికి అవధి అంటూ ఉండదు. అయితే, కొన్ని లక్ష్యాలు మాత్రం ఉంటాయి. ఆయా లక్ష్యాలలో ప్రతిరంగంలోనూ తెలుగులో పరిశోధన సాధించిన ఫలితాంశాలు పరిగణింపదగినవిగానే ఉన్నాయి. అయితే, వాటి నన్నింటినీ ఒకచోట చేర్చి వివరించటానికి నాకు శక్తి లేదు; సామర్థ్యమూ చాలదు. బహుశః ఒక వ్యక్తి చేయగలిగిన పని కూడా కాదేమో !

ఇక్కడ పరిశోధన అంటే విశ్వవిద్యాలయాలలో, సిద్ధాంత వ్యాసాలకు మాత్రమే పరిమితమైనదని భావించరాదు. పరిశోధన లక్షణాలను ప్రదర్శించిన ప్రతి విమర్శా పరిశోధనయే అవుతుంది.

పైన పేర్కొన్న అయిదు అంశాలలో ఒక్కొక్కదానికి మచ్చుకు కొన్ని ఉదాహరణలిస్తే వాటి స్వరూప స్వభావాలను తెలిసికోవటానికి వీలౌతుంది.

**1.** నూత్న సిద్ధాంతాలనుగాని వాదాలనుగాని రూపొందించటం :

(1) నన్నెచోడుడు నన్నయకు పూర్వుడనే మానవల్లి రామకృష్ణ కవిగారి వాదం.

(2) ఆముక్తమాల్యద రాయలకృతమా కాదా అనే వాదం.

(3) కావ్య ప్రక్రియ కంటె ఆంధ్ర ప్రబంధ ప్రక్రియ విశిష్టమైనదన్న పింగళివారి వాదం.

(4) క్రీ.శ. 19 వ శతాబ్ది తెలుగు సాహిత్య యుగం క్షీణయుగం కాదని నిరూపించిన ఏటుకూరి సత్యనారాయణగారి వాదం.

(5) రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం.

(6) జి. వి. సుబ్రహ్మణ్యం ప్రతిపాదించిన 'ధర్మవీరపీవరసానాంరసః' అనే సిద్ధాంతం.

(7) గుంటూరు శేషేంద్ర శర్మగారి అనుభూతి కవిత్వ వాదం.

(8) కుమార సంభవ కర్త నన్నెచోడుడు కాడని ప్రతిపాదించిన కొర్లపాటి శ్రీరామమూర్తిగారి వాదం.

**2.** పూర్వ సిద్ధాంతాలను గాని, వాదాలను గాని ఖండించి, పరిష్కరించి అభినవ దృక్పథాన్ని అనుశీలనానికి అందించటం :

(1) జి. వి. కృష్ణరావుగారు 'కావ్యజగత్తు'లో ప్రతిపాదించిన మార్క్సిస్టు దృక్పథం.

(2) ఆర్. ఎస్. సుదర్శనంగారి-'రస'మంటే 'Unity of moods' అనే వాదం.

(3) గిడుగు సీతాపతిగారు దేశిచ్ఛందస్సులను అనుశీలించటంలో చూపిన నూతన...

(4) పాటిబండ మాధవశర్మ గారు ప్రస్తరించిన ఛందశ్శిల్ప విధానం.

(5) విశ్వనాథ సత్యనారాయణ గారి కావ్య వ్యాఖ్యానుశీలన విధానం.

(6) జి.వి. సుబ్రహ్మణ్యం ప్రతిపాదించిన [illegible] వివేచనం, ఆంధ్ర మహాభారత రామాయణాలు ధర్మవీర ప్రధానాలని చేసిన ప్రతిపాదనం; శాంతరస వివేచనం.

(7) కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి గారు చేసిన ఇతిహాసలక్షణ వివేచనం.

**3.** కావ్యాల విలువలను వినూత్న దృక్కోణాలతో నిర్ధరించే పద్ధతులు.

(1) ప్రబంధాలను ప్రతీకాత్మక దృక్పథంతో అన్వయించవచ్చునన్న విషయం జి. వి. కృష్ణరావు గారు కళాపూర్ణోదయాన్ని, పింగళి, విశ్వనాథలు మనుచరిత్రను, కె. సుప్రసన్నాచార్య వసుచరిత్రను, జి. వి. సుబ్రహ్మణ్యం విజయవిలాసాన్ని అనుశీలించటం ద్వారా స్పష్టమైంది. ప్రతీకాత్మకత ప్రబంధ ప్రధాన లక్షణమని ధ్రువపడింది.

(2) వెల్చేరు నారాయణరావు గారు తెలుగులో కవితా విప్లవాల స్వరూపం అనుశీలించే విధానంలో ప్రతిపాదించిన పద్ధతులు.

(3) శ్రీశ్రీ సామ్యవాద మానవతావాద దృక్పథం.

(4) ప్రసిద్ధ ప్రాచీనాంధ్ర కవుల సాహిత్య దర్శనాలను అనుసరించి వారి వారి కవిత్వాలలో ఏర్పడిన మత భేదాలను గుర్తించే విధానంలో జి.వి. సుబ్రహ్మణ్యం ప్రతిపాదించిన పద్ధతులు.

(చూడు: ఆం.ప్ర.సా. అకాడమీ ప్రచురించిన సాహిత్య వ్యాసాలు మొదటి సంపుటి- లోని ఆ ప్రత్యేక వ్యాసం)

4. సాహిత్యంలోని ప్రయోగాలను, ప్రక్రియలను, వివిధ సాహిత్యాంశాలను విశ్లేషణాత్మకంగా వివేచించటం, వివరించటం.

బి. రామరాజుగారు జానపద గేయ ప్రక్రియను, ఎస్వీ జోగారావుగారు యక్షగాన ప్రక్రియను, పోణంగి శ్రీరామ అప్పారావుగారు నాటక ప్రక్రియను, పల్లా దుర్గయ్యగారు ప్రబంధ ప్రక్రియను, సి. నారాయణ రెడ్డిగారు ఆధునిక కవిత్వ ప్రక్రియలను, కె. గోపాలకృష్ణరావుగారు శతక ప్రక్రియను, నిడదవోలు వెంకటరావుగారు దక్షిణాంధ్ర వాఙ్మయ ప్రక్రియను, వేటూరి ఆనందమూర్తిగారు సంకీర్తన ప్రక్రియను, కొలకలూరి ఇనాక్‌గారు వ్యాస ప్రక్రియను, ఎం. కులశేఖరరావుగారు వచన వాఙ్మయ ప్రక్రియను, బి. వి. కుటుంబరావుగారు నవలా ప్రక్రియను, పోరంకి దక్షిణామూర్తిగారు కథానికా ప్రక్రియను, బాదాల రామయ్యగారు వీరశైవ వచన ప్రక్రియనూ, డా॥ ఎస్. వి. రామారావుగారు సాహిత్య విమర్శ ప్రక్రియను, టి. సుశీలగారు ద్విపద కావ్య ప్రక్రియను అనుశీలించిన పరిశోధనలు ఈ కోవకు చెందుతాయి.

5. పరిశోధనలో ప్రక్రియాశాఖా విస్తృతి.

(1) జానపద సాహిత్యంలో నాయని కృష్ణకుమారిగారి 'జానపద గేయగాథలు', తంగిరాల వెంకట సుబ్బారావుగారి 'తెలుగు వీరగాథా కవిత్వము' మొదలైనవి.

(2) దేశీ ప్రక్రియలలో తూమాటి దోణప్పగారి 'హరికథా వాఙ్మయం', గార్లపాటి దామోదరనాయుడు గారి 'అవధాన కవిత,చాటు కవితల తులనాత్మక పరిశీలనం', ఎం. కె. దేవకిగారి 'బాలగేయ సాహిత్యం', కంకంపాటి రామగోపాలకృష్ణమూర్తిగారి 'అవధాన ప్రక్రియ', కావేటిపాకం సర్వోత్తమన్‌గారి 'దాక్షిణాత్య దేశిచ్ఛందో రీతులు', సి.వి. సుబ్బన్న శతావధానిగారి 'అవధాన శిల్పం', చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'సామెతలు, నుడికారాలు', సి.హెచ్. రామనాథంగారి 'కూచిపూడి యక్షగాన విద్య', మొ॥నవి శాఖా విస్తృతికి కొన్ని సాక్ష్యాలు.

(3) శిష్ట సాహిత్య ప్రక్రియలపై జరిగిన పరిశోధనలో జి. వి. సుబ్రహ్మణ్యం 'పురాణ వాఙ్మయము', జి.వి.బి. కృష్ణమాచార్యులు గారి 'తెలుగులో స్థల పురాణాలు', బి. చెన్నకేశవరెడ్డి గారి 'ఆధునికాంధ్ర గేయ కవిత్వం', ఈటూరి పద్మావతి గారి 'తెలుగులో ప్రహసనాలు', మిరియాల రామకృష్ణగారి 'శ్రీశ్రీ కవిత్వం', పి. వెంకటరమణ గారి 'తెలుగు సాంఘిక నాటకం', వి. సీతాకల్యాణి గారి 'చారిత్రక కావ్యాలు', ఐడ్. ఎలిజబెత్ గారి 'చారిత్రక నవలలు', తిరుమల శ్రీనివాసాచారి గారి 'గేయ నాటికలు'-ఇలా ఎన్నో పేర్కొనవచ్చు.

ఇవికాక ఒక్కొక్క కవిని గురించి, ఒక్కొక్క కావ్యాన్ని గురించి, కొందరు కవుల్లో ఉన్న సజాతీయ ప్రవృత్తులను గురించి, ఆయా రచయితలు నిర్వహించిన ప్రత్యేక ప్రక్రియలను గురించి, ప్రత్యేక కవితా లక్షణాలను గురించి (ఉదాహరణకు వి.వి.యల్. నరసింహారావు గారి 'నన్నయ అక్షరమ్యత'), వ్రాసిన గ్రంథాలు,

చేసిన పరిశోధనలు ఎన్నో ఉన్నాయి. అలంకారశాస్త్ర సంబంధి విషయాలను [illegible], కవితలను [illegible] అనుశీలించినవి ఉన్నాయి. ఛందోవ్యాకరణాద్యంశాలను తీసికొని కావ్యాలకు అన్వయించినవి ఉన్నాయి. [illegible] కంటె తులనాత్మక పరిశీలనలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

సాహిత్యానికి కొంతవరకు సంబంధించినవి భాషాశాస్త్ర విభాగానికి చెందినవి వ్యాకరణశాస్త్ర పరిశోధనలు. ఈ శాఖలో వఝ్ఝల చిన సీతారామస్వామి, మల్లాది సూర్యనారాయణ, కోరాడ మహాదేవశాస్త్రి... గోపాలకృష్ణయ్య, అమరేశం రాజేశ్వరశర్మ, బొడ్డుపల్లి పురుషోత్తం మొదలైన వారి కృషి పేర్కొనదగింది. ఇవికాక [illegible] విశేషాలను పరిశీలించే గ్రంథాలు కూడా వెలువడినాయి. బయలాటలు, కోలాటం మొదలైన జానపద ప్రక్రియల మీద కూడా పరిశోధనలు జరిగాయి. ప్రస్తుతం జానపద వాఙ్మయంతో పాటు జానపద విజ్ఞాన శాఖలో కూడా పరిశోధనలు వెలువడుతున్నాయి.

సాహిత్య పరిశోధనలో సంశోధిత గ్రంథాలను సిద్ధం చేయటం ఒక ప్రత్యేక శాఖగా భావింపబడుతున్నది. బ్రౌణ్య వీరేశలింగ యుగాలలో ఈ ప్రక్రియ విస్తరించి తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేసింది. ఆధునిక యుగంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆధ్వర్యంలో ప్రచురింపబడిన సంశోధిత మహాభారత ప్రచురణం ఈ శాఖలో ఒక గర్వకారణంగా నిలిచింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన 'ఆంధ్ర మహాభాగవతము', తిరుపతి దేవస్థానంవారు ప్రచురించిన 'పదసాహిత్యం', మండా జగన్నాథరావుగారు కూర్చిన స్వరసహితపద వాఙ్మయ సంపుటాలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధన శాఖవారి 'నారద పురాణం' మొదలైనవి [illegible] సాహిత్య [illegible] కోవలో పేర్కొనవచ్చు. ఈ పరిశోధన పద్ధతిలో తాళపత్ర గ్రంథాలను పరిశీలించి [illegible] బి. రామరాజుగారి కృషి ఆధునికులలో పేర్కొనదగింది. వీరి కృషి [illegible] శ్రీనాథుని 'శివరాత్రి మాహాత్మ్యం' వంటి గ్రంథాలు పూర్తిగా లభించాయి. [illegible] రంగంలో కూడా ఈ ప్రక్రియ సముచిత పాత్ర నిర్వహిస్తున్నది. దేవరకొండ చిన్నికృష్ణయ్యగారు 'హరిభట్టు రచించిన వరాహపురాణా' [illegible] వల్లపురెడ్డి బుచ్చారెడ్డి గారు 'మధురవాణీ విలాసా'నికి, ముదిగొండ వీరేశలింగంగారు 'జైమినీ భారతా'[illegible] సంశోధనాత్మక ప్రతులను తయారుచేసి పరిశీలించటం గమనింపదగింది. వారికి డాక్టరేట్ డిగ్రీలు వచ్చాయికూడా.

సాహిత్య అకాడమీ అందిస్తున్న పోటీ బహుమతులను పొందిన [illegible] కూడా [illegible] కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు–గిడుగు సీతాపతిగారి 'తెలుగు భాషలో [illegible]' [illegible] 'వీరరసము', తూమాటి దొణప్పగారి 'ఆంధ్ర సంస్థానములు – సాహిత్య [illegible]', [illegible] వాఙ్మయము', జె. గోపాలకృష్ణరావుగారి 'తెలుగు సాహిత్యముపై ఉరుదు ప్రభావము', [illegible] 'తెలుగులో తిట్టు కవిత్వము', జి. నాగయ్యగారి 'తెలుగు కావ్యాలలో [illegible]', [illegible] వ్యావహారిక భాషా వికాసము–చరిత్ర', ఆర్.వి.యస్. సుందరంగారి 'తెలుగు సాహిత్యంలో [illegible]', [illegible] శంకరరావు, రామానుజాచార్యులు, మల్లినాథ సూరి 'జీవితము–[illegible]', [illegible] 'తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ' మొదలైనవి. ప్రతి సంవత్సరం సాహిత్య [illegible] సాహిత్య విమర్శకు బహుమతులిచ్చే పద్ధతి గ్రంథాలలో ఆర్.యస్. [illegible] గారి 'సాహిత్య[illegible]',

తిరుమల రామచంద్రగారి 'గాథా సప్తశతిలో తెలుగు పదాలు', ఓరుగంటి [illegible] శాస్త్రిగారి '[illegible] హరి హరనాథ [illegible]' మొదలైనవి పరిశోధన స్థాయి నందుకొనిన గ్రంథాలు.



తెలుగులో జరుగుతున్న పరిశోధన వ్యక్తుల స్థాయిలోనూ, సాహిత్య సంస్థల స్థాయిలోనూ, విశ్వవిద్యాలయాల స్థాయిలోనూ, అకాడమీల స్థాయిలోనూ సాగుతున్నది. ఈ వ్యవస్థా చతుష్టయంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తన పాత్రను బాధ్యతాయుతంగా నిర్వహిస్తూ అటు సమగ్ర భాషా నిఘంటు నిర్మాణం, ఇటు సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణం అనే గురుతర పరిశోధన కార్యక్రమాల నిర్వహణకు అనువైన ప్రయత్నాలను సాగిస్తూ, మిగిలిన విద్వాంసుల సహకారంతో సంపుటీకరణ పథకాలను రూపొందించుకొంటూ, పరిమితమైన ఆర్థిక వనరులతో తన విద్యుక్త ధర్మాన్ని శక్తివంచన లేకుండా నిర్వహిస్తున్నది. అంటే, సాహిత్య అకాడమీకి భాషా సాహిత్య పరిశోధనలు రెండు కళ్ళులాంటివన్నమాట. ఆ రెండూ శక్తిమంతంగా సాగించే యత్నమే దాని ప్రగతికి ప్రధాన సూత్రమన్నమాట!

ఇరవై అయిదేళ్ళ జీవితాన్ని విజయవంతంగా ముగించుకొన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తన వెండి పండుగను, వేడుకలతో వినోదంగా గడపకుండా నిర్మాణాత్మకమైన సదస్సులను నిర్వహించటంతో పాటు తాను మౌలికంగా అంకితమైన తెలుగు భాషా సాహిత్య పరిశోధనను గురించి, దేశంలో జరుగుతున్న కృషిని, దానివలన సాధింపబడుతున్న ప్రగతిని సమీక్షించే వ్యాసాలతో ఒక సంచికను వెలువరించాలని సంకల్పించింది. అకాడమీ కార్యవర్గం, సాధారణసభ ఈ ప్రతిపాదనను ఏకగ్రీవంగా ఆమోదించాయి. సంపాదకవర్గాన్ని ఏర్పరిచాయి. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి అధ్యక్షతలో సంపాదకవర్గం ఒక ప్రణాళికను రూపొందించింది. ఆ ప్రణాళికయే ఈ సంచికా స్వరూపం. ఇందులో ఎందరో పెద్దలు వ్యాసాలు వ్రాశారు. మొదట భావించినట్లుగా వ్యాసాలు రాకపోయినా, అందిన వ్యాసాలతో ఈ సంచికను సిద్ధం చేయటం జరిగింది. ఈ సంచికను నాలుగు భాగాలుగా విభజించటం అయింది. మొదటి భాగం 'పరిశోధన-సిద్ధాంత ప్రమాణాలు', రెండవభాగం 'చారిత్రక సమీక్షలు', మూడవ భాగం 'ప్రక్రియాపరంగా సాగిన పరిశోధనలు', నాల్గవ భాగం 'సింహావలోకనానికి' గా విభజింపబడింది. వ్యాసాలన్నీ సమీక్షా దృష్టితో వ్రాయబడినవి. జరిగిన కృషిని గురించి ఒక సమాలోచనం చేసికోవటానికి ఉపయోగించేవి. ఇందులో 'విశ్వవిద్యాలయాలలో జరిగిన పరిశోధన', 'విదేశాలలో జరిగిన తెలుగు భాషా పరిశోధన' అనే వ్యాసాలు వివిధ కారణాల వల్ల సమయానికి అందకపోవటంవలన ప్రచురించలేకపోతున్నాం. అయినా, ఆ లోపం చాలవరకు తీర్చేట్లు ఈ సంచికలో అనుబంధంగా ప్రచురింపబడుతున్న అంశాలు ఉపయుక్తాలైనవి. [illegible] ఆయా అంశాలలో జరిగిన కృషిని వ్యక్తం చేయగలిగేవిగా ఉన్నాయి. విశ్వవిద్యాలయాలలో జరిగిన పరిశోధకుల, పరిశోధనల పట్టిక, తెలుగులో వెలువడిన సాహిత్య పత్రికల పట్టిక విలువైన సమాచారాన్ని అందిస్తాయని, భావి పరిశోధకులకు ఎంతో ఉపయోగపడతాయని నమ్ముతున్నాం. ఈ సంచికకు అనుబంధంగా చేర్చిన 'పదసూచి' ఇందులో ప్రస్తావించిన విషయాలను పట్టి ఇస్తుంది.

తెలుగులో పరిశోధనను గురించి విషయసేకరణ చేసి, విశ్లేషణాత్మకంగా వాటిని వ్యాస రూపంలో అందించే మొదటి ప్రయత్నం ఈ సంచిక అని అనుకుంటాను. విశ్వవిద్యాలయాలలో ఒకటి, రెండు పరిశోధన

పత్రికలు వెలువడుతున్నా అవి కూడా ఈ ప్రయత్నాన్ని సమగ్రంగా నిర్వహించలేదు. పరిశోధన విషయంలో ఒక సంఘటితమైన అవగాహనతో కూడిన ప్రణాళిక విశ్వవిద్యాలయాలకు కావాలన్న అంశమైనా [illegible] జంగానూ, సదస్సులలోనూ వినపడుతున్నా ఎటువంటి ప్రయత్నమూ ఆ మార్గంలో జరిగినట్లు కానరాదు. అందువలన ఈ సంచిక సమకాలీన పరిశోధకులకు ఉపయోగకారిగా ఉంటుందని సాహిత్య అకాదెమీ భావించి ప్రచురిస్తున్నది. లక్ష్యం ఉత్తమమైనది; ప్రయత్నం సార్థకమైనది; ఫలితం తెలుగు ప్రజకు అంకితమైనది. ప్రథమ ప్రయత్నం సమగ్రం కాకపోవచ్చు. కాని, సమగ్రత కొరకు చేసే సాధనగా దీనికి గుర్తింపు ఉంటుంది.

"Works of art Cannot be discribed or explained. They must be perceived. And the most the critic can do is to offer hints and directions for focusing the attention in the very difficult art of excercising and cultivating the skill to perceive."21

—Harold Osborne

సంచికకు ఈ ముందు మాటలు వ్రాసేందుకు అవకాశమిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి నా కృతజ్ఞతలు.22

హైదరాబాదు,
31-8-1983

—[illegible]

# ఈ సంపుటిలోని వ్యాసకర్తలు

**అమరేంద్ర, డా॥**
ప్రిన్సిపాల్, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి
కళాశాల, గుంటూరు.

**ఆనందమూర్తి, వేటూరి, డా॥**
రీడర్, తెలుగుశాఖ,
పి. జి. కళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**ఇనాక్, కొలకలూరి, డా॥**
ఆంధ్రాచార్యులు, తెలుగుశాఖ,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

**కృష్ణమూర్తి, ఇరివెంటి, డా॥**
రీడర్, తెలుగుశాఖ,
పి. జి. కళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**కోటేశ్వరరావు, తుమ్మపూడి, డా॥**
ఆచార్యులు & ఆంధ్ర శాఖాధ్యక్షులు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

**గంగప్ప, ఎస్., డా॥**
ఆంధ్రోపన్యాసకులు, తెలుగుశాఖ,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ (గుంటూరు).

**గోపాలకృష్ణరావు, కె., డా॥**
ఆంధ్రాచార్యులు, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**చంద్రశేఖరశర్మ, మూలంపల్లి, డా॥**
సంస్కృతోపన్యాసకులు,
ప్రభుత్వ మహిళా కళాశాల,
బేగంపేట, హైదరాబాదు.

**నరసింహారావు, వి. వి. యల్., డా॥**
డైరెక్టర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత
గ్రంథాలయము-పరిశోధనాలయం,
ఆర్‌నాకా, హైదరాబాదు.

**'నిర్మల్', ఎమ్‌పేన్, డా॥**
రీడర్, హిందీశాఖ,
పి. జి. కళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**ప్రసాద్, ఏటుకూరి, డా॥**
ఆంధ్రోపన్యాసకులు,
సింగోడియా కామర్సు కళాశాల,
హైదరాబాదు.

**బ్రహ్మానంద, హెచ్. ఎస్., డా॥**
రీడర్, తెలుగుశాఖ,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

**రంగనాథాచార్యులు, కె. కె., డా॥**
ప్రిన్సిపాల్,
ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్యకళాశాల,
హైదరాబాదు.

**రఘునాథశర్మ, శలాక, డా॥**
రీడర్, తెలుగుశాఖ,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

**రమాపతిరావు, అక్కిరాజు, డా॥**
రీసర్చి ఆఫీసరు, తెలుగు అకాడమి,
హైదరాబాదు.

**రాధాకృష్ణ, బూదరాజు, డా॥**
డిప్యూటీ డైరెక్టర్, తెలుగు అకాడమి,
హైదరాబాదు.

**రాధాకృష్ణశర్మ, చల్లా, డా॥**
ఆచార్యులు, ఆంధ్ర శాఖాధ్యక్షులు,
మదురై కామరాజ్ విశ్వవిద్యాలయం,
మదురై.

**వీరభద్రరావు, కొత్తపల్లి, డా॥**
ఆంధ్రాచార్యులు, తెలుగు శాఖ,
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**వేంకటావధాని, దివాకర్ల, డా॥**
ఆంధ్రాచార్యులు, ఆంధ్ర శాఖాధ్యక్షులు (రిటైర్డ్),
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**శేషగిరిరావు, చీమకుర్తి,**
పరిశోధకుడు, తెలుగుభాషాసమితి,
హైదరాబాదు.

**శ్రీనివాసాచార్య, తిరుమలం, డా॥**
ఆంధ్రోపన్యాసకులు,
సర్దార్ పటేల్ కళాశాల,
సికిందరాబాదు.

**శ్రీరామచంద్రుడు, పుల్లెల, డా॥**
రీడర్, సంస్కృతశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**శ్రీహరి, రవ్వా, డా॥**
రీడర్, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**సంపత్కుమారాచార్య, కె., డా॥**
రీడర్, తెలుగుశాఖ,
కాకతీయ విశ్వవిద్యాలయం,
వరంగల్లు.

**సుబ్రహ్మణ్యం, జి. వి., డా॥**
ఆంధ్రశాఖాధ్యక్షులు, రీడరు,
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

**సుబ్రహ్మణ్యం, పి. యస్., డా॥**
భాషాశాస్త్రాచార్యులు,
సెంటర్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీ ఇన్ లింగ్విస్టిక్స్,
అన్నామలై విశ్వవిద్యాలయం,
అన్నామలైనగర్, తమిళనాడు.

**సుబ్రహ్మణ్యశాస్త్రి, పోతుకూచి, ఆచార్య..**
ఆంధ్రశాఖాధ్యక్షులు (రిటైర్డ్),
నాగపూరు విశ్వవిద్యాలయం,
నాగపూర్.

# విషయసూచిక

## మూడవ భాగం: ప్రక్రియాపరంగా జరిగిన పరిశోధన - ఒక అనుశీలన

## నాలుగవ భాగం : తెలుగులో పరిశోధన - సింహావలోకనం

## అనుబంధాలు

# మొదటి భాగం

# పరిశోధన-సిద్ధాంతం-ప్రమాణం

# సాహిత్య పరిశోధన - సిద్ధాంత ప్రమాణాలు

—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

శంభోర్దేహార్ధ భావేన జపంతీం పరమేశ్వరీమ్
నౌమి త్రిలోచనప్రియాం పశ్యంతీ
మాత్మరూపిణీమ్.

సాహిత్య పరిశోధనకు నిర్దిష్ట ప్రమాణాలు, ఆశయాలు చాల అవసరము. సంప్రదాయమును త్రోసివేయకుండ కళాకారుడు తన వైశిష్ట్యమును, వ్యక్తిత్వమును చూపగలిగి ఉండవలెనని టి. ఎస్. ఎలియట్ కూడ వచించినాడు. దీనిని ఆశ్రయించి కావ్యమునకు విశ్వజనీనత్వమున్నదీ, లేనిదీ నిశ్చయించుటలోనే పరిశోధన ఫలించును. ఆయా దేశ కాలాదులకు గాని, ఆయా వర్గములకు గాని ఉద్దేశించిన సాహిత్యము కాలప్రవాహమున సముద్రగర్భమును చేరును. ఈ సత్యమును నిరూపించుటకే సిద్ధాంతములు, ప్రమాణములు ఉద్దిష్టములైనవి, సహృదయులైన సమీక్షకుల ఆమోదముల నందినవి.

మనదేశమున తొలిసమీక్షకుడు నాట్యశాస్త్రకర్తయగు భరతుడు. నాట్యమునకు చెప్పిన లక్షణములు చాలవరకు సాహిత్యమునకుగూడ అనువర్తించును. "త్రైలోక్యస్యాస్యసర్వస్య నాట్యం భావానుకీర్తనమ్" (1.107), "లోకవృత్తానుకరణం" (1.112), "లోకోపదేశజననం" (1.115), "సప్తద్వీపానుకరణం" (1.117) అని పలుతావుల భరతముని పలికినాడు. "యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః" (1.119) అని కూడ అనినాడు. తత్తద్దేశకాలప్రవృత్త్యా వైచిత్ర్యమును గాక విశ్వజనీనమైన స్వభావములను, స్థితులను, సన్నివేశములను సాహిత్యము అభివ్యక్తము చేయక తప్పదు. ఇది తాత్కాలికసాహిత్యవిషయము కాదు. "సర్వకర్మానుదర్శకం" (1.14), "సర్వశాస్త్రార్థసంపన్నం" (1.15), "కర్మ భావాన్వయాపేక్షీ" (1.106) అని పలికినపుడు పాశ్చాత్య సమీక్షకులు వివరించిన Universal నే భరతుడు నొక్కిచెప్పినాడు. దీనినే దార్శనికులు మహాసామాన్య మని, సత్తాసామాన్య మని పలికిరి.

విశ్వజనీనతను Universalization, Idealization అని ప్లేటోనుంచి, భరతునినుంచి నేటివరకు సహృదయు లంగీకరించుటచే ధర్మవిరోధము మంచి సాహిత్యమున కన్పించరాదు.

'అకవిత్వ మధర్మాయ వ్యాధయే దండనాయవా
కుకవిత్వం పునః సాక్షా న్మృతి మాహు
ర్మనీషిణః' (1.12)

అని భామహుని వచనము. అధర్మమును పోషించునది అకవిత్వము. ఈ కుకవిత్వము మరణము వంటిది. ధర్మసామాన్యస్వభావ మెల్లప్పుడు ఒకేతీరున నున్నను, ఆయా దేశకాల పరిస్థితుల ననుసరించి స్వల్పమైన భేదములు రాగలవు. ధర్మప్రకోపమే కాక

'తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యాద్వపుః సుందర మపి శ్విత్రేణైకేన
దుర్భగమ్' (1.7)

అని దండి పల్కినప్పుడు దోషములుకూడ సాహిత్యమున ఉండరాదు. ఇచట దోషశబ్దమునకు కావ్య

దోషము లని అర్థము. సాహిత్యగ్రంథమున దోష మున్నచో నది క్రొద్దిగా బయలుదేరిన కుష్ఠుమచ్చవలె వ్యాపించును. విరుద్ధరసములనుగాని విరుద్ధవిభావాదు లనుగాని సమావేశపరచుట, అన్వితమైనదానినే మరల వర్ణించుట, చెప్పదలచినదానిని మధ్యలో వదలివేయుట, పునరుక్తి అనునవి రసభంగహేతువులు.[1] శ్రుతి దుష్టము, అర్థదుష్టము, కల్పనాదుష్టము, శ్రుతికష్టము అనునవి రసప్రతీతికి విఘ్నమును కల్గించునవి. వీటితో పాటు అపార్థము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, అపక్రమము, శబ్దహీనము, యతిభ్రష్టము, విసంధి కము, దేశకాలకళాదివిరోధములుకూడ సాహిత్యమున దోషములే.[2] ఒకే పద్యమున భిన్నవృత్తపంక్తులను వాడుట కూడ దోషమే. ఈ దృష్టితో పరిశీలించినచో ఎన్ని కావ్యములు నిలువగలవో తెలిసికొనవచ్చును.

సాహిత్యమున లౌకికావేశములను బాహాటముగా చెప్పుట పనికిరాదు. సుఖదుఃఖ తారతమ్యకృతమైన ఈ ఆవేశము రసప్రతీతికి యోగ్యము కాదు. అలౌకి కమై, ఆవేశరహిత మైనట్లు కన్పించు నిజమైన ఆవే శమే కవికి, సామాజికునకు కలిగినపు డది రసమున కుపకరణ మగు నని అభినవగుప్తపాదులు.[3] ఇదే విధముగా "Poetry is not a turning loose of emotion, but an escape from emotion"[4] అని టి. ఎస్. ఎలియట్ వ్యక్తము చేసెను.

భరతుడు లోకధర్మి, నాట్యధర్మి అని (6.24) చెప్పుటలో మనకు కవిసమయములు వచ్చినవి. వాస్త వికి, అతివాస్తవిక రచనలలో కన్పించున్నది లోక ధర్మి (2.30) కేవలము దీనిమీదనే ఆధారపడి రచించి నచో అది కవిత్వమనిగాని, సాహిత్యమనిగాని అని [illegible]కొనడు. భరతుడు (13.70-86) వివరించిన [illegible] నాట్యధర్మికే కావ్యత్వమెక్కువ. [illegible] ఉన్నదానిని ఉన్నట్లుగానే చెప్పు [illegible]ము.

'యదత్రాస్తి న తత్రాస్యకవే ర్వర్ణన మర్హతి
య న్నాసంభవితత్రస్యాత్ సంభవ్యత్ర తు
ధర్మతః.'[5]

దీనినే అరిస్టాటిల్ Probable Impossibility అనికొనియాడినాడు. నాట్యధర్మిలేని రచనకు సాహిత్య లక్షణము వర్తించ దని భరతుడు (13.84). పదు నాల్గవ అధ్యాయమున రాజశేఖరుడు దీనినే సమయ స్థాపన అని వ్యవహరించినాడు. స్త్రీస్పర్శతో ప్రియంగు, పాదతాడనముతో అశోకము, వీక్షణాలింగనముల వలన తిలక కురవకములు, నర్మవాక్యములవలన మందారము పుష్పించు నను మొదలుగా గలవి కవి సమయములు. వీటిలోవాస్తవముగా అశోకముమాత్రము పుష్పించదు. అశాస్త్రీయము, అలౌకికము నైనను కవిపరంపరాగత మైన ఇట్టి విషయములు కవిసమయ ములు గాన అంగీకార్యములు.

'అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే.'[6]

ఉన్నదానిని యథాతథముగా చెప్పక మాత్రముతో సూచించుటలో కవికి అధికారమున్నది. తన ప్రతిభా, భావనలద్వారా భావించిన జగమును సృష్టించగల వాడు కవి. ఉన్నదానిని ఉన్నట్లుగా 'కెమెరా' లోని చిత్రములవలె చూపవలె నను Naturalism అను వాదము ఒక వెలుగు వెలిగి ఏబదియేండ్లు నిండకయే పాశ్చాత్య దేశములలో 1930 నాటికే మరణించినది. సహ్యముగా భాసించని జగమును కవి స్వర్ణమయ మని మన కందజేయు నని సిడ్నీ నాల్గువందల ఏండ్ల క్రితము చెప్పినాడు. మన లౌకిక జగమునకు సదృశ ముగను, అసదృశముగను కూడ కన్పింపజేయుటలో సాహిత్యస్రష్టయొక్క వైశిష్ట్య మున్నది. తార్కిక కార్యకారణ సంబంధము నతిక్రమించక రచించుటలో నాట్యధర్మి కలదు. అప్పుడే సాహిత్యమున సరియైన రసానుభూతి రాగల వీలున్నది.

భరతుని దృశ్య శ్రవ్య శబ్దములను వ్యాఖ్య చేయుచు దృశ్య మనగా హృద్య మని, శ్రవ్య మనిన వ్యుత్పత్తిప్రద మని అభినవుడు వివరించెను. ప్రీతి, వ్యుత్పత్తి అనునవి ఒకే నాణెమునకు గల రెండు ప్రక్కలు[7]. కావుననే "నాయకస్య కవేః శ్రోతు స్సమానోఽనుభవ స్తతః'' అని తౌతభట్టు పలుకగా, ''కవి ర్హి సామాజికతుల్య ఏవ''[8] అని అభినవుడు పలికెను. కవికి, సామాజికునకు సాదృశ్య మవసరము. ఈ సాదృశ్యము లేనిదే సాహిత్యమున గల ఔచిత్యా నౌచిత్యములు భాసింపజాలవు. సాహిత్యమున కన్పించు ఔచిత్యమువలన ప్రీతి కలుగును. విభావాదులను రస పర్యవసితములుగా చేయుటలో కవియొక్క వ్యుత్పత్తి భాసించు నని ప్రామాణికులు.[9]

కలము పట్టనేర్చిన ప్రతివ్యక్తి కవి కాలేడు. లులాయిపదములు పాడినంతనే గేయకవిత్వమురాదు. కవికి కొంత వ్యుత్పత్తి అవసరము గనుకనే అవ్యుత్పత్తికృత దోషములను సాహిత్యములో ఆనందవర్ధనాదులు పేర్కొనినారు. సాహిత్యస్రష్టకు కొంత సాధన సామగ్రి కావలసియున్నది. శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము అనున వతిముఖ్యమైనవి. శక్తి యనగా సామర్థ్యము, ప్రతిభ, ప్రజ్ఞ మొదలగు స్వతఃసిద్ధమైన సంపద.

'త్రితయమిదం వ్యాప్రియతే శక్తి ర్వ్యుత్పత్తి రభ్యాసః' అని రుద్రటుడు. వ్యుత్పత్తిని

ఛందోవ్యాకరణకలా లోకస్థితి పదపదార్థ
విజ్ఞానాత్
యుక్తాయుక్తవివేకో వ్యుత్పత్తిరియం సమాసేన'10

అని వివరించినాడు. కావ్యాంగములుగా లోకము, విద్య, ప్రకీర్ణము కల వని చెప్పువామనుడు లోక మనగా స్థావర జంగమవర్తన మని

'శబ్దస్మృత్య, భిధానకోశా,చ్ఛందోవిచితి,కలా, కామశాస్త్ర, దండనీతి పూర్వావిద్యాః'

అని విద్యాశబ్దమును నిర్వచించెను. కావ్యమీమాంసలో పదవ అధ్యాయ మీ విషయమునే వివరించినది. శబ్ద శాస్త్రము వ్యాకరణము. కళలు అరువది నాలుగు. దండనీతిలో నేటి Political Science, శాసన పరిజ్ఞానము, న్యాయ శాస్త్రము (Law) ఉన్నవి. వీనిని సరిగా ఉపయోగించగల్గినది ప్రతిభ. ''కవిత్వబీజం ప్రతిభానం.''11 అపూర్వవస్తు నిర్మాణక్షమ మగు ప్రజ్ఞయే ప్రతిభ. కావ్యరచనకు అనుకూల మగు శబ్దార్థోపస్థితిని కలుగజేయు ప్రతిభయే కావ్యహేతు వని జగన్నాథుడు.[12] దీనిని అభివ్యక్తము చేయుటకు ఉచితానుచిత వివేకమైన వ్యుత్పత్తి కావలెనని రాజశేఖరుడు. వ్యుత్పత్తితోపాటు కావ్యకరణాభ్యాసముకూడ కావలెనని పండితరాయలు. ఏ రచయిత ఐనను తనకు పూర్వము వచ్చిన సాహిత్యలోకమును విస్మరింపవీలు లేదు.ఈ పరిజ్ఞానమువలన కలుగు వ్యుత్పత్తిని సమీక్షకుడు కూడ సేకరించవలెను. శ్రుతి, స్మృతి, ఇతిహాసము, పురాణము, ప్రమాణవిద్య, సమయవిద్య, అర్థశాస్త్రము, నాట్యశాస్త్రము, కామశాస్త్రము, లోకవృత్తము, ఇతర కవుల రచనలు, చతుష్షష్టికళలు. ఉచిత సంయోగము, యోక్తృసంయోగము, ఉత్పాద్య సంయోగము, సంయోగ వికారము అనునవి కావ్యార్థ ప్రతిపత్తికి ఆధారము లని రాజశేఖరుడు.[13] సమయ విద్య లనగా దర్శన సిద్ధాంతములు. ఉత్తరోత్తర సంబంధమును సూచించుట యోక్తృసంయోగము. ఉపమానోపమేయభావాది సంబంధమును తెలుపునది. ఉత్పాద్యసంయోగము.

ఈ వ్యుత్పత్తితో రచన చేసినచో సాహిత్యము శాస్త్రజ్ఞులకొరకే వ్రాయబడునదికాదా ? అను ప్రశ్నకు. ఒక శతాబ్దముక్రిందట పేటర్ సమాధాన మిచ్చినాడు. సహృదయులగు పాఠకులకందరకు సాహిత్య ముద్దిష్టమైనది గనుకనే రసము, ధ్వని, రసధ్వని అందు కన్పించుచున్నవి.

కావ్యములన్నియు ఒకేవిధముగా నుండవలెనను నియమము లేదు. దేశకాలాద్యవస్థా విశేష ప్రాహాశ్యముండుటచే భిన్నత్వ మున్నది. కాని, రసాశ్రయము లేనికావ్యమునకు కావ్యత్వము లేదు.

'నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా' అని ఆనందవర్ధనుడు సహస్ర సంవత్సరములకు పూర్వమే అనినాడు. కాని, ప్రాచీన రచయితలతో సంబంధమును పూర్తిగా త్యజించిన రచన నిలువదు. సమీక్షకుడు ఒక సాహిత్యగ్రంథమును వివేచించునపుడు ఇతర గ్రంథములతో సంవాదము చేయవలెను. ఒకటి ఒకదానికి ప్రతిబింబముగా గాని, ఆలేఖ్యాకారముగాని, తుల్యదేహము కలిగిగాని ఉండవచ్చును. వేరొకకావ్యమునకు ప్రతిబింబముగా నున్నది తాత్త్వికశరీరము లేని దగుటచే పరిహరింపబడవలెను. ఇతర గ్రంథములకు అనుకరణగా నుండు ఆలేఖ్యప్రఖ్యకావ్యమున ప్రాణమే కన్పించదు. తుల్యదేహి యైనకావ్యము పరిశీలనీయము. కావున "నాన్యసామ్యం త్యజేత్ కవిః"[14] అనినాడానందవర్ధనుడు. పూర్వకవుల ఛాయను వదలి కావ్యరచన చేయుట అతిప్రసంగమగును.

వ్యుత్పత్తివలన, లోకానుభవమువలన రచయితకు ఉచితానుచితవివేక మేర్పడును. కొన్ని సమయములలో గొప్ప రచయితలుకూడ ఈ వివేకజ్ఞానమును విస్మరించి రచించుట మనకు సంస్కృతాంధ్రములలో ఉదాహరణ లున్నవి.

కావ్యమునకు, కావ్యరసమునకు ప్రాణభూతమైనది ఔచిత్యమని క్షేమేంద్రుడు.

'ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్' అని అతని అభిప్రాయము. ఉచితస్థానవిన్యాసమే ఔచిత్యము.

'కావ్యస్యాంగేషు ప్రాహు రౌచిత్యం వ్యాపి జీవితమ్.' ఔచిత్యము రసవ్యాపి. ఇది రసప్రతీతికౌశలక్షణమే కాని, కావ్యాత్మ కాజాలదు. సంస్కృత నాటకాలలో వేశ్య సంస్కృతము మాట్లాడవచ్చును. ఇతరులు మాట్లాడిన అది అనౌచిత్యము. కావ్యములో సముచితార్థ విశేషమవసరము. ఈ ఔచిత్య మనేకవిధములుగా నున్నది. దేశ, కాల, సంప్రదాయాది ఔచిత్యములను గమనించవలెను.[15] మన సంప్రదాయమును వదలి అన్యుల సంప్రదాయములను స్వీకరించి రచించిన కావ్యాలు, కావ్యఖండికలు అనుచితాలు కాగలవు. అనగా మన సంప్రదాయమునకు భిన్నమగు సిద్ధాంతాలతో మన సాహిత్యమును సమీక్షించుట అనుచితమగునో కాదో వివేచనీయము. శ, ష, ఢ, రేఫతో కూడిన అక్షరములు శృంగారమున అనుచితములు. కాని, బీభత్సాదులలో నివి ఉచితములే.[16] ఇట్లే పద, వాక్య, కావ్యాదులకు ఔచిత్య మవసరము. కావ్య విషయము కూడ ఔచిత్యలక్షితము కావలెను. "సూది బెజ్జముమీదకాని, మానవజాతిపతనముమీద గాని కావ్య రచన చేయవచ్చును. కాని, మహాకవి మానవజాతి పతనమునే ఎన్నుకొనును" అని ఎ. సి. బ్రాడ్లే ఎప్పుడో పలికినాడు.[17] మనవారు "ప్రసిద్ధ మితివృత్తం" అనిరి. విషయగ్రహణమును పరిశీలించి కవి పట్టినవాడో, కావ్య మెట్టి దగునో నిశ్చయింప వీలున్నది.

> 'యథోక్త మౌచిత్య మేవ తస్యా నియామకమ్
> అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్యకారణమ్
> ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా.'[18]

అని ఆనంద వర్ధనుడు. రసభంగమునకు ప్రధాన కారణము అనౌచిత్యమే. రససిద్ధాంత రహస్యము ఔచిత్యమునే కంఠ వని సర్వసమీక్షక సిద్ధాంతము. దీనిని కొద్దిగా విచారించినవాడు కుంతకుడు. సుస్పష్టముగా పదార్థ స్వభావమును ఉత్కర్షతో పోషించుటయే ఔచిత్య మని, శోభాతిశయముగా అభిదేయవస్తువును ఆచ్ఛాదించుటకూడ ఔచిత్యమే అని అతని అభిప్రాయము.[19]

సమీక్షకుడు, పాఠకుడు సహృదయుడై ఉండ వలె ననినారు. కావ్యానుశీలనాభ్యాసము వలన మనస్సు అనే అద్దము విశదము కాగా ఎవరికి రసానుభూతి అనే తన్మయత్వము కలుగునో వారే సహృదయులైన సమీక్షకులు అని లోచన[20]. ఈ భావమునకు

'యోఽర్థోహృదయసంవాదీ తస్యభావో
రసోద్భవః
శరీరం వ్యాప్యతే తేన శుష్కంకాష్ఠ మివాగ్నినా'

అను భట్టనాయక వచన మాధారము. రసచర్వణ శీలుడే కావ్యరచనకు, సమీక్షకు అధికారి.

'కావ్యేరసయితా సర్వో, న బోద్ధా, న యోగభాక్'

అని భట్టనాయకుడు. ఉపదేశములు, ప్రబోధములు చేయువాడు కాని, విధి నిషేధములను ఆజ్ఞాపించు వాడు కాని సాహిత్యస్రష్ట కాదు. సాహిత్యమున భాసించు ఉపదేశము వాచ్యముగా నుండదు. అది ప్రతీయమానము, వ్యంజితము. స్పష్టముగా ఉపదేశించు సాహిత్యమును అతి ప్రాచీనకాలముననే ప్లేటో బహిష్కరించినాడు. ఇట్టిదానిని చూచియే "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని ప్రాచీను లని ఉండ వచ్చును.

సామాజికుని, సమీక్షకుని గూర్చి అభినవుడు-

'అధికారీ చాత్రవిమల ప్రతిభానశాలిహృదయః[21]'

అనినాడు. వాక్యార్థ ప్రతిపత్తి కలిగిన వెంటనే సాక్షాత్కారాత్మకమైన మానస ప్రతీతి కల్గినవాడే సరియైన సమీక్షకుడు. ఇట్టి ప్రతీతి కలుగకపోవుటకు కావ్యమే దోషభూయిష్ఠము కావచ్చును. లేనిచో సమీక్షకునిలో లోప ముండవచ్చును. ధ్వన్యాలోకమును కావ్యాలోక మని, సహృదయాలోక మని కూడ అభినవుడు వ్యవహరించెను. రసమును స్వసంవిత్సంవేద్యముగా అనుభవించగలవాడే నిజమైన సమీక్షకుడు. రసజ్ఞత్వమే సహృదయత్వ మని ఆనంద వర్ధనుడు[22] పలుకగా

'దేశకాల ప్రమాతృభే దానియంత్రితో రసః'[23]

అని అభినవు డనినాడు. ఆయా దేశ కాల నియమాదులకు, సమీక్షకుని వ్యక్తిగత భావములకు అతీతమై సర్వజనీనమైనది కావ్యరసము.

'ఇత్యుక్తలక్షణో యో ధ్వని ర్వివేచ్యః
ప్రయత్నతః సద్భిః
సత్కావ్యం కర్తుంవా జ్ఞాతుంవా సమ్యగభి
యుక్తైః'[24]

రసమును, ధ్వనిని గూర్చి పూర్తిగా తెలిసికొనినవాడే రచయిత కాగలడు, సమీక్షకుడు కూడ కాగలడు.

సాహిత్యము శబ్దార్థనిష్ఠము, సాహిత్యేతర గ్రంథములలో కన్పించు శబ్దార్థముల సంబంధము దీనికన్న విలక్షణమైన దని భట్టనాయకు డిట్లనెను.

'శబ్దప్రాధాన్యమాశ్రిత్య తత్రశాస్త్రం పృథగ్విదుః
అర్థేతత్త్వేన యుక్తే తు వదంత్యాఖ్యానమే తయోః
ద్వయోర్గుణత్వే వ్యాపార ప్రాధాన్యే కావ్యగీ
ర్భవేత్'[25]

అభినవు డీ భావనా వ్యాపారమును తిరస్కరించి, వ్యంజనా వ్యాపారమును గ్రహించినాడు. భావనా వ్యాపారమునకు రసనా స్వభావ మున్నది. వేదాదులలో శబ్దము ప్రధానము, ఇతిహాసాదులలో అర్థమే ముఖ్యము. సాహిత్యమున ఈ రెంటికి తుల్య ప్రాధాన్య మున్నదని అందరును అంగీకరించిరి. కాని, శబ్దార్థశాసన జ్ఞానము మాత్రమే కలవారికి ప్రతీయమానార్థము భాసింపదని ఆనందవర్ధనుడు. శబ్దార్థములు ప్రయత్నపూర్వకముగనే ప్రత్యభిజ్ఞేయములు కాగలవు[26]. ప్రత్యభిజ్ఞద్వారా అర్థమునకు విశేష నిరూపణ లభించునని భావము. వాచ్యవాచక రచనా మాత్రముచేత మహాకావ్యత్వసిద్ధిరాదు. వ్యంగ్యవ్యంజకాలైన శబ్దార్థముల ద్వారా మాత్రమే మహాకవిత్వ లాభము. తెలిసినదానినే విశిష్టముగా నిరూపణచేయు అనుసంధానాత్మక శక్తిని ప్రత్యభిజ్ఞ యని కాశ్మీర

శాక్తుల వాదము. వ్యంజనార్థ ప్రతీతికి ముందు వాచ్యార్థ ప్రతీతి కలదు. కనుక, ప్రాభాకరమీమాంస కుల దీర్ఘ దీర్ఘప్లుతములో ఈ క్రమము కన్పించదు కనుక, లోచనకారుడు వైయాకరణుల స్ఫోటవాదము నాశ్రయించినాడు. దీనికి ధ్వనికారుని సమ్మతి ఉన్నది.[27] వ్యంజనార్థము కేవలము వాచ్యార్థము నుండి మాత్రమే రాదు. శబ్దమునకు కూడ ఈ శక్తి గలదనుటకు ''ఉపసర్జనీకృతస్వార్థౌ'' అని ధ్వని కారుడు ద్వివచనమును ప్రయోగించినాడు.[28] ప్రయో జన విషయమైనది ధ్వననవ్యాపారము. కేవలము ముఖ్యార్థబాధ కలిగినపుడే లక్షణ నాశ్రయించి అర్థ మును చెప్పుకొనవలెను.

శబ్దమునకు అర్థప్రతీతికై అభిధా, లక్షణా, వ్యంజనావృత్తులు గలవని ధ్వనికారు లైన ఆనంద వర్ధనాభినవాదులు. మొదటి రెంటినే ముకులభట్టు తన అభిధావృత్తిమాతృకలో అంగీకరించినాడు. వ్యంజనా వృత్తిని వైయాకరణుల స్ఫోటవాదమును అనుసరించి స్పందశబ్దముతో గ్రహించినవారు శాక్తాద్వైతులు. భాట్ట మీమాంసకులు, శాంకరాద్వైతులు దీనిని త్రోసివేసి నారు. శాంకరాద్వైతులు దీనిని అంగీకరించినవారు ప్రాభాకరమీమాంసక మతావలంబకులు గాని, వైయా కరణులుగాని కాగలరు. దార్శనికులలో వ్యంజనను అంగీకరించినవాడు నాగేశభట్టు. వ్యక్తివివేకములో మహిమభట్టు ధ్వనివాదమును తిరస్కరించినాడు.కాని భట్టనాయకుడు ధ్వనివాదమును అద్వైతపరముగా వివేచించి రసధ్వనిని తన హృదయదర్పణములో సిద్ధాంతించినా డని లోచనకారుడు.[29] ఈ రస ధ్వనియే ధ్వని అని, కావ్యాత్మ అని అభినవుడు పలికి శబ్దమునకు అభిధా, తాత్పర్యము, వ్యంజన అను శక్తు లున్న వని వివరించినాడు.[30] "కావ్యస్యాత్మా ధ్వనిః", "సకల సత్కవికావ్యోపనిషద్భూత మతి రమణీయం"అని ఆనందవర్ధనుడు. వాచ్యము,ప్రతీయ మానము అని అర్థము రెండు రకములు. ప్రతీయమా నార్థము లావణ్యమువలె భాసించునది.[31]

తాత్పర్యశక్తివలన అన్వయప్రతిపత్తి. అన యము కుదురుటకు లక్షణార్థము కొన్ని సమయవ లలో అవసరము. వీటికి భిన్నమైనది వ్యంజన వాక్యమునకు ఏదో అర్థమును చెప్పి ఇదే ధ్వన మానమైన అర్థమని భావించరాదు. "ప్రతిపత్తృప్రతీతి సహాయార్థద్యోతన శక్తి" మాత్రమే ధ్వనన వ్యాపా మని అభినవు డనినపుడు ధ్వన్యమానమైన అర్థావగ సహృదయునకు మాత్రమే పరిమిత మని భావము సహృదయుడు వివరించు అర్థమే ప్రామాణికము కాని సనే అభినవుడు అన్వితాభిధాన వాదమును తిరస్క రించి, భాట్టమీమాంసకుల అభిహితాన్వయవాదమును స్వీకరించినాడు.[32]

'అభిధా భావనాచాన్యా తద్భోగీకృత మేవ చ
అభిధా ధామతాం యాతే శబ్దాలంకృతీ తతః
భావనాభావ్యఏషోఽపి శృంగారాదిగణో హి యత్
తద్భోగీకృతరూపేణ వ్యాప్యతే సిద్ధిమాన్నరః'

అనిన భట్టనాయకుని ప్రకారము శబ్దమునకు మూడు అంశలున్నవి. మొదటిది అభిధాయకత్వము. ఇది వాచ్యవిషయము. రసాదివిషయకమైన భావకత్వము రెండవది. సహృదవిషయకమైన భోగకత్వము మూడ వది. విభావాదులకు భావకత్వమువలన సాధారణీకర ణత్వము లభించును. దీనినే Universalization అని పాశ్చాత్యసమీక్షకులనిరి. భోగీకృతిలోచిత్తద్రుతి, విస్తర, వికాసములు భాసించగలవు. వీటిద్వారా సత్త్వ మయమైన నిజచిత్స్వభావ నిర్వృతి విశ్రాంతిలక్షణము, పరబ్రహ్మాస్వాదసవిధము నగు రసప్రతీతి కలుగును. ఇదే ప్రధానమైన అంశము. దశరూపకమున,అవలోక మున ధనిక, ధనంజయు లీవాదము నంగీకరించిన వారు. భావకత్వము సముచిత గుణాలంకార పరి గ్రహాత్మకమని,రసవిషయకమైన భోగీకరణము ధ్వన నాత్మకమని అభినవుని విమర్శ.[33] భోగకృత్వమనగా వ్యంజనయే.[34]

'కవేరంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే' అని భరతుడు పలికినాడు. సహృదయులైన సామాజికుల చిత్తవృత్తివిభావనమే విభావ మని రసగంగాధరకారుడు. భావనావ్యాపారములో పరిష్కృతములైనవి విభావాదిభావములు. భావన యనగా "భవితుః భవనానుకూలో వ్యాపారః." ఉచితానుచితజ్ఞానముతో సంభవింపదగినదానిని తలపోయుట భావన. దీనినే Law of Probability or Necessity అని అరిస్టాటిల్ వివరించెను. భావనావ్యాపారము వలన సాధారణీకరణము సిద్ధించును. ఈ సాధారణీకరణము లేనిదే కావ్యమునకు విశ్వజనీనత రాదు.

శబ్దార్థ సహితత్వమే సాహిత్య మని భామహోదులు.[85] శబ్దార్థములకు అనన్యత్వసంబంధమున్నది. శబ్దమునకు వాచ్యార్థమే కాక అర్థాంతర ప్రతీతిని కలుగజేయు శక్తి కలదు. దండి అభిప్రాయమున (1.10) ఉద్దిష్టార్థ సమన్వితమైన పదావళి కావ్యశరీరము. ఇష్టార్థము వ్యంజితమగునది. ఒకప్పుడు వాచకత్వమును, వేరొకప్పుడు గుణవృత్తిని, మరొకప్పుడీ రెంటిని ఆశ్రయించుకొని వచ్చునది వ్యంజితమైన అర్థము.

'యుక్తం లోకస్వభావేన రసైశ్చ సకలైః
పృథక్'[86]

లోకస్వభావమునకు అనుగుణముగా, రసాన్వితముగా ధ్వన్యమాన మగు అర్థము భాసించవలెను. వాచకత్వము, గుణవృత్తి, వ్యంజకత్వము అను మూడు ప్రకారములుగా శబ్దవ్యాపార మున్నది.

'వక్రాభిధేయ శబ్దోక్తి రిష్టావాచా మలంకృతిః'

అని భామహుడు వక్రోక్తిని అలంకారముగా గ్రహించినాడు. కాని, తర్వాత దీనిని సర్వవ్యాపిగా పల్కినాడు.

'సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽ
నయావినా'[87]

వ్యంగ్యార్థమును ప్రకాశింపజేయుశక్తి వ్యంజకత్వము. వక్త్రభిప్రాయ ప్రకాశనము వాచ్యవాచక సంబంధముకన్న భిన్నము.

అనుమేయార్థము, ప్రతిపాద్యము అని రెండు శబ్దమునకు గల అర్థములు. వక్తయొక్క అభిప్రాయము, వివక్ష అనునది అనుమేయము. వాచ్యము, వ్యంగ్యము అని ప్రతిపాద్యార్థము రెండు విధములు. వాచ్యమున స్వశబ్దాభిధేయత్వము, వ్యంగ్యమున స్వశబ్దానభిధేయత్వము కలవు. వ్యంగ్యార్థమే ప్రధానమైనచో దానిని ధ్వనియని, అప్రధానమై కన్పించినచో గుణీభూతవ్యంగ్య మని అందురు. సాహిత్యమంతయు ధ్వని ప్రధానముగా కన్పించదు. చాటువులు, స్తోత్రములు, శతకములు, గాథలు మొదలైన వానిలో రసమునకు అంగముగనే వ్యంజన వ్యాపారము కన్పించగలదు.[88]

వక్రోక్తి లేనిదే ఏ అలంకారముగాని, కావ్యముగాని ఉండజాలదని భామహు డనినను, ఇదే కావ్య జీవితమని ప్రపంచించినవాడు కుంతకుడు. అమెరికాలోని నవ్యసమీక్షకులు చెప్పిన Irony, Paradox, Ambiguity మొదలైన వాదములు వక్రోక్తి జీవితమున వీరికన్న ముందే కన్పించుచున్నవి.

లోకోత్తర చమత్కారమును కలుగజేయు వైచిత్ర్యము, సౌందర్యము నిచ్చునది వక్రోక్తి. ఈ విచిత్రమగు ఉక్తి అనన్యత్వము గల శబ్దార్థములకు చెందినది. ఈ వక్రత కేవల శబ్దనిష్ఠము కాదు, కేవల మర్థాశ్రయమునుకాదు. శబ్దార్థములకు సాహిత్యమున అభిన్నత్వమున్నది. శబ్దార్థము లలంకార్యములు. వైదగ్ధ్య భంగీభణితి యగు వక్రోక్తియే అలంకారము. ప్రసిద్ధాభిధానముకన్న భిన్నము, కవికర్మకౌశలజనితమునైన దిది. కావ్యశోభాహేతు వగు వక్రోక్తిలో ఆరు భేదము లున్నవి. వర్ణవిన్యాస వక్రత్వము, పదపూర్వార్థవక్రత, ప్రత్యయవక్రత, వాక్యవక్రత, ప్రకరణ వక్రత, ప్రబంధ వక్రత అని వీని నందురు.

వాక్యవక్రతలోనే అలంకార వర్గమునకు అంతర్భావము. వాచ్య వాచకముల సౌభాగ్యలావణ్యములను పోషించు వాక్యవిన్యాసమును బంధమందురు. వాచ్యార్థముకన్న వాచకము, వాచకమైన శబ్దముకన్న వక్రోక్తి శ్రేష్ఠమైనవి.[39] కుంతకుడే సాహిత్యమను శబ్దమును మొదట వాడినవాడు.

వక్రోక్తి ననుసరించి కావ్యమార్గములు లేక కవిప్రస్థానములు మూడు గలవని కుంతకుడు. సుకుమారము, విచిత్రము, మిశ్రము అని వీటిపేర్లు.[40] ఉత్తమము, మధ్యమము, అధమము అని ప్రతి మార్గమున మూడు భేదములు రాగలవు. మాధుర్యము, ప్రసాదము, లావణ్యము, ఆభిజాత్యము అను గుణములు ప్రతిమార్గమున గలవు; కాని, వాటి లక్షణములు భిన్నములు. కాళిదాసాదులది సుకుమార మార్గము, మాతృగుప్తాదులది మిశ్రమార్గము. విచిత్రమార్గము హర్షచరితలో నున్నది. భవభూతి, రాజశేఖరాదుల రచనలలోను, ముక్తకములయందు బంధసౌందర్యము కలదు. పద, వాక్య, ప్రబంధములలో ఔచిత్య, సౌభాగ్యములు సర్వవ్యాపకములై ఉండవలెను.[41] కవి ప్రస్థాన హేతువులైన ఈ మార్గములు కవి స్వభావ భేదముల నాశ్రయించుకొని వచ్చునవి. ధ్వని, గౌణ, చిత్రమార్గములను పేర్కొనిన ఆనందవర్ధనుని వాదము కన్న నిది మిన్న.

ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని సాహిత్యగ్రంథములు నాల్గుతెరగు లని జగన్నాథుని వాదము. శబ్దార్థములు గుణీభూతములై అర్థమును అభివ్యంజితము చేయునది ఉత్తమోత్తమ కావ్యము. అతిగూఢము గాని, స్ఫుటముగాని కానట్టి వ్యంజన ఇట కన్పించదు. లోకోత్తరాహ్లాద ముండవలెను. వ్యంగ్య మప్రధాన మైనను లోకోత్తరానందమును కల్గించునది ఉత్తమ కావ్యము. వ్యంజన లేకయే వాచ్యార్థముద్వారా మాత్రమే ఇట్టి ఆనందమును కల్గించునది మధ్యమకావ్యము. అర్థచమత్కృతికన్న శబ్ద చమత్కృతియే ప్రధానమైనది అధమకావ్యము అను జగన్నాథుని వాదము[42] ధ్వని కన్పించనిసాహిత్య రచనలకుకూడ గతి కల్పించుటచే ఆమోదయోగ్యమగుచున్నది.

కుంతకుని సిద్ధాంతమున ప్రధాన కావ్యగుణములు ప్రసాదము, మాధుర్యము, లావణ్యము, ఆభిజాత్యము, ఔచిత్యము, సౌభాగ్యము. అలౌకిక చమత్కార కారియగు సౌభాగ్యమును కావ్యైక జీవిత మనినాడు. గుణాలంకారాదులు వక్రత్వపరిపోషకములు.

'మహాకవి ప్రబంధానాం సర్వేషా మస్తి వక్రతా
నూతనోపాయ నిష్పన్న నయవర్త్మోపదేశినామ్.'[43]

నవ నిర్మాణ నిపుణులైన కవిప్రకాండులు నూతనోపాయముల ద్వారా సిద్ధమైన నీతిమార్గమును ఉపదేశించువారు. వీరి ప్రబంధములలో వైచిత్ర్య భంగీ భణితి యగు వక్రత ఉన్న దని భావము. సాహిత్య సౌందర్యము అసత్కావ్యములలో కన్పించదు.

శబ్దార్థముల సహితత్వమే కావ్య మని భామహుడు. శబ్దార్థములకు అనన్యత్వ మున్ననే కావ్యత్వమని, అందు వక్రోక్తి ఉండవలె నని కుంతకుడు. అలంకారములు కావ్యమునకు ప్రధాన మని భామహ, రుద్రటులు. గుణాలంకారములు, రీతి ముఖ్య మని వామనుడు. దోషరహితమై, గుణానిత్వమైన శబ్దార్థములకు కావ్యత్వము కలదు. ఇవి అలంకారరహితమైనను కావ్యత్వ లక్షణము కలిగిఉండ గల వని మమ్మటుడు. కేవల దోషరాహిత్యమే చాల దని, అట్టి స్థలములలో ధ్వని ఉండవలె నని కావ్యప్రకాశ కర్త అభిప్రాయము. రసము ప్రధాన మని భరతుడు. ధ్వనియే అవసర మని ఆనందవర్ధనుడు. ఈ ధ్వనినే కొద్ది మార్పులతో వక్రోక్తి అని పల్కినవాడు కుంతకుడు. రసాత్మక మైన వాక్యమే కావ్య మని విశ్వనాథుడు. రమణీయార్థ ప్రతిపాదక మగు శబ్దమే కావ్య మని జగన్నాథుడు. ఈ వాదము మిగిలిన

వాటికన్న చాల మెరుగు. లోకోత్తరాహ్లాదమును కలుగ జేయు జ్ఞానమునకు విషయీభూతమైన శబ్దమును రమణీయ మందురు. లోకోత్తరత్వము అనుభవ సాక్షికము. పునఃపునరనుసంధానాత్మకమైన భావనా విశేషమున నిది భాసించును. లోకోత్తరాహ్లాద మన బడు చమత్కారమును కలిగించు భావన ద్వారా విషయీ భూతమైన అర్థమును ప్రతిపాదించు శబ్దము నకు కావ్యత్వమున్న దని భావము.[44]

కావ్యశోభాకరము లైన ధర్మములు అలంకారము లని దండి (2.1). కావ్యరసప్రతీతికి, కావ్య రచనకు ఇవి చాల అవసరము.

'కావ్యేష భావార్థగతాని తజ్ఞైః

సమ్యక్ప్రయోజ్యాని యథా రసంతు.' (16.4)

అని భరతుడు. కావ్యమునకు శోభను చేకూర్చు ధర్మ ములు గుణము లని, ఈ శోభను అతిశయింపజేయు టకు వచ్చినవి అలంకారము లని వామనుడు(3.1.1-2) అలంకారములు కేవలము చారుత్వ హేతువులే కనుక వాటికి అంగత్వమే సిద్ధించును. అందుచేతనే "అనలం కారేఽపి" అని మమ్మటుడు పలికెను. రసభావాది పర్యవసాయిత్వము లేని అలంకారములకు ప్రయోజ నము లేదు. రసమే అలంకార్య మని తాత్పర్యము. గుణాలంకారములు, వృత్తులు అంగము లని, ధ్వని మాత్రమే అంగి యని ఆనందవర్ధనుడు.[45]

'రసాదిర్ధ్వనిర్వ్యవస్థిత ఏవ. న హి తచ్ఛూన్యం కావ్యం కించి ద స్తి'

అని లోచనకారుడు. రసధ్వనియే కావ్యానికి ఆత్మ.[46]

మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అను కావ్య గుణములు రసము నాశ్రయించినపుడే వాటికి గుణ త్వము సిద్ధించును. శ్రవ్యము, నాతిసమస్తార్థము గల శబ్దమునకే మాధుర్యమున్నదని భామహుడు(2.2-3). దీప్తరసత్వహేతువైన ఓజస్సునకు చిత్తవికాస, విస్తర ప్రజ్వాలన స్వభావమున్నది. హృదయ సంవాదము ద్వారా స్వాత్మావేశమును కలిగించునది ప్రసాద మనే గుణము.[47] శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకు మారత, అర్థవ్యక్తి, ఉదారత్వము, ఓజస్సు, కాంతి, సమాధి అను పది శబ్దార్థ నిష్ఠములైన గుణము లని భామహుడు అనిరి.

భామహునిది అలంకార సిద్ధాంతము. సర్వాలంకారములలోను వక్రోక్తిగలదనిన ఇది అతిశయోక్తి అను అలంకారమే కాగలదు.[48] సర్వాలంకార శరీర మిది. సాదృశ్యము నాశ్రయించుకొనివచ్చిన రూపక, ఉపమా, తుల్యయోగిత, నిదర్శన మొదలైన అలం కారములు గుణీభూతవ్యంగ్యమున కుపకరించునవి. కాని-

'రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్

అపృథగ్యత్న నిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః'[49]

అలంకారములు రసపోషకము లైననే సాహిత్యమున నిలువగలవు. వీరాద్భుతాది రసములలో యమకాద్య లంకారములు రసవిఘ్నకారులు. అలంకారములు యత్నములేకయే నిష్పన్నములు కావలెను. యమ కానుప్రాసాది అలంకారములు యత్ననిర్వర్త్యములు. రూపకాద్యలంకారములు వ్యంజన ద్వారా రసప్రతీతి హేతువులు కావలె నని ధ్వనికారుడు.[50] సమాసోక్తి, ఆక్షేపము, పర్యాయోక్తి మొదలైనవికూడ గుణీభూత వ్యంగ్యవిషయములే. ఇట్టి అలంకారములలో కొన్ని ఇతరాలంకారములలో ఇమడగలవు. ప్రేయోఽలం కార మున వ్యాజస్తుతి, ఉపమాలంకారమున సందే హాదులు, ఉపమలో దీపకము, దీపకమున ఉపమ రాగలవు. ఈవిధమున అలంకారములు చారుత్వాతి శయ హేతువు లగును. అర్థాంతరమును సూచించు కాకువుకూడ గుణీభూతవ్యంగ్య విషయమే.

అలంకారములు రసస్వభావము కలిగిఉండవలె నని; ఇవి అలౌకికమైన కావ్యరహస్యభూత మగు

వక్రతను పోషించు నవి అని కుంతకుని వాదము.[51] శబ్దాలంకారములు, అర్థాలంకారములు, ఉభయాలంకారములు అను వాటికన్నిటికి స్వతంత్రప్రతిపత్తి లేదను సిద్ధాంతమును సమీక్షకులు ఆమోదించినారు.

రసభావాదివిషయవివక్షావిరహే సతి
అలంకారనిబంధోయః స చిత్రవిషయో మతః'[52]

గుణాలంకార సంస్కృతములైన శబ్దార్థసహితత్వమే కావ్య మని, అలంకారశబ్దము సౌందర్యమును నిర్వచించున దని, దోషరహితము, గుణాలంకారసహితము నైనది కావ్యమని వామనుడు (1.1.1-3) పలికినప్పటికిని, కావ్యాత్మగా రీతినే గ్రహించినాడు. విశిష్ట పదరచనయే రీతి. విశిష్టత్వము గుణములవలన కలుగును.[53] రీతివిశేషములలో వైదర్భి, గౌడి, పాంచాలి కలవని వామనుడే

'కావ్యశోభాయాఃకర్తారో ధర్మా గుణాః, తదతిశయిహేతవ స్త్వలంకారాః' (3.1.1-2)

అని వచించెను. తర్వాత వచ్చిన సాహిత్యసమీక్షకులు ఆరభటి, కైశికి, సాత్త్వతి మొదలైనవాటిని చేర్చినారు. అస్ఫుటముగా స్ఫురించిన కావ్యతత్త్వమును వ్యాఖ్యానించుట కశక్తులైనవారే రీతివాదమును, వృత్తులను ప్రధానముగా నెంచినా రని ఆనందవర్ధనుడు.[54] విద్యానాథుడు శయ్య అని సాహిత్యశైలిని సమీక్షించువారికి వేరొకపదమును అర్పించినాడు. వీటికితోడు పాకముకూడ ఉన్నది. శాకము లేదు.

భరతుడు వృత్తులను, ప్రవృత్తులను చెప్పినాడు. కాని, ఉద్భటాదులు ఉపనాగరకాది వృత్తులనే ప్రధానముగా చెప్పినారు. రసానుగుణములు, ఔచిత్యవంతములు, వాచ్యాశ్రయములు నగు వ్యవహారములు కైశిక్యాది వృత్తులు. వాచ్యాశ్రయమైన వృత్తులు ఉపనాగరకాదులు. ''వృత్తయః కావ్యమాతృకాః'' అని భరతుడు రసోచితమైన ఇదివృత్త సమాశ్రయణమునే కావ్యవృత్తులకు చెప్పినాడు. ఇతివృత్తము కావ్యశరీరమని కూడ పల్కుటచే వృత్తులకు రసాశ్రయత్వమే కలదు.[55] వైదర్భి, గౌడీయాదిరీతులు దేశభేదము నాశ్రయించినవి. దేశము లనేకము లుండుటచే రీతిబాహుళ్యము రాగలదు కావున కావ్యమున కన్పించురీతి దేశనిష్ఠము కాజాల దనిన కుంతకుడు సరియైన మార్గమును చూపినాడు.[56]

ఈ విధముగా మన దేశమున వచ్చినవి గుణ, అలంకార, రీతి, వృత్తి, వక్రోక్తి, ఔచిత్య, ధ్వని సిద్ధాంతములు. వీటికన్న శ్రేష్ఠము ప్రాచీనము నైనది రస సిద్ధాంతము. నాట్యము ''రసభావక్రియాత్మిక'' (1.44) అని భరతుడు. గుణాలంకార - మనోహర శబ్దార్థ శరీరము కలిగి లోకోత్తర మగు రసప్రతీతిని సాహిత్యము కలుగజేయవలెను.[57]

''రసాద్భృత ఇత్యత్రైకవచనోపపత్తిః'' అని వచించి ముఖ్యభూతమైన మహారస మొక్కటే యని, దీని రూపాంతములు నవరసము లని, మహారసము శాంత మని పలికిన అభినవుడు భట్టనాయకుని అనుసరించినాడు.[58] శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుతము లను ఎనిమిది రసములనే మొదట పూర్వులు గ్రహించినారు. ఆనందవర్ధన, భట్టనాయకులు శాంతరసమును తెచ్చినట్లు కన్పడును. ధర్మార్థకామముల నుద్దేశించిన శృంగారాద్యష్టరసము లని, నివృత్తి ధర్మాత్మకమగు మోక్షఫలమును సూచించునది శాంతరస మని భావము. కనుక ''తత్ర స్వాత్మావేశేన రసచర్వణా'' అని అభినవభారతి.

భరతుని రససూత్రము ''విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః'' అని ఉన్నది. దీనిపై తీవ్రచర్చలు విరివిగా జరిగినవి. రససిద్ధాంతము సాహిత్యసమీక్షలో ప్రధానమైనది. రసములేని సాహిత్యము నీరసమే. రసనిష్పత్తిని వివరించు వాదములను గమనించినచో సాహిత్య సిద్ధాంతములకు ఆధారభూతమైనవి భారతీయ దర్శనములే అను రహస్యము

వ్యక్తము కాగలదు. పూర్వ మీమాంసకుల అపూర్వో త్పత్తి సిద్ధాంతము నాశ్రయించినది భట్టలొల్లటుని ఉత్పత్తి వాదము. నైయాయికుల అనుమితి ప్రమాణముపై నిలబడినది శ్రీశంకుకుని రసానుమితి. యోగదర్శనమున, ఉపనిషదద్వైతమున గల సిద్ధాంతములు భట్టనాయకుని భావకత్వ, భోగకృత్వ వాదమునకు పునాదులైనవి. కాశ్మీర శాక్తాద్వైతమున గల స్పంద, ప్రత్యభిజ్ఞా వాదములనుండి ఉద్భవించినది ఆనందవర్ధనాభినవగుప్తుల ధ్వనివాదము. ఉపనిషదద్వైతమును అనుసరించి ''భగ్నావరణాచిదేవరసః''[59] అను జగన్నాథుని రసధ్వని సిద్ధాంతము వచ్చినది. వీటిలో ఏ వాదమును మన మంగీకరింతుమో దానికి ఆధారమైన దర్శనమును కూడా స్వీకరించక తప్పదు. ఒకప్రక్క నాకు శాంకరాద్వైతమే ప్రామాణికమనువారు అభినవుని రసధ్వనిని అంగీకరించిన ఈ రెంటిని అతడు సమన్వయపరచుట కష్టము. అప్పుడు సాహిత్య సమీక్ష అపమార్గములో పడగలదు. వీరు భట్టనాయక, జగన్నాథుల రసధ్వనిని స్వీకరించవలెను. కేవలము ధ్వనిని అంగీకరించువారు ప్రత్యభిజ్ఞను, స్ఫోటను, శాక్తాద్వైతమును కూడ గ్రహించక తప్పదు. రసధ్వని వాదమును విమర్శించవలెనన్న దానికి ఆధారమైన అద్వైతమును విమర్శించక తప్పదు. ఏ వాదమునకు సంబంధించిన దర్శనము (System of Philosophy) ఆ వాదమున కున్నది.

ఉదాహరణ తీసికొందము. రసగంగాధరములో ''రసో వైసః'' అనే తైత్తిరీయశ్రుతి ప్రస్తుతించబడినది. దీనితో రసమే బ్రహ్మ అని వాదించువారు పలువురున్నారు. ఈ శ్రుతిలో ''సః'' అను పుంలింగరూపమున్నదని, అద్వైతుల నిర్గుణబ్రహ్మశబ్దము నపుంసకలింగమున కలదని, ఈ శ్రుతిలో సగుణ బ్రహ్మనే ప్రస్తుతించిరని, అందుకనే ప్రాచీనలాక్షణికులు రసప్రతీతిని బ్రహ్మాస్వాదసహోదర మని పలికినారని వీరు గమనించినట్లు లేరు. ''పరబ్రహ్మాస్వాదసవిధః'' మని భట్టనాయకుడు సరిగా చెప్పినాడు.

కావ్యమున ఉచితములు, లలితములు నైన సన్నివేశములు సుందరముగా నున్నపుడు అవి సహృదయుల హృదయములను ప్రవేశించును. ఈ సహృదయతతో కూడిన భావనావిశేషమహిమద్వారా విభావాదులు అలౌకికములుగా భాసించును. అప్పుడు తత్తద్దేశకాలములకు చెందిన సుఖదుఃఖములు, అజ్ఞానము, పరిమిత ప్రమాతృత్వము దూరీకృతము లగును. ఇట్టి సమయమున

> ప్రమాత్రాస్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహగోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్టవాసనారూపోరత్యాదిరేవ రసః.

అని జగన్నాథు డనెను. సామాజికుడు స్వసంవిత్సంవేద్యముగా అంతర్లీనమైన వాసనలను బట్టి ఆయా సన్నివేశములలో ఆయా రసములను అనుభవించగలడు. రత్యాదిస్థాయి భావములచే పరిచ్ఛిన్నమై ఆవరణభంగము కలిగిన చైతన్యతమే రస మని సిద్ధాంతము. స్వచైతన్యమున కున్న ఆవరణలు తొలగిపోవుటయే రసప్రతీతి. దీనిని అంతఃకరణ చిత్తవృత్తి అనికూడ చెప్పనగును. తదాకార చిత్తవృత్త్యాత్మికమైన రసచర్వణ శబ్దవ్యాపారముద్వారా భావింపబడునది. అపరోక్షముగా సుఖావలంబనత్వ ముండుటచే నిది అపరోక్షాత్మిక మగు అనుభూతికూడ.[60]

వస్తుధ్వనికి, అలంకారధ్వనికి రసపర్యవసాయిత్వము అవసరమగుటచే రసమే కావ్యాత్మ అని అభినవుడు.[61] వాచ్యార్థముకన్న ఇవి ఉత్కృష్టములైనప్పటికి, రసప్రతీతికి దోహదము చేయక పోయినచో వాటికి కావ్యత్వము సిద్ధించదు. సాహిత్యమున రసప్రతీతి ముఖ్యము. సమీక్షకుడు ఈ రసావగతిని చక్కగా అవగాహన చేసికొనవలసిఉన్నది.

'యావత్పూర్ణోనచైతేన తావన్నైవ పమత్వమ్' అని భట్టనాయకుడు. విభావాదులద్వారా తన్మయత్వము కలుగనంతవరకు రసమునకు బహిర్భావము కాని, ఇతరులచే ఆస్వాదింపబడుటకు గాని యోగ్యత

కలుగదని భావము. ప్లేటో, అరిస్టాటిల్ ప్రభృతులు చెప్పిన Katharsis వాదమునకు దగ్గరగా నున్న దీనభిప్రాయము. ప్రతీయమానమగు రసధ్వనినే చారుత్వప్రతీతి యని, ఇదే కావ్యాత్మ అని భట్టనాయకుడు[62]. చారుత్వమును ఆంగ్ల సమీక్షకుల 'విట్' (Wit) తో సమన్వయించుట ప్రామాదికము. చారుత్వోత్కర్ష కల్గినది వ్యంగ్యార్థమే కాని, వాచ్యార్థము కా దని ఆనందవర్ధనుడు.[63]

భరతుడు నాట్యవిషయమున రసప్రసక్తిని తెచ్చినను ఇది కావ్యములకు కూడ వర్తించును.

'కావ్యేఽపి నాట్యాయమాన ఏవరసః.కావ్యార్థ విషయే హి ప్రత్యక్షకల్పసంవేదనోదయే రసోదయ ఇత్యుపాధ్యాయాః.

నాట్యేఏవ రసా, నలోక ఇత్యర్థః. కావ్యం చ నాట్యమేవ'

అని కావ్యనాట్యశబ్దాల నభినవుడు పర్యాయపదములుగా వాడినాడు. భరతుడు కూడ "కావ్యార్థాన్ భావయంతీతి భావాః" (1.342) అని పలికెను. కావ్యార్థము లనగా రసము లని అభినవభారతి.[64]

రసముల కన్నింటికి మూలభూతమైనది శాంత రసము. రత్యాదిభావములు వికృతు లని, వీటి ప్రకృతి శాంత మని వచించి

'స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతా ద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయేతు శాంత ఏవ ప్రలీయతే'

అని భరతు డనినాడు. శాంతరసము ప్రధానతమము గనుకనే

'సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదో, విషయేభ్యో విపరివృత్త్యా'

అని అభినవుడు పలికెను.[65] ప్రధాన రసము కరుణ యని భవభూతి, శృంగార మని భోజుడు, శాంత మని భట్టనాయకాభినవగుప్తులు సిద్ధాంతించిరి. రసములకు శాంతపర్యవసాయిత్వమే ముఖ్యము. సమీక్షకు డీసిద్ధాంతమును దృష్టిలో నుంచుకొని వివేచన చేయ వలసియున్నది.

'వాగ్ధేనుర్దుగ్ధ ఏతం హి రసం యద్బాలతృష్ణయా
తేననాస్యసమః సస్యాద్ దుహ్యతే యోగిభి ర్హియః'

అని భట్టనాయకుడు.[66] సహృదయులగు వత్సలకు వాత్సల్యముతో రసమనే పాలపొదుగును చేపునది కావ్యరూపమైన ధేనువు. ఇట్టి రసమునకు తుల్యమైనది లేదు. ఈ రసావేశమును పొందువారు యోగులు అని భావము. ఇట్టి ప్రతీతిని కలుగజేయునదే ఉత్తమ సాహిత్యము.

రసప్రతీతి ప్రధానమైనపుడు కావ్యమున గాని, గేయమున గాని ఏదో ఒకపాత్ర అవసరము. ప్రాచీనులు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంత నాయకులను పేర్కొని, దక్షిణ, ధృష్ట, అనుకూల శఠులను ప్రస్తుతించిరి. వీరితోపాటు పీఠమర్ద, విట, విదూషకాదు లున్నారు. నాయికలలో కూడ భిన్నపాత్ర లున్నవి. నాయికానాయకుల గుణములు, అలంకారములు చెప్పబడినవి. ముగ్ధ, ప్రగల్భ, మధ్యా అని నాయికా భేదములు. దూతి, సఖి, నటి, దాసి, ధాత్రేయి, ప్రతివేశిని, బాల, ప్రవ్రజిత, రజకి, శిల్పిని మొదలగువారికి నాయికతో సంబంధమున్నది. వీర రసమున దాన, ధర్మ, యుద్ధ, దయావీరు లున్నారు.

కథ, ఆఖ్యాయిక అని గద్యము రెండు విధములు. "గద్యం కవీనాం నికషం వదంతి" అని సహృదయు లగు సమీక్షకుల వాదము. దీని నాధారముగా చేసికొని గద్యమువలె భాసించుచు, లయాన్వితము (Rhythm) కానిదానిని గద్యకవిత్వ మని పల్కుట సనుంజమో, కాదో విజ్ఞులు వివేచించవలెను. సుబంధు, భట్టబాణుల గద్యరచనలు కవిత్వ మనిపించుకొనునవి.

రూపకమున దశ విధములను ప్రాచీనులు పేర్కొనినారు. ధనంజయుని దశరూపకము, దానిపై ధనికుని అవలోకము, భరతుని నాట్యశాస్త్రము తర్వాత కన్పించు ప్రధాన సమీక్షాగ్రంథములు మనకు ప్రమాణమైనవి. అర్వాచీనకాలమున వచ్చిన ఏకాంకికలను, నాటకములను సమీక్షించునపుడు ప్రాచీనుల సిద్ధాంతములను కొద్దిమార్పులతో అన్వయించ వీలున్నది. యక్షగానములను, గేయరూపకములను వివేచించునపుడు భరతుని నాట్యశాస్త్రమును, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమును కూడ ఆశ్రయించక తప్పదు.

ఆంధ్రసాహిత్య సంప్రదాయమున రససిద్ధాంతము స్ఫుటముగా కన్పించుచున్నది. గుణాలంకారములను మెచ్చినను, మన పూర్వరచయితలు రసప్రతీతికి ఎక్కువ విలువ నిచ్చిరి. మల్లినాథుని ఏకావళీవ్యాఖ్య, విద్యానాథుని ప్రతాపరుద్రీయము, సింగభూపాలుని రసార్ణవ సుధాకరము, నరసభూపాలీయము, కవికర్ణ రసాయనము మొదలైనవి దీనికి తోడ్పడియుండవచ్చును. ఉదాహరణకు మన మహాభారత మున్నది. ''మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవుల'' సాంగత్యము గలిగి, కృష్ణ ద్వైపాయనిచే ''అభిహిత'' మైన మహాభారతమును ''ప్రసన్నకథాకలితార్థయుక్తి''తో,''అక్షరరమ్యత''ను పాటించి, ''నానారుచిరార్థసూక్తినిధి''యైన నన్నయ భట్టు మన కిచ్చినాడు. ఇది ''హృద్యమపూర్వ'' మని పలికి ''సర్వలక్ష్య సంగ్రహ'' మనినాడు. ''మనః ప్రీతిదము'', ''పండిత చేతోనిర్వృతి'' చేయునది, ''సర్వసభారమ్యము'', ''సర్వమనోజ్ఞము'', ''హృదయరోచనము'', ''అతిహృద్యము'', ''సవ్యార్థరమణీయము'', ''విబుధశ్రేణినుతము'',''అమితార్థయుక్తి'' యుతము, ''వేదార్థామలఛాయోపేతము'', ''నానావేద వేదాంత విద్యాయుక్తము'' అని పలికెను. ఇచటనుండి రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్యమని జగన్నాథుడు గ్రహించె ననుటకు సందేహము లేదు.

ఇంతేకాక నన్నయ దృష్టిలో లొల్లటుని రసనిష్పత్తి వాదము ఆదరణీయముగా నున్నట్లు కలదు. ''అభిహిత'' మను శబ్దమును ప్రయోగించుటలో విశేషార్థము ద్యోతక మగుచున్నది. కచుడు

''సంజీవితుడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
నభిహితంబగు శబ్దంబునట్లపోలె (1.3.127)

ఇది మూలములో లేదు. భాట్టమీమాంసకుల అభిహితాన్వయ వాదమును స్వీకరించిన నన్నయభట్టు లొల్లటుని ఉత్పత్తి వాదము నాశ్రయించి రసనిష్పత్తి కలుగు నని భావించినాడు. ఇది వివేచనీయాంశము.

సంస్కృత సమీక్షకులు సహృదయ శబ్దము నుపయోగింపగా ''సాధుజన సిద్ధి గోరి'' యని, ''కవీంద్రకర్ణపు టపేయముగాన్''అని (3.7.468-9) ఎర్రన వచించెను. తిక్కన ''మహాకవిత్వ దీక్ష''ను గ్రహించినాడు. ''నవరస భావానుబంధ బంధుర'' మని శ్రీనాథుడు పల్కి, రసభావాలంకా రౌచిత్యములను ప్రస్తుతించినాడు.

రచయిత ఏ ఊరివాడు, ఏ కాలమువాడు అను పరిశోధనల నిక చాలింపక తప్పదు. సమీక్షకుడు తన సొంత అభిప్రాయములను వదలి నిష్పాక్షిక విమర్శ చేయవలసియున్నది. ''యజుర్వేదవేది'' యనినంత మాత్రమున రామకృష్ణుడు ఆరాధ్యు డాయె నని వాదించు విమర్శకులు ''వేదవేది'' అను తిక్కన ప్రయోగము నేమిచేయగలరో ఊహింపజాలము. ఇక నైక సాహిత్య పరిశోధకులు భారతీయ సమీక్షా శాస్త్రమును అవగాహన చేసికొని వివేచించవలెను. పాశ్చాత్యులు మన సిద్ధాంతములను స్వీకరించినారా మనము వారిని అనుకరించుటకు ?

తత్త్వామృతే స్థితాం దేవీం
స్మరామి షోడశీం కలామ్
వందే శక్తి మహం తుర్యాం
కావ్యసారప్రదాయినీమ్.

---

**ఉపయుక్త గ్రంథములు :**


ధ్వన్యాలోకం, లోచనసహితం, కాశీ సంస్కృత గ్రంథమాల 135 (1940)

నాట్య శాస్త్రం, అభినవ భారతీసహితం, బరోడా (4 సంపుటములు 1956, 1934, 1954, 1964).

రసగంగాధరం, నిర్ణయసాగరముద్రణం (1947)

వక్రోక్తి జీవితం, కర్నాటక విశ్వవిద్యాలయం (1977)


**సూచికలు :**

1. ధ్వన్యాలోక, 3.18-19
2. కావ్యాదర్శ, నాల్గవ ప్రకరణము
3. అభినవభారతి, సంపుటము 3, పుటలు 83-84
4. Tradition and Individual Talent
5. అభినవ భారతి. 2.216
6. ధ్వన్యాలోక, 498
7. అ.భా. 1.11; లోచన, 336
8. అ.భా. 1.294
9. లోచన, 337
10. కావ్యాలంకార, 1.14,18
11. కావ్యాలంకారసూత్ర, 1.3.1-3,16
12. రసగంగాధర, 9
13. కావ్యమీమాంస, అధ్యాయము 8
14. ధ్వన్యాలోక, 4.8, 11-13
15. ఔచిత్య విచారచర్చ, కారికలు 5,10,13
16. ధ్వన్యాలోక, 3.3-4
17. Poetry for Poetry's sake (Oxford Lectures on Poetry)
18. ధ్వన్యాలోక. 3.8; పుట 330
19. వక్రోక్తి జీవితం, 1.53, 54
20. లోచన, 38-39
21. అ. భా. 1.279
22. ధ్వన్యాలోక, 359
23. అ. భా. 1.291
24. ధ్వన్యాలోక, 3.45
25. లోచన, 87
26. ధ్వన్యాలోక, 1.7,8
27. లోచన, 102; ధ్వన్యాలోక, 132-3
28. ధ్వన్యాలోక, 1.13
29. లోచన, 52, 69, 171
30. లోచన, 61-62
31. ధ్వన్యాలోక, 1.1; పుట 35; 1.2,3
32. లోచన, 62-64
33. లోచన, 182-3, 188
34. రసగంగాధర, 30
35. భామహాలంకార, 1.16
36. భామహాలంకార, 1.21
37. భామహాలంకార, 1.36; 2.85
38. ధ్వన్యాలోక, 449-453, 499
39. వక్రోక్తి జీవితం, పుటలు 7, 13-14, 17, 1.10, 19-23
40. వక్రోక్తి జీవితం, 1.24
41. వక్రోక్తి జీవితం, 66, 1.57
42. రసగంగాధర, 11-25
43. వక్రోక్తి జీవితం. 1.56; 4.26
44. రసగంగాధర, 4-6
45. ధ్వన్యాలోక, 197, 131
46. లోచన, 175, 197
47. ధ్వన్యాలోక, 2.7-10
48. ధ్వన్యాలోక, 467-470
49. ధ్వన్యాలోక, 2.16
50. ధ్వన్యాలోక, 233
51. వక్రోక్తి జీవితం, 3.34
52. ధ్వన్యాలోక, 497
53. కావ్యాలంకార సూత్ర 1.2.6-8
54. ధ్వన్యాలోక, 3.46-47
55. లోచన, 518; ధ్వన్యాలోక, 401-2
56. వక్రోక్తి జీవితం, 41
57. అ.భా. 1.36
58. నాట్యశాస్త్రం, 1.272; అ.భా. 1.267, 5
59. రసగంగాధర, 27
60. రసగంగాధర, 25-28
61. లోచన, 85
62. లోచన, 105
63. ధ్వన్యాలోక, 114
64. అ. భా. 1.290-1, 342-3
65. లోచన, 394; అ. భా. 1.339
66. లోచన, 91-2.



# భాషా పరిశోధన-సిద్ధాంత ప్రమాణాలు

—పి. యస్. సుబ్రహ్మణ్యం

## 1. భాషాపరిశోధన-పుట్టుపూర్వోత్తరాలు :

1.1 భారతదేశంలో ప్రాచీనకాలంలో భాషా పరిశోధన:

"సక్తుమివ తితఉనా పునంతో
యత్ర ధీరా మనసా వాచ మక్రత
అత్రాసఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి"

(ఋగ్వేదం, మండలం 10, సూక్తం 71, ఋక్కు 2)

(విద్వాంసులు పిండిని జల్లెడతో జల్లించి శుభ్రం చేసినట్లు మనస్సుతో వాక్కును సృష్టించారు; అటువంటి జ్ఞానవంతులు వాక్కుకు సంబంధించిన జ్ఞానాన్ని తెలుసుకొని ఉంటారు; వారి వాక్కులో కళ్యాణ ప్రదమైన లక్ష్మి ఉంటుంది.)

"ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ
ముత త్వః శృణ్వన్న శృణో త్యేనాం
ఉతో త్వస్మై తన్వం వి సస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః"

(ఋగ్వేదం, మండలం 10, సూక్తం 71, ఋక్కు 4)

(అవిద్వాంసుడు వాక్కును చూచికూడా (సరిగా) చూడలేడు; వినికూడా (సరిగా) వినలేడు; భర్తృ సంయోగం కోరే మంచివస్త్రం ధరించిన భార్య భర్తకి లాగా వాక్కు విద్వాంసుడికి మాత్రం తన స్వరూపాన్ని స్పష్టం చేస్తుంది.)

పై వేదమంత్రాలవల్ల వేదకాలంలోనే పండితులు భాషా విజ్ఞానాన్ని తెలుసుకొనే ప్రయత్నం ప్రారంభించారని ఆ కాలంలోనే వైయాకరణులకు సంఘంలో ఉన్నతస్థానం ఉండేదనీతెలుస్తుంది. 'ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః' అనే సూక్తి కూడా ఈ అభిప్రాయాన్నే ఆవిష్కరిస్తుంది. వేదకాలపు భాష అర్వాచీన కాలంలో మార్పుకు లోనవడంవల్ల వేదమంత్రాలలో శబ్దాలు, స్వరం యథాతథంగా ఉంచి వాటిని పరిరక్షించవలసిన అవసరం పండితులకు ఏర్పడింది. వేదమంత్రాల వర్ణస్వరాలు మార్పుతో ఉచ్చరించబడితే అవి శుభం కల్గించక పోవడమే కాక కీడు చేయడం కూడా జరుగుతుం దని మనవారి విశ్వాసం. వేదాల వర్ణస్వరాలను యథాతథంగా పరిరక్షించే కృషితో శిక్షా ప్రాతిశాఖ్యలు పుట్టాయి. ఇవే ఆధునిక ధ్వని శాస్త్రానికి ప్రాతిపదికలు. శిక్షలలో వివిధ ధ్వనులను ఉచ్చరించేటపుడు స్థానకరణ ప్రయత్నాలు విపులంగా వివరించబడ్డాయి. ఈ వివరణ వేదాల మటుకే పరిమితంకాక సిద్ధాంత ప్రాతిపదికపై జరిగింది. ప్రాతిశాఖ్యలు ఈ సిద్ధాంతాల ఆధారంగా ఒక్కొక్క వేదంలో వచ్చే ధ్వనుల ఉత్పత్తి విధానం, సంధి మొదలైన విషయాలు వర్ణించాయి. ఋగ్వేదానికి ఋక్ప్రాతిశాఖ్య, సామవేదానికి ఋక్తంత్ర వ్యాకరణం, కృష్ణ యజుర్వేదానికి తైత్తిరీయ ప్రాతిశాఖ్య, శుక్ల యజుర్వేదానికి వాజసనేయీ ప్రాతిశాఖ్య, అథర్వ వేదానికి అథర్వ ప్రాతిశాఖ్య ఉన్నాయి.

వేదాలలో పదాలను ప్రకృతి ప్రత్యయవిభాగం చేసి ఒక్కొక్క పదం ఏ ధాతువునుంచి వచ్చిందో నిరూపించే ప్రయత్నంలో నిరుక్తమూ, వ్యాకరణమూ అనే వేదాంగాలు వెలిశాయి. యాస్కుడి నిరుక్తం

ముఖ్యంగా వేదభాషలో ఉంది. తర్వాతకాలంలో వ్యవహార భ్రష్టమైన పదాల వ్యుత్పత్తిని, వాటి అర్థాలనూ గూర్చి చర్చిస్తుంది. ఇది నిఘంటువు అనే అయిదు అధ్యాయాల గ్రంథానికి విపుల వ్యాఖ్యానం. యాస్కుడు పదాల అర్థాన్ని నిర్వచించడానికి అవి వేదమంత్రాలలో ఏఏ సందర్భాలలో ఉపయుక్తమయ్యాయో పరిశీలించి ఈ పరిశీలన సాహాయ్యంతో పదాల అర్థనిర్ణయం చేశారు. పదవ్యుత్పత్తి పరిశీలన యాస్కుడికి ముందుకాలంలోనే ప్రారంభమైనట్లు ఆయన స్మరించిన గార్గ్య గాలవ శాకటాయనాది ఋషినామాలవల్ల తెలుస్తుంది. యాస్కుడు ఒక పదం ఏ ధాతువునుంచి వచ్చిందో అని చెప్పిండారే కాని ఆయన పాణినిలా పదాలకి ప్రకృతి ప్రత్యయ విభాగం చేసి అందులో వచ్చే సంధి మార్పులు వివరించలేదు. అందువల్ల యాస్కుడు పాణినికి ప్రాచీనుడై ఉంటాడని పండితుల నిర్ణయం. పాణిని క్రీ. పూ. 6వ శతాబ్దివాడైతే, యాస్కుడు క్రీ. పూ. 7-8 శతాబ్దుల ప్రాంతానికి చెందినవాడై ఉంటాడు. పదాలని నామం, ఆఖ్యాతం, ఉపసర్గ, నిపాత అని నాలుగు విధాలుగా విభజించినది యాస్కుడే. శాకటాయనాది వైయాకరణులు, నిరుక్తకారులు నామాలన్నీ ధాతువుల నుంచి పుట్టాయని అంటారు; కాని గార్గ్యాది వైయాకరణులు అన్ని నామాలూ అలాంటివి కావు అన్నారనీ ఆయన చెప్పారు (తత్ర నామాన్యాఖ్యాతజాని ఇతి శాకటాయనో నైరుక్తసమయశ్చ, న సర్వాణీతి గార్గ్యో వైయాకరణానాం చైకే).

సంస్కృత వ్యాకరణాలలో ముఖ్యమైన పాణిని మహర్షి విరచితమైన అష్టాధ్యాయి ప్రపంచములోని వ్యాకరణ గ్రంథాలన్నిటిలోనూ ప్రశస్తమైనది అని ప్రాచ్య, పాశ్చాత్య విద్వాంసులంతా అంగీకరించారు.[1] ఈయన క్రీ. పూ. 6-7 శతాబ్దులకు చెందిన వారనీ, ప్రస్తుతం పాకిస్తాన్‌లో లాహోర్ పట్టణానికి సమీపంలో ఉండిన 'శాలాతుర' అనే గ్రామానికి చెందినవారనీ పండితుల అభిప్రాయం. అష్టాధ్యాయిలో సుమారు 4000 సూత్రాలు 8 అధ్యాయాలలో ఉన్నాయి; ఒక్కొక్క అధ్యాయంలో 4 పాదాలు ఉన్నాయి. ఈ వ్యాకరణానికి ముఖ్యాధారం ఆ కాలంలో వ్యవహారంలో ఉన్న సంస్కృత భాష. ఈ భాషకీ, వేదాలలో ఉన్న భాషకీ భేదం ఉన్నచోట్ల వైదిక భాషారూపాలు కూడా ఈయన వ్యాకరణంలో సాధించబడ్డాయి. ఈ వ్యాకరణం ప్రథమ ప్రమాణ గ్రంథమై ఇంతటి ప్రాశస్త్యాన్ని పొందడానికి కారణం

---

1. ఆధునిక భాషాశాస్త్ర ప్రవర్తకులలో ముఖ్యుడైన లియోనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ పాణిని అష్టాధ్యాయిని గురించి ఇలా చెప్పేరు :

"This (i. e. Panini's) grammar, which dates from some where round 350 to 250 B. C. is one of the great monuments of human intelligence. It describes with the minutest detail, every inflection, derivaton and composition, and every syntactic usage of its author's speech. No other language, to this day, has been so perfectly described."

(Language P. 11)

"This scientific condensation, which places every feature into its proper setting, is one of the two virtues which make Indian grammar a model for us. The other is completeness Panini gives the formation of every inflected, compounded or derived word, with an exact statement of the sound-variations (including accent) and of the meaning."

-Lg. 5 (1929), P. 274.

దీనిలోని సమగ్రత, నిర్దుష్టత, సూత్ర లాఘవం, శాస్త్రీయ వర్ణనం మొదలైన గుణాలు. అష్టాధ్యాయిలో ఉపయుక్తమైన పద్ధతులకీ, ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలకీ చాలా పోలికలు ఉన్నాయి. పాణినికి ముందుకాలంలో కూడా వైయాకరణులు కొందరు ఉన్నారని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. ఆయనే అష్టాధ్యాయిలో ఆపిశలి, కాశ్యపుడు, గార్గ్యుడు, శాకటాయనుడు, గాలవుడు, చాక్రవర్మణుడు, భారద్వాజుడు, శాకల్యుడు, సేనకుడు, స్ఫోటాయనుడు అనే పది మంది పూర్వవైయాకరణుల మతాలను పేర్కొనడమే కాకుండా మరికొందరు వైయాకరణులను పేరు చెప్పకుండా స్మరించారు. వారి గ్రంథాలేవీ ఇప్పుడు మిగలలేదు. పాణినీయాదిత్యుని తేజస్సులో ఆ నక్షత్రాల వెలుగు అంతరించింది. పాణిని వ్యాకరణంలో పునరుక్తి దోషం ఉండదు. సదృశమైన వ్యాకరణ కార్యాలు వీలైనంతవరకూ ఒక వ్యాకరణ కార్యంలోనే గ్రహించబడతాయి (గుణం, వృద్ధి, సంప్రసారణం మొ॥). పారిభాషిక సంజ్ఞలు, పరిభాషలు, అధికార సూత్రాలు, అనువృత్తి, ప్రత్యాహారం మొదలైనవాటివల్ల లాఘవం సాధించబడింది. ఈ గ్రంథానికి ఆధారభూతమైన అ ఇ ఉణ్ మొదలైన 14 ప్రత్యాహార సూత్రాలలో ధ్వనుల వరుస అక్షర సమామ్నాయంలో ఉన్న వరుసలో ఉండదు. పాణిని ఇలా వీటి వరుసక్రమం సంధి విధానాన్ని వర్ణించడానికి అనువుగా మార్చారు. అష్టాధ్యాయి అర్థ నిర్మాణాన్ని ప్రాతిపదికగా తీసుకొని ఒక అర్థాన్ని సూచించడానికి అవసరమైన ప్రత్యయాన్ని ధాతువుకి లేక ప్రాతిపదికకి విధిస్తుంది. ప్రత్యయాలు వాటి ప్రక్కనున్న ధాతువు లేక ప్రాతిపదికవల్ల పొందే రూపాంతరాలని ఆదేశప్రక్రియతో సాధిస్తుంది. అంటే ఒక ప్రత్యయానికి ఏ రూపాంతరం లేక సార్థకం (Allomorph) ఏ సందర్భంలో వస్తుందో నిర్దుష్టంగా, నిశితంగా సూచిస్తుంది. పదమధ్య సంధినీ, పదాంత సంధినీ పాణిని సమగ్రంగా వర్ణించారు. పద నిర్మాణం, సంధీ ఇంత నిర్దుష్టంగా, సమగ్రంగా ఏ ప్రాచీన పాశ్చాత్య వ్యాకరణంలోనూ వర్ణించబడలేదు. అష్టాధ్యాయిలో వాక్య నిర్మాణచర్చ లేదని కొందరు పండితులు అపోహ పడ్డారు. కాని, ఇటీవలి కాలంలో జరిగే పరిశోధనలవల్ల పాణిని వాక్య నిర్మాణాన్ని కూడా దృష్టిలో పెట్టుకొనే వ్యాకరణ రచన సాగించారని తెలుతోంది. కారక ప్రక్రియా, లకార ప్రక్రియా మొదలైనచోట్ల వాక్య నిర్మాణం కూడా వర్ణితమైంది. అష్టాధ్యాయి ఎనిమిదో అధ్యాయంలో చివరి మూడు పాదాల (వీటినే త్రిపాది అంటారు) లో 'పూర్వత్రా సిద్ధం' అనే సూత్రంతో ప్రారంభించి సంధి విధానంలో చివరి సూత్రాలు కూర్చబడ్డాయి. వీటిలో ఒక సూత్రం ప్రవర్తించాక అవకాశమున్నా దానిముందు సూత్రాలు ప్రవర్తించవు. కొన్ని పాణిని సూత్రాలకి చేయవలసిన మార్పులూ, చేర్పులూ సూచిస్తూ ఆయన తర్వాత కొంతకాలానికి వరరుచి వార్తికాలు రచించారు. ఈ సూత్రాలకీ, వార్తికాలకీ విమర్శయుక్త వ్యాఖ్యాప్రాయంగా పతంజలి (క్రీ.పూ. 150 ప్రాంతం) మహాభాష్యం రచించారు. ఆ తరవాత అష్టాధ్యాయికీ, మహాభాష్యానికీ పరశ్శతమైన వ్యాఖ్యలూ, అష్టాధ్యాయికి కాతంత్రం వంటి సంగ్రహ గ్రంథాలూ వెలువడ్డాయి. వీటి అన్నింటిలో ఆధునిక భాషా శాస్త్రానికి ఆమోదయోగ్యాలూ, గ్రహణీయాలూ అయిన అభిప్రాయాలు పుష్కలంగా ఉన్నాయి.

### 1.2. యూరప్‌లో ప్రాచీన కాలంలో భాషా పరిశోధన :

యూరప్ ఖండవాసుల సంస్కృతి మొదట గ్రీసు దేశంలో వృద్ధి చెందింది. గ్రీసుదేశ పండితులు వేదాంత శాస్త్రం, న్యాయశాస్త్రం, రాజకీయ శాస్త్రం, అలంకార శాస్త్రం మొదలైన అనేక విజ్ఞాన శాస్త్ర శాఖలలో పరిశ్రమ చేశారు. వారు భాషని గురించీ,

వ్యాకరణాన్ని గురించీ చేసిన చర్చ వేదాంత శాస్త్రంలో అంతర్భూత మవుతుంది. ప్రాచీన గ్రీసుదేశ పండితులు తమ భాషపైనే దృష్టి కేంద్రీకరించి భాషాశాస్త్ర సిద్ధాంతాలు ప్రతిపాదించారు. గ్రీకుభాషకు లిపి ఏర్పడడం వీరి ప్రథమ పరిశోధనా ఫలితం. క్రీస్తు పూర్వం వేయి సంవత్సరాలకు ముందే వీరు ఫొనీషియన్ (Phoenicion) లిపి ఆధారంగా గ్రీకు లిపి ఏర్పరచారు. ఫొనీషియన్ లిపిలో హల్లులకి మాత్రమే సంకేతాలు ఉండేవి. అచ్చులను సందర్భానుసారంగా ఊహించుకునేవారు. గ్రీకులు ఈ లిపిని తమ భాషకు ఉపయోగిస్తూ తమ భాషకు అవసరంలేని ఫొనీషియన్ హల్లుల సంకేతాలని అచ్చులకు సంకేతాలుగా మార్చి, గ్రీకుకు అచ్చులనూ, హల్లులనూ విడివిడిగా సూచించే లిపిని ఏర్పరచుకున్నారు.

ఇప్పుడు మనకు దొరికే గ్రంథాల్లో భాషను గురించిన చర్చ ఉన్నవాటిలో ప్రాచీనతమమైనది ప్లేటో (Plato క్రీ. పూ. 425-348/347) సంభాషణలలో ఒకటైన క్రటిలస్ (Cratylus). ఈయన భాషలో పదాలకీ, అర్థాలకీ సహజ సంబంధం ఉందని నమ్మారు. ఈ సిద్ధాంతాన్ని నిరూపించడానికి ఈయన కొన్ని పదాలకి వ్యుత్పత్తులు ఇచ్చారు. కాని, ఈ వ్యుత్పత్తులలో అనేకం అంగీకారయోగ్యం కావు. ప్లేటో శిష్యులలో ఒకరైన అరిస్టాటిల్ (Aristotle, క్రీ. పూ. 384-322/321) ప్రాచీనకాలపు పండితులలో అగ్రగణ్యుడు. భాషోత్పత్తి విషయంలో ఈయన తన గురువుతో ఏకీభవించలేదు. ఈయన భాష సహజ సిద్ధమైనది కాదనీ, అది సంప్రదాయసిద్ధ మైనదనీ చెప్పారు. ఈయన నామాలు, క్రియలు, సంయోజకాలు (Conjections) అనే మూడు భాషా భాగాలు గుర్తించారు. ఈయన తరవాత ఏథెన్స్‌లో జెనో (Zeno క్రీ. పూ. 308 లో స్థాపించిన స్టోయిక్ శాఖ (Stoic School) లో భాషావిషయాలకు సంబంధించిన ప్రత్యేక గ్రంథాలు వెలువడ్డాయి. పాశ్చాత్య వ్యాకరణ మూల పదతులను స్థాపించినవారు వీరే. నామ విభక్తులకు వీరు పెట్టిన పేర్లే అనువాదాలద్వారా అన్ని పాశ్చాత్య భాషలకూ వ్యాపించాయి.

గ్రీకు పండితులు సహజ సిద్ధ- సంప్రదాయ సిద్ధ వాదాలలాగే మరొక విప్రతిపత్తినికూడా చర్చించారు. భాష క్రమబద్ధమైనదని కొందరు వాదిస్తే, మరి కొందరు అది క్రమరహిత మని వాదించారు. మొదటి రకంవారు ఒకే ప్రత్యయం చాలా ధాతువులు/ప్రాతిపదికలకు చేరడం అనే విషయానికి ప్రాధాన్యం ఇస్తే, రెండో రకంవారు భాషలో ఉన్న ప్రతిషేధ రూపాలు, పట్టణాల పేర్లు బహువచనంలో ఉండడం, పుంలింగ, స్త్రీలింగ పదాలు అప్రాణి వాచకాలని కూడా సూచించడం మొదలైన అసహజంగా కనబడే విషయాలకు ప్రాధాన్యం ఇచ్చారు. అలెగ్జాండ్రియాలో పండితులు హోమర్ మొదలైన ప్రాచీన కవుల కావ్యాలలో భాషని గురించి చర్చించి ఆ కావ్యాలకి వ్యాకరణాలు వ్రాశారు. థ్రేక్స్ (Thrax, క్రీ. పూ. 1 వ శతాబ్ది) అనే వైయాకరణుడు మొట్టమొదటి సారిగా 8 భాషా భాగాలని గుర్తించారు.

వారో (Varro క్రీ. పూ. 116-27) మొదలైన లాటిన్ వైయాకరణులు, గ్రీకు వైయాకరణులని అనుసరించారు. గ్రీకుల వలె వీరు పదాన్నే మూలాంశముగా తీసుకున్నారు కానీ పదానికి ప్రకృతి ప్రత్యయ విభాగం సమగ్రంగా చేయలేదు.

1.3. 19 శతాబ్దినుంచి జరిగిన పరిశోధనలు :

క్రైస్తవమతం స్థాపించబడిన తరవాత దాన్ని అన్ని దేశాలకూ వ్యాపింపజేయడానికి ప్రయత్నం జరిగింది. ఈ ప్రయత్నంలో ముఖ్యాంగం వివిధ దేశ భాషలలో బైబిలును అనువదించడం, ఆ మత సూత్రాలను వివిధ దేశ భాషలద్వారా ప్రజలలో ప్రచారం చెయ్యడం, ఈ విధంగా పండితుల దృష్టి లాటిన్ గ్రీకు భాషలపై నించి మరలి దేశభాషలపై ప్రసరించింది. 18 వ శతాబ్ది వరకూ భాషా పరిశోధన వివిధ

భాషలకు వ్యాకరణాలూ, నిఘంటువులూ రచించడానికి పరిమితమైంది. పండితులకు వివిధ భాషలతో ఏర్పడిన పరిచయం వల్ల అన్ని భాషలూ నిర్మాణములో ఒకే రకంగా ఉండవు అని తెలిసింది. 18 వ శతాబ్దిలో లైబ్నిజ్, హెర్డర్, సర్ విలియమ్ జోన్స్ అనే ముగ్గురు చేసిన పరిశోధనలు తరవాత వారికి మార్గదర్శకాలు అయ్యాయి. లైబ్నిజ్ భాషల పరస్పర సంబంధాలను నిర్ణయించడంలో ఆసక్తి చూపేరు. హెర్డర్ భాష దైవదత్తమనే భావాన్ని ఖండించారు. సర్ విలియమ్ జోన్స్ అనే ఆంగ్లేయుడు కలకత్తా హైకోర్టులో న్యాయమూర్తిగా ఉండేవారు. ఈయన సంస్కృతాన్ని క్షుణ్ణంగా అభ్యసించడమేకాక సంస్కృతానికి, ప్రాచీన యూరపియన్ భాషలకి గల సంబంధాన్ని మొట్టమొదటిసారిగా ఊహించగలిగారు. ఈయన క్రీ. శ. 1786 లో ఏషియాటిక్ సొసైటీలో ఇచ్చిన ఉపన్యాసంలో సంస్కృతం, గ్రీక్, లాటిన్, గొథిక్, కెల్టిక్, పర్షియన్ భాషలు అధారాలు మిగలని ఒక మూల భాష నుంచి పుట్టాయని ప్రమాణపూర్వకంగా నిర్ణయించారు.[2] సర్ విలియమ్ జోన్స్ ఉపన్యాసమే అధునిక భాషా శాస్త్రానికి నాందీ ప్రస్తావన అని పండితులందరూ అంగీకరించారు.

సర్ విలియమ్ జోన్స్ పరిశోధన ఇచ్చిన ప్రోత్సాహం వల్ల 19 వ శతాబ్దిలో ఇండో యూరపియన్ భాషాకుటుంబంపై తులనాత్మక పరిశోధన ప్రారంభమైనది. రాస్మస్ రాస్క్ లాటిన్‌కు జర్మానిక్ భాషలకు ధ్వనులలో గల పరస్పర సంబంధాలు ప్రతిపాదిస్తూ ధ్వనిసూత్రాలు రచించారు. యాకోబ్ గ్రిమ్ రాస్క్ ఇచ్చిన ధ్వని సూత్రాలను విపులీకరించారు. ఫ్రాంజ్ బొప్ ఇండో యూరోపియన్ భాషలకు తులనాత్మక వ్యాకరణం (1833-52) వ్రాశారు. అగస్ట్ ష్లైష కూడా ఇండోయూరోపియన్ భాషలకు తులనాత్మక వ్యాకరణం (1861-62) వ్రాసి ఉపకుటుంబ విభజనను గూర్చి చర్చించారు. అగస్ట్‌ఫిక్ ఇండో యూరోపియన్ భాషల తులనాత్మక నిఘంటువు (1868) రచించారు. 1870-80 లలో యువ వ్యాకర్తలు (Neogrammarians) అని పిలువబడే అస్కోలీ, కారల్ వెర్నర్, కారల్ బ్రూగ్‌మన్ వంటి కొందరు పండితులు తమ నిశిత పరిశోధనలు అధారంగా ధ్వని సూత్రాలకు నిజమైన అపవాదాలు ఉండవు అని ప్రతిపాదించారు. ధ్వని సూత్రాలకు అపవాదాలుగా కనబడే వాటిలో మరొక ధ్వని సూత్రం అంతర్లీనమై ఉండడమో లేక అవి సామ్యం (Analogy), ధ్వన్యనుకరణ, ఎరువు తెచ్చుకోవడం వంటి కారణాల వల్ల ఏర్పడి ఉంటాయని వారు నిర్ణయించారు. వీరి పరిశోధనలు భాషాశాస్త్రం శాస్త్రీయమైన పరిశోధనగా వర్ధిల్లడానికి మూలకందాలు అయ్యాయి. ఫెర్డినాండ్ దె సస్యూర్ భాషా చరిత్రే కాక భాషా నిర్మాణం కూడా నియమపూర్వకంగా ఉంటుందనీ, దానిని కూడా శాస్త్రీయ దృష్టితో పరిశోధించవచ్చుననీ నిరూపించారు.

---

2. "The *Sanscrit* language, whatever be its antiquity, is of a wonderful structure; more perfect than the *Greek*, more copious than the *Latin*, and more exquisitely refined than either, yet bearing to both of them a stronger affinity, both in the roots of verbs and in the forms of grammar, than could possibly have been produced by accident; so strong indeed, that no philologer could examine them all three, without believing them to have sprung from some common source, which, perhaps, no longer exists."

అమెరికా దేశస్థులైన లియోనార్డ్ బ్లూమ్ ఫీల్డ్ ఎడ్వర్డ్ సపేర్‌లు అమెరికన్ ఇండియన్ భాషలలో తమకున్న పరిచయంతో వర్ణనాత్మక, చారిత్రక భాషా శాస్త్ర శాఖలలో పద్ధతులను తీర్చిదిద్దారు. ఇప్పుడు అనేక దేశాలలో భాషాశాస్త్ర పరిశోధన బహుముఖంగా జరుగుతూనే ఉంది. భాషాశాస్త్రంలో వివిధశాఖలలో ముఖ్య సిద్ధాంతాలను సంగ్రహంగా కింద చూద్దాం.

## 2. వర్ణనాత్మక వ్యాకరణ సిద్ధాంతాలు :

2.1 భాష - స్వరూప స్వభావాలు :

భాష మానవుడి అభిప్రాయావేదనకు ముఖ్య సాధనం. ఒక వక్త మాట్లాడేముందు అతని మనస్సులో వక్తీకరించదలుచున్న అర్థం అతని ముఖ యంత్రం చేసే ధ్వనుల ద్వారా తమ అభిప్రాయాలని సూచించ గలిగే సామర్థ్యం మానవులకి మాత్రమే ఉంది. కోతులు పశుపక్ష్యాదులు కూడా భయం. ప్రేమ, కోపం, ఆకలి మొదలైన భావాలను సూచించడానికి అరుపులు అరుస్తాయి. అయితే మానవ భాషకీ, పశు పక్ష్యాదుల అరుపులకీ మధ్య ఎంతో భేదం ఉంది. జంతువుల అరుపులలో ఏడెనిమిది లేక పదికన్నా ఎక్కువ రకాలు ఉండవు. కాని, మానవభాషలో రకరకాల ధ్వనులు కలిసి మాటలుగా ఏర్పడడం, రకరకాల మాటలు కలిసి రకరకాల వాక్యాలు ఏర్పడడం ఉంది. మానవ భాషకి ఏడు ముఖ్యలక్షణాలు ఉన్నాయి. ఇవి మానవ భాషని మిగిలిన ప్రాణుల భాషవంటి వార్తా ప్రసారాన్నుంచి వేరు చేస్తాయి.

అవి:

1. నిర్మాణ వైవిధ్యం : మానవ భాషలో రెండు రకాల నిర్మాణం ఉంది. కొన్ని ధ్వనులు కలిసి ఒక పదంగా ఏర్పడడమూ, కొన్ని పదాలు కలిసి ఒక వాక్యంగా ఏర్పడడమూ అన్ని భాషలలోనూ ఉన్నాయి.

2. ఉత్పాదన శక్తి : మనం ఇంతవరకూ విన్న వాక్యాల నిర్మాణాన్ని అనుసరించి ఇంతకు ముందు ఎప్పుడూ వినని వాక్యాలను కూడా తయారుచేసి వాడ గలం.

3. శబ్దార్థ సంబంధ సిద్ధి : ఈ శబ్దానికి ఇది అర్థం అనే సంకేతం ఒక్కొక్క భాషా సముదాయం ఏర్పరుచుకొన్నది. స్వల్ప సంఖ్యాకమైన అనుకరణ శబ్దాలలో తప్ప శబ్దానికీ, అర్థానికీ సహజ సంబంధం లేదు.

4. వక్తృ శ్రోతృ వినిమయం : ప్రతి వ్యక్తికీ మాట్లాడగల శక్తీ, ఇతరులు మాట్లాడింది అర్థం చేసుకోగల శక్తీ - ఈ రెండూ ఉన్నాయి.

5. ప్రత్యేకత: వార్తాప్రసారంలో ప్రేరణ, ప్రతిక్రియ ఉంటాయి. ఈ రెండిటికీ సహజ సంబంధం లేకపోతే ఆ వార్తాప్రసారంలో ప్రత్యేకత ఉన్నట్లు లెక్క. ఉదాహరణకి డాక్టరు ఒక రోగితో 'నీకు క్యాన్సరు వచ్చింది' అని చెప్పినంతనే రోగి కేన్సరు తగిలిన భాగం చూడకపోయినా భయపడతాడు.

6. ప్రేరణ దూరత : జంతువులు మనోవికారాలు కలిగినప్పుడే శబ్దాలు చేస్తాయి. కాని, మానవులు వర్తమాన సంఘటనలని గురించేకాక భూత భవిష్యత్తు లని గురించి కూడా మాట్లాడగలరు.

7. సాంస్కృతిక ప్రసరణం : మానవులు ఇతర ఆచార వ్యవహారాలలానే భాషనికూడా ఒకతరంనుంచి మరొక తరం, ఒకరి నుంచి ఒకరు నేర్చుకుంటారు.

2. 2. ధ్వని నిర్మాణం- వర్ణ నిర్మాణం :

ఏ భాషకైనా దాని ముఖ్యరూపం ధ్వన్యాత్మకంగానే ఉంటుంది. ఈ ధ్వనులని అసంపూర్ణంగా మాత్రమే సూచించే లిపి అముఖ్యరూపం. సాధారణంగా ధ్వనులు ఊపిరితిత్తులలోనుంచి బైటికి వచ్చే గాలి గొంతుకలోనూ, నోట్లోనూ పీడనకు లోనవడం వల్ల పుడతాయి. (కొన్ని భాషలలో బైటనుంచి లోపలికి వచ్చే గాలివల్ల పుటే ధ్వనులు కూడా ఉన్నాయి.) మనం విభిన్న ధ్వనులని ఉచ్చరించ

గలగడం, ముఖ్యంగా మూడు విషయాలమీద ఆధార పడి ఉంది. అవి : 1) స్వరపేటికలో కలిగే మార్పు 2) గొంతుకలోగానీ, నోట్లోగాని గాలి నిరోధించబడే స్థానం. (దీనిని ఉచ్చారణ స్థానం అంటారు), 3) గొంతుకలోగానీ, నోట్లోగానీ గాలిని నిరోధించే వ్యాపారంలో భేదం (దీనిని ఉచ్చారణ ప్రయత్నం అంటారు). స్వర పేటికలో నాదతంత్రులు ఉంటాయి. ఇవి కొంచెంగా, వాయు మార్గాన్ని నిరోధించినపుడు కంపించడం వల్ల ధ్వనికి 'నాదత' అనే గుణం వస్తుంది. ఇవి కంపించకుండా వాయు మార్గాన్ని పూర్తిగా తెరిచి ఉంచినపుడు పుట్టే ధ్వనులని 'శ్వాస ధ్వనులు' అని అంటారు. ఊపిరితిత్తులలోనుంచి నోటిలోకి వచ్చిన గాలి సాధారణంగా ఏదోఒకచోట నిరోధించబడుతుంది. ఈ నిరోధించబడే చోటుని స్థానం అనీ, దానిని తాకడం లేక సమీపించడం చేసే అవయవాన్ని కరణం అనీ అంటారు. పెదవుల దగ్గర గాలి నిరోధించబడడం వల్ల పుట్టే ప, ఫ, బ, భ, మ వంటి ధ్వనులు ఓష్ఠ్యాలు. దంతాలకు నాలుక చివరి భాగం తగిలి వాయువు నిరోధించబడినపుడు పుట్టే త, థ, ద, ధ, న వంటి ధ్వనులు దంత్యాలు. ఇక ప్రయత్న భేదంవల్ల హల్లులని 1) స్పర్శాలు (వీటి ఉచ్చారణలో స్థానాన్ని కరణం తాకుతుంది. క, ట, త, ప మొ॥), 2) అనునాసికాలు (వీటి ఉచ్చారణలో వాయువు నోటి ద్వారానూ, ముక్కుద్వారానూ కూడా బయటికి వస్తుంది. న, మ మొ॥), 3) పార్శ్వికాలు (వీటి ఉచ్చారణలో గాలి నాలుక పక్కలనుంచి బయటికి వస్తుంది. ల, ళ, మొ॥), 4) కంపితాలు (వీటి ఉచ్చారణలో కరణం రెండు మూడు సార్లు కంపిస్తూ స్థానాన్ని తాకుతుంది: ర), 5) తాడితాలు (వీటి ఉచ్చారణ కరణం స్థానాన్ని అతిస్వల్పకాలం తాకి వదలివేస్తుంది), 6) ఈషత్ స్పృష్టాలు (వీటిఉచ్చారణలో స్థానం కరణాన్ని తాకకుండా దగ్గరగా వచ్చి ఉంటుంది స, శ, ఇంగ్లీషు f మొ॥), 7) అంతస్థలు (వీటి ఉచ్చారణలో వాయు నిరోధం చాలా స్వల్పంగా ఉంటుంది : య, వ). స్పర్శోచ్చారణతో ఎక్కువ గాలిని వదిలితే అవి మహాప్రాణాలు అవుతాయి. తాలవ్యాలైన చ, ఛ, జ, ఝ ల ఉచ్చారణలో నిరుద్ధమైన వాయువు ఆకస్మికంగా కాక మెల్లిగా వదలబడుతుంది; కాబట్టి వీటిని స్పృష్టోష్మాలు అంటారు.

అచ్చుల ఉచ్చారణలో వాయునిరోధం ఉండదు. అచ్చులలో అంతర్విభజన చేయడానికి ఈ కింద ఇచ్చిన ఏడు విషయాలూ తోడ్పడతాయి: 1. నాలుక ఎత్తు, 2. ఎత్తుగా ఉన్న నాలుక భాగం (పూర్వ భాగం లేక పశ్చాద్భాగం), 3. పెదవుల ఆకారం, 4. నాసామార్గం తెరుచుకుని ఉండడం లేక మూసుకొని ఉండడం, 5. నాలుక పై భాగపు ఆకారం, 6. నాలుక నరాల దృఢత, 7. సప్తపథలోనూ కృకాగ్రంలోనూ జరిగే మార్పులు. తెలుగులో ఇ, ఈ, ఉ, ఊ లు ఉన్నతాచ్చులు; ఎ, ఏ, ఒ, ఓ లు మధ్యమాచ్చులు; అ, ఆ లు నిమ్నాచ్చులు; ఇ, ఈ, ఎ, ఏ లు అగ్రాచ్చులు; ఉ, ఊ, ఒ, ఓ లు పశ్చిమాచ్చులు; అ, ఆ లు కేంద్రాచ్చులు; పశ్చిమాచ్చులు ఓష్ఠ్యీకృతాలు. మిగిలినవి అనోష్ఠ్యీకృతాలు. పైన చెప్పినవి కాక కొన్ని భాషలలో ఉదాత్తత, స్వరం అనే రెండింటివల్ల కూడా అచ్చులలో భేదాలు ఏర్పడతాయి. శ్రుతి భేదం వాక్యాని కంతకీ వ్యాపించి ఉంటుంది. కాబట్టి శ్రుతిభేదంవల్ల వాక్యాల అర్థం మారుతుంది.

మానవ ముఖయంత్రం ఉచ్చరించగలిగిన ధ్వనులన్నీ ప్రతిభాషలోనూ ఉండవు. ఒక్కొక్క భాషలో కొన్ని ధ్వనులు మాత్రమే ఉంటాయి. ప్రతి భాషలోనూ పదాలలో అర్థభేదం కలిగించగల ధ్వనులూ, అర్థభేదాన్ని కలిగించలేని ధ్వనులూ అని రెండు రకాలు ఉంటాయి. అర్థభేదకశక్తిగల ధ్వనులని వర్ణాలు అంటారు. తెలుగులో కోడలు-గోడలు, చుట్టు - జుట్టు, పేట - పేడ, తడి - దడి, పుట్ట-

బుట్ట వంటి జంటలలో క, చ, ట, త, ప లకి గ, జ, డ, ద, బ లకీ మధ్యగల భేదమే అర్థ భేదాన్ని కలిగిస్తోంది. కాబట్టి తెలుగులో ఇవి భిన్నవర్ణాలు. తమిళంలో వీటికి మధ్య అర్థభేదక శక్తి లేదు. కాబట్టి తమిళంలో ఇవి భిన్నవర్ణాలు కావు. దీనివల్ల ఏ ధ్వనులు భిన్న వర్ణాలు అనే విషయంలో భాషకీ, భాషకీ మధ్య భేదం ఉంటుందని గ్రహించవచ్చు. ప్రతి భాషలోనూ కొన్ని వర్ణాలకి కొన్ని పరిసరాలలో సమీపధ్వనులవల్ల ఉచ్చారణలో స్వల్పమైన మార్పు ఉంటుంది. తెలుగులో చ, జలు అగ్రాచ్చుల ముందు తాలవ్యాలుగానూ (చిల్లు, చీర, చెట్టు, చేమ, జిగురు, జీర, జెర్రి, జేగురు మొ॥), మిగిలిన అచ్చుల ముందు దంత్యాలుగానూ చల్లు, చాలు, చుట్టం, చూడు, చొప్పు, చోటు, జల్లు, జాలి, జుట్టు, జూలు, జొన్న, జోడు మొ॥) ఉచ్చరించబడతాయి. ఈ రెండు రకాల ధ్వనులకీ అర్థభేదక శక్తి లేదు, కాబట్టి ఇటువంటి వాటిని ఒకే వర్ణానికి సవర్ణాలుగా, అంటే రూపాంతరాలుగా గ్రహించాలి.

ప్రతి భాషలోనూ పదంలో వర్ణాలు వివిధ స్థానాలలో ఉండటంలోనూ, అవి పరస్పరం కలిసి రావడంలోనూ నియమాలు ఉంటాయి. ఉదాహరణకు తెలుగులో ఙ, ళ లు పదాదిని రావు; పదాంతంలో మకార, యకారాలు తప్ప మిగిలిన హల్లులు రావు. ఇప్పటి తెలుగులో దేశ్యశబ్దాలలో పదాదిని సంయుక్తాక్షరాలు ఉండవు. ప్రాచీన భాషలోని క్రొత్త, త్రాచు, ప్రొద్దు మొదలైన వాటిలో రేఫ లోపించి ఇప్పటి తెలుగులో అవి కొత్త, తాచు, పొద్దు ఇత్యాదిగా మారిపోయాయి.

2.3. పద నిర్మాణం:

ఒక వాక్యాన్ని పదాలుగా విడగొట్టగలిగినట్లే కొన్ని పదాలని కూడా అర్థవంతమైన భాగాలుగా విడగొట్టవచ్చు. పదంలో కనిష్ఠార్థవంతమైన భాగాలని 'అర్థకాలు' (Morphemes) అంటారు. కుక్కలు, ఇళ్లు, చెప్పడం, తినడం అనే రూపాలు ఒక్కొక్కదాంట్లో కుక్క, లు ఇత్యాదిగా రెండేసి అర్థకాలు ఉన్నాయి. వీటిలో కుక్క మొదలైనవి ప్రత్యయాలు. కొన్ని అర్థకాలకు పరిసరానుగుణంగా రూపభేదాలు ఉంటాయి. బహువచన ప్రత్యయమైన -లు కు ఇళ్లు, ముళ్లు, కళ్ళు వంటి పదాలలో -ళు అనే రూపాంతరం ఉంది. ఇటువంటి రూపాంతరాలని 'సార్థకాలు' (Allomorphs) అంటారు. అర్థకాలకి సార్థక భేదం ప్రక్కనున్న ధ్వనులపైననే కాక ప్రత్యేక పదాలపై కూడా ఆధారపడి ఉంటుంది. ప్రకృతులైన అర్థకాలు స్వతంత్ర ప్రవృత్తి కలవి. సార్థక భేదాలలో లోపంకూడా ఒకటి. ఇంగ్లీషులో Sheep, deer ఇత్యాదుల బహువచన రూపంలో -s ఉండదు. అంటే వీటిలో s అనే అర్థానికి సార్థకం లోపం అన్నమాట. పద నిర్మాణంలో ధాతువుకి చేరే ప్రత్యయాలని వాటి ప్రయోజనాన్ని బట్టి రెండు రకాలుగా విభజించవచ్చు. ఒకరకం విభక్తులు సంయోజన (Inflection)లో ఉపయోగించేవి. వీటిని విభక్తి సంయోజకాలు (Inflectional suffixes) అనవచ్చు. రెండో రకం నిష్పాదన(Derivation)లో ఉపయోగించేవి. వీటిని నిష్పాదకాలు (Derivational suffixes) అనవచ్చు. కృత్తద్ధిత ప్రత్యయాలు నిష్పాదకాలు, బహువచన ప్రత్యయం, విభక్తి ప్రత్యయాలు, కాల ప్రత్యయాలు మొదలైనవి విభక్తి సంయోజకాలు. నిష్పాదకాలు ప్రకృతిపక్కనే ఉంటాయి; విభక్తి సంయోజకాలు నిష్పాదకాల తర్వాత చేరతాయి. నిష్పాదకాలు చేరినప్పుడు ప్రకృతి భాషాభాగం మారవచ్చు, లేక మారకపోవచ్చు. కానీ విభక్తి సంయోజకాలు చేరినపుడు ప్రకృతి భాషాభాగం మారదు. విభక్తి సంయోజకాలు ఇంచుమించు అన్ని ప్రకృతులకీ చేరతాయి; నిష్పాదకాలలో ఇటువంటి సార్వత్రికత ఉండదు.

2.4. వాక్య నిర్మాణం :

ఒక వాక్యంలో పదాలు ఏ విధంగా పరస్పరం కలిసి ఆ వాక్యం ఏర్పడింది అని చర్చించేది వాక్య నిర్మాణం. ఇటీవల చోమ్స్కీ (Chomsky) స్థాపించిన పరివర్తన వ్యాకరణం(Transformational Grammar) వాక్యనిర్మాణ పరిశోధనకి ప్రాముఖ్యం తెచ్చిపెట్టింది. వాక్యంలో పదాలకి పరస్పరం ఉన్న సంబంధం ముఖ్యంగా మూడు రకాలు. అవి 1) స్థాన సంబంధం, 2) యోగ్యతా సంబంధం, 3) ఆదేశ సంబంధం. కొన్ని పదాలు కలిసినపుడు అవి నిర్దిష్ట క్రమంలోనే, స్థానాలు మార్చడానికి వీలులేకుండా ఉండడం స్థాన సంబంధం, 'రెండు పెద్ద ఇళ్లు' అనేది *పెద్ద రెండు ఇళ్లు ఇత్యాదిగా పదాల స్థానాలు మార్చి ప్రయోగిస్తే అది అసాధువు (un grammatical) అవుతుంది (అసాధు రూపాలకి నక్షత్రం గుర్తు వాడడం సంప్రదాయం ). వాక్యంలో ఉన్న ఒక రకం పదం కొన్ని రకాల పదాలతోనే కలుస్తుంది. మరికొన్ని రకాల పదాలు దానికి చేరిస్తే ఆ వాక్యం వింత అర్థాన్ని ఇవ్వడమో లేక అది అంగీకార యోగ్యం కాకపోవడమో జరుగుతుంది. ఇది యోగ్యతా సంబంధం. కొన్ని క్రియలు మనుష్య వాచకాలనే లేక ప్రాణి వాచకాలనే కర్తలుగా అపేక్షిస్తాయి. 'కమల ఆలోచించింది.' కానీ *రాయి ఆలోచించింది. *రాయి మాట్లాడింది, *పులి మాట్లాడింది (ఇటువంటివి కథలలో మాత్రమే సాధ్యం: సామాన్య వ్యవహారంలో కాదు). అన్వయం (Agreement/concord) అనేది యోగ్యత కిందికే వస్తుంది. తెలుగులో సమాపకక్రియ కర్తతో పురుష, లింగ వచనాలలో అన్వయం కలిగి ఉండాలి : నేను రాస్తున్నాను, విజయ బడికి వెళుతోంది. కొన్ని అప్రాణి వాచకాలని ఒకే సముదాయంగా గ్రహించినపుడు బహువచనానికి బదులు ఏకవచనం రావచ్చు. ఆయనకి పంద ఎకరాలు ఉండి ఉన్నాయి, నాదగ్గర వెయ్యి రూపాయలు ఉంది/ఉన్నాయి; ఆయనకి పది ఇళ్లు ఉన్నాయి (*ఉంది), ఒక వాక్యంలో ఒక పదం స్థానంలో ఇంకొక పదాన్ని కానీ, పదాలని కానీ పెట్టడం సాధ్యమైతే అటువంటి పదాల పరస్పర సంబంధాన్ని ఆదేశ సంబంధం అంటారు. ఇలా చేసినప్పుడు వాక్యం అర్థం మారుతుంది. అయినా ఒక పదం స్థానంలో ఇంకొక పదాన్ని పెట్టినపుడు ఏర్పడే కొత్త వాక్యం భాషలో అంగీకార యోగ్యం (సాధువు) అవుతుందా ? కాదా ? అన్నదే ఇక్కడ మనం చూడవలసింది. ఆ-పెద్దది. పై వాక్యంలో గీత స్థానంలో ఇల్లు, చెట్టు, బల్ల, కిటికీ, రాయి, పని మొదలైనవి రావచ్చు. కానీ చూశాడు, కొత్త, తిని, తొందరగా మొదలైన పదాలు రావు. కాబట్టి ఇల్లు, చెట్టు మొదలైన పదాలు ఆదేశ సంబంధం కలవి అని దీనివల్ల తెలుస్తుంది. ఒక భాషలో పదాలని భాషా భాగాలు (Parts of Speech) గా విభజించడానికి ఇటువంటి పరీక్ష పనికి వస్తుంది. ఇటువంటి పరీక్ష వల్లనే పై పదాలని నామవాచకాలు అని వైయాకరణులు వ్యవహరించారు. ఆదేశ సంబంధంలో ఒక పదం స్థానంలో రెండు-లేక అంతకన్నా ఎక్కువ పదాల సముదాయం రావచ్చు. 'పండు రుచిగా ఉంది' అనే వాక్యంలో 'పండు'కు బదులు, 'మామిడి పండు', 'పెద్ద మామిడి పండు', 'చాలా పెద్దమామిడి పండు' అనే పదబంధాలు వాడవచ్చు. ఇటువంటి పదబంధాలకు అవయవాలుగా ఉన్న పదాలని సన్నిహితావయవాలు (Immediate Constituents) అంటారు.

చోమ్స్కీ ప్రతిపాదించిన పరివర్తన వ్యాకరణం ముఖ్యంగా ఒక భాషలో వాక్యనిర్మాణాన్ని, ఒక రకం వాక్యానికి మరొక రకం వాక్యానికి గల పరస్పర సంబంధాన్ని వర్ణించడానికి ఉద్దిష్టమైంది. కానీ, పరిశోధన సాగినకొద్దీ వర్ణ నిర్మాణం, చారిత్రక వ్యాకరణం మొదలైన ఇతర వ్యాకరణాంగాలకికూడా

ఈ ప్రక్రియా పద్ధతులు అనువర్తించబడితే వాటికి కూడా ఇతోఽధిక శాస్త్రీయతా, నైశిత్యం చేకూర తాయని స్పష్టమైంది. పైగా అంతవరకూ నిర్లక్ష్యం చేయబడిన అర్థనిర్మాణానికి ఈ ప్రక్రియలో ప్రాముఖ్యం లభించింది. ఈ విధంగా పరివర్తన వ్యాకరణం మొత్తం భాషా నిర్మాణాన్నీ, భాషా స్వరూప స్వభావాలనీ సూక్ష్మదృష్టితో గ్రహించ డానికి ఉపకరిస్తుందని తెలియడంతో ఈ ప్రక్రియ భాషాశాస్త్రాధ్యయనంలో ఒక కొత్త సంచలనాన్ని రేకెత్తించింది. పరివర్తనవైయాకరణుల దృష్టిలో వ్యాకరణం మనం ఇంతకుముందు విన్న లేక చదివిన వాక్యాలకి మాత్రమే పరిమితం కాకూడదు. అది భాషలో సాధ్యమైన వాక్యాలన్నింటినీ సాధించగలిగి ఉండాలి. అంతేకాక అది అసాధు వాక్యాలని సాధించ కూడదు. ఇది పరివర్తన వ్యాకరణం లక్ష్యం. పరి వర్తన వ్యాకరణానికి మూడు అంగాలు ఉంటాయి. అవి 1. వాక్య నిర్మాణం, 2. అర్థ నిర్మాణం, 3. వర్ణ నిర్మాణం అనేవి. వాక్య నిర్మాణంలో పదబంధ నిర్మాణం (Phrase Structure), పరివర్తన సూత్రాలు (Transformational rules) అనే రెండు విభాగాలు ఉన్నాయి.

పరివర్తన వ్యాకరణం అర్థంలో ఇంచుమించు తుల్యమైన వాక్యాల పరస్పర సంబంధాన్ని సూత్ర రూపంలో స్పష్టీకరిస్తుంది. ప్రతివాక్యానికీ అంతరంగ నిర్మాణం, బహిరంగ నిర్మాణం అని రెండు రూపా లుంటాయి. అంతరంగ నిర్మాణం వాక్యం అర్థానికి సన్నిహితం. ఒకే అర్థం కలిగిన బహిరంగ నిర్మాణాలు భిన్నంగా గల వాక్యాలకి ఒకే అంతరంగ నిర్మాణం ఉంటుంది. ఉదాహరణకి 'విశాలాక్షికి మొగుడి మీద కోపంగా ఉంది', - 'విశాలాక్షికి మొగుడి మీద కోపం వచ్చింది', 'నేను ఆకలిగా ఉన్నాను - 'నాకు ఆకలి వేస్తోంది', ఇటువంటి వాక్యాల జంటలకు అంతరంగ నిర్మాణం ఒకటిగానే ఉంటుంది. బహిరంగ నిర్మాణంలో లోపించిన పదాలు అంతరంగ నిర్మాణంలో ఉన్నాయని పరివర్తన వ్యాకరణం ప్రతిపాదిస్తుంది. 'రామయ్య పెళ్లాన్ని కొట్టాడు' అనే వాక్యానికి అంతరంగ నిర్మాణం *రామయ్య రామయ్య పెళ్లాన్ని కొట్టాడు (ఈ వాక్యంలో రామయ్య అనే పదాలు రెండూ ఒకే వ్యక్తిని సూచిస్తాయి) అనేది. ఇందులో రెండోసారి వచ్చిన రామయ్య అనే పదం లోపించింది. అంత రంగ నిర్మాణంలో అర్థసందిగ్ధత ఉండదు. కానీ, బహిరంగ నిర్మాణంలో అర్థ సందిగ్ధతకి అవకాశం ఉంది. 'మేక తినడానికి సిద్ధంగా ఉంది' అనే వాక్యా నికి రెండు అర్థాలు ఉన్నాయనీ, 'మేక పులి తిన డానికి సిద్ధంగా ఉంది', 'మేక గడ్డి తినడానికి సిద్ధంగా ఉంది' అనే వాక్యాలవల్ల తెలుస్తుంది. చివరి రెండు వాక్యాలూ రెండు భిన్న అంతరంగ నిర్మా ణాలు. వీటినుంచి అర్థసందిగ్ధత గల బహిరంగ రూపంగా మొదట వాక్యం ఏర్పడింది.

2. 5. భాష-సంఘం :

ప్రజల వ్యవహారంలో ఉన్న ఏ భాష అయినా కాలక్రమేణా మార్పు చెందుతూ ఉంటుంది. ఒకే కాలానికి చెందిన భాషలో కూడా ప్రాంత భేదాలవల్లా, కులం, సాంఘిక స్థాయి మొదలైన భేదాలవల్లా వ్యవ హారంలో భేదాలు ఉంటాయి. ఇటువంటి భేదాలని మాండలిక భేదాలు అంటారు. మాండలికాల మధ్య భేదం స్వల్పంగానే ఉంటుంది. కాబట్టి భిన్న మాండ లికాలు మాట్లాడే వ్యక్తుల మధ్య వ్యవహారానికి నిరోధం ఉండదు. ఒక భాషలో ఇలా ఏర్పడిన మాండలికాలే కాలక్రమాన ప్రత్యేక భాషలుగా విడి పోతాయి. ప్రాంతీయ మాండలికాలు రాకపోకలకు అవరోధం కలిగించే నదులు పర్వతాలు, మొదలైన వాటివల్ల ఏర్పడతాయి. సంఘంలో విద్య, ధనం మొదలైన వాటివల్ల ఉన్నత స్థాయిలో ఉన్నవారి మాండలికం వ్యవహారంలోనూ, వ్రాతలోనూ ప్రమాణ మాండలికంగా ఏర్పడుతుంది. సాధారణంగా ఒక

భాషా ప్రాంతానికి చివరి భాగాలలో ఉన్న మాండలికాలు ప్రాచీన రూపాలని నిలుపుకొంటూ ఉంటాయి.

## 3. చారిత్రక వ్యాకరణ సిద్ధాంతాలు :

3.1. భాషా కుటుంబాలు :

ప్రపంచంలో మూడువేల భాషలకి పైన ఉన్నాయని అంచనా. కొన్ని భాషల విషయంలో అవి ప్రత్యేక భాషలా? లేక మరొక భాష మాండలికాలా? అనే విషయం తేల్చడం సాధ్యంకాదు కాబట్టి భాషల సంఖ్య ఇంత అని నిర్దుష్టంగా చెప్పడం కష్టమైన పని. మానవులు మాట్లాడే ప్రతిభాషా ఇంకొక భాషకన్నా విలక్షణమైనదే అయినా ప్రపంచంలో అన్ని భాషలూ ఏక భాషనుంచి ఉత్పన్నమయ్యాయని నిరూపించి చెప్పలేం. కాని, ప్రపంచ భాషలను కొన్ని సముదాయాలుగా విభజించవచ్చు. ఈ విభజనకు ఉపయోగించే పద్ధతులు రెండు ఉన్నాయి. అవి 1. లక్షణాత్మక విభజన, 2. జన్మాత్మక విభజన. లక్షణాత్మక విభజనలో భాషాలక్షణాలని అనుసరించి అవి కొన్ని సముదాయాలుగా విభజించబడతాయి. ఇలా ఒక సముదాయంలో చేర్చబడ్డ భాషలు జన్మ సంబంధం కలవి కావచ్చు, లేనివి కావచ్చు. 1818లో ఆగస్ట్ వోన్ ష్లెగల్ ప్రపంచ భాషలన్నింటినీ లక్షణాలను అనుసరించి మూడు సముదాయాలుగా విభజించారు. అవి 1. ప్రత్యయరహిత భాషలు (చైనీస్, అన్నమీస్ వంటివి). 2. వికరణాత్మక భాషలు (టర్కిష్, స్వాహిలీ, తెలుగు వంటివి; వీటిలో ప్రకృతి ప్రత్యయాలు శిథిలంగా ఉండి వాటి విభాగం స్పష్టంగా కనబడుతూ ఉంటుంది) 3. సంశ్లేషణాత్మక భాషలు (లాటిన్, గ్రీక్, సంస్కృతం వంటివి; వీటిలో ప్రకృతి ప్రత్యయాలు సంధి బాహుళ్యం వల్ల కలిసిపోయి వాటిని విభజించడం కష్టసాధ్యం అవుతుంది. ఒకే ప్రత్యయమే లింగ విభక్తి వచనాలు మూడింటినీ సూచించడం వీటిలో తరచుగా ఉంటుంది). తరవాతకాలంలో లాటిన్, గ్రీక్, సంస్కృతాల కన్నా ఇంకా క్లిష్టతరమైన నిర్మాణంగల కొన్ని అమెరికన్ ఇండియన్ భాషలు వెలుగులోకి వచ్చాయి. ఇటువంటి వాటిని కొందరు 'అతి సంశ్లేషణాత్మక భాషలు' అన్నారు.

రెండు లేక అంతకన్నా ఎక్కువ భాషలలో వర్ణార్థ సాదృశ్యంగల శబ్దాలు ఎక్కువగా ఉండడానికి ముఖ్యకారణం జన్మసంబంధం. జన్మ సంబంధం వల్ల వర్ణాలలోనూ, అర్థంలోనూ సాదృశ్యం ఉన్న భిన్న భాషా శబ్దాలను సజాతి శబ్దాలు(Cognates) అంటారు. ( ఉదా : తెలుగు- చెవి; తమిళం- చెవి; కన్నడం- కివి మొ॥) ఇటువంటి సాదృశ్యం జన్మ సంబంధం వల్లనేకాక ఎరువు తెచ్చుకోవడం, ధ్వన్యనుకరణ, యాదృచ్ఛికత- వీటివల్లకూడా భాషల మధ్య కన్పించవచ్చు. ఈ కారణాలకు అవకాశం లేనప్పుడు సాదృశ్యం వందలూ, వేల కొలదీ పదాలలో కనబడుతూ ఉంటే అది భాషల జన్మ సంబంధం వల్లనే ఏర్పడిందని నిర్ణయించవచ్చు. ముఖ్యంగా సాదృశ్యం సర్వనామాలు, సంఖ్యావాచకాలు, దైనందిన వ్యాపార బోధకాలైన క్రియలువంటి వాటిలోనూ, ప్రత్యయాలలోనూ ఉన్నప్పుడు ఆ భాషలు జన్మ సంబంధం కలవి అని నిర్ణయించడం సులభం. జన్మ సంబంధం గల భాషలు ప్రాచీన కాలంలో ఒకే భాషగా ఉంటాయి. అటువంటి భాషని మూల భాష అంటారు. ఒక మూల భాషనుంచి పుట్టిన భాషలని దుహితృ భాషలు; లేక సోదర భాషలు అంటారు. సోదరభాష లన్నిటినీ కలిపి భాషాకుటుంబం అంటారు. ప్రపంచంలో ఎన్ని భాషా కుటుంబాలు ఉన్నాయనేది జటిలమైన ప్రశ్న. ప్రసిద్ధ భాషల విషయంలో సమస్యలేదు గానీ, చారిత్రకాధారాలు లేని కొన్ని ఆఫ్రికా భాషలు, అమెరికన్ ఇండియన్ భాషలలో భాషాకుటుంబ నిర్ణయం చెయ్యడంలో పండితులకు భేదాభిప్రాయాలు ఉన్నాయి. ప్రపంచంలో ఎక్కువమంది జనాభా మాట్లాడే భాషలు సంస్కృతం, గ్రీక్, లాటిన్, ఇంగ్లీషు మొదలైన ఇండో యూరోపి

యన్ భాషలు. తెలుగు, తమిళం,మలయాళం,కన్నడం గోండీ మొదలైన భాషలు ద్రావిడ భాషాకుటుంబానికి చెందినవి. మన దేశంలో ఈ రెండు భాషా కుటుంబాలే కాక ముండా భాషా కుటుంబం (సంతాలీ, సవర మొదలైనవి), టిబెటో బర్మన్ భాషా కుటుంబం (బోరో, ఖాసీ మొ॥) ఫ్రాన్స్‌లోని బాస్క్, కాశ్మీరులోని బురుషస్కి మొదలైన కొన్ని భాషలకు సోదర భాషలు లేవు. మొత్తం ప్రపంచంలో 50, 60 భాషా కుటుంబాలకు పైగా ఉన్నాయి.

3. 2. తులన పద్ధతి :

భాషా శాస్త్రజ్ఞులు మొట్టమొదట సంస్కృతం, గ్రీక్, లాటిన్ మొదలైన ఇండో - యూరపియన్ భాషా కుటుంబానికి చెందిన భాషలని జన్మ సంబంధం కలవిగా గుర్తించారు. సర్ విలియమ్ జోన్స్‌తో ప్రారంభించి ఇండో- యూరపియన్ భాషల తులనాత్మక చరిత్ర పరిశోధన ఎలా వృద్ధి చెందిందో పైన 1.3 లో చూశాం. ధ్వని పరిణామం అపవాద రహితమని పండితులకు తెలిశాక తులన పద్ధతీ, దాని ద్వారా మూల భాషని పునర్నిర్మించడమూ వ్యాప్తిలోకి వచ్చాయి. సజాతి శబ్దాలని ఏరి కూర్చడం తులన పద్ధతిలో మొదటి మెట్టు. సజాతి శబ్దాలు ఆధారంగా ఒక్కొక్క భాషలో జరిగిన ధ్వని పరిణామాలని వివరించే ధ్వని సూత్రాలు ఏర్పరుస్తారు. మూల ద్రావిడ భాషలో * ణకార * ళకారాలు తెలుగులో న, ల లు గా మారతాయి. ఇది ఒక ధ్వని సూత్రం. ఈ సూత్రానికి తమిళం- కణ్; తెలుగు- కన్ను; తమిళం- పణి: తెలుగు - పని: తమిళం- కళ్: తెలుగు- కల్లు: తమిళం- ఉళ్లి; తెలుగు- ఉల్లి మొదలైన ఉదాహరణలు అనేకం ఉన్నాయి. (తెలుగులో వచ్చిన ఈ మార్పు తమిళంలో లేదు కాబట్టి పైన తమిళ రూపాలు మూల భాషా రూపాలకి ప్రతీకలుగా ఇవ్వబడ్డాయి). పై ధ్వని సూత్రంలో ధ్వనులు అన్ని పరిసరాలలోనూ ఒకే రకంగా మారాయి. కొన్ని మూల భాషా ధ్వనులు ఒక పరిసరంలో మాత్రమే మారి మిగిలిన పరిసరాలలో మారకుండా ఉండవచ్చు. మూల ద్రావిడ * కకారం తెలుగుళ అగ్రాచ్చుల ముందు చకారంగా మారింది (తమిళం- కిళి; తెలుగు- చిలుక; తమిళం-కెటు: తెలుగు-చెడు). కాని మిగిలిన అచ్చుల ముందు కకారంగానే మిగిలింది. (తమిళం- కాల్; తెలుగు- కాలు). కొన్ని సందర్భాలలో ఒక మూల భాషాధ్వని భిన్న పరిసరాలలో రెండు లేక అంతకన్నా ఎక్కువ ధ్వనులుగా మారిపోవచ్చు. తెలుగులో మూల భాషలో *ళకారం అచ్చులమధ్య డకారంగానూ, వర్ణ వ్యత్యయంలో పదాది హల్లు తరువాత రేఫగానూ మారింది. తమిళం- ఏళ్; తెలుగు- ఏడు; తమిళం- పొళుతు ; తెలుగు- ప్రొద్దు). ధ్వని సూత్రానికి అపవాదాలుగా కనబడే పదాలు అది ప్రవర్తించిన తరవాత మరొక భాషనుండి ఎరువు తెచ్చుకొన్నవి కాని, ధ్వన్యనుకరణ శబ్దాలుకాని, ధ్వనిసూత్రం ప్రవర్తించిన తరవాత భాషలో పుట్టినవి కాని అయి ఉంటాయి. తెలుగులో మూల భాషా * కకారం చకారంగా మారని కినియు, కెడయు వంటి పదాలు కన్నడం నుంచి ఎరువు తెచ్చుకొన్నవి. కిలకిల, కిరుకిర్రు, కీచు కీచు ఇత్యాదులు ధ్వన్యనుకరణ శబ్దాలు. చారిత్రకాధారాలలో దొరికే ప్రాచీన రూపాలకన్నా ప్రాచీనతరమైన రూపాలను తులనపద్ధతివల్ల తెలుసుకోవచ్చునని పై చర్చ నిరూపిస్తుంది. ఇప్పటి తెలుగు 'పాత'కు ఇంకా ప్రాచీనతర రూపం 'ప్రాఁత' అని ప్రాచీన గ్రంథాలవల్ల తెలుస్తుంది. 'ప్రాఁత'కు ఇంకా ప్రాచీనతర రూపం 'పళంత్త(య్)' అనీ, ముఖ్యంగా ఇందులో రేప * ళ నుంచి వచ్చిందనీ తులన పద్ధతి వల్లనే తెలుస్తుంది.

ధ్వని సూత్రాలు ఆధారంగా పదంలో ఒక్కొక్క ధ్వనినీ పునర్నిర్మించడం వల్ల పూర్తి పదాలనీ, ప్రత్యయాలనీ కూడా పునర్నిర్మించవచ్చు. ఇలా మూల భాషా వ్యవహర్తల సంస్కృతిని గురించి

కొంత ఊహించవచ్చు. మూల ఇండో-యూరపియన్ భాషకు 'మంచు' అనే అర్థం ఇచ్చే పదం పునర్ని ర్మించవచ్చు. విల్లు-అమ్ములని సూచించే పదాలు ఇంచు మించు అన్ని ద్రావిడ భాషల లోనూ సజాతి పదాలుగా ఉన్నాయి కాబట్టి మూల ద్రావిడ భాషా వ్యవహర్తలు వీటిని ఉపయోగించే వారని చెప్పవచ్చు. * నూఱ్ '100' మూల ద్రావిడంలో ఉంది. కాని 1000 ని సూచించే దేశ్యపదం తెలుగులో మాత్రమే ఉంది. కాబట్టి మూల భాషా వ్యవహర్తలకు 1000 కానీ, అంతకుపై అంకెలుకాని లెక్కపెట్టడం తెలియదని మనం ఊహించవచ్చు.

3.3. ఆంతరంగిక పునర్నిర్మాణ పద్ధతి:

ఆంతరంగిక పునర్నిర్మాణం ఒక నిర్ణీత కాలానికి చెందిన భాషలోని (ఉదా॥ ఇప్పటి తెలుగు, లేక నన్నయ కాలపు తెలుగు) సంధి పరివర్తనాలు ఆధారంగా ఆ భాష ప్రాచీన స్థితిని పునర్నిర్మించడానికి ఉపయోగిస్తుంది. కాబట్టి ఇది సోదర భాషలున్న భాషల విషయంలో తులన పద్ధతికి సాహాయ్యకారిగా ఉంటుంది; సోదర భాషలు లేని బాస్క్ వంటి వంటరి భాషల విషయంలో వాటి ప్రాచీన చరిత్ర తెలుసుకొనేందుకు ఇదే ఏకైక ఆధారం.

ఆంతరంగిక పునర్నిర్మాణం ఆధునిక కాలంలో మొదట ఉపయోగించినవారు 19 వ శతాబ్దానికి చెందిన హెర్మన్ గ్రాస్‌మన్. ఈయన సంస్కృతంలోనూ, గ్రీక్‌లోనూ (ముఖ్యంగా క్రియలలో) రెండు మహాప్రాణాలు పక్కపక్కన ఉండవు అనే విషయం కనుగొన్నారు. సంస్కృతంలో భూతానద్యతన పరోక్షార్థక (లిట్) క్రియలతో ధాతువు ప్రథమ హల్లూ, అచ్చూ ద్విరుక్తమవుతాయి. పపాత 'పడ్డాడు', దదర్శ 'చూశాడు', మొ॥ కాని మహాప్రాణం ఉన్న ధాతువులకు ద్విరుక్తి వచ్చినపుడు మహాప్రాణం స్థానంలో దానికి సంబంధించిన అల్పప్రాణం ఉంటుంది; భూ నుంచి బభూవ 'అయింది', ధృ నుంచి దధార 'ధరించాడు', మొ॥. ద్విరుక్తి నియమాన్ననుసరించి వీటి పూర్వరూపాలు *భభూవ, *ధధార అయి ఉండాలనీ, రెండు మహాప్రాణాలలో మొదటి దాని మహాప్రాణత్వం లోపించిందనీ మనం ఊహించవచ్చు.

ఒక భాషలో ఒక పదంకానీ, అర్థంకానీ ఒక పరిసరంలో ఒక వర్ణంతోనూ, మరొక పరిసరంలో మరొక వర్ణంతోనూ ఉన్నప్పుడు అటువంటి పదాన్ని లేక అర్థకాన్ని ఈ మార్పులేని మరొక పదం లేక అర్థకంతో పోల్చి చూచినపుడు మొదటి దాంట్లోని రెండు వర్ణాలలో ఏది ప్రాచీనమో మనకు తెలుస్తుంది. ఉదాహరణకి సంస్కృతంలో మరుత్, శరత్, సమిత్ అనే మూడు శబ్దాలు తీసుకుందాం. వీటికి ప్రథమైక వచనంలోనూ, హల్లుల ముందూ(మరుద్భిః, శరద్భిః, సమిద్భిః) భేదం లేకపోయినా అజాది ప్రత్యయాల ముందు భేదం ఉంది.

| ప్ర. ఏ. | ప్ర.ద్వి. | ప్ర.బ. | తృ.ప. |
|---|---|---|---|
| మరుత్ | మరుతౌ | మరుతః | మరుతా |
| శరత్ | శరదౌ | శరదః | శరదా |
| సమిత్ | సమిధౌ | సమిధః | సమిధా |

పై ఉదాహరణలలో మరుత్ శబ్దంలో తకారం ప్రథమైక వచనంలోనూ (అంటే పదాంతంలో),అచ్చు ముందూకూడా తకారంగానే ఉంది (ఇది మరుద్భిఃలో భ నాదహల్లు కాబట్టి దానిముందు దకారంగా మారింది; ఈ మార్పు ప్రస్తుత చర్చకు అనవసరం), కాబట్టి ఇందులో తకారమే ప్రాచీనమని చెప్పవచ్చు. ఇక అచ్చులముందు శరద్, సమిధ్ అనే రూపాలలో ద, ధలకు బదులు ప్రథమైక వచనంలో తకారం ఉంది. వీటిలో తకారమే ప్రాచీనమా? లేక ద, ధలు ప్రాచీనాలా? అనేది సమస్య. తకారం ప్రాచీనం అనుకొని ఇది అచ్చులముందు కొన్ని శబ్దాలలో మారకుండా ఉంటుంది, మరికొన్నింటిలో దకారమవుతుంది,

మరికొన్నింటిలో ధ కారంగా మారుతుంది అనే అంటే ఇది ధ్వని పరిణామ స్వభావానికి విరుద్ధం. ఒక భాషలో ఒక ప్రాచీన ధ్వని అన్ని మాటలలోనూ ఒక రకంగానే మారుతుంది; లేక భిన్నవర్ణ పరిసరాలలో భిన్న ధ్వనులుగా మారుతుంది. అనేది సార్వకాలిక సత్యం. పై ప్రతిపాదన దీనికి విరుద్ధం కాబట్టి శరత్,/శరద్‌లో దకారం ప్రాచీనమనీ, సమిత్- సమిధ్-లో ధకారం ప్రాచీనమనీ చెప్పడం సమంజసం. పదాంతంలో మహాప్రాణాలు అల్పప్రాణాలుగానూ, నాదస్పర్శాలు శ్వాసస్పర్శాలుగాను మారడం సంస్కృతంలో నియమం కాబట్టి పై వాటిలో ద, ధలు పదాంతంలో తగా మారాయని నిర్ణయించవచ్చు. ఇది ఆంతరంగిక పునర్నిర్మాణానికి ఒక చక్కని ఉదాహరణ.

ఈ పద్ధతి వలన ఇప్పటి భాషలో లోపించిన వర్ణాలను కూడా పునర్నిర్మించడానికి అవకాశం ఉంది. ప్రాచీనాంధ్రంలో విధ్యేక వచనంలో రా/రమ్ము, చెప్పు/ చెప్పుము లో లాగా ము వర్ణం వైభాషికంగా ఉండేది. ఇప్పటి భాషలో వీటిలో ము లేదు గానీ విధి రూపం తర్వాత 'అను' ధాతురూపం ఏదైనా వస్తే ఈ మకారం కనబడుతుంది: రమ్మను, అడగమంటే, చెప్పమన్నారు. ఇలా మకారం అధికంగా రావడం భాషలో ఇతరత్రా లేదు కాబట్టి రమ్ము, అడుగుము, చెప్పుము అనే రూపాలను పునర్నిర్మించవచ్చు.

ఆంతరంగిక పునర్నిర్మాణం ఒక పదంలో వర్ణాలలో పరివర్తన ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. పరివర్తన లేనప్పుడు పునర్నిర్మాణం తులన పద్ధతి వలననే సాధ్యం. పైగా తులన పద్ధతి అనేక సోదర భాషల ఆధారంతో చేయబడేది కాబట్టి ఆంతరంగిక పునర్నిర్మాణం కన్నా తులన పద్ధతే ఎక్కువ శక్తిమంతమైనది.

(ఈవ్యాసానికి ప్రస్తుత వ్యాసకర్త యు.జి.సి. స్కీములో ఇటీవల పూర్తిచేసిన 'ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు' అనే గ్రంథం ఆధారంగా ఉపయుక్తమైంది.)

**కొన్ని ముఖ్యాధార గ్రంథాలు**


Bloomfield, Leonard 1933 *Language* - New York: Holt.

Gleason, H. A. 1961 *An Introduction to Descriptive Linguistics*. New York : Holt.

Hockett, Charles F. 1958 *A Course in Modern Linguistics*. New York : Macmillan

Jacobs, Roderick A. & Rosenbaum, Peters, 1968 *English Transformational Grammar*. Waltham : Blaisdell.

Lehmann, Winfred P. 1962 *Historical Linguistics : An Introduction*. New York : Holt

Robins, R. H. 1967 *A Short History of Linguistics*. London : Longmans.




# తెలుగు భాషా సాహిత్య పరిశోధనలు- పుట్టుపూర్వోత్తరాలు (ప్రాథమికదశ)

—హెచ్. ఎస్. బ్రహ్మానంద

**ఉపోద్ఘాతం :**

రచన విమర్శలతోపాటు 'పరిశోధన' (Research) ఒక సాహిత్య వ్యాసంగంగా ఈ శతాబ్దంలో స్థిరపడింది. 1940-45 ప్రాంతానికి స్పష్టంగా పరిశోధకు లనదగ్గ భాషా సాహిత్యవేత్తలు తెలుగు దేశంలో స్థిరపడ్డారు. ముందుగా గిడుగు, నడుమ చిలుకూరి నారాయణరావు, తరువాత కోరాడ రామకృష్ణయ్యగార్లు పరిశోధకాగ్రేసరులుగా గుర్తించదగ్గ వాళ్ళుగా కనిపిస్తారు. వీరు ప్రధానంగా భాషా రంగానికి చెందినవాళ్ళు; ఆనుషంగికంగా సాహిత్యం మీదా వీరు తమ దృష్టుల్ని ప్రసరించారు. విమర్శకులుగా కంటె సాహిత్య (వాఙ్మయ) పరిశోధకులుగా నిల్చిపోయినవారు మానవల్లి రామకృష్ణ కవి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరి వెంకట రమణయ్య, కొమర్రాజు లక్ష్మణరావు పంతులు, వేటూరి ప్రభాకర శాస్త్రి, గిడుగు సీతాపతి మొదలైనవారు. ఈ వ్యాసంలో వీరి పూర్వరంగాన్నీ, సమకాలీనరంగాన్నీ చర్చించి, అవి ఈనాటి భాషా సాహిత్య పరిశోధనలకు ఎలా ప్రాథమిక దశను సంతరించి పెట్టాయో చర్చించడం జరుగుతుంది.

**భాషా సాహిత్య పరిశోధనల తారతమ్యం**

స్పష్టంగా ఒక చారిత్రక కారణం వల్ల 19వ శతాబ్దం చివర్లో, 20వ శతాబ్దంలో ఈనాటి దాకా వాఙ్మయ పరిశోధకులు కొంతకాలం భాషా సాహిత్య పరిశోధకులుగా ఉండి (దీన్నే ప్రాథమిక దశ అని ఈ వ్యాసంలో చర్చిస్తున్నది) తరువాత భాషా పరిశోధకులుగా కొందరు, సాహిత్య పరిశోధకులుగా మరికొందరు విడిపోయారు. ఈ విడిపోవడానికి కావాల్సిన మౌలిక లక్షణా లున్న పరిశోధకులూ ఈ మొదటి దశలో కనిపిస్తారు. (చూ. బ్రహ్మానంద : 1981)

భాషా పరిశోధన రంగంలో గిడుగు నుంచి ఈనాటి మనదాకా ఒక స్పష్టమైన మార్గంలో ఎదుగుదల కనిపిస్తుంది. సాహిత్యరంగంలో ఇంకా వ్యూహాలు, మార్గాలు, పరిభాష, సేకరణ, విశ్లేషణ, ఫలితాల్ని అన్వయించడం - ఇవి ఇప్పుడిప్పుడే స్పష్టమైన రూపురేఖలు దిద్దుకొంటున్నాయి (చూ. వెల్చేరు నారాయణరావు: 1980 ; చేకూరి రామారావు: 1980).

**పుట్టుపూర్వోత్తరాలు: ఆరంభ (ప్రాథమిక) దశ:**

'పరిశోధన' అంటే 'విచారణ చేసి కొత్త విషయాల్ని (అవి సిద్ధాంతాలు కావడం-కాకపోవడం

వేరే విషయం) ప్రతిపాదించడం' అనే అర్థం వ్యాపించడాన్నే పరిశోధనకు ఆరంభంగా మనం ఈ వ్యాసంలో గుర్తిస్తున్నాం.

పరిశోధన సిద్ధాంత వ్యాస (Thesis) రూపంలో ఏదో విద్యాసంస్థకి సమర్పించడం, డిగ్రీలు పుచ్చుకోవడం వగైరా తెలుగులో 1929 లో మొదలైంది. చిలుకూరి నారాయణరావుగారిని 'డాక్టరుగారు' అని ఆ రోజుల్లో పిల్చేవారట. 1944 లో కె.వి.ఆర్. నరసింహం 'మాష్టారు' పిహెచ్.డి. డిగ్రీ పుచ్చుకొన్నారు. (చూ. బొడ్డుపల్లి పురుషోత్తం, 1978) ఇంకా వెనక్కివెళ్తే కొత్త ప్రతిపాదన చేసిన మొదటి సిద్ధాంత గ్రంథంగా శ్రీ పి. టి. శ్రీనివాసాచార్యులు (1912) రాసిన 'Life or death - A Plea for Vernaculars' ని గుర్తించవచ్చు. అప్పటి నుంచి (అంతకు ముందు కూడా వచ్చిన గ్రంథాల్లో, వ్యాసాల్లో పరిశోధన వాసనలు లేకపోలేదు) దాదాపు 3 దశాబ్దాలపాటు (1945 ప్రాంతాలదాకా) వచ్చిన గ్రంథ, వ్యాసాదిరూపమైన పరిశోధన వాఙ్మయాన్ని ప్రాథమిక దశగా ఇక్కడ గుర్తిస్తున్నాం.

**ప్రాథమిక దశకు ముందు :**

ఈనాటి మనలాగా కాకుండా యూనివర్సిటీలు, డిగ్రీలు లేని ఆ రోజుల్లో చేసిన కృషే నిజానికి చాలా బరువైంది. 'రాశి' విషయంగానూ విస్తారమైంది. ఆనాటి దేశీయ పండితులు ఆంగ్ల విద్యా వాసనలతో 'పులకరించి' ఆ నూత్న భావపరిష్వంగంలో మొదలుపెట్టిన రచనలన్నింటిలోనూ పరిశోధక 'బుద్ధి' తొంగి చూస్తూ వుంటుంది. తాత్త్వికంగా చూస్తే ఇది పాశ్చాత్య విజ్ఞాన వాసనలతో సంధించుకొన్న సాంప్రదాయక ఆలోచనల 'కలగూరగంప' దశ. దీనికి ప్రధాన లక్షణం చరిత్రను తవ్వటం.1* ప్రాచీన భారతీయులు 'చరిత్ర' రాసి పెట్టలేదు. పురాణాలు రాసుకున్నారు. అవి పుక్కిటి కథలు. పాశ్చాత్యులే చారిత్రక దృష్టి వున్న మేధావులు. అలాంటి చారిత్రక దృక్పథం వున్న చదువు కావాలని భారతీయులు 19 వ శ. తొలి రోజుల్లోనే ఆశించారు (చూ. కొత్తపల్లి వీరభద్రరావు; 1960; 236). బేకన్ విద్యా సంప్రదాయంతో కూడిన ప్రాథమిక విజ్ఞానం, చరిత్ర, తోడుగా 'అతుకుపడని' కాల్పనిక వాదపూరితమైన ఆంగ్ల సాహిత్య నేపథ్యంతో- ఏర్పడ్డ ఒక అన్వేషణా 'తృష్ణ' 1829 ప్రాంతానికే భారతీయుల్లో-తెలుగువారిలో-చోటు చేసుకొంది. భాషా సాహిత్యాల మీద సాంప్రదాయిక-మతసాంస్కృతిక విశ్వాసాల(beliefs)తో కూడిన మొండివైఖరులు(దీన్నే ఆ రోజుల్లో ఈ రోజుల్లో చాలా మంది సంప్రదాయ పరిరక్షణమంటారు) క్షీణించడంకూడా మొదలుపెట్టాయి. భారతీయసాహిత్యం-సంస్కృతి-సంస్కృతం చుట్టూ ముడిపడింది; అది "దివ్య" మూలాలు కల్గింది: ప్రపంచ భాషాసారస్వతాలన్నీ సంస్కృతంలో నుంచే పుట్టాయని అనుకొంటున్న ఆ రోజుల్లో కావలి వెంకట రామస్వామి ఇలా రాయగలిగాడంటే అప్పటికే తెలుగువారిలో పరిశోధన బుద్ధి ఏర్పడ్డదనే అర్థం:

"Although Sanskrit is a dead language ......"

(ibid. Preface. P XII)

(వివరాలకు చూ.కొత్తపల్లి వీరభద్రరావు 1960:167)

1786 ప్రాంతానికే విలియం జోన్స్ ఇండో యూరోపియన్ భాషలతో సంస్కృతానికున్న సగోత్ర సంబంధాల్నిగూర్చి చర్చించడం మొదలుపెట్టాడు. గ్రీకు, లాటిన్ భాషల్లాగానే సంస్కృతంకూడా మృత భాషేనన్న నూత్న శాస్త్రీయాభిప్రాయం ఒకటి పండి

---

1* గ్రీకు చరిత్రకారుడు హెరిడోటస్, గ్రీకుల నిత్య అన్వేషణా తత్పరతను 'historieri' అని పిలిచాడు - ధాత్వర్థం 'researches' (చూ. Jacques Barzun and Henry Graff (1970 : 48)

తుల్ని ఆకర్షించడం మొదలుపెట్టిన రోజులవి. మాక్స్ ముల్లర్, ఎల్లిస్, కాంప్‌బెల్ మొదలైనవారు దక్షిణ భారతదేశంలోని భాషల్ని ఔత్తరాహభాషలకన్నా భిన్నమని గుర్తిస్తూ వచ్చారు. 1832 ప్రాంతానికే తెలుగులో 'జర్నలిజం' మొదలైంది. 1838 ప్రాంతంలోనే ఏనుగుల వీరాస్వామిగారు 'కాశీయాత్రచరిత్ర'రాశారు. మొదటిసారిగా ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతాల సంఘర్షణ మనకి ఆ రచనలో కన్పిస్తుంది. ముఖ్యంగా మత, ఖగోళ, విజ్ఞాన భాషా సంబంధి పరిశీలన ఎంతో ఆసక్తిదాయకంగా చేయబడ్డ ఆ రచనలో పరిశోధనా వుంది. 1846 లో కోల శేషాచలకవి తానుచేసిన 'నీల గిరి యాత్ర'ను పుస్తకంగా ప్రచురించారు. ఇందులోనే మొదటిసారిగా తోడా ప్రజల జీవితాన్ని గురించి (తెలుగులో) రాయడం జరిగింది.

19 వ శతాబ్ది పూర్వ భాగంలో మనం గుర్తించాల్సిన పరిశోధకాగ్రేసరుడు C. P. బ్రౌన్ (1798-1884); ఆయన మొదలుపెట్టిన గ్రంథ పరిష్కరణ మార్గం (Textual Criticism) విమర్శగా కన్నా పరిశోధనగానే గుర్తించడం బాగుంటుంది. తెలుగు వాఙ్మయ రాసిని పెంచిన సాహితీ విమర్శకులందరూ మొదలు పెట్టడం పరిష్కర్తలుగానే. తేవ పెరుమాళ్ళయ్య లాంటి ఎంతో మంది దేశీయ పండితులు ఆయన మార్గదర్శకత్వంలో పుస్తక పరిష్కరణను ఆకళించుకొన్నారు. 1827 లోనే వేమన పద్యాల్ని ఆయన పరిష్కరించారు. ఈనాడు చిన్న విషయాలుగా కనిపించినా పేరాగ్రాఫుల విభజన, కామా, ఫుల్‌స్టాప్ మొదలైన విరామ చిహ్నాలు, పేజీలకు నెంబర్లు వెయ్యటం - ఇవన్నీ ఆయన మొదలు పెట్టినవే. పీఠిక రాయడాన్నీ ఆయనే ప్రారంభించినట్టుంది (వసుచరిత్ర పీఠిక. 1844).

బ్రౌన్ కన్నా ముందే కావలి సోదరుల కాశ్రయ మిచ్చిన కాలిన్ మెకంజీ (1753-1821), వెంకట బొర్రయ్య సహాయంతో ప్రథమంగా శాసనాల్ని చదవడానికి ప్రయత్నించాడు. స్థానిక చరిత్రల్ని బొర్రయ్య ద్వారా సేకరించి వాటిని పదిల పరిచాడు. (అలాంటి వాటిలో ఒకటి 'అరవణ వ్యవహార తంత్రం' (ఇంగ్లీషు,తెలుగుల్లో) 1802 ప్రాంతానికే బొర్రయ్యగారు తయారు చేశారట. ఈ గ్రంథంలో మొదటిసారి దేశాలపేర్లు - భాషలు వీటి 'etymology' ని గురించి చర్చించడం కనిపిస్తుంది. చూ. *బ్రహ్మానంద : 1981*)

**రాబర్ట్ బిషప్ కాల్డ్‌వెల్-ద్రావిడ సిద్ధాంతం**

సి. పి. బ్రౌన్ దొర దగ్గరే ఎక్కడో ఓడలో 1837 లో సంస్కృతం నేర్చుకోవడానికి శ్రీకారం చుట్టిన2* కాల్డ్‌వెల్ 20 సంవత్సరాల్లోగానే ద్రావిడ భాషల స్వతంత్ర ప్రతిపత్తిని స్థాపిస్తూ సంస్కృత జన్యత్వాన్ని నిరసించాడు. ఆయన (1856) రాసిన 'A Comparative Grammar of the Dravidian...' అన్న గ్రంథం ద్వారా ఈ శతాబ్దిలోకి కూడా చొచ్చుకు రాగలిగాడు. ఆ గ్రంథం అటు భాషా సాహిత్యరంగాల్లో రెండిటా విస్తృతమైన ప్రభావం చూపింది. అలా కాల్డ్వెల్ కూడా తెలుగు మీద పరిశోధించిన వారిలో ప్రాతఃస్మరణీయుడే.

దేశీయ పండితులకి చారిత్రక సత్యాల్ని కనుక్కోవాలన్న తపనను, విచక్షణాబుద్ధిని, దృక్పథాన్నీ ప్రేరేపించిన ఘనత కాల్డ్వెల్ గ్రంథానిదే (*చూ. పై గ్రంథం పీఠిక. పు.* IX). భాషాపరంగా ద్రావిడ భాషల సగోత్రతను నిర్మాణాత్మకోపపత్తుల (Structural Proofs) నాధారంగా ప్రతిపాదిస్తూ పరోక్షంగా ఈ గ్రంథం రెండు అంశాల్ని ప్రతిపాదించింది.

1. సంస్కృతం ఏనాడూ నిత్యవ్యవహారంలో లేని కృతక భాష. వ్యవహారంలో వుండినవి ప్రాకృతాల్లాగానే ద్రావిడ భాషలు మాత్రమే.

---

2*ఈ విషయాన్ని గుర్తించి వెలికి లాగిన మహాశయుడు బంగోరె. (చూ. బ్రౌన్ లేఖలు 1977 ; 133)

2. దక్షిణ దేశభాషల్లో సంస్కృత సంబంధం ఏ మాత్రమూ లేని స్వతంత్రమూ, ప్రాచీనమూ అయిన భాష (Primitive language) తమిళం.

భాషారంగంలో 20 వ శతాబ్దంలో జరిగిన పరిశోధన (మన భాషకి సంబంధించినంతవరకు) పై రెండంశాలకూ సవరణ, వివరణ, పూరణలు మాత్రమే. కాని, ద్రావిడ సిద్ధాంతం తెలుగు భాషా సాహిత్య పరిశోధనలపైన వెంటనే చూపిన ప్రభావం తక్కువనే చెప్పాలి.* కాల్డ్వెల్ గ్రంథం ఆంగ్లంలో ఉండటం వల్లా; ఆ కాలపు పండితులలోని సంప్రదాయానుసరణ 'బుద్ధి'వల్లా బాలవ్యాకరణం(1856) అదే ప్రాంతంలో వచ్చి దేశీయ పండితుల్ని నన్నయ వైపే తీసుకువెళ్ళింది.

**సాహిత్య పరిశోధనలు :**

కవి జీవితాల్ని తవ్వి పట్టడం 1893 లోనే ప్రారంభమయినా (గురజాడ శ్రీరామమూర్తిగారు) వీరేశలింగం గారితోనే సాహితీ వ్యవసాయం విలువలు పలువలుగా వ్యాపించిపోయింది. ఆయన నవలాది స్రష్టగా కాకుండా విజ్ఞానం, ఖగోళం, భూగోళం, భౌతిక శాస్త్రాలమీద రాసిన రచనలన్నిట్లోనూ భావి పరిశోధనల మూల బీజాలున్నాయి, ఆయన ఒక 'యుగకర్త' అయ్యాడు. ఆ యుగంలో వచ్చిన పరిశోధనల్లో చెప్పుకోదగ్గవి కోలాచల శ్రీనివాసరావు (1854-1919) గారి 'ప్రపంచ నాటక చరిత్ర' (The Dramatic History of the World).

ఈ ఇరవై శతాబ్దంలో కూడా కవి జీవితాలపై పరిశోధన ఆగలేదు. అది ఎప్పటికీ ఆగదు కూడా. పుస్తక పరిష్కరణగా మొదలైన ఈ కృషి కవి జీవిత, సాహిత్య చరిత్రలు రాయడంలో పర్యవసించింది. ఈ సందర్భంగా మనం గుర్తించాల్సిన వ్యక్తులు దాదాపు 50 మంది దాకా ఉన్నారు. 'అముద్రిత గ్రంథ చింతామణి' లో వీరి సునిశితమైన ప్రతిభా పాటవాలు దర్శనమిస్తాయి. మానవల్లి రామకృష్ణ కవి (భరత నాట్యశాస్త్రాన్ని,కుమార సంభవాన్ని వెలికి తీయడం); కుందూరి ఈశ్వరదత్తు (శాసన పద్య మంజరి); మల్లంపల్లి సోమశేఖరశర్మ (ఆంధ్ర చారిత్రకాధారాల్ని వెలికితీయడం); రాళ్ళబండి సుబ్బారావు (కళింగ దేశ చరిత్రము); నేలటూరి వెంకటరమణయ్య (విజయ నగర చరిత్ర - చిలుకూరి నారాయణరావు గారూ ఈ పనిచేశారు); కొమర్రాజు లక్ష్మణరావు పంతులు (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలన ప్రయత్నం; భాషా సాహిత్య వ్యాసాలు); వేటూరి ప్రభాకరశాస్త్రి ('నాగబు' - అమరావతీ స్తూప పాఠాన్ని చదివిన వారు; అన్నమాచార్యుల సంకీర్తనల పరిష్కరణ, చాటుపద్యమణిమంజరి సంకలనం; బసవపురాణం పరిష్కరణ).

చిలుకూరి వీరభద్రరావు,చిల్లరిగె శ్రీనివాసరావు ప్రభృతులు ఆంధ్రుల చరిత్రని తవ్వటంలో పడ్డశ్రమ ప్రశంసనీయమైంది. (ఆంధ్రుల చరిత్రను గూర్చిన శ్రీనివాసరావుగారి పుస్తకానికి పీఠికరాస్తూ టేకుమళ్ళ కామేశ్వరరావు గారు తెలుగు-గోండీ ప్రజల సాన్నిహిత్యాన్ని గూర్చి చెప్పిన.విషయాలు ఎంతో అమూల్యమైనవి; సాహిత్యపరమైన విలువ కూడా వున్నవి).

కట్టమంచివారి (1914) 'కవిత్వ తత్త్వ విచారం' వచ్చేదాకా సాహిత్య 'విమర్శ' ఒక రూపాన్ని పొందలేదు. ఆ తర్వాత కూడా ఆ ప్రభావంతో పుట్టిన విమర్శలేదు కాని, పరిశోధన కన్నా భిన్నమైన విమర్శ (Subjectivity తో కూడింది) సృష్టించిన వారు కట్టమంచివారే. కవిత్వతత్త్వ విచారానికి ముందూ వెనకా కూడా పరిశోధన దృష్టి ఉన్న విమర్శ గ్రంథాలు చాలా వచ్చాయి. పాశ్చాత్య

---

* చూ. టి. యన్. మురుగేశన్ పిళ్ళై (1870-1930) 'ద్రావిడాంధ్ర భాషల పరస్పర సంబంధము', ఆ.సా.ప.ప. సం. 7 (1918).

ప్రాచ్య భావాల్ని సమన్వయించాలని ప్రయత్నించడం; దేశీయ ప్రమాణాల్ని అసహ్యించుకోవడం; పాశ్చాత్య భావ చట్రంలోకి దేశీయ కావ్యాల్ని ఇమడ్చడానికి ప్రయత్నించడం- ఈ గ్రంథాలలో కనిపించే అంశాలు.

పి. దక్షిణామూర్తి గారి 'పింగళి సూరన' (1892); కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారి 'వివేక చంద్రికా విమర్శనము' (1896); వెన్నేటి రామ చంద్రరావుగారి 'మను వసుచరిత్ర రచనావిమర్శ' (1899); పి. యస్. సుబ్రహ్మణ్య అయ్యర్ గారి 'నన్నయ భట్టారకుడు' (1910); వింజమూరి రంగా చార్యులుగారి 'పింగళి సూరనార్యుడు' (1914); బుర్రా శేషగిరిరావు గారి 'విమర్శాదర్శము'(1915); కురుగంటి సీతారామయ్యగారి 'అలంకార తత్త్వ విచారము' (1915), పురాణం సూరిశాస్త్రి గారి'విమ ర్శక పారిజాతము' (1926);కల్లూరి వేంకటనారాయణ రావుగారి'ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము'(1928) అక్కిరాజు ఉమాకాంతం గారి 'నేటికాలపు కవిత్వం' (1928), కోరాడ రామకృష్ణయ్య గారి 'ఆంధ్ర మహా భారత కవితా విశేషములు' (1929), బసవరాజు అప్పారావు గారి 'ఆంధ్ర కవిత్వ చరిత్ర' (1932) మొదలైన గ్రంథాల్లో మనకి తర్వాతి సంవత్సరాల్లో వచ్చిన సాహిత్య పరిశోధనలకు కావాల్సిన భావనా బీజాలున్నాయి. (చూ. సంపత్కుమారాచార్య 1978) సత్యనారాయణ గారి 'వేయి పడగలు' (1932) నవలగా కన్నా గొప్ప పరిశోధన గ్రంథంగా గుర్తిం చడం బాగుంటుంది.*3 ఆ నవలలోని పరిశోధనాంశాలే తర్వాతి సంవత్సరాల్లో ఆయన విమర్శ గ్రంథాలుగా వెలువరించింది. ఆయన కాశ్మీర, నేపాల నవలలన్నీ ఎంతో పరిశోధన తర్వాత రాసినవే. పరోక్షంగా కవిగా విశ్వనాథ చూపిన ప్రభావం కూడా ఆ తర్వాత విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధనలమీద వుంది.

1940 ప్రాంతాల దాకా విశ్వవిద్యాలయాలు పరిశోధనకు కేంద్రాలు కాకపూర్వం (తర్వాత కూడా) సాహితీ పరిశోధనలకు నిలయాలు ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (1908); సాహిత్య పరిషత్ పత్రిక (1911), శారద (1923), భారతి (1924) మొదలైనవి. ఈ వ్యాసాల సంఖ్య వందల్లో ఉన్నాయి. (చూ. నే. శ్రీకృష్ణమూర్తి : *1974*) ఆ రోజుల్లో ఆ పత్రికల్లో వ్యాసాలు రాయడం పండితుల పాండిత్య ప్రకర్షకు నిదర్శనం. వాద ప్రతివాదాలు తుదముట్టా సాగేవి. పండితుల మధ్య కుల ప్రాంతీయ శాఖాదిభేదాలే ప్రధానంగా సాగిన విమర్శలూ ఉండేవి. సత్యనిరూపణ దృష్టికన్నా వాద సామర్థ్య దృష్టి అతి శయించి కనిపించేది. కరపత్రాలు, సభలు, ఉపన్యాస సారాంశాల్ని ప్రత్యేకంగా ప్రచురించడం, పుస్తకాలు గానే రాయడం - ఇవీ ఆనాటి పరిశోధనకు స్థలాలు. ''తెలుగు కవిత్వ పరిణామములు, చరిత్ర పరిశోధ నలు, విమర్శ దృక్పథములు, కావ్య కళా వైవిధ్య ములు, శబ్ద ప్రయోగ చర్చలు, శాస్త్ర పరామర్శలు, గ్రంథ సమీక్షలు (ఆ. ప. ఉ. సం.) అముద్రిత తాళ పత్ర గ్రంథ ప్రచురణ, శాసన పరిష్కారాలు, సంస్కృతాంధ్రాంగ్ల భాషాసాహిత్యముల తులనాత్మక పరిశీలనములు, కవి జీవిత కావ్య విశేషములు, సాహిత్య భాషా వికాస చర్చలు, పరిషత్ సభల ఉపన్యాసాల పాఠాలు, గ్రాంథిక భాషా సమర్థన (పరి షత్ పత్రిక); అనువాద నాటకాలు, స్వతంత్ర రూప కాలు, రూపక విమర్శ, భావ కవిత్వము. కళాసమీక్ష, సాహిత్య శాస్త్ర విమర్శ, నవల, కథ, కథానిక, విజ్ఞాన శాస్త్రము, సాంఘిక రాజకీయాంశములు, శాసన ప్రచురణము, చరిత్రాంశ చర్చలు, సంస్కృతాంధ్ర కావ్యవిమర్శ, సమీక్షలు (శారద); కవిత్వము- కళ, శాస్త్రము, చరిత్ర, వ్యాసము, విమర్శనము, రూపకము, గ్రంథ సమీక్ష, కలగూరగంప, లేఖలు, స్వవిషయ

*3. సామాజిక చరిత్ర ప్రాధాన్య దృష్ట్యా 'మాలపల్లి'లో ఉన్నవ వారు చేసిన పరిశోధన కృషి కూడా సామాన్య మైంది కాదు.

ప్రపంచ విషయాలు - బాల రథం నుండి బ్రహ్మ పదార్థందాకా (భారతి)" [చూ. జి. వి. సుబ్రహ్మణ్యం: 1969 వీరక].

సాహిత్య పరిశోధనల్లో ఇంత వైవిధ్యమూ ఈనాటికీ వుంది. పెద్దగా మార్పు కనిపించడం లేదు. కాకపోతే రెండు దృక్పథాలు స్పష్టంగా ఆ రోజుల్లో సర్వత్రా కనిపించేవి కావు:

1. సాహిత్యాన్ని సమాజ పరిణమానికి సాధనంగా వాడుకోవాలి అన్నది. (చూ. కొ. కుటుంబరావు: 1937)
2. సేకరించిన విషయాల్ని వివరించడానికి, విశ్లేషించడానికి ప్రమాణాల్ని తవ్వడం; అవి వస్త్వాశ్రయంగా వుండాలని ఆశించడం.

ఒక విషయం మాత్రం వినమ్రంగా అంగీకరించాలి. ఆ రోజుల్లో (1940 ల దాకా) పండితులు తెగచదివినవారు. ఒక్కొక్కరూ 20, 30 గ్రంథాల దాకా, 100 వ్యాసాల దాకా రాయందే తృప్తిపడ్డవారు కాదు. ఆ బహుగ్రంథ పఠనతో లభించిన జ్ఞానాన్ని సమన్వయించుకొని (Synthesizing) తమదంటూ ఒక్కొక్క నిర్దిష్టమార్గం ఏర్పరచుకొన్న పండితులు చాలా తక్కువనే గుర్తించాలి.

**నూత్న సాహిత్య శాఖల ఆవిష్కరణ :**

ఈతరంవారిలో మేల్కొన్న మరో దృష్టి అనాదృతవాఙ్మయోద్ధరణ. బ్రౌన్‌గారే యక్షగానాల్ని గురించి, బొబ్బిలికథని గురించి కొంత రాసినా ఎక్కువ పరిశీలించినవాడుమాత్రం కాదు. J. A. Boyle (1874) మొదటిసారిగా 'సర్దార్ పాపారాయని కథ'ను సంపాదించి ప్రకటించాడు *4 (Indian Antiquary Vol. III) నందిరాజు చలపతిరావు గారు స్త్రీల పాటల్ని (1903, 1905) ఎం. ఎన్. వెంకటస్వామి (1905) కొన్ని స్త్రీ, బాల గేయాల్ని ప్రచురించారు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు; వేటూరి ప్రభాకరశాస్త్రి గారు, చి. నారాయణరావు గారు, అక్కిరాజు ఉమాకాంతం గారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు మొదలైన పండితులు గేయాల్ని సేకరించారు; వివరించారు కూడా. జానపద గేయ పరిశోధకుడుగా ప్రథమగణ్యుడు నేదునూరి గంగాధరం గారు. టేకుమళ్ళ, శ్రీపాద గోపాల కృష్ణమూర్తి (కృష్ణశ్రీ), శ్రీహరి ఆదిశేషువు — మొ. వారు రామరాజుగారి గ్రంథానికి (1958) నేపథ్యాన్ని ఏర్పరిచారు.

ఇలా మొదలైన జానపద, (బాల గేయాలతో కలిపి) సాహిత్య కృషిలో భాగంగానే కొన్ని ఆసక్తికరమైన పరిశోధనలు సాగాయి. వేదాల తిరువేంగళ రామానుజ స్వామి (ప్రజామిత్ర సంక్రాంతి సం. 1939) (గోల్కొండ పత్రిక 1940) గారు జానపద గేయాల్లోని ఆయుర్వేద రహస్యాల్ని వెల్లడించారు. ఆ రోజుల్లోనే Oswald J. Couldrey (South Indian Hours 1924); పి. సాంబమూర్తి (Indian Art and letters. Vol. VI New Series 1937) గార్లు జానపద సంగీత కళల్ని గురించి రాశారు.

ఈ యుగానికి సంబంధించిన మహామనీషుల్లో మనం గుర్తించదగ్గ ప్రతిభాశాలి ఆదిభట్ల నారాయణ దాసు గారు. ఆయన ప్రచురించిన 'నవరస తరంగిణి' (1929 ప్రాంతం; పునరుద్ధరణ 1978) కాళిదాసు, షేక్స్‌పియర్ మహాకవుల్లోని నవరస స్థానాల తులనాత్మక పరిశోధన. సృజనాత్మకమైన అలాంటి పరిశోధన మళ్ళీ ఈనాటికీ రాలేదంటే

*4. పాపారాయుడు రాయలసీమ వాడని బోయల్ అభిప్రాయపడ్డాడట. మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు (అమరావతీ స్తూపము - అనాదృత వాఙ్మయంలో) తెలంగాణవాడని నిరూపించారట. చూ. బి. రామరాజు 1958 : 54

మనం ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ప్రాచ్య పాశ్చాత్య అలంకార శాస్త్రాల్లోని తేడాను గురించి చెబుతూ 'ట్రాజెడీ' రచనకు నేపథ్యంగా ఉన్న పాశ్చాత్యుల దైవభావనను గూర్చి ఆయన చెప్పిన మాటలు ఎంతో పరిశోధక విలువ ఉన్న అంశం (చూ.పీఠిక).

అలాగే ఈ దశలోనే సామెతల సేకరణకూడా ప్రారంభమయింది. (చిలుకూరి నారాయణరావు గారే ఒక లక్షకు పైనా సామెతలు సేకరించారట. అముద్రితంగానే అవి ఉండిపోయాయి). వ్యవసాయ సామెతల్ని ఇంగ్లీషు అర్థాలతో పాటుగా మదరాసు ప్రభుత్వ వ్యవసాయశాఖవారు 1933 లో (బులెటిన్ సం. 31) ప్రచురించారు *(చూ. తెలుగు సామెతలు, ప్ర.ము. 1959. సంపత్ రాఘవగారి పీఠిక)*

**వస్తు భావ వాదాల అవతరణ :**

పరిశోధనకు 'ధ్యేయం' (Target) అవసరం- అనుశీలనానికి అది అవసరం లేకపోవచ్చు. సాహిత్య పరిశోధనగా 1945 నుంచి ఈనాటి మనదాకా వచ్చిన, వస్తున్న పరిశోధనల్లో ఒక నిర్దిష్ట ధ్యేయంతో మొదలైన సిద్ధాంత వ్యాసాలూ, రచనలూ వేళ్ళ మీద లెక్కించాల్సినవే ఉన్నాయి. ఈ స్థితికి కారణంగా పాశ్చాత్య విద్యార్జనతో పుట్టిన రెండు రకాల భావ ప్రపంతులని గుర్తించడం దోషం కాదు. వస్తుతత్త్వ దృష్టి - అనుభవ - వాస్తవిక సంబంధి (Empiricism); భావవాదం - వస్తుగతికి ఆంతరమైన అవ్యక్త భావగతి మూలమంటుంది (Idealism). తెలుగు సాహిత్య పరిశోధనల్లో మొదట 'వస్తు' దృక్పథం, సమకాలికంగానే 'భావ' వాదచ్ఛాయలూ గురజాడ - రాయప్రోలు మహా కవుల్లో సాక్షాత్కరించాయి. తర్వాతి పరిశోధనల్ని కూడా ఈ దృక్పథాలు ఎంతగానో ప్రభావితం చేశాయి *(చూ. బ్రహ్మానంద 1981 : అధ్యాయాలు 3, 4, 5 & 6)*.

**సంప్రదాయానుస్యూతి - సంఘర్షణ**

హేతువాదం, నాస్తిక, గతితార్కిక భౌతిక వాదాలు 1920 ప్రాంతం తర్వాత రూపందుకొన్నా స్పష్టంగా 1940 ల తర్వాతే వస్తు తత్త్వదృష్టి ఒక నిర్దిష్ట గమ్యాన్ని పొందగల్గింది. ఇది ఎక్కడో గురజాడ (1910) లో ఆవిష్కరింపబడినా (చూ. కె.వి. రమణారెడ్డి : 1969) ఒకవైపు భావవాదంతో, మరోవైపు సంప్రదాయానుస్యూతి వున్నా పండితుల శాస్త్ర ప్రమాణ దృక్పథంతో 'సమరం' సాగిస్తూ, ఒకోచోట లొంగిపోతూ, సమన్వయించబడుతూ వచ్చింది. వెరసి ఈ దశలో పరిశోధనల్లో వస్తు, భావ, సంప్రదాయ మార్గాలు మూడూ సంగమించాయి.

**గిడుగు - గురజాడలు - వస్తు దృక్పథం**

గిడుగు + గురజాడలు విడదీయరాని సంబంధమున్న జంట పదం లాంటివారు. ఒకరు సిద్ధాంత కర్త. మరొకరు లక్ష్యస్రష్ట. ఇరువురూ కలిసి భాషా సాహిత్య పరిశోధన రంగాల్లో నూత్నశకాన్ని ఆరంభించారు. భాషా పరంగా వస్తు తత్త్వదృష్టి భాషల తులనాత్మక పరిశోధనవైపు, గిరిజన మాండలికాల్ని తవ్వి తీయడంవైపు ప్రసరించింది. సాహిత్య పరంగా కూడా సాహిత్యాన్ని జానపదీకరణం (Rebarbarisation)వైపు నడిపించింది. గురజాడ 'The Dravidian folk songs' అనే గ్రంథం చదివాడట *(చూ. సి.నారాయణరెడ్డి 1967)*. ఆయన వీరేశలింగం, రవీంద్రుడు, బంకిం మొదలైన వారి మీద చేసిన విమర్శ అంతా ఈ వాస్తవిక దృక్పథంతోనే *(చూ. రమణారెడ్డి 1969 & బ్రహ్మానంద 1981: 7)*.

గిడుగు రామమూర్తి పంతులుగారు (1863-1940) నైఘంటికుడు. సలక్షణంగా సంస్కృతం చదివినవాడు. ద్రావిడ భాషల్ని గురించి, అప్పుడప్పుడే ఇండియాలోకి ప్రవేశించిన ఆధునిక భాషా విజ్ఞానం లోని ధ్వని (Phonetics), వ్యాకరణ విభాగాల్ని

గురించి అధ్యయనం చేసినవాడు. సవర భాషకి నిఘంటు వ్యాకరణాలు తయారు చేసినవాడు. నిజమైన ఆధునిక భాషా శాస్త్రవేత్తకు కావాల్సిన లక్షణాలున్న మొదటి తెలుగువా డీయనే. అందుకే ఆనాటి సమకాలీన పండితుల్లో చాలామంది విమర్శలకు అనహేళనకు గురైనా (చూ. గ్రాంథిక వ్యావహారిక వాద సూచిక: 1980) 1879 మొదలు 1940 దాకా ఆయన రాసినన్ని వ్యాసాలూ, చేసిన నిర్దుష్టమైన భాషా చర్యలు మరెవ్వరూ చెయ్యలేదు.5*

మొదటి సారిగా 'గ్రామ్యం' అనే పదాన్ని వ్యాకరణ శాస్త్ర పరంగా కాకుండా భాషావిజ్ఞాన పరంగా అర్థం చేసుకున్న వాడు రామమూర్తిగారే. ఆయన రచనల్లో (1879; 1913, 1914, 1919, 1923, 1933) ఆయన ప్రతిపాదించిన అంశాల సారంశం ఇది.*6

1) సంప్రదాయ పండితులు 'గ్రాంథిక భాష' అని వ్యవహరించే దాని స్వరూపం ఇదమిత్థమని నిర్ణయించడానికి వీలుకాదు. ఒక వ్యాకరణం ఒప్పుకొన్నది మరో వ్యాకరణం అంగీకరించదు. గ్రాంథిక భాషలో నిర్దుష్టంగా రాసినవారెవరూ లేరు. పండితులు వైద్యులు కారాదు (ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం : 1879 (1919).

2) తాళపత్ర గ్రంథాల్ని సంస్కరించి ప్రచురించడం చాలా అనర్థాన్ని కల్గిస్తోంది. ఇది కూటకరణ దోషం. పూర్వులు రాసిన పురాణ వచనాలూ, లక్షణ గ్రంథాలూ, వ్యాఖ్యానాలూ, టీకలు, వివిధ శాస్త్రగ్రంథాలూ, దేశ చరిత్రలు, జానపద వృత్తాంతాలూ, వార్తాపత్రికలూ, శాసనాలూ, కథలూ, బడి పుస్తకాలూ - వీటిలో 'వచనం' వ్యావహారికంలోనే వుంది. ఏ భాషలోనైనా సరే ఇదే నిజమైన సంప్రదాయం.

(గద్య చింతామణి. 1933)

3) వ్యాకరణం ప్రయోగ మూలం. లక్షణం కన్నా కవిప్రయోగం బలవత్తరమయింది. కవుల రూపాలకి గతి కల్పించలేకపోతే వ్యాకరణమే అసమగ్రం, దుష్టం అవుతుంది. ప్రయోగాలు మాత్రం నింద్యాలు కావు.

(బాలకవి శరణ్యం 1907 (1933)

4) ప్రపంచంలోని ఇతర భాషా వాఙ్మయాల చరిత్రతో పోల్చి చూస్తే ఆంధ్ర భాషా వాఙ్మయం కూడా మారుతూ వస్తోందని గుర్తించాల్సి వస్తోంది. ఆయాకాలాల్లో కవులు తమ నాడు శిష్టమైన భాషనే వాడుతూ వచ్చారు. నోటిమాటకీ, చేతిరాతకీ సామరస్యం కుదిరితే వాఙ్మయం లోని భాష సహజంగా, సరసంగా, సుబోధకంగా పరమ ప్రయోజనకారిగా ఉంటుంది.

(వ్యాసావళి 1933)

నిజమైన భాషావాదిగా గిడుగు వారు మరో మూడంశాల్ని గుర్తించారు. వీటి మీద తగినంత పరిశోధన తర్వాత జరిగినట్టులేదు.

1. పూర్వము వేదములలోని భాష లోకులు మాటలాడుకొనే రోజులలో ఇప్పుడు బొబ్బిలి పాట లాగు, వేదములు అందరికీ బోధపడేవి. రానురాను ఆ భాష మారి తుదకు వాడుకలేక ఎవరికీ తెలియకుండా అయినది. ఇట్లా మారి ఏర్పడిన క్రొత్త భాషే సంస్కృతము. (*నీటి నేటి తెలుగు, ఆం. ప. సం.సం.* ***1913***).

2. నందంపూడి శాసనంలోని భాష నన్నయ భారతంలోని భాష ఒకేలాగున్నాయి.

---

5* బూదరాజు రాధాకృష్ణగారు (1972; 1975) లలో గిడుగు వారి మీద విస్తారంగా రాశారు.

6* చూ: తెలికిచెర్ల వెంకటరత్నం గారి సంపాదకీయ భూమిక. బాలకవిశరణ్యం (ప్ర. ము. 1933)

3. పాత ధాతువుల మీద కొత్త రూపాలు ఏర్పడుతుంటాయి.7 *

సంస్కృత భాష భారతీయ భాషే అయినా, సంస్కృతం ఏర్పడకముందది ఇండోయూరోపియన్ భాషా ప్రవంతికి ఇండో ఆర్యన్ రూపమని గుర్తించినందువల్లే గిడుగువారు పై (1) అంశాన్ని రాశారు. అందుకే కావచ్చు ఆయన ద్రావిడ భాషల (తెలుగు) సంస్కృత జన్యత్వాన్ని తన శిష్యుడు (చిలుకూరి నారాయణరావు) ప్రతిపాదించినా అంగీకరించలేదు.

### గిడుగు - భాషాభివృద్ధి

గిడుగువారు పరిశోధకుడుగా చేసిన పని అంతా పూర్వకవి ప్రయోగప్రదర్శన; సజాతీయ ద్రావిడ భాషారూపాలతో పోల్చిచూడటం; ధ్వని సూత్రాల్ని సమన్వయించి ఆ రూపాల్ని వివరించడం (ఇది సూరిని సీతారామాచార్యులు సవరించడం లాంటిదికాదు).

అయనలో పండితుడికన్నా సామాజిక దృష్టి ఉన్న సంఘసేవకుడు ముఖ్యంగా కనిపిస్తాడు:

''మాదిగ వెంకడు మొదలుకొని వెంకటావధానులవరకున్న వెయ్యింటికి 75 గురు మాత్రమే ఓనమాలు వచ్చినవారున్నప్పుడు గ్రాంథిక భాష వచ్చినవారు 5 గురు అయినా ఉందురో ఉండరో. అయితే నాగరికుల తెలుగు- తేట తెలుగు లోక వ్యవహారములలో ఇప్పుడు వాడుతూ ఉన్నవారే వెయ్యింటికి అధమ పక్షము నూరుగురైనా ఉంటారు. అది తెలుసుకోగల్గిన వారు వెయ్యింట మున్నూరుగురైనా ఉంటారు. క్రమక్రమముగా వాడుక ఎక్కువయి అంతకంతకు దిగువ జాతులకు అది వ్యాపిస్తుంది.*8 ఈ తేట తెలుగులో తెలివి కలిగించే విద్య అందరికీ చెప్పితే సరస్వతి తెలుగు దేశములో తాండవమాడదా!'' *(నేటి తేట తెలుగు-పైన ఉదాహృతం)*

గిడుగు వారి ధ్వని విజ్ఞాన ప్రవేశానికి ఒక ఉదాహరణం చూపడం బాగుంటుంది:

''తాటాకు, మఱ్ఱాకు (చూ. ఇత్వసంధి) శబ్దములలో మధ్య వర్ణముపై నున్న అచ్చు కేవలము అకారము కాదు. ఆ ఏలకు మధ్యస్థమైన స్వరము. తాలవ్యము. ఇంగ్లీషు భాషలోని Man అనే పదములోని అచ్చువంటిది''. *(బాలకవిశరణ్యం పు. 250)*.

గిడుగు వారి ప్రభావాన్ని పూర్తిగా పొందిన గురజాడ అప్పారావు పంతులు (1861-1916)కూడా చేసిన భాషా సంబంధి పరిశీలన వుంది. కన్యాశుల్కం (రెండో ముద్రణ 1897) నాటకానికి రాసిన పీఠికలో, డిసెంటు పత్రం (1914) లో, తెలుగు కన్నడ భాషల నడుమవున్న సంబంధాన్ని గురించి రాసిన వ్యాసంలో *(చూ. అవసరాల సూర్యారావు (సం) వ్యాస చంద్రిక 1953)*, శాసనాల్ని చదవడంలో, 'Annals of Handet Anantapuram' కి

---

*7. పైని 2, 3 అంశాల్ని అక్కిరాజు రమాపతి రావు (1971) గుర్తించారు.
2. అంశం ఈనాడు మనం అంగీకరించడం లేదు. (చూ. కృష్ణమూర్తి 1980).
3. అంశం మీద ఈ వ్యాసకర్త పరిశ్రమిస్తున్నాడు. (చూ. బ్రహ్మానంద 1983)

*8. భూస్వామ్య విధానం మీద నాగరికులు సాధించిన ఆర్థిక రాజకీయ పోరాటానికి వాఙ్మయ రంగంలో ఈ ఉద్యమం మారుపేరు. దీనిలో లోపాలు లేకపోలేదు. ఆర్థిక రంగంలో భూస్వామి పెత్తనం పోయి లేదా భూస్వామి, పెట్టుబడిదారుడు రాజీపడి ఆర్థిక దాస్యం సాగిపోయిన విధంగా ఈ వ్యావహారిక భాష కూడా గ్రాంథిక భాషావాదులు స్వీకరించిన వస్తువు (Subject matter) గురించి పేచీ పెట్టలేదు. ఎంతసేపటికి శైలి, రీతి పద్ధతిని గురించే వారి తాపత్రయం. (కె.వి. రమణారెడ్డి : 1951)

బ్రౌన్ తర్వాత పునః సంపాదకత్వం వహించడంలో (1922) ఆయనలోని వ్యావహారిక భాషాభివేశం నష్యతా ప్రియత్వం కనిపిస్తాయి.

గిడుగువారికి Daniel Jones, Sten-konow మొదలైన భాషా పరిశోధకులతో ఉత్తర ప్రత్యుత్తరాలుండేవి. ఆయన కుమారుడుగా గిడుగు సీతాపతి గారు తర్వాతి సంవత్సరాల్లో రాసిన సాహిత్య చరిత్రలో, ఛందః పరిశీలనలో భాషా విజ్ఞాన ప్రభావం ఎంతగానో కనిపిస్తుంది. సమకాలికుల్లో, తర్వాతి వారిలో గిడుగువారి ప్రేరణ ఎంతోవుంది. ఉదాహరణకు చిలుకూరి నారాయణరావు గారు విశాఖలోని సరంగుల భాష మీద క్షేత్ర పరిశీలన(field work) చేశారు (చూ. ఆంధ్రభాషా చరిత్రం సం. 1;622-646) అనంతపురం గ్రామనామాల మీద పశీలన కూడా ఆయనే మొదలు పెట్టారు (చూ. పై గ్రంథం పు. 647-667). ఆంధ్రభాషలోని గంజాం మాండలికం మీద డి. యన్. శర్మ (భారతి ఫి. 1924); విశాఖ తెలుగు మీద గరిమెళ్ళ సోమన్న (1926); ఎరుకల భాషమీద కొత్తపల్లి సూర్యారావు(భారతి జూ. 1929); ముండా భాషమీద రాళ్ళపల్లి ఫణిశాయశర్మ (వ్యాస సంగ్రహం 1933 ) రాసిన వ్యాసాలు క్రమంగా ఎదుగుతున్న భాషా పరిశోధనాసక్తిని నిరూపిస్తాయి.

**మరికొన్ని రచనలు :**

భాషల్లో చాలా అంశాలమీద ఆ రోజుల్లో వ్యాసాలు వచ్చాయి. కొన్ని ఆసక్తికరమైన అంశాల్ని మాత్రం చూద్దాం. కోతుల భాష మీద, నాగమణి (భారతి జూ. 1926) రాసిన వ్యాసం చాలా వింతైనదే ఆ రోజుల్లో. క్రమంగా సిద్ధాంత నేపథ్యం కూడా కొద్దిగా పెరుగుతూ వచ్చిందనటానికి పరవస్తు రామానుజం గారు ( 1927 ) ఇండో యూరోపియన్ భాషా కుటుంబం మీద - (ఆర్య, వైదిక, సంస్కృత ప్రాకృత భాషల్లోని వర్ణోత్పత్తి - లిపి మొదలైన విష యాల మీద రాయడం నిదర్శనం (చూ. భారతి. మా. ఏ. న. 1927). గిడుగు సీతాపతిగారి 'సొడ్డు' (1928?) ఈ ప్రాంతంలోనే రచింపబడింది.

తెలుగు కన్నడ భాషల సంబంధం మీద గూడా కొన్ని వ్యాసాలు వచ్చాయి. కూరిగనూరు నరసింగరావు 'కన్నడిగలు - తెలుగులు (భారతి 1930,31;4 సంచికల్లో); చిలుకూరి వీరభద్రరావు 'అరవణ్దెలు జ్గన్నడ మంత్రము కాదా! అది యాంత్రము కాలేదా!' (భారతి 1932). ఈ అంశం మాత్రం తర్వాత ఎక్కడో సుబ్బరామప్ప లాంటివారు తెలుగు కన్నడ లిపుల్ని గురించి రాయడం తప్పా అట్టే పట్టించుకొన్నది కాదు.

బులుసు పాపయ్యశాస్త్రిగారు (1932) లో కొత్త మాటలు, పాత మాటలకి కొత్త అర్థాల్ని గురించి రాశారు. దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు (వ్యాస సంగ్రహం: 1933 లో) 'అర్థ విపరిణామ పద్ధతి' మీద ఒకవ్యాసం రాశారు. వజ్ఝలవారు 'తాలువన దొడకాదు' అనే విషయం నిరూపించారు.

సరిగా ఈ మధ్యలోనే (1930-40) బరో, ఎమెనోలు ఇండియాలో పర్యటించడం ప్రారంభించారు. వారి ప్రభావానికిలోనై సంప్రదాయ వ్యాకరణం కన్నా భాషా శాస్త్రం ఎలా భిన్నమైందో గుర్తించి ఇక్కడ సోమయాజిగారి 'ఆంధ్రభాషా వికాసం' (1945) ప్రభావం చాలా ముఖ్యమైంది. కృష్ణమూర్తి గారికీ గురువు సోమయాజిగారే) నవ్య భాషా విజ్ఞాన రథ సారథి అవడానికి తగిన అర్హతను భద్రిరాజు కృష్ణమూర్తిగారు సంపాదించారు.

**గిడుగు నుంచి కృష్ణమూర్తి దాకా:**

భాషా సాహిత్య పరిశోధనలు కలగాపులగంగా ఉన్న ఈ ప్రాథమిక దశలో గుర్తించదగ్గ మార్గాలు ఇక రెండు ప్రధానంగా ఉన్నాయి. ఈ రెండు మార్గాల్లోని లోపాల్నించీ బయటపడి మౌలికమైన భాషా విజ్ఞాన ప్రతిపాదనల్ని అవగాహన చేసుకున్న

వారు కృష్ణమూర్తిగారు. ఆ తర్వాత వచ్చిన భాషా పరిశోధనల్లో విషయ విస్తృతితో పాటు స్పష్టత కూడా వుంది. అంతకు ముందటి భాషా సాహిత్య పరిశోధనల్లో అస్పష్టత నుంచి స్పష్టత వైపు దారితీసిన ముఖ్య పరిశోధకులిద్దర్ని గురించి రాయడంతో ఈ వ్యాస ప్రయోజనం నెరవేరుతుంది.[9*] ఆ ఇద్దరే చిలుకూరి నారాయణరావు; కోరాడ రామకృష్ణయ్యగార్లు. ఈ యిద్దరి నేపథ్య రంగంగా ఉన్న తెలుగు భాషా సాహిత్య రంగాన్ని మొదట చూడాల్సిన అవసరం వుంది.

**పరిశోధనల్లో సంప్రదాయ పాండిత్య విస్తరణ:**

ఏ సాహిత్యంలోనైనా, ఏ యుగంలోనైనా సాహిత్యంలో లోతును దర్శింప చేసేది సంప్రదాయాభిజ్ఞత. అందుకే పాండిత్యమంటే తనకు పూర్వులు దర్శించి సంపాదించి పెట్టిన విజ్ఞాన భాండాగారాన్ని తవ్వి తీయటమనే అర్థాన్నే ప్రపంచంలో చాలామంది పండితులు భావిస్తారు. ఈ రోజుల్లో 'చాదస్తం' గా వికటించిన ఈ సంప్రదాయాభిజ్ఞత విస్తృత పరిధిని అందుకొన్న మొదటి దశ కూడా గిడుగు తర్వాత చిలుకూరి నారాయణరావుగార్ల తరంలోనే మొదలైంది.

సాహిత్య ఉద్యమంగా 'క్లాసిసిజమ్' ని నిర్వచించడం ఎంత కష్టమో పరిశోధనలో 'పాండిత్య' నిర్వచనం చెయ్యడమూ అంత కష్టమే. భారతదేశంలో వేద పురాణ శాస్త్రాది వాఙ్మయ పరిచయం పాండిత్య మనిపించుకొంది. కొక్కొండ వెంకటరత్నం పంతులు గారి కాలంనుంచి మనకు పండితుల్లో కనిపించే ఒక సమాన ధర్మం అన్నింటికీ వైదిక ప్రామాణ్యం చూపించాలి అనడం.[10*] అదే 'శాస్త్రం' బలవత్తర మన్న దృక్పథం. ఇది ఎక్కడ పనిచేస్తుందో అక్కడ 'అన్వేషణ' (investigation), ఆత్మ విమర్శ; పునర్విమర్శ; భాష్యం; వ్యాఖ్యానం- లాంటి ప్రక్రియలకు లొంగి పని చేస్తుంది.

కోరాడ రామకృష్ణయ్యగారు తమ భాషాశాస్త్ర గ్రంథం, వ్యాసాల్ని ఇలా ప్రారంభించేవారు:

'శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుండు...' ఇదంతా తాను చెప్పబోయే భాషాశాస్త్ర విషయానికి ప్రాచీనశాస్త్ర నేపథ్యం కల్గించడమే. దీన్నే 'Classicism' అనేది. ఆ తరంలో అందరిలోనూ ఈ లక్షణం కొట్టొచ్చినట్టు కనిపించేది.

విజయనగరం కేంద్రంగా సంస్కృత వాఙ్మయ శాస్త్ర ప్రచారం బాగా సాగింది. వఝల చిన సీతా రామస్వామిశాస్త్రి గారి పరిశోధనలన్నీ ఈ సంస్కృత విద్యావాసనతో సాగినవే. బాల వ్యాకరణోద్ద్యోతం కాని; వసుచరిత్ర విమర్శనం కాని; వ్యాకరణ సంహితారచనం కాని; ద్రావిడ భాషా సామ్యములు కాని- శాస్త్రిగారి బహుముఖ పాండిత్యాన్ని నిరూపిస్తాయి. ఒకవైపు కాల్డ్వెల్‌ని అంగీకరిస్తూ శాస్త్రి

---

9. *సృజన విమర్శన రంగాల్లో మాత్రమే అధికంగా ప్రభావం చూపిన భావవాద ధోరణి పరిశోధనలోనూ ప్రవేశించక పోలేదు. రాయప్రోలు సుబ్బారావు గారి 'కళా కవిత్వములు' (1905), ఆధునికాంధ్ర సాహిత్యము (1916), తృణకంకణ పీఠిక (1912), రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి 'కవిత' (1912), భావము-వస్తువు-రచన, నాచన సోమున్ని నవీన గుణ పరిశీలన, తణికెళ్ళ వీరభద్రుడు గారి 'ఆంధ్ర విషాద నాటకము' (1917), శ్రీపాద కామేశ్వరరావు గారి 'కన్యాశుల్క నాటక విమర్శ' (1921), దువ్వూరి రామిరెడ్డి గారి కవిత్వ తత్త్వము (1921), కావ్యము-నీతి (1925), విశ్వనాథవారి 'కృత్యాద్యవస్థ' (1936), 'లిరికల్ పొయెట్రీ' (1939), పి.ఎమ్.వి. హనుమంతరావు గారి 'విమర్శకుడు - కళోపాసకుడు' (1940) మొదలైన రచనల్లో ప్రధానం ఈ ధోరణే. క్రమంగా ఇది సంప్రదాయ వాదంలో కలిసిపోయింది.

10. *కడకి గిడుగు రామమూర్తి గారు కూడా వ్యావహారికాన్ని సమర్థించడంతో వేదం దాకా వెళ్ళి వచ్చారు. (చూ. బాలకవి శరణ్య ప్రారంభ వేదమంత్రం.)

గారు ఆయన్ని ఖండించి సవరించిన సందర్భాల్ని తరువాతి పరిశోధకులు గమనించినట్టుగా దాఖలాలు లేవు.

ఆ రోజుల్లో తాతా సుబ్బరాయశాస్త్రి గారు ఒక మహా విజ్ఞాన ఖనిగా ప్రాచీన శాస్త్ర విద్యను వందల మంది విద్యార్థులకి పంచిపెట్టారు. ఫలితంగా పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి (తరువాత జమ్ముల మడక మాధవరామశర్మ) ప్రభృతులు ఆలంకారిక వాఙ్మయాన్ని తెలుగు చెయ్యడం మొదలు పెట్టారు. ప్రాచీన శాస్త్ర పరిచయం కల్గడంతో పండితుల ధోరణులు మారిపోవడం మొదలుపెట్టాయి. ఉదాహరణకు 1925 ప్రాంతంలో రాయబడ్డ 'రమ్యాలోకం' లోనే ఈ ప్రాచ్య పాశ్చాత్య భావ సమన్వయ ధోరణులు మొదలయ్యాయి. కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి గారు రాసిన 'సాహిత్య-పాశ్చాత్య విజ్ఞాన సమన్వయము' (1936) ఇలాంటి పరిశోధన వ్యాసమే. బంకుపల్లి మల్లయ్య శాస్త్రిగారు రాసిన 'అభిధ-లక్షణ-వ్యంజన' (1939) అనే వ్యాసంలో మొదటి సారిగా ఒక పండితుడు వాగ్వ్యాపారాల్ని గురించి రాయడం కనిపిస్తుంది. పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి గారి 'ఆంధ్ర ధ్వన్యాలోకము' (1939-42) (3 సం. లు) కూడా ఈ మధ్య కాలంలోనే అచ్చయింది. ప్రాకృత భాషా సాహిత్యాల మీద ఆసక్తి కూడా ఈ కాలంలో పెరిగింది. ఈ దశలో ప్రతి పండితుడూ ప్రాకృతం మీద ఏదో ఒక వ్యాసం రాసి తన పాండిత్యాన్ని నిరూపించుకున్నవాడే.*11

ఈ దశలో వచ్చిన మరో పరిణామం వ్యావహారికాన్ని సంస్కృత (కావ్య) భాషా దృష్టితో పునర్విమర్శించడం.

గ్రాంథిక వ్యవహారిక వాదాలు ఒకప్పటి సంస్కృత ప్రాకృత వాదాల వంటివని రాసిన పండితులున్నారు (ఎం.ఆదినారాయణశాస్త్రి 'ప్రాకృత గ్రంథకర్తలూ-ప్రజాసేవానూ' 1933 ) అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'కావ్యభాష' (1927), తాతా సుబ్బరాయశాస్త్రి గారి 'శిష్టభాష' ( 1936 ), పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'పాణినీయము - కావ్య భాష' (1937), విశ్వనాథవారి 'గ్రామ్యమా! వాడుక భాషా' (జయంతి (1-2 (12), అధ్యక్షోపన్యాసం ( 1940 ) ఒకటి రెండు అదనమైన విషయాల్ని స్థాపించాయి. ఈ రచనల ఫలితంగా పండితుల్లో (ముఖ్యంగా విశ్వవిద్యాలయ పరిశోధకుల్లో కూడా) 'కావ్య' శైలి ఉదాత్తంగా - భిన్నంగా ఉంటుందన్న ధోరణి ఒకటి మిగిలిపోయింది.

ఈ అదనపు అంశాలేమిటంటే - గిడుగువారు కోరినట్టే వ్యావహారికంలో పఠనపాఠనాలు జరగాల్సిందే. కాని, కావ్యం - వార్త కాదు. అంచేత వ్యవహారంలో లేని 'నిఘంటు' రూపాలు కావ్యంలో ఎప్పుడూ ఉంటూనే వుంటాయి. ఇలా అంటూనే ఈ పండితులందరూ వ్యావహారిక భాషకు కూడా రస సమర్పక శక్తి ఉందని గుర్తించారు. కాగా అటు గిడుగుకాని, కోరాడ, చిలుకూరి మొదలైన తరువాతి వారుకాని గ్రాంథికం వాసనలులేని శుద్ధ వ్యావహారికాన్ని రాయలేకపోయారు - ( వార్తాపత్రికల్లోనే మొదటిసారిగా ప్రజావ్యవహారం లిఖితమయిందని అంగీకరించక తప్పదు.)

ఇలా ఇన్ని శాస్త్రమర్యాదలు సంఘర్షించుకొన్న రోజుల్లో చిలుకూరి వారు పరిశోధన చేబట్టారు.

చి. నారాయణరావుగారు (1890 - 1951) కేవలం భాషా విజ్ఞాని కాదు-గిడుగువారిలాగా. ఆయన కవి పండిత విమర్శక పరిశోధకుడు. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వ్యవస్థాపకులలో ఒకడుగా, నిశిత

11. * మేడేపల్లి వెంకటరమణాచార్యులు 'ప్రాకృత భాషోత్పత్తి' (1920), మల్లంపల్లి సోమశేఖరశర్మ 'ప్రాచీనాంధ్ర భాషాస్వరూపము' (1922), పరవస్తు రామానుజ స్వామి 'సంస్కృత ప్రాకృత భాషలు' (1928) మొ.

పరిశీలకుడుగా ప్రసిద్ధి పొందాడు. ఎర్రగుడి (గుత్తి: అనంతపురం జిల్లా) లోని అశోకుని ధర్మశాసనాల్ని మొదట ప్రచురించి వివరించింది ఈయనే (అశోకుని ధర్మ శాసనములు (?) ). హంపీ శాసనస్థాథారాలతో విజయనగర చరిత్రను కూడా రాశాడు. 'పండితా రాధ్య చరిత్ర' ను పరిష్కరించి సప్రమాణంగా పాల్కురికి సోమన కన్నడ దేశీయుడని నిరూపించాడు. 'కురాన్‌షరీఫ్' ని తెలుగులోకి అనువదించాడు. మొదటి సారిగా కాల్డ్‌వెల్ సిద్ధాంతాన్ని భారతీయ శాస్త్ర ప్రమాణాలతో ఖండించడానికి నడుముకట్టి 'పైశాచీ ప్రాకృత' వాదాన్ని ప్రచారం చెయ్యడమే తన జీవిత ధ్యేయంగా పోరాడాడు. తన సిద్ధాంతాన్ని పరిపుష్టం చేసుకొనేందుకు ఋగ్వేదసాయణభాష్యాన్ని, అథర్వవేదాన్ని, గీతను, ఆపస్తంబ ధర్మసూత్రాల్ని, త్రిపిటకాల్ని, ధమ్మపదాన్ని అనువదించాడు. బుద్ధ చరిత్రను, జైన శైవ అద్వైత మత గ్రంథాల్ని రచించాడు. తర్క సంగ్రహాన్ని, పిల్లల మనస్తత్వ శాస్త్రాన్ని కూడా రాశాడు. రోమ్, గ్రీసు, చైనా, జపాన్‌ల చరిత్రల్ని సంగ్రహించాడు. ఆంధ్ర భాషా చరిత్రతో పాటు ఆంధ్ర సాహిత్య చరిత్రను కూడా రాశాడు.[12]*

**ఆంధ్ర భాషాచరిత్ర: కొన్ని ప్రతిపాదనలు:-**

1937-38 లో రెండు సంపుటాలుగా దాదాపు 2000 పై చిలుకు పుటలతో ప్రచురించబడ్డ ఆంధ్ర భాషాచరిత్రము (The History of Telugu Language) ఒక అత్యుత్తమ ఆకరగ్రంథం. తర్వాత వచ్చిన ఆంధ్ర భాషావికాసం, (1945) తెలుగు భాషా చరిత్ర (1975) లకు ఈ గ్రంథం మూలరూపం.[13]* ఆంధ్రుల చరిత్ర మీద ఎంతో విస్తార వాఙ్మయం ఉద్ధరింపబడిన మొదటి గ్రంథం ఇదే. 'తెలుగు' అనే మాటకు బదులు ఆ రోజుల్లో 'ఆంధ్ర' అనే మాట ఎక్కువగా వాడబడేదనిపిస్తుంది. తెలుగులో కలిసిపోయిన ప్రాకృత సంస్కృత లక్ష ణాల్ని కలిపి 'ఆంధ్ర' పదంతో నిర్దేశించే వారని పిస్తుంది. ఆంధ్ర భాషా చరిత్ర సాధించిన ఫలితమూ ఈ అంశమే. తన గ్రంథంలో లోపాలున్నాయని ఆయనే గురిస్తూ 'ప్రథమ ప్రయత్నం'లో దోషాలు తప్పవని కూడా ఆయనే చెప్పారంటే ఆయన నిరహం కార హృదయాన్ని అభినందించక తప్పదు.

ఈ గ్రంథంలో ఆయన ప్రతిపాదనల్లో ముఖ్యమైనది ఇది :

"క్రీ.పూ. 3వ శ. నుండి క్రీ. శ. 5వ శ. వఱకును భారతదేశమందంతటను బ్రాకృత భాషలు ప్రచారమందుండినట్లు మనకుఁ దెలియును. నాటనుండి 6, 7వ శతాబ్దముల వఱకు దక్షిణ హిందూ దేశ మందును, 12వ శతాబ్దము వఱకు తక్కిన భారత వర్షమునందును ప్రచారమునందుండిన భాషల స్వరూప మెట్లుండెనో తెలిసికొనుట కాధారములు లేవు. అట్టి సందర్భమున ద్రావిడ భాషల మూలమునఁ బ్రాకృత భాషలును నేఁటి యార్య భాషలును గలిగినవని యూహించుట సమంజసముగాదని తోఁచుచున్నది. కావున ఆ అభిప్రాయమునకుఁ దగిన యాధారములు నిరూపింపబడునంతవఱకును బూర్వ లాక్షణికు లతో నేకీభవించి ద్రావిడ భాషలు కూడఁ బ్రాకృత భాషలే యనియుఁ, దక్కిన ప్రాకృత భాషలెట్లు గలిగినవో ద్రావిడ భాషలు నట్లే గలిగిన వనియుఁ, బ్రాకృత భాషలపై ద్రావిడీ ప్రాకృతమున కెంతటి ప్రోద్బలము కల్గెనో ద్రావిడ భాషలపైఁ గూడఁ దక్కిన ప్రాకృత భాషలవలన అంతటి ప్రోద్బలము కలిగెననియుఁ బ్రాచీనార్య భాషల నుండి తక్కిన ప్రాకృతములవలె ద్రావిడ భాషలును వికాసము

12. *ఈ గ్రంథాల్లో చాలావరకు అముద్రితాలే. సృజనాత్మక రచనలూ చాలా ఉన్నాయి.

13. *చూ. గాడిచర్ల హరిసర్వోత్తమరావు 'ఆంధ్ర భాషా చరిత్రము' (భారతి, 1937), గరిమెళ్ళ సత్యనారాయణ 'ఆంధ్ర భాషా పరిణామము' (భారతి, 1938).

నొందినవనియుఁ దలంచుచు నాదృష్టితోఁ బరిశోధన ముల సాగించినచో ద్రావిడ భాషా తత్త్వము తేలఁ గలదని చెప్పుట సాహసము కానేరదు' (ఆ. భా.చ. సం. 1. పు. 65-66)

కాల్డ్‌వెల్ ద్రావిడ భాషల్ని ప్రత్యేక కుటుంబంగా స్థాపించడానికి తీసుకున్న ప్రమాణాల్ని తప్పని నిరూపించే ప్రయత్నం కూడా ఆయన చేశారు. (చూ. పు. 66-75)*[14]-చాలామంది తర్వాత గుర్తించారు- ఈ అంశాలు అంత సమంజసంగా లేవని. కాని గుర్తింపుకి రాకుండా మరుగున పడిపోయిన కొన్ని ఆసక్తికరమైన అంశాలున్నాయి.

(1) "తెలుగు భాష తక్కిన ద్రావిడ భాషల కంటె స్వతంత్రమగు స్థానము నాక్రమించుచున్నదని గ్రియర్‌సన్ పండితుని యభిప్రాయము. తెలుగునకు గల ఈ ప్రత్యేకతకుఁ గారణమేమి? ప్రాచీన ప్రాకృత భాషలకిది తక్కిన ద్రావిడ భాషలకంటె నెక్కువ దగ్గఱగా నుండుటయే అని ఈ గ్రంథమును (ఆ. భా. చ.) చదువుచున్నపుడు గోచరింపగలదు" (చూ. పు. 75)

ఈ అంశం మీద తరువాతి సంవత్సరాల్లో పెద్దగా పరిశోధన సాగినట్టు కనిపించడంలేదు గాని; తెలుగు అటు మధ్య ద్రావిడమూ, ఇటు దక్షిణ ద్రావిడమూ రెంటికీ నడుమ ఉందని గుర్తిస్తున్న ఈ రోజుల్లో (చూ. కృష్ణమూర్తి : 1975 : 16) గ్రియర్‌సన్ ప్రతిపాదించిన 'తెలుగు సముదాయం' అనే అంశాన్ని ప్రాకృత ప్రభావ దృష్ట్యా సమీక్షించడం యుక్తంగానూ, అవశ్యంగా కూడా కనిపిస్తోంది. (చూ. బ్రహ్మానంద, 1983 (a))

(2) ద్రావిడ భాషల్లోని పదాలకు సమానార్థక సంస్కృత రూపాలుగా కాల్డ్‌వెల్ గ్రహించినవి తప్పుడు రూపాలని చెబుతూ; "అతడాయాపదములకు సంబంధింపని సంస్కృత శబ్దముల నిచ్చుటచేఁ బోలికలు సరిగాఁ గానరాకున్నది. కాని, యాపదముల కన్నిటికిఁ దగిన సంస్కృత శబ్దములను నిరూపించవచ్చును" అంటూ కింది రూపాలు ఇచ్చాడు (చూ. పు. 68-69).

| తమిళం | కాల్డ్వెల్ ఇచ్చిన సంస్కృత పదం | సరియైన సంస్కృత పదం |
|---|---|---|
| అప్పన్ | పితృ | అంబః |
| ఆయి | మాతృ | మాయి (హిందీ) |
| మగన్ | సూను | మహాన్ |
| తలెయ్ | శిరస్ | తల |
| శెవి | కర్ణ | శ్రవస్ |

ఇంకా ఆయన కొన్ని పదాలిచ్చారు. వీటిలో చాలా వాటిని బరో మొదలైన ద్రావిడ పరిశోధకులు ద్రావిడ భాషల్లోంచి సంస్కృతంలోకి వెళ్ళిన రూపాలుగా నిరూపించారు. ఏమైనా ద్రావిడ - సంస్కృత భాషల నడుమ కనిపించే ప్రాథమిక పదజాల సమానత మాత్రం ఇంకా పరిశీలనీయాంశమే.

(3) తెలుగులోని పైశాచీ ప్రాకృత లక్షణాల్ని (చూ. పు. 547-574) గురించి చర్చిస్తూ ఆయన చూపిన ఉపపత్తులు పునఃపరిశీలన యోగ్యాలు. ఒక ఉదాహరణం.

సంస్కృతం : క్త్వా (గత్వా)    పైశాచి : తూన (గంతూన)

తెలుగులో 'తూ', 'కన్నడంలో 'త, త్త'లు శత్రర్థకాలు. ఉదా: తె. చేస్తూ క. గెయ్యుత (త్తా). "తొలుత నివి క్త్వార్థక రూపములుగా నుండి తరువాతి కాలమున 'ఇ' వర్ణము క్త్వార్థకార్థమున నెలకొనినప్పుడు శత్రర్థకములుగ రూఢియై యుండవచ్చును. తెలుగున

14. *ఈ ప్రయత్నంపైని విమర్శకు చూ. కోట సుందర రామశర్మ 'ఆంధ్ర ప్రాకృతముల జన్యజనక సంబంధ మీమాంస' ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం, 1959. సం. 3. పు. 36-42.

'తు' వర్ణమే 'చు' వర్ణముగ మారినది. తు వర్ణము మొదటినుండియు వ్యవహారమున నున్నది. చు వర్ణ చిహ్నము తోడి శత్రర్థక రూపములు గ్రంథముల కెక్కి వ్యవహార భ్రష్టములైనవి" (చూ. పు. 565)[16*]

(4) తెలుగులో చేరిన ప్రాకృత పదజాలాన్ని గురించి ఆయన ఇచ్చిన ఉదాహరణలూ ఆలోచించ దగ్గవిగానే ఉన్నాయి. ఒక ఉదాహరణం : 'అరి' 'tax' (< సం. హృత.) భ. కృష్ణమూర్తిగారు దీన్ని ద్రావిడపదంగా గుర్తించారు. (చూ. బ్రహ్మానంద, 1983.) (చూ. తె.భా.చ. సం. 1. పు. 483)

(5) తెలుగులోకి వచ్చిన హిందుస్తానీ పదాల అర్థవిపరిణామాల్ని గూడా ఆయన చర్చించాడు. ఒక ఉదాహరణం :

హిం. ఉస్తాద్. (పు. 587)

(6) కొన్ని తెలుగు రూపాలకు ఆయన ఇచ్చిన వివరణ మాత్రమే సాంస్కృతిక నేపథ్య దృష్ట్యా సమంజసంగా వుంది.

ఉదాహరణం. ఐదువ (చూ. పు. 785)

(7) జంట పదాల్ని గురించి రాసిన వాళ్ళలో మొదటివాడూ ఈయనే (చూ. ద్విరుక్త ప్రకరణము పుట. 787-797)

ఈయన ఇచ్చిన ఉదాహరణల్ని తరువాతి చాలా మంది పరిశోధక శిఖామణులు పేరు కూడా ఉదాహరించకుండా వాడుకున్నారు.[16*] తెలుగు పరిశోధనల్లో సాధారణంగా కనిపించే అంశమే ఇది.

చిలుకూరి వారి వాదాన్ని సమకాలికంగా సశాస్త్రీయంగా ఖండించిన ప్రయత్నం కోరాడ రామకృష్ణయ్య (1891-1961) గారిది. వీరి రచనల్లో సుప్రసిద్ధమైనవి 1925-49 మధ్యన వచ్చాయి. ఈయన కూడా కేవలం భాషా విజ్ఞాని కాడు. అయినా ద్రావిడ భాషా విజ్ఞాన వికాస కర్తల్లో ఒకడుగా గుర్తించదగ్గవాడు. కొన్ని విషయాల్లో ఈయన పరిశోధన దశారంభకుడు కూడా.

వీరు వ్రాసిన ఆంధ్ర గ్రంథాలలో ముఖ్యమైనవి ఇవి: సంధి (1925), కాళిదాసుని కళాప్రతిభలు (1930), భారత కవితా విమర్శనము (1931), భాషోత్పత్తి క్రమము - భాషా చరిత్రము (1935), సారస్వత వ్యాసములు (1944), దక్షిణ దేశ భాషా సారస్వతములు - దేశి (1949).

వీరు సంపాదకత్వం వహించిన గ్రంథాలు: విష్ణు పురాణం (1930), విష్ణుమాయా నాటకం (1934), నవనాథ చరిత్ర (1937).

వ్రాసిన ఆంగ్ల గ్రంథాలు : 'Studies in Dravidian Philology' (1935), Telugu literture outside the Telugu Country (1941), The Dravidian Cognates (1945).

వీరి వ్యాసాలు దాదాపు 60 కి పైగా ఉన్నాయి. ఈ వ్యాసాల్లో ప్రధానాంశాలివి: మూల ద్రావిడ భాష; ద్రావిడ భాషల్లో ధాతువాదం, ద్రావిడ భాషల్లో కర్మణి ప్రయోగం; అనాగరిక ద్రావిడ భాషలు, ఔతస్థ రూపాలు, ద్రావిడాలూ-ప్రాకృతాలూ; తెలుగు భాషా వికాసం, ద్రావిడ భాషా ధ్వని విజ్ఞానం (Phonetics); *ద్రావిడ తుమున్నర్థకరూపాలు;* ద్రావిడరూప నిష్పత్తి; ద్రావిడక్రియ; తెలుగు పైశాచీ భాషల సంబంధం; ప్రాక్చాళుక్య దశలోని తెలుగు

---

15. *చూ. భద్రిరాజు కృష్ణమూర్తి(సం)తెలుగుభాషాచరిత్ర (1975: అధ్యా. 16.)

16. *ఆనాటికీ ఈనాటికీ పరమ ప్రామాణిక పాఠ్య గ్రంథంగా ఉన్న 'ఆంధ్ర భాషా వికాసం'లో కొన్ని వందల సందర్భాల్లో చిలుకూరి వారి గ్రంథం ప్రామాణికంగా ఉదాహృతమైంది; ఉద్ధృతమూ అయింది.

భాషా స్వరూపం ఇంతవరకు ఆంగ్లవ్యాసాలు; ద్రావిడభాషా విభక్తులు (1923); భారతాంధ్రీకరణం-ఎఱ్ఱాప్రెగడ (1927); కవితా లక్షణము - రసచర్చ (1927); విరాటుని బృహన్నలా పరీక్షణము(1928); ద్రావిడ భాషా పదచరితము(1929), ఉత్తర హిందూస్థాన భాషల్లో దేశి (1929), నన్నయపూర్వం ఆంధ్ర వాఙ్మయస్థితి (1930); ద్రావిడ భాషలు - వర్ణ వినియయం (1931) ద్రావిడభాషా లక్షణాలు-తొల్‌కాప్పియం (1932); ఆంధ్రభాషా వాఙ్మయం - ప్రాకృత సంపర్కం (1941); తెలుగు-తమిళం-వాని ప్రాచీనత (1941); ఆంధ్రం - తెనుగు దాని ప్రాచీనత (1942); దేశ్య-అన్యదేశ్యాలు (1944); తాళికట్టు - మంగళసూత్రము (1944); నన్నిచోడుని వస్తుకవిత ( 1945 ); శబ్దార్థ పరిశోధనము - జాను తెనుగు (1946); ద్రావిడ భాషలలోని కొన్ని వింత యక్షరములు (1947); నన్నయ భారత భాష (1948) తమిళ వాఙ్మయమందలి భక్తి సాహిత్యము (1949); నన్నిచోడుని కుమార సంభవము ప్రతులు పాఠములు (1949) భాషాశాస్త్ర క్రమాభివృద్ధి (1949). మహాభారత పాఠనిర్ణయ పద్ధతి (?) మొదలైనవి.

ఈయన పరిశోధనలోని కొన్ని ఆసక్తికరమైన అంశాల్ని ప్రదర్శించడం అవసరం.

## (1) పైశాచీ ప్రాకృతవాద నిరాసం :

"చి. నారాయణరావుగారు ప్రతిపాదిస్తున్న పైశాచీ ప్రాకృతవాదం అశాస్త్రీయం. ఎందుకంటే పైశాచీలో ప్రత్యేకంగా రావుగారు గుర్తించిన లక్షణాలన్నిటినీ ద్రావిడ భాషా సహజ ధర్మాలుగా; ద్రావిడ భాషా ప్రభావంతో ప్రాకృతంలో ఏర్పడ్డవిగా నిరూపించవచ్చు కాబట్టి. 7వ శతాబ్దికి ముందు తెలుగు మొదలైన భాషల్లో శాసనాలు లేకపోవచ్చు కాని అంతవరకూ ఉన్న సంస్కృత ప్రాకృత శాసనాల్లోనే ఈ భాషల ఉనికి ప్రతిపాదింపబడుతోంది. తొల్‌కాప్పియంలో చెప్పబడ్డ తమిళ లక్షణాలతో పోల్చి చూస్తే తెలుగుకి సంస్కృతంతోకన్నా తమిళంతోనే సంబంధం అధికమని నిరూపించవచ్చు. అంతే కాకుండా ఆర్యంపై ద్రావిడుల ప్రభావమే అధికమనీ తేలుతుంది. అలా చూసినపుడు పైశాచీవాదం-ద్రావిడ భాషల ఆర్య భాషా జన్యత్వ సిద్ధాంతం సహజంగా నేలకొరుగుతోంది." (Is Telugu Language a form of Paisachi)

—Synopsis. PP. 647-648.

## (2) ద్రావిడ భాషలు - ప్రాకృతాలు :

"ప్రాకృత వ్యాకర్తలకే పైశాచీ ప్రాకృతావిర్భావంమీద సరైన అవగాహన ఉన్నట్టు కనిపించదు. వాల్మీకి ఆ భాషను గురించి చాలా స్వల్పంగా చెప్పాడు. వరరుచి శౌరసేనికన్నా అది ఎలా భిన్నమో చాలా కొద్దిగా వివరించాడు. స్టెన్‌కొనో, గ్రియర్‌సన్ మొదలైనవాళ్ళు పైశాచి 'పాళీ' ప్రభేదమంటున్నారు. హేమచంద్రుడు మూడు రకాల పైశాచీ ప్రభేదాలున్నాయన్నా అవి ఎక్కడ మాట్లాడుతారో చెప్పలేదు."

(The Dravidian Languages and Prakrits PP. 12-14)

చిలుకూరి వారి ఱ, ఴ మొదలైన ధ్వనుల్ని కూడ సంస్కృతం నుంచి నిష్పన్నం చెయ్యడానికి చేసిన ప్రయత్నం నిష్ఫలమని నిరూపించారు. కృష్ణ > కట్టిగా మారిందనుకోవడం కన్నా 'కఱి' (నల్ల)తో సంబంధమున్న పదంగా 'కట్టి'ని గుర్తించాలంటూ ఆయన ఇలా అంటారు:

'Since this sound- common to all the languages of the group is considered as a peculiar one ... ' (P. 19)

'ఴ' విషయంలోనూ సంస్కృత జన్యత్వం లేదంటా రాయన (మా. పు. 12.)

(3) తెలుగు-తెలంగ్

ఈనాడు ప్రసిద్ధంగా తెన్ (దక్షిణం అనే అర్థంలో) అనే ధాతు రూపం నుంచి తెనుగు ఏర్పడ్డదని; నలలవ్యత్యయం కారణంగా తెలుగు గా మారిందని అనుకోవడం వుంది. (చూ. జి. యన్. రెడ్డి 1975-1).రామకృష్ణయ్య గారు 1952 ప్రాంతం లోనే ఈ అభిప్రాయాన్ని (చూ. సోమయాజి. *1945 : 31-34*) అంగీకరించలేదు. ఆయన నిర్ణయం ఇది: తెలంగ్- జాతి వాచకం. ప్రాచీనం. దానితో సంబంధం ఉన్నదే 'తెలుంగు'. ఇక్కడ ల>నగా మారింది[17] తప్పా న>ల గా కాదు. (చూ. Our selves, our home and our langunge 1952: 18-20) 'మనం మొదట తెలుగులం తర్వాత ఆంధ్రులం' అని ఆయన నిర్ధరించాడు. (పై వ్యాసం. పుట. 20).

కోరాడ వారి విమర్శలో పరిశోధన దృష్టి ప్రధానమైందనడానికి 'కాళిదాసుని కళా ప్రతిభలు' నిదర్శనం (చూ. పుటలు 34-35). మహా భారత పాఠ నిర్ణయ పద్ధతిని సూచిస్తూ ఇలా అంటారు:

'ఇంద్రుడై పుట్టిన యుద్ధ తేజుఁడు' (భారతం 2-83) అన్న పాఠంలో 'యుద్ధ'కు సాంద్ర, నరేంద్ర, రుంద్ర వంటి పాఠాంతరాల్ని కల్గి వుంది. ఇందులో 'రుంద్ర' పాఠాంతరమే సమంజసమంటూ పంప భారతాన్ని; దక్షిణ హిందూ దేశ శాసనాన్ని (Vol. VI. No. 117) ప్రమాణంగా చూపారు.

(చూ. Ramakrishnaiah & S. Lakshmipathi Sastry 'Andhra Bharata Patha Nirnaya Paddhati' Annals of OR. Univ. of Madras II-1. PP. 14-15)

ఇలా ఆరంభ దశల్నించి, వికాస దశలోకి అడుగు పెట్టిన తెలుగు భాషా సాహిత్య పరిశోధనల్లో ఎన్నో అమూల్యమైన అంశాలు దాగి ఉన్నాయి. ఇవి పునః పరిశీలన యోగ్యాలుగా కూడా కనిపిస్తున్నాయి:

'అనుపాసిత వృద్ధానాం విద్యానాతి ప్రసీదతి'

—భర్తృహరి.

***


**ఆకర గ్రంథాలు :**

బ్రహ్మానంద హెచ్. ఎస్. (1981) 'తెలుగు సాహిత్యవిమర్శ-పాశ్చాత్య ప్రభావం' (అము)
రమణారెడ్డి కె. వి. (1969) 'మహోదయం' విశాలాంధ్ర ప్రచురణ.
రామరాజు బి. (1958) 'తెలుగు జానపద గేయ సాహిత్యం' స్వీయ.
సంపత్కుమారాచార్య, కోవెల (1978) 'ఆధునిక సాహిత్య విమర్శ : సాంప్రదాయిక రీతి' స్వీయ.
సుబ్రహ్మణ్యం జి. వి. (1969) 'సారస్వత వ్యాసములు', ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ.
వీరభద్రరావు కొత్తపల్లి (1960) 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' స్వీయ.
శ్రీకృష్ణమూర్తి నే. (1974) 'తెలుగు వ్యాస రచనల సూచి', ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ.
తెలుగు అకాడమీ (1980) 'గ్రాంథిక వ్యావహారిక వాద సూచిక'
రాధాకృష్ణ బూదరాజు (సం) (1836-1980)
రామకృష్ణయ్య కోరాడ ( ? ) 'కోరాడ వంశీయులు' ( ? )

**ఉదాహృత వాఙ్మయం :**

కుటుంబరావు కొడవటిగంటి (1937) 'సాహిత్యం ఎందుకు ?' భారతి (సె)
కృష్ణమూర్తి, భద్రిరాజు (1975) (సం) 'తెలుగు భాషా చరిత్ర', ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ.
గోపాలరెడ్డి బండి (బంగోరె) (1977) 'బ్రౌను లేఖలు', ఎస్. వి. యు. ప్రచురణ.


17. ఇటీవల బ్రహ్మానంద (1983 (c)) కూడా ల> నగా మారిందని నిరూపించాడు. కాని రామకృష్ణయ్యగారి విషయాన్ని గుర్తించారని అతను గమనించలేదు.

నారాయణరావు వెల్చేరు (1980) 'తెలుగు పరిశోధనల తీరుతెన్నులు' అభ్యుదయ విమర్శ విశేష సంచిక.

నారాయణరెడ్డి సి. (1967) 'ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు - ప్రయోగములు' స్వీయ.

పురుషోత్తం, బొడ్డుపల్లి (1978) 'యాభై ఏండ్ల తెలుగు పరిశోధన', ఆం. ప. సం. సం.

బ్రహ్మానంద హెచ్. ఎస్. (1983) (a) 'రాయలసీమ తెలుగు', స్రవంతి (ముద్రణలో)

— (1983) (b) 'నన్నయ్యగారి వాగనుశాసనం' (అము)

— (1983) (c) 'తెలుగులో అరసున్న', భారతి (ఫి)

రమణారెడ్డి కె. వి. (1951) 'కళాప్రపూర్ణుడు-వాగ్యుద్ధములు, వ్యావహారికభాష', కిన్నెర. 3-2

రమాపతిరావు అక్కిరాజు (1971) 'వ్యావహారిక భాషా వికాసం-చరిత్ర', ఎమెస్కో.

రాధాకృష్ణ బూదరాజు (1972) 'వ్యావహారిక భాషా వికాసం', విశాలాంధ్ర.

రామారావు చేకూరి (1980) 'తెలుగులో (భాషా) శాస్త్ర పరిభాష', (లక్షణాలూ, వాదాలూ, మార్గాలూ, వ్యూహాలు) తెలుగు సారస్వత సమాఖ్య ప్రచురణ. న్యూఢిల్లీ.

రెడ్డి జి. యన్. (1975) 'ఆంధ్రము, తెనుఁగు, తెలుఁగు' భ. కృష్ణమూర్తి (సం) (1975లో)

సుందరరామశర్మ కోట (1959) 'ఆంధ్ర ప్రాకృతముల జన్యజనక సంబంధ మీమాంస', ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం, తెలుగు భాషాసమితి.

సోమయాజి గంటి, జోగి (1945) 'ఆంధ్రభాషా వికాసము' త్రివేణి.

Caldwell Robert Bishop (1856) 'A Comparative Grammar of the Dravidian or the South Indian family of languages', pub. Madras Univarsity (1961)

Jacques Barjun & Henry F. Graff (1970) 'The Modern Researcher'.

**ఉద్ధృత వాఙ్మయం :**

నారాయణరావు చిలుకూరి (1937) 'ఆంధ్రభాషా చరిత్రము' (సం. 1)

— (1938) ,, (సం. 2) ఆంధ్ర విశ్వకళా పరిషత్ ప్రచురణ.

రామకృష్ణయ్య కోరాడ ( ? ) 'Is Telugu language a form of Paisachi' A. I. O. C. (xiii) Session.

— ( ? ) 'The Dravidian languages and Prakrits' Annals of the University of Madras, Vol. V Pt. 1

— (1952) 'Ourselves; Our home and language; SVUO Journal.

రామమూర్తి పంతులు గిడుగు వెంకట (1913) 'నేటి తేటతెలుగు', ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక.

— (1933) 'బాలకవి శరణ్యం', తెలికిచెర్ల వెంకటరత్నం (సం).




# తెలుగులో భాషా సాహిత్య పరిశోధనను వికాసదశకు తెచ్చిన మనీషులు

—వి. వి. యల్. నరసింహారావు

తెలుగులో భాషా సాహిత్యాల పరిశోధనను వికాసదశకు తెచ్చిన మనీషులను గూర్చి ముచ్చటించ బోయే ముందు ఇటువంటి వికాసదశకు తొలుదొల్త దారిచూపిన ప్రాజ్ఞులను గూర్చి ప్రస్తావించటం భావ్యం.

దాదాపు పదహారు విశ్వవిద్యాలయాల నుండి తెలుగులో నేటికి సుమారు అయిదువందలమంది పరిశోధకులు పి.హెచ్.డి, డి.లిట్, ఎం.లిట్ డిగ్రీలు, ఎం.ఫిల్ డిప్లొమోలు సాధించి భాషా సాహిత్యాల పురోభివృద్ధికి కృషి చెయ్యగలిగారంటే ఈ పరిశోధకులందరికీ మార్గదర్శకులైన మనీషులను మెచ్చితీరాలి.

అయితే ఈ సందర్భంలో విశ్వవిద్యాలయాలతో సంబంధం లేకుండా, డిగ్రీలు డిప్లొమాల మీద మోజు లేకుండా కేవలం భాషా సాహిత్యాల సేవ కోసమే జీవితాలను అంకితం చేసిన ఆద్యప్రవర్తకులు కూడా అవశ్యం స్మరణీయులు. వికాసదశకు వచ్చిన నేటి పరిశోధనకు సాధన దశ వారి జిజ్ఞాసాఫలమే. సాధన లేని శోధన సాధ్యం కాదుగదా !

**నక్షత్ర కాంతులు :**

విదేశీయు లీగడ్డపై కాలుపెట్టిన తరువాత దేశీయు లనుభవించిన కష్టనిష్ఠురాలను బేరీజు వేసుకుంటే - కీడులో మే లన్నట్లు — కనిపించేవి పూర్వ గ్రంథ పత్రాల సేకరణ, భాషా సాహిత్య గ్రంథాల సముద్ధరణ. ఇవి చీకటిలో చుక్కల వెలుగులు.

సాళువ వంశ ప్రభువులు విజయనగర సామ్రాజ్యం పాలిస్తున్నకాలంలో బేరసారాలు సాగిస్తూ తొలిసారిగా ఈ ప్రాంతాలకు వచ్చిన పోర్చుగీసువారు మాత్రమే కాకుండా డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలైన వాణిజ్య సంఘాలు కూడా ఈ నేలపై నిలదొక్కుకో మొదలుపెట్టాయి. వాణిజ్యపు పోటీలో ముందుకువచ్చి నిలబడి, ఇంగ్లీషువారి ఈస్టిండియా కంపెనీ నెగ్గుకురావటం, క్రమంగా ఆంగ్లేయులు పాలకులు కావటం అందరికీ సువిదతం. భారతదేశం వ్రాతప్రతుల సేకరణ కార్యక్రమం 1774 లో సర్ రాబర్ట్ చాంబర్స్‌తో మొదలైంది. మంచి సాహిత్యాభిరుచి కలిగిన ఈ మేధావికి సర్ విలియం జోన్స్ బర్క్ మొదలైన మనీషులతో సన్నిహితత్వం ఉండేది. చాంబర్స్ ఈస్టిండియా కంపెనీ సుప్రీంకోర్టు న్యాయమూర్తుల్లో తానూ ఒకడు కావటం బెంగాల్ ఏషియాటిక్ సొసైటికి అధ్యక్ష పదవి నలంకరించటం మొదలైన అవకాశాలు సద్వినియోగం చేసుకుని వ్రాతప్రతుల సేకరణ కృషి దీక్షతో సాగించాడు. ముఖ్యంగా సంస్కృతం వ్రాతప్రతుల మీద ఇతని దృష్టి కేంద్రీకరించబడింది. ఇతను సేకరించిన ప్రతులు బెర్లిన్ ఇంపీరియల్ లైబ్రరీలో నిక్షేపించబడినాయి. ఇతడు చూపిన దారిలో అడుగు పెట్టిన వాడే కల్నల్ కాలిన్ మెకంజీ.

1782 నుండి 1821 వరకు ఇక్కడ వుండి మెకంజీ సేకరించిన సాహిత్య నిక్షేపం తరుగని మూల నిధి. సుప్రసిద్ధ మేధావులైన కావలి సోదరులు—బొర్రయ్య, లక్ష్మయ్య, రామస్వాముల-సాహాయ్యంతో మెకంజీ మద్రాసు రాష్ట్రం, నిజాం సరిహద్దులు మొదలైన ప్రాంతాలనుండి ఇబ్బడిబ్బడిగా వ్రాతప్రతుల సేకరణ జరిపాడు. ఈ వ్రాతప్రతుల్లో తాళపత్రగ్రంథాలు, స్థానిక చరిత్రలు, శాసనప్రతులు మొదలుగా అనేక విజ్ఞానశాఖలకు సంబంధించిన రచనలు లభ్యమైనట్లు 1828 లో హెచ్. హెచ్. విల్సన్ తయారుచేసిన కేటలాగు వల్ల స్పష్టమవుతున్నది. భాషా చరిత్ర పరిశోధనకు మెకంజీ కైఫీయత్తుల విలువ ఎటువంటిదో మనకు తెలుసు.

అటుతరువాత తెలుగు జిల్లాలలో వ్రాతప్రతులు సేకరించిన భాషాభిమాని డాక్టర్ లేడన్. ఈస్టిండియా కంపెనీవారు ఇతని వ్రాతప్రతుల సేకరణ సంపుటిని ఇతని నిర్యాణసమయంలో ప్రకటించి, ఆ ప్రతులను ఇండియా ఆఫీసు లైబ్రరీలో పదిలపరిచారు.

లేడన్ వెన్నంటి అడుగుపెట్టిన ఆంధ్రబంధువు సి. పి. బ్రౌన్. గ్రంథ సేకరణ, పరిష్కరణ, ముద్రణ మొదలైన మార్గాల్లో తెలుగు భాషా సాహిత్యాల పరిశోధనకు బీజావాపనం చేసిన పుణ్యపురుషుడు ఇతడే. అందుకే అన్నారు కొత్తపల్లి వీరభద్రరావుగారు "తెలుగుదేశములో పరిశోధనలకు పునాది వేసినవాడు మెకంజీ తరువాత బ్రౌను దొరయే. వీరిరువురి కృషియే లేకున్న తెలుగుదేశమున పరిశోధనయే లేదన్నచో తరువాతి కృషిపై వీరి ప్రభావమెంత గాఢమో స్పష్టమగును" అని. (తె.సా.ఇం.ప్ర. పుట 141) వ్రాతప్రతిని పరిష్కరించి, సుష్ఠుప్రతిగా ముద్రణకు సిద్ధంచేసే పద్ధతికి ప్రత్యేకంగా పి.హెచ్.డి. డిగ్రీ పుచ్చుకునే స్థాయికి మనం ఎదిగామంటే తొలినాళ్ళలో ఇందుకు ఒరవడి పెట్టిన పుణ్యం బ్రౌనుదే. సుగమ వ్యాకరణ రచన, నిఘంటు నిర్మాణం మొదలైన మార్గాలకు అతను చేసిన కృషి సామాన్యమైంది కాదు. A Grammer of the Telugu Language, ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు, తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు మొదలైన రచనలు భాషా పరిశోధనకు బ్రౌను వేసిన బంగారు బాటలే.

నిఘంటు నిర్మాణంలో బ్రౌన్ ఒక తెలుగు-ఫ్రెంచి నిఘంటువును కూడా సంప్రతించినట్లు తన 'ఇంగ్లీషు - తెలుగు నిఘంటు' (1852) పీఠికలో (పుట 5) పేర్కొన్నాడు. వ్యావహారిక భాషా పదాలే ఎక్కువగా ఉన్న ఈ 'తెలుగు-ఫ్రెంచి నిఘంటు' రచయిత పేరేమిటో తెలియదుగాని బహుశః ఫ్రెంచివారు తెలుగు నేర్చుకునేందుకు వీలుగా 18వ శతాబ్ది ప్రారంభంలో దీన్ని వ్రాయించి వుంటారు. బ్రౌనుకు వేమన రచన పరిచయమైంది కూడా యాబ్లె. జె. ఎ. దుబాయ్ అనే ఫ్రెంచి విద్వాంసుని ద్వారానే. ఫ్రెంచి పాదిరీలలో ఒకడైన రెవరెండ్ డబ్ల్యు టేలర్ 1822 లో మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాల జాబితాను సవివరంగా తయారుచేయటం కూడా జరిగింది. అంతకు ముందే - అంటే 1818 లో - ఫాదర్ హూస్టన్ అనే ఫ్రెంచి పండితుడు తన డైరెక్టరీలో తెలుగుపుస్తకాల జాబితాను తయారుచేసుకోవటం కూడా గుర్తుంచుకోవలసిన విషయమే. తెలుగు పుస్తకాలు కాలగర్భంలో కలిసిపోకుండా పరిరక్షితం కావటానికి ఈ పాశ్చాత్యుల కృషి ఎంతగానో ఉపకరించిందని చెప్పవచ్చు.

ఆ మాటకు వస్తే తెలుగులో తొలి పుస్తకాన్ని ముద్రించిన ఘనుడు జర్మన్ పాదిరీ బెంజిమన్ షూల్జ్. గ్రంథం క్రైస్తవమత ప్రతిపాదకమే కావచ్చు, తెలుగు పుస్తకం ముద్రణకు శ్రీకారం చుట్టిన దిట్ట ఒక జర్మన్ పాదిరీ అనే సంగతి మర్చిపోరాదు. 1747 లో తెలుగు సారస్వతం గూర్చి లాటిన్‌భాషలో ఒక ఉద్గ్రంథం వ్రాసిన ప్రోడ ఈ షూల్జ్. భాషా సారస్వత పరిశోధనల వికాసదశకూ ముద్రణపద్ధతుల వికాసానికీ అత్యంత సన్నిహిత సంబంధం వున్నదన్నే

అంశం మర్చిపోగూడదు. ఇది గుర్తించిన విజ్ఞుడు గనుకనే బ్రౌన్ తెలుగు లిపి సంస్కరణకు కూడా పూనుకోవలసి వచ్చింది. దంత్య తాలవ్య చిహ్నాలు, సాధుశకట రేఫల ప్రయోగం ముద్రణకు అనువుగా ఎటువంటి మార్పు పొందటం అవసరమో బ్రౌనుకు నిశ్చితమైన అభిప్రాయాలు నాటికే ఏర్పడినాయి. లిపి సంస్కరణ,ముద్రణ పద్ధతుల పరిణామం ఒకదానితో ఒకటి నేటికీ ముడివడే వున్నాయి. భాషా పరిణామ సమగ్ర పరిశీలనకు లిపి సంస్కరణను గూర్చి, ముద్రణ పద్ధతులను గూర్చి సువిస్తృతమైన పరిశోధనలు ఇంకా జరుగవలసే వున్నది.

భాషా సాహిత్య పరిశోధనలో లిపి సంస్కరణాత్మక ముద్రణ పద్ధతుల పరిశీలన ఎంత ముఖ్యమో నిఘంటు - వ్యాకరణ రచనాదుల పరిశీలన అంత ముఖ్యం. సంస్కృతంలోని అమరకోశాదులు గాని తెలుగులోని ఆంధ్రనామ సంగ్రహాదులు గాని అకారాది క్రమంలో కూర్చబడినవి కావు. అంటే ఆధునిక నిఘంటువుల రచనాపద్ధతికి భిన్నమైనవి. విదేశీయులు మన భాష నేర్చుకొనేందుకు ఇవి అంతగా ఉపకరించక పోవటం వల్లనే వారు తమ సౌకర్యం కోసం ప్రత్యేక నిఘంటువులు, వ్యాకరణాలు వ్రాసుకోవలసివచ్చింది. తొలుదొల్త ఈ పద్ధతిలో తెలుగు వ్యాకరణం ఫ్రెంచి భాషలో వ్రాయబడినట్లు విలియం బ్రౌన్ 'A Grammar of Guntoo Language' అనే పుస్తకం (1817) పీఠికలో పేర్కొన్నాడు. డా. విలియం కారే 'Grammar of the Telugu Language' రచించి 1714 లోనే తాను ప్రత్యేకంగా పోతపోయించిన అక్షరాలతో దాని ముద్రింపించాడు.

కారే పండితుని దృష్టిలో దక్షిణ దేశ భాషలన్నీ సంస్కృత జన్యాలే. ఈ వాదాన్ని ఎదుర్కొనటం కోసమే ఏ. డి. కాంబెల్ A Grammar of the Telugu Language అనే గ్రంథమూ బిషప్ కాల్డ్వెల్ "Comparative Grammar of the Dravidian Languages'' అనే గ్రంథమూ వ్రాయవలసి వచ్చింది. నిజానికి కాల్డ్వెల్ వ్రాసిన ఈ గ్రంథంతో దక్షిణాది భాషలలో సృజనాత్మక భాషా పరిశోధన మొగ్గ తొడిగి రేకులు విప్పుకోసాగిందని చెప్పవచ్చు.

**ఉషఃకిరణాలు :**

'పదకొండో శతాబ్ది తెలుగు భాష' అనే అంశం గూర్చి చిలుకూరి నారాయణ రావుగారు 1929 లో మద్రాసు విశ్వవిద్యాలయానికి పరిశోధన వ్యాసం సమర్పించి డాక్టరేట్ పట్టం పొందారు. వారు రచించిన 'ఆంధ్ర భాషా చరిత్రము' అనే రెండు సంపుటుల బృహద్గ్రంథం ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథ మాల 18 వ ప్రచురణగా 1937 లో ప్రచురితమైంది. దీని ప్రథమ సంపుటి పీఠికలో నారాయణ రావుగారు పందొమ్మిదవ శతాబ్ది చివరి వరకు జరిగిన పాశ్చాత్య పండితుల భాషా శాస్త్ర కృషిని సంగ్రహంగా సమీక్షిస్తూ ఒక్క మాటన్నారు. ''కాల్డువెల్లు 1856 సం॥ ర ప్రాంతమున వ్రాసిన 'కంపేరెటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రెవిడియన్ లాంగ్వేజస్'' అను గ్రంథమే ద్రావిడ భాషల పరస్పర సంబంధమును గూర్చియు, వానికిని నితర భాషా వర్గములకునుగల సంబంధమును గూర్చియు చర్చలు గల గ్రంథముగా నున్నది. దానినేనేటివారు పరమప్రమాణముగా నంగీకరించుచున్నారు. కానికాల్డువెల్లుతనకుతమిళముతోమాత్ర మెక్కువపరిచయము కలదనియు, తక్కిన ద్రావిడభాషలను బాగుగా నభ్యసించినవారు తమ తమ భాషలను ప్రధానముగా జేసికొని యాలోచించిన యెడల వేఱు సిద్ధాంతములఁ జేయుట కవకాశమున్న దనియు అట్టి కృషిచేయుటకుఁ దగినవా రీదేశపు పండితులే యనియు తెలిపియుండెను.'' (ఆం. భా. చ. పుట. xviii) కాల్డ్వెల్ పండితుని సహజ వినీత వాక్యాలు చిలుకూరి వారు స్వీయవాదానుకూలముగా నుటంకించినట్లు స్పష్టం. కాల్డ్వెల్ అభిలషించిన దేశీయుల కృషికి

తామే నడుముకట్టి చిలుకూరివారు రచించిన ఉద్గ్రంథం 'ఆంధ్ర భాషా చరిత్రము'. ఇందులోని ప్రధాన విషయమైన 'ద్రావిడ భాషలకును ఆర్య భాషలకునుగల సంబంధము' గురించిన వాదము తమ గురువుగారైన గిడుగు రామమూర్తి పంతులుగారే అంగీకరించకపోవచ్చునని చిలుకూరి సందేహం వెలిబుచ్చారు. తమ గ్రంథమున లోపములు, దోషములు ఉన్నప్పటికీ ఆంధ్ర భాషా చరిత్ర నిర్మాణమున కిది ప్రథమ ప్రయత్నమని వినీతులై వారు పలికిన పలుకులు పరమసత్యం. ఆంధ్ర భాషా చరిత్ర నిర్మాణ ప్రయత్నంలో శిశువుల భాష, స్త్రీల భాష, మాండలిక భాషలు, సాంకేతిక రహస్య భాషలు మొదలైన మరి కొన్ని విషయాలను గూర్చి కూడా వివరించాలని వారు ఎంతో కుతూహలం చూపారు. వీటినిగూర్చి చెప్పకపోతే ఆంధ్ర భాషా చరిత్రము సంపూర్ణం కాజాలదని కూడా వా రభిప్రాయపడ్డారు. నిజానికి వారు పేర్కొన్న ఆ మహాకార్యం నేటికీ అసంపూర్ణంగానే వున్నది. మాండలిక వృత్తి పదకోశాదులు కొన్ని అవతరించినా ఆ మార్గంలో జరుగవలసిన పరిశోధన ఎంతో వున్నది. 'ఆంధ్ర భాషా చరిత్రము అయిదవ ప్రకరణము అనుబంధము I లో తెనుగున నావిక పదజాలము' అను శీర్షిక క్రింద చిలుకూరివా రిచ్చిన పదజాలము, అనుబంధము II లో చేసిన 'అనంతపురము జిల్లాలోని గ్రామ నామధేయములను గుఱించిన మీమాంస' ఆధునిక భాషా పరిశోధనకు గొప్ప కనువిప్పు. అట్టి బాటను పరిచి చూపిన ఆ మనీషి చిరస్మరణీయుడు.

ఆనాటి సమకాలీన భాషా పండితులలో ఆంధ్ర భాషా చరిత్ర వ్రాయటానికి అర్హులు - చిలుకూరి వారన్నట్లు-గిడుగు రామమూర్తిపంతులుగారే. కాని, వారి జీవితంలోని మేలి భాగమంతా పండితులతో వాగ్వివాదాలతోను వ్యావహారిక భాషా ప్రవర్తనోద్యమంతోను గడిచిపోయింది. నిజానికి ఆ పండిత పరిశోధకుడు సాగించిన మహోద్యమం ఫలితాలు తనివిదీరా నేడు మనం చవి చూస్తున్నాం. మనమే కాదు; చిలుకూరి వారు భాషా చరిత్ర వ్రాయటానికి కూడా వ్యావహారికాంధ్ర భాషోద్యమమే సహకారి అయినట్లు చిలుకూరివారే పేర్కొన్నారు.

భాషా సంబంధమైన పరిశోధన వికాసానికి తోడ్పడిన మనీషులలో గిడుగువారు ప్రాతఃస్మరణీయులు. వారు లేవనెత్తిన బ్రహ్మాండమైన భాషోద్యమానికి బీజావాపనం చేసిన మనీషి మరొకరున్నారు. వారి పేరు స్వామినేని ముద్దు నరసింహంగారు; పరవస్తు చిన్నయసూరిగారికి దాదాపు సమకాలికులు. రాజమండ్రిలో ఫస్ట్‌క్లాస్ ఆక్టింగ్ మున్సిఫ్‌గా పనిచేసిన ముద్దు నరసింహంగారు ఇంగ్లీషులోనే కాక సంస్కృతాంధ్రాలలో అసాధారణ పాండిత్యం గలవారు. 1862 లో ఆయన తాను వ్రాసిన 'హితసూచని' గ్రంథంలో వ్యావహారిక భాషా ప్రాధాన్యం ఉగ్గడించటమే కాకుండా ఉచ్చారణలో భ్రష్టమైన అక్షరాలను తొలగించాలనీ, జనవ్యవహారాని కనుగుణంగా గ్రంథ రచన సాగించాలనీ సహేతుకమైన సిద్ధాంత ప్రతిపాదన చెయ్యటం జరిగింది. 'హితసూచని' లో ముద్దు నరసింహంగారు వ్రాసుకున్న పీఠికను గిడుగు రామమూర్తి పంతులుగారు తమ 'గద్యచింతామణి' మొదటి భాగంలో ప్రకటించటమే పంతులుగారి వ్యావహారిక భాషోద్యమానికి బీజం ముద్దు నరసింహంగారే నాటినారనటానికి గుర్తు. ఆ బీజమే పంతులుగారి తీవ్ర కృషివల్ల మహోద్యమమై భాషా పరిశోధకులకు మార్గదర్శకమైంది.

వ్యావహారిక భాషా ప్రయోగం ముందుగా విద్యార్థి లోకంలో ప్రవేశపెడితే కాని ప్రయోజన ముండదని గిడుగువారు అందుకు బద్ధకంకణులైనారు. ప్రాచీన ప్రయోగ ప్రమాణాలతో పండిత మండలిని ఒప్పించటం ఆయనకు సాధ్యమైన పనే. విద్యాలయాధికారులనుకూడా ఒప్పించగలగాలి. 1914 లో మద్రాసు

యూనివర్సిటీ సిండికేట్ 'ప్రస్తుత పరిస్థితులలో వ్యావహారిక భాషావాదమును అంగీకరింపజాల' మని తీర్మానించింది. దానితో గిడుగువారి సంకల్పం వజ్ర సంకల్పమైంది. తెలుగుదేశంలో నాడున్న కళాశాల లన్నింటికీ కాలికి బలపం కట్టుకొనిపోయి కళాశాలాధి కారుల సాయంతో అధ్యాపకవర్గ సమావేశాలు ఏర్ప రిచి వ్యావహారిక భాషావాద స్వరూపాన్ని విశదీకరించి ప్రసిద్ధ పండితు లెందరినో తనవైపు త్రిప్పుకోగలి గారు. 1916 లో కొవ్వూరులో జరిగిన ఆంధ్ర సారస్వత వార్షికోత్సవ సభలో ఆయన సాధించిన సౌముఖ్యమే అందుకు నిదర్శనం. తత్ఫలితంగానే 1919 లో వీరేశలింగం పంతులుగా రధ్యక్షులుగా వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజం ఏర్పడటం వ్యావహారిక భాషా ప్రయోగానికి ఆ సమాజోద్దేశాలు రాజముద్ర వేసినట్లు ప్రకటితం కావటం జరిగాయి. ఆ సమాజం ఏర్పడ్డ మూణ్ణెల్లకే వీరేశలింగంపంతులు గారు దివంగతులైనారు కాని వారు మరికొంతకాలమే జీవించివుంటే-చిన్నయసూరిగారి బాణీలో వచన రచన చేసిన చేతితోనే పుంఖానుపుంఖంగా వ్యావహారిక భాషా రచనలు కూడా చేసివుండేవారు. నిజానికి పంతులు గారి ప్రహసనాలలో అప్పటికే వ్యావహారికం రేకులు విప్పుకొన్నది. వచన రచనాభివృద్ధికి తగినట్లుగా ఒక నూతన వ్యాకరణం వ్రాయాలనే దృఢ సంకల్పం వున్నట్లు కూడా వారు స్వీయ చరిత్రలో పేర్కొనటం జరిగింది. ''పూర్వ వ్యాకరణము లన్నియు పద్య కావ్య రచన కొఱకే. వచన కావ్యములు లేని కాలములో పుట్టినవగుటచేత అందలి లక్షణము లనే కము వచన కావ్యాభివృద్ధికి తగవు'' అని నిర్ద్వంద్వ ముగా ఉద్ఘాటించారు. ఇదంతా గిడుగు వారి భాషో ద్యమ జైత్రయాత్రా ఫలమే. నేడు పత్రికా ప్రపంచం మొదలుకొని విశ్వవిద్యాలయాల వరకు విశృంఖలంగా వ్యావహారిక భాషా రచన జరుగుతున్నదంటే అదంతా గిడుగు వారి సంకల్ప కల్పంక విదిసిన స్నిగ్ధ పరిమ ళమే. అందుకే ఆధునిక భాషా పరిశోధనకు వెలుగు దారులు పరిచిన మనీషి గిడుగు రామమూర్తి పంతులు గారు.

అయితే పరవస్తు చిన్నయసూరిగారు, రేకము రామానుజసూరిగారు, కరాలపాటి రంగయ్యగారు, నిశ్చింత తేవప్పెరుమాళ్ళయ్యగారు భారతాది ప్రాచీన గ్రంథాలు పఠించిన తీరు, భావించిన పరిష్కారము గ్రాంథిక భాషా స్థిరత్వానికి వెన్నెముకగా నిలిచాయి. 1834 లో రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు వ్యావహా రిక భాషలోనే రచించి ముద్రించిన పంచతంత్రము 1870 తరువాత కావ్య భాషలో క్రొత్త అవతారం దాల్చటానికి హేతువులు మనం తేలికగా ఊహించుకో గలం. సూరిగారి భాషా సాహిత్య కృషిని తక్కువగా అంచనా వెయ్యటం అపచారం. గ్రాంథికమైన ఆంధ్ర భాషకు చిన్నయ ఆద్యుడనే గౌరవభావం పండితులలో విస్తృతంగా వుంది; నాడేకాదు నేడూ వున్నది. పద్య కావ్య ఫక్కి ననుసరించిన ఆధునిక గ్రాంథిక వచన రచనా గంగావతారణకు చిన్నయ అభినవ భగీరథుడే. ఆంధ్ర సాహిత్య సమీక్ష సాగించిన శతసహస్రాధిక పండితులకు, విమర్శకులకు చిన్నయ వచన రచన ఒజ్జబంతిగా పరిణమించింది. వ్యావహారికం విచ్చల విడిగా విజృంభించిన ఈనాడు కూడా మడిగట్టుకొని గ్రాంథిక వచనం వ్రాసేవారికి చిన్నయ్యే అన్నయ్య.

కట్టమంచి రామలింగారెడ్డిగారి వంటి ఆధునిక సాహిత్య విమర్శకులు కూడా వేదికలపై తెలుగులో ఉపన్యసించవలసివస్తే తొలినాళ్ళలో సూరి గారి గ్రాంథిక వచన ఫక్కిలోనే ఉపన్యసించేవారు. నాటి పండితుల్లో అధిక సంఖ్యాకు లట్లాగే ఉపన్యసించేవారు. నేడావీరగ్రాంథికం సాంఘిక నాటకాలలో హాస్యం సరఫరా చెయ్యటానికి ఉపయోగిస్తున్నది.

ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో పెక్కింటికి బాటలు పరిచిన మనీషి వీరేశలింగం పంతులు గారే. అయినా నవయుగ సాహితీ వైతాళికుడుగా ఆయనతో

పాటు తొలిపూజ లందుకున్న దిట్ట గురజాడ అప్పారావుగారు. వ్యావహారికభాషా ప్రయోగం ఆయన చేతిలో క్రొత్త రూపు సంతరించుకున్నది.

ఆధునిక విమర్శ రీతులలో కట్టమంచివారు త్రొక్కిన దారి అప్పటికి అపూర్వం. ప్రాచీన కావ్యాలకు ఆంగ్ల విమర్శన సూత్రాలు సమన్వయించి కవిత్వాన్నీ, కవి తత్త్వాన్నీ, కావ్యపాత్రల తత్త్వాన్నీ అన్వేషించే చూపు నాటికి క్రొత్తచూపు. బాధ్యత గల విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి నలంకరించి పండితులకు ఆదేశాలిచ్చి కావ్య సమీక్షాదులకు గ్రంథ పరిష్కారాదులకు కూడా దోహదం కల్పించిన ప్రోఢ కట్టమంచి.

**ఉదయరాగం :**

విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలు పరిశోధన కేంద్రాలుగా రూపుదిద్దుకునే రోజు లవి. ఒక ప్రక్క ఆంధ్ర విశ్వవిద్యాలయం, మరొక ప్రక్క మద్రాసు విశ్వవిద్యాలయం, ఈ ప్రక్క ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు భాషా సాహితీ పరిశోధన కేంద్రాలుగా క్రొత్త రూపు సంతరించుకుంటున్నాయి. పింగళి లక్ష్మీకాంతం గారు, కోరాడ రామకృష్ణయ్యగారు, ఖండవల్లి లక్ష్మీరంజనం గారు మొదలైన దక్షుల శిక్షాదక్షతలతోను, చోదన కౌశలంతోను డాక్టరేట్ డిగ్రీలకు పరిశోధకులు నమోదు కావటం, పరిశోధన వ్యాసాలు సమర్పించటం మొదలైన వేడుక విస్తృతం కాజొచ్చింది. భాషా సారస్వత సంబంధమైన తెలుగు డాక్టర్ల అవతరణం విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలలో వింత వెలుగు వెదజల్లసాగింది.

1929 లోనే చిలుకూరి నారాయణరావు గారు మద్రాసు విశ్వవిద్యాలయం నుండి పి.హెచ్.డి. పట్టి మందుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 'ఆంధ్ర ప్రబంధం-అవతరణ వికాసాలు' అనే అంశం మీద కాకర్ల వేంకటరామనరసింహం గారు 1945 లో డాక్టరేట్ డిగ్రీ పుచ్చుకున్నారు. నాటికి తెలుగు డాక్టర్ల సంఖ్య వ్రేళ్ళ మీద లెక్కించతగిందే.

డాక్టరేట్ డిగ్రీల కోసం కాకపోయినా సాహితీ క్షేత్రంలో కృషి చెయ్యటమే జీవలక్షణంగా రూపొందిన మనీషులు పలువు రున్నారు. తెలుగు భాషా సాహితీ పరిశోధనకు నారుపోసినవారు కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు, నీరుపోసినవారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, సురవరం ప్రతాపరెడ్డి గారు, జయంతి రామయ్య పంతులు గారు, ముట్నూరి కృష్ణరావు గారు, వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మొదలైన ప్రాజ్ఞు లెందరో! కావ్య సమీక్షాది మార్గంలో రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, వేలూరి శివరామ శాస్త్రిగారు, తిరుమల రామచంద్ర గారు, బండారు తమ్మయ్యగారు, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, గడియారం శేషశాస్త్రి గారు, పుట్టపర్తి నారాయణాచార్యులు గారు మొదలైన పండిత ప్రకాండు లెందరో వున్నారు. కట్టమంచి వారి తరువాత తెలుగు సాహిత్య విమర్శ పథంలో శిల్పానుశీలన ప్రక్రియను, రస వ్యాఖ్యాప్రవృత్తినీ వర్ణనాత్మకంగా వివేచించిన కవి విమర్శకుడు విశ్వనాథ. విశ్వనాథ వారి దృష్టితో నిడుదవోలు వేంకటరావు గారు పరిశోధన పరమేశ్వరుడు. ప్రాచీన కావ్యపాఠ పరిశీలనలు, సుష్ఠుపాఠ నిర్ణయాలు చేసిన పండితుల కృషి పరిశోధన మార్గంలో అవశ్యం స్మరణీయం. భాషా సాహిత్య పరిశోధనకు చారిత్రక పరిశోధన అత్యంతావశ్యకం. మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరు వేంకట రమణయ్య, చిలుకూరి వీరభద్రరావు, కుందూరి ఈశ్వరదత్తు, మామిడిపూడి వేంకటరంగయ్య గార్ల పరిశోధన ఫలితాలు సాహిత్య పరిశోధనకు ఎంతగానో ఉపకరించాయి. భాషా సాహిత్యాలను చరిత్రతో సంవదించుకుంటూ చేసే పరిశోధన సర్వదా సత్ఫలితాలనిస్తుంది. అందువల్లనే భాషాసాహిత్య పరిశోధన వికాస పరిశీలనలో చరిత్ర పరిశోధన దక్షుల సంస్మరణ అనివార్యం.

అముద్రిత తాళపత్ర గ్రంథాదుల పరిశీలన పరిష్కరణాదుల్లో మునిగితేలిన మానవల్లి రామకృష్ణ కవి వంటి మనీషుల కృషి సాహిత్య పరిశోధన రంగంలో వెలుగు వెల్లువలు క్రుమ్మరించిం దనటంలో సందేహం లేదు. ఈ మార్గంలో కృషి చేసిన ప్రాచ్యలిఖిత గ్రంథాలయాదుల పాత్ర కూడా విస్మరించరానిది. స్వతంత్ర గ్రంథ ప్రచురణ సంస్థల పాత్ర అంతకంటే విస్మరించరానిది. ప్రాచీనాంధ్రగ్రంథ పరిష్కరణకు కంకణం కట్టుకొన్న వావిళ్ల రామస్వామి శాస్త్రులు, ఆనంద ముద్రణాలయాధి నేతలు, ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యకర్తలు, వేంకట్రామ అండ్ కంపెనీ వారు గుర్తుంచుకోదగినవారు. వేదం వేంకటరాయశాస్త్రి గారి ఆముక్తమాల్యదా నైషధ వ్యాఖ్యానాదులు సాహిత్య పరిశోధనాంబుధిలో వెలువడిన చిరత్నరత్నాలే. కాకపోతే - వాటిని క్రమబద్ధమైన డాక్టరేట్ డిగ్రీల కోసం జరిగిన కృషి క్రింద జమ కట్టలేము.

విశ్వవిద్యాలయాల తెలుగు పాఠ్య ప్రణాళికలలో ప్రత్యేకంగా భాషాచరిత్ర, శాసన భాషాచరిత్ర, సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శ మొదలైనవి చేర్చబడటం, వాటిని బోధించే ఆచార్యులు బి. ఏ., ఎం. ఏ., బి. ఓ. యల్; ఎం. ఓ. యల్. మొదలైన తరగతుల విద్యార్థులకు ఆయా అంశాలు క్రమబద్ధంగా బోధించటం ప్రారంభించిన తరువాత ఆ పాఠ్యాంశాలలోని ఏకదేశాలు గ్రహించి, పరిశోధన చేయాలనే జిజ్ఞాస విద్యార్థుల్లో పెంపొందటం కారణంగా పలువురు విద్యార్థులు (నేడు వీరిలో పెక్కురు సుప్రసిద్ధాచార్యులు, అధ్యాపకులు) పరిశోధన రంగంలోకి హుటాహుటిని దూకటం జరిగింది.

ఆంధ్ర సాహిత్య చరిత్ర-విమర్శాచార్యులుగా పింగళి లక్ష్మీకాంతం గారు విశ్వవిద్యాలయాంధ్ర విద్యార్థుల మనస్సులలో చెరగని ముద్రవేశారు. ఆధికారిక వచన రచనా సుభగత్వంతో సాగిన వారి 'డిక్టేషన్స్' శిష్యప్రశిష్యుల జిహ్వాలపై చిరంతనంగా నాట్యం చేశాయి. పింగళి సూరన్నను గూర్చి చెప్పినా, గోన బుద్ధారెడ్డిని గూర్చి చెప్పినా కట్టమంచి విమర్శ కట్టడులకు మంచి కట్టలు కట్టారనిపించింది. సాహితీ పరిశోధకులైన పలువురు శిష్యులకు పరమచోదకశక్తిగా పనిచేసినవారు పింగళివారు.

మరొకప్రక్క ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రాచార్యపదవి నలంకరించి ఆంధ్రుల చరిత్ర సంస్కృతుల నన్వేషిస్తూ, సాహిత్య చరిత్రను సంగ్రహిస్తూ తెలుగు దుక్కిని తెలివిగా దున్నిన సాహితీకర్షక శిఖామణి ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. విశ్వవిద్యాలయం తెలుగు విభాగ విస్తృతికీ పరిశోధనావకాశాల వికాసానికీ ఈ ఆచార్యుని కృషి అఖండం. ఉస్మానియా విశ్వవిద్యాలయ - ఆంధ్రమహాభారత సంశోధితప్రతి పండిన పలువురు పండిత పరిశోధకుల కృషిని సమీకరించుకున్న సంశోధన ఫలం.

అటు మద్రాసు విశ్వవిద్యాలయంలో కోరాడ రామకృష్ణయ్యగారు భాషాసాహిత్య రంగాలు రెండింటిలోను తీవ్రకృషి సాగించారు. ద్రావిడ భాషలను గూర్చి, అందులో సంధి లక్షణం గూర్చి మాత్రమే కాక, కావ్యాలోకన దృష్టితో ఆంధ్ర భారత కవితా విమర్శనం, కుమార సంభవ పరిష్కార పీఠికా రచనాదులు సంతరించి భాషా సాహితీ పరిశోధక విద్యార్థులకు క్రొత్త రుచులు చవి చూపసాగారు.

బహుభాషా పాండిత్యం భాషాసాహిత్యాధ్యాపకులకు గౌరవమర్యాదలు పెంచగలవు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో గంటి జోగి సోమయాజిగారి భాషా పరిశోధన కృషికి ఆయనకు గల భాషా పాండిత్యం ఎంతగానో తోడ్పడింది. 1947 లో 'ఆంధ్రభాషా వికాసము' వెలువడటంతో భాషా పరిశోధకుల గుండెల్లో క్రొత్త పెరపెరలు మొదలైనాయి. సుమారు పధ్నాలుగు సంవత్సరాలుగా వారు ఆంధ్ర విశ్వకళా పరిషత్కళాశాల తెలుగు ఆనర్సు విద్యార్థులకు ఆంధ్ర

భాషా చరిత్ర బోధించడంవల్ల కలిగినఫలం 'ఆంధ్ర భాషా వికాసం'. ఇది ఒక విధంగా పింగళివారి సాహిత్య చరిత్ర- విమర్శ బోధన ఫలం వంటిదే.

సోమయాజిగారి 'భాషా వికాసము'నకు Fore word వ్రాస్తూ కట్టమంచి వా రొకమాటన్నారు: "I suppose the epoch-making book of Bishop Caldwell, the poineer explorer in this field, will always remain the leading classic on the subject round which developments revolve sped by time and discovery. In the list of books, not many, that have to be mentioned in near order, though subsequent, vidwan Somayaji's 'Andhra Bhasha Vikasamu' or Evolution of 'Telugu' will occupy very high rank."

ఈ మాట అక్షరాలా నిజం:

ఈ గ్రంథం వెలువడ్డ ఎనిమిదేండ్లకు-అంటే 1955 లో- వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి 'ద్రావిడ భాషా పరిశీలనము' వెలువడింది. 'చింతామణీ విషయ పరిశోధనము', 'ఆంధ్ర వైయాకరణ పారిజాతము' 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము' మున్నగు భాషా వ్యాకరణ సంశోధన గ్రంథాభరణాలను ఆంధ్ర వాగ్దేవతకు సమర్పించిన ప్రౌఢ పండితుడు ఈయన. "ద్రావిడ భాషా పరస్పర సంబంధ విశదీకరణ దక్ష శబ్దతత్త్వశాస్త్రపు లేమి ఆంధ్ర సరస్వతీ వైభవమునకొక కొఱంతయయ్యె"నని చింతించి 'ద్రావిడ భాషా పరిశీలన' మనే బృహద్గ్రంథం వ్రాసినట్లు ఆ గ్రంథానికి మున్నుడిగా చేసిన 'విజ్ఞప్తి'లో (పుట viii) వారే పేర్కొన్నారు. "డా. కాల్డు వెల్లుగారు వైదేశికు లగుటచేతను వారి వ్యాకరణము ప్రథమ ప్రయత్న సిద్ధమగుట చేతను, నయ్యది బహూపయోగ యోగ్యమయ్యును నందు సహింపరాని దోషములు నపసిద్ధాంతములును గల" వని కూడా శాస్త్రిగారు పేర్కొన్నారు (పు. iv). కాల్డ్వెల్ సిద్ధాంతములను గూర్చి మాత్రమే కాకుండా "చిలుకూరి నారాయణరావు గారు చూపిన పైశాచీ లక్షణములు ద్రావిడ భాషలందు లేవు" అనే విషయాన్నికూడా విపులంగా విమర్శించారు (పుటలు 30-37). శాస్త్రిగారు పట్టుపట్టి బహుభాష లభ్యసించి, శాస్త్ర చక్షువుతో భాషా తత్త్వ పరిశీలనం చేసిన పద్ధతి పరిశోధక విద్యార్థు లెందరికో నూతనోత్తేజం కలిగించింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వ్యాకరణ ప్రసక్తి వస్తే దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు వెంటనే గుర్తు వస్తారు. చిరకాలం బాల వ్యాకరణం బోధించి, చిన్నయ సూరిని వ్యాకరణ విద్యార్థుల హృదయ పీఠికపై సుస్థిరంగా ప్రతిష్ఠించి, వ్యాకరణ పాఠమంటే సాహిత్య పాఠం కంటే రసవత్తర మనిపించేట్లు చేసిన మనీషి, మహామనస్వి దువ్వూరి. అధ్యాపకుడు ముందు విషయం పట్ల రుచి పుట్టిస్తే పరిశోధన క్షేత్రం క్రమంగా అదే ఫలిస్తుంది. దువ్వూరివారు చేసిన మహోపకారం అదే. పింగళి సూరనాదుల సాహిత్య ప్రథను కప్పుర తావులు గుప్పించే కమ్మని నోటితో వివరించి సాహిత్య సంశోధనకు కూడా పలువురు పరిశోధక విద్యార్థులకు అంతఃప్రేరణ కలిగించిన రసజ్ఞ పండితు డాయన. ఒకవంక వీరు, ఇంకొక వంక పింగళివారు, కాకర్ల వేంకట రామనరసింహం గారు-ఇందరు పూనుకొని సాహితీ విమర్శ క్షేత్రం దున్నటంవల్ల ఆంధ్ర విశ్వకళా పరిషత్తు భాషా పరిశోధన రంగంలో కంటె సాహిత్య పరిశోధన రంగంలోనే ఎక్కువ పంటలు పండించింది.

**క్రాంతి కిరణాలు :**

1956 లో కొత్తపల్లి వీరభద్రరావు గారు 'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం' గూర్చి

పరిశోధించి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్టం పొందారు. అదే సంవత్సరం అదే విశ్వ ''విద్యాలయం నుండి టి. వి. నారాయణ శాస్త్రిగారు ప్రాచీనాంధ్ర శాసనాలను" గూర్చి పరిశోధించి పి హెచ్.డి. పట్టం పొందారు. అదే సంవత్సరం ఇక్కడ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బిరుదురాజు రామరాజుగారు 'తెలుగు జానపద గేయ సాహితం' మీద పరిశోధన పట్టం గ్రహించారు. సరిగా అదే సంవత్సరం మద్రాసు విశ్వవిద్యాలయం నుండి జి.యన్. రెడ్డిగారు 'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం - అనువాదాలు-అనుసరణలు' అనే అంశం మీద ఎం. లిట్ సంపాదించారు. 'తెలుగు సాహిత్యంలో శైవతత్త్వం- దక్షిణ భారత సంస్కృతి చేసిన సేవ'ను గూర్చి పరిశోధించి ఎం. ఆదిలక్ష్మిగారు కూడా ఎం. లిట్ సంపాదించారు. మొత్తంమీద 1956 వ సంవత్సరం తెలుగు భాషా సాహిత్య పరిశోధనకు ననలు తొడిగిందని చెప్పవచ్చు.

1957 తెలుగు పరిశోధన రంగంలో క్రొత్త పరిమళాలు వెదజల్లింది. పరిశోధన వికాసానికి ముమ్మందు మహాకృషి జరుగగలదన్న విశ్వాసం కలిగించింది ఈ సంవత్సరం. 'ప్రాఙ్నన్నయ యుగము- నన్నయ భారత' మనే అంశం మీద ఉస్మానియా నుండి దివాకర్ల వేంకటావధానిగారు, 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' మీద ఆంధ్ర నుండి యస్వీ జోగారావు గారు, 'Telugu Verbal Bases-Comparative and Descriptive Study' గూర్చి విదేశాలకూడా పోయి పెన్సిల్వేనియా నుండి భద్రిరాజు కృష్ణమూర్తి గారు డాక్టరేట్ పట్టాభిషిక్తులైన సంవత్సరం అది. ఈ పరిశోధకులను మనీషులుగా దిద్ది తీర్చిన చోదక శక్తులు మాత్రమే కాక పరిశోధకుల దీక్షా దక్షతలు కూడా కొనియాడదగినవే.

1958 లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి 'Studies in Kalapurnodayamu' విషయంగా పి.హెచ్.డి. అందుకున్న జి. వి. కృష్ణారావు గారు సాహిత్య రంగంలో అందె వేసిన చేయి. కేవల పరిశోధన వ్యాసం వల్లనే కాకుండా ప్రాక్ప్రతీచీ తత్త్వ సాహిత్య సిద్ధాంతాలను ఆకళించుకొని అనేక గ్రంథాలు వ్రాసిన మహామనీషి. విశ్వవిద్యాలయాచార్య పదవి నధిష్ఠించి పరిశోధక విద్యార్థులకు అయన చోదకత్వమే లభించివుంటే సాహిత్య పరిశోధనలో బంగారు పంటలు పండించి ఉండేవాడు. శాస్త్రీయమైన సృజనాత్మక సాహితీ పరిశోధన క్షుణ్ణంగా జరగాలనే తపనగల జిజ్ఞాసువు జి. వి. కృష్ణరావు.

మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ నలంకరించిన కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి, నిడుదవోలు వేంకటరావు, శిష్టా రామకృష్ణశాస్త్రి గారల పరిశోధన కృషి గణనీయం. ప్రెసిడెన్సీ కళాశాలలో ఆచార్య పదవి నధిష్ఠించిన భూపతి లక్ష్మీనారాయణ రావుగారు, పచ్చయప్ప కళాశాలలో ఆచార్య పదవి నిర్వహించిన యస్.వి. భుజంగరాయ శర్మగారు పలువురు తెలుగు విద్యార్థులకు పరిశోధన జిజ్ఞాస రేకెత్తించిన మనీషులు.

1956, 57 లలో పరిశోధన పట్టాలందుకున్న పలువురు తెలుగు డాక్టర్లు క్రమంగా వివిధ విశ్వవిద్యాలయాలలో ఆచార్య పదవు లందుకొని అనేక పరిశోధక విద్యార్థులకు మార్గదర్శకులు కాగలిగారు. కొత్తపల్లి, జి. యన్. రెడ్డి, బిరుదురాజు, దివాకర్ల, భద్రిరాజు, యస్వీగారలు ఈ కోవకు చెందినవారే.

**వికాస దీప్తులు :**

1960 నుండి 69 వరకు గల దశాబ్దిని తెలుగు పరిశోధన వికాస దశగా చెప్పవచ్చు. దేశ విదేశ విశ్వవిద్యాలయాలైదారింటి నుండి సుమారు యాభైయైదు మంది తెలుగు పరిశోధకులు భాషా సాహిత్యాలలో డాక్టరేట్ పట్టభద్రులైన శుభ సమయ మది.

అంతకుముందు ఇంతటి బహుళ సంఖ్యలో పట్టా భిక్షుకులు లేరు. సంఖ్యాబలమే కాక సిద్ధాంత దర్శన తాత్పర్యం కూడా బలపడింది.

ఉస్మానియా నుండి 1960 లో '16 వ శతాబ్ది లోని ప్రబంధ వాఙ్మయం : తద్వికాసం' గూర్చి పల్లా దుర్గయ్యగారు, 'తిక్కన కావ్యశిల్పం : తత్త్వ దర్శనం' గూర్చి కేతవరపు రామకోటిశాస్త్రి గారు, 1961 లో 'తెలుగు నాటక వికాసం' గూర్చి పోణంగి శ్రీరామ అప్పారావుగారు, 1962 లో 'ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగముల' గూర్చి సి. నారాయణరెడ్డిగారు, 'రామరాజభూషణుని కృతుల' గూర్చి కోవెల సుప్రసన్నాచార్యులు గారు పరిశోధక పట్టాలందుకున్నారు. ఈ అయిదుగురు సాహిత్యమునకు సంబంధించిన పరిశోధకులే. వీరిలో ఆచార్య పదవు లధిష్ఠించినవారు పలువురు పరిశోధకు లకు మార్గదర్శకులై పరిశోధన వికాసమునకు దోహదం చేయగలిగారు.

1961 లో కలకత్తా విశ్వవిద్యాలయం నుండి కోరాడ మహదేవశాస్త్రిగారు 'ఆంధ్రభాషా చారిత్రక వ్యాకరణం' గూర్చి పరిశోధించి డి. లిట్. పట్టం పొందగలిగారు. శాస్త్రీయమైన భాషా పరిశోధనలో పలువురు విద్యార్థులకు చోదకశక్తిగా పనిచేసినవారు మహదేవశాస్త్రిగారు.

ఆంధ్ర నుండి 1962 లో 'తెలుగులో స్థల పురాణాలు : వాటి స్వభావ పరిశీలన' అనే అంశం మీద జి. వి. జి. కృష్ణమాచార్యులుగారు, 1963 లో 'ఆంధ్ర సాహిత్యంలోని సామెతలు నుడికారాలు : సేకరణ వివరణ' అనే అంశం మీద చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పిహెచ్.డి. సంపాదించారు. ఇదే సమయంలో ఉస్మానియా నుండి 'పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి సాహిత్య సృష్టి: సవిమర్శక పరిశీలన' అనే అంశం మీద ముదిగొండ వీరభద్ర శాస్త్రిగారు పిహెచ్.డి, మద్రాసు నుండి 'తెనాలి రామకృష్ణ కవి రచనలు' శోధించి దేవళ్ళ చిన్ని కృష్ణయ్యగారు ఎం.లిట్, మైసూరు నుండి 'తిక్కన భారత దర్శనం' గూర్చి ఎన్. వి. ఆర్. కృష్ణమా చార్యులుగారు పిహెచ్.డి. -పట్టాలు పరిగ్రహించారు. వీరి పరిశోధనాంశము లన్నీ సాహిత్యానికి సంబం ధించినవే. మైసూరులో కె. సుబ్బరామప్పగారు తెలుగు పరిశోధకులకు ఎంతగానో సాయపడిన సౌమనస్య మూర్తి.

1964 లో ఆంధ్ర నుండి 'ద్రావిడ భాషా క్రియా నిర్మాణం : తులనాత్మక పరిశీలన' అనే అంశం మీద పి. యస్. సుబ్రహ్మణ్యం గారు, ఉస్మానియా నుండి 'ఆంధ్ర వచన వాఙ్మయం : ఉత్పత్తి వికాసాలను' గూర్చి ఎం. కులశేఖరరావుగారు, 'ఆంధ్రమహాభారతం: ఛందశిల్పము' గురించి పాటి బండమాధవశర్మగారు, శ్రీ వేంకటేశ్వర నుండి 'తెలుగు సమాసాల పరిశీలన' చేసి జాస్తి సూర్యనారాయణ గారు, మైసూరు నుండి 'శ్రీనాథుని కవితాదృక్పథం' దర్శించి కూచిభొట్ల హరిగారు, మద్రాసు నుండి 'A study of Telugu Semantics' మీద జి. యన్. రెడ్డి గారు పిహెచ్.డి. లు పొందారు. అదే సంవత్సరం మద్రాసు నుండే 'తెలుగులో కథా సాహిత్యం' శోధించి సి. విజయలక్ష్మిగారు 'తెలుగు సాహిత్యంలో రచయిత్రుల్ని' సమీక్షించి వై. సరోజినీ దేవిగారు, 'తెలుగు సాహిత్యంలో తమిళ మౌలికత' రూపించి చల్లా రాధాకృష్ణశర్మగారు ఎం.లిట్. పట్టాలు గ్రహించారు. ఈ సంవత్సర కాలంలో భాషాశాస్త్ర పరిశోధన ప్రగతి కూడా కొంత వేగం పుంజు కున్నట్లే.

1965 లో ఆంధ్రనుండి 'వైకృతపద స్వరూప నిరూపణ' చేసి తూమాటి దోణప్పగారు, 'శ్రీనాథుడు: ఆంధ్రీకరణ విధానం , చారిత్రక విశేషాలు' వివరించి కొర్లపాటి శ్రీరామమూర్తి గారు, 'A Historical Grammar of Early Inscriptional

Telugu (upto 1100 AD)' రచించి బూదరాజు రాధాకృష్ణగారు, ఉస్మానియా నుండి 'ఆంధ్రశతక వాఙ్మయం : ఉత్పత్తి వికాసాల' గూర్చి కె. గోపాల కృష్ణరావుగారు, 'వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన' గురించి అక్కిరాజు రమాపతిరావు గారు, 'ఆధునిక కవిత్వంలో మానవుడు, ప్రకృతి' గురించి అరిపిరాల విశ్వనాథం గారు శ్రీ వేంకటేశ్వ నుండి 'నన్నయ భాషకు వర్ణనాత్మక వ్యాకరణం' రచించి కల్లూరి నాగభూషణరావుగారు, మైసూరు నుండి 'తెలుగు భాషా వాఙ్మయంపై వీరశైవమత ప్రభావం' గూర్చి జీరెడ్డి చెన్నారెడ్డిగారు డాక్టరేట్ డిగ్రీలు సంపాదించారు. క్రమంగా ఆచార్య పదవు లలంకరించిన వీరిలో పలువురు భాషా సాహిత్య పరిశోధనలకు జీవం పోసిన సుమనస్కులు.

1966 లో ఆంధ్రనుండి 'తెలుగు వ్యాకరణ వికాసము' మీద బొడ్డుపల్లి పురుషోత్తంగారు, 'నాచన సోమన : అతని కృతుల' మీద వి. కామేశ్వరరావు గారు, ఉస్మానియా నుండి 'విజయనగరయుగపు తెలుగు సాహిత్యంపై వైష్ణవతత్త్వ ప్రభావం' గురించి వేటూరి ఆనందమూర్తిగారు, 'కవిత్రయం : నాచన సోమన కావ్యానుశీలనం' గురించి మాదిరాజు రంగా రావుగారు, 'పోతన : అతని కృతులను' గురించి వి. రాజేశ్వరిగారు, 'దక్షిణాంధ్ర వాఙ్మయంలో భాషా విశేషాల' గురించి జె. హేమలతగారు, శ్రీ వేంకటేశ్వర నుండి 'ఎఱ్ఱాప్రెగడ కృతులు : పౌర్వాపర్యం' మీద వి. రామచంద్రగారు పిహెచ్. డి. పట్టా లందుకున్నారు. మొత్తంమీద ఈ సంవత్సర మంతా భాషాశాస్త్రం వైపుకంటే సాహిత్య విషయం వైపే మొగ్గు కనిపిస్తోంది.

1967లో-ఆంధ్ర నుండి 'తెనాలి రామకృష్ణుని కావ్య పరిశీలన' చేసి ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు, 'ఆంధ్ర శాసన సారస్వతంలోని ఉర్దూ-మరాఠీ పదాల'ను శోధించి లకుసాని చక్రధరరావుగారు, 'కుమారసంభవ విమర్శ' కావించి తమ్మారెడ్డి నిర్మల గారు, ఉస్మానియా నుండి 'ఆముక్తమాల్యదా సౌందర్యం' దర్శించి తుమ్మపూడి కోటేశ్వరరావు గారు, 'ఆంధ్ర నవలా పరిణామం' పరిశీలించి బి.వి. కుటుంబరావుగారు, శ్రీ వేంకటేశ్వర నుండి 'ఆంధ్ర భాగవత విమర్శ' చేసి పి.వి.యల్.ప్రసాదరావుగారు, 'నన్నెచోడ కుమారసంభవానికి వర్ణనాత్మక వ్యాకరణం' వ్రాసి లింగంనేని బసవశంకరరావుగారు డాక్టరేట్ డిగ్రీలు పొందారు. ఈ సంవత్సరంలో కూడా సాహిత్య విషయాలవైపే మొగ్గుకనిపిస్తున్నది.

1968 లో ఆంధ్ర నుండి 'ఉత్తర రామాయణ విమర్శ: తిక్కన, కాచవిభులుడు, పాపరాజు' గూర్చి మారుటూరి పాండురంగారావుగారు, ఉస్మానియా నుండి 'కేతన : అతని కృతుల' గురించి హరిశివ కుమార్‌గారు, శ్రీవేంకటేశ్వర నుండి 'క్రీ.శ. 12-19 శతాబ్దుల తెలుగు శాసన భాషా చారిత్రక వ్యాకరణం' గురించి ఎం. కందప్పచెట్టిగారు, 'ఆంధ్రసాహిత్యంలో దేశి కవితోద్యమం: పాల్కురికి సోమనాథుని పాత్ర' గురించి తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు, మద్రాసు నుండి 'తమిళం తెలుగులలో రామాయణం' గురించి చల్లా రాధాకృష్ణశర్మగారు, కార్నెల్ విశ్వ విద్యాలయం నుండి 'A Transformational study of Telugu Nominals' గురించి చేకూరి రామారావుగారు పరిశోధన పట్టము లందు కున్నారు. ఈ సంవత్సరపు తెలుగు డాక్టర్ల పరిశోధన వాసిలో సాహిత్యం వైపు మొగ్గినా వన్నెలో భాషా శాస్త్రం వైపే మొగ్గింది.

1969 పూర్తిగా సాహిత్య పరిశోధనకే అంకితమైపోయింది. ఆంధ్రనుండి 'పాల్కురికి సోమన: అతని కృతుల'ను గురించి పి. వీరేశలింగంగారు, ఉస్మానియా నుండి 'తెలుగులో హరివంశాల' గురించి పి. యశోదారెడ్డిగారు, 'మార్కండేయ పురాణం: ప్రబంధ కథామూలం' గురించి జి.వి. సుబ్రహ్మణ్యం

గారు, 'పోతన కృత శ్రీమదాంధ్ర మహాభాగవతాను శీలన' గురించి ధూళిపాళ శ్రీరామమూర్తిగారు, శ్రీవేంకటేశ్వర నుండి 'తెలుగు వీరగాథా కవిత్వం' గురించి తంగిరాల వేంకటసుబ్బారావుగారు, మైసూరు నుండి 'ఎఱ్ఱాప్రెగ్గడ : అతని కృతుల' గురించి వి. విశ్వనాథశాస్త్రిగారు పరిశోధన జరిపి డాక్టరేట్ డిగ్రీ లందుకున్నారు. వీరిలో కొందరు బాధ్యత గల ఆచార్య పదవు లధిష్ఠించి సాహితీ పరిశోధకులకు చేదోడువాదోడుగా కృషి చేస్తున్న ప్రతిభాశాలులు.

ఈ కారణంవల్లనే మొత్తంమీద ఈ దశాబ్దిలో పట్టభద్రులైన పరిశోధకులను గురించి పేరుపేర ఇంత విశదంగా చెప్పవలసివచ్చింది.

విశ్వవిద్యాలయావరణలో పరిశోధక ముద్రతో వ్యాసాలు సమర్పించనకపోయినా పరిశోధన వ్యాసాల స్థాయికిమించి రచనలు సాగించిన విజ్ఞులు పలువు రున్నారు. వీరి రచనలు విశ్వవిద్యాలయ పరిశోధకుల కెంతగానో ఉపకరించాయి. ఆటువంటి వారిలో తిరుమల రామచంద్ర, ఆర్. యస్. సుదర్శనం, ఆరుద్ర, నిడుదవోలు సుందరేశ్వరరావు, టి. భాస్కరరావు గార్లు కొందరు. రామచంద్రగారి 'సాహితీ సుగతుని స్వగతం' 'తెలుగు లిపి పరిణామం' మొదలైన వ్యాసాలు అచ్చమైన పరిశోధన వ్యాసాలే. సుదర్శనం గారి 'సమాజము : సాహిత్యము' ; 'సాహిత్యంలో దృక్పథాలు' మొదలైన వ్యాస సంపుటులు పరిశోధ నాత్మక సాహిత్య విమర్శలే. ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యం,' వ్యాసపీఠం (ఆంధ్రజ్యోతి) మొదలైన రచనలు పరిశోధనాత్మకాలే. 1958 లో వెలువడిన వజ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారి 'వ్యావహారిక భాషా వ్యాకరణం' భాషాశాస్త్ర దృష్టితో నాటికి పరిశోధ నాత్మక వ్యాకరణమే. వ్యావహారిక భాషాప్రయోగ విషయంలో నార్ల వేంకటేశ్వరరావుగారి 'కొత్తగడ్డ' మొదలైన రచనలు లక్షణనిర్దేశాని కుపకరించిన లక్ష్య గ్రంథాలే. గోపాలకృష్ణయ్యగారు ఆయా లక్ష్యాల నుదాహరిస్తూ వ్యావహారిక వ్యాకరణసూత్రాలు వ్రాయటమే అందుకు నిదర్శనం. గోపాలకృష్ణయ్యగారు ప్రాచ్యలిఖిత గ్రంథాలయ సంచాలక పదవిలో వుండి పరిశోధక విద్యార్థులకు సంస్థ పక్షాన శిక్షణ ఇవ్వటం కూడా జరిగింది. "తెలుగులో బాలసాహితీ వికాసం: తెలుగునాట బాలల గ్రంథాలయ ప్రగతి" గురించి వెలగా వెంకటప్పయ్యగారు; 'ఆంధ్రభాష: యతి ప్రాసాదిచ్ఛందో విశేషాల' గురించి యన్.యన్.రాజుగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయం ద్వారా పరిశోధన జరిపి ఇటీవలనే డాక్టరేట్ డిగ్రీలందుకున్నారు. ఈ సంస్థ ప్రాచీనమైన, అమూల్యమైన, అముద్రితమైన అనేక తాళపత్ర గ్రంథాలను, కాగితపు వ్రాతప్రతులను సేకరించటమే కాక వాటిని పరిష్కరించి ప్రచురించటం కూడా జరిగింది. తెలుగు పురాణకావ్య ప్రబంధాదులకు విపుల విమర్శాత్మక పీఠికలు సంతరించ తెలుగు పరిశోధన ప్రపంచానికి కానుకగా సమర్పించటం జరిగింది. వ్యాకరణచ్ఛందోలంకార గ్రంథాలుకూడా ఈ సంస్థ పరిశోధన ప్రచురణలలో అంతర్భూతాలు.

ఆధునిక సాహిత్య పరిశోధన కుపకరించే అనేక విమర్శవ్యాసాలు వ్రాసిన అభినవకవి రచయిత లెందరో వున్నారు. నూతలపాటి గంగాధరం, సోమసుందర్, కె. వి. రమణారెడ్డి, రాచమల్లు రామచంద్రారెడ్డి, నగ్నముని గార్లు పేర్కొనదగ్గ పలువురిలో కొందరు. కాకపోతే ఒక్కొకసారి ఉద్యమాల ప్రభావంవల్ల సంయమంపాలు తక్కువైం దనిపించవచ్చు. ఆ మాటకు వస్తే ఆపాటి ఆవేశం మన వృద్ధ పండితులలోనూ లేకపోలేదు. వెనుకటి తరంలో జరిగిన పార్థమన్యు శ్రీమహోత్సవాల వేడుక మనకు తెలియందికాదు. నేటికీ సభల్లోను, పత్రికల్లోను జరుగుతున్న వాగ్యుద్ధాలు కాదనలేముగదా! ఒక విధంగా చైతన్యం, జిజ్ఞాస కల జాతికి ఇటువంటివి అనివార్యలక్షణాలే.

పత్రికల ప్రసక్తి వచ్చింది కనుక అభిప్రాయ నివేదనకు ప్రబలసాధనాలుగా రూపొందిన పత్రికలను పరిశోధకులు సద్వినియోగం చేసుకోవాలి. పరిశీలించి చూస్తే పరిశోధన వ్యాసాల ప్రచురణ కుద్దేశించబడిన పత్రికలు మనకు లేవు. విశ్వవిద్యాలయాల 'జర్నల్స్' వారపత్రికల స్థాయి నందుకుంటున్నాయి. తెలుగు భాషా సాహిత్యాలకు పరిమితమైన ఓరియంటల్ రిసెర్చి జర్నల్స్ మృగ్యం. ఉన్న ఒక్క ఆశాదీపం 'భారతి'. అదీ అప్పుడప్పుడు మినుకు మినుకుమంటూ వుంటుంది. ఇంత తైలంపోసి వత్తి ఎగదోసే ఉదార సంపాదకులున్నారు. భాషా సాహిత్యసేవకు అంకితమై కనిపించేది ఆ ఒక్క పత్రికే.

'పరిశోధన' అనే పేరుతో పావు శతాబ్దం క్రిందట (ఏప్రిల్ 1954 నుండి) తిరుమల రామచంద్ర గారి సంపాదకత్వంలో మద్రాసునుండి ఒక సారస్వత ద్వైమాసపత్రిక వచ్చేది. అట్లాగే పందిరి మల్లికార్జున రావుగారి సంపాదకత్వంతో కిన్నెర అనే పత్రిక కూడా ఒకటి వచ్చేది. పురిటిలో సంధికొట్టి ఆ పత్రికల పేర్లు మాత్రమే తీపిగుర్తులుగా మిగిలాయి. నిజానికి ఆనాడు వాటిలో ప్రచురించబడిన వ్యాసాలు పరిశోధక విద్యార్థులు నిక్షేపించుకోదగినవి. ఏమైనా ఇదంతా విశ్వవిద్యాలయాల వెలుపల జరిగిన భాషా సాహిత్య పరిశీలన కృషి క్రింద లెక్క. విశ్వవిద్యాలయాల పరిధిలో ప్రవేశించి చూస్తే భాషా శాస్త్ర విషయాల పరిశోధన కంటే సృజనాత్మక సాహిత్య విషయాల పరిశోధనే ఎక్కువ జరిగిందనిపిస్తుంది. ప్రాచీన సాహిత్యం మీద కోకొల్లలుగా పరిశోధన వ్యాసాలు వచ్చాయి. నన్నయ మొదలు వేమన్న వరకు ప్రసిద్ధ కవులెవ్వరూ పరిశోధకుల చూపు తప్పించుకోలేదు. ఈ చూపులు చాలవరకు వెలుగు దారులలోనే ప్రసరించాయి.

**వెలుగు దారులు :**

1970 తరువాత తెలుగు పరిశోధన మూడు పూలూరు కాయలుగా వర్ధిల్లిఁది. ఒక్కొక్క కవిని గూర్చీ కావ్యం గూర్చీ కొందరు, సాహిత్య ప్రక్రియలను గూర్చి కొందరు, విమర్శ లక్షణం గూర్చి కొందరు, కవిత్వాదర్శ పరిణామాల గూర్చి కొందరు, శైలీ విశేషాల గూర్చి కొందరు, తత్త్వ దర్శనాల గూర్చి కొందరు విషయ వైవిధ్యంతో విస్తృత పరిశోధనలు జరిపారు.

వేమన సర్వజ్ఞుల గూర్చి గంధం అప్పారావు గారు, ధూర్జటి గురించి టి.బి.యం. అయ్యావారు, పొన్నెకంటి హనుమంతరావు గారు, పెద్దన కవిత్వ నిర్వచనం గూర్చి సాళ్వ కృష్ణమూర్తిగారు, కోలాచలం నాటకాల గూర్చి యస్. గంగప్పగారు, బసవేశ్వర వచనాల గురించి బాడాల రామయ్యగారు, విజయ విలాసం గూర్చి కలిదిండి వెంకటరాజుగారు, వేలూరి శివరామశాస్త్రిగారి కృతులను గురించి జంధ్యాల మహతి శంకర్‌గారు. జాషువా కృతులను గూర్చి బి. భాస్కర చౌదరిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగార్ని గురించి పోచిరాజు శేషగిరిరావు గారు, శ్రీశ్రీ కవిత్వం గురించి మిరియాల రామకృష్ణగారు పరిశోధించారు. ఇవన్నీ దాదాపు కవిని గూర్చీ కావ్యం గూర్చీ జరిగిన పరిశోధనలు.

సాహిత్య ప్రక్రియల దృష్టితో చూస్తే నాయని కృష్ణకుమారిగారి 'జానపద గేయగాథలు', బి. అరుణకుమార్యిగారి 'చారిత్రక కావ్యాలు', కొలకలూరి ఇనాక్ గారి 'తెలుగు వ్యాస పరిణామం', తిరుమల శ్రీనివాసాచారిగారి 'తెలుగు గేయ నాటికలు', పోరంకి దక్షిణామూర్తి గారి 'తెలుగు కథానిక స్వరూప స్వభావాలు' అవశ్యం గుర్తుంచుకోదగినవి.

వర్ణనాత్మక పరిశీలన దృష్టితో చూస్తే కె. మలయవాసిని గారి 'ఆంధ్ర వాఙ్మయంలో రామాయణాలు', అంతటి నరసింహంగారి 'ప్రబంధాలలో ప్రకృతి వర్ణన', ఇరివెంటి కృష్ణమూర్తిగారి 'కవి సమయాలు', ధారా రామనాథ శాస్త్రిగారి 'ఆంధ్ర వాఙ్మయంలో కృష్ణ కథ' అత్యంత పరిగణనకు వస్తాయి.

అనువాద పరామర్శ దృష్టితో చూస్తే జె. మృత్యుంజయరావుగారి 'వ్యాస భారతము నన్నయ పరిష్కారము' కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది.

వ్యాకరణ తత్త్వ పరిశీలన దృష్టితో చూస్తే అమరేశం రాజేశ్వర శర్మగారి 'ఆంధ్ర వ్యాకరణ వికాసం', జి. లలితగారి 'తెలుగు వ్యాకరణ సంప్రదాయాలు' విస్పష్టంగా కనిపిస్తాయి.

లౌకికాలౌకిక విషయ వివేచనతో చూస్తే పి. వెంకటపతి రాజుగారి 'మహాభారత ఉపాఖ్యాన తత్త్వము' అప్పజోడు వెంకటసుబ్బయ్యగారి 'మహాభారతంలో మానవ స్వభావ చిత్రణ', రత్నాకర బాలరాజుగారి 'సీతారామాంజనేయ సంవాద కావ్య సమాలోచన' దృగ్గోచర మౌతాయి.

అలంకారశాస్త్ర సమన్వయ దృష్టితో చూస్తే వి.వి.యల్. నరసింహారావుగారి 'నన్నయ భారతము: అక్షర రమ్యత', శలాక రఘునాథశర్మగారి 'ఆంధ్ర భారతము : ధ్వని సిద్ధాంత సమన్వయము' సిద్ధాంత రచనలుగా గోచరిస్తాయి.

విమర్శ తత్త్వాన్వేషణ దృష్టితో చూస్తే యస్. వి. రామారావుగారి 'తెలుగు సాహిత్యంలో విమర్శ అవతరణ వికాసాలు', ముకురాల రామారెడ్డి గారి 'తెలుగు కవిత్వంలో ఆదర్శాలు, పరిణామాలు', వెల్చేరు నారాయణరావుగారి 'తెలుగు కవితా విప్లవాల స్వరూపం', కోవెల సంపత్కుమారాచార్య గారి 'ఆంధ్ర సాహిత్యంలో విమర్శ' చెప్పుకోదగిన రచనలు. విశ్వవిద్యాలయ పరిశోధన పరిధిలోకి రాక పోయినా ఇటీవల వెలువడ్డ 'జి. వి. సుబ్రహ్మణ్యం గారి 'ఆంధ్ర సాహిత్య విమర్శ : ఆంగ్ల ప్రభావం' ఈ మార్గంలో నిలిచిన మరో మైలురాయిగా చెప్పదగ్గ సద్గ్రంథం.

భాషాశాస్త్ర పరిశోధన దృష్టితో చూస్తే ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర, ఉస్మానియా, నాగార్జున, అనంతపురం పి. జి. సెంటర్లలో మాత్రమే కాక హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం, మద్రాసు, అన్నామలై, మైసూరు, బెంగుళూరు, పూనా, కలకత్తా, ఎడింబరో, కార్నెల్, పెన్సిల్వేనియా, యార్క్ విశ్వవిద్యాలయాలలో కూడా తెలుగు భాషా పరిశోధన జరిగినట్లు స్పష్టమౌతుంది. ఈ మార్గంలో దాదాపు ఇప్పటికే డెబ్భై మంది భాషా పరిశోధకులు కనిపిస్తారు. శాసనాలు, కైఫీయతులు, ఇళ్ళ పేర్లు, ఊళ్ళ పేర్లు, మాండలికాలు, అన్యదేశీయాలు, వర్ణనాత్మక వ్యాకరణాలు, నిఘంటు నిర్మాణ పద్ధతులు, వ్యావహారిక భాషా ప్రయోగాలు, పత్రికా భాష శీర్షికలు మాత్రమే కాక చారిత్రక వ్యాకరణాలు, మాండలిక వృత్తి పదకోశాలు, వ్యుత్పత్తి పదకోశాలు, ఆదాన పదాలు, ఫోనాలజీ, మార్ఫోఫోనిమిక్స్, రెలిటివైజేషన్, ప్రొనన్సియేషన్, లాంగ్వేజ్ ప్రెస్, లింగ్విస్టిక్ ఎనాలిసిస్, వాక్య నిర్మాణంలో లోకలిస్ట్ సిద్ధాంతం మొదలైన అనేక విషయాలమీద పరిశోధన వ్యాసాలు వెలువడినాయి. లకంసాని చక్రధరరావు, జి. యస్. ఆర్. కృష్ణమూర్తి, ఎం. కందప్పచెట్టి, కేతు విశ్వనాథరెడ్డి, పన్నాల ఉష, ఎ. ఉషారాణి, సి. పుష్పలత, వి. స్వరాజ్యలక్ష్మి, పి. యల్. విశ్వేశ్వరరావు, పి. చంద్రశేఖర్, హెచ్. యస్. బ్రహ్మానంద, కె. లక్ష్మీనారాయణ, యన్. శివరామమూర్తి, కె. నాగమ్మరెడ్డి, బి. రామకృష్ణారెడ్డి, వి. ప్రకాశంగార్ల కృషి గణనీయం. వీరి ఈ మార్గంలో నడిపించిన మనీషులు మెచ్చదగినవారు.

1974 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 'తెలుగు భాషా చరిత్ర' అనే గ్రంథాన్ని భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వంతో ప్రచురించారు. ద్వాదశ సూరి విరచితమైన వ్యాస సంపుటి ఇది. దీన్ని ఎం. కందప్పచెట్టి స్మృతికి అంకితం చెయ్యటం సూరి సమ్మానం. 1977 లో అణ్ణామలై నగర్‌నుండి పి. యస్. సుబ్రహ్మణ్యంగారి "ద్రావిడ భాషలు" వెలువడింది. ఈ రెండు గ్రంథాలు ఇటీవల

వెలువడిన భాషా చరిత్ర గ్రంథములలో గణనీయము లని గంటి జోగి సోమయాజిగారు తమ 'ఆంధ్ర భాషా వికాస' చతుర్థ ముద్రణ (1978) పీఠికలో పేర్కొన్నారు (పుట x). ఇవి విశ్వవిద్యాలయ ప్రచురణలు కావు.

తెలుగు భాషా సమితి, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆం. ప్ర. ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం పరిశోధనశాఖ మొదలైన సంస్థల కృషి భాషా సాహిత్య పరిశోధన వికాసానికి ఎంతగానో తోడ్పడుతున్నాయి. ఆయా సంస్థలు పండిత మండలిచేత పరిష్కరణ చేయించి పీఠికాదులతో ప్రచురించిన అనేక గ్రంథాలే అందుకు సాక్ష్యం. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలనాన్ని ఉపక్రమించిన ప్రాజ్ఞులు కాశీనాథుని నాగేశ్వరరావు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, నాయని వెంకట రంగారావుగార్లు.

ప్రస్తుతం రజతోత్సవానికి ఆయత్తమైన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి అభ్యుదయానికి చిరకాలం కృషిచేసిన బెజవాడ గోపాలరెడ్డి, దేవులపల్లి రామానుజరావుగార్లు, ప్రస్తుత కార్యదర్శి ఇరివెంటి కృష్ణమూర్తిగారు అకాడమీ భవితవ్యానికి చేసే ప్రయత్నం భాషా సాహిత్యవికాసానికి చేసే ప్రయత్నమే. తక్కిన పరిశోధన సంస్థల కార్యకర్తల దీక్షాదక్షతలు పరిశోధన వికాసానికి తోడ్పడగలవు.

నిజానికి పరిశోధన రంగంలో ఏ విషయం గురించి కాని 'ఇదే తుది తీర్పు' అనటానికి వీలులేదు. సత్యాన్వేషణ తాత్పర్యం, దృష్టి నైశిత్యం సమకూడిన కొద్దీ క్రొత్త సత్యాలు, క్రొత్త సిద్ధాంతాలు దృగ్గోచర మౌతాయి. ఇదొక నిరంతరమైన గవేషణ. తాత్కాలికంగా ఒక సిద్ధాంతం తప్పనిపించినా కాలక్రమాన అదే ఒప్పనిపించనూ వచ్చు. "కుమారసంభవము వ్రాసింది నన్నెచోడుడేనా?"అనే ప్రశ్న ఈనాటిదికాదు, ఆ గ్రంథం పొడసూపిననాడే పుట్టింది. ఆ ప్రశ్నే కొంతమార్చి, మరో ఆశ్చర్యార్థకపు గుర్తుచేర్చి, కొర్లపాటి శ్రీరామమూర్తిగారు "నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీన గ్రంథమా?!" అనే గ్రంథం ఇటీవలనే విడుదల చేశారు. కుమారసంభవ 'కావ్యము యొక్క మాయావేషమునకు కొర్లపాటి వారిది తుది చీటి' అని ఆంధ్ర శేషగిరిరావుగారు సింహావలోకనం చేశారు. సత్యసంశోధన దృష్టితో సాగే పరిశోధన పరామర్శలు సర్వదా అభిలషణీయాలు.

విశ్వవిద్యాలయాచార్యపదవు లధిష్ఠించి, శాఖాధిపత్యాలు నిర్వహించే పరిశోధక మనీషులు పరిశోధక విద్యార్థులకు మార్గదర్శకులు. వారిది పండిన అనుభవం, బాధ్యతగల కృషి. తెలుగు భాషా సాహిత్యాలలో నేటికి సుమారు పంచశత పరిశోధకులు పట్టభద్రులైనట్లే. దాదాపు అర్ధశతాబ్దికాలం పండించిన పరిశోధన పంట ఇది. ఈ పంటకు సంబంధించిన బాగోగులు కూడా పరామర్శించుకుంటేకాని పరిశోధన వికాస దశకు తోడ్పడిన మనీషులకు మెచ్చుకూర్చదు. అభ్యుదయ పథంలో ఆత్మపరిశీలన ఆత్యంతావశ్యకం.

**అభ్యుదయ దీప్తుల ఆత్మావలోకనం :**

తెలుగులో సాహిత్య పరిశోధకుల సంఖ్యకంటె భాషా పరిశోధకుల సంఖ్య తక్కువ. భాషా-సాహిత్య పరిశోధన వ్యాసాల నిష్పత్తి 1:7 అని చెప్పవచ్చు. భాషా పరిశోధన వ్యాసాలు భౌతికశాస్త్ర నిర్వచనాల వలె పరివృత్త్యసహిష్ణువులుగా కనిపించటం; వ్యాస పరిమాణం పరిమితంగా ఉండటం - సాహిత్య పరిశోధన వ్యాసాలు తద్భిన్నంగా వర్ణనాత్మకంగా వుండి బృహద్గ్రంథాలుగా రూపొందటం గుర్తిస్తున్నాం. ఈ కారణంవల్లకూడా సాహిత్య పరిశోధన వ్యాసాలమీద కంటె భాషాపరిశోధన వ్యాసాలమీద గౌరవం పెరుగుతున్నది.

భాషా పరిధిలోకి వచ్చేవన్నీ శాస్త్ర విషయాలనీ, సాహిత్య పరిధిలోకి వచ్చేవన్నీ కథనాత్మకాలనీ ఒక భ్రాంతికూడా లేకపోలేదు. భాషా పరిశోధన శాస్త్రమై

సాహిత్య పరిశోధన విశ్లేషణాత్మక వర్ణనమాత్రమే అయినప్పుడు ఈ భ్రాంతి సత్యమై భాసిస్తుంది.

పరిశోధనకు ఎన్నుకునే విషయాలను బట్టి కూడా ఈ భ్రాంతి ఏర్పడుతుంది. పుడిసెడు నీళ్ల చేతబట్టి, సూక్ష్మేక్షికతో దర్శించి, ప్రత్యణుపరిశీలనం చేసి, సిద్ధాంత ప్రతిపాదన చెయ్యటం ఒక పద్ధతి-సముద్రాని కేతమెత్తి, అందినంతమేర పరిశీలించి, అదే సముద్రలక్షణమని చెప్పబూనటం మరొక పద్ధతి. మొదటి పద్ధతిలోని పరిశోధన ఫలితాలు సంతృప్తికరంగా ఉంటాయి. భాషా పరిశోధనలు చాలవరకు మొదటి పద్ధతిలోని సాహిత్యపరిశోధనలు రెండవ పద్ధతిలోను జరిగినట్లు కనిపిస్తున్నాయి. ఈ హేతువు వల్లకూడా సాహిత్య పరిశోధనలు తరుచు విమర్శలకు గురికావటం కద్దు.

ఈ విమర్శ కేవలం తెలుగు పరిశోధనకే పరిమిత మనుకోనక్కరలేదు. పాశ్చాత్య పరిశోధన వ్యాసాలను గూర్చి కూడా ఆయా విమర్శకులు చారుణంగా విమర్శించిన సందర్భాలున్నాయి. 'ప్రపంచంలో ఏదేటా వచ్చే ఈ విశ్వవిద్యాలయ పరిశోధన వ్యాసాలలో గుర్తించుకోదగ్గ అంశం ఒక్కటీ కనిపించటంలే' దనీ, 'వీటిలో ఎక్కువ భాగం డిగ్రీలకోసం వ్రాసినవే కాని కొత్తగా చెప్ప దలచిన అంశం ఒక్కటీలే' దనీ, 'ఈ పరిశోధకు లలో నిజమైన పరిశోధకులు అరుదుగాగాని కనిపించ' రనీ, 'విశ్వవిద్యాలయాల్లో జనమైతే వున్నారుగాని సరియైన పాండిత్యమే లే'దనీ, 'నిష్ప్రయోజనమైన ఈ పరిశోధన గ్రంథాలను ప్రచురించటం మాత్రమే చేటనుకోనక్కర్లేదు; అసలు వీటిని వ్రాయటమే పెద్ద చేటనీ'- ఈ ధోరణిలో ఎడాపెడా పరిశోధన వ్యాసం గాన్నే చెరిగిపారేసిన సందర్భాలున్నాయి. 'వివిధ గ్రంథాలలో వున్న విషయాలను ఒకచోట చేర్చి దానినే పరిశోధన వ్యాసంగా చెలామణి చేస్తున్నా'రనీ, 'వీటిలో అధికభాగం పట్టికల పుట్ట' అనీ, 'సొంతంగా ఆలోచించి చెప్పిన ముక్క ఒక్కటి కనిపించ' దనీ, 'క్రొత్తగా చెప్పేదేమీ లేనప్పుడు పరిశోధన పేరుతో వృథా కాలక్షేపం అనవసర' మనీ పలురకాల తిట్లూ దీవెనెలూ వడ్డించిన విమర్శకపుణ్యులూ వున్నారు.

అంతమాత్రాన పరిశోధన వ్యాసంగం నుండి విరమించుకోవలసిన అవసరం లేదు. ఆ విమర్శలను దృష్టిలో వుంచుకుని పరిశోధన ప్రమాణాన్నీ, స్థాయినీ పెంపొందించుకోవటమే పరిశోధక విజ్ఞులు చెయ్యవలసిన పని. విజ్ఞులంటే పరిశోధన సంచాలకులని కూడా అర్థం. సాహిత్య పరిశోధనలో ప్రాథమికంగా గుర్తించ వలసిన అంశాలు విస్మరించటం వల్లనే ఈ ప్రమాదం తటస్థిస్తున్నది.

వర్ణనకూ విశ్లేషణకూ, విమర్శకూ వివేచనకూ, సమీక్షకూ సమన్వయానికీ, పరిశీలనకూ పరిశోధనకూ, సిద్ధాంతానికీ దర్శనానికీ గల సూక్ష్మభేదం గుర్తించి సత్యాన్వేషణ చేస్తే సత్ఫలితాలతో కూడిన నూతన విషయాలు బహిర్గతమౌతాయి. అచుంబితమైన నూతన విషయం దృష్టిపథంలో పడేవరకు అన్వేషణ సాగ వలసిందే. ప్రతిపాదితమైన సిద్ధాంతం దర్శన స్థాయి నందుకునే వరకు సంశోధన జరుగవలసిందే. ఈ లక్ష్యం కొరవడిన సందర్భాలలోనే పరిశోధక విద్యార్థులూ, సంచాలక మనీషులూ విమర్శకు గురి కావలసి వచ్చింది.

లక్ష్యశుద్ధి కొరవడని మనీషులే భాషాసాహిత్య పరిశోధన వికాసానికి బహుధా తోడ్పడ్డారు. వారి నీ వ్యాసంలో యథావకాశంగా సమ్మాన పూర్వకంగా సంస్మరించటం జరిగింది. వారినే కాదు; వారి మార్గ దర్శకత్వంతో లక్ష్యాన్ని అందుకున్న పరిశోధకులు పలువుర్ని పేర్కొనటమూ జరిగింది. 'పరిశోధన వికాస దశ' అనేది సంచాలక సంచోదితు లిరువురి ప్రజ్ఞకూ సంబంధించిన అంశం. కనుక ఇరువురి మనీషనూ స్పృశించవలసి వచ్చింది. తలపండి, తల

వులు పండిన ఏ నలుగురైదుగురు మనీషుల పేర్లో వర్ణించి 'తాంబోలం ఇచ్చేశా'నని చెప్పటం ధర్మం కాదు; పైగా కోరి ముప్పు కొని తెచ్చుకోవటమే. విషయ విస్తృతివల్ల విషయాలను ఎడనెడ స్పృశించటమే తప్ప విడమర్చి చెప్పేందుకు అవకాశం తక్కువ. అయినా ఆనుషంగికంగా తెలుగు భాషా సాహిత్య పరిశోధన క్రమపరిణామ చరిత్రను కూడా తడపటం జరిగింది. విశ్వవిద్యాలయ పరిధి నతిక్రమించి స్వచ్ఛంద సంశోధన తత్పరులైన మనీషులను కూడా సన్మానించటం జరిగింది. మానవ సహజమైన భ్రమ ప్రమాదాలవల్ల కొందరు పేర్కొనబడక పోనూవచ్చు. వారి ఔదార్యమే ఈ జాతి వ్యాసకర్తలకు రక్ష.

---

**ఉపయుక్త రచనలు**

| | | | |
|---|---|---|---|
| 1. | ఆంధ్ర భాషా చరిత్రము | 1937 | చిలుకూరి నారాయణరావుగారు |
| 2. | ఆంధ్ర భాషా వికాసము | 1946;78 | గంటి జోగి సోమయాజిగారు |
| 3. | ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం | 1983 | జి. వి. సుబ్రహ్మణ్యంగారు |
| 4. | తెలుగు భాషా చరిత్ర | 1979 | భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వము |
| 5. | తెలుగులో పరిశోధన-పట్టిక | | పోరంకి దక్షిణామూర్తిగారు |
| 6. | తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము | 1960 | కొత్తపల్లి వీరభద్రరావుగారు |
| 7. | ద్రావిడ భాషలు | 1977 | పి. యస్. సుబ్రహ్మణ్యంగారు |
| 8. | ద్రావిడ భాషా పరిశీలనము | 1955 | వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు |
| 9. | పాశ్చాత్యులు-తెలుగు భాషా సంస్కృతులు | 1978 | కె. ఆర్. కె. మోహన్‌గారు |
| 10. | విజ్ఞాన వికాసానికి వ్రాతప్రతుల సేకరణ, సంరక్షణ | 1983 (భారతి-మే) | వి. వి. యల్. నరసింహారావుగారు |
| 11. | విజ్ఞాన సర్వస్వము-ఆంధ్ర సంస్కృతి-౧ | 1959 | తెలుగు భాషా సమితి |
| 12. | వ్యావహారిక భాషా వ్యాకరణం | 1958 | వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు |

ఇవికాక వ్యాసంలో పేర్కొన్న అనేక రచనలు.



# తెలుగులో సాహిత్య పరిశోధన - సంస్థల పాత్ర

—కె. గోపాలకృష్ణరావు

తెలుగులో సాహిత్య పరిశోధన - ఆరంభ దశను గూర్చి పరిశీలించినపుడు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము నుండి పాశ్చాత్యుల కృషి, వారి ప్రోత్సాహము, పాశ్చాత్య విద్యావిధానము వారి పరిశోధనాత్మక దృష్టి అనునవి పరిశోధనకు మార్గదర్శకములైనట్లుగ తెలియుచున్నది. అంతకుముందు పరిశోధన మేమాత్రమును జరుగలేదనుట సమంజస మనిపించదు. అది ఏదియో ఒక రూపమున కొనసాగినది- ఆనాడు రాజాస్థానములు - విద్వత్సభలు - సాహిత్య పోషణకు సాహిత్య పరిశోధనకు రంగములుగానుండెను. ఈ సభలే విద్వల్లోకమునకు సహృదయులకు, నూత్న కవులను, కావ్యములను పరిచయ మొనర్చినవి. ఆనాడు విద్వత్సభలలోని చర్చలు-కవులకు విద్వాంసులకు నూత్న దృష్టిని ప్రసాదించినవి. కవి - కవితా సిద్ధాంతములు- కావ్యము, కావ్యస్వరూపము, కవిత్వాచర్యములు, భాష, శైలి, రచనా విధానము- మొదలగు అనేకాంశములను గూర్చి ఈ సభలు ఆనాటి కవులకు విద్వాంసులకు ఆలోచనాత్మక, పరిశీలన, పరిశోధనాత్మక దృష్టి నొసగినట్లు వివిధ కావ్యావతారికలలోని విశేషములు వెల్లడించుచున్నది. ఇవి అన్నియు బహుళముగ సృజనాత్మక సాహిత్యమునకే పరిమితమైయుండె ననుటకు సందేహము లేదు. అదియు పరిమిత పరిధిలో వాతావరణములో నియమిత రంగమునకే వ్యాప్తమైయుండెను.

ఆధునిక విద్యావిధానము - విద్యలు వివిధ ప్రక్రియలు రచనలు సాహిత్య రంగమున నూత్న మార్గమును నిర్దేశించినవి. పరిశోధన స్వరూప స్వభావములను నిరూపించిన విద్వాంసులు విమర్శకులు ఆధునిక పరిశోధన పరిధిని-విస్తృతిని నిశితదృష్టితో వివరించినారు. శాస్త్రరంగమునందలి పరిశోధన కంటె కళలు విద్యలు మున్నగు రంగములందలి పరిశోధన భిన్నమైనది. శాస్త్రరంగమునం దపూర్వమైన సృష్టి సాధ్య మని ఆధునిక పరిశోధనలు నిరూపించుచున్నవి. కళాసాహిత్య రంగములలో అపూర్వ సృష్టి కంటె వినూత్న, విలక్షణ, అపూర్వ దృక్పథమే ప్రాధాన్యము వహించుచున్నది. అజ్ఞాతకవి-అముద్రిత గ్రంథ సేకరణ, పరిచయము-పాఠ, గ్రంథ పరిష్కరణము- నూత్న దృష్టితో కావ్య విమర్శ లేక కావ్యావలోకనము-పరిష్కృత ముద్రణము-పీఠికలు-నూత్న దృక్పథముల ఆవిష్కరణము-శాసన సంపాదనము-లిపి గుర్తింపు, శాసన పఠనము వివరణ వ్యాఖ్యానములు, వివిధ దృక్పథముల సమన్వయము, తులనాత్మక అధ్యయనము మొదలగునవి ఎన్నియో నేడు పరిశోధన పరిధిలో చేరిన అంశములుగా గుర్తింపబడినవి. తెలుగులో పరిశోధనము వ్యక్తులు పత్రికలు సాహిత్య సంస్థలు గ్రంథమాలలు అకాడమీల పరముగ సాగినవి.

వ్యక్తి పరముగ జరిగిన పరిశోధనలో ప్రముఖ విద్వాంసులు పరిశోధకుల పాత్ర ప్రధానమైనది. వీరిలో కొందరు కేవలము పరిశోధకులు కారు. అకుంఠిత దీక్షా సంపన్నులు, తపస్సంపన్నులు- జీవితమును మహోన్నత, మహోదారాశయములకు సాహిత్య పరిశోధన కంకిత మొనర్చిన మహాను భావులు వీరు. జీవితములను కర్పూరమువలె వెలి గించిన వారిలో బ్రౌను, కందుకూరి వీరేశలింగము, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు, వేదము వేంకట్రాయశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, జయంతి రామయ్య, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు, నేలటూరి వేంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖర శర్మ, సురవరము ప్రతాపరెడ్డి, ఆదిరాజు వీరభద్ర రావు, నిడదవోలు వేంకటరావు ప్రభృతులు ప్రత్యేక ముగ పేర్కొనదగినవారు. వీరు ఒక్కొక్కరు ఒక్కొక్క సంస్థ వంటివారు. మూర్తీభవించిన సాహిత్య సంస్థలు, వీరి పరిశోధనలో కృషి ప్రత్యేక ముగ నెన్నదగి యున్నది.

తెలుగులో సాహిత్య పరిశోధనము పత్రికలమూల ముగను జరిగినది.ఇవికూడ సంస్థలవంటివే. తెలుగులో కొన్నిపత్రికలు కేవలముసాహిత్యమునకు సాహిత్యపరి శోధనకు అంకితమైనవి. భారతి, పరిశోధన, జయంతి మొదలగునవి ఇట్టివి. పత్రికలవారు కొన్ని ప్రత్యేక సందర్భములను పురస్కరించుకొని ప్రత్యేక సంచికలు వెలువరించుచున్నారు. ఉగాది, దీపావళి, సంక్రాంతి మొదలగు పర్వదినములు, ప్రముఖుల జయంతి, వర్ధంతులు, షష్టిపూర్తి సన్మానోత్సవములు, ప్రత్యే కోత్సవములు, రజతోత్సవ వజ్రోత్సవములు, జాతీయ పర్వదినములు మున్నగు సందర్భములలో పత్రికల విశేష సంచికలు ప్రచురింపబడుచున్నవి. వీనిలో కొన్ని వ్యాసములు పరిశోధనాత్మకములు. ఉగాది సంచికలలో ఆంధ్రపత్రిక ఉగాది సంచిక ఉన్నత ప్రమాణములను నెలకొల్పినది. విశ్వ విద్యాలయముల కనుబంధముగా నున్న తెలుగు శాఖవారు ప్రత్యేక పరిశోధనాత్మక పత్రికలు వార్షిక సంచికలుగా ప్రకటించుచున్నారు. వీనిలో ఉస్మానియావారి వివేచన, కాకతీయవారి విమర్శ్ని పేర్కొ నదగినవి. ప్రత్యేక సాహిత్య పత్రికలలో భారతితో పాటు పరిశోధన - సుజాత - జయంతి - సృజన మొదలగునవి పరిశోధనాత్మక వ్యాసములను ప్రక టించినవి. వేటూరి వారి రచనలకే ప్రత్యేకముగ అంకితమై వేటూరి ఆనందమూర్తి గారి ఆధ్వర్యమున ప్రభాకరశాస్త్రి గారి జయంతి వర్ధంతి సందర్భముగా ఆరు మాసముల కొకమారు 'మణిమంజరి' అను పత్రిక ఇటీవల ఆరంభమైనది. దినవార పత్రికలవారు సారస్వతానుబంధములో భాష సాహిత్యము చరిత్రకు సంబంధించిన ప్రత్యేక వ్యాసములు ప్రచురించు చున్నారు. సారస్వతానుబంధ శీర్షికలో కొన్ని అమూల్యములైన వ్యాసములు ప్రకటింపబడుచున్నవి. వారపత్రికలో నుడి-నానుడి, క్షేత్ర కథలు, గ్రామనామ ములు మొదలగు వానిని గూర్చిన వ్యాసములు భాషా శాస్త్రమునకు చెందిన ఎన్నియో విశేషముల తెలుపు చున్నవి. గ్రామనామముల చరిత్రకు పరిశీలనకు ఈ వ్యాసములు ఆధారములుగా నుండుట కవకాశము కలదు. విస్మృత కవులు - వారి కావ్యముల గూర్చిన వ్యాసము లిట్టివే. కొన్ని పత్రికల వారు ప్రత్యేక సందర్భమును పురస్కరించుకొని ఉత్తమ పరిశోధక గ్రంథములను ప్రచురించిరి. గోలకొండ పత్రికవారు 1934 లో ప్రకటించిన గోలకొండ కవుల సంచిక ఇట్టిది. తెలంగాణమునందు కవులు లేరని ఎవరో ఒకరు విమర్శింప సురవరం ప్రతాపరెడ్డిగారు అభిమాన వశులై తెలంగాణమునందలి కవులు- వారి వంశాదిక వృత్తాంతము- ముద్రితా ముద్రిత రచనలు మున్నగు విశేషములతో గోలకొండ సంచికను ప్రకటించిరి. ఇది ఒక వ్యక్తివలన జరిగిన అమూల్యమైన పరిశోధన.

ఇక సాహిత్య సంస్థల సంగతి - వివిధ రంగములలో లబ్ధప్రతిష్ఠులైన మహానుభావులు, సేవాసక్తులు, సాహిత్య కృషి ధ్యేయముగా అనేక సంస్థలను స్థాపించిరి. ఈ సంస్థలు లెక్కకుమీరి యున్నవి. కొన్ని కేవలము మఖలో పుట్టి పుబ్బలో అంతరించినవి. మరికొన్ని నేటికిని సజీవముగా నిలిచియున్నవి. కొన్ని సృజనాత్మక రచనలను, వివిధ గ్రంథములను ప్రకటించినవి. మరికొన్ని వానితోపాటు పరిశోధనాత్మక గ్రంథ ప్రకటనకు ముందంజ వేసినవి. ఒకటి రెండు సంస్థలు కేవలము పరిశోధనకే అంకితమై విశేష కృషి నొనర్చినవి. ప్రతి సంస్థ పుట్టుపూర్వోత్తరములు, ప్రకటిత గ్రంథములు మున్నగు విశేషములు సంపూర్ణముగ వివరించుట సాధ్యముకాదు. బహుళ వ్యాప్తమైన సాహిత్యసేవ పరిశోధనాత్మక కృషిచేసిన సంస్థలలో కొన్నింటిని గూర్చిన వివరము లివి :

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు**

తెలుగుదేశములోని సాహిత్య సంస్థలలో పరిశోధన కంకితమైన సంస్థ ఆంధ్ర సాహిత్య పరిషత్తు. ఇది కాకినాడలో 1911 సంవత్సరమున స్థాపింపబడినది. శ్రీ జయంతి రామయ్య గారి ఆధ్వర్యమున ఈ సంస్థ చేసిన పరిశోధనాత్మకమైన కృషి బహుముఖమైనది. ఇది చెన్నపట్టణములో కొంతకాలము పనిచేసినను తరువాత కాకినాడయందే స్థిరముగా నెలకొని సాహిత్య సేవలో అగ్రగామి యైనది. ఈ సంస్థకు విజయపతాకగా నిలిచినది ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సంస్థ ఆదర్శములకు లక్ష్యములకు వాహికగా నుండి అనేక సాహిత్య గ్రంథములను పరిష్కరించి ప్రకటించుటకును, పరిశోధక వ్యాసములకును, శాసనముల ప్రకటనకును ప్రామాణిక పత్రికగా ప్రశస్తి నొందినది. అముద్రిత గ్రంథము లెన్నియో ఈ పత్రికవలన సాహిత్య లోకమునకు వెల్లడియైనవి. ప్రాచీన గ్రంథములను పరిష్కరించి ప్రకటించుటలో ఈ సంస్థ చేసిన పరిశోధనాత్మక కృషి చిరస్మరణీయము. ప్రాచీనాంధ్ర శాసనములను కూడ ప్రకటించి భాషా సాహిత్య చరిత్రలో పరిశోధన కమూల్యమైన సామగ్రి నందజేసినది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రకటించిన సంశోధిత గ్రంథములు సాహిత్యములోని విభిన్న ప్రక్రియలకు చెందినవి. మొదటి శతకముగా, మల్లికార్జున పండితుని ప్రశస్తకృతిగా పేరొందిన శివతత్త్వసారమును సవిమర్శకముగ పరిష్కరించి విపులమైన పీఠికతో ప్రప్రథమముగ ప్రకటించిన కీర్తి ఆంధ్ర సాహిత్య పరిషత్తునకే లభించినది. ఇట్టి గ్రంథములు రాయవాచకము, శాసనపద్యమంజరి మొదలగునవి శతాధికముగ పరిషత్తు పక్షమున వెలువడినవి. పరిషత్తునకు కీర్తికిరీటము నలంకరింపజేసినది సూర్యరాయాంధ్ర నిఘంటువు తెలుగులోని ప్రామాణిక నిఘంటువులలో ఒకటి. దేశములోని పండితుల విద్వాంసుల కృషి ఫలము. ఈ నిఘంటువు నిటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తోడ్పాటుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు పరిష్కృతముద్రణముగా సంపూర్ణముగ ప్రకటించినారు. అతి విస్తృత పరిధిలో పరిశోధనాత్మక కృషి చేసిన ఈ పరిషత్తు ఇతర సంస్థలకు, పరిశోధకులకు ఆదర్శప్రాయమై నిలిచినది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు నిర్వహించిన సభలు, వార్షికోత్సవములు కేవలము లాంఛనప్రాయములు కావు. ఈ సభలు మధుర వంటి రాష్ట్రేతర ప్రాంతములందును జరుగుట దాని విస్తృత కార్యరంగమును సూచించును. పరిషదధ్యక్షోపన్యాసములు పాండిత్య స్ఫోరకములు. పట్టప్రదానోత్సవోపన్యాసములవలె దీక్షాసంకలితములు.

శాసనములు, తాళపత్ర గ్రంథములు సేకరించి భద్రపఱచుట, ముద్రణ భాగ్యము నొందని అమూల్య గ్రంథములను గ్రంథాలయమున సంతరిం

చుట సంస్థ చేసిన పరిశోధనాత్మక కృషిలో ఒక భాగము. ఆంధ్ర సాహిత్య పరిషత్తు కార్యాలయము, గ్రంథాలయము నేటికిని పరిశోధకులకు యాత్రా స్థలము. ఈ అంశ మొకటియే పరిషత్తునకు పరిశోధనలోగల ప్రాధాన్యమును నిరూపించుచున్నది.

పరిశోధనాత్మక సాహిత్య కృషితో తృప్తి నొందక ఆంధ్ర సాహిత్య పరిషత్తు తెలుగు భాషా సాహిత్య రంగములోని వివిధ సమస్యలను పరిష్కరించుటకును, నిర్మాణాత్మక కృషి చేయుటకును శక్త్యనుసారము ప్రయత్నించినది. నాడు భాషా సాహిత్య రంగమున సంచలనము కలిగించినది గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమము. ఆంధ్రసాహిత్య పరిషత్తు-ఎక్కటివీరునివలె పరిస్థితుల కెదురొడ్డి నిలిచి గ్రాంథిక వాదమునకు పెట్టనికోటగా నిలిచినది. శృంగార ప్రధాన గ్రంథముల ప్రకటనము నా డొక తీరని సమస్యగా నుండెను. ప్రభుత్వమువారు వీని ప్రకటనమును గూర్చి అనేక నిర్బంధములు కూర్చి యుండిరి. ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రభుత్వ నిషేధాజ్ఞలను తొలగించుటకు, దీక్షతో కృషి చేసి విజయమును సాధించినది. కేవలము సాహిత్య దృష్టితో ఈ అంశమును చేపట్టిన ఫలముగ శృంగార రసాత్మకము లగు గ్రంథముల ప్రకటన అనంత దశలో సుసాధ్యమైనది.

**తెలుగు భాషా సమితి**

దేశ స్వాతంత్ర్యమునకు పూర్వము నుండి తెలుగు భాషా సాహిత్యములకు విశేషమైన సేవ చేయుచున్న సంస్థలలో తెలుగు భాషా సమితి ప్రథమ గణ్యము. కొమర్రాజు లక్ష్మణరావు గారి సంపాదకత్వమున ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండు భాగములలో అప్పటికే వెలువడి యుండెను. మాగంటి బాపినీడుగారు ఆంధ్ర సర్వస్వమును 1942 నాటికి ప్రచురించి యుండిరి. విజ్ఞాన సర్వస్వము విజ్ఞాన పేటిక. అది జాతి భాషా సాహిత్య సంస్కృతులకు దర్పణము వంటిది. కొమర్రాజు వారి విజ్ఞాన జ్యోతిని జాజ్వల్యమానముగ ప్రకాశింపజేయుటకు బెజవాడ గోపాలరెడ్డిగా రధ్యక్షులుగ, మోటూరి సత్యనారాయణ రావు గారు కార్యదర్శిగ 1947 లో మద్రాసు నగరమున తెలుగు భాషాసమితి అవతరించినది. దీని కార్యాలయము 1955 వరకు మదరాసులోనే ఉండి అనంతరము హైదరాబాదు నగరమునకు మారి ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలో నిర్మింపబడిన స్వంత భవనమునుండి తన కృషిని కొనసాగించుచున్నది. తెలుగు భాషా సమితి రూపొందించిన విజ్ఞాన సర్వస్వ ప్రణాళిక వేరు. ఇది అకారాదిగ గాక ఒక్కొక్క విజ్ఞానమునకు శాస్త్రమునకు ఒక్కొక్క సంపుటము చొప్పున ఆయా రంగములలో నిష్ణాతులైన పండితుల వ్యాసములతో సంతరింపబడినది. ఇప్పటికి పదిహేనుకు మించిన సంపుటములు వెలువడినది. తెలుగు భాషా సమితి ఇంతకంటెను విస్తృతమైన కార్య ప్రణాళికను చేపట్టినది. సాహిత్యము విజ్ఞానము మొదలగు అనేకాంశములపై బహుమతులు ప్రకటించి అత్యుత్తమ స్థాయికి చెందిన గ్రంథములు వెలువడుటకు ప్రోత్సహించినది. ఈ పరంపరలో దాదాపు నలువదికి మించిన గ్రంథములు ప్రచురింపబడినవి. అంతియేకాక 1900-53 వరకు భారతదేశమునందలి ప్రధాన భాషలలోని ముద్రిత గ్రంథముల సూచిని సంతరించినది. భారతీయ భాషా సాహిత్యముల తులనాత్మక అధ్యయనమునకు పరిశోధనాత్మక కృషికి ఈ గ్రంథసూచి ప్రధానాధార గ్రంథముగ తోడ్పడుననుట కెట్టి సందేహము లేదు. ప్రస్తుత మీ సంస్థ విజ్ఞాన సర్వస్వము వివిధ సంపుటముల పరిష్కృత ముద్రణమునందు పునర్ముద్రణమునందు వ్యగ్రమై యున్నది.

**సాహితీ సమితి - నవ్యసాహిత్య పరిషత్తు**

ఆధునిక కవితలో భావ కవిత్వమునకు లేదా అభినవ కవిత్వమునకు అగ్రస్థానము కలదు. దీనికి సంబంధించిన పరిశోధనాత్మక అధ్యయనమునకు పూల పందిళ్ళు వేసి వేదికగా నిలచిన సంస్థలలో సాహితీ సమితిని స్మరించినంతనే సభాపతి శివశంకర స్వామి గారు మనోరంగమున నిలుతురు. నవ్యకవితా రీతికి పండితలోకమునం దాదరభావము కలిగించుటలో తెనాలియందు 1910 ప్రాంతములో స్థాపితమైన ఈ సంస్థ కృషి విస్మరింపరానిది. క్రీ. శ. 1933 లో బరంపురములో అభినవాంధ్ర పండితసభగా ప్రారంభమైన సంస్థ మూడేండ్లలో గుంటూరులో నవ్యాంధ్ర సాహిత్య పరిషత్తుగా అవతరించినది. ఇది నవ్య సాహిత్యమునకు వ్యావహారిక భాషోద్యమమునకు ప్రధాన రంగముగా నిలిచినది. ఈ సంస్థ ధ్యేయమునకు అక్షర రూపమును కలిగించినది 1920 లో ప్రారంభింపబడిన ప్రతిభ అను పత్రిక. దీనిలో అమూల్యములైన ప్రామాణిక పరిశోధక వ్యాసము లెన్నియో ప్రకటింపబడినవి.

**ఆంధ్రభాషాభివర్ధిని**

ప్రెసిడెన్సీ కళాశాల (మద్రాసు) లోని ఈ సంస్థ ప్రతి సంవత్సరము వ్యాసరచనల పోటీలను, ప్రాచీనాంధ్రకవుల విమర్శకోపన్యాసములను నిర్వహించినది. మను వసుచరిత్రలు-శ్రీనాథుడు- నన్నయ-పింగళి సూరన మున్నగు వారిపై ప్రముఖుల ఉపన్యాసములు జరిగినవి. ఇవి పరిశోధనాత్మకములైనవి.

**అభ్యుదయ రచయితల సంఘము**

ఆర్థిక సామాజిక వ్యవస్థ పునాదిగ రూపొందిన మార్క్సిస్టు దృక్పథము, అభ్యుదయ వాదము తెలుగులో అభ్యుదయ కవితకు మార్గదర్శకమైనవి. అఖిల భారత స్థాయిలోని అభ్యుదయ రచయితల సంఘములు ఏర్పడిన [illegible] తెలుగు దేశము నందును 1943 లో అభ్యుదయ రచయితల సంఘ మేర్పడినది. ఇది కేవలము సాహిత్యాదర్శములకే కాక, మార్క్సిస్టు దృక్పథమునకు ఆర్థిక రాజకీయ సామాజిక సిద్ధాంతములకు ప్రాతినిధ్యము వహించిన వానికి వేదికగా ప్రచారక సంస్థగా ప్రాధాన్యము నొందినది.

ఈ సంఘము కార్యక్రమములలో కవి సన్మానములు- మహనీయుల వర్ధంతులు - భాషాసాహిత్యాధ్యయనమునకు చెందిన సమావేశములు - ప్రసిద్ధ కవుల కావ్య ప్రచురణలు - పత్రికల ప్రచురణము మున్నగునవి ప్రత్యేకముగ పేర్కొనదగి యున్నవి. ఈ సంస్థ చిలకమర్తిని సన్మానించి, వారి స్వీయ చరిత్రను ప్రప్రథమముగ ప్రచురించినది. గురజాడ, గిడుగు, కొమ్మరాజు మొదలగువారి వర్ధంతులను నిర్వహించినది. శ్రీశ్రీ, కుందుర్తి మొదలగు అభ్యుదయ కవుల రచనలను ప్రకటించినది. అభ్యుదయ సాహిత్యమునకు సంబంధించిన సిద్ధాంత, విమర్శనాత్మక పరిశోధనాత్మక గ్రంథములను ప్రకటించినది. ప్రజాశక్తి వంటి అభ్యుదయ వాద పత్రికలను నిర్వహించినది. సామాన్య ప్రజలకు తెలుగు భాషా సాహిత్యముల నందజేసి, వారికి అభిరుచిని ఆసక్తిని కలిగించుటకు, సాహిత్య ధోరణులను సామాన్య భాషా జ్ఞానము కలవారికిని సుపరిచిత మొనర్చుటకు, అన్ని దశలకు, రంగములకు చెందిన శాస్త్ర, సాహిత్య గ్రంథములను వెలువరించుటకు ప్రజలలో నూతన దృష్టిని, సామాజిక చైతన్యమును, అభ్యుదయ భావములను కలిగించుటకు, ప్రత్యేకమైన రాజకీయ ఆర్థిక సిద్ధాంతములను ప్రచార మొనర్చుటకు ఈ సంఘము చేసిన కృషి గమనింపదగినది.

**విప్లవ రచయితల సంఘము**

అభ్యుదయ రచయితల సంఘ సిద్ధాంతములతో ధ్యేయము, ఆచరణ విధానములలో మత భేదము లంకురించి విప్లవాత్మక దృష్టికి ప్రాధాన్యము హెచ్చినది. అట్టి దృక్పథముతో విప్లవ రచయితల

సంఘ మవతరించినది. హింసాత్మక విప్లవాత్మక ధోరణి వీరి ధ్యేయము- ఈ ధోరణికి సంబంధించిన రచనలను సాహిత్యమును కూడ వీరు ప్రచురించిరి. వీరి ఆశయములను చాటు పత్రికలు కూడ కొన్ని సృజన-పిలుపు వంటివి వెలువడినవి. వీనిలో ఈ దృక్పథము గల పరిశోధనాత్మక వ్యాసములు. కొన్ని ప్రచురింపబడినవి ప్రసిద్ధ కవుల స్మృత్యంకితముగను, ఇతర సందర్భములందును ఈ పత్రికల ప్రత్యేక సంచికలు వెలువడినవి. వీనిలోని వ్యాసములున్నతప్రమాణములు గలవి.

**ఆంధ్ర సారస్వత పరిషత్తు**

దశమాంధ్ర మహాసభలు జరుగుచున్న సందర్భమున 1943 ప్రాంతమున తెలంగాణమునందలి యువకులు కొందరు తెలుగువారి సర్వతోముఖాభివృద్ధికి ఒక సాహిత్య సంస్థను స్థాపించుటకు సంకల్పించియుండిరి. తత్ప్రయత్న ఫలితముగ నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు అవతరించి, అనంతర దశలో 1949 లో ఆంధ్ర సారస్వత పరిత్తుగా రూపొందినది. సాహిత్య సాంస్కృతిక రాజకీయ రంగములోని ప్రముఖ వ్యక్తు లీసంస్థ అభివృద్ధికి ఎన్నియో విధముల పాటుపడిరి. మొదటి దశలో లోకనంది శంకరనారాయణ రావు, బిదురు వేంకట శేషయ్య, బూర్గుల రామకృష్ణరావు, సురవరము ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, కాళోజి నారాయణరావు, గడియారము రామకృష్ణశర్మ, పులిజాల హనుమంతరావు, పర్సా వేంకటేశ్వరరావు ప్రభృతులు ఈ సంస్థ అభివృద్ధికి కృషి చేసిరి. దేవులపల్లి రామానుజరావు గారు దీనికి వెన్నెముకగా నుండి నేటివరకు, ప్రముఖ వ్యక్తుల సహకారము నొందుచు సంస్థ కార్యనిర్వహణ బాధ్యతను జయప్రదముగ నిర్వహించుచున్నారు. వీరి ఆధ్వర్యమున పరిషత్తు అన్ని రంగములందును అభివృద్ధిని సాధించినది. బొగ్గులకుంటలో దీనికి సుందర భవనము విశాల ప్రాంగణముతో నిర్మింపబడినది. దీనికి అనుబంధముగా పుస్తక విక్రయశాల, ప్రచురణల భాగము, పరీక్షా విభాగము - ఆంధ్ర ప్రాచ్య కళాశాల మున్నగునవి నిర్వహింపబడుచున్నవి.

సాహిత్యసేవలో ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యనిర్వహణ రంగ మతి విస్తృతమైనది. సాహిత్య సభలు, మహాకవులు - మహాపురుషుల జయంతి, స్మారక సభలు - వివిధాంశములపై ప్రత్యేకోపన్యాసములుమున్నగునవి శతాధికముగ నేర్పాటు చేయబడుచున్నవి. ప్రముఖ విద్వాంసు లొసగిన ఈ సాహిత్యోపన్యాసములు, పరిశోధనాత్మకములగు గ్రంథములు మున్నగు వానిని ప్రచురించుట ఆంధ్ర సారస్వత పరిషత్తు పరిశోధనాత్మక కృషిలో ప్రధాన భాగము. ఈ ప్రణాళిక ననుసరించి వెలువడిన గ్రంథములలో భారత భాగవతోపన్యాసములు, కావ్యాలంకార సంగ్రహము, భాషా చారిత్రక వ్యాసావళి, స్త్రీల రామాయణపు పాటలు, జానపద గేయములు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ప్రపంచరాజ్య సర్వస్వము ప్రత్యేకముగ పేర్కొనదగియున్నవి. ఇవి వివిధ రంగములకు చెందిన ప్రామాణిక పరిశోధనాత్మక గ్రంథములుగా ప్రశస్తి కెక్కినవి. పరిషత్తు గ్రంథాలయములో అమూల్యమైన గ్రంథములు, తాళపత్ర గ్రంథములు సేకరించబడినవి. పరిశోధకుల కీ సామగ్రి ఎన్నియో విధముల తోడ్పడుచున్నది.

**విజ్ఞానవర్ధినీ పరిషత్తు**

శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు గౌరవ కార్యదర్శిగ విజ్ఞానవర్ధిని పరిషత్తు వ్యవహారములను నిర్వహించిరి. హైదరాబాదులో స్థాపింపబడిన ఈ సంస్థ పక్షమున 1951 నాటికి సామాన్య గ్రంథములతోపాటు కొన్ని శాస్త్రగ్రంథములు, పరిశోధనాత్మక గ్రంథములు ప్రచురింపబడినవి. శాస్త్ర గ్రంథములలో శిరోమణి చెలమచర్ల రంగాచార్యులుగారి అలంకార

వసంతము - ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము అనునవి పేర్కొనదగినవి. సురవరము ప్రతాపరెడ్డి గారి రామాయణ విశేషణములు అను గ్రంథము పరిశోధనాత్మకమైనది. యువజన విజ్ఞానము, మృత్యు సిద్ధాంతము, గంగాపుర మాహాత్మ్యము మొదలగు గ్రంథములు విజ్ఞానవర్థినీ గ్రంథావళిగ ప్రకటింపబడినవి.

**సారస్వత వేదిక**

ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షమున సారస్వత వేదిక పేర నిర్ణీత సాహిత్య ప్రణాళిక ననుసరించి ప్రతి నెల మొదటి ఆదివారమునాడు సాహిత్య గోష్ఠి కార్యక్రమము దాదాపు అయిదు సంవత్సరముల నుండి నిర్విఘ్నముగ కొనసాగుచున్నది. భాషా సాహిత్యాంశములకు సంబంధించిన ఈ ఉపన్యాసములు గ్రంథ రూపమున ప్రచురింపబడుచున్నది. ఈ పరంపరలో తెలుగు సాహిత్య వికాసము (78-79); ఆధునిక తెలుగు సాహిత్యము-విభిన్న ధోరణులు (80-81) అను గ్రంథములు ప్రచురింపబడినవి- పండితుల వ్యాసములు ప్రామాణికములని, పరిశోధనాత్మకములని సహృదయుల మన్ననల నొందినవి.

**సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి**

కొమర్రాజు వారి విజ్ఞాన సర్వస్వ జ్యోతిని వెలిగించుట కేర్పడిన సంస్థ ఇది. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము, బేతనభట్ల విశ్వనాధముగార్లు 1953లో అకారాదిగ విజ్ఞాన కోశమును కూర్చుటకు సంకల్పించిన ఫలముగా అవతరించిన సంస్థ క్రమముగా విస్తరిల్లి విశ్వవిద్యాలయములందును, తదితర రంగములందును గల విద్వాంసుల తోడ్పాటు నొందినది. ఈ విజ్ఞానకోశము సంగ్రహ రూపమున ఎనిమిది సంపుటములలో వెలువడినది.

ప్రత్యేక ప్రణాళికతో ఆచార్య లక్ష్మీరంజనము గారి పర్యవేక్షణతో "ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ సర్వస్వము" అను కోశము కూడ ప్రకటింపబడినది. ఆంధ్రదేశమునందలి చారిత్రక భౌగోళిక ప్రాధాన్యము గల వివిధాంశములపై విద్వాంసులు వ్రాసిన వ్యాసములు విజ్ఞానకోశరూపమున నిందు సంతరింపబడినవి. ఈ రెండు విజ్ఞాన కోశములలోని కొన్ని వ్యాసములు పరిశోధనాత్మకము లనుటకు సందేహము లేదు.

**నవ్యసాహితీ సమితి :**

1952 లో హైదరాబాదులో స్థాపింపబడిన ఈ సంస్థ పరిశోధనాత్మక కృషి రెండు మూడు విధములుగ సాగినది. వివిధ ప్రక్రియలకు బహుమతులు ప్రకటించి ఉత్తమ గ్రంథ రచనకు ప్రోత్సహించుట సాహిత్య పరిశోధనకు, సాహిత్యాభివృద్ధికి దోహదమొనర్చినది. ఈ సంస్థ కనుబంధముగ నాటకవిభాగ మేర్పడి ప్రయోగాత్మక నాటక ప్రదర్శనలకు, పూనుకొని, సాహిత్య వికాస కార్యక్రమమునకు తోడ్పడుచున్నది. అఖిల భారత రచయితల సమావేశము నేర్పాటు చేసి, తెలుగు ప్రశస్తిని లోకమునకు వెల్లడించినది. సదస్సులు-చర్చలు - సమావేశములు ఈ సంస్థ కృషిని ఇనుమడింపజేయుచున్నవి.

**ఆంధ్ర విశ్వసాహితి**

ఆదాన ప్రదాన సాహిత్యమును పరిశోధనాత్మక కృషిలో ఒక భాగముగ గుర్తింపవచ్చును. అది వివిధ సాహిత్యముల పరస్పర వికాసమునకు మార్గము నేర్పఱచును. 1960 లో స్థాపింపబడిన ఆంధ్ర విశ్వసాహితి పోతుకూచి సాంబశివరావు గారి ఆధ్వర్యమున ఈ దృక్పథముతో పని చేయుచున్నది. ఆంగ్ల పత్రిక మూలమున ఆంధ్రేతరులకు తెలుగు సాహిత్య వైభవ వైశిష్ట్యములను వెల్లడించుటకు ఈ సంస్థ చేయుచున్న కృషి ప్రశంసార్హము. పానుగంటి వారిపై ప్రకటింపబడిన ప్రత్యేక సంచిక ఆంధ్ర విశ్వసాహితీ పరిశోధనాత్మక కృషికి దర్పణముగా నున్నది.

**యువభారతి**

కేవలము పండిత లోకమునకే కాక సామాన్య పాఠకునకు సాహిత్య పరిజ్ఞానము కలవారికి సుపరిచితమైన సంస్థ యువభారతి. తెలుగువా రున్నచోట ఈ సంస్థ ఏదియో ఒక రూపమున ప్రత్యక్షమగుట దాని సర్వతోముఖ వ్యాప్తిని ఆదరణ భావమును నిరూపించుచున్నది. ఉత్సాహవంతులైన యువకులచే 1964 లో స్థాపింపబడిన ఈ సంస్థకు డా॥ పంగపల్లి విశ్వనాథము, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యము వెన్నెముక వంటివారు. దాదాపు పదిహేను ఏండ్లలో ఈ సంస్థ క్రమాభివృద్ధి నొంది మహావృక్షమై సహృదయులకు చల్లనినీడ నొసగి సాహిత్య మందమారుతముచే మనోల్లాసమును కలిగించుచున్నది. ఈ సంస్థ స్వరూపమునందే కాక స్వభావమునందును విస్తృత ప్రణాళికలతో ఉదాత్తాశయములతో ధ్యేయముతో తెలుగువారున్న ప్రతిచోట స్థావరము కలిగించుకొనుచున్నది. క్రమశిక్షణకు మారుపేరు ఈ సంస్థ యనుటలో ఎంతయో ఔచిత్యము కలదు. ప్రతి కార్యక్రమము నిర్ణీత ప్రణాళిక ననుసరించి జయప్రదముగ నిర్వహింపబడుట ఈ సంస్థ క్రమశిక్షణకు దర్పణముగా నున్నది.

సాహిత్య సమావేశములు-గోష్ఠులు- సాహిత్యోపన్యాసములు మున్నగువానిని క్రమ ప్రణాళికతో ఏర్పాటు చేయుటలోను, పరిశోధక విద్వాంసుల ఉపన్యాసములను గ్రంథరూపమున ప్రచురించుటలోను, ప్రత్యేకాంశములపై ప్రామాణిక పరిశోధనాత్మక రచనలను వెలువరించుటలోను, ఈ సంస్థ ముందంజ వేయుచున్నది. 1970లో తెలుగు నవల- మారుతున్న విలువలు, రచయితల బాధ్యతలు మొదలగు వాటిపై జరిగిన గోష్ఠులకు, చర్చలకు అక్షర రూపము నొసగి అమూల్యమైన గ్రంథముల నీసంస్థ ప్రకటించినది. సృజనాత్మక గ్రంథములు కూడ అధిక సంఖ్యలో ఈ సంస్థ పక్షమున ప్రచురింపబడినవి. కావ్యలహరి- చైతన్యలహరి - ప్రతిభాలహరి, ఇతిహాసలహరి వంటివి ప్రాచీనార్వాచీన సాహిత్య వైశిష్ట్యమును, వెల్లడించుచున్నవి. ప్రాచీనాధునిక కవుల ప్రతిభా ప్రదర్శకములగు లఘు గ్రంథములు వివిధ కావ్య సౌరభములను గుబాళింప చేయుచున్నవి. తిక్కన, పాలకురికి సోమన, చేమకూర వేంకటకవి, శతక కవులు మొదలగు కవుల కవితావైభవమును చాటునవి, లఘు గ్రంథములు మందారమకరందము శతక సౌరభము వంటివి ఈ పరంపరలో వెలువడిన విశిష్ట గ్రంథములు పరిశోధనాత్మక దృష్టితో వెలువడిన వ్యాససంకలన గ్రంథములు సభ్యులు వ్రాసిన గ్రంథములు అత్యున్నత స్థాయికి చెందినవని సహృదయ విమర్శకులు ప్రశంసించినారు. మహతి, నారాయణ రెడ్డి సాహితీమూర్తి వంటి గ్రంథము లిట్టివి. యువభారతి ఆశయములకు అద్దముపట్టు 'నందిని' పత్రిక యందును అప్పుడప్పుడు చక్కని వ్యాసములు ప్రకటింపబడుచున్నవి. ఇప్పటికిని సాహిత్య సేవ చేయుచున్న సంస్థలలో యువభారతి సజీవ సంస్థ అనుటకు సందేహము లేదు.

**తిరుపతి సాహిత్య సమితి**

అత్యుత్తమ స్థాయి సాహిత్య వ్యాసంగమే ధ్యేయముగా గల సాహిత్య సంస్థలలో తిరుపతిలో 1964లో స్థాపితమైన సాహిత్య సమితి విశిష్టమైనది. కళాశాలలు, విశ్వవిద్యాలయములు, తదితర సంస్థలలో గల దిగ్దంతుల వంటి పండిత విమర్శకులచే సాహిత్య గోష్ఠి కార్యక్రమము నిర్వహించి, వారు చదివిన వ్యాసములను, గ్రంథ రూపమున ప్రచురించుట ఈ సంస్థ ఆదర్శములలో ప్రధానమైనది. దీనిని సముచితరీతిలో అక్షర రూపమున నుంచిన కీర్తి ఈ సంస్థకు లభించినది. సభ్యులు చదివిన వ్యాసములు 1967, 69, 72 సంవత్సరములలో ప్రత్యేక వ్యాస సంపుటముల రూపమున వెలువడినవి. ఈ వ్యాసములు భాషా సాహిత్యములకు సంబంధించినవి. అనేక నూత్న

దృక్పథములకు, అత్యాధునిక అంశములకు రీతులకు దర్పణము పట్టుచున్నవి. వీనిలోని వ్యాసములన్నియు ఉత్తమ ప్రామాణిక పరిశోధనస్థాయి గలవి.

**ఆర్ష విజ్ఞాన పరిషత్తు**

ప్రాచీన సాహిత్య సంస్కృతులను, ఆర్ష విజ్ఞానమును పరిశోధనాత్మక గ్రంథ ప్రచురణ రూపమును సురక్షిత మొనర్చి ప్రచార మొనర్చుటకు 1952 లో నిడుదవోలులో ఏర్పడిన సంస్థ ఇది. ఇపుడీ సంస్థ కార్యాలయము హైదరాబాదులో నున్నది. చర్ల గణపతి శాస్త్రిగా రీ సంస్థనుండి సాహిత్యాలంకార శాస్త్ర గ్రంథములను ప్రచురించినారు. ఇవి పరిశోధనాత్మకములు.

**కళాస్రవంతి**

ఉత్సాహవంతులు, సాహిత్యాభిమానులైన యువకులు కొందరు సెప్టెంబరు 1971 లో కళాస్రవంతి పేర హైదరాబాదులో సమితిని స్థాపించి వివిధ ప్రక్రియలపై సాహిత్యోపన్యాసముల నేర్పాటు చేసి వానిని లఘు గ్రంథ రూపమున కూడ ప్రకటించిరి. వీనిలో ఆంధ్ర వాఙ్మయారంభ దశ, యక్షగానము శతకము, వచనము మున్నగు ప్రక్రియలపై వెలువడిన గ్రంథములు ప్రామాణిక పరిశోధనాత్మకములుగ సహృదయుల మన్ననల నొందినది. ఈ సంస్థ వారు 'సాహిత్య మంజూష' పేర ప్రముఖులు వ్రాసిన పరిశోధక వ్యాసములను ప్రకటించి తమకు తెలుగు సాహిత్యముపై గల ఆదరాభిమానములను వ్యక్తీకరించిరి.

**భాషా చారిత్రక పరిశోధక సంస్థలు**

భాషా సాహిత్యములకు చరిత్రకు అవినాభావ సంబంధము కలదు. చరిత్ర వీనికి పునాది వంటిది. తెలుగు శాసనములు-వాని భాష- చారిత్రకాంశములను గూర్చి పరిశోధన మొనర్చుటకు కొన్ని సంస్థలు ప్రత్యేకముగ నేర్పడినవి. వీనిలో ప్రధానముగ పేర్కొనదగిన సంస్థలు కొన్ని కలవు.

**లక్ష్మణరాయ పరిశోధక మండలి**

1921 లో ఏర్పడిన ఆంధ్ర జనసంఘమునకు కొమర్రాజు లక్ష్మణరావు గారు సభ్యులుగా నుండి పరిశోధనా వ్యాసంగము నారంభించిరి. కాని, కొద్ది కాలమునకే వారు దివంగతులైరి. వారి స్మృతి చిహ్నముగ ఆంధ్ర పరిశోధక సంఘము లక్ష్మణరాయ పరిశోధక మండలిగా వ్యవహరింపబడినది. మునగాల జమీందారు నాయని వేంకటరంగారావు గారి అధ్యక్షతలో ఏర్పడిన ఈ సంస్థకు మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి ప్రభృతులు సభ్యులుగా నుండిరి. ఆదిరాజు వీరభద్రరావుగారు కార్యదర్శిగా వ్యవహరించిరి. తెలుగు దేశంలోని శాసనములను సంపాదించి ప్రకటించుట ఈ సంస్థ ధ్యేయము. ఈ మండలి ఆదేశము ననుసరించి శేషాద్రి రమణ కవులు తెలంగాణ ప్రాంతమున పర్యటించి చాళుక్యులు, కాకతీయులు మొదలగు వారికి సంబంధించిన శాసనములను సంపాదించిరి. ఇవి ''తెలంగాణ శాసనములు'' అనుపేర గ్రంథరూపమున 1935 లో ప్రకటింపబడినది. చరిత్ర శాసన సంబంధమైన పరిశోధన ఫలమే ఈ గ్రంథము.

**ఆంధ్రేతిహాస పరిశోధక మండలి**

రాజమహేంద్రవరములో స్థాపింపబడిన ఈ మండలి శాసనములను, చారిత్రక గ్రంథములను ప్రకటించుటలో ప్రత్యేక కృషి చేసినది. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక- కళింగ సంచిక - రెడ్డి సంచిక మొదలగునవి ఈ సంస్థ పక్షమున ప్రకటింపబడిన గ్రంథములు. భావరాజు వేంకట కృష్ణారావు, రాళ్ళబండి సుబ్బారావుగారు చేసిన ప్రశస్త పరిశోధనలకు ఇవి అక్షర రూపమున నిలిచిన గ్రంథములు.

**ఆంధ్ర విజ్ఞానచంద్రికా మండలి**

సుప్రసిద్ధ విద్వాంసులు, పరిశోధకులు, కొమర్రాజు లక్ష్మణరావు గారు స్థాపించిన మండలి ఇది.

చరిత్రకు సంబంధించిన అనేక గ్రంథములు ఆంధ్ర దేశ కథా సంగ్రహము, హిందూ దేశ చరిత్ర - హిందూ యుగ, మహమ్మదీయ యుగము-శిలా తామ్ర శాసనములు మొదలగునవి ఎన్నియో ఈ సంస్థ పక్షమున ప్రకటింపబడినవి.

## గ్రాంథిక వ్యావహారికవాదుల సంఘములు

గ్రాంథిక వ్యావహారిక భాషలకు సంబంధించిన సమస్యలను గూర్చి చర్చించి తమ అభిప్రాయములను చాటుటకు గ్రంథములను కూడ ప్రకటించిన సంస్థలు కొన్ని కలవు. భాషల విషయమై ప్రత్యేకముగ సంస్థ లవతరించుట ప్రత్యేకముగా గమనింపదగినది. గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమములకు అనుకూల ప్రతికూల సంస్థలుగా ఇవి వర్ధిల్లినవి. గ్రాంథికవాదుల కవి పండిత సంఘము- ప్రత్యేకముగ గ్రాంథికవాద మును బలపరిచినది. 1914 లో వ్యావహారిక భాషను సమర్థించిన ఆంధ్రభాషా సంరక్షక సంఘము 1914 లో వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సంఘము లనునవి ఏర్పడినవి. వీరు ఏర్పాటు చేసిన ఉపవ్యాసములు - ప్రకటించిన గ్రంథములు పరిశోధనాత్మకములు.

## వివిధ సంస్థలు

సాహిత్య పరిశోధనకు ఈ సంస్థలే కాక తెలుగు దేశములో మరికొన్ని సంస్థలు తమకు తోచిన రీతిలో సాహిత్య సేవ చేయుచున్నవి. వానిలో కొన్ని పరిశోధనాత్మక కృషి చేయుట ప్రత్యేకముగ గమనింప దగినది. విశాఖ రచయితుల సంఘము-స్పందన సాహితి, సాహిత్య లహరి- సాహిత్య గౌతమి, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, యువసాహితీ సమితి-లలితకళా పరిషత్తు మొదలగునవి ఇట్టివి. కొన్ని సంస్థలు కేవలము ఒకే ఒక వ్యక్తి పరిశోధనల నావిష్కరించుచున్నవి. మరికొన్ని ప్రాంతీయ పరిమితిలో సేవ చేయుచున్నవి. "ప్రభాకర పరిశోధక మండలి" అను సంస్థ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మరణానంతరము స్థాపింప బడినది. ఇది మొదట తిరుపతిలోను, మద్రాసులలోను పనిచేసినది. ప్రస్తుతము దీని కార్యాలయము హైదరా బాదులో వేటూరి ఆనందమూర్తి గారి ఆధ్వర్యమున పని చేయుచున్నది. ప్రభాకర శాస్త్రిగారి ముద్రితా ముద్రిత రచనలను వారికి సంబంధించిన సాహిత్యము ప్రముఖులు శాస్త్రిగారికి వ్రాసిన లేఖలు- వారు ఇతరు లకు వ్రాసిన లేఖలు - మొదలగునవి ఈ మండలి పక్షమున ప్రకటింపబడుచున్నవి. అనంతపురములో స్థాపింపబడినది రాయల కళాగోష్ఠి. తెలుగుభాషా సాహిత్యములకు సంబంధించిన అనేకాంశములపై చర్చలు సమావేశములు నిర్వహించుచున్నది. ఈ వేదికనుండి ప్రముఖులొనర్చిన ఉపన్యాసములు గ్రంథ రూపమున వెలువడునని సహృదయలోక మెదిరి చూచున్నది.

## ప్రాంతీయ, జిల్లా రచయితల సంఘములు

తెలుగుదేశము సువిశాలమైన మండలము-అఖి లాంధ్ర స్థాయిలో జరిగిన సాహిత్య పరిశోధనము లేదా సాహిత్య కృషిని పరిశీలించుటకు అన్ని మండల ములలోని సాహిత్య కృషితో పరిచయ మవసరము. నేడు సాహిత్య వికాసము కేవలము రాజధానీ నగర మునకు లేదా కొన్ని ప్రత్యేక ప్రాంతములకు పరిమిత ముగా లేదు. తెలుగుదేశములోని ప్రతి ప్రాంతము నందును, జిల్లా యందును కవులు, రచయితలు పండి తులు విద్వాంసులు తమ తమ పరిధిలో సాహిత్యసేవ చేయుచున్నారు. ప్రయాణ సౌకర్యములు తదితర ప్రచారసాధనము లధికమైన ఆధునిక శాస్త్ర యుగము నందును మారుమూల జరుగుచున్న సాహిత్య కృషి తెలుగువారికి అందరికి సుపరిచితమగుటలేదు. ప్రాచీన కాలమునను ఇట్టి పరిస్థితియే ఉండి అనేక కవులకు గ్రంథములకు సముచితమైన గుర్తింపు లభించలేదు. ఈ లోపమును నేటి ప్రాంతీయ జిల్లా రచయిత సంఘ ములు తీర్చుటకు ప్రయత్నించుచున్నవి. ఈ సంఘ ముల ద్వారా తెలియుచున్న విశేషములు ఒక ప్రాంతము వారి సాహిత్య కృషి అన్యప్రాంతీయులకు

పరిచితమగుటకు, ప్రాంతీయ కవుల కృషికి తగిన గుర్తింపు లభించుటకు, అఖిలాంధ్ర స్థాయిలో జరుగు సాహిత్య కృషిని గ్రహించుటకు తోడ్పడుచున్నవి.

ప్రాంతీయ, జిల్లా రచయితల సంఘములు నేడు దాదాపు అన్ని ప్రాంతములందు, జిల్లాలందు అవతరించుచున్నవి. తెలంగాణమున నిజామాబాదు, కరీంనగరము, వరంగల్లు, ఖమ్మము, నల్లగొండ, మహబూబ్‌నగరము మొదలగు జిల్లాలలో ఇట్టి సంఘములు కలవు. గుంటూరు, కృష్ణా, గోదావరి, విశాఖ, అనంతపురము, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు మొదలగు ప్రాంతములలోని రచయితల సంఘములు సృజనాత్మక సాహిత్యముతోపాటు పరిశోధనాత్మక రచనలనుకూడ వెలువరించుచున్నవి. నిజామాబాదులోని ఇందూరిభారతి సృజనాత్మక రచనలను ప్రకటించినది. మెదకు మండలసాహిత్యచరిత్ర ఆమండలము సాహిత్యపరిశోధనాత్మక కృషికి మకుటాయమానమైన రచన. మహబూబునగరము జిల్లాలోని రచయితల సంఘములు, ఆ ప్రాంతములోని అజ్ఞాత కవులను, వారి రచనలను సాహిత్య లోకమునకు పరిచయ మొనర్చినది. జ్యోతిర్మయి అను సంస్థ ఆత్మకూరు, ఆలంపూరు అను ప్రాంతములకు సంబంధించిన రెండు ప్రత్యేక సంచికలను ప్రకటించినది. ఇవి ఆ ప్రాంతముల సాహిత్య సాంస్కృతిక పరిశోధనాత్మక కృషికి దర్పణము పట్టిన పరిశోధనాత్మక సంచికలు. నెల్లూరు గుంటూరు ప్రాంతములందును ఇట్టి సర్వస్వములు ప్రకటింపబడినవి. అనంతపురములోని లలితకళా పరిషత్తు, రాయల కళాగోష్ఠి, కాకినాడ సాహిత్యలహరి ఈ సందర్భములలో కొంత గణనీయమైన కృషి నొనర్చినవి. హైదరాబాదులోని శ్రీనివాస సాహితీ సమితివారు ప్రచురించిన రెండు సంకలన గ్రంథములు పరిశోధనాత్మకములు 'అడుగుజాడలు' మధురకవితాపితామహుడు కుందుర్తి ఆంజనేయులపై ప్రచురింపబడిన వ్యాసముల సంపుటి; హాస్యరచనలను సంబంధించినది 'రమణీయము'. ఇవి సాహిత్య చరిత్రలోని అమూల్యాంశములను వివరించు వ్యాస సంకలనములు. నవోదయం అను సాహితీ సంస్కృతిక సంస్థ ప్రముఖ కవి డా॥ సి. నారాయణరెడ్డి రచించిన మంటలు మానవుడు అను కావ్యమునకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించిన సందర్భమున దానిపై చర్చలు, గోష్ఠి కార్యక్రమము ఏర్పాటు చేసి ఆ ఉపన్యాసములను సంకలన గ్రంథ రూపమున డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారి సంపాదకత్వమున చైతన్యశిఖరము పేర ప్రకటించినది. దీనిలోని వ్యాసములు ప్రామాణిక పరిశోధన స్థాయి కలవి. హైదరాబాదులోని కిన్నెర పబ్లికేషన్సువారు ఆచార్య తిరుమల సృజనాత్మక రచనలతోపాటు పరిశోధనాత్మక గ్రంథమును కూడ ప్రచురించినారు. ఆచార్య తిరుమల గారి సంపాదకత్వమున 'ఆధునిక కవిత్వ-అభిప్రాయ వేదిక' అను గ్రంథము ఆధునిక కవితను గూర్చి ప్రముఖుల అభిప్రాయము లొకచో కూర్చబడినవి. ఇది ప్రామాణిక గ్రంథమనుటకు సందేహము లేదు. ఇటీవల వంశీ ఆర్ట్ థియేటరు వారు నారాయణరెడ్డి గారి పరిశోధనాత్మక వ్యాసములను "సమీక్షణం" అను గ్రంథముగా ప్రకటించిరి. అంతియేకాక కళాప్రపూర్ణ రావూరు వేంకట సత్యనారాయణరావు గారు నారాయణరెడ్డి గారి 50వ జన్మదిన సందర్భమున ప్రత్యేక గ్రంథములను అభినందన సంచికను ప్రకటించిరి.

## గ్రంథమాలలు :

గ్రంథమాలలు గ్రంథ ప్రకటనకు ఆధార సంస్థలు. తెలుగుదేశములో వివిధ భాషా సాహిత్య ఉద్యమములు, గ్రంథాలయోద్యమములు మున్నగువాని ఫలితముగ గ్రంథాలయ, గ్రంథమాలల స్థాపనమారంభమైనది. గ్రంథ పరిష్కరణము, గ్రంథమాలకు పీఠికలు వ్రాయించుట, ముద్రితాముద్రిత గ్రంథ ప్రకటనము మొదలగునవి ఈ గ్రంథమాలల

లక్ష్యములలో కొన్ని- కొందరికి గ్రంథముల ప్రకటించుటలో సాహిత్యవ్యాపారదృష్టి అనగా గ్రంథప్రకటన మూలమున ధనార్జన గావించుట అను దృష్టి మాత్రమే ఉండవచ్చును. ఆ దృష్టి కేవలము పాఠ్యగ్రంథములు గైడు పుస్తకములు మొదలగువానిని ప్రకటించుటకే పరిమితము కావచ్చును. కాని, బహుళముగ సాహిత్యాభిమానముతో గ్రంథములను ప్రచురించు దృష్టియే కనిపించును. కొందరి యందు పరిశోధనాత్మకదృష్టి మాత్రమే గోచరించును. వీరు సాధారణ గ్రంథములను మాత్రమే ప్రచురించక ప్రత్యేక ధర్మములు గల గ్రంథములను పరిశోధనాత్మక ప్రాధాన్యముగల వానిని వెలువరించినారు. వీనిలో ప్రధానములైన గ్రంథమాలల కృషి పరిశీలింపదగియున్నది.

**విజ్ఞాన చంద్రికా గ్రంథమాల**

తెలుగుదేశములో 1906 లో అవతరించిన గ్రంథమాల- ప్రాచీన గ్రంథమాలలలో దీనికి ప్రాధాన్యము కలదు. కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, ఆదిరాజు వీరభద్రరావు ప్రభృతులు దీనికి మూల స్తంభములుగా ఉండిరి. వీరి ఆధ్వర్యమున చరిత్ర- విజ్ఞానము- వివిధ శాస్త్రములు- సాహిత్య ప్రక్రియలు మున్నగువాటికి సంబంధించిన అమూల్య గ్రంథములు ప్రకటింపబడినవి. దీని కార్యస్థానము మొదట హైదరాబాదులో ఉండి తరువాత మదరాసునకు మారినది. కందుకూరి వీరేశలింగము పంతులుగారి స్వీయచరిత్ర, లక్ష్మణరాయ వ్యాసావళి, వైద్యవ్యవసాయ శాస్త్రములకు చెందిన గ్రంథములు కొన్ని ప్రత్యేకముగ పేర్కొనదగిన గ్రంథములు. లక్ష్మణరాయ వ్యాసావళిలో పరిశోధనాత్మకములైన వ్యాసములు కలవు.

**ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల**

తణుకులో 1911 లో స్థాపింపబడిన ఈ గ్రంథమాల వేంకట పార్వతీశ్వర కవులు, చాగంటి శేషయ్య ప్రభృతుల ఆధ్వర్యమున వచన గ్రంథములను, నవలలు, కావ్యసంపుటములు మున్నగువానిని బహుళముగ ప్రచురించినది. స్వతంత్ర, అనువాద నవలలను అధిక సంఖ్యలో ప్రకటించిన గ్రంథమాల ఇది. నవలను గూర్చి పరిశోధన మొనర్చు వారికి గ్రంథములు ప్రధానాధారములు.

**ఆంధ్ర గ్రంథమాల**

విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు గారి పరిశోధనాత్మ కృషికి చేయూత నొసగిన గ్రంథమాల. ప్రాచీనార్వాచీన గ్రంథములు, వివిధ ప్రక్రియలకు సంబంధించిన గ్రంథములు సవిమర్శక పీఠికలతో ఈ సంస్థ పక్షమున ప్రకటింపబడినవి. శతకములు-కావ్యములు మొదలగు వానికి సంతరింపబడిన పీఠికలు కేవలము పరిచయాత్మకములుకావు.పరిశోధనాత్మకములు. పాలకురికి సోమన బసవపురాణమునకు గల పీఠిక నేటికిని పరిశోధకులకు మార్గదర్శిగ నున్నది. కిళాంబి రంగాచార్యుల దమ్మపదము, శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారి ఆత్మకథ అనునవి అనువాద గ్రంథలైనను ప్రశస్తములైన ఆధార గ్రంథములు. తలిశెట్టి రామారావు గారి 'చిత్రకళ' ఆ రంగమున గల పరిశోధనాత్మక గ్రంథము. కోరాడ రామకృష్ణయ్య గారి ఆంధ్ర భారత కవితా విమర్శనము సిద్ధాంత గ్రంథముతో పోల్చదగిన పరిశోధన గ్రంథము.

ఆంధ్ర గ్రంథమాల ప్రకటించిన గ్రంథములలో విశిష్ట గ్రంథముగా పేర్కొనదగినది ఆంధ్ర వాఙ్మయ సూచిక. ఒక సాహిత్య సంస్థ చేయదగిన కృషి నీ గ్రంథమాల వారు చేపట్టి ప్రామాణిక రీతిలో పరిశోధనాత్మక దృష్టితో వెలువరించుట ప్రశంసార్హమైన కార్యము. గ్రంథ సూచికల ప్రకటనము పరిశోధనలో ప్రధానమైన భాగము. అది తరతరముల వరకును పరిశోధకులకు ఆధార గ్రంథముగను మార్గదర్శక గ్రంథముగను తోడ్పడుచుండును. నాగేశ్వరరావు గారు పండితుల తోడ్పాటుతో తెలుగులో ముద్రితాముద్రిత గ్రంథముల వివరణమును ప్రామా

ణిక రీతిలో సంతరింపజేసినారు. తెలుగు దేశమున గల గ్రంథాలయములు, మదరాసు, తంజావూరు ప్రాంతములలో గల ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములలోని గ్రంథములను గూర్చి అమూల్యమైన నిధిని సేకరించి గ్రంథ సూచిక రూపములో 1929 లో అందించినారు. గ్రంథములు-గ్రంథకర్తలు - వివిధ ప్రక్రియా విభాగముల ననుసరించి అకారాది పద్ధతిలో ముద్రణ కాలాది సంపూర్ణ వివరణములతో ఆంధ్ర వాఙ్మయ సూచిక సార్థక రూపమున కూర్చబడినది.

**ఆంధ్ర చంద్రికా గ్రంథమాల**

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు గారు 1945 లో తమ షష్టి పూర్తి సందర్భమున ప్రజల నుండి పొందిన విరాళ ధనముతో ఈ గ్రంథ మాలను స్థాపించిరి. ఈ సంస్థ ప్రచురించిన గ్రంథములు కొన్నియే అయినను అవి అన్నియు తెలుగు సాహిత్యము, చరిత్ర సంస్కృతికి సంబంధించిన ప్రామాణిక పరిశోధనాత్మక గ్రంథములు. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారి ఆంధ్ర సాహిత్య సంగ్రహము, బాలేందు శేఖరము గారి విస్మృత సామ్రాజ్యములు, మాడపాటి హనుమంతరావు గారి తెలంగాణ ఆంధ్రోద్యమము, ఆదిరాజు వీరభద్రరావు గారి ప్రాచీనాంధ్ర నగరములు అనునవి ఈ గ్రంథ మాల ప్రకటించిన ప్రశస్త గ్రంథములు.

**దేశోద్ధారక గ్రంథమాల**

విస్తృతమైన ప్రణాళికతో తెలంగాణమునందేర్పడిన సంస్థలలో ఇది ఒకటి. వట్టికోట ఆళ్వారు స్వామిగారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారి స్మృతి చిహ్నముగా 1938లో సికింద్రాబాదు నగరమున స్థాపించిన సంస్థ. వివిధ కవులు, పండితులు, రచయితల సృజనాత్మక విమర్శనాత్మక పరిశోధనాత్మక గ్రంథము లెన్నియో ఈ సంస్థ పక్షమున ప్రకటింపబడినవి. వీనిలో నాటికలు, కథలు నవలలు, గేయసంపుటములు, కవితాసంకలనములు-అనువాదములు బహుళముగా నున్నవి. పరిశీలనాత్మక గ్రంథములలో వైజ్ఞానిక గ్రంథము లెన్నదగినవి. సురవరము ప్రతాపరెడ్డిగారి ప్రాథమిక స్వత్వములు గ్రంథాల యోద్యమము. మొదలగునవి పరిశీలనాత్మక గ్రంథములు. నేదునూరి గంగాధరముగారు జానపద వాఙ్మయోద్ధారకులు. వారి పరిశోధన ఫలముగ సంపాదించిన గేయములు 'సెలయేరు' రూపమున ప్రకటింపబడినవి. జానపద వాఙ్మయమునకు సంబంధించిన పరిశోధనాత్మక గ్రంథ మిది.

**వివిధ గ్రంథమాలలు**

గ్రంథమాలలను స్థాపించునపుడు స్థాపకులు లేదా నిర్వాహకులు కొందరు ప్రత్యేక ధ్యేయమును, లక్ష్యమును అనుసరించి గ్రంథ ప్రకటన మొనర్చుచుందురు. కొందరు తమ ప్రాంతీయ కవిపండితులు, వారి సాహిత్యముపై అభిమాన మూని వారిగ్రంథములచే ప్రకటించుచుందురు. మరికొందరు, వర్గ, మతచరిత్ర రాజకీయ దృక్పథము గల సాహిత్యమునే వెలువరించుటకు పూనుకొందురు. ప్రాచీనసాహిత్యముపై ప్రత్యేక ప్రక్రియలపై కొంద రాసక్తి వహింతురు. వివిధ దృక్పథములతో గ్రంథ ప్రకట మొనర్చిన గ్రంథమాలల కృషి నిట సంగ్రహముగ సమీక్షించుట సముచిత మనిపించును.

కృష్ణాజిల్లాలో 1957 లో స్థాపింపబడిన గోదా గ్రంథమాల బాలసాహితి, ఇతర గ్రంథములతో పాటు వైష్ణవమత ప్రధానములైన గ్రంథములను బహుళముగా ప్రకటించినది. శ్రీమాన్ వెలగలేటి నరసింహాచార్యులుగారు 1972 లో స్థాపించిన వెలగలేటి గ్రంథమాల ద్వారా విశిష్టాద్వైత దృక్పథముగల గ్రంథములను ప్రకటించిరి. శైవ విజ్ఞాన ప్రచారార్థము శైవమత ప్రధానములైన రచనలను మాత్రమే ప్రచురించిన గ్రంథమాలలలో ఓరుగల్లులోని విశ్వేశ్వర గ్రంథమాల శివధర్మ వర్ధినీ పార్వతీ శంకర గ్రంథమాల, శివా

గమ గ్రంథమాల శుకశ్యామలా రామలింగేశ్వర గ్రంథ మాల, వీరశైవప్రచారిణీ గ్రంథమాల మొదలగునవి పేర్కొనదగినవి.

కొన్ని గ్రంథమాలలవారు, తమ అభిమాన కవులను గూర్చిన సాహిత్యమును మాత్రమే ప్రచురించిరి. నెల్లూరిలోను వేంకటణ గ్రంథమాల (1951) నన్నెచోడుని గూర్చి కొన్ని ప్రత్యేక గ్రంథములను ప్రకటించినది. వీనిలో నన్నెచోడుని కవిత, వెంకణాదిత్యుడు అను గ్రంథములు విశిష్టము వైనవి. భీమవరములోని సాహిత్యపరిషత్తు వసుచరిత్రకారుడైన రామరాజభూషణుని గూర్చి పరిశోధనాత్మకములైన గ్రంథములను వెలువరించినది. ఈ సంస్థ ప్రకటించిన గ్రంథములలో భూషణకిరణావళి- పుట్టపర్తి నారాయణాచార్యులుగారి వసుచరిత్ర సౌరభము మొదలగునవి ప్రధానమైనవి. శ్రీకృష్ణదేవరాయల గ్రంథ మాల (1931) ప్రత్యేకముగ రాయలసీమ కవిపండితుల రచనలనే ప్రకటించినది. ఆర్షవిజ్ఞాన గ్రంథ మాల దేశచారిత్రక ప్రాధాన్యముగల, ఆర్షవిజ్ఞాన ప్రదములైన గ్రంథములను ప్రచురించి ఆర్ష విజ్ఞాన ప్రచారము పట్ల తమకు గల ఆసక్తిని చాటినది. భారతీయ శకమును గూర్చిన గ్రంథములు-అశోకుని కాలమును గూర్చిన గ్రంథములు వీనిలో పేర్కొనదగినవి. కృష్ణాజిల్లాలోని ఇతిహాస తరంగిణి గ్రంథ మాల చిలుకూరి వీరభద్రరావు గారి ఆంధ్రుల చరిత్ర కొన్ని భాగములను ప్రచురించినది.

తెలుగు సాహిత్య గ్రంథములను పరిశోధనాత్మక దృష్టి కలవానిని ప్రకటించిన వానిలో అభినవాంధ్ర గ్రంథమాల (1927), భారత గ్రంథమాల (1968), ప్రాక్ప్రతీచి గ్రంథమాల, వాఙ్మయవినోదినీ గ్రంథమాల, వేగుచుక్క గ్రంథమాల, శారదా పీఠ గ్రంథమాలిక, సారస్వత కుటీర గ్రంథమాల (మదరాసు) ఆంధ్రభాషాభివర్ధినీ గ్రంథమాల (బందరు), కవికోకిల గ్రంథమాల (పెమ్మారెడ్డి పాలెము) శరత్ గ్రంథమాల ( బెజవాడ ) మొదలగునవి పేర్కొనదగినవి.

కామశాస్త్ర ప్రధానములైన గ్రంథములను, శృంగార రస ప్రధానములగు గ్రంథములనే కొన్ని గ్రంథమాలలు ప్రకటించుటకు పూనుకొనుట ప్రత్యేకముగ గమనింపదగిన అంశము. చెన్నపురిలోని గంటి సూర్యనారాయణశాస్త్రి గారి గ్రంథమాల శృంగార గ్రంథమాల, కామకళానిధి, అహల్యా సంక్రందనము, రసాలవాలము, రాధామాధవ సంవాదము మొదలగు గ్రంథములను ప్రకటించినది. కామగ్రంథమాల కామశాస్త్ర ప్రధానములైన గ్రంథములు రతిరహస్యము, బ్రహ్మానంద శతకము వంటి వానిని ప్రచురించినది.

ఈ గ్రంథమాలలు ప్రకటించిన గ్రంథములు అన్నియు పరిశోధనాత్మకములా అను సందేహము కొందరికి కలుగవచ్చును. వీనిలో బహుళములు పరిశోధనాత్మక గ్రంథము లనుటకు సందేహము లేదు. కొన్నింటిలో పరిశోధనాంశము కొంతవరకైనను లభించును.

**అకాడమీలు :**

సంస్థకు పర్యాయవాచిపదము అకాడమీ. సాహిత్య అకాడమీ స్థాపనముతో దీనికి బహుళ ప్రాచుర్యము కలిగినది. సాహిత్య పరిశోధనలో సంస్థలవలె అకాడమీలు కూడ తమ తమ పరిధులలో ప్రయత్నించినవి. స్వాతంత్ర్యానంతరము భాషా సాహిత్య సాంస్కృతికాభ్యుదయమునకు భారత ప్రభుత్వము చేపట్టిన ప్రణాళికలలో సాహిత్య అకాడమీ స్థాపన మొకటి.

కేంద్ర సాహిత్య అకాడమీ ఒరవడిలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రమునందు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పడినది.

**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ :**

భారతదేశ స్వాతంత్ర్యానంతరము భాషా సాహిత్య సాంస్కృతికాభివృద్ధి ప్రణాళికలు కొన్ని రూపొందినవి. వానిలో కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు నిర్వహించిన పాత్ర ప్రధానమైనది. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ 1957 లో ఏర్పడినది. ఈ అకాడమీల ధ్యేయము, లక్ష్యము కార్యాచరణ విధానము లన్నియు నొకే రీతిలో నున్నను, కొన్ని అంశములలో స్థానిక ప్రాంతీయావసరముల దృష్టితో ప్రత్యేక విధానాచరణము కనిపించును. ప్రభుత్వ ఆర్థిక సహాయముతో ఈ సంస్థ నిర్వహణము కొనసాగుచున్నది. అకాడమీ కార్యనిర్వాహక వర్గము నిర్దేశించిన చట్టము ప్రకారము ఏర్పడినది. సాధారణ సభ్యులు వివిధ సాహిత్య సంస్థలకు, విశ్వవిద్యాలయములకు ప్రాతినిధ్యము వహించినవారు కలరు. నియమింపబడిన సభ్యులు కొందరు కలరు. వివిధ కార్యక్రమములు ప్రణాళికలు రూపొందించుటకు, ఆచరణలో పెట్టుటకు సలహా సంఘములు కలవు. వీని ఆశయములు లక్ష్యములు బహుళార్థ సాధకములు. చిరకాలము వరకు డా. బెజవాడ గోపాలరెడ్డి గారు అధ్యక్షులుగా, దేవులపల్లి రామానుజరావు గారు కార్యదర్శిగా ఈ అకాడమీ తన కార్యక్రమమును జయప్రదముగా నిర్వహించినది. దీని కార్యాలయము కళాభవనమున గలదు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రణాళిక అతి విస్తృతమైనది. సృజనాత్మక రచనలు - ప్రాచీ నాధునిక గ్రంథములు, కావ్యముల పరిష్కృత ముద్రణములు- వివిధ శాస్త్రగ్రంథములు- సంకలన గ్రంథములు, వ్యాస సంపుటములు, విమర్శనాత్మక గ్రంథములు, అనువాదములు, విశేష సంచికలు, గ్రంథ పునర్ముద్రణములు, బహుమతి నొసగి ప్రత్యేకాంశములపై గ్రంథ రచనకు ప్రోత్సాహము, గ్రంథ ముద్రణమునకు ఆర్థిక సహాయము, నిఘంటువులు, పదకోశములు, వివిధ పరిశోధనాత్మక ప్రణాళికలు మొదలగునవి ఎన్నియో సాహిత్య అకాడమీ సాహిత్య పరిశోధనాత్మక కృషిలోని ప్రణాళికలు. వీని ననుసరించి తెలుగులోను ఇతర భాషలలోను శతాధిక గ్రంథములు ప్రకటింపబడినవి. భారతదేశములోని వివిధ రాష్ట్ర సాహిత్యఅకాడమీలకంటెవిస్తృత ప్రణాళికలలో ఆంధ్ర ప్రదేశ్‌సాహిత్య అకాడమీ అగ్రగామిగా నున్నది. పరిశోధనాత్మక గ్రంథములలో నన్నయ, నన్నెచోడ, తిక్కన, శ్రీనాథ పదప్రయోగ కోశములు, ప్రాచీనాంధ్ర శాసనములు, శాసన శబ్దకోశములు, తెలుగు భాషాచరిత్రకు సాహిత్యచరిత్రకు సంబంధించిన పరిశోధనాత్మక గ్రంథములు, వివిధవృత్తి పదకోశములు పదబంధములు, క్రియలు, సామెతలు మొదలగు గ్రంథములు ప్రధానముగ పేర్కొనదగినవి. ప్రాచీన కావ్యములను పరిష్కరింపజేసి సవిమర్శక పీఠికలతో ప్రచురించుట పరిశోధనలో ఒక భాగమే. సాహిత్య అకాడమీ ఈ ప్రణాళిక ననుసరించి భారత భాగవతాదులచే కాక కావ్యప్రబంధములు శతకములు వచన గ్రంథములు మున్నగువానిని ప్రకటించి పరిశోధన కెంతయో తోడ్పడినది. వివిధాంశములపై ప్రామాణిక గ్రంథరచనకు బహుమతి ప్రకటనలతో ప్రోత్సాహ మొసగి అవార్డుల నొసగి చేయుచున్న కృషికూడ ప్రత్యేకముగ నెన్నదగినది. ఇట్టి అవార్డుల నొందిన గ్రంథములలో బహుళములు పరిశోధనాత్మక గ్రంథములు. వీనిలో కవితాశిఖామణి - వీర రసము - వీర కవిత - తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము, ఉషఃకిరణాలు, తెలుగులో రామకథ మున్నగునవి పేర్కొనదగినవి. అవార్డులనొందలేని గ్రంథములకు కూడ సాహిత్యఅకాడమీ ప్రచురణార్థము ఆర్థిక సహాయము చేయుట, ప్రామాణిక గ్రంథప్రకటనకై అకాడమీ తలపెట్టిన విస్తృత ప్రణాళికను ఉదారదృక్పథమును వ్యక్తీకరించుచున్నది.

పరిశోధనాత్మక కృషిలో అమూల్యగ్రంథములను, సామగ్రిని సేకరించుటకూడ ఒక భాగమే అని

అకాడమీ నిరూపించుచున్నది. తెలుగుభాషా సాహిత్యములకు సంస్కృతికి, పందొమ్మిదవ శతాబ్ది తెలుగు దేశ చరిత్రకు అమూల్య నిధివంటిది మెకంజీకైఫియతులు రచనలు. ఇవి దాదాపు నాలుగువందల సంపుటములుగా లిఖితరూపమున ప్రాచ్యపుస్తక భాండాగారమున మద్రాసున గలవు. వీనిలో అతి ప్రధానములైనవి కైఫీయతులు, ప్రౌనులేఖలు- జాబులు, ప్రకీర్ణ రచనలు కొన్ని సంపుటములుగ పరిష్కరించి కూర్చబడినవి. వీనిలోని అమూల్యాంశములను గ్రహించుటకు, పరిశోధనలో తోడ్పడుటకు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు కొన్ని సంపుటములకు పండితులచే శుద్ధప్రతులను సిద్ధము చేయించి కార్యాలయములో భద్రపరిచినారు.

అరువదికి మించిన ఈ సంపుటములు పరిశోధకుల పాలిట కల్పతరువు లనుటలో సందేహము లేదు.

కేంద్ర సాహిత్య అకాడమీ సాహిత్య ప్రణాళికలో ఆదానప్రదాన సాహిత్య మొకటి. భారతీయ భాషలలోను అత్యుత్తమ గ్రంథములను, సాహిత్య విశేషములను పరస్పరము తెలిసికొనుటకు, అనువాదములు స్వతంత్ర రచనలమూలమున గూర్చిన ప్రణాళిక ఇది. రాష్ట్రి అకాడమీలు స్థానికభాషలను ఇరుగు పొరుగు భాషలను దృష్టిలో నుంచుకొని ఇట్టి ప్రణాళికలు చేపట్టుచుందురు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రాష్ట్రిములోని ఉర్దూ భాషకు సంబంధించినంతవరకు ఆదానప్రదాన సాహిత్య కార్యక్రమమును గ్రహించినది. హిందీ భాషకు సంబంధించిన సాహిత్యము కొంత వరకు వెలువడినది. ఇటీవల ఆ భాషలకు ప్రత్యేక అకాడమీలు ఏర్పడినందున ఈ భారము కొంతవరకు తగ్గినది. తెలుగు, ఉర్దు భాషలకు సంబంధించినంత వరకు సృజనాత్మక సాహిత్య ప్రణాళికలకే ప్రాధాన్యము లభించినది. పరిశోధనాంశముల పరిశీలము ఒకటి రెంతు గ్రంథములకే పరిమితమైనది. ఈ ప్రణాళిక తులనాత్మక సాహిత్యాధ్యయనమునకు దోహదము కలిగించుచున్నది.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వివిధ వృత్తిపదకోశములను, అన్యదేశ్యపదకోశములను ప్రకటించుటకు బృహత్ప్రణాళికలు రూపొందించినది. త్రిభాషానిఘంటువుల ఒరవడిలో మరికొన్ని నిఘంటువులు సంతరింప బడవలసియున్నది. పారిభాషిక పదకోశములు, ప్రభుత్వములోని వివిధశాఖలకు చెందిన పారిభాషిక పదకోశములు, ప్రభుత్వవ్యవహార భాషకు సంబంధించిన పారిభాషిక పదములు మున్నగు వానిపై పరిశీలనము పరిశోధనము ఆవశ్యకము ఎంతైనను కలదు. పూర్వప్రగతిని పరిశీలించినపుడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇంకను నూత్నములైన పరిశోధనాత్మక ప్రణాళికలను రూపొందించి అత్యుత్తమగ్రంథములను ప్రకటించుటకు పూనుకొనగలదను విశ్వాసము సాహిత్య ప్రపంచమునకు కలదు.

ఆంధ్రప్రదేశ్‌లో సంగీత నాటక అకాడమీ, లలితకళా అకాడమీ, నృత్య అకాడమీవంటి అకాడమీలు కూడ కలవు. సంగీత నాటక అకాడమీవారు కర్ణాటక జానపద సంగీతములకు చెందిన పరిశోధనాత్మక గ్రంథములను ప్రకటించుచున్నారు. సంగీతమునకు, పదకవితకు, తదితర శాస్త్రాంశములకు సంబంధించిన గ్రంథము లీ అకాడమీల పక్షమున కొన్ని వెలువడినవి. వీటిలో కొన్ని పరిశోధనాత్మక శాస్త్రగ్రంథము లనుట కెట్టి సందేహము లేదు.

**తెలుగు అకాడమీ :**

ఆంధ్రప్రదేశ్‌లో స్థాపింపబడిన అకాడమీలలో సాహిత్య అకాడమీ తరువాత పేర్కొనదగినది తెలుగు అకాడమీ. భాషా రాష్ట్రిము లేర్పడిన అనంతరము ఆయా రాష్ట్రిములలోని ప్రధాన భాష రాష్ట్రి భాషగా గుర్తింపబడినది. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాష కీ విధముగా ప్రభుత్వ స్థాయిలో ప్రాధాన్యము కలిగి

నది. విద్యాశాఖకు చెందిన పాఠ్య ప్రణాళికలలో తెలుగునకు బోధనాభాషగా ప్రత్యేక స్థానము లభించినది. వివిధ శాస్త్రముల అధ్యయనమునకు పఠనపాఠనాదులకు, రాష్ట్రభాషలో ప్రామాణికములైన పాఠ్య గ్రంథములు, ఆధార గ్రంథములు, సామాన్య గ్రంథములు మున్నగువాని ఆవశ్యకత కలిగినది. అంతియే కాక పాఠ్య ప్రణాళిక విద్యా ప్రణాళికకు అనుగుణమైన భాషా స్థాయిని భాషా విధానమును గూర్చిన పరిశీలనము ఆచరణ విధానము మున్నగు సమస్యల పరిష్కరించుటకు ఒక యంత్రాంగము ఆవశ్యకతను ప్రభుత్వము గుర్తించినది. తత్ఫలితముగ 1968 లో రాష్ట్ర విద్యామంత్రి అధ్యక్షతన పాలక వర్గముతో నిర్వహింపబడు తెలుగు అకాడమీ స్థాపింపబడినది. వివిధ విభాగముల ఆధిపత్యమున పనిచేయు ఉపసంఘములు అకాడమీ కార్యభారమును వహించుచున్నవి. 1970 లో ఈ అకాడమీకి డైరెక్టరును నియమించినారు. నాటినుండి ఈ దశాబ్ది కాలమున తెలుగు అకాడమీ గణనీయమైన సేవ చేసిన దనుట కెట్టి సందేహము లేదు.

పాఠ్య గ్రంథములలో ఉపయోగింపదగు భాషను గూర్చి ఈ సంస్థ ఎన్నియో సదస్సులు నిర్వహించి, ఉప సంఘముల ద్వారా దానిని పరిష్కరించుటకు ప్రయత్నించినది. మాండలిక భాషను గూర్చి ప్రత్యేక విభాగ మేర్పరిచి క్షేత్ర కార్యకర్తలను నియోగించి సర్వే జరిపించి భాషా విశేషములను పదజాలములను సేకరించినది. వివిధ శాస్త్రములకు సంబంధించిన పారిభాషిక పదకోశ సూచికలను సిద్ధము చేసినది. ప్రసిద్ధ శాస్త్ర గ్రంథములను తెలుగులోనికి అనువదింపజేసి ప్రచురించినది. నిఘంటువులు, సాహిత్య పదకోశములు భాషాశాస్త్ర సాహిత్యాలంకార శాస్త్ర గ్రంథములు పాఠ్య గ్రంథములు శతాధికముగ ఈ సంస్థ పక్షమున వెలువడినవి. క్రమబద్ధమైన ప్రణాళిక ననుసరించి ప్రముఖ పండితుల ఆధ్వర్యమున విద్వాంసుల పర్యవేక్షణలో తెలుగు అకాడమీ చేయుచున్న కృషి, ప్రచురించుచున్న సాహిత్యము - గ్రంథ ప్రకటనములు మున్నగు వానిలో అధిక భాగము పరిశోధనాత్మకమని భావింపవచ్చును.

**తెలుగు ఉర్దు అకాడమీ :**

వివిధ శాస్త్ర, చరిత్ర, విజ్ఞానములకు సంబంధించిన పరిశోధనాత్మక గ్రంథముల ప్రచురణ కంకితమైన ఈ సంస్థ 1959 లో హైదరాబాదులో స్థాపింపబడినది. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు దీనికి మూలస్తంభముగా నిలిచిరి. హైదరాబాదు తెలుగు ఉర్దూ భాషలకు కూడలి అను అంశమును గ్రహించి ఈ సంస్థవారు తెలుగుతో పాటు ఉర్దూలో కూడ ఎన్నియో గ్రంథములను ప్రకటించిరి. మాతృభాషలో శాస్త్ర విజ్ఞానము నభ్యసించువారికి, పారిభాషిక పదములపై పరిశీలన మొనర్చువారికి ఈ గ్రంథములు పరిశోధనాత్మకముగ తోడ్పడుచున్నవి.

**సైన్సు అకాడమీ :**

శాస్త్ర వైజ్ఞానిక గ్రంథములను మాత్రమే వెలువరించుటకు 1963 లో అవతరించిన సంస్థ ఇది. వైజ్ఞానిక గ్రంథములతో పాటు వివిధ శాస్త్రములకు సంబంధించిన రచనల సూచిక ఈ సంస్థవారు ప్రకటించినారు. 1863-1965 వరకు తెలుగులో రచింపబడిన వైజ్ఞానిక గ్రంథముల అకారాది సూచికలు వివరణలు గల గ్రంథమిది. ఇవి పరిశోధనాత్మ కృషితో కూడిన రచనలు.

**పరిశోధన ప్రగతి సమీక్ష :**

వ్యక్తులు, సంస్థలు, గ్రంథమాలలు, అకాడమీలు తెలుగులో చేసిన పరిశోధన సంగ్రహ సమీక్ష ఇది. దాదాపు ఒక శతాబ్ది కాలము చరిత్రను పరిశీలించినపుడు పరిశోధన ప్రగతిని దాని విధానమును సంగ్రహముగ వివరించవచ్చును. విమర్శనములో ప్రాచీనాలంకార శాస్త్రముద్ర నేటికిని ప్రస్ఫుటముగ

నున్నను ప్రాచ్య విధానముతోపాటు పాశ్చాత్య రీతులలోను కొనసాగుచున్నది. ఈ ప్రగతిని తెలుగులోని సాహిత్య పరిశోధనకును అన్వయింపవచ్చును. తొలిదశలో పరిశోధనము రెండు స్థాయిలలో సాగినది. కొందరు కావ్యస్థ విషయమునకు అనగా పాఠ పరిష్కారము-అర్థనిర్ణయము-అంతరార్థము - రచనా విధానము-శైలి-ఛందోవ్యాకరణాలంకారాది విశేషములకు పరిమిత మొనర్చిరి. విమర్శనము కంటె ఒకటి రెండు మెట్లు దాటి ఈ అంశములలో నూత్న విశేషములను వివరించుటకు ప్రయత్నించిరి. కవి జన్మాదికములు- కాలనిర్ణయము - గ్రంథ రచనలు మొదలగు సాహిత్య చరిత్రలకు సంబంధించిన అంశములపై మరి కొందరు తమ దృష్టిని మరల్చిరి. అముద్రిత రచనలు, అజ్ఞాత రచనలు- ఆశ్వాసాది భాగములు, పద్యములు- పాఠాంతరములు మున్నగువానిని సంపాదించి అజ్ఞాత కవులను గూర్చి కొందరు ప్రత్యేకముగ కృషి చేసిరి. పాశ్చాత్యశాస్త్ర విధానము ప్రాచుర్యము పొందిన అనంతరము శాసన పరిశోధనమునందు నూత్న మార్గము నవలంబించుటకు భాషాశాస్త్రజ్ఞులు, చరిత్రకారులు పూనుకొనుట ప్రశంసింపదగినది. శాసన కాలము - శాసన విషయములతో తృప్తి నొందక భాషాశాస్త్రాంశములను ప్రత్యేకముగ పరిశీలించి తెలుగు భాషా వికాసమును శాస్త్ర పద్ధతులలో వివరించుటకు వీరు ప్రయత్నము చేయుచున్నారు. వివరణాత్మక పద్ధతితో పాటు చారిత్రక, తులనాత్మక రీతిలో ఈ పరిశోధనము కొనసాగుచున్నది. భాషాశాస్త్రములోని నూత్నరీతులు తెలుగు సాహిత్యములోని వివాదాస్పద విషయములను పరిష్కరించుటకు తోడ్పడుట కవకాశము కలుగుచున్నది.

పదప్రయోగరీతి, శైలీశాస్త్రము - గణాంక పద్ధతిని అనుసరించి అపరిష్కృత సమస్యలను శాస్త్ర పద్ధతులలో వివరించవచ్చును. ఆముక్తమాల్యద కర్తృత్వము- వేమన పద్యములు - చాటు పద్యముల కర్తృత్వము-కొన్ని గ్రంథముల కర్తృత్వము మొదలగు వానిని పరిశీలించి నిర్ణయించుట కీశాస్త్రము తోడ్పడవచ్చును. ఇటువంటి అధ్యయనము ఇటీవలనే ఆరంభమైనది. ఈ ప్రగతి మున్ముందు పరిశోధనలో నూత్నమార్గములను దర్శింపజేయవచ్చును. ప్రాచీన విధానముతో ఈ రీతి కూడ తెలుగు పరిశోధనకు వన్నెచిన్నెలు కూర్చవచ్చును. భాషాశాస్త్ర అధ్యయనముతో ఇది సుగమ మనుట కెట్టి సందేహము లేదు. పరిశోధనను శాస్త్రపద్ధతులలో కొనసాగించుటకు శిక్షణ తరగతులను ఆరంభించినచో ప్రాచీనాధునిక పద్ధతుల సమన్వయముతో పాటు నూత్నశాస్త్రరీతుల ననుసరించుటకును యువక పరిశోధకుల కవకాశము లభించును.

"Telugu can be looked upon as the northernmost member of the southern languages or southernmost member of the northern languages; and it has the advantages of both groups with few, if any, of the defects. It is adaptable, dynamic, absorptive, grammatically simple and euphonically exceptionlly beautiful even when using foreign words. It has never suffered from narrow proventialism."

—G. *Homefield Mc Leod*

❖ ❖ ❖

"Telugu is singularly melodious. It is the sweetest and most musical of all the Dravidian tongues and it sounds harmonious even on the lips of the most illiterate. It haf justly been called the Italian of the East and though Tamil may, perhapes, be a richer language and more wealthy in classical literature, Telugu confessedly bears the palm for its exquisite melody and grace."

—*Henry Morris.*

❖ ❖ ❖

"You cannot keep out foreign words as you keep out foreign manufactuerd goods. Perhaps Telugu aecepts them more easily than any other Indian language, and this will certainly help to make it a rival to Hindi in teaching Science, Medicine and Engineering."

—*J. B. S. Haldane.*

❖ ❖ ❖

# మూడవ భాగం

# ప్రక్రియాపరంగా జరిగిన పరిశోధన - ఒక అనుశీలన

# తెలుగులో పరిశోధన - పురాణములు

—మూలంపల్లి చంద్రశేఖరశర్మ

విశ్వసంస్కృతులలో వైదికసంస్కృతి యతి ప్రాచీన మైనది. భారతీయ సాహిత్యము దాని నాబాల గోపాల మఖిల మానవుల కందింపదలచినది. వారి నందులోనే యానందింపజేయబూనినది. పార్యంతిక ముగ విశ్వశ్రేయమును గూర్చుటకే నిరంతర కృషిని సాగించినది. అందు వైదికసాహిత్యము ప్రభుసమ్మితము, పురాణసాహిత్యము మిత్రసమ్మితము కావ్యసాహిత్యము కాంతాసమ్మితము అని సాహిత్యవేత్తలందరును సంభావించిరి. ఈ త్రిపుటియే భారతజాతి నంతటిని పురుషార్థ చతుష్టయైక లక్ష్యముగ నడిపించినది.

కాగా, వేదములు షడంగ సంబద్ధములై, శమదమాది షడ్గుణసంపన్నులైన విజ్ఞుల విచారములకే పరిమితములైనవి. అంతమాత్రమున వారి విచారధారా ఫలితములు వారికి మాత్రమే భోగ్యములు గాలేదు. కృషీవలుడు కష్టించి పండించిన పంటను తా ననుభవించుచునే యా కృషి నేమాత్ర మెరుగని తక్కిన మానవజాతి కంతకును అందించును. అట్లే పురాణములు వేదవిచారాచారములచే దెలిసికొన్న పురుషార్థ చతుష్టయసాధన మార్గములను సులభతరముగ జేసినవి. వాని నావేదవిచారాచారశ్రమ నేమాత్రము గలుగనీక తక్కిన మానవజాతికంతకు నందించి యనుభవింపజేసినవి. కావుననే భారత ప్రజాబాహుళ్యమున పురాణముల కున్నంతటి యాదరసత్కారములు వేదములకుగాని కావ్యములకుగాని లేవనుట సత్యము.

వేదములు కొందరికి పరిమితము లైనను పురాణము లపరిమితములు. అందరికి అందుబాటులో నుండునవి. కావుననే మొన్నమొన్నటివరకు ప్రతి గ్రామమున వేదవేత్తలైనవిజ్ఞులు తమ పురాణప్రవచనములచే ప్రజనంతటిని పురుషార్థచతుష్టయోన్ముఖము గావించిరి. ఈ విధమున ప్రజలందరికిని పాఠము లేకయే శ్రౌత మవగతమైనది. పురుషార్థచతుష్టయ మనుగతమైనది.

ఆ తరువాత కాలవశమున వచ్చిన కామచారాది సాంకర్యము అజ్ఞులనేకాక విజ్ఞులను సైతము ధర్మమోక్షములకు విముఖులనుగా జేయజొచ్చినది. ఖడ్గమును వదలక శత్రువుల సంహరించినప్పుడే సామ్రాజ్య విజయసౌఖ్యము లనుభోగ్యము లగును. అట్లే ధర్మఖడ్గమును వదలక అర్థకామముల యపమార్గముల నంతమొందించినపుడే మోక్ష సామ్రాజ్యసుఖము మానవుల కుపభోగ్య మగును. కావుననే ధర్మమును కాంతా సమ్మితోపదేశమున మానవులలో స్థిరీకరించి అపమార్గములలో నాకృష్టములగుచున్న యర్థకామములను సన్మార్గ సంసక్తములగ గావించి, నిరాతంకముగ మానవులను తీవ్రమోక్షార్థులగను తీవ్రమోక్షకాములగను జేసి, వారి నాకార్యరంగమున విజేతలుగా జేయుటకే భారతీయ కావ్యసుందరి యవతరించినది. ఈ కావ్యసుందరి శ్రవ్యరూపమున ప్రధానముగా విజ్ఞులను దృశ్యరూపమున నజ్ఞులను సైతము మరల సన్మార్గ స్థిరులనుగా జేసినది. ఇది భారతీయుల సాహిత్య సరణి.

పురాణ సాహిత్య మనాది యైనది. కావుననే వేదములందు గూడ స్మరింపబడినది. సృష్ట్యాది నుండి ప్రవర్తిల్లిన మానవ చరిత్ర లితిహాసములు గాను, అవి యతిప్రాచీనము లగుచున్న కొలది పురాణములుగాను ప్రవచింపబడుచు, ఎప్పటి కప్పుడు ఇప్పటి వరకును ఇక ముందునను జరుగు సమస్త విషయములను స్థల-భవిష్యపురాణాది రూపమున క్రోడీకరించినవి. కావుననే క్రీ. 3, 4 శతాబ్దముల వరకు 12000 ల శ్లోకాత్మకముగా ఆదిమహాపురాణముగా నున్న బ్రహ్మాండ పురాణము శైవవైష్ణవపరముగా వాయు విష్ణు పురాణములుగ విభాగ వృద్ధుల నందినది. అవి పునర్విభాగ వృద్ధులతో నష్టాదశ పురాణములుగను వాని యుప పురాణ రూపముననను ఊహాతీత వృద్ధి నందినవి. ఈ కారణముననే ఆదిపురాణ పంచలక్షణము దశలక్షణియై యనన్వితలక్షణి యైనది. పరిశీలింపగా సర్వాంధ్ర సంస్కృత పురాణానుగత లక్షణము ''పురాపి నవం భవతి'' అని యాస్కుడు చెప్పిన నిర్వచనమే యని తోచును. ప్రాచీన మగుచునే నవీన మగున దని దానియర్థము. పురా అను నవ్యయ మతీతానాగతార్థముల జెప్పు నని యమరసుధాకారుడు చెప్పినందున నిది భవిష్యత్పురాణమునకు గూడ సమన్వితమగును. ప్రాచీన చరిత్రల కెప్పటి కప్పుడు వర్తమాన చరిత్రలు గూడ జేర్పబడుచుండుటచే నీ పురాణములన్నియు ప్రాచీన మగుచునే నవీనమైనవి. మహామహోపాధ్యాయ బలదేవోపాధ్యాయ గారు గూడ నీయర్థమునే సమర్థించిరి.

పురాణాభివృద్ధికి కారణములైన శైవవైష్ణవములు వైదికేతరములు గావు. కాని, రాగాదులవలన వైదికేతరముల (జైన బౌద్ధముల) మొ. లోనికి బోవు వారిని మరల్చుటకు తాముగూడ కొంత వైదికమునకు వి. ఇట్టివే వీరశైవ వీరవైష్ణవ వామశాక్తాది నాస్తిక మతముల బారినుండి మానవుల ఆస్తిక వైదిక సంస్కృతి నాకర్షణీయముగ జేయుటకును అవలంబించిన మార్గములే యీ శైవాదిమతములు. ఇది సాత్త్విక - రాజస - తామస దశలతో తమ పనిని నిర్వర్తించుచుండినవి. మున్యాశ్రమములు సాత్త్విక దశకు కేంద్రములు. కాగా, రాజులు రాజసదశాకేంద్రములైరి. ఇక మిగిలిన తామసదశకు కేంద్రములు మానవులలోని కొన్ని గణములు. వీనిలో పరిపాలకుల వైశిష్ట్యమును బట్టి ప్రతివారును సాత్త్విక స్థితికి జేరు నవకాశముండును. కాని, తామసదశలో మత మెంత సులభగ్రాహ్యమో సుదృఢమో అంత చంచలము. ఎంత మోక్షదాయకమో యంత నరకప్రదము. ఈ తామసదశ మాహాత్మ్యమునకు మాత్రమే లొంగునది. రాజసదశ సాత్త్వికమునకు కొంత తరుగై తామసమునకు కొంత మెరుగైనది. కొంత సువిచారశక్తియు కొంత మూఢతయు వీరియందుండును. కావుననే రాజవ్యాప్తమైన మతము వేగముగ రాజ్యవ్యాప్తమై యొక్కొక్కప్పు డాచార్యవ్యాప్తముగూడ నగును. కావుననే సాత్త్వికమునియైన యాచార్యుడు సువిచారమున సన్మతమును రాజవ్యాప్తము గావించి సర్వవ్యాప్తికి సాధనములజూపును. రాజు ఆ సాధనములతో దానిని రాజ్యవ్యాప్తము గావించును. 'రాజానుమతో హి ధర్మః' అనికదా న్యాయము !

వైదికేతర మతముల నరికట్టుటకు సంస్కృత పురాణము లవతరించినట్లే జైనబౌద్ధముల నరికట్టుటకు తెలుగుసాహిత్యము ఇతిహాస- పురాణ- ప్రబంధరూపముల త్రివేణియై యాంధ్రదేశమున నవతరించి జాతి నంతయు పునీతము గావించినది. మన తెలుగుకవులీయితిహాస-పురాణ-ప్రబంధ ప్రక్రియలను రెండు మార్గములో నడిపించిరి. 1. అనువాదమార్గము, 2. స్వతంత్రమార్గము. ఈ రెండును దేశి-మార్గములను భేదములచే నాలుగు విధముల నడచినవి.

తెలుగున వెలసిన పురాణముల విషయమున జరిగిన పరిశోధనల పరిశీలనమునకు ముందు తె
పురాణములు వర్ణక్రమమున నీ క్రింది పట్టికలో నుట్టకింపబడుచున్నవి.

| సం. | తెలుగులోని పురాణము పేరు | చంపూ పద్ధతిలో రచించినవారు (పద్యములు) | ద్విపదలో రచించినవారు | వచ రచిం |
|---|---|---|---|---|
| 1. | ఆంధ్ర పురాణము | మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి | — | – |
| 2. | కన్యకాపురాణము | భాస్కరుడు | | |
| 3. | కల్కిపురాణము | చిల్కపాటి రామానుజశర్మ | | |
| 4. | కూర్మపురాణము | రాజలింగకవి (వ్రా. ప్ర.) | | |
| | | మండ కామేశ్వరకవి | | |
| | | ములుగు చంద్రమౌళిశాస్త్రి. | | |
| 5. | గరుడపురాణము | పింగళి సూరన (అలభ్యం) | | |
| | | వరదరాజకవి. | | |
| 6. | దేవాంగపురాణము | | భద్రకవి లింగకవి వీరన్న | |
| 7. | నారదీయపురాణము | పి. పిన వీరన (అలభ్యం) | | |
| | | వాసిరాజు రామయ్య ( ,, ) | | |
| | | కొత్తలంక మృత్యుంజయకవి( ,, ) | | |
| | | నల్లాడ నరసింహకవి (తా. ప్ర.) | | |
| 8. | నృసింహపురాణము | ఎఱ్ఱన (పూర్వభాగము) | | |
| | | హరిభట్టు (ఉత్తరభాగము). | | |
| 9. | పద్మపురాణము | కమలనాభామాత్యుడు | | |
| | ,, ఉత్తరఖండము | మడికి సింగన | | |
| | ,, | కామినేని మల్లారెడ్డి | | |
| | ,, మాఘమాహాత్మ్యము | పీసపాటి సుబ్బరాయకవి | | |
| | ,, ,, | పి. పిన వీరన (అలభ్యం) | | |
| | ,, ,, | వేదం శేషాచలకవి | | |
| | ,, పాతాళఖండము | త్రిపురాన వేంకట | | |
| | రామాశ్వమేధము | సూర్యప్రసాదరాయకవి | | |
| | ,, (సంపూర్ణము) | పిసుపాటి చిదంబరశాస్త్రి | | |
| 10. | పర్వతపురాణము | పోలమరాజు, శేషనాథుడు | | |

| | | | | |
|---|---|---|---|---|
| 11. | బసవపురాణము | పిడపర్తి సోమన | పాల్కురికి సోమన | |
| 12. | బృహన్నారదీయము | వాసిరాజు రామయ్య | | |
| 13. | బ్రహ్మపురాణము | జనమంచి శేషాద్రిశర్మ | | నడకుదుటి<br>వీరరాజుపంతులు |
| 14. | బ్రహ్మాండపురాణము | జనమంచి శేషాద్రిశర్మ | | |
| 15. | భవిష్యపురాణము | మల్లాది సూర్యనారాయణశాస్త్రి | | బ్రహ్మపర్వ వచ<br>నానువాదము<br>అజ్ఞాతకవి |
| 16. | భాగవతపురాణము | పోతన 1,2,3,4,7,8,9,10 స్కం. | ఏకుమళ్ల | కొక్కిరేణి నర |
| | | గంగన 5 స్కం. | రంగశాయి(వ్రా.ప్ర) | సింహకవి 11స్కం |
| | | సింగన 6 స్కం. | మడికి సింగన 10 | కుందుర్తి వేంకటా |
| | | నారయ 11, 12 స్కం. | స్కం. | చలకవి (అలభ్యం) |
| | | మడికి సింగన 10 స్కం. (వ్రా.ప్ర.) | తరికొండ వేంక | శతఘంటం |
| | | హరిభట్టు 6, 11, 12 స్కం. | మాంబ 1 నుండి | వేంకట రంగశాస్త్రి |
| | | శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి | 12 స్కం. | నోరి గురులింగ |
| | | జనమంచి శేషాద్రిశర్మ 10 స్కం. | రత్నాకరము | శాస్త్రి |
| | | మిన్నికంటి గురునాధశర్మ 11,12 స్కం. | గోపాలకృష్ణకవి | విష్ణుపాదకవి |
| | | కోపూరి పట్టాభిరామయ్య 11 స్కం. | 10 స్కం. | ద్రోణమరాజు |
| | | సంజీవరాయకవి 11 స్కం. | చెన్నయ్య | వేంకటాచలపతి |
| | | సంపన్ముడుంబ సింగారాచార్యులు | 10 స్కం. | శర్మ |
| | | 1,2,5,7,8,9,10,11,12 స్కం. | | |
| | | నంది మల్లయ్య ఘంట సింగయ్యలు | | మంజువాణి |
| | | 6 స్కం. (అలభ్యం) | | |
| | | సర్వన్న 6 స్కం. | | |
| | | జంటకవులు గంధం శ్రీరామమూర్తి | | |
| | | ఇట్టికంటి నరసింహమూర్తి | | |
| | | (సంపూర్ణము) | | |
| 17. | మత్స్యపురాణము | హరిభట్టు | | |
| | | లింగమగుంట తిమ్మకవి | | |
| | | రామకవి | | |
| | | కణాదము పెద్దన్న | | |
| | | మండ కామేశ్వరకవి | | |
| 18. | మరి బసవపురాణము | — | బచ్చు సిద్ధకవి | |

| | | | | |
|---|---|---|---|---|
| 19. | మార్కండేయపురాణము | మారన<br>ఔబళకవి<br>మండ కామేశ్వరకవి | నృసింహకవి<br>గుజ్జల గురవప్ప<br>పర్వతమంత్రి లింగన | లక్ష్మణార్య<br>నోరిగురులింగశాస్త్రి<br>వేమూరి జగన్నాథ శర్మ |
| 20. | లింగపురాణము | తెనాలి రామలింగకవి (అలభ్యం)<br>ములుగు చంద్రమౌళిశాస్త్రి | | |
| 21. | వామనపురాణము | ఎలకూచి బాలసరస్వతి<br>లింగమగుంట రామకవి<br>ఔబళకవి (వ్రా. ప్ర.)<br>రామావఝుల కొండయ్యశాస్త్రి. | | |
| 22. | వాయుపురాణము (మాఘమాహాత్మ్యము) | పెద్దయమంత్రి | | |
| 23. | వరాహపురాణము (వ్రతదానధర్మభాగము) | నందిమల్లయ్య, ఘంట సింగయ్యలు | | కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు |
| | ,, (అవతారభాగము) | హరిభట్టు | | |
| 24. | విశ్వకర్మపురాణము | వీపూరి వేంకటాచార్యస్వామి | ద్విపదమూల స్తంభము యాగంటీశ్వరున కంకితము. | |
| 25. | విష్ణుపురాణము | పశుపతినాగనాథుడు (అలభ్యం)<br>వెన్నెలకంటి సూరన<br>కలిదిండి భావనారాయణ<br>దిట్టకవి వేంకటామాత్యుడు<br>ముదుమురాయ దీక్షితులు | చక్రపురి రాఘవాచారి | తుపాకుల అనంత భూపతి<br>సీతారామ సిద్ధాంతి |
| 26. | శివపురాణము | ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి | | నడకుదుటి వీరరాజు పంతులు. |
| 27. | స్కాందపురాణము | నల్లారెడ్డి (అలభ్యం) | — | కుందుర్తి వేంకటాచలకవి |
| | ,, గోదావరీఖండము (భీమేశ్వరపురాణము) | శ్రీనాథుడు | — | |
| | ,, కాశీఖండము | శ్రీనాథుడు | — | నంజరాజు |
| | ,, కేదారఖండము | పెదపాటి సోమయ్య<br>జనమంచి శేషాద్రిశర్మ. | | |
| | ,, కుమారికాఖండము | జనమంచి శేషాద్రిశర్మ | | |

| | | | | |
|---|---|---|---|---|
| | స్కాంధపురాణము | | | |
| | ,, అరుణాచలఖండము | పెదపాటి సోమయ్య | | |
| | (అరుణాచలపురాణము) | | | |
| | ,, నాగరఖండము | తురగా రాజకవి | | |
| | | అయ్యంకి బాలసరస్వతి | | |
| | | జనపతి పట్టాభిరామశాస్త్రి. | | |
| | ,, బ్రహ్మోత్తరఖండము | లింగనారాధ్య | యాదాటి | |
| | | పోచిరాజు వీరయకవి | వేంకట | |
| | | శ్రీధరమల్లె వెంకటస్వామి | నారాయణ | |
| | | ముత్తురాజు వేంకటకృష్ణకవి | దిడుపాటి బసవన్న | |
| | | పాతకోట మల్లయకవి | | |
| | | మటమట సోమనాథబాలయాజి. | | |
| | ,, శివరహస్యఖండము | కోడూరి వేంకటాచలకవి | | |
| | | వంకాయలపాటి వీరభద్రకవి | | |
| | | రేవూరి అనంతయాజి | | |
| | | ములుగు అయ్యవార్లు. | | |
| | ,, ధర్మఖండము | ఈదురుమల్లె భవానీకవి | | |
| | ,, శ్రీశైలఖండము | శేషనారాధ్య (శ్రీపర్వతపురాణము) | | |
| | | అత్తలూరి పాపకవి (వ్రా. ప్ర.) | | |
| | ,, సేతుఖండము | పాపయామాత్య | | |
| | | దామెర్ల వేంకటరాయకవి | | |
| | ,, మహేశ్వరఖండము | ... | ... | కల్లూరి వేంకట |
| | ,, ప్రభాసఖండము | చాగంటి భాస్కరలింగశాస్త్రి | | సుబ్రహ్మణ్య |
| | ,, సూతసంహిత | పటమట సోమనాథసోమయాజి | | దీక్షితులు |
| | ,, శంకరసంహిత | శివరాజరామలింగకవి | | నంజరాజు |
| | | మల్లంపల్లి బుచ్చికవి | | |
| | ,, శ్రీకృష్ణఖండము | గోపీనాథము వేంకటకవి | | |
| 28. | అష్టాదశపురాణములు | — | — | కల్లూరి వేంకట |
| | | | | సుబ్రహ్మణ్య |
| | | | | దీక్షితులు |
| | | | | ఓలేటి వేంకట |
| | | | | లక్ష్మీనరసింహశర్మ |

**గమనిక** :— పై పట్టికను జూడ తెలుగు కవుల యాదరణలో భాగవతస్కాందములు (సమముగా 34 కవులు), ప్రథమ స్థానమును, మార్కండేయపాద్మములు (సమముగా 9 కవులు) ద్వితీయ స్థానమును, విష్ణుపురాణము (8 కవులు), మాత్స్యమును (5 కవులు) తృతీయ-చతుర్థ స్థానముల నాక్రమించినవని తెలియును.

పురాణపరిశోధనము తక్కిన పరిశోధనము లన్నింటికన్నను క్లిష్టతరమైనది. అది నటుని యభినయము వంటిది. రామాదిపాత్రల నభినయించు నటుని నటనము రామాదుల స్వభావమును తన స్వభావమును లోకస్వభావమును సముచిత సంభావనతో మేళవించిన విశిష్ట నటనాకౌశలమున సామాజికుల సత్త్వము నానందోన్ముఖము గావించును. అట్లే తెలుగు పురాణకర్త సంస్కృత పురాణమును తత్కర్తను భావించి కవికాలీన సమాజమునే కాక తాను తనకృతిచే నిర్మింప దలచిన భవిష్యత్సమాజమునుగూడ భావించి తన పురాణరచన సాగించును. కావున పురాణపరిశోధనము సంస్కృతాంధ్రోభయ పురాణ పరిశోధనము గాక తప్పదు. తెలుగువారు తమ పురాణముల నెక్కువగా చంపూపద్ధతిలో వ్రాసిరి. కావున పద్యముగా గద్యముగా నాటకముగా తన రసవస్తువైచిత్రి నెంత చమత్కారముగ నాపురాణము చూపినదో పరిశీలించి చూపవలసియుండును. వేయేల, విశ్వశ్రేయోదాయకముగా కవి సృష్టించిన రసమయ జగమును సర్వాంగీణముగ సందర్శింపజేయవలసి యుండును. ఇది యనువాద సాహిత్యమంతటికిని వర్తించునదే అయినను నీతి ధర్మవేదాంతతత్త్వములు ప్రధానముగా నాలోకింపబడవలసి యుండుటచే తెలుగు పురాణసాహిత్య పరిశోధనము అసిధారావ్రతము.

తెలుగున పురాణసాహిత్య పరిశోధనము సాగిన తీరు లనేకములు. అవి ప్రధానముగ స్వతంత్రములు, విశ్వవిద్యాలయాద్యధీనములు-అని రెండు విధములు. స్వతంత్ర పరిశోధనము - వ్యాసరూపము, గ్రంథరూపము, ప్రవచనరూపము, ఉత్సవసంచికాదిరూపము లలో సామూహిక రూపమును మొ. రెండవది వైయక్తిక సిద్ధాంత వ్యాసరూపము చర్చా వేదికా రూపము (సెమినార్లు). సామూహిక ప్రణాళికా కార్య (ప్రాజెక్టు వర్క్స్)రూపమును మొ. వీనిలో కొన్నింటిని యథాలాభముగ బరిశీలింతము.

సామాన్యముగా నిపు డాంధ్రదేశమున జరిగిన పురాణ సాహిత్య పరిశోధనములు 1. కవి- 2. కవి కృతి- 3. కవి కృత్యంశము- 4. సాహిత్యరీతులు- అను మొ. వానిని ప్రధానముగా జేసికొని జరుపబడినట్లు కనబడును. 1. పోతన : వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, 2. ఆంధ్ర భాగవత విమర్శ : పి. వి. ఎల్. వి. ప్రసాదరావు, పోతన అతని కృతులు: వి. రాజేశ్వరి, 3. మహాభాగవతోపాఖ్యానములు: కె. సామ్రాజ్యలక్ష్మి, 4. పాల్కురికి సోమన రచనల్లోని భాషా ప్రయోగ విశేషాలు: రాజుల వేంకట సుబ్బయ్య, ఆంధ్ర సాహిత్యంలో దేశి కవిత్వం : శ్రీ తిమ్మావఝల కోదండరామయ్య గారు క్రమముగా నుదాహరణములు.

కేవల పురాణకృతిపైననే జరిగిన పరిశోధనలలో ఆంధ్రపురాణము, భాగవతము, మార్కండేయ పురాణము, వరాహపురాణము, విష్ణుపురాణము మొదలగునవి గలవు. కవికృతుల పరిశీలనమున జరిపిన పురాణకృతి పరిశోధనలలో గరుడ పురాణము, బసవ పురాణము, నృసింహ పురాణము, పద్మపురాణము, భీమేశ్వర పురాణము, కాశీఖండము మొదలగునవి కలవు. లింగవాయు పురాణములు, విశ్వకర్మ దేవాంగాది పురాణములు వ్యాసములలో పరిశోధింపబడినవి.

**ఆంధ్రపురాణము : కర్త : మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు**

డా.బి. నాగిరెడ్డిగారు, డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలో "ఆంధ్ర పురాణము - సమగ్ర పరిశీలనము"— అను విషయముపై పరిశోధనము సలిపి ఎమ్. ఫిల్. పట్టము సందిరి (1982). దీనిలో 1. కవి పరిచయము, 2. పురాణేతిహాసములు, 3. చారిత్రక కావ్యము, 4. నామౌచిత్యము, 5. ఇతి వృత్తము, 6. కవితా సౌందర్యము—అను నంశములతో ఛందోలంకార రసధ్వని భాషా పదబంధ లోకోక్తులు, పురాణ సంస్కృతి, జాతీయ భావన, ఆత్మీ

యత మొదలగునవి చక్కగా పరిశీలింపబడినవి. ఇది నవీన పురాణము, పంచలక్షణికి గాని దశలక్షణికిగాని పూర్తిగా లొంగనిది. ఇది గడచిన ప్రముఖాంధ్ర చారిత్రక పురుషులయు చక్రవర్తులయు చిరపరిచిత వృత్తకథనముగా నితిహాస పురాణమై ప్రఖ్యాతేతివృత్తక కావ్య మగునట్లుగా వ్రాయబడినది. ఇది సాతవాహనాదుల చరిత్రలతో ప్రాచీనమై నాయక రాజుల చరిత్రతో నవీనమై స్వతంత్రమైన పురాణము. పురాణకర్తలు సజీవులై యున్నందున అచ్చటచ్చట పరిశోధనలో సహాయసమ్మతుల బడయుట విశేషము. 18 పర్వముల భారత మాత్యంతిక దుఃఖభూయిష్ఠము. ఆంధ్ర పురాణ మట్లుగాక నవపర్వరస్యమై సుఖాంతమైనది. 1. ఉదయ, 2. సాతవాహన, 3. చాళుక్య, 4. కాకతీయ, 5 పునః ప్రతిష్ఠా, 6. విద్యానగర, 7. శ్రీకృష్ణదేవరాయ, 8. విజయ, 9. నాయకరాజ పర్వములు మొత్తము 9. ఇందు చక్రవర్తుల చరిత్రలనే స్వీకరించితి నని పురాణకర్తయే చెప్పెనట. కాబట్టి పర్వవిభాగమున భారత సామ్యమును చక్రవర్తుల చరిత్రవర్ణనమున పురాణసామ్యమును ఆయాసన్నివేశముల రసోత్తరముగ వర్ణించుటచే ప్రబంధసామ్యమును ప్రతిపాదింపబడినవి. చతుర్విధపురుషార్థముల మిత్రసమ్మితముగ బోధించుచు, విశ్వశ్రేయ దృక్పథమును విశ్వజనీనముగ గలిగించుచు, భిన్న భిన్న మానసిక ప్రవృత్తుల కాలవాలమైన లోకమున ధర్మచైతన్యము పలక్షించి రూపొందిన విశిష్ట సాహిత్యప్రక్రియలు పురాణేతిహాసములు. పురాణేతిహాసములు కాలక్రమమున లోకదృష్టితో లోకశ్రేయమునకై విజ్ఞాన సర్వస్వములైనవి- అని పురాణ స్వరూప స్వభావములు పరిశీలింపబడినవి. శాస్త్రిగారితో సంభాషణ మన్న భాగము పరిశోధిత విషయములకు ప్రత్యక్ష (ర) సత్యమును గూర్చినది. జీవత్కవికావ్యపరిశోధనలో [illegible] ముండుట సహజము. కన్నడమున కావ్య [illegible]గాణపర్యాయ మగుట దీనిని కవిగారు పురాణ మన్నట్లు చెప్పబడినది. మొత్తముపైన పరిశోధనము సమగ్రము, సహేతుకము, సరసమును.

**శ్రీమద్భాగవతము - కర్తలు - పోతన, తదితరులు**

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు ''పోతన కృత శ్రీమద్భాగవతానుశీలనము'' అను విషయమున పరిశోధన సలిపి పిహెచ్.డి. పట్టము నందిరి. (1969).ఇది పరినిష్ఠిత పాండిత్యప్రపూర్ణమైన పరిశోధనము. ఇందు 5 ప్రకరణములు. 'పోతన'లో పోతన నివాస - కాల - గ్రంథ - గ్రంథపాత-మత-ఉత్తర జీవితములు పరిశీలితములు. 2 ''భాగవతము''-లో పోతన యనువాద ప్రణాళిక-శ్రీధరీయానుసరణము-సాహిత్యాధ్యాత్మికాపార్థీకరణలు-అననూదిత శ్లోకభాగములు- స్వతంత్ర విస్తరణములు సంశోధితములు. 3. ''పోతనార్యుని కవితా వైభవము''లో అనువాద-కథా శిల్పములు - భావుకతా-వర్ణన-శబ్దాలంకార-దేశిలక్షణ-పాత్రచిత్రణ-రసపోషణ-పూర్వకావ్యానుసరణములు విమర్శింపబడినవి. 4. 'పోతనగారి లాక్షణికత'లో భాషాఛందః ప్రయోగములు చర్చింపబడినవి. 5. 'భాగవత తత్త్వము'-లో సాత్వతమత - భక్తియోగ - భక్తిరసములు సువ్యక్తము జేయబడినవి. తెలంగాణీయ పదముల ప్రయోగించియుండుటను వెలిగందల నారయాదుల గ్రామములు పరిసరములలోనే యున్నందునను వరంగల్లు సమీపమునందలి బమ్మెరయే పోతననివాస మని సిద్ధాంతింపబడినది. పోతన తన వివరణాత్మక విస్తరానువాదమున శ్రీధరీయముల క్రోడీకరణములు సోదాహరణముగ జూపబడినవి. అనువాదములోని యపార్థీకరణములను సూక్ష్మేక్షణికతో పరిశోధించి యవి పోతనవిగాక నారయాదుల వై యుండునని చక్కగా సమర్థింపబడినది. పోతన భాగవతము సంస్కృతి భాగవత సర్వస్వము. పోతన శ్రీధరీయాద్వైతమును నారయ చంద్రికాకారుని విశిష్టాద్వైతమును అనుసరించి యనువదించినట్లు సప్రమాణముగ నిరూపింపబడినది.

పోతనగారు స్మార్తశైవు లని యుక్తియుక్తముగ ప్రతిపాదింపబడినది. ఉపమాశక్తితో గజేంద్రమోక్ష కథను శబ్దశక్తితో వామన చరిత్రమును చిత్రించిన కథాశిల్పము కన్నులగట్టునట్లు చూపబడినది. ప్రహ్లాద చరితము భాగవతాసుర లక్షణ సంఘర్షమున నుద్భవించిన కథగా ప్రతిపాదింపబడినది. రుక్మిణీ పరిణయము పోతన రమణీయ శిల్పకల్ప కథా మణిహార హీరముగా పరిష్కరింపబడినది. పోతనగారి లాక్షణికతయు తాత్త్వికతయు శాస్త్రీయముగను దార్శనికముగను పరిశీలించి సిద్ధాంతింపబడినవి. పోతనకు రామస్వప్న సాక్షాత్కారము భాగవతసర్వస్వమైన యాంధ్ర భాగవతావిష్కారము గావించినట్లే శ్రీ శ్రీరామమూర్తిగారికిని పోతన మహాకవి స్వప్నసాక్షాత్కారము ఆంధ్ర భాగవతానుశీలనతత్త్వము నంతయు యథార్థముగ నావిష్కరింప జేసినట్లు వారి పరిశోధనము గనబడును.

డా॥ కె. సామ్రాజ్యలక్ష్మిగారు "మహాభాగవతోపాఖ్యానములు" అను విషయమున పరిశోధనము గావించి పిహెచ్. డి. పట్టము నందిరి (1979). ఇది కృత్యంశ పరిశోధనము. 1. పురాణములు, 2. సంస్కృత భాగవతము, 3. పోతన, 4. భాగవతోపాఖ్యానములు, 5. భక్తి, 6. భక్తి ప్రధానోపాఖ్యానములు, 7. సంకీర్ణాత్మకోపాఖ్యానములు, 8. స్తుతులు, 9. సంవాదాత్మకోపాఖ్యానములు, 10. భాగవత కథలు, 11. ఆంధ్ర భాగవతము, సాంఘిక విశేషములు, 12. ద్వాదశ స్కంధముల భాగవతసారము-అనునది వారి పరిశోధనలో ప్రకరణ విభాగము. గుణత్రయమునుబట్టియు, మూర్తిత్రయమును బట్టియు, ప్రతిపాద్య విషయముల బట్టియు పురాణముల వర్గీకరణము చూపబడినది. యజ్ఞయాగాది సందర్భములందు క్రతువిధి వివరణార్థమో తద్యజమాని గుణగణకీర్తనార్థమో కథ లవసరము లనియు, అవి కట్టుకథలుగను నీతికథలుగను సాహిత్యమున పర్యాప్తములైనవనియు, ధ్యేయ ముపదేశమై సాంఘికాధ్యాత్మికతలు లక్ష్యములైనవనియు, సాహిత్యమంతయు ఆఖ్యాన-ఉపాఖ్యాన-ఆఖ్యాయిక-ఇతిహాస-చరిత్రాది పదములతో వ్యవహరింపబడుచు గోచరించు ననియు, అవి భాగవతమున తత్త్వ-భక్తి-నానాధర్మ-స్తోత్ర-సంవాదరూపముల నున్నవనియు పురాణమును గూర్చి తెలిపిరి. భక్తిని నారదసూత్రానుసారిణిగా, సాంఖ్యానుసారిణిగను గుణత్రయానుసారిణిగను జూపి దాని రసీభావమును గూడ స్థాపించిరి.

డా॥ కె. కుసుమాబాయిగారు గూడ తమ "మడికి సింగన కృతుల పరిశీలనము"న మడికి సింగన భాగవత దశమ స్కంధమును ప్రసక్తముగా పరిశీలించిరి. మడికి సింగన కృతి కాండాత్మకముగ ద్విపదలో నుండుట విశేషము, ఇది మధురాకాండతో ప్రారంభమైనది. శైవావేశముతో ప్రజాకవితగా సోమనచే ద్విపద యవతరించినది. రంగనాథునిచే కావ్యస్రవంతి యైనది. మడికి సింగనచే మధురారసపదమైనది. కృష్ణుని సర్వాంతర్యామిగా జేసికొని పోతన కనుకార్యమైనది. ఈ విధముగా ప్రసక్తమైనను పరిశోధనము సంసక్తముగ సాగినది. ఇందు మిక్కిలి ప్రశంసనీయ విషయము - భావిపరిశోధకుల కుపయోగపడునట్లు పాఠభేద పట్టిక నొసంగుట.

ఆచార్య నిడుదవోలు వేంకటరావుగారు 'పోతన' అను పేర 1962లో ఒక గ్రంథమునే ప్రకటించిరి. అది "కావ్య విమర్శనాత్మక కవి జీవితము" అను సూత్రము ననుసరించి రచింపబడినది. ఇది నేషనల్ బుక్ ట్రస్టువారి ప్రచురణము. భారతీయ భాషలలో ముఖ్యమైన తొమ్మిది భాషలలో ప్రకటితమై పోతన సర్వస్వము తద్భాషీయుల కవగతమగునట్లు రచింపబడిన యుత్తమ గ్రంథము.

సంస్కృత భాగవతము భారతదేశమంతయు వ్యాపించినట్లే పోతన భాగవత మాంధ్రదేశమంతయు వ్యాపించినది. భారత రామాయణాదులు పోతన

భాగవతమువలె నాంధ్రుల హృదయవచశ్శరీరముల ప్రతిధ్వనింపలేదు. కృష్ణ-రామ వస్తుభేద మున్నను పోతన - తులసీదాసుల భక్తి సమానము. వల్లభ సంప్రదాయమున సగుణభక్తిపై రక్తియే ముక్తిగా భావింపబడును. కాని, పోతనది యద్వైత భక్తి. భాగవతము రామకృష్ణాద్వైతమును గూడ జూపినది. పోతన వీరభద్ర విజయము వాయు పురాణము ననుసరించినది. పోతన బుద్ధిపూర్వకముగనే 1-2-3-4 స్కంధముల రచించుచు గంగనకు '5' వ స్కంధమును, సింగనకు '6' స్కంధమును ఇచ్చి రసప్రధానములగు 7-8-9-10 స్కంధములను తానే రచించి కాలధర్మము నందుటచే నారయ తన పూర్వకవుల శ్రీధరీయానుసరణమును వదలి చంద్రికాకార విశిష్టాద్వైతము ననుసరించి 11 - 12 స్కంధముల వ్రాసెను. కాని శిథిలపూరణమును గాని గ్రంథపాత పూరణమును గాని పోతనేతర కవులు చేయలేదు. ఆంధ్ర భాషా మహోద్గ్రంథములలో భారతమును ముగ్వురు, భాగవతమును నలుగురు, రామాయణము నైదుగురు ననువదించిరి. ఆంధ్రుల పురాణానువాదము ఆయాకవుల కభిమానము లైన ఖండముల యనువాదములుగనే యున్నవి. పోతన యనువాదము భాగవత తత్త్వవ్యాఖ్యాతల్లీన మైనది. కావుననే సుశ్రావ్యసులభ శబ్దార్థ గద్యపద్య రచనా లాలిత్యమునకును సముచిత కథాసారస్వమునకును తావలమైనది. శ్రీనాథుని వాఙ్మయమువలె వీరశైవకథాలంకృతమై పౌరాణిక వీరశైవ సంప్రదాయమున నడచినది. పోతని వాఙ్మయమున వీరభద్ర విజయము పౌరాణిక వీరశైవమునకు మొదటిది. ఛందోలంకార రసభావనాసుసంపన్న కవితలో పూర్వకవుల ననుకరించియు పోతన తరువాతి వారి కన్న కవితా రీతులలో సాదర్శమయ్యెను.—— ఇవి వారి సునిశిత సమగ్ర పరిశీలనలో కొన్ని విశేషాంశములు. విశేష మేమన, నీ గ్రంథమున పోతన-భాగవతముల గూర్చిన వ్యాసవిమర్శాది గ్రంథములన్నియు నుట్టంకింపబడినవి. దీనిని పోతనకు సంబంధించిన యొక విజ్ఞాన సర్వస్వ మనవచ్చును.

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు భాగవత పాఠ పరిశోధన మను నొక గ్రంథమును వ్రాసిరి. సాహిత్య అకాడమీ వారి ప్రతిలో తాళపత్ర ప్రతుల ననుసరించిన పాఠములపై వచ్చిన యాక్షేపములకు శివకవుల దేశి-మార్గానుసారి కవితా వైలక్షణ్యమును సమాధానముగా జూపిన సద్గ్రంథ మిది.

శిష్ట్లా లక్ష్మీకాంత శాస్త్రిగారు పోతన భాగవత రచన అను విషయమున నొక గ్రంథమును వ్రాసిరి. దానిలో వారు పోతన కవితా రచనను అది క్రోడీకరించిన రసభావభక్త్యాదులను 1-7-8-9-10 స్కంధముల దీసికొని హృద్యముగ బరిశీలించిరి. ఇది యొక చారిత్రక నవల చదువుచున్నట్లు రమ్యముగా నున్నది.

పోతన - భాగవతముల విషయమున ననేకులు విమర్శక వ్యాసములు వ్రాసిరి. బమ్మెర పోతరాజు-వీరేశలింగం పంతులుగారు, ఆంధ్ర భాగవత కర్తృత్వము- కొత్తపల్లి సూర్యారావుగారు, మహాకవి పోతన-కల్లూరి వేంకట నారాయణరావుగారు, భాగవత ప్రాశస్త్యము- సెట్టి లక్ష్మీనరసయ్య, భాగవతము-ముక్త్యాల సరస్వతి, పోతన భాగవతము- నిడుదవోలు వెంకటరావుగారు, పోతన - దేవరాజు వెంకట సత్యనారాయణ మూర్తి, ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు- మల్లంపల్లి సోమశేఖర శర్మ (చరిత్ర కాలములు), కురుగంటి సీతారామయ్య (అనువాద విధానము) పుట్టపర్తి నారాయణాచార్యులు (కవిత), పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు (రాజవంశములు), స్వామి శివశంకరశాస్త్రి (ఉపాఖ్యానతత్త్వము), వేదాల తిరువేంగళాచార్యులు (వాసుదేవ అవతార తత్త్వములు), దివాకర్ల వేంకటావధానిగారు (వస్తు విధానము-గోపికా మధురభక్తి). తిమ్మావఝుల కోదండరామయ్యగారు (ప్రేమతత్త్వము).

ఆంధ్ర సారస్వత పరిషత్తువారు పై పండితులను బిలిపించి మహాసభాముఖమున పై విషయములపై ఉపన్యాసము లిప్పించి దానిని గ్రంథస్థము జేసిరి.

గత సంవత్సరమున వరంగల్లులో పోతన భాగవత పంచ శత జయంతి మహోత్సవములు జరిగినవి. ఆ సందర్భమున పోతన భాగవత పంచశతి మహోత్సవ సంస్మారికగా శ్రీ తిరుమల దేవస్థానమునారు "పోతన భాగవత నీరాజనము" అను పేర 41 వ్యాసముల సంపుటమును ప్రకటించిరి. భాష-సాహిత్యము—కవిత-తత్త్వము-తంత్రము-భక్తి నీతి-పూర్వోత్తర కవి సాదృశ్యము - రసభావాలంకారచ్ఛందోరీతులు-భాగవత శ్రీవిద్య - మొదలగుననేక విషయములపై అనేక విద్వద్విమర్శకుల వ్యాసములిందు ప్రకటితములు. నిజముగా నిది వ్యాస జ్యోతుల తోడి విశిష్ట విజ్ఞానముల వెలిగించిన పోతన భాగవత నీరాజనమే.

## మార్కండేయ పురాణము - మారన

మార్కండేయ పురాణము ననువదించినవారిలో మొదటివాడు మారన. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం గారు "ప్రథమాంధ్ర మహాపురాణము—ప్రబంధ కథా మూలము" అను విషయమున పరిశోధనము గావించి పిహెచ్.డి. పట్టము నందిరి (1969). 1. మహా పురాణములు- మార్కండేయము, 2. ప్రథ మాంధ్ర మహాపురాణము, 3. మార్కండేయ పురాణము-కావ్యవస్తు ప్రదానము, 4. మార్కండేయ పురాణము-మఱికొన్ని యాంధ్రానువాదములు, 5. పురాణములు గాని పురాణములు.— అను నైదు సర్గలలో 20 ప్రధానాంశములు కూలంకషముగ నిందు పరిశీలింపబడినవి. పురాణ స్వరూప తత్త్వ వివేచనములు సూక్ష్మేక్షణికతో సంశోధితము లైనవి. మానవజీవిత సర్వాంశలను స్పృశించు పురాతన వస్తువేదైనను పురాణ మనబడును. సర్వపురాణలక్షితమైన నిర్వచనమును సూత్రీకరింపబోవుట అనంత విశ్వాకృతి నొక్క మణి దర్పణమున దర్శింపనెంచుట వంటిది. పురాణములు పురాణ పురుషునివలె పరిపూర్ణజ్ఞాన స్వరూపము లని సూత్రప్రాయముగ జెప్పవచ్చును. మార్కండేయము గుణత్రయ ప్రధానము:— అని యుక్తియుక్తముగ సిద్ధాంతీకరింపబడినది: కాల నిర్ణయమున చారిత్రక పరిశీలన సునిశితము. ద్వితీయసర్గమొక సప్తచ్ఛదము. ఇది మారన ప్రతిభా సర్వస్వమును కదళీపాకమున సందించినది. ప్రథమాంధ్ర పురాణము బసవపురాణము. కాని సంస్కృతానువాదమై ప్రమాణితమైన ప్రథమాంధ్ర పురాణము మార్కండేయ పురాణము - అని ప్రతిపాదింపబడినది. ఎల్లకర నృసింహ కవియు పర్వతమంత్రి లింగనయు ద్విపదలలో వ్రాసిన మార్కండేయ పురాణములును, పోచిరాజు వీరనామాత్యుని చంపూ పద్ధతిలో నున్న భావనాఋషి మాహాత్మ్యమును పద్మశాలీల వంశపారంపర్య వర్ణనా ప్రధానములై పురాణలక్షణ లక్షితములుగా మూల మార్కండేయమునకు సంబద్ధము గామిచే పురాణములు గాని పురాణము లని నిర్ణయింపబడినవి మారన తరువాతి ప్రబంధములకు ఆతని మార్కండేయము మూల మని ప్రత్యక్ష-పరంపర-పరోక్ష-పాక్షిక రూపములో సోదాహరణముగ జూపబడినది. తృతీయ సర్గము "మారన మార్కండేయ మాంధ్రప్రబంధ మూలము" అను సిద్ధాంతమును నికషోపల పరీక్షచే నిగ్గు దేల్చినది. ఆంధ్ర ప్రబంధ స్రోతస్సులకు మారన మార్కండేయము మూలస్రోతస్సు నందించినదని నిరూపించినది. కాగా తృతీయ సర్గము నవార్థరత్నాంగుళీయకము. చతుర్థ సర్గము ఇతర కవుల మార్కండే యానువాదముల బరిశీలించుచు మండ కామేశ్వరకవిది యథా మూలానువాదము, మారనది స్వేచ్ఛానువాదము అని ప్రతిపాదించి, యనేక నూత్ననూత్న విషయముల క్రోడీకరించి ప్రతి యంశమును చక్కని పరిశోధనగా తీర్చి దిద్దినది.

డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్య గారు హరిభట్టు వరాహ పురాణమును క్షుణ్ణముగ పరిశోధించి సంశోధిత ముద్రణమును వెలయించిరి. ఇందు వారి పరిశోధనము 'వాక్యపదాక్షరీయమైనది.' ఆముఖ- అనుశీలన-ఆవిష్కరణముల ద్వారా అనేక నూత్న విషయములు ప్రకాశింపబడినది. భట్ట భట్టార శబ్దార్థ విచారము బహుళార్థ విశేషముల జూపినది.

హరిభట్టులో హరిహరాభేద ప్రత్యయము క్రమ పరిపాకమును జెందుచు హరియే పరతత్త్వము అను ప్రత్యయమునకు జేరినది. కావుననే రతి రహస్యమును హరిహరుడుగ వ్రాసెను. తక్కిన పురాణానువాదములలో తన పేరును హరిభట్టు-హరిసూరి-హరిభట్టారకుడు-అని హరవిరహితముగ జెప్పికొనెను. నారసింహ-వరాహ-భాగవత స్కంధత్రయ-మత్స్య పురాణానువాదములలో నీ హరిపారమ్య ముత్తరోత్తరముగ వికాస పరాకాష్ఠ నందుకొన్నది— అని వాద వివాదముల సహేతుకముగ నిరూపింపబడినది. ఎఱ్ఱన నృసింహ పురాణ పూర్వభాగము ననువదింపగా హరిభట్టు ఉత్తర భాగము ననువదించెను. 24000 గ్రంథమైన వారాహమున ధరణీ వరాహ సంవాద రూపమై వ్రతకల్పప్రధానమైన సుమారు 10 వేల గ్రంథమును నంది మల్లయ్య, ఘంట సింగయ్య లనువదించిరి. కైవల్యజ్ఞాన ఖండాత్మకమైన తక్కిన 14 వేల గ్రంథములో వరాహప్రశస్తి విపులముగా గల కైవల్యకాండమును మాత్రము హరిభట్టు అనువదించెను. దీనికి మూలమైన కైవల్యజ్ఞాన కాండ ద్వయాత్మకమైన వరాహపురాణను పూర్తిగా లభింపకున్నను తదంతర్గతమైన "సాలగ్రామ లక్షణమ్" అను గ్రంథము 300 ల శ్లోకములు గల తాళపత్ర ప్రతి (B. No. 5813 GO. ML.) గా నున్నది. అందులోని సాలగ్రామ లక్షణముల యనువాదములు హరిభట్టు వరాహ పురాణమున స్పష్టముగా నున్నవి. కావున హరిభటు అనువాదమునకు మూలమైన వారాహము నంది ఘంటం యనువాద మూలమునకు భిన్నమైనది.— అని సోదాహరణముగ సిద్ధాంతీకరింపబడినది. వరాహ ప్రశంసలో వేద-ఉపనిషద్-మంత్రార్థ విశేషములు, భూపతిత్వ సాధకమైన వారాహోపాసనము; ప్రస్తార క్రమమున నేర్పడు మ, య, ర, స, త, జ. భ, న-గణముల జెప్పు పింగళఫణి సూత్రోచ్చారము (1. ధీశ్రీస్త్రీమ్, 2. వరాహాయ్, 3. కాగుహార్, 4. వసుదాస్, 5. సాతేక్వత్, 6. కిదాసజ్, 7. కింవదభ్, 8. సహసన్) లందలి గరుడభయ నివారక ధరణీవరాహ ప్రబోధకతయు ప్రాజ్ఞ ప్రబోధకములుగా ప్రకాశింపబడినవి. హరిభట్టు భాగవతములోని 6-11-12 స్కంధముల యనువాదములు పోతన విడిచిన స్కంధములకు తొలి పూరణములు. ఇందలి విస్తృతానువాదసరణియు అనుసరించిన కవితారీతియు పోతన వదలిన స్కంధములకు సరియైన పూరణములు. మొదట నవి యట్లే యందరిచే నాదరింపబడినవి. కాని తరువాత నారయ పోతన శిష్యుడగుటచే నాతని యనువాదములు పోతన భాగవతమునకు పూరణములుగా జేర్చబడినవి. కాని, నారయ రచనలో హరిభట్టు ననుసరించినాడు. హరిభట్టు కడపటి కృతియైన మత్స్యపురాణము అతని పరిపక్వమైన హరిపారమ్యమునకు పరమపదము. ఇది విష్ణు ధర్మోత్తరఖండానువాదము. హరిభట్టు కృతులన్నియు హరిపారమ్య ప్రతిపాదకములైన పురాణ ఖండానువాదములు. కామమునకు రతిరహస్యము, అర్థమునకు వారాహము, మోక్షధర్మములకు భాగవత మాత్స్యములును అనువధింపబడి మొత్తముపైన పురుషార్థ చతుష్టయమును సాధించి పెట్టినవి. అన్ని పురాణములవలె గాక కథా ప్రారంభము పద్యమున నుండుట విశేషము అని విశిష్ట విమర్శనము జేయబడినది. అనుశీలన మనుభాగమున హరిభట్టు వరాహ పురాణ మన్ని దృష్టికోణముల నాలోకితము. సందర్భానుసారముగ వేదావధానమునుండి యధునాతనావ

ధానమువరకు గల యవధానముల పరిశీలనము కౌతుకమును బుట్టించును. ఆవిష్కరణలో తాళపత్ర గ్రంథ పరిచయమున పత్రముల సిద్ధముజేయు తీరును వ్రాసెడి సౌరును, అందలి పొరపులును, వానిని సవరించి చదువుకొనుడను వ్రాయసగాండ్ర విన్నపములును, వారి యుత్తమాది శ్రేణులును చదువరుల విశేష విజ్ఞానాభిరుచిని పెంపొందించునట్లు వివరింపబడినవి. తాళపత్ర ప్రతిలో వచనముగా గుర్తించిన దానిని సీసపద్యముగ గుర్తించిన తీరు శ్రీ చిన్నికృష్ణయ్యగారి గంభీర పరిశోధన ప్రతిభా నైపుణ్యములకు పరాకాష్ఠ.

కుమారి గండికోట సీతమ్మగారు ''వరాహపురాణము'' (నంది మల్లయ్య, ఘంట సింగయ్యలది) తెలుగు సంస్కృతముల తులనాత్మక పరిశీలనము- అను విషయమున డా॥ పి. యశోదారెడ్డిగారి పర్యవేక్షణలో పరిశోధనను గావించి ఎమ్. ఫిల్ పట్టము నందిరి (1980). ఇది '5' అధ్యాయముల పరిశోధనము : 1. వరాహ పురాణము-తదనువాదములు, 2. జంట కవులు-తత్సంప్రదాయము, 3. సంస్కృతాంధ్రానువాదముల కథాభేద సాదృశ్యములు, 4. తెలుగు వరాహ పురాణ వైశిష్ట్యము, 5. తెలుగు వారాహము నిర్వహించిన చారిత్రక సాంఘిక నైపథ్యము—అను విషయములు పరిశీలింపబడినవి. ధర్మనీత్యాది ప్రబోధకములై సత్యములు ప్రకల్పితములు నైన కథల సంపుటీకరణము పురాణము. స్వతంత్ర నూత్నచ్ఛందః కథాసంపుటితమై శైవధర్మప్రబోధకమైన బసవ పురాణము ప్రథమాంధ్ర పురాణ మనుట సమంజసము-అని ప్రతిపాదింపబడినది. క్రీ.శ. 1325 నుండి 1925 వరకు నాంధ్రీకృత పురాణములును తత్కవులును జూపబడిరి. జంట కవిత్వమున ననుసరింపబడు రీతులు సవిస్తరముగ దెలుపబడినవి. వ్రత ప్రధానమైన వారాహములోని వ్రతములు సంగ్రహముగా వివరింపబడినవి. సంస్కృతాంధ్రముల సామ్య భేదములు సోదాహరణముగ బరిశీలింపబడినవి.

**విష్ణుపురాణము-కర్తలు : వెన్నెలకంటి సూరన, కలిదిండి భావనారాయణ**

డా॥ సి.ఎన్. కోటేశ్వరన్ గారు వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము - విమర్శనాత్మక పరిశీలన అను విషయమున కేవల కృతి పరిశోధనము గావించి పిహెచ్.డి. పట్టము నందిరి (1981).

**గరుడ పురాణము-కర్త : పింగళి సూరన**

డా॥ గుమ్మడపు రామకృష్ణ రాయణంగారు పింగళి సూరన- అతని రచనలు- అన్న విషయముపై పరిశోధన గావించి పిహెచ్.డి. పట్టము నందిరి (1977). వీరు సూరనకృతులలో గరుడపురాణమును గూర్చి రెండవ ప్రకరణమున విపులమైన పరిశీలనము గావించిరి. పురాణ- పురాణశబ్దార్థ-పురాణ కర్తృత్వ- పురాణ లక్షణ - అష్టాదశ పురాణతత్సంఖ్యాక్రమములు, ఆంధ్రపురాణములు సూరన గరుడ పురాణము - పురాణ లక్షణ సమన్వయము - అష్టాదశ పురాణములలో గరుడ పురాణ స్థానము - మరణానంతర జీవిస్థితి - నరకప్రద పాపములు - మానవ దేహోత్పత్తి ప్రకారము - బభ్రువాహన ప్రేతసంవాదము-తులసీప్రభావము - వర్ణనాలంకార లోకోక్తులు- రాఘవ పాండవీయ కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్నములపై గరుడపురాణ ప్రభావము- గరుడ పురాణ ఫల శ్రుతి సారాంశము - అను నంశములు చక్కగా బరిశీలింపబడినవి. అగాధవేదపాథోధిలో విహరించుట కేర్పఱచిన విజ్ఞాన నౌకలు పురాణములు. ప్రతి ద్వాపరమున నొక మునిశ్రేష్ఠుడు వ్యాసపదము నంది పురాకర్త యగును-అని పురాణ స్వరూపము చిత్రింపబడినది. ఆంధ్ర పురాణ- తత్కర్తలు పట్టికలో నీయబడిరి. గారుడాప్రథపరాస్తమైనది. బ్రహ్మ వైవర్తమిచ్చిన ''మోక్షస్య చ నిరూపణం'' అను లక్షణమును, మత్స్యపురాణము చెప్పిన ప్రళయ శ్రాద్ధకల్ప లక్షణముల సమన్వితము జేయబడినవి.

గరుడ పురాణమునకు పురాణపురుషుని మజ్జాస్థా నీయత చూపబడినది. మొత్తముపైన గరుడ పురాణముపై నిదిసంగ్రహమై సంభావ్యమైన పరిశోధనము. దీనివలన పఠితలకు గరుడ పురాణము ఆత్మ విజ్ఞాన దాయక మను భావము గలుగును.

**బసవపురాణము : కర్త - పాల్కురికి సోమన, పిడుపర్తి సోమన**

ఇది తెనుగున మొదటిపురాణము. దేశీయమై సర్వ స్వతంత్రమైనది. పంచలక్షణినిగాని దశలక్షణినిగాని అచ్చుగ బాటించి యుచ్చువేసికొన లేదు. ఆ లక్షణములకు మూలాధారమైన పురుషార్థ చతుష్టయము లక్ష్యముగ, అనాదిగా దేశీయమై యాబాలగోపాలము పారంపర్యముగ శ్రుతిసామరస్య ముతోగాని రాబడుచున్న, ప్రాచీన మహాభక్త గాథలను సమకాలీనముల జేర్చి నవీనముగా ప్రబంధించి పురాణమైనది. ఛందమున నేమి బంధమున నేమి భావమున నేమి సంభావ్యాను భావమున నేమి చివరకు మహైశ్వర్య ప్రభావమున నేమి దీనికి దీటైన పురాణముము తెనుగున లేదని చెప్పకతప్పదు. పండితారాధ్య చరిత్ర మితిహాసముగా, బసవపురాణమును సర్వదేశి పురాణ భక్తకథామూల మగు నొక యాదిపురాణముగా సృష్టించి పాల్కురికి సోమనాథుడు తెలుగునాటి పారాశర్యుడైనాడు. కావుననే యీతనిని ఈతని కృతులను ఈతని సృష్టియైన ద్విపదసాహిత్య విశ్వమును పలువురు పలుమెలుగుల లో పరిశీలించి పరవశులై పరంపరావశులై వారు.

డా. టి. సుశీల గారు ద్విపద వాఙ్మయమును పరిశోధించి ఆంధ్ర ద్విపదసాహిత్య చరిత్రమనే వెల యించినారు. ఇది 12 ప్రకరణముల గ్రంథము. 1. ద్విపదపుట్టు పూర్వోత్తరములు, 2. శైవమత సంబంధి ద్విపదలు (వీనిలో బసవపురాణ పండితారాధ్య చరిత్రలు, ''మణి బసవ పురాణము'' శంకర సంహిత బ్రహ్మోత్తర ఖండములు), 3. శాక్తములు, 4. వైష్ణవములు (రామాయణ - భాగవత - తదితర మూలకములు), 5, వేదాంతములు (శైవాద్వైత విశిష్టాద్వైతములు), 6. భారతకథా మూలములు, 7. చరిత్రాత్మకములు, 8. వీరగాథలు, 9. పురాణ సంబంధములు, 10. జీవిత చరిత్రలు, 11. సంకీర్ణములు, 12. ద్విపదకావ్యముల సాంఘిక పరిస్థితులు— అనునవి ప్రకరణాంశములు.

వీరి పరిశోధనము ద్విపద సాహిత్య సముద్ర మథనము. సోమన బసవపురాణ సరణిలో రచించిన పెక్కు పురాణములు తాళపత్ర ప్రతులలో నముద్రితముగా నున్నవి. డా. సుశీలగారు వాని నన్నింటిని (20) పరిశీలించి విశేషముల వివరించిరి. 1. దేవాంగ పురాణము - భద్రకవి లింగకవి (D No. 978), 2. దేవాంగ పురాణము - వీరన్న (No. 994), 3. బ్రహ్మోత్తర ఖండము - యాదాటి వేంకటనారాయణ (R. 1543), 4. భాగవత దశమస్కంధము-మడికి సింగన, 5. భాగవతము - టేకుమళ్ళ రంగశాయి, 6. మణి బసవ పురాణము - బచ్చు సిద్ధకవి, 7. మార్కండేయ పురాణము - నృసింహకవి, 8. మార్కండేయ పురాణము-గుజవెల్లి గురవప్ప, 9. మార్కండేయ పురాణము - పర్వతమంత్రి లింగన, 10. వైశ్య పురాణము(కన్యకా పురాణము)-భాస్కరాచార్యుడు, 11. శివరహస్య ఖండము ( స్కాంద శంకరసంహితాంతర్గతము)- ఔబళకవి, 12. శంకర సంహిత (స్కాంద శంకర సంహితానువాదము) - అజ్ఞాతకవి, 13. సురాభాండేశ్వరము (కథ కాశీ ఖండమునుండి గైకొన్నట్లు చెప్పబడినది) - గురవప్ప, 14. సురాభాండేశ్వరము - పులిగడ్డ నారన, 15. నింబజా మాహాత్మ్యము (బ్రహ్మాండ పురాణాంర్గత రేవమల్లుని కథ) - కన్నడ సరసకవి, 16. శ్రీవిష్ణుపురాణము (రామానుజాచార్యులను ముఖ్యముగా జేసికొన్న విష్ణుభక్తుల చరిత్రము)- చక్రపురి రాఘవాచార్యులు, 17. శ్రీనివాస విలాసశేవధి ( వతాహ

వామన బ్రహ్మాండ పాద్మగారుడాది పురాణ కథలు శోధించి ప్రసిద్ధ వేంకటాధీశుని కథతో సంగ్రహించి వ్రాసిన ప్రబంధము)-శ్రేష్ఠలూరి వేంకటాచార్యుడు 18. హరిశ్చంద్రోపాఖ్యానము (ఋగ్వేద హరిశ్చంద్రుని దీసికొందు సన్న తన ప్రతినకు విరుద్ధముగా స్కాంద హరిశ్చద్రుని దీసికొన్న యనువాదము) - గౌరన, 19. ఉత్తర హరిశ్చంద్ర కథ (హరిశ్చంద్ర పూర్వ జన్మలు) - గద్దె చంద్రశేఖర కవి, 20. రుక్మాంగద కథ (బ్రహ్మాండ పురాణాంతర్గతము) - వేంకటగిరి.

మఱి బసవపురాణము సోముని బసవనకు వేరైన బసవని చరిత్రము. బసవ పురాణచ్ఛాయలో నడచినది. దేవాంగ మార్కండేయ వైశ్యములు తెలుగు నాటి జాతులకు సంబంధించిన దేశీయ జాతి పురాణములు. అముద్రితములైన ద్విపద పురాణముల నుండి చక్కని ద్విపదలను శ్రీమతి సుశీలగారు తమ పరిశోధనమున నుదాహరించి చూపిరి. వానిని జూడ జైన పురాణవాఙ్మయమునకు ప్రతిగా సోమనాదులు దేశీయ ద్విపద పురాణ వాఙ్మయము నెట్లు వికసింప జేసిరో తెలియును. అట్లే గౌరన మడికి సింగన యాదాటి వేంకటనారాయణ ఔబళక వ్యాదులు ద్విపద వికాసమును వైదికపురాణవాఙ్మయానువాదము వైపున కెంత చక్కగా ప్రసరింపజేసిరో విదితమగును. విష్ణు పురాణ-శ్రీనివాస విలాసశేవధ్యాది గ్రంథములు వైష్ణవము గూడ పై దేశీయ సరణి నవలంబించినదని తెలుపును. మొత్తముపైన బసవపురాణము పంచలక్షణ విలక్షణమైన జైన పురాణ సంప్రదాయము ననుసరించి వ్రాయబడినదని శ్రీమతి సుశీలగా రభిప్రాయపడిరి.

శైవ జైనముల పోరాట మొక విలక్షణమైన యుద్ధము. అందు విజయమునకై ఒకరి కన్న నొకరు నూత్నమై బలవత్తరమైన సాధనముల శత్రువుల కందని విధముగనే సిద్ధముజేసి ప్రయోగింతురు గాని అనుకరణమునకు నవకాశ మీయరు. కావున జైనాది మతములపై విజయధ్వజమెత్తిన తెలుగు పురాణ ప్రక్రియ స్వతంత్రమనియే చెప్పుట న్యాయము. కావునే సోమనాథుడు తన యితిహాసపురాణములకు రసకు బూర్వము జైనులకు బ్రతిగా బ్రవర్తిల్లుచుండిన పురాతన భక్తగీతార్థ సమితిని మూలమని చెప్పినాడు. జైన పురాణము తీర్థంకర చరిత్రము గాగా సోమన పురాణము సువిశాల శివభక్త చరితమైనది.

డా. వే. నరసింహారెడ్డి గారు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారి పర్యవేక్షణలో ''పాల్కురికి సోమనాథుని కృతుల పరిశీలన''— అను విషయమున పరిశోధనము గావించి 1972 లో పిహెచ్.డి. పట్టము నందిరి. ఇది 2198 పుటలతో 43 ప్రకరణములతో 4 సంపుటములుగా నున్న విశాల సిద్ధాంత వ్యాసము. సోమన కవి జీవిత- కాలాదులు, కృతులు- వాని వైవిధ్యము, బసవపురాణ పండితారాధ్య చరిత్రలు, ఛందో భేదములు, సంస్కృత కృతులు, కావ్యశిల్పము, ప్రతిపాదించిన శైవము, సాంఘిక పరిస్థితులు, ఆటపాటలు, బహు భాషా పాండిత్యము, తరువాతి కవులపై ప్రభావము మొ. అనేక విషయము లిందు పరిశీలింపబడినవి. 11 వ ప్రకరణము - 1. బసవ పురాణ నామౌచితి. 2. బసవ పురాణకథా సూత్రము, 3. సోమనాథ హరీశ్వరుల కథన భేదము, 4. బసవనిజన్మక్రమము, 5. బసవన ఉపనయన తిరస్కారము, 6. బసవన వివాహము-భార్యలు, 7. బసవన-బిజ్జలుడు-బసవనకు ప్రధాని పదవి, 8. బసవన సమకాలిక భక్తులు, 9. ప్రాచీన భక్తులు, 10. బసవన వీరశైవమత ప్రచారము, 11. బసవన లింగైక్యమును క్షుణ్ణముగ బరిశీలించినది.

'పురాఽపి నవం' అన్న వ్యుత్పత్తి ననుసరించి దీనిని పురాణ మనవచ్చును గాని సోమన దృష్టిలో నిది కావ్యము, ప్రబంధము అనిరి - ఆ కాలమున

బురాణముల కత్యాదరముండుటచే సోమః తన గ్రంథమునకు బురాణమని పేరిడి నారదాది పురాణ పాత్రలచే నందీశ్వర పూర్వజన్మ వృత్తాంతమును పురాణోచితముగ ప్రకృతమున కనుసంధించెను. సంస్కృత పురాణములు మిత్రసమ్మితములు. బసవ పురాణము కాంతాసమ్మితము అనిరి. మిత్రసమ్మిత మగుచునే కాంతాసమ్మితమనుట లెస్స. స్నేహమే కాంతా సంబద్ధమగుచు కమనీయమగును గదా! మల్లమదేవీ పురాణమును గూర్చి యది నందికొట్టూరు ప్రాంతమున సుబ్బయ్యగారి దగ్గర నున్న యుదంత మును దానికై పరిశోధకులు పడిన పాట్లను చివర కది యక్షరావశేషమైన విధమును దెలిపి, అది సోమన వ్రాసిన ''అక్కమహాదేవి పురాణమై యుండనోపు'' నని సముచితముగ నూహించిరి.

**నృసింహ పురాణము-కర్త : ఎఱ్ఱన**

డా॥ వి. రామచంద్రగారు, డా॥ వి. విశ్వనాథ శాస్త్రిగారును, ఎఱ్ఱాప్రెగ్గడ కృతులను గూర్చి పరిశోధనముల గావించి 1966, 1969 లలో పిహెచ్.డి. పట్టముల నందిరి.

**పద్మపురాణము- కర్త : మడికి సింగన**

డా. కె. కుసుమాబాయిగారు ''మడికి సింగన కృతులు- పరిశీలనము'' అను విషయమున ఆచార్య డా. బి. రామరాజుగారి పర్యవేక్షణములో పరిశోధనము గావించి 1979 లో డిహెచ్.డి. పట్టము నందిరి.

ఇది 1. సింగనకు పూర్వము రాజకీయ సాంఘిక పరిస్థితులు, 2. పద్మపురాణోత్తరఖండము, 3. భాగవత దశమస్కంధము, 4, వాసిష్ఠ రామాయణము, 5. సకల నీతి సమ్మతము, 6. సింగన శైలి- అను అంశములను పరిశీలించినది. పురాణ పురుషుని నుండి బ్రహ్మాండ ముద్భవించినట్లు పురాణము నుండి సర్వవాఙ్మయముద్భవించినది. పద్మకల్ప వృత్తాంతము జెప్పుటచే పాద్మమైనది. విష్ణునాభినుండి భూమి పద్మముగా నుద్భవించినది. హిమవన్మేరు పర్వతములు దాని కేసరములు. సాత్త్వికమై మోక్ష ప్రదమైన పాద్మము ప్రథమరచిత మైనను ద్వితీయ స్థానమున పరిగణితము. బ్రాహ్మము- శిరము, పాద్మము- హృదయము, విష్ణు శివ పురాణములు- కుడియెడమ బాహువులు, భాగవతము - ఊరువులు, నారదీయము- నాభి, మార్కండేయాగ్నేయములు- కుడియెడమ పాదములు, భవిష్యబ్రహ్మవైవర్తములు- కుడి యెడమ జానువులు, లైంగవారాహములు- కుడి యెడమ గుల్ఫములు, స్కాందము- లోమములు, వామనము- చర్మము, కౌర్మము- వెన్ను, మాత్స్యము- మేధస్సు, గారుడము- మజ్జ, బ్రహ్మాండము- ఎముకలు-ఇది పురాణ (మయ) పురుష స్వరూపము. పూర్వ-మధ్య-ఉత్తర ఖండాత్మకమైన దీనిలో సర్వ సారాంశమై పుణ్యజనకమైన యుత్తరఖండమును, మాసమాహాత్మ్యములను వైష్ణవోత్తరముగా కేంద్రీకరించుకొని మడికి సింగన యనువదించెను. తన ప్రభువగు ముప్పభూపతిని భావించి దిలీపుని వరించెను. ఊర్వశీ పురూరవ శృంగారఘట్టమును స్వతంత్రముగను, సుందోపసుందుల కథను మూలమునకన్న సక్రమముగను వర్ణించెను. ఈ విధముగ సంస్కృతాంధ్ర పద్మ పురాణములు సామర్థ్యోచితీపూర్ణముగ బరిశీలింపబడినవి. ఇందలి ''పద్మపురాణము- పాఠభేదములు''- అన్న భాగము పరిశోధనలోని తీవ్రమైన గాఢమైన కృషిని ప్రదర్శించుచున్నది. మూలమును గూడ జేర్చినచో నిదియొక పరిశోధిత పద్మపురాణ ప్రతిని సిద్ధముజేసినట్లనిపించెడిది. అయినను అట్టి భావికృషి కిది తప్పక యుపకరించును.

**భీమేశ్వరపురాణము- కర్త : శ్రీనాథుడు**

శ్రీమతి కె. గిరిలక్ష్మిగారు ''భీమేశ్వర పురాణము- విమర్శనాత్మక పరిశీలనము'' అను విషయమున డా. ముదిగొండ శివప్రసాదుగారి పర్యవేక్షణలో పరిశోధనము గావించి ఎమ్.ఫిల్. పట్టము నందిరి (1979). పరిశోధనమును 11 ప్రకరణములు. 1.

పురాణము-కావ్యము - ప్రబంధము- ప్రక్రియాత్మక పరిశీలనము, 2. శ్రీనాథుని కాలనిర్ణయము, 3. ఆతని జీవిత విశేషములు, 4. భీమేశ్వర పురాణము-మూలము, 5. ఇతివృత్తము, 6. వర్ణనము, 7. అలంకార రసపోషణము, 8. శ్రీనాథుడు భావించిన శైవము, 9. భీమేశ్వరపురాణము- వీరశైవము- ఆంధ్రప్రదేశము, 10. వర్ణిత తీర్థక్షేత్ర మాహాత్మ్యములు, 11. సాంస్కృతిక వ్యావహారిక విశేషములు—అనునంగములు పరిశీలింపబడినవి. మానవులు తాము సంపాదించిన కళాశాస్త్రాదితత్త్వజ్ఞానముల నుత్తరోత్తర జాతి కందజేయుటకై యెప్పటికప్పుడు నిక్షేపించుచుండగా నేర్పడినగ్రంథములు పురాణములు. అవి సార్వకాలికవిషయముల క్రోడీకరించుటచే సర్వకాలీనత వానికి సిద్ధించినది. పురాణపంచలక్షణాతిక్రమమున కిది కారణము. అని పురాణస్వరూపము యథావస్తుస్థితినిబట్టి సమంజసముగా జూపబడినది. భీమేశ్వరపురాణము స్కాందాతర్గతగోదావరీఖండమునకు తెలుగుసేతయని యూహింపబడినది. శ్రీనాథ శైవము వీరశైవము చక్కగా నిరూపితములు.

**కాశీఖండ భీమఖండములు - కర్త : శ్రీనాథుడు**

డా. కొర్లపాటి శ్రీరామమూర్తి గారు తమ పిహెచ్. డి. పట్టమునకై వ్రాసిన సిద్ధాంతవ్యాసమును 'శ్రీనాథుడు' అనుపేర నొక యుద్గ్రంథముగ ప్రకటించిరి. లభ్యమైన సంస్కృత భీమ ఖండము శ్రీనాథుని భీమఖండమునకు బోలిక లున్నను సమకాలీనత్వమును నిరూపించి కవితాసాక్ష్యమును బట్టి సంస్కృత భీమఖండము శ్రీనాథ భీమఖండమునకే యనువాదమనియు, ''కాశీఖండ మయః పిండమ్'' అనునది సంస్కృత కాశీఖండమునకే చెందు ననియు, ఎట్టి ప్రతికూల ప్రమాణములు లభ్యములు గానందున శివరాత్రి మహాత్మ్య మీశానసంహితా భాగమున కనుసరణ మనియు సిద్ధాంతీకరించిరి. వీనికి వారు చూపిన యుపపత్తులు సమగ్రములుసంపరిశోధనాభరములును, వీరి హేతువాదమున్యాయవాదమును మించుచు. ప్రరూఢ ప్రసిద్ధములైన సిద్ధాంతములు మారి యన్యథా సిద్ధాంతీకరణములు సప్రమాణముగ నావిష్కరింపబడినప్పుడు విద్వజ్జనములకు సైతమాశ్చర్యమును గొలుపకమానవు. వీరే యిటీవల కుమార సంభవకర్త యగు నన్నెచోడుని మ. రా. (గ్రంథ ప్రారంభ గ్రస్థరావృత్తము సందలి యాది గణద్వయ వ్యంజనమున మానవల్లి రామకృష్ణ కవి) యని యుక్తి ప్రత్యుక్తులతో సంస్థాపించిరి.

**లింగ పురాణము :** ఆంధ్ర లింగపురాణమును గూర్చి పరిశోధన మెవ్వరు సలుపకున్నను ''కళాపూర్ణోదయ మూలము లింగపురాణము" అను నంశమున శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు 1941 డిసెంబరు 'భారతి'లో నొక పరిశోధనా వ్యాసమును ప్రకటించిరి.

''ఆ కళాపూర్ణు కథ...కరము ప్రసిద్ధంబుగా గల యది"— అన్న సూరనార్యుని కళాపూర్ణోదయ ప్రబంధ ప్రారంభము తన కల్పిత కథ పురాణ మూలక మని సూచించుచున్న దనియు, కథామూలమైన నారద గానాభ్యాస ప్రయాసలోని యంశము లన్నియు లింగపురాణము సుత్తరభాగములోని మూడధ్యాయములలో తేటతెల్లముగ గానవచ్చుచున్న వనియు సూరన వానికి గొన్ని మార్పుల గూర్చి తన ప్రతిభతో నచుంబిత కల్పిత కావ్య సౌందర్య కళాపూర్ణోదయమును జేసె ననియు, లింగపురాణ - కళాపూర్ణోదయ పద్యముల సాదృశ్యమును జూపి సిద్ధాంతీకరించిరి. తరువాత సూరన చతుర్ముఖ విలాసకథకు పురాణాది పూర్వ వాఙ్మయమున రవంత మూలము లభించునేమో యని యించుక సందియముగల దని భావిపరిశోధకులకు ప్రోత్సాహ మిచ్చిరి. ఇతర భాగములకు మూలము లభింపదని నిశ్చయించిరి. కళాపూర్ణోదయమున బాలిక వర్ణించిన యోగవిశేషములకు లింగ పురాణీయ యోగవిశేషములే మూలమైయుండు ననిరి. శాస్త్రిగారి యీ వ్యాసము చక్కని సప్రమాణ

సంగ్రహ పరిశోధనముగా నుండి పరిశోధకులకు మార్గదర్శకముగా నున్నది.

''విశ్వకర్మ పురాణము - కొన్ని చరిత్రాంశములు'' అన్న శీర్షికతో కొండూరి వీరరాఘవాచార్యులు 1951 డిసెంబరు భారతిలో నొక వ్యాసమును వ్రాసిరి.

వేదములోని విశ్వకర్మసూక్తములు, పద్మ వాయ్వాది పురాణములలోని విశ్వకర్మోపాఖ్యానములు, విశ్వకర్మ మహిమాత్మకమైన స్కాంద నాగర ఖండమును అనాది విశ్వకర్మ వైభవమును దెలుపును. సంస్కృతమున 'మూలస్తంభము' అను విశ్వకర్మ సంబద్ధమైన పురాణము జర్మనీలో ఓరియంటల్ లైబ్రరీలో నున్నది. దానిని బి. జి. సరస్వతీ స్వాములవారు వ్రాసిరి. సంస్కృతమున మరొక విశ్వకర్మ పురాణముగూడ నున్నది (నాగరఖండము 1213000 సంఖ్య). గాయత్రీ పీఠాధిపతియైన వీపూరి వేంకటాచార్య స్వామి విశ్వకర్మ పురాణము నాంధ్రమున ననువదించెను. దీనిలో ''శ్రీనాథుడు విశ్వకర్మ పురాణమును రచించె నన్న ప్రసిద్ధి యున్నది, అది లభ్యముగామి తా ననువదించె'' నని తెలుపబడినది. ఇది 'మూలస్తంభము' నకును నాగర ఖండమునకును అనువాదమని చెప్పుకొన్నను ఆ యనువాదము నాగర ఖండమున కనువాద మనదగదు. మూలస్తంభమున కొంతనే గ్రహించి పురాణ పంచలక్షణ సమన్వయమునకై సర్గాదులను వర్ణించినది.

విశ్వకర్మలకు త్రిసంధ్యా గాయత్రులైన సావిత్రీగాయత్రీ-సరస్వతుల పేర్లతోమూడుపీఠములు గలవు. విశ్వకర్మ ఋషి వంశీయు లగు బ్రాహ్మణులు వీని కధిపతులు. గాయత్రీ పీఠమునకు వీపూరి వారును, సావిత్రీ పీఠమునకు కనుపర్తివారును అధిపతులు. గాయత్రీ విశ్వకర్మ లాదిమ దంపతులు. వీపూరి వెంకటాచార్యులు ప్రౌఢ దేవరాయల ధర్మాధికారియు, విద్యాధికారియు నైన ముమ్మనాచార్యున కైదవతరము వాడు. కావున క్రీ.శ. 1610 వాడు. ఈ యాంధ్ర విశ్వకర్మ పురాణమునకన్న పూర్వమే ద్విపద మూలస్తంభము రచింపబడి యాగంటీశ్వరున కంకితము జేయబడినది.- ఇవి యీ వ్యాసమున పరిశీలింపబడిన విశేషములు.

కొండూరి వీరరాఘవాచార్యులుగారే 1951 నవంబరు భారతిలో ''రెండు స్కాంద పురాణములు'' అన్న విషయముపై నొక వ్యాసమును వ్రాసిరి. అందు సప్తఖండాత్మకమైన యొక స్కాందము, పంచాశత్ఖండాత్మకమైన మరియొక స్కాందము వెరసి రెండు స్కాందములు గలవు. కొందరు సప్తఖండాత్మకమును మహా పురాణమనియు పంచాశత్ఖండాత్మకమును పురాణ మనియు ననిరి. కొందరీ రెంటిని మహా పురాణములే యనిరి. శ్రీనాథుడు స్కాందము లక్షాత్మక మన్నందున పంచాశత్ఖండ మండితమై సంహితాషట్క సమన్వితమై లక్షాత్మకమైన స్కాందము మహాపురాణము కాగా సప్త ఖండాత్మకమైన స్కాందము ఉప పురాణము - అని యభిప్రాయ పడిరి.

కాని యీ విషయమున కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు తమ శ్రీనాథు డన్న పరిశోధనలో- ఆదిలో నఖండముగ నున్న స్కాందము (నేపాళ ప్రతిని బట్టి) తరువాత నది సప్తఖండాత్మకమై మహా పురాణమైనదనియు, నదియే నూత్నసూత్న ఖండముల జేర్చుకొనుచు పంచాశత్ఖండ మండితమై లక్షాత్మకమై స్కాందోపపురాణముగ క్రమ పరిణతమైనదనియు సోపపత్తికముగ దేల్చి చెప్పిరి.

**పురాణ విమర్శనము :**

అను శీర్షికతో పాలనంద సర్వేశ్వర శాస్త్రి గారు 1926 అక్టోబరు భారతిలో పురాణముల స్మృత్యేకదేశత్వమును ఐతిహ్యాంతర్గతత్వమును శ్రుతిస్మృతి ఐతిహ్యపురాణముల మేకతాపృథక్త్వములను విచారించి పృథక్త్వమును సిద్ధాంతీకరించిరి.

**పురాణ ప్రామాణ్య మీమాంస**

యన్న శీర్షికతో వాసా సూర్యనారాయణశాస్త్రి గారు 1926 జులై భారతిలో- పురాణములు చతుష్షష్టి కళలను మహాపురుష చరిత్రలను దివ్యక్షేత్ర తీర్థ మాహాత్మ్యములను ప్రకాశింపజేయు జ్యోతులై ప్రాచీన భారతీయజ్ఞాన విజ్ఞాన సర్వస్వము లని సిద్ధాంతీక రించిరి.

**విష్ణువాయు పురాణములు బ్రహ్మాండాంతర్భాగములు**

అను విషయమున శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు 1927 జనవరి, ఫిబ్రవరి భారతులలో నొకవ్యాసమును బ్రకటించిరి. అందులో ననేకపరిశోధి తాంశములు తెలుపబడినవి.

ఆదిలో పురాణమొక్కటే. దానినుండి ఒరిస్సా యందు బ్రహ్మపురాణము, పుష్కరక్షేత్రమున పద్మ పురాణము, గయలో నగ్నిపురాణము, మధురలో వరాహపురాణము, స్థానేశ్వరమున వామన పురాణము, వారణసిలో కూర్మ పురాణము, నర్మదాతీరమున మత్స్యపురాణమును బుట్టినవి. (A M V జాన్సన్) ఆ సర్వపురాణమూలపురాణ గ్రంథసంఖ్య 12000లు. విష్ణుపురాణకర్త వెన్నెలకంటి సూరన తనషష్ఠ్యంతము తరువాత గద్యలో ''ఆదిమహాపురాణంబగు బ్రహ్మాండ పురాణంబు సందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణు పురాణంబునకు గిథాక్రమంబెట్టి దనిన'' అని వ్రాయు టచే విష్ణుపురాణము వెన్నెలకంటి సూరననాటికే బ్రహ్మాండాంతర్గతముగా నుండెనని తెలియును విష్ణు పురాణ వ్యాఖ్య వైష్ణవ కూటచంద్రిక విష్ణుపురాణమును 6000 ల గ్రంథ మని చెప్పినది. తక్కిన 6000 ల గ్రంథము వాయుపురాణము అని సూచితము.

వాయుపురాణము మిక్కిలి ప్రాచీనము, బ్రహ్మాం డము వాయుప్రోక్తమగుటచే వాయుపురాణము. వేంక టేశ్వర స్టీమ్‌ప్రెస్సు వారి బ్రహ్మాండ పురాణ ప్రతి వాయు పురాణములోని $\frac{3}{4}$ వంతు సరిపోలును. క్రీ.శ. 5 వ శతాబ్దమునకు బూర్వమే బలిద్వీపవాసులు తమ 'కలి' భాషలో ఋగ్యజుస్సామాథర్వణ రామాయణ భారతములతోపాటు బ్రహ్మాండ మొక్కటే యనువ దింపబడుటచే బ్రహ్మాండము సర్వపురాణమూలపూర్వ రూపము. బలిద్వీపమున నొక తెగ శైవమతస్థులు. వారు బ్రహ్మాండమునే తమ పురాణముగ నెంతురు. కలిభాషలో ననూదిత బ్రహ్మాండమున సర్గప్రతిసర్గ వంశమన్వంతర వంశానుచరిత్రము లున్న వని ఫ్రెడ రిక్కుగారి సూచిక చెప్పును. బ్రహ్మాండాంతర్గతము లైన విష్ణు వాయు పురాణముల యంతర్భాగములే తక్కిన వైష్ణవ శైవ పురాణము లని చూపవచ్చును. మద్రాసు ప్రా. లి. పు. భాం. లోనున్న బ్రహ్మాండ పురాణపు వ్రాత ప్రతి (C. P. బ్రౌన్) అనేక ఖండ ములతో గూడిన పూర్వోత్తర భాగములుగల వైష్ణవ పురాణము.

కావున క్రీ. శ. 3, 4 శతాబ్దముల వరకు పురాణ మను పేర నొక పురాణ మున్నది. అది 'బ్రహ్మాండము' అను పేరుతో నుండి యుండును. దానిలో 12000 శ్లోకములు. దీని మొదటి చీలిక విష్ణు వాయు పురాణములు. చీలిన యీ రెండును తాము మూలములోని యే భాగమునకు జెందు చుండినవో తెలుపుకొనుచుండి తరువాత తరువాత మతాభిమాన ముచేత పృథగ్వైశిష్ట్యమును సంపాదించు తలంపుతో తాము జేరిన మూలపు జేరును వీడినవి. 16 వ శతాబ్ది వరకు విష్ణుపురాణము బ్రహ్మాండాంతర్గత పరాశర సంహిత యని గుర్తింపబడిన దని వెన్నెలకంటి సూరన విష్ణుపురాణ కథా ప్రస్తావన వలన స్పష్టమై నది.— ఇవి యీ వ్యాసమున పరిశోధిత సిద్ధాంతి తములైన విశిష్టాంశములు.

**పురాణ చరిత్రమును** గూర్చిన వ్యాసమున 1930 మార్చి ఏప్రిల్ భారతిలో కవికొండల వేంకట సత్యనారాయణ మూర్తిగారు— బ్రాహ్మణమతము నామావశిష్టమై బౌద్ధ మతము విజృంభించినపుడు బ్రాహ్మణ మతకర్తలు తమ విజయమునకై వ్రాసినవే పురాణము లని ప్రతిపాదించిరి.

శ్రీ యస్వీ జోగారావు గారు 1954 అక్టోబరు సంస్కృతిలో "ఆంధ్ర పురాణము- మధునాపంతుల సత్యనారాయణ" అను వ్యాసమున ఆంధ్ర పురాణ మును పురాణలక్షణముల నేకదేశమగు నితిహాసమున కుపలక్షణభూత మగు గ్రంథ మనిరి.

వేదాంతం గోపాలకృష్ణమాచార్యులగారు 1962 జూలై భారతిలో "స్థల పురాణములు వస్త్వైక్యము" అను వ్యాసమున పాండురంగ మహాత్మ్య భీమ ఖండ ములలో వస్త్వైక్యమున్న దని పరిశీలించి నిరూపించిరి.

**"శివరాత్రి మాహాత్మ్యము - శిథిల పూరణము"** అను శీర్షికతో ఆచార్య డా. బి. రామరాజు గారు విశ్వావసు చైత్రాషాఢపు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో నొక వ్యాసమును ప్రకటించిరి. వారు తమ తాళపత్ర గ్రంథ సేకరణోద్యమమున తెలంగా ణమున గ్రామ గ్రామమున దిరుగుచు మెదకు మండ లములో అన్నారము అను గ్రామమున నొక జంగమ దేవరకడ శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యము యొక్క సంపూర్ణ తాళపత్ర ప్రతిని (250-300 ఏండ్లనాటిది) సంపాదించి, కర్రి సాంబమూర్తి గారు శిథిల భాగ ముల నట్లే యుంచి ముద్రించిన వానికి పూరణము లున్నట్లు ఆయా భాగముల నుదాహరించి చూపిరి. తరువాత సమగ్ర శుద్ధ ప్రతిని సిద్ధముజేసి యాంధ్ర సారస్వత పరిషన్ముఖమున ప్రకటింపించిరి. ఈ విధ ముగ శ్రీ రామరాజు గారు శ్రీనాథుని ఈశాన సంహి తాస్వైరానువాదమైన శివరాత్రి మాహాత్మ్యమును సమగ్ర రూపమున నాంధ్రపురాణ వాఙ్మయమున పునఃప్రతిష్ఠింప జేసిరి.

బండారు తమ్మయ్యగారు బసవపురాణమును గూర్చియు కాశీభట్ల సుబ్బయ్య శాస్త్రిగారు పురాణపఠ నావశ్యకతను గూర్చియు విపుల వ్యాసముల వ్రాసిరి. భాగవతమును గూర్చి వచ్చిన యుపన్యాస వ్యాసములు కోకొల్లలు విజ్ఞాన దీపికలు.

ఇంత పరిశోధన జరిగినను ఇంకను నాంధ్ర పురాణములు పరిశోధనీయములు పెక్కులుగ మిగిలి యున్నవి. వాని నన్నింటిని ప్రాజ్ఞులు పరిశోధించి వెలయించిన భారతీయ విజ్ఞాన సంస్కృతులు వేవెలు గుల విరజిమ్మి విశ్వకల్యాణము గూర్చునని యాశింతును.



# కావ్య పరిశోధన

—తుమ్మపూడి కోటీశ్వరరావు

**విషయ పరిధి**

తెలుగు కావ్యాలమీద విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధన ప్రస్తుతం. అంటే, ఇతిహాస పురాణ ప్రబంధ ప్రక్రియా భిన్నమైన కావ్య పరిశోధన వక్తవ్యాంశం.

దాదాపు 1960 నుండి నేటిదాక ఈ రెండు దశాబ్దాల్లో జరిగిన కావ్య పరిశోధన వ్యాసంగం, ఈ వాస్యకర్త కన్నంత[1] విన్నంత[2] వరకు ఇలా వింగడింపబడుతున్నది.

**ప్రత్యేక పరిశోధనలు**

ఏదో ఒక కావ్యాన్ని పరిశోధనకోసం గ్రహించి విమర్శించడం ఈ విభాగంలో చెప్పబడుతోంది.

**ఆంధ్ర విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు/రాలు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 1. | కుమార సంభవ విమర్శ | డా॥ టి. నిర్మల | డా॥ దోణప్ప | పిహెచ్.డి. | 1960 |
| 2. | విజయ విలాసానుశీలన | డా॥ కె. వెంట్రామరాజు | — | పిహెచ్.డి. | 1978 |
| 3. | *తెలుగులో పంచతంత్రం చంపువు | డా॥ పి. సుబ్రహ్మణ్య శాస్త్రి | — | పిహెచ్.డి. | 1978 |
| 4. | నిశ్శంక కొమ్మన శివలీలా విలాసం | డా॥ కె. హనుమంతరావు | — | పిహెచ్.డి. | 1979 |

**ఉస్మానియా విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు/రాలు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 1. | జయదేవుని గీతగోవిందం ఆంధ్రానువాదం | డా॥ వి. కృష్ణారావు | — | పిహెచ్.డి. | 1981 |
| 2. | భీమేశ్వరపురాణం విమర్శనాత్మక పరిశీలన | శ్రీమతి కె. గిరిలక్ష్మి | — | యం.ఫిల్. | 1979 |

---

1. కన్నంత– 1. తెలుగులో పరిశోధన డా. పోరంకి దక్షిణమూర్తి,
2. తెలుగు పరిశోధన సంహిత–తెలుగు అకాడమీ.
3. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ పరిశోధనలు.

2. విన్నంత– ఆంధ్ర, మద్రాసు, బెంగుళూరు విశ్వవిద్యాలయాలనుండి, మిత్రులు శ్రీ విశ్వనాథరెడ్డి, డా॥ వి. రామచంద్ర, డా॥ జి.యస్. మోహన్ పంపిన సమాచారం– వీరందరికి కృతజ్ఞతలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3. | *దూబగుంట నారాయణ కవి పంచతంత్రం | శ్రీమతి బి.టి. పద్మినీదేవి | — | యం.ఫిల్. | 1976 |
| 4. | మధురవాణి విలాసం సంశోధనాత్మక అధ్యయనం | డా॥ వి. బుచ్చారెడ్డి | — | పిహెచ్.డి. | 1980 |
| 5. | *కోఱవి గోపరాజు కవిత్వం | డా॥ ఎ. భూమయ్య | | యం.ఫిల్. | 1976 |
| 6. | చంద్రాంగద చరిత్ర ఒక పరిశీలన | శ్రీ మాణిక్ ప్రభు | — | యం.ఫిల్. | 1981 |
| 7. | చిన్నన్న అష్టమహిషీ కల్యాణం-విమర్శాత్మక పరిశీలన | శ్రీమతి వి. రేణుకాదేవి | — | యం.ఫిల్. | 1979 |
| 8. | మంచన కేయూరబాహు చరిత్ర | శ్రీమతి వి. విజయలక్ష్మి | — | యం.ఫిల్. | 1979 |
| 9. | హంసవింశతి-సమకాలీన జీవిత విధానం | డా॥ జి. వెంకటరత్నం | — | యం.ఫిల్. | 1975 |
| 10. | హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం | డా॥ జి. వెంకటరత్నం (కాకతీయ వి.వి.) | — | పిహెచ్.డి. | 1978 |
| 11. | *క్రీడాభిరామం- సాంఘిక, సాంస్కృతిక విశేషాలు | డా॥ రంగాచార్య | — | యం.ఫిల్. | 1980 |
| 12. | *శుకసప్తతి-సమకాలీన జీవిత చిత్రణ | డా॥ బి. సుమిత్ర | — | పిహెచ్.డి. | 1979 |
| 13. | జైమినీ భారతం- సంశోధనాత్మక పరిశీలన | డా॥ యం. వీరేశలింగం | — | పిహెచ్.డి. | 1978 |
| 14. | శివభారతం- సవిమర్శాత్మక పరిశీలన | శ్రీమతి పద్మావతి | — | యం.ఫిల్. | 1978 |

**శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రబోధ చంద్రోదయ విమర్శ-తులనాత్మక పరిశీలన | మల్లెం గురవయ్య | జె. సూర్యనారాయణ | పిహెచ్.డి. | 1976 |
| 2. | సీతారామాంజనేయ సంవాద కావ్యము | డా॥ రత్నాకర బాలరాజు | డా॥ జీరెడ్డి చెన్నారెడ్డి | ,, | 1977 |
| 3. | కవికర్ణ రసాయన కావ్య పరిశీలన | డా॥ జి. చలపతి | డా॥ యం. సుబ్బారెడ్డి | ,, | 1978 |
| 4. | విష్ణుమాయా నాటకము సవిమర్శ సమీక్ష | ఇ. రెడ్డమ్మ | | యం.ఫిల్. | 1978 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5. | రాధా మాధవము-ఒక పరిశీలన | శ్రీమతి జె. సంధ్యాదేవి | డా॥ నాగయ్య | యం.ఫిల్. | 1978 |
| 6. | భానువద్విజయ ప్రబంధ సవిమర్శక పరిశీలన | శ్రీ పి. జయరామరెడ్డి | డా॥ జి.యస్. రెడ్డి | యం.ఫిల్. | 1980 |

**మద్రాసు విశ్వవిద్యాలయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రాజశేఖర చరిత్ర | డా॥ ఉమ | — | పి.హెచ్.డి. | 1978 |
| 2. | *భోజరాజీయం- ఒక పరిశీలన | శ్రీమతి తులసీబాయి | — | యం.ఫిల్. | 1979 |
| 3. | జక్కన విక్రమార్క చరిత్ర విమర్శనాత్మక పరిశీలన | డా॥ టి. నీరజ | — | పిహెచ్.డి. | 1980 |
| 4. | *కూచిమంచి తిమ్మకవి అచ్చ తెలుగు కావ్యాలు-ఒక పరిశీలన | డా॥ సి. మనోజ | — | పిహెచ్.డి. | 1979 |
| 5. | *భోజరాజీయము-పరామర్శ | డా. యస్. పి. శివారెడ్డి | — | పిహెచ్.డి. | 1980 |
| 6. | కేయూరబాహు చరిత్ర | డా. కె. షణ్ముగపిళ్లై | — | ,, | 1981 |
| 7. | *చేమకూర సారంగధర చరిత్ర | డా. యస్. సెల్వరాజ్ | — | ,, | 1981 |
| 8. | గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము | శ్రీమతి యం. ఆర్. గీత | — | యం.ఫిల్ | 1980 |

**బెంగుళూరు విశ్వవిద్యాలయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తెలుగు ప్రబంధ ప్రక్రియలో సంస్కృత నాటకము | డా. డి. రాజ్వేరి | డా. టి. వి. సుబ్బారావు | పిహెచ్.డి | 1978 |

**కాకతీయ విశ్వవిద్యాలయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | హంసవింశతి-విజ్ఞానసర్వస్వం | జి. వెంకటరత్నం | — | పిహెచ్.డి | 1978 |
| 2. | *భోజరాజీయ కావ్యానుశీలనము | డా. వి. సీతాలక్ష్మి | — | ,, | 1980 |

**శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తిమ్మక్క సుభద్రా కల్యాణము | శ్రీమతి ఉమాదేవి | డా॥ టి. కోటీశ్వరరావు | యం.ఫిల్ | 1977 |
| 2. | రామాభ్యుదయము-ప్రబంధ లక్షణాలు | శ్రీ కె. దైవాధీనం | డా॥ టి. కోటేశ్వరరావు | ,, | 1978 |
| 3. | ఘటికాచల మాహాత్మ్యము-భాషా విశేషాలు | యస్. కుమారదేవి | డా॥ యస్. ఆర్. శర్మ | ,, | 1979 |
| 4. | ఘటికాచల మాహాత్మ్యము-కావ్య పరిశీలన | శ్రీమతి వసుంధర | డా॥ టి. కోటేశ్వరరావు | ,, | 1979 |
| 5. | *సారంగధర చరిత్ర-ఒక సమీక్ష | శ్రీ కుళ్ళాయప్ప | డా॥ శ్రీనివాసరెడ్డి | ,, | 1979 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6. | *క్రీడాభిరామము-అధిక్షేప కావ్యము | శ్రీ కె.నారాయణరెడ్డి | డా॥ ఆర్. సి. రెడ్డి | ,, | 1979 |
| 7. | ఉద్భటారాధ్య చరిత్ర-ఒక పరిశీలన | శ్రీ పద్మనాభరెడ్డి | డా॥ శ్రీనివాసరెడ్డి | ,, | 1979 |
| 8. | *శుకసప్తతి - దేశీయతాచిత్రణ | శ్రీ సి.వెంకట్రామిరెడ్డి | డా॥ ఆర్.సి. రెడ్డి | ,, | 1979 |

**2. పరోక్షకావ్య పరిశోధన పద్ధతి:-** ఈ విభజనలో విషయ మిది. ఒక కవి యొక్క కృతుల నన్నిటిని పరిశోధనాంశముగా గ్రహించడం. శ్రీనాథ కావ్య పరిశీలన ఇత్యాదిగా వచ్చిన సిద్ధాంత గ్రంథాలలో భీమఖండం, కాశీఖండం వంటి కావ్యాలమీద విమర్శలు చేయడం జరుగుతుంది కనుక, ఇది పరోక్ష పద్ధతి అనుకోవాలి. ఇందులో మరొక భేదం ఏమంటే, ఏదో ఒక సిద్ధాంత దృష్ట్యా కవి కృతుల నన్నిటిని సామూహికంగా పరిశీలించడం.

ఉ॥ శ్రీనాథుని కృతులలో అలంకారము.

ఈ పద్ధతిలో ఆయా కావ్యాల పరిశీలన జరుగుతుంది కనుక ఇదొక భేదంగా గ్రహించాలి. ఈ రెండు పద్ధతుల పరిశోధనల వివరాలివి.

**ఆంధ్ర విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు/రాలు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|
| 1. | శ్రీనాథుడు - ఆంధ్రీకరణ విధానము చారిత్రక విశేషాలు | డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి | పిహెచ్.డి | 1965 |
| 2. | తెనాలి రామకృష్ణుని కావ్యపరిశీలన | డా॥ ఇ. కృష్ణమాచార్య | ,, | 1965 |
| 3. | శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము | డా॥ జె.బి. జయకృష్ణప్రసాద్ | ,, | 1973 |
| 4. | తాళ్లపాక కవుల సాహిత్యసేవ | డా॥ అద్దేపల్లి విద్యావతి | ,, | 1975 |
| 5. | రెడ్డిరాజుల కాలంలోని ప్రధానేతరాంధ్రకవులు | దువ్వూరు విమల | ,, | 1976 |

**ఉస్మానియా విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | తెలుగులో హరివంశాలు | డా॥ యశోదారెడ్డి | పిహెచ్.డి. | 1968 |
| 2. | రంగాజమ్మ కావ్యాల్లోని భాష | శ్రీమతి రె. కుసుమాబాయి | యం.ఫిల్ | 1976 |
| 3. | *తాళ్ళపాక తిరువేంగళ నాథుని కృతులు | శ్రీ సి. గోపాలకృష్ణమాచార్యులు | ,, | 1976 |
| 4 | తంజావూరు నాయకరాజులకాలంలోని ఆంధ్ర కవయిత్రులు - రంగరాజమ్మ | శ్రీమతి యం. భారతి | ,, | 1975 |
| 5. | అవతారికలు - ఆంధ్రదేశచరిత్ర | డా॥ యం. దీనావతి | పిహెచ్.డి. | 1977 |
| 6. | *ఆంధ్ర సాహిత్యంలో హరిశ్చంద్రోపాఖ్యానం | డా॥ వి. ప్రభావతీ దేవి | ,, | 1975 |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | మహాకవి రఘునాథ భూపాలుడు | డా॥ ఆర్.యల్. కామేశ్వరరావు | ,, | 1979 |
| 8. | పింగళి సూరన - అతని రచనలు | డా॥ జి. రామకృష్ణరాయణం | ,, | 1972 |
| 9. | ఆంధ్ర సారస్వతమండలి అద్వైతతత్త్వ కావ్యములు | డా॥ యస్. పరబ్రహ్మశాస్త్రి | ,, | 1973 |

**శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | తరిగొండ వెంకమాంబ కృతులు సవిమర్శక పరిశీలన | డా॥ జి. కృష్ణమూర్తి | పిహెచ్.డి | 1981 |
| 2.* | తెలుగులో హరిశ్చంద్ర కథ | డా॥ ఐ.వి. పద్మాకరరెడ్డి | ,, | 1978 |
| 3. | తెలుగులో విప్రనారాయణ కథ - తులనాత్మక పరిశీలన | శ్రీ ఏ. బాలకృష్ణారెడ్డి | యం.ఫిల్ | 1978 |

**మద్రాసు విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1.* | మొల్ల రామాయణం - ఒక పరిశీలన | సత్యమ్మ | యం.ఫిల్ | 1979 |

**బెంగుళూరు విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | తెలుగు ప్రబంధ ప్రక్రియలలో సంస్కృత నాటకత | డా॥ డి. రాజేశ్వరి, | పిహెచ్.డి | 1978 |

**హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సాంత్వన కావ్యాలు శృంగార నాయికలు | బి. జయరాములు | యం.ఫిల్ | 1982 |

ఈ వింగడింపులో 'ప్రబంధాల్లో ప్రకృతి వర్ణనలు' (డా॥ అంతటి నరసింహం - పరిశోధకుడు) వంటివి గ్రహించలేదు. ఎందుకంటే కేవల ప్రబంధాలు మనుచరిత్రాదులనే గ్రహించి చేసిన విమర్శ కనుక కావ్యాలు గ్రహించలేదు. కనక, ఈ పరిధి కిలాంటివి రాదుగవు.

**ఉస్మానియా విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | దక్షిణదేశ ఆంధ్ర వాఙ్మయం సాంఘిక జీవితం | డా॥ బి. విజయభారతి | పిహెచ్.డి | 1969 |
| 2.* | అచ్చతెలుగు కృతులు-పరిశీలన | డా॥ కె.వి. సుందరాచార్యులు | ,, | 1978 |
| 3. | కేతన - అతని కృతులు | డా॥ హరిశివకుమార్ | ,, | 1968 |
| 4. | తెలుగులో చారిత్రక కావ్యాలు | డా॥ వి. సీతాకళ్యాణి | ,, | 1973 |
| 5.* | మొల్ల రామాయణం | శ్రీమతి సి. హేమ | యం.ఫిల్ | 1977 |

* ఈ గుర్తులు ఉంచిన పరిశోధనలు చూస్తే ఒకే అంశంమీద భిన్న విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరుగుతున్నాయన్న మాట తెలుస్తున్నది. దీనిక్కారణం వాటిమధ్య పరస్పరం తెలుసుకొనే సదుపాయాలులేకపోవటం. దీనికి నివారణ పరిశోధన పత్రికలు నెలకొల్పుకోవటమే. ఇందులో కావ్యాలు ఏ దృక్కోణంతో పరిశోధింపబడుతున్నవో- భాషాదృష్టి, సాహిత్యదృష్టి, ప్రత్యేక సిద్ధాంత దృష్టి- వివరణతోపాటు ప్రచురించటం వల్ల ఒక సదవగాహన ఏర్పడుతుంది. విశ్వవిద్యాలయాలు ఈ విషయం గ్రహించినా (80 లో కాబోలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖ పరిశోధన పద్ధతులమీద ఒక సదస్సును నిర్వహించింది. అందులో ఈ పత్రికావసరాన్ని గుర్తించటం మాత్రమే జరిగింది. కాని దాని కింకా రూపురేఖలు ఏర్పడలేదు) ఆచరణలోకి మాత్రం రాలేదు.

**పీఠిక :** పై అస్థిపంజరానికి రూపకల్పన ప్రయత్నంగా తెలియవచ్చినంత-చేతి కందివచ్చినంత పరిశోధనల సారాంశాలు గుదిగ్రుచ్చబడుతున్నవి.

**ఆంధ్ర విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు/రాలు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 1. | కుమారసంభవ విమర్శ | డా॥ టి. నిర్మల | ఆచార్య కె. వి. నరసింహం | పిహెచ్. డి. | 1967 |

ఇది సాహిత్య విమర్శ గ్రంథం. ఇందులో 9 ప్రకరణా లున్నవి.

1. కవికాలాదులు - ఇందులో శాసనాలను, కావ్య అంతర్గత సాక్ష్యాలనుబట్టి కవికాలం నన్నయ, తిక్కనల మధ్యకాలంగా నిర్ణయించబడ్డది.

2. కథామూలం, కూర్పులు చేర్పులు-పూర్వ మూలకథలతో పోలిక లిందు చెప్పబడ్డాయి.

3. అనువాద విధానం-అనువాదస్వరూపం చర్చించబడి, గౌరీకళ్యాణ విషయంగా, శ్రీనాథునికి నన్నెచోడునికి మధ్యవున్న తారతమ్యాలు విశదీకరింపబడ్డాయి.

4. ప్రబంధత్వం - ఇందులో ప్రబంధ లక్షణాలు వివరింపబడి, కావ్యానికి సమన్వయింపబడ్డాయి.

5. పాత్రపోషణ, 6. కవితా శిల్పం - ఇందులో కవి రచనాశిల్పము, సంవిధానమూ కవితలో వున్న మార్గ దేశిభేదాలు, కావ్యభాషా స్వరూపము చర్చించబడ్డాయి.

7. కవితా సంప్రదాయాలు, 8. మతము-ఈ అధ్యాయంలో కవి. ఆగమ శైవ సంప్రదాయాలు వివరించబడ్డాయి.

9. సాంఘిక రాజకీయ పరిస్థితులు - ఇందులో నాటి సమాజ స్వరూపం కావ్యంలో భంగ్యంతరంగా చెప్పబడినట్లు నిరూపించబడ్డది.

| | పరిశోధన | పరిశోధకుడు/రాలు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 2. | తెలుగు సాహిత్యంలో చారిత్రక గ్రంథాలు (17 వ శతాబ్దిలో వరకు) | డా॥ బి. అరుణకుమారి | ఆచార్య కె.వి. నరసింహం | పిహెచ్.డి. | 1972 |

తెలుగులో వున్న చారిత్రక కావ్యప్రక్రియను పరిశీలించడానికి ఉద్యమించిన గ్రంథం. ఇది ద్వాదశ ప్రకరణాత్మకము. ఇందులో పరిశీలింపబడిన చారిత్రక కావ్యాలు- 1. వల్లభాభ్యుదయం.

ఈ కావ్యం ఆంధ్ర విష్ణువు కథను, ఆయన విగ్రహాన్ని పునఃప్రతిష్ఠించిన సుమతి, అనంతపాలుడు మొదలగువారి గాథలను వర్ణించింది. పల్లభాభ్యుదయ కావ్య విచారణ ద్వితీయ ప్రకరణంలో చేయబడింది. తృతీయంలో నవచోళ చరిత్ర. క్రీ. శ. 5 వ శతాబ్దంనుండి 13 వరకు ఆంధ్రదేశాన్ని పరిపాలించిన చోళ చక్రవర్తులు ముక్కంటి చోళుడు, భాస్కర చోళుడు మొ॥ వారిని వర్ణిస్తున్న దీ కావ్యం. దీని పరిశీలనం ఈ ప్రకరణ విషయం.

చతుర్థం : కాకతీయ వంశాన్ని వర్ణించే శ్రీ సిద్ధేశ్వర చరిత్ర ఇందులో పరిశీలింపబడింది.

పంచమం - 12 వ శతాబ్దంలోని పల్నాటి యుద్ధకథలు, చారిత్రక అంశాలు, నాటి స్థితిగతులు మొ॥ చర్చించబడ్డవి.

షష్ఠ ప్రకరణంలో 13 వ శతాబ్దిలో జరిగిన కాటమరాజు యుద్ధకథలు ప్రస్తావించబడ్డాయి.

సప్తమంలో రాయవాచకము, కృష్ణరాయ విజయము వంటి గ్రంథాల పరిశీలన జరుపబడింది.

అష్టమంలో 12 వ శకంనుండి 17 దాక సాగిన ఆరవీటి రాజుల చరిత్ర గ్రంథం రామరాజీయం విచారించబడింది.

నవమంలో తంజాపుర ఆంధ్రనాయక రాజుల చరిత్రను చెప్పే కావ్యాలు పరిశోధింపబడ్డాయి.

దశమంలో పండితారాధ్య చరిత్ర, బసవ పురాణాలు, తత్సంబంధికమైన వ్యక్తుల జీవిత విశేషాలు ప్రస్తావించబడ్డాయి.

ఏకాదశ ప్రకరణంలో అన్నమాచార్యుల జీవిత విశేషాలకు సంబంధించిన కథాగ్రంథాలు, ద్వాదశంలో క్రీడాభిరామం ఆధారంగా 15 వ శతాబ్దినాటి సాంఘిక పరిస్థితులు చిత్రించబడ్డాయి.

| | పరిశోధన | పరిశోధకుడు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 3. | విజయవిలాసానుశీలనము | డా॥ కె. వెంకటరామరాజు | ఆచార్య టి. దొణప్ప | పిహెచ్.డి | 1972 |

ఇది విజయవిలాసాన్ని సాహిత్య దృష్ట్యా విచారించిన సిద్ధాంత గ్రంథం. ఇది 9 ప్రకరణాల గ్రంథం.

1. కవి జీవిత విశేషాలు నాటి సాంఘిక విషయాలు, కవిమీద వాటి ప్రభావం.
2. దక్షిణాంధ్రయుగ కవితావైశిష్ట్యం. 3. చేమకూర కవితా వైశిష్ట్యం.
4. విజయవిలాస ప్రత్యేకత. 5. విజయవిలాస మూలకథ. 6. శృంగార రస భంగిమలు.
7. జాతివార్తా చమత్కారాదులు. 8. జాతీయాలు, నుడికారాలు. 9. గుణదోషాలు.

**కాకతీయ విశ్వవిద్యాలయం**

| | | | | |
|---|---|---|---|---|
| 4. హంసవింశతి-విజ్ఞాన సర్వస్వము | డా॥ జి. వెంకటరత్నం | — | పిహెచ్.డి | 1978 |

ఇది హంసవింశతిని సాహిత్య దృష్ట్యా పరిశీలించిన గ్రంథం. ఇందులో ఐదు అధ్యాయా లున్నాయి.

1. కృతికర్తదేశకాలాలు. 2. ఇతర పద్యకథాకావ్యాలతో దీనికున్న పోలిక.
3. హంసవింశతి-శృంగార ప్రబంధం. 4. సమకాలీన జీవిత విధానం. 5. విజ్ఞాన సర్వస్వం.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5. | కేతన | డా॥ హరిశివకుమార్ | డా॥ కె. రామకోటిశాస్త్రి | పిహెచ్.డి | 1978 |

ఇది కేతన కృతుల సమీక్ష. దశకుమార చరిత్ర విమర్శన ముఖ్య కనుక ఈ పరిధిలోకి వస్తున్న గ్రంథం.

ఇది మూడు ప్రకరణాల గ్రంథం. ప్రథమ ప్రకరణంలో దశకుమార చరిత్ర. ద్వితీయంలో ఆంధ్ర భాషాభూషణం, తృతీయంలో విజ్ఞానేశ్వరము విమర్శింపబడ్డవి. మూడనుబంధములు కూర్చబడినవి.

1 **దశకుమార చరితము**

"1. కథాకావ్య ప్రక్రియా వివేచనము, 2. దండి దశకుమార చరిత్ర, 3. దశకుమార చరిత్రము-అనువాద పద్ధతి, 4. దశకుమార చరిత్రము-పాత్రచిత్రణము, 5. దశకుమారచరిత్రము-రసభావములు, 6. కేతన కవితాశక్తి, 7. కేతన రచనాపాటవము, 8. ఆంధ్ర కథాకావ్యములు-దశకుమార చరిత్రము" అనుబంధత్రయంలో మొదటిది - "దశకుమార చరిత్రము - కేతన చిత్రించిన తెక్కన"

**మైసూరు విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 6. | చేమకూర వెంకటకవి గ్రంథాలు | డా॥ వి. నారాయణరెడ్డి | ఆచార్య జి. రెడ్డి చెన్నారెడ్డి | పిహెచ్.డి | 1972 |

ఇందులో సారంగధర చరిత్ర, విజయవిలాస కావ్యముల యొక్క సాహిత్య విచారణ చేయబడ్డది. ఈ రెండు కావ్యాల పౌర్వాపర్యములు మూలకథలు, మార్పులు, చేర్పులు, కవికాలాదులు, కథానిర్మాణము, రసపోషణ దక్షత, ఆలంకారిక విషయములు నిరూపింపబడ్డవి. ఈ కావ్యాలలో కవి ప్రయోగించిన భాషా స్వరూపము ఆ కాలపు వ్యావహారిక భాషా స్వరూపము, వ్యాకరణ విశేషాలు చర్చించి దక్షిణాంధ్ర కవుల్లో వెంకటకవి స్థానం నిర్ధారించబడింది. ఇది ఐదు ప్రకరణాల గ్రంథం.

**శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం**

| | పరిశోధన | పరిశోధకుడు | ప్రచోదకుడు | డిగ్రీ | కాలము |
|---|---|---|---|---|---|
| 2. | ప్రబోధచంద్రోదయ విమర్శ - తులనాత్మక పరిశీలన | యం. గురవయ్య | డా॥ జె. సూర్యనారాయణ | పిహెచ్.డి | 1972 |

ఇది 16 అధ్యాయాల గ్రంథం

1. సింబాలిజమ్, అలిగరి - వేదాల్లో వీటి స్థానం, ప్రతీక రూపక రచనా ప్రయత్నం.
2. సారస్వతం - వేదాంతం ఈ రెండు ప్రతీక రూపకాల్లో సమన్వితమైన పద్ధతి.
3. ప్రబోధచంద్రోదయంలోని పాత్రలు, కథావస్తువు, వీటి వైశిష్ట్యము, భారత ఇతివృత్తానికి దీనికి వున్న సంబంధం, షడ్దర్శనాలు - ప్రబోధచంద్రోదయం.
4. తత్త్వగ్రంథాలు - నాటకాలు ప్రబోధచంద్రోదయంలో ఫలించిన రూపక ప్రయోజనం, ప్రతీకరూపకాలు ప్రబోధచంద్రోదయం.
5. కృష్ణమిశ్రుని ప్రతిభ, నాటకలక్షణాల్లను అన్వయించి స్థాపించడం.
6. రసనిర్ణయం.

7. ఇతర తాత్త్విక నాటకాలు, వాటి అప్రసిద్ధికి కారణాలు.
8. ప్రబోధ చంద్రోదయానికి వ్యాఖ్యానాలు - అనువాదాలు.
9. అనువాదాలు, శ్రవ్యకావ్యాలుగా రావటంలోని కారణాలు.
10. జంట కవిత్వము - ఆవిర్భావ వికాసాదులు. తెలుగు ప్రబోధచంద్రోదయ కావ్యంలో నాటక లక్షణాలు.
11. సంస్కృత నాటకాలు తెలుగులోని శ్రవ్యకావ్యాలుగా వచ్చినకాలం - ఇతర కవులు.
12. మూల - అనువాద రహస్యాలు.
13. వరాహపురాణానికి, ప్రబోధచంద్రోదయానికి వున్న భేద సాదృశ్యాలు - ఛందశ్శిల్పము, పదప్రయోగ వైచిత్రి మొదలైనవి.
14. ఇతర భాషలలో ప్రతీకప్రధాన గ్రంథాలు, వాటితో ప్రబోధచంద్రోదయానికున్న భేద సాదృశ్యాలు.
15. శంకరాద్వైత దర్శనము - ప్రబోధచంద్రోదయం అనుసరణ.
16. విభిన్నమత సిద్ధాంతాలు - వాటి ఖండన పద్ధతి, కృతికర్త - కృతిభర్తల అద్వైతదృష్టి - తత్త్వ ప్రధానమైన ఈ గ్రంథంలో కావ్యత్వం.

8. సీతారామాంజనేయ సంవాదకావ్యము- సమాలోచనాత్మక పరిశీలనము రాజయోగదర్శనము డా॥ రత్నాకర బాలరాజు డా॥ జి. రెడ్డి చెన్నారెడ్డి పిహెచ్.డి 1977

ఈ అద్వైతగ్రంథాన్ని వేదాంత - సాహిత్యదృష్ట్యా సమీక్షించాడు పరిశోధకుడు.

1. ప్రకరణం - భారతవర్ష వైభవము - వేదోపనిషత్తుల విషయం చెప్పబడ్డది.
2. ప్రకరణం ఆంధ్ర వాఙ్మయమున అద్వైతజ్ఞాననిష్ఠులైన మహాకవులు. ఇందులో తిక్కనాది కవుల ప్రస్తావన వుంది.
3. ప్రకరణం - గురుమూర్తికవి దేశకాలములు.
4. ప్రకరణం - గురుమూర్తి కవియొక్క ఆధ్యాత్మిక చింతనం.
5. ప్రకరణం - యోగజిజ్ఞాస
6. ప్రకరణం - కాపిల సాంఖ్యదర్శన విచారము
7. ప్రకరణం - పాతంజలయోగదర్శన విచారము
8. ప్రకరణం - దర్శనసాంఖ్య యోగములు - అద్వైతము
9. ప్రకరణం - అనుబంధ చతుష్టయము
10. ప్రకరణం - వక్తృశ్రోతృ వైలక్షణ్యములు
11. ప్రకరణం - భక్తియోగము - శ్రీరామనామము - భగవన్నామ సిద్ధాంతము
12. ప్రకరణం - శ్రీరామహృదయము
13. ప్రకరణం - తారక యోగానుభవ విచారము
14. ప్రకరణం - సాంఖ్యయోగానుభవ విచారము

15. ప్రకరణం - అమనస్క యోగానుభవ విచారము
16. ప్రకరణం - గురుమూర్తికవి - కవితావైదుష్య విచారము
17. ప్రకరణం - రాజయోగము - రసానుభవము
18. ప్రకరణం - శాంతమే రసరాజము

ఇలా ఇది 18 ప్రకరణాల గ్రంథం. గ్రంథానికనుబంధంగా ''సీతారామాంజనేయ సంవాదము'' కావ్యము కూర్చబడినది.

**శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం**

9. రామాభ్యుదయము- శ్రీ కోనంకి దైవాధీనం డా॥ బి. కోటీశ్వరరావు యం.ఫిల్. 1978
ప్రబంధ లక్షణములు

భూమిక - రామభద్రుడు అష్టదిగ్గజ కవులలోని వాడేనని సోపపత్తికంగా నిరూపింపబడినది. అతని జీవితమూ, వంశాదికమూ నిరూపితాలైనవి. రామరాజభూషణునకు నీతనికి గల సంబంధం రామాభ్యుదయ రచనాకాలము చర్చింపబడినది.

1. అధ్యాయం :- ప్రబంధ మంటే ఏమిటి ? ప్రబంధ శబ్దాన్ని ఎవ రెవ రే యే యర్థాల్లో ప్రయోగించారో చర్చింపబడినది. ప్రబంధ లక్షణములను తెల్పి రామాభ్యుదయమునకు సమన్వయింపబడ్డవి.
2. అధ్యాయం :- అష్టాదశ వర్ణనలు తెల్పి రామాభ్యుదయంలోని అష్టాదశవర్ణనములు విశదీకరింపబడినవి. వసంత, హేమంత, వర్ష, శరదృతు వర్ణనలు చర్చించి, అవి కథాగతికి ఎట్లు దోడ్పడినవో చూపబడ్డవి.
3. అధ్యాయం :- రామభద్రుని కవితావైఖరి, శైలీ, సమాసాలూ, జాతీయాలూ, నుడికారాలూ, లోకోక్తులూ, కొన్ని వింత ప్రయోగాలూ, అతని శబ్దాలంకార ప్రియత్వం, భావనావైదుష్యం, ఇతివృత్తగతౌచిత్యం కూలంకషంగా చర్చింపబడినవి.
4. అధ్యాయం :- రామాయణం కరుణ రసప్రధానం కాగా ప్రస్తుత ప్రబంధంలో ధర్మవీరమే అంగి రసంగా ప్రతిపాదింపబడి, శృంగార, హాస్య, కరుణాదులు అంగాలుగా కూర్చుకొన్నట్లు నిరూపింపబడినవి.

**శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం**

10. తాళ్ళపాక తిమ్మక్క- శ్రీమతి పి. ఉమాదేవి డా॥ టి. కోటీశ్వరావు యం.ఫిల్. 1977
సుభద్రాకల్యాణము

ఇది ఐదు ప్రకరణాలుగా విభజింపబడినది.

భూమిక - ఇందులో తిమ్మక్క కాలాన్ని గూర్చిన విషయం, తాళ్ళపాక వంశసంగ్రహ చరిత్ర వ్రాయబడినది.

1. ప్రకరణం :- ఇందులో మూలగ్రంథమైన భారతానికీ, సుభద్రాకల్యాణానికి గల మార్పులు గుర్తింపబడినవి. కథ భారతంలో నుండే గ్రహింపబడినా స్త్రీయైనందువలన కొన్ని స్త్రీ సహజమైన భావాలు చిత్రించటం, కవయిత్రి చేసిన మార్పులు, ప్రకృతి సిద్ధమై మానవ స్వభావ చిత్రీకరణకు మార్గం వేసినది.

2. ప్రకరణం :- ఈ ద్విపదలోని భాషావిశేషాలనగా అప్పటి దేశీయ పదజాలం, వ్యావహారికాలైన సామెతలు, జాతీయాలు చెప్పబడినవి. మరికొన్ని వ్యాకరణ విరుద్ధాలైన పదాలూ, పాటగా వ్రాయబడినందువలన గణ విభజనయందు ప్రాసాదులయందు చేసిన మార్పులు సూచింపబడి సరిదిద్దబడినవి.

3. ప్రకరణం :- ఇది నాటి సాంఘిక విషయ విస్తరణాధ్యాయం. ఇందులో దేశీయత, ఆచార సంప్రదాయాలూ చెప్పబడినవి. ఇం దానాడు ప్రసిద్ధముగనున్న ఆచారవిశేషాలూ, ప్రజల వేడుకలూ, వినోదాలూ, ముఖ్యంగా వివాహ విశేషాలు చెప్పబడినవి.

4. ప్రకరణం :- ఇందులో మంజరీ ద్విపదను చేపట్టటంలోని ఉద్దేశం, దీనిశైలి లక్షణం, వివరింపబడి, రచన చేయటానికి సులభం కాబట్టి-ద్విపద యొక్క ప్రాచీనతను గమనించి, తన పూర్వు లేర్పాటు చేసిన పద కవితను గ్రహించి యుండవచ్చునని నిర్ణయింపబడినవి.

5. ప్రకరణం :- ఇందులో సుభద్రా కల్యాణ కావ్య మితర కావ్యాలపై చూపిన ప్రభావాన్ని ముఖ్యంగా విజయ విలాసం, రాధికా స్వాంతనం వంటివి-వానికి గల భేద సాదృశ్యాలు గమనింపబడినవి.

11. ఉద్భటారాధ్య చరిత్ర శ్రీ యస్. పద్మనాభరెడ్డి డా॥ వి.యల్. శ్రీనివాసరెడ్డి యం.ఫిల్. 1979

పరిశోధనా ప్రణాళిక, ఐదు ప్రకరణాలుగా విభజింపబడినది. మూలం పాల్కురికి సోమన బసవ పురాణం.

1. అధ్యాయం :- ఉద్భటారాధ్య చరిత్ర ప్రబంధ కాలనిర్ణయం చేయబడ్డది. రామకృష్ణుడు రామలింగడు అభిన్నులన్న వాదాన్ని బలపరచి. అష్టదిగ్గజాలలో వొక్కడని నిరూపించటం జరిగింది.

2. అధ్యాయం :- బసవ పురాణంలోని కథకు ఉద్భటారాధ్య చరిత్రలోని కథకూ గల భేద సాదృశ్యములను పోల్చిచూడటం జరిగింది. ఆనాటి సాంఘిక పరిస్థితుల్లో వైష్ణవ మత ప్రాబల్యాన్ని గురించి చెప్పబడినది.

3. అధ్యాయం :- కావ్యశైలి సుకుమారమని నిరూపించడం. ఈ కావ్యంలో ప్రతి అశ్వాసాంత గద్యలో కవి తాను 'కుమారభారతి' బిరుదాభిరాముడుగా చెప్పుకొనటం జరిగింది. ఈ బిరుదు ప్రాముఖ్యం శైలితో సమన్వయింపబడ్డది.

4. అధ్యాయం :- ప్రబంధాల్లో కథా నిర్మాణం. వర్ణన సౌందర్యం, రసపోషణ, అలంకారాలు, ప్రయోగాల గురించి స్థూలంగా చర్చింపబడినది.

5. అధ్యాయం :- జాతీయాలు, భాషా విశేషాలు, స్థాలీ పులాక న్యాయంగా వివరించబడవి.

## శ్రీ కృష్ణదేవరాయల విశ్వవిద్యాలయం

12. సారంగధర చరిత్ర-ఒక సమీక్ష శ్రీ డి. కుళ్లాయప్ప డా॥ పి.యల్. శ్రీనివాసరెడ్డి యం.ఫిల్. 1979

విషయ విభజన ;- విషయం ఐదధ్యాయాలుగా విభజింపబడినది.

1. అధ్యాయం :- ఈ అధ్యాయమున వేంకటకవి కాల, నివాస, రచనాది విషయాలు, అతని వైయక్తిక జీవితం స్థూలంగా చర్చింపబడ్డాయి.

2. అధ్యాయం :- సారంగధర చరిత్రకు ఆధారాలైన నవనాథ చరిత్రలోని కథ, తత్కథతో ఈ కథకు గల భేద సాదృశ్యాలు సమీక్షింపబడ్డాయి. లభించిన గ్రంథాలకూ, బహిరాధారమును బట్టి ప్రస్తుత కథ కల్పన గాక చారిత్రకమనే చెప్పబడ్డది. సారంగధర చరిత్ర సదృశ కథలతో సరిపోల్చి సారంగ ధరు డెవరు అను విషయం తేల్చి చెప్పబడ్డది. ఈ కథమీద పాశ్చాత్య ప్రభావం కంటె ప్రాచ్య కథా ప్రభావమే ఎక్కువని చెప్పబడింది.

3. అధ్యాయం :- ఇందులో కావ్య ప్రయోజనం విశదీకరింపబడ్డది. సమకాలీన జీవితాని కనుగుణమైన కథను స్వీకరించి ధర్మోపదేశ ప్రాతిపాదికగా కవి రచన చేసినట్లు వివరింపబడినది.

4. అధ్యాయం :- చివరి అధ్యాయంలో అంగిరసం నిరూపించబడినది. అందుకు గల ఉపపత్తులు విశ్లేషింప బడినవి.

13. సింహాసన ద్వాత్రింశిక శ్రీ బి. నారాయణ డా॥ యస్. ఆర్. శర్మ యం.ఫిల్. 1982

ఇది పై కావ్యంలోని సాహిత్య దృష్టిని విమర్శించే గ్రంథం. ఇందులో 9 ప్రకరణాలున్నాయి. 1. కవికాలాదులు, 2. కథాకావ్య లక్షణాలు, ఇతర వాఙ్మయంతో తులనాత్మక పరిశీలన-కథాకావ్యాల్లో రసము నీతి, 3. కథాకావ్యాల సంగ్రహ పరిచయం, 4. సింహాసన ద్వాత్రింశికకు మూలాధారాలు, 5. ఈ కావ్యానికి జక్కన విక్రమార్క చరిత్రకు కథలో వున్న భేదసాదృశ్యాలు, 6. సింహాసన ద్వాత్రింశిక-విజ్ఞాన సర్వస్వము, 7. కావ్యకథానీతి, 8. గోపరాజు కాలంనాటి సాంఘిక పరిస్థితి, 9. గోపరాజు కవితారీతి, భాషా విశేషాలు.

14. శుకసప్తతి-దేశీయతాచిత్రణ శ్రీ పి. వెంకట్రామరెడ్డి డా॥ ఆర్. సి. రెడ్డి యం.ఫిల్ 1979

ఇది 5 అధ్యాయాల గ్రంథం.

1. కవి దేశకాలాలు, 2. కవి సమకాలీన దేశకాల పరిస్థితులు - రచన, 3. శుకసప్తతి మూలం, పరిశీలన, 4. కదిరీపతి రచనా శిల్పం-హాస్యశృంగార రసపోషణ, 5. నాటి ప్రజల జీవన విధానం.

ఈ గ్రంథంలో 5వ అధ్యాయం ప్రధానమైన అధ్యాయం. నాటి ప్రజల వేషభాషలు, పండుగలు, పబ్బాలు, ప్రజల మనస్తత్వం, జీవన విధానాలు, పల్లీ వాతావరణ చిత్రణ, ఆచార వ్యవహారాలు మొ॥ చర్చింపబడ్డవి.

15. ఘటికాచల మాహాత్మ్యము- సుంకర కుమారదేవి డా॥ యస్. ఆర్. శర్మ యం.ఫిల్. 1979
భాషాప్రయోగ విశేషాలు

ఈ సిద్ధాంతవ్యాసం ఘటికాచలమాహాత్మ్యములోని ప్రయోగవిశేషాల్ని సమీక్షించిన గ్రంథం. ఇందులో అధ్యాయాలు ఆరు.

1. ధ్వనులు, 2. సంధి, 3. పదజాలం, 4. నామప్రక్రియ, 5. క్రియాప్రక్రియ, 6. జాతీయములు-పలుకుబడులు.

ఇవి సమీక్షితాంశములు. చివర్లో మూడనుబంధాలు కూర్చబడ్డాయి.
1. క్రియాధాతువులు, 2. శబ్దపల్లవాలు-జంటపదాలు, 3. ధ్వన్యనుకరణాలు.

16. ఘటికాచల మాహాత్మ్యము- ఒక పరిశీలన | శ్రీమతి యస్. వసుంధర | డా॥ కోటేశ్వరరావు | యం.ఫిల్ | 1979

ఈ సిద్ధాంతవ్యాసం సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథం. పీఠికలో రామకృష్ణుని దేశకాల మతవిశేషాలు తెలియచేయబడ్డాయి. ఇందులో మూడు ప్రకరణాలున్నాయి. 1. క్షేత్రమాహాత్మ్య సంప్రదాయము - దాని ప్రారంభ వికాసాలు తెలియజేసి దీని కాధారంగా ఇతిహాస, పురాణ, కావ్యాలలో ఎక్కడెక్కడ క్షేత్రమహాత్మ్య వివరణ వుందో, అది చర్చింపబడింది. ఇందులో తెలియచేయబడిన విషయాలు 1. క్షేత్రమాహాత్మ్య సంప్రదాయము, 2. ఘటికాచల మాహాత్మ్య కావ్యంలోని అష్టాదశ వర్ణనలు, 3. క్షేత్రమాహాత్మ్య కావ్యానికీ, ప్రబంధానికీ వున్న భేద సాదృశ్యాలు.

2. ఇందులో ఐదు విభాగాలు:- 1. ఘటికాచల చరిత్ర, 2. ఇతర కావ్యాల్లో ఘటికాచల ప్రసక్తి, 3. అవతారికా రచన, 4. స్థలపురాణం మూలకథ-మార్పులు చేర్పులు, 5. సంస్కృతములోని కావ్యానికీ దీనికీ వున్న భేదసాదృశ్యాలు. ఘటికాచలానికి ఆ పేరు రావడానికి చారిత్రక ఉపపత్తులు చూపబడ్డాయి. అవతారికలో కృతిపతిని గురించి, అవతారికా రచయితను గురించి చర్చింపబడ్డది.

3. ఇందులో రామకృష్ణుని శైలి రచనారీతులు వివరింపబడ్డాయి.

17. క్రీడాభిరామము-అధిక్షేప కావ్యము | శ్రీ కె. నారాయణ | డా॥ ఆర్.సి. రెడ్డి | యం.ఫిల్. | 1979

ఈ గ్రంథం క్రీడాభిరామాన్ని ఒక అధిక్షేప కావ్యంగా నిరూపిస్తున్నది. ఇందులో ఐదు ప్రకరణాలున్నాయి.

1. అధిక్షేప కావ్య ప్రక్రియ :- ఇందులో అధిక్షేప శబ్దవిచారము, అధిక్షేప కావ్య స్వరూపము, వ్యాజస్తుతి, వ్యాజనింద, అధిక్షేపానికి సెటైర్‌కు ఉన్న భేదసాదృశ్యాలు, అధిక్షేప కవితా స్వరూప విచారము, దాని ప్రయోజనము కావ్యత్వసిద్ధి చర్చితాంశాలు.
2. క్రీడాభిరామము- సాంఘిక జీవనము :- ఇందులో ఆనాటి సాంఘిక జీవన నిరూపణము-కవి దానిని అధిక్షేపించిన పద్ధతి, అధిక్షేపణలో ఉన్న వైవిధ్యము నిరూపించబడ్డవి.
3. క్రీడాభిరామ వస్తువు- దృశ్య శ్రవ్య వివాదము, వీధి లక్షణాలు, సమన్వయము, హాస్యరసము వైవిధ్యము నిర్వహణ-ఇవి ఇందులోని అంశాలు.
4. కవితా శిల్పము :- ఇందులో పద్య, వర్ణన, అలంకార శిల్పాలు చర్చింపబడ్డాయి.
5. ఆంధ్ర సాహిత్యమున క్రీడాభిరామస్థానము :- ఇందులో క్రీడాభిరామము - పికారెస్క్ - క్రీడాభిరామ నామ సార్థక్యము చర్చించబడ్డవి.

వ్రాసిన సారాంశాలను శోధిస్తే మన పరిశోధనలో ఒక క్రమ విన్యాసం కన్పిస్తుంది. ప్రతి పరిశోధకుడు కొన్ని పరిశోధన సూత్రాలు పాటించటం గమనార్హం. లోపాలున్నా ఒక పరిణామం ఒక వికాసం చూడదగ్గ విషయం.

ఇతోధికాభివృద్ధికి వేచి చూడాలి.



# శతకాలు, ఉదాహరణలు మొదలగు ప్రక్రియలపై పరిశోధన

—చల్లా రాధాకృష్ణశర్మ

వెయ్యేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో ఒక శతాబ్ది అత్యల్పం కాకపోయినా తత్తుల్య మనవచ్చు. అయినా గత శతాబ్దిలో వెలుగులోకి వచ్చిన తెలుగు సాహిత్యాన్ని అలవోకగా పరిశీలించినా అద్భుతావహంగా ఉంటుంది. ఎన్ని కొత్త పుంతలు! ఎన్ని మార్పులు! సంగ్రహంగా చెప్పాలంటే, గత నూరేండ్లలో వచ్చినన్ని మార్పులూ కూర్పులూ అపూర్వం అనక తప్పదు; అంగీకరించనూ తప్పదు. కొత్త సాహిత్య ప్రక్రియలతో పాటు పాతవి కూడా పరిపుష్టం చెందాయి. శతకం, ఉదాహరణం, నిఘంటువు మొదలైన ప్రక్రియలలో జరిగిన పరిశోధనా వ్యాసంగాన్ని పరిశీలించడం ప్రస్తుత వ్యాస రచనోద్దేశం.

**శతకాలు :**

తెలుగు సాహిత్యం ప్రచారంలోకి వచ్చినప్పటి నుంచీ వస్తున్న ప్రధాన శాఖలలో ప్రముఖమయింది శతకం. అది అల్ప కావ్యమే కావచ్చు. ఉదాత్తకావ్య శ్రేణిలో నిలవగలిగే శక్తి సంపన్నత దానికి లేకపోవచ్చు. కవితాశక్తి విరాట్ స్వరూపం అందులో పరిపూర్ణంగా ప్రదర్శితం కాకనూపోవచ్చు. రస చర్చకు అందులో తావు లేకపోవచ్చు. అయినా శతకంలో ఒక విశిష్టత లేకపోలేదు. అది ఆత్మాశ్రయ కవితారూపం. కవి హృదయాని కది కమనీయ దర్పణం. పండితుల్నీ అపండితుల్నీ సరిసమానంగా రంజింపజేసే రచనా ప్రక్రియ అది. పైగా శతకం ఎంత ప్రాచీనమో అంత ఆధునికం కూడా. వెల్లువలా కొత్త సాహిత్య ప్రక్రియలు వచ్చినా, ఇదానీం తనులకు మొగం మొత్తని పాత ప్రక్రియ ఇది. కనుకనే తెలుగులో వేల సంఖ్యలో శతకాలు వాడుకలోకి వచ్చాయి. ఆ వచ్చిన వాటిలో వైవిధ్యం ఎంత ఉందని! భక్తి, నీతి, వైరాగ్యం, హాస్యం, శృంగారం, అధిక్షేపం- ఇలా విభిన్న విషయాలు శతకాలకు ఆధారమైనాయి. చివరికి మనం అనాదరభావంతో చూసే విసనకర్ర, చీపురుపుల్ల, కుక్క మొదలైనవి కూడా శతకాల పుణ్యమా అని చిరంజీవిత్వం గడించాయి. కొందరు శతకకర్తలు వ్యాకరణ నియమోల్లంఘనం చేసివుండవచ్చు; మరికొందరిలో విద్వత్తు లోపించి వుండవచ్చు. అంతమాత్రాన శతకాల ప్రచారానికి లోపమేమీ రాలేదు. ఇవికాక అనువాద శతకాలూ తెలుగులో బహుళంగానే వచ్చాయి. కాగా, శతక సాహిత్యం విస్తృత మయిందని చెప్పడం చర్వితచర్వణం.

తెలుగు శతకం గురించి ప్రస్తావించేటప్పుడు మరొక విషయమూ చెప్పక తప్పదు. సంస్కృతం, తమిళం, కన్నడం మొదలైన భాషలలో శతకాలు ఉన్నప్పటికీ, తెలుగులో ఉన్నన్ని లేవనడం సత్యసన్నిహితం. కాగా తెలుగువారికి శతకం ఆదరపాత్రమైన ప్రక్రియ అనడం నిర్వివాదం.

తెలుగుశతక వాఙ్మయంలో పరిశోధన అనగానే వంగూరి సుబ్బారావుగారు (1886 - 1923) స్ఫురణకు వస్తారు. శతక వాఙ్మయానికి వారు చేసిన సేవ అనల్పం. శతాధికములైన శతకాలను సేకరించడమే కాక వాటిని చక్కగా పరిశీలించి శతక కవుల చరిత్ర సంతరించారు. అది 1923లో కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికతో వెలువడింది. సుబ్బారావుగారి పీఠికకూడా అమూల్యమయింది. చాలా కాలందాకా తెలుగు శతక కవుల్ని గురించి తెలుసుకోడానికీ, శతక వాఙ్మయ పరిశీలనకూ ఆ గ్రంథమే ఉపకరించింది. ఆయన కుమారులు నరసింహారావుగారి కృషివల్ల ఈ శతక కవుల చరిత్రకు 1951లో ద్వితీయ ముద్రణ భాగ్యం కలిగింది. అంతవరకూ ప్రచారంలోకి రాని శతకాల వైశిష్ట్యాన్ని వివరిస్తూ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిన విషయాదికం ఆ గ్రంథానికి అనుబంధంగా ముద్రించబడింది. నిడుదవోలువారి పీఠికానుబంధాలు పుస్తకానికి నిండుదనం కలిగించిన వనడంలో ఏ మాత్రమూ సందేహం లేదు.

ఆ తర్వాత విద్వత్కవిభూషణ బిరుద విరాజితులు వేదము వేంకటకృష్ణశర్మగారు శతక వాఙ్మయ సర్వస్వం ప్రచురించి, ఆ వాఙ్మయ ప్రాశస్త్యాన్ని పాఠకలోకానికి తెలియజేశారు. ఒక్కొక్క శతకాన్ని విమర్శన దృష్టితో పరిశీలించినా, శర్మగారి దృష్టి ప్రధానంగా 25 శతకాలమీద కేంద్రీకృతమయిందని చెప్పవచ్చు. వాటికి సంబంధించినంతవరకు విమర్శ విపులంగా సాగింది.

పై గ్రంథాలే కాక, శతకాలను గురించి వివిధ పత్రికలలో ప్రశస్త పరిశోధక వ్యాసాలు కొన్ని వెలువడకపోలేదు. శ్రీయుతులు కొమఱ్ఱాజు లక్ష్మణరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ ప్రభృతులు ఆ వ్యాసకర్తలలో ప్రముఖులు. ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచికలో-అనగా 1910లో-ఆంధ్రశతకములు అనే వ్యాసం వెలువడడం పేర్కొనదగింది. తత్కర్త శ్రీ కేసానపల్లి చెంగయ్య నాటినుంచీ నేటిదాకా శతకాలను గురించి అవిచ్ఛిన్నంగా వ్యాసాలో పుస్తకాలో వెలుగు చూస్తూ ఉండడం గమనించదగిన అంశం.

ఈ విధంగా శతక ప్రక్రియను గురించి వ్యాస రచన జరిగినా, గ్రంథరచన సాగినా, విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధనాంశంగా స్వీకరించి తెలుగు శతకాల చరిత్రను పర్యాప్తంగా పరిశీలించిన ఘనత డాక్టర్ కె. గోపాలకృష్ణరావుగారికి దక్కింది. ఆయన 1960లో పరిశోధన ప్రారంభించి, 1965లో తమ సిద్ధాంత వ్యాసానికి (ఆంధ్ర శతక వాఙ్మయము, ఉత్పత్తి వికాసాలు, సమకాలీన జీవనము) డాక్టరేటు పట్టం పొందారు. దాని సంగ్రహరూపం 'ఆంధ్రశతక సాహిత్య వికాసము' అనే పేరుతో 1976 లో వెలువడింది. ఇదే 864 పుటల గ్రంథంగా రూపొందింది. కాగా, ఆకృతిని పురస్కరించుకునే ఇది శతక వాఙ్మయం గురించి క్షుణ్ణంగా జరిగిన పరిశోధన వ్యాసమనవచ్చు. ఇందులో అయిదువేల శతకాలు పరిశీలించబడ్డాయి.

శతకం దేశి ప్రక్రియ అనే అభిప్రాయం ఒకటి పండితలోకంలో ఉంది. తగిన ఆధారాలు చూపి యీ అభిప్రాయం సమంజసంకాదని గోపాలకృష్ణరావుగారు తమ సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నారు. అందుకు వారు సంస్కృత ప్రాకృతములలోని శతకప్రాయములైన అష్టక స్తోత్రాలను పరిశీలించారు. వాటికీ తెలుగు శతకాలకూ కొన్ని సాదృశ్యాలు లేకపోలేదు. ముఖ్యంగా తొలినాళ్ళలో వెలసిన శతకాలు ఇంచుమించు స్తోత్రాలే. అనగా స్వభావంలో సామ్యం ఉన్నదనడం సత్య సన్నిహితం. కాని ఆకృతిలో సామ్యం కనిపించదు. సంఖ్యాభేదం కానవస్తుంది. సంస్కృత ప్రాకృతాల నుంచి శతక ప్రక్రియను తెలుగువారు గ్రహించారని అంగీకరించినా, కొన్ని కొత్త తొడుగులు తొడిగి

శతకం తెలుగువారి విశిష్ట ప్రక్రియ అన్నంతగా ఆ సాహిత్య రూపాన్ని తెలుగువారు తమదిగా చేసుకున్నారనడం నిజమునకు దగ్గరి చుట్టం.

తెలుగు తోబుట్టువులైన తమిళ, కన్నడాలలో శతకరచన జరిగినా, ఆ భాషలలో శతకానికి ప్రచుర ప్రచారం లభించలేదు. తమిళుల దృష్టిలో 96 ప్రబంధాలలో శతకం ఒకటి. ఈ ప్రబంధాలకు కావ్య యశస్సు లేదు. తెలుగువారిలా, తమిళ కవులు కూడా సంఖ్యా, మకుట నియమాలు పాటించారు. ఈ రెండు నియమాలను కన్నడ కవులూ పాటించారు. అయితే ప్రముఖ కన్నడ సాహిత్య చరిత్రకారులు డాక్టర్ ఆర్. యస్. ముగళి తమ 'ప్రాచీన కన్నడ సాహిత్య రూపగళు' అనే గ్రంథంలో శతకం లఘుకావ్యం అని పేర్కొన్నారు.

శతకం ఖండకృతి అనే అభిప్రాయం మన విమర్శకులలో ఉంది. కాని గోపాలకృష్ణరావుగారు దీనిని ఆమోదించలేదు. ఏక సూత్రత లేని పద్య సమూహాన్ని ఖండకావ్య మనడం అసమంజసమని ఆయన అభిప్రాయం. నిజమే. కథాగత కావ్యాలలో ఏకసూత్రత పాటించడం సులభమే కాని ఏ పద్యానికా పద్యం స్వతంత్రంగా భాసించే శతకంలో ఏక సూత్రతను మరో దృష్టితో పరిశీలించడం సమంజసం. ఉదాహరణానికి భక్తిశతకాన్ని పరిశీలిద్దాము. పద్యాలు వేర్వేరు కావచ్చు; కాని ఆ పద్యాలలో అంతర్గతమై ప్రవహించే భావగంగ మాత్రం ఒకటే. అదే భక్తిరసం. ఆ రసాన్ని కవి వివిధ పద్యాలలో ఆవిష్కరింపజేస్తున్నాడు. నీతి శతకమూ అంతే. ప్రతి పద్యమూ ముక్తకమే. అయినప్పటికీ ఆ ముక్తకాలలో నీతులు అందాలు దిద్దుకుంటున్నాయి. కాగా, నీతి శతకంలో మనకు కొట్టవచ్చేలా కనిపించేది నీతి బోధ. దీన్ని ఏకసూత్రతగా గ్రహించవచ్చు. ఏది ఎలా ఉన్నా, 'మకుటాత్మకమగు శత ముక్తక సముచ్చయమే శతకము' అని ఒక చక్కని నిర్వచనం చేశారు గోపాలకృష్ణరావుగారు.

ఎంత పరిశోధన జరిగినా, కొన్ని విషయాలు ఇంకా వివాదగ్రస్తంగానే ఉన్నాయి. అందుకు సుమతి శతక కర్తృత్వ విషయాన్ని ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చు. రాజకవి అయిన బద్దె నరేంద్రుని (బద్దెన) రచనయే సుమతి శతకమని పలువురి అభిప్రాయం. కాని బద్దెన పేరు మాత్రం ఉపలబ్ధములైన సుమతి శతకం తాళపత్ర ప్రతులలో గాని ముద్రిత ప్రతులలోగాని లేదు. ప్రసిద్ధ లాక్షణికుడైన కూచిమంచి తిమ్మకవి భీమకవి రచించిన సుమతి శతకంలోని దంటూ ఒక పద్యాన్ని తన సర్వలక్షణ సార సంగ్రహంలో ఉదాహరించాడు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో D. 1810 సంఖ్య కల తాళపత్ర ప్రతిలో భీమన వ్రాసినట్టుగా ఒక పద్యం ఉంది. కనుక సుమతి శతకం భీమన కవి కర్తృకమని భావించవచ్చు.

నేటి ముద్రిత ప్రతులలో కానవస్తున్న 'శ్రీరాముని దయ చేతను...' అనే పద్యం సుమతి శతకానికి బ్రౌన్ చేసిన ఆంగ్లానువాదంలో గాని, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని వ్రాతప్రతులలోగాని, తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయంలోని వ్రాత ప్రతులలోగాని లేకపోవడం వల్లనూ, సుమతి శతకం సుమతి అనే పేరు కల ఒక జైన సన్న్యాసికి అంకితమిచ్చినట్లు ఐతిహ్యం ఒకటి ఉండం వల్లనూ, తమిళ జైన కవులవలె సుమతి శతక కర్త జైనందిన జీవితం నుంచే ఎక్కువగా ఉపమలు గ్రహించడం వల్లనూ, బద్దెన వ్రాసిన నీతిశాస్త్ర ముక్తావళి శైలికి సుమతి శతక శైలికీ భేదం ఉండడం వల్లనూ సుమతి శతకం జైనకవి కర్తృకమని నా అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని పర్యాప్తంగా పరిశీలించవలసి ఉన్నా, నేడు మనం భావిస్తున్నట్టుగా సుమతి శతకం బద్దె భూపాలుని రచన మాత్రం కాదని నా నిశ్చితాభిప్రాయం. నీతిశాస్త్ర ముక్తావళిలోని కొన్ని పద్యాలకూ సుమతి శతకంలోని

కొన్ని పద్యాలకూ పోలికలున్న మాట నిజమే. అలాగే చాణక్యుని నీతి దర్పణం, భర్తృహరి రచన మొదలైన వాటినుంచి కూడా సుమతి శతక కర్త కొన్ని శ్లోకాలు గ్రహించి వాటిని తెలుగు చేసినట్లు చెప్పవచ్చు. ఒకవిధంగా చూస్తే, ఈ నీతులు ఒక భాషకో ఒక ప్రాంతానికో పరిమితమైనవిగా భావించడం సమంజసం కాదేమో అనిపిస్తుంది. ఇవి భారతీయ సంస్కృతికి చెందిన ఆణిముత్యాలు !

సాధు పాఠ నిర్ణయ మన్న సాకుతో శతకాల పరిష్కర్తలు కొంచెం స్వాతంత్ర్యం వహించినట్టు స్పష్టమవుతోంది. తాళపత్రప్రతులలో ఉన్న పాఠాలు కొన్ని ముద్రిత ప్రతులలో కనిపించవు. మరి, పూర్వ పరిష్కర్తలు ఏ ఆధారం పురస్కరించుకుని పాఠాంతరాలు ఉదాహరించారో ఇదమిత్థమని చెప్పలేము. ఈ విషయంలో పరిశోధన జరగవలసిన అవసరం ఎంతైనా కనిపిస్తున్నది. అయితే ఆ పరిశోధన కేవలం సత్య దృష్టితో సాగాలి. ఈ సందర్భంలో కూడా సుమతి శతకాన్ని ఉదాహరణగా గ్రహించవచ్చు.

ఇప్పటికి సుమతిశతకం పలువురిచే పరిష్కృతమై పలువురిచే ప్రకటితమయింది. కొన్ని వ్రాత ప్రతులలో 150 దాకా పద్యాలు కానవస్తున్నాయి. ఈ అదనపు పద్యాలు ప్రక్షిప్తాలేమో !

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రకటించిన సుమతి శతకంలోని (శతక సంపుటము - 1,1966) ఈ క్రింది పద్యాన్ని పరిశీలిద్దాము :

ఎప్పుడు, దప్పులు వెదకెడు
నప్పురుషుని గొల్వఁగూడ దది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించిన విధంబు గదరా సుమతీ !

'సర్పంబు పడగ నీడను' అనే పాదం 1922లో మదరాసు, విక్టోరియా డిపో వారు ప్రకటించిన శతక రత్నావళిలోనూ, 1904లో మదరాసు, పి. ఎతిరాజులునాయుడు ప్రకటించిన తమిళ సుమతి శతకంలోనూ 'సప్పంబు పడగ నీడను' అని ఉంది. అందువల్ల ఇది చాలా కాలంగా వస్తున్న పాఠమని చెప్పవచ్చు. అయితే సి. పి. బ్రౌన్ తయారు చేయించిన వ్రాతప్రతిలో (D. 3090, 1832) ఈ పద్యం ఈ కింది విధంగా కానవస్తున్నది.

'ఎప్పుడు తప్పులు పట్టెడి
యప్పురుషుని యొద్ద నుండుటది కీడు సుమీ
యప్పాము పడగ నీడల
కప్పలు వెస జేరినట్లు గదరా సుమతీ.'

కాగా తరువాతి ముద్రణలలో చేయబడిన మార్పులు సుస్పష్టం. బ్రౌను ప్రతిలోని పాఠం సరళంగా ఉంది.

కొన్ని పద్యాలయితే చాలా మార్పులకు లోనయినట్లు తెలియవస్తున్నది.

బ్రౌను ప్రతిలోని యీ కింది పద్యం-

'మతి నొకని వలచి యుండిన
సతి వేరొక విటుడు గవయ జపలత నొందున్
ధృతి పిల్లి పట్టవచ్చిన
గత పంజర శుక కిశోరము గతి సుమతీ.'

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి ప్రచురణలో ఈ పద్యం ఇలా కానవస్తున్నది.

'మది యొకని వలచియుండఁగ
మది చెడి యొక క్రూరవిటుడు మానక తిరుగున్
అది చిలుకఁ బిల్లి పట్టినఁ
జదువునె యా పంజరమున జగతిని సుమతీ'

వేమన పద్యాల విషయంలోనూ విస్తృతమైన పరిశోధన జరిగింది. ఇంకా జరుగుతూనే ఉన్నది. ముమ్ముందు కూడా జరగగలదన్న ఆశాభావం లేకపోలేదు. కాలం ముందుకి సాగను సాగను వేమన పద్యాలకు గల ప్రచారమూ ఇనుమడిస్తూ వుండడం, ఆ పద్యాల పట్ల తెలుగువారికి గల శ్రద్ధాసక్తులు, అద

రాభిమానాలు వ్యక్తమవుతున్నాయి. వేమనను గురించి వివిధ విశ్వవిద్యాలయాలలోనూ పరిశోధనలు జరుగుతున్నాయి. విమర్శకులూ యథోచితంగా ఈ విషయంలో కృషి చేస్తూ వున్నారు.

శ్రీయుతులు వంగూరి సుబ్బారావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, ఆరుద్ర, ఎన్. గోపి ప్రభృతులు వివిధ కోణాలనుంచి వేమనను పరిశీలించి తమ పరిశోధనాంశాలు తెలియజేశారు. అయినా ఏవి నిజంగా వేమన పద్యాలు అనే విషయమై పర్యాప్తమైన పరిశీలన సాగి, నిజమైన వేమన పద్యాల సంపుటి వెలువడవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని మాత్రం సవినయంగా మనవి చేస్తున్నాను. అప్పుడే వేమన ఆత్మీయతను ఇదమిత్థమని నిర్ణయించవచ్చు.

కొందరు వేమనను యోగిగా వర్ణిస్తే, మరి కొందరు వేదాంతిగా అభివర్ణించారు. ఇంకా కొందరు మానవతావాదిగా ప్రస్తుతించారు. ప్రస్తుతం ఆయన తాత్త్విక, సామాజిక చింతనను విమర్శకులు బహుధా పరిశీలిస్తున్నారు. వేమనలో ఈ వివిధ దృక్పథాలూ కొట్టవచ్చినట్టు కనిపించేమాట వాస్తవం. బహువిషయాలను గురించి ఆ ప్రజాకవి తన పద్యాలలో పేర్కొన్నారు. కాగా, ఎవరికి వారు తమ దృక్పథాన్ని ఆయనలో దర్శించి తృప్తిపొందుతున్నారు.

వేమన ప్రధానంగా మానవతావాది అయినప్పటికీ, తాత్త్వికుడుగా కూడా ఆయన గోచరిస్తాడనడం చర్వితచర్వణం. తాత్త్వికచింతన ప్రముఖంగా కానవచ్చే ఆయన పద్యాలే యిందుకు ప్రబలసాక్ష్యం.

ఈ కింది పద్యం పరిశీలించదగింది.

'నేరనన్నవాడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాడు వార్తకాడు
ఊరకున్నవాడె ఉత్తమోత్తము డెందు
విశ్వదాభిరామ వినురవేమ'
(హైదరాబాద్ బుక్ ట్రస్టువారి ప్రచురణ)

ప్రజాకవి వేమన అనే అంశంపైన పరిశోధన సాగించిన డాక్టర్ ఎన్. గోపి ఈ పద్యానికి ఈ కింది విధంగా వివరణ ఇచ్చారు.

'కార్యకర్తల్లో మూడు రకాల వ్యక్తులుంటారు. ఒకడు ప్రతిదీ నాకు తెలియదు నేను చెయ్యలేను అని తప్పించుకుంటాడు. వీడు నెఱజాణ, అంటే నేర్పరి. సుమతికారుని ''ధన్యుఁడ'' న్నమాట. నేరనన్నవాడు అంటే అసమర్థతను వ్యక్తపరిచే వాడన్నమాట.

'రెండవవాడు అది చేస్తాను ఇది చేస్తాను అని కోతలు కోస్తాడు. వీడి మాటలు కోటలు దాటుతాయి గాని కాళ్లు తంగెళ్లుదాటవు. వార్త అంటే మాట, సంభాషణ, అని అర్థాలు. వార్తకాడు అంటే మాటకారి, వాగుడుకాయ అని అర్థాలు. ప్రసిద్ధికెక్కుట అనే అర్థంలో వార్త కెక్కుట అని వేరేచోట వాడాడు వేమన.

'మూడవవాడు మౌనంగా పనులు చేసుకపోతాడు. వీడు నిజమైన క్రియాశీలి. ఇటువంటివాడు ఉత్తముడు అంటున్నాడు వేమన.'

పై పద్యం కొన్ని ముద్రిత ప్రతులలో ఇలా కానవస్తున్నది.

'నేర నన్నవాడు నెరజాణ మహిలోన
నేర్తు నన్నవాడు నిందజెందు
ఊరకున్నవాడు ఉత్తమ యోగిరా.'

నాకు తెలీదంటూ తప్పించుకు తిరిగేవాడు నేర్పరి కావచ్చునేమో కాని కోతలరాయడు మాత్రం వార్త కెక్కడు. అతను నింద్యార్హుడవుతాడు. కనుక నా అభిప్రాయంలో 'నేర్తు నన్నవాడు నింద జెందు' అన్న పాఠం సముచితం. క్రియాశీలి నిజంగా ఉత్తముడే అయినా, 'ఊరకున్న వాడు' అనడంలో వేమన భావించిన అర్థం ఇది కాదనుకుంటాను. ఒక తాత్త్విక భావం ఇందులో ఉన్నట్లు నా అభిప్రాయం.

వేమన జీవించిన 17వ శతాబ్దిలో తమిళ నాడులో తాయు మానవర్ అనే ప్రసిద్ధ భక్తకవి ఉండేవాడు. 'ఊరికే ఉండే శక్తిని' తనకు అనుగ్రహించవలసిందిగా ఆయన పరాత్పరుణ్ణి ప్రార్థించాడు. ఒకచోట ఆయన యిలా అన్నాడు :

'సొల్లుం పొరుళు మట్రు సుమ్మా ఇరుప్పదర్కే-
అల్లుం పగలు మెన క్కాశై పరాపరమే.'

(శబ్ద భావములు విసర్జించి ఊరక, ఉండగా సతమ్ము ఉత్సహింతు.)

ఇక్కడ ఊరికే ఉండడ మంటే నిష్క్రియ అని కాదు అర్థం. త్రికరణ శుద్ధిగా మౌనం పాటించడం. ఈ చిత్తవృత్తి నిరోధాన్ని యోగమన్నారు.

తాయు మానవరే మరోచోట, 'సిన్దైయై అడక్కియే సుమ్మా ఇరుక్కిన్ద్ర తిఱ మరిదు' అని పేర్కొన్నాడు. చింతనను అణిచి ఊరికే ఉండడం చాలా కష్టం అని దీనికి అర్థం. నిప్పుమీద ఉండవచ్చు, నీటిమీద నడవవచ్చు. మరి ఏదైనా చెయ్యవచ్చు. కాని ఏవిధమైన ఆలోచనలూ లేకుండా, ఏ విధమైన పనీ చెయ్యకుండా, మాటా పలుకూ లేకుండా బొమ్మలా కూర్చోవడం మాత్రం మానవ మాత్రుడికి వీలయ్యే పనికాదు. అలా ఊరికే ఉండ గలిగినప్పుడే నిజమైన సౌఖ్యం కలుగుతుంది- అని తాయు మానవర్ అభిప్రాయం. ఆయనే కాదు, 15వ శతాబ్దిలో జీవించిన అరుణగిరి నాథర్ కూడా ఈ ఊరికే ఉండడంలోని వైశిష్ట్యాన్ని తెలియజేశాడు. ఇతర సిద్ధులు కూడా దీన్ని ప్రబోధించారు. తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి 'సుమ్మా' (ఊరికే) అనే ప్రశస్త వ్యాసం ఒకటి వ్రాశాడు. కనుక తమిళనాడులో 'ఊరికే ఉండే' యీ తత్త్వం 17వ శతాబ్దికి ముందే వెలుగు చూసిందనీ, కాని తాయు మానవర్ కాలంలో ప్రచుర ప్రచారం అందుకున్నదనీ చెప్పవచ్చు.

వేమన కూడా 'ఊరకున్నవాడు ఉత్తమ యోగిరా' అన్నాడు. కొంతవరకూ మాటల్నీ చేతల్నీ నిగ్రహించవచ్చు. కాని చిత్తమును మాత్రం నిగ్రహించడం కష్టం. ఊరకున్న వాడిలో చిత్తవృత్తి నిరోధకుడూ ఉన్నాడు. కనుకనే వేమన చిత్తశుద్ధి లేని శివపూజనూ, ఆత్మశుద్ధిలేని ఆచారాన్నీ విమర్శించాడు. చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యాన్ని ప్రశంసించాడు. కాగా 'ఊరకున్నవాడు' నిజంగానే ఉత్తమ యోగి.

17వ శతాబ్దిలో నెలకొన్న యీ తాత్త్వికభావాన్ని పురస్కరించుకుని పై పద్యానికి వివరణ ఇవ్వడం సమంజసమని నేను భావిస్తున్నాను. ఇప్పటి భావాలతో కాక అప్పటి భావాలతో పరిశీలిస్తే, వేమన పద్యాలు కొన్నిటిని చక్కగా అర్థం చేసుకోవచ్చు.

వేమన పద్యాలు ప్రజల నాలుకలమీద నానుతున్నంత వరకూ పాఠాంతరాలు తప్పవనుకుంటాను. అయినా నిజమైన వేమన పద్యాల సంపుటిని తయారు చేసే బాధ్య పండిత లోకం మీద ఉన్నది.

**ఉదాహరణాలు:**

శతకంలా ఉదాహరణం కూడా అల్పకావ్యమే. ప్రసిద్ధ ఆలంకారికుడైన విద్యానాథుడు దీన్ని క్షుద్ర ప్రబంధమని పేర్కొన్నాడు. క్షుద్ర ప్రబంధ మంటే అల్పకావ్యమనీ మధుర ప్రబంధమనీ అర్థం చెప్పవచ్చునని ఉదాహరణ వాఙ్మయ చరిత్రకారులూ, ఇటీవల యశశ్శరీరులూ అయిన నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయం. సంగీత సాహిత్యాల సంబంధం కలిగిన యీ కావ్య భేదం మధురకవితా శాఖకు చెందింది.

దేశి సంప్రదాయ సమన్వితమూ, స్తుతి ప్రధానమూ, గానానుకూలమూ అయిన ఉదాహరణం తెలుగు సాహిత్యానికి విశిష్టత సమకూర్చిన ఒక రచనా ప్రక్రియ. ఇవి తెలుగు వారి స్వతంత్ర శాఖ

అన్నా సాహసం కాదు. తమిళంలో పేర్కొనబడిన 96 కావ్య భేదాలలో ఇది కనిపించదు. ఇతర భాషం లోనూ ఇది లేదు. నన్నయనాటినుంచీ నేటి దాకా ఈ ప్రక్రియ సజీవంగా ఉంది. ఈ అంశం దీనికి గల ప్రాచుర్యాన్ని వ్యక్తం చేస్తున్నది.

తమ ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో శ్రీ వేంకటరావుగారు ఉదాహరణముల లక్షణాలను విపులంగా చర్చించారు. సంస్కృతోదాహరణముల లక్షణాలు కూడా తెలియజేశారు. తెలుగులో వెలసిన ప్రాచీన, అర్వాచీన ఉదాహరణములు యథాతథంగా ఉదాహరించారు. నేడు ఉపలబ్ధం కాని ఉదాహరణముల వివరాలు కూడా తెలియజేశారు. బహుగ్రంథ పరిశీలనాఫలితమే ఈ ప్రశస్త గ్రంథమనే భావం పుస్తకాన్ని అవలోకగా పరిశీలించే పాఠకుడికి సైతం కలుగుతుంది. కాగా ఉదాహరణ వాఙ్మయ చరిత్రను పరిశీలించడానికి ఈ గ్రంథం బహుథా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు.

స్తుతి ప్రధానమైన కావ్యం కనుక (అది దైవ స్తుతి అయినా కావచ్చు, మహా పురుష స్తుతి అయినా కావచ్చు), ఉదాహరణలు కొత్తవి ఇంకా ఎన్నో వెలువడుతాయి. ఇటీవల శ్రీ సాళ్వ కృష్ణమూర్తి గారు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిని గురించి సురూపోదాహరణం రచించారు. అందువల్ల ఈ వాఙ్మయ చరిత్ర పెరగడానికి అవకాశం ఉన్నది. తదనుగుణంగా పరిశోధనావకాశాలు కూడా పెరగవచ్చు.

తులనాత్మక దృష్టితో వివిధ ఉదాహరణ కావ్యాలను పరిశీలిస్తే, ఆయా కవుల మనోగత భావాలను స్పష్టంగా మనం గ్రహించవచ్చు. పాల్కురికి సోమనాథుడిది భక్త్యావేశం. బసవ పురాణాదులు ఇందుకు సాక్ష్యం. కాని ఆ మహాకవి బసవోదాహరణం చదువుతుంటే, ఆవేశం అంతగా కనిపించదు. భక్తి ప్రభావమే ప్రముఖంగా గోచరిస్తుంది. శరణాగత వత్సలుడూ భక్తమానస పరిపూర్ణుడూ దయాపయోధీ అయిన మా బసవనిలో చిత్తమా వసింపు-అంటాడు కవి, వినయంగా.

పైగా దైవపరంగా చెప్పబడిన ఉదాహరణాలలో పురాణ గాథలు ఎన్నో అందాలు దిద్దుకున్నాయి. వంగకాయలు లింగములుగా మారిన కథను సోమన తన రచనలో సూత్రప్రాయంగా పేర్కొన్నాడు. అలాగే రావిపాటి త్రిపురాంతకుడు కన్నప్ప, శాఖ్య తొండడు మొదలైన వారి కథలలోని కొన్ని సన్నివేశాలను సంగ్రహంగా పేర్కొన్నాడు. కాని గుండయ గారి కథను మాత్రం కొంచెం వివరంగా, మనోజ్ఞంగా చెప్పాడు, ఈ కింది ఉత్కళికలో.

'కడు దీనతతో ముది తాపసికై
పడి నింటికిఁ జని వెడ కప్పెర గై
కొని యాలు మగల పెనురచ్చలకై
ఛనుదెండని నిక్కము సేయుటకై
వెను ద్రిప్పిన గుండము లోపల గై
కొని చని తన యెప్పటి రూపముకై
కొని గుండయ మెచ్చిన వేల్పునకై.'

తెలుగు సాహిత్యంలో కుమ్మర గుండయ్యగా ప్రసిద్ధికెక్కిన యీ భక్తుని అసలు పేరు తిరునీలకంఠ నాయనారు. అరవై ముగ్గురు శివ భక్తులలో ఆయన ఒకడు. సోమనాథుని బసవ పురాణంలో కూడా గుండయ్య గారి కథ కనిపిస్తుంది. తాను చెప్పిన కథలలో సోమనాథుడు మార్పులు, చిన్నవీ పెద్దవీ, ఎన్నో చేశాడు. తమిళ, తెలుగు కథనాలను కనుక శ్రద్ధగా పరిశీలిస్తే, ఈ మార్పులు కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి.

**చాటువులు :**

సాహిత్యంలో ఆశు కవిత ఎంత ప్రాచీనమయిందో, ఆ కవితా శాఖకు చెందిన చాటువు కూడా అంత ప్రాచీనం. ప్రతి నాగరక భాషలో వలె తెలుగు

లోనూ చాటువులు పరిష్కృతంగా ఉన్నాయి. వేమన దృష్టిలో చాటువు చాలా విలువైనది. ఆయన అన్నాడు, గదా :

'నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల
చాటుపద్య మరయ చాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినురవేమ.'

చదువ పద్య మరయ చాలదా యొక్కటి-అనేది పాఠాంతరం.

తళుకు బెళుకురాళ్లు తట్టెడుకంటె మంచి నీలం ఒకటి చాలు. అలాగే పిచ్చి పద్యాలు బండెడు కంటె ఒక మంచి చాటువు మేలు - అన్నాడు ఆ ప్రజాకవి. పరిశీలించిన మీదటగాని యీ విషయం స్పష్టం కాదన్నాడు.

తెలుగు చాటువులు గురించి పత్రికాముఖంగా నైతేనేమి వ్యాస సంకలనాలలో నైతేనేమి చాలా వ్యాసాలు వచ్చాయి. శ్రీయుతులు వేటూరి ప్రభాకర శాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి ప్రభృతులు వ్యయ ప్రయాసల కోర్చి, చవీ చక్కనా కల చాటువులు ఎన్నెన్నో సేకరించి ప్రశస్త సంకలనాలు ప్రచురించి మహోపకారం చేశారు. కవనార్థం ఉదయించిన కారణ జన్ములు తిరుపతి వేంకటకవులు మొదలైన ప్రసిద్ధ అవధాన కవులు ఎన్నో చాటువులు వెలయించారు. అత్యాధునికులు కూడా చాటువులు చెప్పారు.

శ్రద్ధాసక్తులతో వాసే పద్యంలా అలవోకగా చెప్పే ఆశుకవిత అర్థగాంభీర్యం సంతరించుకుని మధురంగా మనోజ్ఞంగా ఉండకపోవచ్చు. కనుకనే 'నిలుకడ వలయుఁ గృతికి' అన్నాడు అప్పకవి. అలా అనీ, ఆశుకవితాశాఖకు చెందిన చాటుధారల్ని చిన్నచూపు చూడడం సహృదయత అనిపించుకోదు. నిజానికి చమత్కారభరితములూ ఆలోచనామృతములూ అయిన చాటువులు ఎన్నో మనకు కనిపిస్తాయి. అవి వింటుంటే సవ్వసని కంకణం కట్టుకున్నవాడు కూడా కడుపుబ్బ నవ్వుతాడు. అనగా, నిక్కమైన నీలంవంటి చాటువులో మనస్సుని మురిపింపజేసే గుణం ఉన్నది. అందువల్లనే ఆయా చాటువులు చెప్పిన సన్నివేశాలు నేడు లేక పోయినా చాటువులు మాత్రం మిగిలాయి.

విశ్వవిద్యాలయ స్థాయిలో చాటువుల్ని గురించి పరిశోధన జరగకపోయినా, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారి పుణ్యమా అని కొందరు ఈ విషయమై గ్రంథరచన చేశారు. 1978 - 79వ సంవత్సరం అకాడెమీవారు చాటుకవిత్వం గురించి గ్రంథ రచన పోటీ నిర్వహించారు. ఆ పోటీలో ఉత్తమ రచనగా నెగ్గి, ఆ తర్వాత పుస్తకరూపంగా వెలువడిన గ్రంథం తెలుగులో చాటు కవిత్వము (1981). రచయిత్రి ప్రొఫెసర్ జి. లలితగారు. అంతకు పూర్వం, అంటే 1975లో, అకాడెమీవారు డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారి ఆశుకవితలు - అవధానములు - చాటువులు అనే పుస్తకం ప్రకటించారు. వేటూరివారూ దీపాలవారూ ఇతరులు చాటు సంకలనాలకు వెలయించిన పీఠికలు, అమూల్యమైనవి, ఉండనే ఉన్నాయి. కాగా ఈ ప్రక్రియను గురించి తృప్తికరంగా పరిశోధన జరిగి నట్లు భావించవచ్చు.

10 అధ్యాయాలలో సాగిన 'తెలుగులో చాటు కవిత్వము'లో ముద్రితా ముద్రిత చాటువులు ఎన్నో వివరించబడ్డాయి. చాటువులలో కానవచ్చే ఛందో వ్యాకరణాది భాషా విశేషాలు, చారిత్రక విశేషాలు, సాంఘిక విశేషాలు మొదలైనవి చర్చించడం జరిగింది.

పరిహాస రసికతకూ దూషణ భూషణలకూ చతురోక్తులకూ చాటువులు వార్త కెక్కిన మాట వాస్తవమే. అయినా మన సాంస్కృతిక సామాజిక విశేషాలను తెలుసుకునేందుకు చాటువులు ఎంతగానో తోడ్పడతాయి. ఈ దృష్టితో చూస్తే, కావ్య సాహిత్యం కన్నా చాటు సాహిత్యం ప్రయోజనకారిగా కని పిస్తుంది. ఆయా సన్నివేశాలు పురస్కరించుకుని

చాటు కవులు ఆశువుగా పద్యాలు చెప్పడంవల్ల, వాటిలో అతిశయోక్తులకు తావు అంతగా ఉండదు. సత్యదృష్టి ప్రధానంగా ఉంటుంది కనుక, వాటిని విశ్వసించవచ్చు. పైగా అవి అనుభవ పూర్వకంగా చెప్పినవి. కష్టమో, సుఖమో, మంచో, చెడో తన అనుభవానికి వచ్చిన విషయాన్నే చాటుకవి చెపుతాడు; చమత్కార భరితంగా చెపుతాడు. తమ ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనకు సురవరం వారు చాటువుల్ని కూడా సంప్రదించిన విషయం సర్వ విదితం.

శ్రీనాథుడి ప్రసిద్ధమైన యీ పద్యం పరికించండి, ఆనాటి సాంఘిక విశేషాలు ఎన్ని బయల్పడతాయో.

'సిరిగల వానికిఁ జెల్లును
తరుణులు పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాంధ్రా
పరమేశా! గంగవిడుము పార్వతి చాలున్.'

అలనాటి విష్ణుమూర్తి మాటెందుకు, మొన మొన్నటి శ్రీమంతులలో బహుభార్యాత్వం విశేషంగా ఉండేది; వేశ్యాగమనమూ వాడుకలో ఉండేది. ఆ శ్రీమంతులు ఎన్ని పెళ్లిళ్లు చేసుకున్నా పరవాలేదు. ఆర్థిక స్తోమత లేనివాడికి ఇద్దరు భార్యలు 'వృద్ధస్య తరుణీ విషం' లాంటిది. అందుకే కాబోలు ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారం చేసినట్టు అనే సామెత పుట్టి ఉంటుంది.

ఒక పూట పస్తు ఉన్నంత మాత్రాన మనిషికి పెద్ద నష్టమేమీ కలగదు. కాని, గొంతు తడి ఆరిపోయినప్పుడు, నీళ్లు కనక లభ్యం కాకపోతే ప్రాణహాని సంభవించే ప్రమాదం ఉంది. కనుక ఆహారం కంటె మంచినీళ్లు చాలా ముఖ్యం. పార్వతి ఆహారానికీ, గంగ జలానికీ ప్రతీకలు. అసలే నీటి యెద్దడి. అందులో మండు వేసవి. కాగా పల్నాటి ప్రాంతంలో, అటువంటి సమయంలో, మంచినీటికోసం పడే బాధ, అనుభవించినవాళ్లకి, బాగా తెలుస్తుంది.

అలాగే స్థానిక వీరుల్ని గురించీ స్థానికచరిత్ర గురించీ తెలుసుకోడానికి చాటువులు బహుధా ఉపకరిస్తాయి. ఒక ఉదాహరణ. అచ్యుతదేవరాయల మరణానంతరం సదాశివరాయలు విజయనగర సింహాసనం అధిష్ఠించాడు. నామకః అతడు పాలకుడు. అధికారమంతా కృష్ణదేవరాయలవారి అల్లుడు ఆళియరామరాయల హస్తగతమై ఉండేది. అతని సోదరులైన తిరుమల వేంకటాద్రులు కూడా పరిపాలనలో వ్యవహారాలు పర్యవేక్షిస్తూ ఉండేవారు. అలా ఉండగా, 1565 లో జరిగిన రక్షస్థగిడి (తళ్లికోట) యుద్ధంలో విజయనగర సామ్రాజ్య చరిత్రే తలకిందులై పోయింది. ఆళియ రామరాయలు స్వర్గస్థు డయ్యాడు. ఆ యుద్ధంలో తిరుమలరాయలుకూడా పాల్గొని ఉంటాడు. యుద్ధంలో ఒక కన్ను పోగొట్టుకున్నాడు. ఈ ఉదంతాన్ని మనం ఈ కింది చాటువువల్ల తెలుసుకోగలుగుతున్నాము.

'అన్నాతిఁ గూడ హరుఁ డగు
నన్నాతిని గూడకున్న నసురగురుండౌ
నన్నా! తిరుమలరాయడు
కన్నొక్కటి లేదుగాని కంతుఁడు కాఁడే.'

(చాటుపద్య మణిమంజరి, 1942)

ఇది రామలింగ కవి వర్ణనగా చెప్పబడుతున్నది.

రామరాజ భూషణుని వసు చరిత్రలోని అవతారికా పద్యాలు ఈ తిరుమల రాయని గుణగణాలను కీర్తిస్తున్నాయి.

అయితే పై ఉదంతాన్ని బలపరిచే చారిత్రకాధారాన్ని అన్వేషించాలి.

ఏమయినప్పటికీ, చాటువులు స్థానిక చరిత్ర రచనకు ఉపకరిస్తాయనడం సత్య సన్నిహితం. కాగా, సామాజిక, చారిత్రక విశేషాల అవగాహనకు చాటువుల్ని పర్యాప్తంగా పరిశీలించడం ఎంతైనా అవసరం.

**నిఘంటువులు :**

భాషాధ్యయనానికి వ్యాకరణం ఎలా తోడ్పడుతున్నదో, అలాగే నిఘంటువు కూడా సహకరిస్తున్నదనడం నిర్వివాదం. కనుక ఈ రెండూ అత్యావశ్యకాలని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

తెలుగులో నిఘంటు రచన 17 వ శతాబ్దిలో ప్రారంభమయింది. వివిధ ప్రక్రియలకు సంస్కృత కవుల కృతుల్ని ఆదర్శంగా గ్రహించిన మన ప్రాచీనులు కోశరచనకు కూడా సంస్కృత నిఘంటువుల పద్ధతినే గ్రహించారు. తత్ఫలితంగా తెలుగు నిఘంటువుల తొలిదశలో పద్యకోశాలు వెలుగులోకి వచ్చాయి. ఆ తర్వాత పాశ్చాత్యుల సంపర్కంవల్ల, 19వ శతాబ్దిలో, అకారాది నిఘంటువులు ప్రచారంలోకివచ్చాయి. ఈ అకారాది రచనా విధానాన్ని ప్రామాణికంగా గ్రహించిన తొలి తెలుగు నిఘంటుకారుడు మామిడి వెంకయ్య; ఆయన సంతరించిన నిఘంటువు ఆంధ్ర దీపిక (1806). ఆ తర్వాత ఎన్నో తెలుగు నిఘంటువులు వెలుగు చూశాయి. మహాకాళి సుబ్బారాయుడుగారి శబ్దార్థ చంద్రిక, బహుజనపల్లి సీతారామాచార్యులుగారి శబ్దరత్నాకరం (1885), కొట్ర శ్యామల కామశాస్త్రిగారి ఆంధ్రవాచస్పత్యం (1934 - 40), బులుసు వేంకటేశ్వర్లు, ఇతరుల వావిళ్ల నిఘంటువు (1949-69), చెలమచెర్ల రంగాచార్యులు గారి ఆంధ్ర శబ్దరత్నాకరం (1966 – 70), సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదలైనవి వెలువడ్డాయి. వీటిలో కొన్ని విశేషాలు లేకపోలేదు. శబ్దరత్నాకరంలో కావ్యప్రయోగాల్లు చూపబడ్డాయి. ఆంధ్ర శబ్దరత్నాకరంలో పద వ్యుత్పత్తి చూపబడింది. సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రామాణికమైన బృహత్కోశం. ఎందరెందరో పండితుల పరిశ్రమకు ఫలితంగా ఇది వెలువడింది. ఆంధ్ర వాచస్పత్యం కూడా పేర్కొనదగిన పదకోశం. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు దీనికి చక్కని పీఠిక వ్రాశారు. 2,840 పుటలు గల ఈ నిఘంటువుకి ఆయనే 'ఆశీస్సు' వెలయించారు. అందులో ఆయన అన్న యీ మాటలు పరిశీలించదగినవి: 'బ్రహ్మశ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రిగారు సామాన్య సంసారియై యుండియు విద్యావంతులకును ధనికులకును ప్రభువులకును సాధ్యము కాని యీ మహాయజ్ఞముకు తామొక్కరేచక్కగాకొనసాగించి లోకమునకు మహోపకారం బొనరించిరి...' ఇవికాక విద్యార్థుల ఉపయోగార్థం వెలసిన నిఘంటువులూ కొన్ని లేకపోలేదు. మొత్తంమీద కొన్ని ప్రామాణిక నిఘంటువులే వెలువడ్డాయి. అయినా మదరాసు విశ్వవిద్యాలయం వారు ప్రకటించిన Tamil Lexicon వంటి పరమ ప్రామాణికమైన బృహత్కోశం ఒకటి తెలుగులో వెలువడవలసిన అవసరం ఉంది. ఇందుకు ఏ విశ్వవిద్యాలయమైనా ముందుకు రావడం వాంఛనీయం.

తెలుగు నిఘంటువుల పుట్టుపూర్వోత్తరాలను గురించి శ్రీ వేంకటేశ్వర విద్యాలయంలో పరిశోధన సాగించిన టి. ఉషారాణిగారు పట్టం కూడా పొందారు. ఆమె అభిప్రాయం ప్రకారం తెలుగులో లఘు, అలఘు ముద్రితాముద్రిత నిఘంటువులు సుమారు 200 దాకా ఉన్నాయి. ప్రస్తుతం బ్రౌన్ నిఘంటువులను గురించి శ్రీ వేంకటేశ్వర విద్యాలయంలోనే పరిశోధన జరుగుతూ వుండడం హర్షించదగిన అంశం.

సి. పి. బ్రౌన్ మొదలైన పాశ్చాత్య పండితులు వెలయించిన నిఘంటువులు కూడా మన భాషా సాహిత్యాలకు మహోపకారం చేశాయి. ముఖ్యంగా బ్రౌన్ నిఘంటు త్రయం పేర్కొనదగినది. అకారాద్యక్షరక్రమంలో, అంటే ఆధునిక పద్ధతిని, తెలుగు నిఘంటువులు వెలువడడానికి పాశ్చాత్య పండితులే మార్గదర్శకులనడం సత్య సంపూర్ణం.

బహు భాషా నిలయమైన మన దేశంలో ద్విభాషా నిఘంటువుల అవసరం ఎంతైనా ఉన్నదనడం చర్వితచర్వణం. ప్రస్తుతం ఇంగ్లీషు-తెలుగు, హిందీ-తెలుగు వంటి నిఘంటువులు కొన్ని లభి

స్తున్నాయి గాని, తెలుగు-తమిళం, తెలుగు-కన్నడం వంటి ద్విభాషా నిఘంటువులు లభ్యం కావడం లేదు. ఈ దృష్టితో చూస్తే ఒక్క తెలుగులోనే 196 ద్విభాషా నిఘంటువులు (తెలుగు-అస్సామీ, అస్సామీ-తెలుగు, తెలుగు-మలయాళం, మలయాళం-తెలుగు...) వెలువడాలి. ఇది బృహత్తర కార్యక్రమమే అయినప్పటికీ ఈ విషయమై కృషి మొదలుపెట్టడం అవసరం. ఇటీవల ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు తెలుగు లిపిలో త్రిభాషా నిఘంటువు (తెలుగు-తమిళం-కన్నడం; సంపాదకులు : శ్రీయుతులు వేదము వేంకటరాయశాస్త్రి, చల్లా రాధాకృష్ణశర్మ, తిరుమల రామచంద్ర) ప్రచురించారు. ప్రస్తుతం మధుర-కామరాజ్ విశ్వవిద్యాలయంలో తెలుగులిపిలో తమిళ-తెలుగు ద్విభాషా నిఘంటు రచన కొనసాగుతున్నది.

**ఆకర గ్రంథాలు :**

ఆకరగ్రంథాల ఆవశ్యకతను గుర్తించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఈ విషయంలో చేస్తున్న కృషి ఎంతైనా ప్రశంసార్హం. విజ్ఞానం బహుముఖంగా పెరిగేకొద్దీ, ఆకర గ్రంథాల అవసరం అడుగడుగునా కనిపిస్తూనే వుంటుంది.

అకాడమీ వారి ఆధ్వర్యంలో నన్నయ తిక్కనాది ప్రసిద్ధకవుల పద ప్రయోగకోశములు (సూచికలు) వెలువడ్డాయి. భాషా పరిశోధకుల కివి బహుధా ఉపకరిస్తాయి. అలాగే అకాడమీ వారు శాస్త్రీయ పద్ధతిలో వ్యవసాయాది వివిధ వృత్తులకు సంబంధించిన మాండలిక వృత్తి పదకోశాలు రూపొందించి సర్వాంగ సుందరంగా ప్రచురించారు. అకాడమీ వారు ప్రకటించిన మాండలిక పదకోశము, సమాన వ్యతిరేకార్థ పద నిఘంటువు మొదలైనవి కూడా భాషా సేవకులకు పనికివచ్చే ఉద్గ్రంథాలు. ఈ వివిధ గ్రంథాలూ తెలుగు భాషా బృహన్నిఘంటు నిర్మాణానికి ఉపకరించే సాధనా లనడం నిర్వివాదం.

వివిధ శాస్త్ర విషయాలలో పారిభాషిక పద నిఘంటువుల్ని సరైన పద్ధతులలో నిర్మించడానికి నడుము బిగించి కృషి సాగిస్తున్న తెలుగు అకాడమీ వారు సాహిత్య శాస్త్ర నిఘంటువులు ప్రచురించారు. వారే ప్రచురించిన గ్రంథ సూచిక (1863-1969) మొదలైనవి కూడా పేర్కొనదగిన గ్రంథాలు. ఈ సందర్భంలో సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన వ్యాస రచనల సూచి (శ్రీ నే. శ్రీ. కృష్ణమూర్తి గారిది), సూక్తి సుధాకరం మొదలైనవి ప్రశంసించదగిన ప్రయత్నాలు. ఇవి భాషా జిజ్ఞాసువుల పాలిటి కల్పకాలు !

ఇలా సాహిత్య సంస్థలే కాక పండితులు కొందరు వ్యయప్రయాసల కోర్చి ఆకరగ్రంథాలు తయారు చెయ్యడం హర్షించదగిన అంశం. శ్రీయుతులు వేమూరి శ్రీనివాసరావు సంతరించిన పూర్వగాథాలహరి, అబ్బరాజు సూర్యనారాయణ కూర్చిన మహాభారత నిఘంటువు మొదలైనవి ఉదాహరించదగిన ఉద్గ్రంథాలు.

ఆధునికాంధ్ర మహాకవులు సృష్టించిన వాఙ్మయాన్ని అధ్యయనం చెయ్యడం కూడా చాలా అవసరం. ఈ దృష్టితో చూసినప్పుడు ప్రసిద్ధ రచయితల వాఙ్మయ జీవితాన్ని ఆధికారికంగా వివరించే రచనలు వెలువడాలని ప్రతి పరిశోధకుడు ఆశిస్తాడు. ఈ విషయంలో వరంగల్లులోని స్నాతకోత్తర విద్యాకేంద్రంలోని తెలుగు విభాగం సముచితమైన కృషి చేసి విశ్వనాథ వాఙ్మయ సూచికను వెలుగులోకి తీసుకువచ్చింది. ఇలాగే ఇతర సాహితీ మూర్తుల వాఙ్మయ సూచికలు వెలువడాలి.

ఆకర గ్రంథాలకు సంబంధించినంతవరకు తెలుగులో పేర్కొనదగిన ప్రయత్నాలు జరిగాయనీ, ఉద్గ్రంథాలు కొన్ని వెలువడ్డాయనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

**దండకాలు :**

నన్నయ నాటి నుంచీ నేటి దాకా ప్రచారంలో ఉన్న సాహిత్య ప్రక్రియలలో దండకం ఒకటి. ప్రసిద్ధులు పలువురు దండకాలు వెలయించారు. పారిజాతాపహరణకర్త నంది తిమ్మన కూడా ఒక దండకం వెలయించినట్లూ, దాని పేరు త్రిస్థలీ దండకమని శ్రీ ఉత్పల వెంకట నరసింహాచార్యులు గారు పేర్కొన్నారు.

మనకు లభించే దండకాలను నాలుగు విధాలుగా వింగడించవచ్చు. దేవతాస్తుతి, మానవ స్తుతి, మానవ నింద, శృంగారాత్మకం- అనేవి ఆ చతుర్విధాలు.

దండకాలు సంస్కృతంలో ఉన్నప్పటికీ, తమిళంలో 7 వ శతాబ్దిలోనే వెలసిన తాండకంతో తెలుగు దండకాన్ని పోల్చవచ్చు. ఈ విషయమై తులనాత్మక పరిశీలన జరగాలి. అప్పుడు గాని ఇదమిత్థమని చెప్పలేము. కాళిదాసకృత మని చెప్పబడే శ్యామలాదండకం ఆ మహాకవి సంతరించింది కాదని పండితులు పలువురు విశ్వసిస్తున్నారు. మన సాహిత్య ప్రక్రియల పేర్లు సంస్కృతంలో ఉన్నందువల్ల, అవి అన్నీ దేశిశాఖకు చెందనవి కావని భావించడం సమంజసం కాదేమో అనిపిస్తున్నది.

తెలుగులో పేర్కొనదగిన దండకాలు వచ్చినప్పటికీ వాటి చరిత్రను వివరించే పుస్తకం నేటికీ వెలువడక పోవడం శోచనీయం. శ్రీయుతులు నిడదవోలు వేంకటరావు, రావూరి దొరసామి శర్మ ప్రభృతులు దండకాలను గురించి వ్యాసాలు వెలయించారు.

**ఉపసంహారం :**

శతకం, ఉదాహరణం మొదలైన సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన అమూల్య రచనలు తెలుగులో ఎన్నో వెలువడ్డాయి. వాటి ప్రాశస్త్యాన్ని వివరించే ప్రశస్త రచనలూ వెలువడ్డాయి. భవిష్యత్తులో కూడా ఈ ప్రక్రియలలో రచనలు వెలువడతాయని ఘంటాపథంగా చెప్పవచ్చు. కాగా, తులనాత్మక దృష్టితో వీటిని పరిశీలించడం అవసరం.

ఆయా కవుల జీవిత విశేషాలను తెలుసుకోవడం ఎంత అవసరమో, వారి ఆత్మీయతను తెలుసుకోడానికి యత్నించడమూ అంతే అవసరం. ఇందుకు శతకాలూ చాటువులూ చాలా ఉపకరిస్తాయి. ధూర్జటిని గురించి ఒక అవగాహన ఏర్పడాలంటే, అందుకు ఆయన కావ్యం కంటె శతకమే ఎక్కువగా ఉపకరిస్తుందని నా విశ్వాసం. అలాగే మహాకవి శ్రీనాథుని పరిహాస రసికతనూ లోకజ్ఞతనూ గ్రహించడానికి ఆయన చాటూక్తులు ఉపకరిస్తాయి.

ఈనాడు విశ్వవిద్యాలయ స్థాయిలో జానపద వాఙ్మయం గురించి పరిశోధన జరుగుతున్నంత యెత్తున చాటువులను గురించి కూడా విస్తృతమైన పరిశోధన జరగాలి. ప్రజల గుండెలలో తలదాచుకున్న చాటువుల్ని సేకరించి, గ్రంథస్థం చెయ్యాలి. వాటిని కనుక క్షుణ్ణంగా పరిశీలిస్తే, మన కవులకు సంబంధించిన విశేషాలు, స్థానిక నాయకులకు సంబంధించిన వివరాలు ఎన్నో తెలుగులోకి వచ్చే అవకాశముంటున్నది. ఈ కోవకు చెందిన కార్యక్రమాలు ముమ్ముందు నిర్వహించబడగలవని నా ప్రగాఢ విశ్వాసం.



# తెలుగులో పరిశోధన - పదసాహిత్యం

—ఎస్. గంగప్ప

"మదివిటులు విధవలంజలు
పదకవితలు మారుబాసబాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిరవీరవరులు కడిదిపురమునన్" - ఇది తెలుగు కవులలో ప్రసిద్ధుడైన శ్రీనాథుని దని ప్రతీతి. కానీ ఇది నమ్మ శక్యంగాని సంగతి. శ్రీనాథుడు ఒక చెంప ఉద్దండ పండిత ప్రకాండుల ప్రశంసా పాత్రమైన శృంగార నైషధాది మహా కావ్యకర్త అయినట్లే, మరోవైపు పామర ప్రజల మన్ననలకు నోచుకొన్న పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథల్ని రచించి ఉండడం సర్వపండిత లోకానికి సువిదితమే. పరంపరగా మన పండిత వర్యులు పద సాహిత్యానికి ప్రాధాన్యం ఇవ్వలేదన్న మాట మాత్రం అక్షర సత్యం. చారిత్రక సత్యం.

సంస్కృత సమాస భూయిష్ఠమై, శబ్దాడంబర సంయుతమైంది పండితుల భాష. సరళమూ, సులలితమూ, సుఅభ గ్రాహ్యమూ అయినది పామర భాష. దీన్నే మనం లక్షణానుగుణంగా మరో విధంగా చెప్పవచ్చు. గ్రాంథిక భాష, గ్రామ్య భాష అనవచ్చు. కానీ ఈ గ్రాంథిక భాషకంటే గ్రామ్య భాషే మొదటిదన్న విషయం మనం మరవకూడదు. పామరుల వాడుక భాషయే కాలాంతరములో సంస్కరించబడి, వ్యాకరించబడి, లక్షణబద్ధమై గ్రాంథిక భాష అయ్యింది. 'ప్రయోగ శరణం వ్యాకరణమ్' అనే సూత్రమే దీనికి చక్కటి తార్కాణ.

ఇలాగే సాహిత్య విషయంలోను - మనం గమనించగలం. తెలుగు సాహిత్యాన్నంతటినీ పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ అనీ స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు. ఇంతకంటే దీన్నే ప్రౌఢ సాహిత్యమూ, జానపద సాహిత్యమూనని పేర్కొనవచ్చు. దీన్నే శిష్టసాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ- అని చెప్పటం సముచితం. ఈ శిష్ట సాహిత్యం కంటే శిష్టేతర సాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి, వికాసం పొందింది. ఆవెనుకే శిష్ట సాహిత్యం ఉద్భవించి తన బలాన్ని, ప్రాభవాన్ని స్థిర పరచుకొంది. నిజమే! 'ముందొచ్చిన చెవులకంటే వెనుకొచ్చిన కొమ్ములు వాడి' అన్న సామెత ఉంది కదా! అనాదిగా వస్తూన్న సహజమూ, స్వాభావికమూ, నిసర్గమనోజ్ఞమూ అయిన జానపద కవితను మన పూర్వులు సేకరించి కాపాడలేదు. రాజాదరణకు పాత్రమైన శిష్ట సాహిత్యం అధికారం చెలాయిస్తూ వచ్చింది. జానపద సాహిత్యమంతా ఆడి, పాడుకోడానికి పనికివచ్చే పద కవితలు. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్టసాహిత్యమంతా పద్యకవితలు. జానపద సాహిత్యం జన సామాన్యంలోనూ, పండిత సాహిత్యం పండిత పరిషత్తులలోనూ కొనసాగుతూనే వచ్చాయి. దీన్నే మనం మరో విధంగా చెప్పవచ్చు. తెలుగు సాహిత్యపు మాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తూ వస్తూంది. మొదటిది కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది. లిఖితం కాలేదు. కేవలం మౌఖికం (oral). రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన

ద్విపద కవిత; దీనికి మళ్లీ జానపదులలో వ్యాప్తిలో ఉన్న ఏలలు, జోలలు, కథలూ, గాథలూ మొదలైనవే ఆధారం. కాకపోతే ద్విపదని మాత్రమే పాల్కురికి గ్రహించాడు. గ్రహించడమే గాదు; దానికి కావ్య ప్రతిపత్తిని తెచ్చాడు. అంటే పండితులు గౌరవించేట్టు చేశాడు.

''తేట తెనుంగున ద్విపద రచింతు
... ... ... ... ... ... ...
ఒప్పదు ద్విపదఁ గావ్యోక్తినా వలవ,
దారూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతను
నట్టులుగాక కావ్యప్రౌఢి పేర్మి
నెట్టణ రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్య పద్యోదాత్తకృతులు
ద్విపదయు సమము భావింప......
... ... ... ...
వరకవు ల్గొనియాడ వర్ణనకెక్క
ధరఁ జెప్పఁ గృతియు నుద్యత్కృతిగాక''1

—అని చెప్పడమే గాదు, ఆనాడు పండితలోకంలో తెలుగు పలుకులంటే గౌరవాదరాలు లేవని తెలుస్తోంది. ఆ పండితుల్ని ఒప్పించడానికి పాల్కురికి పాటు పడినట్టు తెలుస్తుంది.

''ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁ దెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగు మాట'లనంగవలదు; వేదముల
కొలదియకాఁ జూడు డిల నెట్టు లనిన
జాటి తూమునకును జాటి యౌనేని
జాటింప సోలముఁ జాటియకాదె''2

—'తెలుగు మాట లనంగవలదు, వెదముల కొలదియకా జూడుడు' అని పాల్కురికి పట్టుబట్టి ఒప్పించాడు. అందుకే ఆ తర్వాత తెలుగు సాహిత్యంలో ద్విపద రచనకు అత్యంతాదరం లభించింది. ఒక శాఖగా శోభాయమానంగా వెలుగొందుతూ వచ్చింది.

ఇక మూడోది తాళ్ళపాక అన్నమార్యునితో ఆరంభమైన సంకీర్తన సాహిత్యం. ఇది తెలుగులోని పదసాహిత్యం. అనాదినుంచి వస్తూ, ఆనాటి సామాన్య ప్రజలలో ప్రచారంలో ఉండిన జానపద గేయరీతుల్ని గ్రహించి, అనేక పదాలు శిష్టకవితలో ఒక భాగంగా వెలయించి పద్య కవితాపీఠం పక్కనే పద కవితకు సైతం సరిపీఠం సవదరించిన ఘనత అన్నమాచార్యునికి దక్కింది. పైపెచ్చు 'సంకీర్తన లక్షణం' సంస్కృత భాషలో రచించి దీనికి విశిష్టతని, గౌరవ ప్రతిపత్తుల్ని తీసుకొచ్చాడు. ఇది గమనించదగ్గది, గర్వించదగ్గది. ఈ పదసాహిత్యంలో కొనసాగిన పరిశోధనను పరిశీలించడమే ఈ వ్యాసప్రధానోద్దేశం.

ఈ పదసాహిత్యం దేశి కవితా విభూతిలోని భాగం. దేశి అయిన తెలుగు కవిత నాలుగు విధాలనీ, అందులో మధుర కవితారీతిలో చేరినది పదకవిత అనీ లాక్షణికోక్తి ఉంది. ''తెల్గు కవిత యాశు, మధుర చిత్ర, విస్తరము లని నాల్గు తెఱఁగుల గలదని లాక్షణికులనిరి.........అందు మధుర కవిత యనగా పాటలు మొదలగునవి. లక్షణదీపికలో నీ విషయ మిట్లు చెప్పబడినది. మధుర కవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యతి దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్టొట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి,

1. పండితారాధ్య చరిత్ర:- పు. 18-20. పరిష్కర్త, డా॥ చిలుకూరి నారాయణరావు - 1939.
2. బసవపురాణము:- పరిష్కర్త, బండారు తమ్మయ్య. -1952.

నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురతర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళ హారతులు, శోభనంబులు, నుయ్యాలజోలలు, జక్కుల రేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పదాష్టపదులలో నివి యాదిగా గల్గునవి''[3]

ప్రపంచంలోని ఏ సాహిత్యాన్ని పరిశీలించినా పద పద్య కవితల్లో పదకవిత్వమే ముం దావిర్భ వించిందన్న విషయం సర్వ ప్రాచ్య పాశ్చాత్య విపశ్చిద్వర్యులూ అంగీకరించారు. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతుల్ని పొందినపుడు తదనుగు ణంగా ఆడి,పాడుకోవడంలోనే ఈ పదకవిత పుట్టింది. ఈ పదకవితావిర్భావాన్నిగూర్చి R.G. Moulton ఈ కవిత పుట్టింది. ఈ పద పండితుని అభిప్రాయం ఉల్లేఖించదగ్గది. "The improvised lyrical song, communal or individual, a popular or artistic is probably the simplest and most spontanious form of lyric expression ... The true song is primarly the instinctive outburst of emotion or emotional thought in language which by aptness of word and rythm echoes suggests the underlying emotion and melody of line and harmony of stanza is adopted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance ...... The song is therefore, more than anyother lyric kind, a musical cry."[4]

"That the popular or the traditional ballad is folk poetry, i.e. poetry that has originated usually in oral form among a homogeneous, non literary people, and has been handed down among them by word of mouth, is generally conceded."[5]

"మన దేశములో చాల ప్రాత పాటలు వేద సూక్తములు. మనుష్యజాతికే అవి మొదటి రచనలు అని యూహింపవలసినవి. వాటి గానమందు తాళము లేదు అన్నది మన మిక్కడ గమనింపవలసిన తత్త్వము... నేటికినీ తెలుగులో పరమ ప్రాచీన పద్ధతి యని చెప్ప దగిన పల్లె పాటలు, కపిలె పాటలు మొదలగునవి - కొన్ని తాళ నియమము లేకుండనే పాడబడుచున్నవి. ఈ రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచుభాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము. దాని పూర్ణానుభవమును మనకప్పుడే; సతాళముగనో వితాళముగానో, కావ్యకళా రసానుభవమును ప్రాచీన మనుష్య జాతి పాట రూపమునగో అనుభవించి రచించినదని పండితులూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు"[6] అన్న శ్రీ రాళ్ళపల్లి

---

3. వేటూరు ప్రభాకరశాస్త్రి; సింహావలోకనము పు-42
4. R.G. Moulton : Methods and Matetials of Literaty Criticism. P.P. 13, 14.
5. R.G. Moulton : The Modern Study of Literature- An Introdution to Literary Theory and Interpretation- P. 605.
6. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ: క్షేత్రయ్య పదకవిత్వము; సాహిత్యోపన్యాసములు - 3 క్షేత్రయ్య పద సాహిత్యము పు - 12,13.

అనంతకృష్ణశర్మ గారి మాటలు చక్కటి నిదర్శనాలు. కాబట్టి ఈ పదకవితే కాలాంతరంలో సంస్కరింపబడి పద్య కావ్యంగా, ప్రౌఢ కావ్యంగా, పండిత కావ్యంగా అంగీకరించబడి గౌరవాదరాలకు పాత్రమైంది. పద కవిత చాలాకాలం వరకు పండితామోదముద్రను పొందకపోయినా, రాజగౌరవ పాత్రం కాకపోయినా దానిదారిన అది నడుస్తూనే వచ్చింది. అభివృద్ధి చెందు తూనే వచ్చింది. సామాన్య ప్రజల మన్నలకు మాన నీయ మవుతూనే వచ్చింది. చివరికి రాజ గౌరవాద రాలకు నోచుకొంది. పండితులు సైతం సమాదరించడం జరిగింది.

తెలుగులో సైతం ఆరంభంలో చక్కటి పదాలుండేవనీ, పామర ప్రజలు వాటిని పాడి ఆనందిం చేవారనీ చెప్పడానికి తగిన ఆధారాలున్నాయి. పాల్కురికి సోమనాథుని మాటలే ఇందుకు చక్కటి తార్కాణం.

''మది నుబ్బ సంసారమాయా స్తవంబు
పదములు, పర్వత పదము లానంద
పదములు, శంకర పదముల్ నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సెజ్జ
వర్ణన మణిగణ వర్ణన పదము
లర్ణవ ఘోషణ ఘూర్ణిల్లుచుండ''[7] - భక్తులు శ్రీశైల పర్వతారోహణ సమయంలో పాడినట్లు పేర్కొ న్నాడు సోమనాథుడు. కానీ పైని వర్ణితమైన పదాల స్వరూప స్వభావా లేమిటో తెలుసుకొనే అవకాశం మనకు లభించలేదు. కారణం అలాంటిపాటలకు మన సాహిత్యంలో స్థానం లేకపోవడమే. ఇలాగే నన్నె చోడుని కాలంలో ఊయల పాటలు, గౌడు గీతాలు ఉండేవని తెలుస్తుంది.[8] ఇంతకంటే పూర్వం ఎలాంటి దేశిరచనలుండేవో కొంతవరకు తెలుసుకోవచ్చు. ప్రాఙ్నన్నయ యుగంలో శాసనాల్లోని తరువోజ, సీసం, మధ్యాక్కర మొదలైన దేశిచ్ఛందస్సులు వాడబడ్డాయి. ఇవి నిబద్ధచ్ఛందస్సులలో ఉండడంవల్ల శాసనాల్లోకి ఎక్కాయి. కానీ అనిబద్ధాలై పండితులచేత ఈసడించబడ్డ సామాన్య జన సముదా యపు పాటలు పరిగణనలోనికి రాలేకపోయాయి. అవి కేవలం మౌఖికం (Oral) కావడంవల్ల వాటికి స్థిరత్వం లేకపోవడంతో నశించిపోయాయి. అయితే మానవుడు జన్మించి సహజ సంతోష దుఃఖాల అను భూతిని పొందినప్పటినుంచీ పూర్వోక్తమైనట్లు పదాలు కోకొల్లలుగానే వెలిసే ఉంటాయి. పామర ప్రజల రచనలే పట్టుగొమ్మలై వాటికాధారంగా ఉండేవని మనం భావించడంలో తప్పులేదు. ''నన్నయ నాటికి తెనుంగున నెలకొన్న రచనములు, పాటలు, పదాలు, ఏలలు, జోలలు, అర్ధచంద్రికలు మొదలగు గేయ రచనములును, అక్షరగణములతోగాక మాత్రగణము లతో నిబద్ధమగు అక్కరలు, రగడలు, సీసములు, గీతములు, మంజరి, తరువోజ, ద్విపద మొదలగు పద్య రచనములునై యుండును.''[9] నాచన సోమ నాథుడు ఉత్తర హరివంశముతోపాటు 'వసంత విలాసం' అనే ప్రబంధం రచించినట్లు తెలుస్తోంది. అందులో జాజరపాట ప్రసక్తి ఉంది.

''వీణాగానం వెన్నెలతేట
రాణమీరగా రమణుల పాట
పేరు చెప్పిన పిన్నబ్రాహ్మణుపీట
జాణలు మెత్తురు జాజరపాట'' — ఇలాంటి తేట తెలుగు పద కవితల్ని విని ఆనందించే అదృష్టం ఆంధ్రులకు కలుగలేదు, అవి లభింపకపోవడంవల్ల.

ఏది ఏమైనా సంకీర్తన సాహిత్యం కృష్ణమా చార్యులతోనే ఆరంభమైంది. ఆయన సింహగిరి

7. పండితారాధ్య చరిత్ర - 513
8. కుమార సంభవము: 4-89; 6-45.
9. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి: దేశిసారస్వతవిభూతి- కిన్నెర (డిశం. 1953) పు-557.

పదనాలు కొన్ని లభించాయి. ఇతని తరువాత పేర్కొనదగ్గవారు యాగంటివారు. వారి పదాలు, వచనాలు పామర ప్రజల్లో బహుళ ప్రచారంలో ఉండేవి. తదనంతర కాలంలో వీరబ్రహ్మంగారు, వారి శిష్యుడు దూదేకుల సిద్ధయ్యల తత్వాలు ప్రసిద్ధిలోకి వచ్చిన సంగతి మన మెఱిగినదే.

తెలుగు పద సాహిత్యానికి క్రీ. శ. 15 వ శతాబ్ది వసంతకాలం. ఆనాడు వేనవేలు పదాలు రచింపబడ్డాయి. తెలుగు పద కవితకు ఆద్యుడు, అనవద్యుడు అన్నమాచార్యుడు; సంకీర్తనాచార్య, పద కవితా పితామహ బిరుదాంచితుడు. ఇతడి పుత్ర పౌత్రులు పదకవితా రచనా సేవ గావించారు. ఆ వెనుక సంగీత సాహిత్యాలకు సమాన గౌరవంతో పాటు, అభినయాన్ని జోడించి పదరచన చేసి పదమంటే శృంగారపదమన్న ప్రసిద్ధిని తెచ్చిన పద కవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఆ వెనుక పేర్కొనదగ్గ వాగ్గేయకారుడు సారంగపాణి. పదరచనచేసి భజన గోష్ఠులకు భద్రతకూర్చిన మహానుభావులు భక్త రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. నాదోపాసనతో ముక్తిపొందిన భక్తాగ్రేసరుడు త్యాగరాజస్వామి. రామదాసు కీర్తనలు, త్యాగరాజస్వామి కృతులు తెలుగు సాహిత్యానికి పుష్టిని, తుష్టిని చేకూర్చిన సంగతి అందరికీ తెలిసిందే. ఇలాగే ఇంకా ఎందరో మహానుభావులు పద సాహిత్యానికి సేవ చేసినవారు. వారందరికీ వందనాలు.

తెలుగులోని పద సాహిత్యంలో జరిగిన పరిశోధనా పద్ధతిని పరిశీలిద్దాం. తదితర సాహిత్య ప్రక్రియల్లో కంటే పద సాహిత్యంలో జరిగిన పరిశోధన తక్కువనే అంశం అందరూ అంగీకరించేదే. ఇంకా జరగవలసిందే ఎక్కువ. ఇప్పుడిప్పుడు పదకవితలపై మోజుపుట్టి విశ్వవిద్యాలయాల్లో పరిశోధన ప్రారంభమైంది. ఇది ముదావహమైన విషయం.

తెలుగు పదసాహిత్యానికి పట్టుగొమ్మ తాళ్ళపాక అన్నమాచార్యుడు (1408-1503). ఇతడు రచించిన పదాలు 32 వేలు. ఇవి అధ్యాత్మ పదాలని, శృంగార పదాలనీ రెండు విధాలు. వీటికానాడు సంకీర్తనలనియే వాడుక. అందుకే అన్నమాచార్యుడు సంకీర్తన రచన చేయడమే గాక సంకీర్తన లక్షణాన్ని సైతం సంస్కృతంలో సవదరించి ఉండడం విశేషం. ఇప్పుడిది అలభ్యం. అయినా అన్నమాచార్యుని మనుమడు చినతిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా రచించాడు. అందులోని పదనిర్వచనం ఇలా ఉంది:

''భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకటభూమీ
ధరవరకీర్తన లక్ష్యము
లురుపదకవితా పితామహుం డేర్పరచెన్[10]''

''పదమగు సుప్తిఙ్ఞన్తము
పదమవయవ, మయయవియును బదమనఁ బరగున్
దుది నీ తెఱంగులన్నియుఁ
బదకవితా మార్గ సార్వభౌముఁడు దెలిపెన్''[11]

''పదములు శృంగార వధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంక మెఱఁగి పలుకం జెల్లున్''

''వల్లవ నారీ మ్లేచ్ఛా
ద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసక ముఖ్య నాటకాదిక ఫణితిన్.''

---

10, 11- శ్రీ చిన తిరుమలాచార్యుడు : సంకీర్తన లక్షణము : **Vol. I. The Minor works of Tallapaka Poets : Ed. by V. Vijaya Raghavacharya and G. Adinarayana naidu-1935.** పద్యములు : 18, 24, 56, 58

''వైరాగ్య వృద్ధికరగం
భీరపద శ్రేణి పొసఁగఁ బెనుపుచుఁ గ్రా
మ్య రమ్య విష్ణు చరితో
దారములై యున్నఁ జాలు ధరణిన్వేలయన్''[12]

దినాని కొక్కటిగా 32 వేల పదాలు శ్రీ వేంకటేశ్వర ముద్రతో అన్నమాచార్యుడు, అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు రచించారు. ఆ వెనుక వాటిని భద్ర పరచడం కోసం రాగిరేకుల మీద చెక్కించడం పెద తిరుమలాచార్యుడే ఆరంభించాడు. తరువాత చిన తిరుమలాచార్యుడు ఆ పనిని పూర్తిచేసి సుమారు 1545 ప్రాంతంలో ముగించి సంకీర్తన భాండారాన్ని స్థాపించి ఉండవచ్చునని తెలుస్తూ ఉంది.[18] 1915 లోనే ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు కొన్నిటిని తమ పత్రికలో ప్రకటించారు. కానీ 1935 నుంచి మాత్రమే వీటి ప్రకటన కార్యక్రమం ఆరంభమైంది. సంపుటం-1. తాళ్ళపాక వారి లఘు కృతులు; సం-2. తాళ్ళపాక వారి అధ్యాత్మ కీర్తనలు; సం- 3. తాళ్ళపాక వారి శృంగార కీర్తనలు-ఈ మూడింటి పరిష్కర్తలు శ్రీ విజయ రాఘవాచార్యులు, జి. ఆదినారాయణ నాయుడు గారు. సం. 4. తాళ్ళపాక వారి శృంగార సంకీర్తనలు, సం. 5. తాళ్ళపాకవారి అధ్యాత్మ సంకీర్తనములు: వీటి పరిష్కర్తలు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. సం.లు. 6,7,8,9,10,11 అధ్యాత్మ సంకీర్తనలు: పరిష్కర్తలు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారు, ఏ.వి. శ్రీనివాసాచార్యులు గారు. సం.లు. 12,13,14,15,17 అన్నమాచార్యుల శృంగార సంకీర్తనములు, సం. 16 చినతిరుమలాచార్యుని శృంగారాధ్యాత్మ సంకీర్తనములు: పరిష్కర్తలు: శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, ఏ.వి. శ్రీనివాసాచార్యులుగారు. సం. 18. అన్నమాచార్యుని శృంగార సంకీర్తనలు: సం. 21 పెదతిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు: పరిష్కర్తలు డా॥ పి.టి. జగన్నాధరావుగారు. సం. 19,20,22. అన్నమాచార్యుని శృంగార సంకీర్తనలు -పరిష్కర్తలు: శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు. ఆతరువాత 23 పెదతిరుమాలాచార్యుని శృంగార సంకీర్తనలు, 24, 25,26,27,28,29 అన్నమాచార్య శృంగార సంకీర్తనలు పరిష్కర్తలు ; శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు. పూర్వమే ముద్రితమైన అన్నమాచార్యుని ఆధ్యాత్మ కీర్తనల్ని కలిపి సం. 1. గా శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించి ప్రకటించారు. శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ ; I.A.S. గారు తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహణాధికారిగా ఉండగా అన్నమాచార్య కళాపీఠమనీ, అన్నమాచార్య ప్రాజెక్టు అనీ ప్రత్యేకంగా స్థాపించి, ప్రత్యేకాధికారులను నియమించి అన్నమాచార్య సంకీర్తన ప్రచారానికి దోహదంచేశారు. 1981 మేనెలలో అన్నమాచార్యజయంతి సందర్భంగా అన్నమాచార్యుని సంకీర్తనలపై గోష్ఠులు, సదస్సులు ఏర్పాటు చేసి, పలువురు పండితులను సత్కరించడం జరిగింది. 1981 సం॥లో బ్రహ్మోత్సవాల్ని పురస్కరించుకొని విజయవాడ, ఆకాశవాణివారు గోష్ఠి పెట్టి, పండితులచే అనేక ప్రసంగాలు చేయింపించి ప్రసారం చేశారు. పైపత్రాలు, ప్రసంగాలు గ్రంథ రూపంలో రాబోతున్నాయి. తి.తి. దేవస్థానం వారు అన్నమాచార్య పదాల పరిష్కరణ కొనసాగింప జేస్తున్నారు. అంతేగాక శ్రీ వేకంటేశ్వరవిశ్వవిద్యాలయంలో అన్నమాచార్య పీఠం నెలకొల్పబడుతుంది. శ్రీ వేంకటేశ్వర, నాగార్జున, శ్రీ కృష్ణదేవరాయ, హైద్రాబాద్,

---

12. శ్రీ చినతిరుమలాచార్యుడు : సంకీర్తన లక్షణము : Vol.I. The Minor works of Tallapaka poets : Ed. by V. Vijaya Raghavacharya and G. Adinarayana Naidu-1935 పద్యాలు 13, 24, 56, 58.

18. డా॥ వేటూరి ఆనందమూర్తి : తాళ్ళపాక పదకవితలు-భాషా ప్రయోగ విశేషాలు (ద్వితీయ భాగము) పు-56, 57.

ఉస్మానియా, ఆంధ్ర విశ్వవిద్యాలయాల్లో అన్నమాచార్యుని సంకీర్తనలపై వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించి పరిశోధనలు కొనసాగిస్తున్నారు. ఈ వ్యాసకర్తవి అనేక వ్యాసాలు పత్రికల్లో వచ్చాయి. అంతేగాక ప్రస్తుతం ''అన్నమాచార్యులు-ప్రముఖ వాగ్గేయకారులు : తులనాత్మక అధ్యయనం'' అనే అంశాన్ని వ్యక్తిగతమైన పరిశోధనంగా గ్రహించి కొనసాగిస్తున్నాడు.

అంతకుముందే డా॥ వేటూరి ఆనందమూర్తి గారు అన్నమాచార్యుని సంకీర్తనలపై పరిశోధించి తాళ్లపాక కవుల కృతులు-వివిధ సాహితీ ప్రక్రియలు (ప్రథమభాగము) 1964, తాళ్లపాక కవుల పద కవితలు-భాషా ప్రయోగవిశేషాలు (ద్వితీయభాగము)-1976 ప్రకటించారు. శ్రీమతి కె. రామలక్ష్మి 'తాళ్ళపాకవారి పలుకుబళ్లు' రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన ప్రకటించారు. డా॥ ముట్నూరి సంగమేశంగారు 'అన్నమాచార్య సాహితీ కౌముది' (1981) రచించారు. అన్నమాచార్య సంకీర్తనల్లో ముఖ్యమైన వాటిని గ్రహించి స్వరకల్పనచేయగా తిరుమల తిరుపతి దేవస్థానమువారు ప్రకంటిచారు.

ఇంకా రాగిరేకులమీది పదాలను పరిష్కరించి ప్రకటించవలసినపని ఎంతైనా ఉంది. ఆ పనిలో నిమగ్నులై సమర్థవంతంగా నిర్వహిస్తూన్నారు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు.

అన్నమాచార్యుని తరువాత పేర్కొనదగ్గ పదకవితాచక్రవర్తి క్షేత్రయ్య. (1590-1675) ఇతడు సుమారు 4500 పదాలు రచించినట్లు తెలుస్తూంది. ఇవన్నీ మువ్వ గోపాలాంకితాలు. శృంగార రస భూయిష్ఠాలు. వీటిలో సంగీత సాహిత్యాలకు శోభ చేకూర్చడమేగాక, అభినయం జోడించడం విశేషం. పదాభినయం క్షేత్రయ్యతోనే ఆరంభమైంది. ముద్దు తే దనికా దు. బహుళ ప్రచారం వచ్చింది క్షేత్రయ్యతోనే అని అర్థం. మొదట క్షేత్రయ్యను పతిచయం చేసినవారు సుబ్బరామ దీక్షితులు. పరిశోధించి వివరించిన వారు విస్సా అప్పారావుగారు. వీరు విపులమైన పీఠికతో 330 పదాలను ఆంధ్ర గాన కళా పరిషత్, రాజమండ్రి వారి పక్షాన మిక్కిలి పరిశ్రమించి 1950 లో ప్రకటించారు. ఇందుకు తేవ పెరుమాళ్లయ్య (1862) గారూ, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమూ (1864), వివేక చంద్రోదయ ముద్రాక్షర శాలా (1874), భువనగిరి రంగయ్య శెట్టిగారూ (1916), సంగీత సర్వార్థ సంగ్రహమూ (1917) ప్రకటించిన గ్రంథాలు చక్కగా ఉపకరించాయి. ఇంకా మద్రాసు అడయారు పుస్తక భాండాగారంలోని తాళపత్ర గ్రంథాలు, తిరుపతి దేవస్థానం, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం, తంజావూరులోని సరస్వతీ మహల్ పుస్తక భాండాగారం మొదలైన చోట్ల లభించిన వ్రాత ప్రతులూ విస్సా వారికి ఉపకరించినట్లు తెలుస్తుంది. వీ రీ విధంగా 330 పదాలు సేకరించినట్లు, సుమారు 90 పదాలు నూతనంగా సంపాదించ గలిగామని వారు పేర్కొన్నారు.[14] కానీ 1886 లో మైలాపూరు 'మాణిక్య మొదలారి' మాణిక్య మందిరమనే ముద్రాక్షర శాలలో ముద్రితమైన 'క్షేత్రయ్య పదంబులు'ను విస్సావారు చూచినట్లు లేదు. ఇందులో 260 క్షేత్రయ్య పదాలతో పాటు 13 త్యాగరాజు కృతులు ఉన్నాయి. ఈ ప్రతిలోని ఏడు క్షేత్రయ్య పదాలు విస్సావారి ప్రతిలో చేరనే లేదు. వావిళ్లవారు 1916 లో 200 క్షేత్రయ్య పదాలు ముద్రించి, 1950 లో పునర్ముద్రించి శ్రీమాన్ కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు, తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగార్ల పరిష్కరణతో పైవాటికి 118 పదాలు కలిపి 1951 లో ప్రకటించారు.

---

14. విస్సా అప్పారావుగారు: క్షేత్రయ్య పదములు పుట. 9

విస్సావారి ప్రతిలో లేని 20 పదాలు అదనంగా చేర్చినట్లు పరిష్కర్తల అభిప్రాయం. 1952 లో డా॥ గిడుగు వెంకట సీతాపతిగారు స్వీయ, పరకీయ, సామాన్య నాయికా విభజన చేసి పదాలకు కొంత ఉపోద్ఘాతం రచించి, 360 క్షేత్రయ్య పదాలు ప్రకటించడం విశేషం. శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు 1966 లో శీర్షికలతో 100 పదాలు కూర్చగా జయంతి ప్రచురణలు, విజయవాడ వారు ప్రకటించారు.

1954 లో టి.వి. సుబ్బారావుగారి సంపాదకత్వంలో శ్రీ మంచాళ జగన్నాథరావుగారు స్వరాలు కూర్చగా 78 క్షేత్రయ్య పదాలను రాజమండ్రి ఆంధ్ర గాన కళా పరిషత్ పక్షాన శ్రీ విస్సావారు ప్రకటించారు. 1968 లో నిర్మలా పబ్లిషర్స్ వారు బి. కుమారస్వామిగారు స్వరాలు కూర్చగా 20 క్షేత్రయ్య పదాలు ప్రకటించారు. ఇంతకంటే ముఖ్యంగా 140 పదాలకు శ్రీ మంచాళ వారు స్వరాలు కూర్చగా 1973 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు ప్రకటించడం విశేషం.

ఎందరో క్షేత్రయ్య పదాలను అభినయిస్తూ ఉంటారు. కూచిపూడి నృత్యంలో క్షేత్రయ్య పదాభినయం ఒక భాగం. అభినయంలో ఆచార్యులైన శ్రీ నటరాజ రామకృష్ణగారు పరిశోధించి 'క్షేత్రయ్య పదాభినయం' గ్రంథమే ప్రకటించారు.

పూర్వోక్తమైనట్లు క్షేత్రయ్యను పరిచయం చేసిన వారు సుబ్బరామ దీక్షితులు. ఆచార్య పి. సాంబమూర్తి గారు తమ 'Indian Music Series' లో క్షేత్రయ్యను సందర్భోచితంగా ప్రస్తావించారు. క్షేత్రయ్యను గూర్చి పరిశోధించి వివరించినవారు విస్సావారు. తమ గ్రంథాల్లో ప్రస్తావించిన వారు చాగంటి శేషయ్య, బాలాంత్రపు రజనీకాంతరావు, ఆరుద్రగార్లు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఉపన్యాసాల సంపుటిని ప్రకటించారు. ప్రకటించిన వ్యాసాల్లో విలువైంది శ్రీ రాళ్ళపల్లి వారిది. ఈ వ్యాసకర్త 1972-73 లో సమగ్రమైన చక్కటి విమర్శనాత్మక గ్రంథం "క్షేత్రయ్య పద సాహిత్యం" అన్నది రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డును అందుకొన్నాడు. ఈ మధ్యనే శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు 'క్షేత్రయ్య' అనే ఆంగ్లగ్రంథం రచించారు.

భద్రాచల రామదాసు (1620-1680) కీర్తనలు పల్లెపట్టులలోని భజన కూటములలో రామ మందిరాల్లో మనకు వినిపిస్తూ ఉంటాయి. వీటిలో కొన్నింటికి మాత్రం శ్రీ మంచాళ జగన్నాథరావు గారు స్వరాలు కూర్చగా ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ వారు ప్రకటించారు. గుజిలీ ప్రతులలో రామదాసు కీర్తనలు కనిపిస్తాయి. కానీ తత్సంబంధి పరిశోధన జరగనేలేదు.

క్షేత్రయ్యకు ముందూ, సమకాలికంగా వెనుకా పద కవితలు కోకొల్లలు వెలిశాయి. పదకవితలకు పట్టుగొమ్మలైన యక్షగానాలు నాయక రాజుల కాలంలో అనేకం రచిత మయ్యాయి. యక్షగానాల మీద ఆచార్య యస్వీ జోగారావు గారు పరిశోధించి 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర'ను ప్రకటించారు. విజయరాఘవ నాయకుడు, అతని ఆస్థాన కవయిత్రి రంగాజమ్మ చక్కటి యక్షగాన కర్తలు, పదకవితా కర్తలూను. అతని ఆస్థాన కవుల్లో కామరసు వెంకటపతి సోమయాజి, పురుషోత్తమ దీక్షితుడు, కోనేటి దీక్షిత చంద్రుడు, పెద్దిదాసు మొదలైనవారనేకులు ఈ పద కవిత అల్లినవారే.

పోతులూరి వీరబ్రహ్మంగారు, అతని శిష్యుడు దూదేకుల సిద్ధయ్యల తత్వాలు అనేకం. కాని వాటి మీద పరిశోధన లేవీ ఇంకా రానేలేదు. శ్రీ రాళ్ళపల్లి వారు 'వేమన' ఉపన్యాసాల సంపుటిలోను, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు తమ 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర'లోను, డా॥ ఎన్. గోపి వేమన మీది సిద్ధాంత గ్రంథంలోను వీరబ్రహ్మం గారిని గూర్చి రాసినవే తప్ప జరగవలసినంత పరిశోధన జరగలేదు.

పద కర్తల్లో క్షేత్రయ్య తరువాత పేర్కొనదగ్గవాడు సారంగపాణి (1680-1750). చిత్తూరు మండలంలో వెలసిన కార్వేటి నగరం ఆస్థాన వాగ్గేయ కారుడు. సారంగపాణి పదాలు మొదట కార్వేటి నగరం భారతీ లీలాసదన ముద్రాక్షరశాలలో ప్రకటితం. 1878 లో భువనగిరి రంగయ్య శెట్టిగారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షరశాలలో ముద్రితం. 1963 లో రాజమహేంద్రపరం సరస్వతీ పవర్ ప్రెస్‌లో శ్రీ పురిపండా అప్పలస్వామి గారి సంపాదకత్వంలో ప్రకటించబడ్డాయి. కానీ సారంగపాణి పదాల గూర్చిన కొన్ని వ్యాసాలు తప్ప పరిశోధన జరగలేదు. అయితే ఈ వ్యాసకర్త సారంగపాణి జీవితమూ, పదాలకూ సంబంధించిన అనేకాంశాలను పరిశోధించి 'సారంగపాణి పద సాహిత్యం' అనే గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి అర్థిక సాహాయ్యంతో 1980 లో ప్రకటించాడు. దేవస్థానం వారి ఆర్థిక సాహాయ్యంతోనే కుమారి మంగళగిరి ప్రమీలాదేవి, డా॥ టి. యస్. మురళీకృష్ణమ్మగార్లు నా యీ గ్రంథాన్ని హిందీలోకి అనువదించగా ముద్రణలో ఉంది. త్వరలోనే వెలుగుచూడగలదని తెలుపడానికి నా ఆనందాన్ని ప్రకటిస్తున్నాను.

తెలుగు పదకర్తలలో అజ్ఞాతులు అనేకులు. తెలియవచ్చిన వారిలో ఘనం శీనయ్య, మేలట్టూరు కాశీనాథయ్య, ఆడి అప్పయ్య, వీణ పెరుమాళ్ళయ్య, మాతృ భూతయ్య, ఇనుపసెనగల వెంకట్రామయ్య, పల్లవి గోపలయ్య, దొరసామయ్య, సభాపతయ్య మొదలైన వారెందరో! వారందరిని గూర్చి విస్తృతమైన పరిశోధన జరగవలసి ఉంది. వాగ్గేయకారుల్లో చెప్పుకోదగ్గవారు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు ముఖ్యులు.

అధ్యాత్మ సంకీర్తనలతో తెలుగు వారి హృదయాలను చూరగొన్న మునిపల్లె సుబ్రహ్మణ్య కవి (1730-1780) ఎన్నో పదాలు రచించారు. ఇతనిపై జరగవలసిన పరిశోధన ఎంతైనా ఉంది. ఉన్నంతలో కుమారి ప్రమీలాదేవి 'భారతీ కళా తరంగిణి' లోని వ్యాసం పేర్కొనదగ్గది.

త్యాగరాజస్వామి (1767-1847) నాదోపాసనలో ముక్తిపొందిన మహావాగ్గేయకారసత్తముడు. శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, త్యాగరాజస్వామివారలను కర్ణాటక వాగ్గేయకార త్రయమంటారు. అందులో సుప్రసిద్ధుడు త్యాగరాజస్వామి. ధాతుమాతువుల్లో ధాతుకల్పనాదక్షుడితడు. అయినా అన్నమాచార్యుని కాలంలో సంకీర్తనగాను, క్షేత్రయ్యనాడు శృంగారపదంగాను, రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి అనే వాగ్గేయకారులలో కీర్తనగాను ప్రసిద్ధికెక్కి, పరిణతి గాంచి త్యాగరాజస్వామి కాలంలో కృతిగా రూపొందింది. ధాతువుకే ప్రాధాన్యమైన మాతు విరహితంగా ఉండడానికి వీలులేక పోలేదుగాని దానికంత ప్రాముఖ్యమివ్వరు సంగీతజ్ఞులు. కాబట్టి త్యాగరాజస్వామి కృతులు రచించి సంగీతానికి అమితమైన సేవచేసినా, సాహిత్యకారుల్లోనూ ఆయనకు ఒక ప్రత్యేక స్థానముంది. త్యాగరాజ కృతులకు త్యాగబ్రహ్మోపనిషత్తు అనే ప్రసిద్ధి కలిగింది. ఈయన 2400 వేల కృతులు రచించగా 660 మాత్రమే స్వర సాహిత్యాలతో ఈనాడు ప్రచారంలో ఉన్నాయి. 72 మేళకర్తరాగాలలోను కృతులు రచించారు. ఇతని ఘనరాగ పంచరత్న కీర్తనలు ప్రసిద్ధమే. ఇంతేగాక ప్రహ్లాదభక్తివిజయమూ, నౌకా చరిత్రమూ, సీతారామ విజయమూ అనే మూడు సంగీత రూపకాలను రచించాడు. వీటిని ప్రబంధాలని అంటారు. ఈ మహావాగ్గేయకారునిపై జరగవలసినంత పరిశోధన జరగలేదు. విస్సా అప్పారావుగారి సంపాదకత్వంలో కల్లూరి వీరభద్రరావుగారు పరిష్కరించగా రాజమండ్రి ఆంధ్ర గాన కళాపరిషత్తు పక్షాన త్యాగరాజ కీర్తనలు 1948లో ప్రకటితమయ్యాయి. టి.వి. సుబ్బారావుగారి సంపాదకత్వంలో 1951 లో స్వర సహితంగా కొన్ని త్యాగరాజ కృతులు ముద్రించబడ్డాయి. కల్లూరి వీరభద్రశాస్త్రి సంపాదకత్వంలో 1975 లో మొదటి సంపుటమూ, 1978 లో రెండో సంపుటమూ వచ్చాయి. బందరులో శ్రీ భావరాజు నరసింహారావు గారు సంకలనం చేసి 1981 లో రెండు సంపుటాలుగా త్యాగరాజ కృతులను ప్రకటించారు. 1979 లో తిరుపతి అనంతపద్మనాభ[illegible] 'సద్గురు త్యాగరాజు' అనేదీ, 1981 లో తిరుమల[illegible]

సుధాకరరెడ్డి 'నాదయోగి త్యాగయ్య' అనే పేరుతోను, డా॥ కె. సర్వోత్తమన్ 'త్యాగయ్య' అనే చిన్ని పుస్తకాన్ని రచించారు. కానీ వీటన్నిటిలో శ్రీ కె. ఇ. పురుషోత్తమన్‌గారు ఆంగ్లంలో ప్రకటించిన 'త్యాగోపనిషత్తు' ఉత్తమ గ్రంథం. త్యాగరాజస్వామి హృదయావిష్కరణ గావించిన గ్రంథం. పరిశోధనాత్మకమైంది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్య సి. నారాయణరెడ్డిగారి పర్యవేక్షణలో కె. వి. యస్. ఆచార్యగారు త్యాగరాజ కృతులపై పరిశోధన చేస్తున్నట్లు తెలుస్తుంది.

పద సాహిత్యాన్ని గురించి చెప్పేటప్పుడు ప్రాతస్స్మరణీయుడు సుబ్బరామదీక్షితులు. ఆయన రచించిన సంగీత సంప్రదాయ ప్రదర్శిని (1904) రెండు సంపుటాలుగా ప్రకటించారు. అందులో ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర రచించారు. తరువాత పేర్కొనదగ్గ ప్రముఖ గ్రంథం శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము' మద్రాసు ఆంధ్ర భాషా సంఘం వారి బహుమతికి నోచుకొన్న పరిశోధనాత్మక గ్రంథం. కుమారి మంగళగిరి ప్రమీలాదేవి తెలుగు వాగ్గేయకారులగూర్చి అనేక వ్యాసాలు పలు పత్రికల్లో ప్రకటించడమేగాక, 'భారతీకళా తరంగిణి' (1981) అనే పేరుతో పుస్తకం సైతం ప్రకటించారు. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు 'తెలుగులో పదకవిత'ను ప్రకటించారు. ఈ మధ్యనే 1980-81 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డుకు నోచుకున్నది. ఈ వ్యాసకర్త కృతమైన 'తెలుగులో పదకవిత' - ఇది త్వరలోనే ముద్రించబడబోతూంది. దీన్ని అన్ని విధాలా ఉత్తమ పరిశోధన గ్రంథంగా ఈ రచయిత తీర్చిదిద్దడం జరిగింది.

పదసాహిత్యంలో ప్రప్రథముడైన అన్నమాచార్యుని సంకీర్తనలు ఈనాడు అన్ని విశ్వవిద్యాలయాల్లోని ఆచార్యుల్ని, అధ్యాపకుల్ని, పరిశోధక విద్యార్థుల్ని ఆకర్షించాయి. ఈ విషయం సైతం పూర్వోక్తం. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి పర్యవేక్షణలో తాళ్లపాక కవులమీద పరిశోధన జరిగింది. శ్రీ సత్యసాయి మహిళా కళాశాలా ప్రిన్సిపల్ డా॥ జె. హేమలత పర్యవేక్షణలో పెద తిరుమలాచార్యుని పదాలపై పరిశోధన జరిగింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో డా॥ కె. సర్వోత్తమన్ పర్యవేక్షణలో అన్నమాచార్య సంకీర్తనల్లోని అలంకారాలమీద, జానపద రీతులమీద పరిశోధన జరుగుతూ ఉండడమే గాక వారే స్వయంగా 'అన్నమాచార్యుని సంస్కృత సంకీర్తనల'మీద పరిశోధిస్తున్నారు. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు గారి పర్యవేక్షణలో అన్నమాచార్యుని శృంగార సంకీర్తనల మీద, అధ్యాత్మ సంకీర్తనలమీద పరిశోధన కొనసాగుతుంది. నాగార్జున విశ్వ విద్యాలయంలో ఈ వ్యాసకర్త పర్యవేక్షణలో 1) 'అన్నమాచార్య సంకీర్తనలు-వర్ణనలు' (గుమ్మా సాంబశివరావు) 2) అన్నమాచార్య సంకీర్తనలు-జానపద గేయ సంగీత రీతులు (కుమారి మంగళగిరి ప్రమీలాదేవి) పరిశోధన ప్రారంభమైంది. ఈ వ్యాసకర్త అనేక ప్రముఖ పత్రికల్లో అన్నమాచార్య సంకీర్తనలపై పలు వ్యాసాలు ప్రకటించారు. పూర్వోక్తమైనట్లు ప్రస్తుతం 'అన్నమాచార్యుడు: ప్రముఖ వాగ్గేయకారులు- తులనాత్మక అధ్యయనం' వ్యక్తిగత పరిశోధనగా కొనసాగిస్తున్నాడు.

ఇలాగే ఇంకా ఎందరో పద సాహిత్యంపై పరిశోధన చేస్తూ ఉండవచ్చు. అయినా ఈ వ్యాసకర్త విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత వివరించడం జరిగింది. అలాంటి మహానుభావులు ఎవరైనా విస్మరింపబడి ఉంటే వారికందరికీ ఈ రచయిత వందనాలు అర్పించుకొంటున్నాడు. క్షమాభిక్షకై అర్థిస్తున్నాడు. తెలిపితే సరిదిద్దుకొంటాడు.

పద సాహిత్యం మీది మమకారంతో కృషిచేసి, అందులోని నిజమైన కవితని, భావలోని సొగసును, నుడికారాన్ని, పలుకుబడిని స్పష్టం చేసి, అదే ప్రజా కవిత అని భావి పరిశోధకులు నిరూపిస్తారని ఈ రచయిత నిక్కాక్సయిన ఆకాంక్ష!



# తెలుగులో పరిశోధన - జానపద సాహిత్యం

—కొలకలూరి ఇనాక్

1. జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం ఒక భాగం. మిగతావి జానపద సాంఘిక జీవితం, జానపదవస్తుజాలం, జానపద కళలు. జానపద సాహిత్యంలో జానపద కవిత్వం, గద్య కథనం, సామెత, పొడుపు కథ ప్రముఖాంగాలు. జానపద సాంఘిక జీవితంలో పండుగలు, ఉత్సవాలు, క్రీడలు, వినోదాలు, వైద్యం, కులం, తెగ, మతం, వృత్తులు, నమ్మకాలు, ఆచార వ్యవహారాలు, ఆహార విహారాలు, నోములు, వ్రతాలు మొదలైనవి ముఖ్య విషయాలు. జానపద వస్తు జాలంలో సంస్కృతి బోధక వస్తు సంబంధి నిర్మాణాలు పనిముట్లు, బొమ్మలు, చేతికళలు, వాస్తువు, వాయిద్య పరికరాలు, వస్త్ర విన్యాసం, దైనందిన వస్తుజాలం, వంటావార్పు మొదలైనవి ప్రసిద్ధాలు. జానపద కళల్లో జా. నాటకం, జా. సంగీతం, జా. నృత్యం, జా. భాష ప్రధానాంశాలు. జానపద విజ్ఞానం దేశి ధర్మ నిరూపకం. మార్గ సంబంధి సాహిత్యం, జీవితం, వస్తు జాలం, కళల కంటే జానపద సంబంధి సాహిత్యం, జీవితం వస్తుజాలం కళలు భిన్నంగా ఉన్నాయి.

1.1. విశాలమైన జానపద విజ్ఞానంలోని జానపద సాహిత్యంలో జరిగిన పరిశోధన మాత్రమే సమీక్షించటం కర్తవ్యం. అయితే జానపద విజ్ఞాన ప్రభావం సమస్తం జానపద సాహిత్యంలో ఉంది. జానపద సాహిత్యం ఆధారంగా జానపద విజ్ఞానం గుర్తించవచ్చు. అలాగే జానపద సాహిత్యంలో జానపద విజ్ఞానంలోని చాలా భాగం ప్రతిబింబిస్తుంది. జానపద సాహిత్యం మూలంగా జానపద విజ్ఞానం దర్శించడానికి ఆకళింపు చేసుకోడానికి అవకాశం ఉంది.

1.2. సామూహిక కర్తృకం, స్థిరరూప రహిత్యం, అస్పష్టకాలం, మౌఖిక ప్రచారం, అకృతకశైలి, ప్రజాజీవితం, ఆశు ధర్మం. పునరుక్తి, నాటకీయత, అస్థిరాకృతి, సజీవభాష వంటి విభిన్న ధర్మాలతో ఉన్న సాహిత్యాన్ని జానపద సాహిత్యం అని పిలుస్తున్నారు. ఈ సాహిత్యాన్ని ప్రజావాఙ్మయమనీ (ఖండవల్లిలక్ష్మి రంజనం), పదవాఙ్మయమనీ (తల్లావఝుల శివశంకరస్వామి), అనాదృత వాఙ్మయమనీ (మల్లంపల్లి సోమశేఖర శర్మ), మధుర కవిత అనీ (వేటూరి ప్రభాకర శాస్త్రి,) దేశి సారస్వతమనీ (శ్రీపాద గోపాల కృష్ణమూర్తి) ఎన్నో పేర్లతో పిలిచినా జానపద సాహిత్యం అనే పేరు స్థిరపడింది. డా॥బి. రామరాజు జానపద సాహిత్యం అనే పేరు స్థిరపరచినట్లు డా॥ నాయని కృష్ణకుమారి తెలపటం జరిగింది.

1.3. తెలుగులో జరిగిన జానపద సాహిత్య పరిశోధన సేకరణ, వివరణ, పరిశోధనగా పరిణామం చెందింది. జానపద విజ్ఞానానికి ప్రపంచమంత ప్రాచీనత ఉన్నా, ఈ పేరుతో ఈ ఆలోచనకు ఒకటిన్నర శతాబ్ది కూడా దాటలేదు ఆంగ్లంలో లాగే ఆంధ్రంలో కూడా ఈ జానపద సాహిత్యదృష్టి ఈ మధ్యే ఆరంభమయింది. జనపదాలకు సంబంధించిన ఈ విజ్ఞానం విశ్వవిద్యాలయ ప్రాంగణాలను ప్రాకటం, పరిశోధన సాగటం ఆధునిక పరిణామమే ! విశ్వవిద్యాలయాలలో, వెలుపలా, జరిగిన జానపద సాహిత్య పరిశోధన దేశ స్వాతంత్ర్యానికి ఇటూ అటూగా వుంది.

2. సేకరణ : జానపద సాహిత్య పరిశీలన దశలన్నింటిలో సేకరణ ప్రధాన భాగంగా ఉంది. ప్రజలు, కవులు, పండితులు, ఉద్యోగులు, పరిశోధకులు, జానపద సాహిత్య సేకరణ విశేషంగా కొనసాగించారు. ఆ సాహిత్యాన్ని ప్రచురించారు. ప్రచారం చేశారు. వ్యాసాలు వ్రాశారు. విమర్శనలు వెలయించారు. పరిశోధన చేశారు.

2.1. 1842 లో బొబ్బిలి కథ, కుమార రాముడి కథ, కామమ్మ కథ, పల్నాటి వీరచరిత్ర వీరగాథల్ని సి. పి. బ్రౌన్ సేకరించాడు. దేశి సారస్వతంగా చెప్పుకోదగ్గ కథలు పాటలు కూడా సేకరించాడు. తాళపత్ర గ్రంథ సాహిత్యం సేకరించినట్లే జానపద మౌఖిక సాహిత్యం కూడా సేకరించి ఆంధ్ర సాహిత్యానికి సి. పి. బ్రౌన్ అమూల్యమైన సేవ చేశాడు.

1988 లో కార్ 'ఆంధ్రలోకోక్తి చంద్రిక' పేరుతో కొన్ని సామెతలు సేకరించి ప్రకటించాడు. అదే సంవత్సరం రావిపాటి గురువాయురు తెలుగు సామెతల సంగ్రహం వెలువరించాడు. 1874 ప్రాంతంలో జె. ఎ. బోయర్ రాయలసీమలో ఉద్యోగిగా ఉన్నప్పుడు ఆరు పాటలను సేకరించి ప్రకటించాడు. ఇందులో ఒకటి చారిత్రకం. ఐదు శృంగార గీతాలు. ది ఇండియన్ ఆంటిక్వరీ, వా. III లో ఈ సాహిత్య పరామర్శగా ఒక వ్యాసం కూడా వ్రాశాడు. 1884 లో జానకి పాటలు, 1893 లో కోలాట కీర్తనలు వెలువడ్డాయి.

1899, 1903 సంవత్సరాల్లో నందిరాజు చలపతిరావు స్త్రీల పాటలను సంపుటాలుగా ప్రకటించాడు. 1905 లో మంగు వెంకటనాథరావు మరి కొన్ని స్త్రీల పాటలను చేర్చి ముద్రించాడు. అయితే 'స్త్రీల పాటలు' పేరుతో 1889 లో మంత్రి ప్రెగడ భుజంగరావు, 1898 లో జె. వెంకటరమణయ్య, జె. రామలక్ష్మయ్య గ్రంథాలు ముద్రించినట్లుగా ఆంధ్ర వాఙ్మయ సూచిక తెలుపుతూ ఉందని డా॥ బి. రామరాజు తెలపటం జరిగింది. ఎం. ఎన్. వెంకటస్వామి 1905 లో 'Some Telugu Folk Songs', 1906 లో 'Some Telugu Nursery Songs and Catches' సేకరించి ప్రకటించాడు. 1909 లో 'చిల్లర పాటలు' అనే పేరుతో ఒక గ్రంథం వెలువడింది. "1904 లో స్త్రీజనానంద నవీన కల్యాణ పాటలు, 1910 లో స్త్రీల వేడుక పాటలు (గూడ కృష్ణయ్య), 1911 లో స్త్రీజనవినోదిని పెండ్లి పాటలు (వి. కన్నయ్యదాసు), 1913 లో స్త్రీల పూజ పాటలు (తెలకపల్లి నరసమాంబ), 1915 లో స్త్రీల వేడుక పాటలు (ఘాలి సుబ్బారావు). 1919 లో స్త్రీజనానందకర కల్యాణ పాటలు (ఎన్. గోపాలకృష్ణయ్య)[1]" వెలువడ్డాయి. 1920 కి ముందే అప్పగింతల పాటలు, అడవి గోవింద నామ కీర్తనలు, కొమార్తె నత్తవారింటి కంపెడు పాట, కోలాట కీర్తనలు, తులసీ గోవింద నామములు, మంగళహారతులు, రాములవారి అలక, శ్రావణ మంగళవారపు పాటలు ముద్రితాలని తెలుపుతూ డా॥ ఆర్.వి.యస్. సుందరం ఆంధ్ర వాఙ్మయ సూచికలో పేర్కొబడ్డ 20 వ శతాబ్ది పూర్వార్ధంలో ప్రచురింపబడ్డ జానపద గేయ సంపుటాల పేర్లు; కన్యకామ్మవారి పాటలు, కోటప్ప గురుకీర్తనలు, పెండ్లి గోవింద నామములు, శ్రావణ మంగళవార, శుక్రవారముల పాటలు, చల్ మోహన రంగా సిరిసిరి మువ్వా పాటలు ఇవ్వటం గమనించవచ్చు.

"టేకుమళ్ళ అచ్యుతరావు 'ఆంధ్ర పదములు-పాటలు' కృష్ణాపత్రికలో (1917) ప్రచురించిన అనంతరం (1924) వ్యాసంగా ముద్రించాడు. జన జీవితంలో సాహిత్యంలో పల్లెపదాలు (ballads) ఎంతటి చైతన్యం కలిగించాయో తెలుపుతూ ఉదాహరణ సహితంగా ఉన్న"[2] ఈ రచన మంచి సేకరణ-

2.2. జానపద సాహిత్యం సేకరించినవాళ్ళలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వేటూరి ప్రభాకర శాస్త్రి, చిలుకూరి నారాయణరావు, అక్కిరాజు ఉమాకాన్తం, సురవరం ప్రతాపరెడ్డి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు వంటి వాళ్ళు అనేకు లున్నారనీ, వావిలాల సోమయాజులు, తిమ్మావజ్ఝల కోదండరామయ్య, తిరుమల రామచంద్ర, వేదాల తిరుమల రామానుజస్వామి, దేవేంద్ర సత్యార్థి, బంగోరె, శ్రీధర బాబు, ప్రయాగ నరసింహశాస్త్రి, అడిదము రామారావు, బాదగొని నరేంద్ర, చొక్కపు నారాయణ స్వామి వంటివాళ్ళు సేకరించటంతోపాటు వ్యాసాలు వ్రాశారనీ డా. బి. రామరాజు తెలపగా, డా. ఆర్వియస్ సుందరం కాశీనాథుని నాగేశ్వరరావు 'భారతి'లో, కేసరి 'గృహలక్ష్మి' లో బాల గేయాలు ప్రచురించినట్లు, ఆస్వాల్డు కూల్డ్రె ప్రోత్సాహంతో అడవి బాపిరాజు, కవికొండల వెంకటరావు, చింతా దీక్షితులు జానపద సాహిత్యం సేకరించినట్లు, నార్ల వేంకటేశ్వరరావు, విశ్వం, సభా ఆంధ్రప్రభలో చాలా గేయాలు ముద్రించినట్లు తెలపటం చూడవచ్చు.

''చింతా దీక్షితులు ప్రజావాఙ్మయం పేరుతో వెలువరించిన గ్రంథంలో ఆరు విషయాలు వ్యాసాలుగా విన్యస్తాలయ్యాయి. స్త్రీల సాహిత్యంలో పాటలు ప్రధాన భాగంగా ఉన్నాయి. శారీరక కష్టం మరచిపోవటానికి, మానసిక శాంతి పొందటానికి, హృదయానుభూతి వ్యక్తం చేయటానికి పాటలు ఉపయోగపడాయి. బాలవాఙ్మయం (పసివాళ్ళ) జీవిత బాధ్యత భరించే సమరత కలిగించేంత పటిష్ఠంగా రూపొందింది. ఈ వ్యాస సంపుటి స్త్రీ బాల సాహిత్యం'' ఉదాహరణలతో ఒస్సుతూ వుంది (తెలుగు వ్యాస పరిణామం).

2.3. డా. జి. యస్. మోహన్ 'తెలుగు జానపద విజ్ఞాన సూచి'(1982)లో సేకరణ గ్రంథాల వివరణ ఇవ్వటం జరిగింది. గేయాలు, కథా గేయాలు, ఇప్పటిదాకా ప్రచురితాలై తనకు లభించిన 266 రచనలను పేర్కొనటం ఉంది. అలాగ్గే, జానపద కథలు 41 ముద్రిత సేకరణలను, సామెతలు పొడుపు కథలు జాతీయాలు 34, రచనలను, 20 కీర్తనలను, 68 యక్షగానాలను, అవీ ఇవీ అన్నీ అని 22 గ్రంథాలను చిల్లర సేకరణ అంటూ 30 రచనల్ని ఇవ్వటమయింది.

2.4. ''శ్రీ టేకుమళ్ళ వారు పాత పాటలు (సాంప్రదాయిక విజ్ఞానము-మొదటి భాగము) అను పేరుతో ఒక చిన్న పొత్తమును, శ్రీ శ్రీపాద వారు పల్లె పదాలు (1953), స్త్రీల రామాయణపు పాటలు (1955), స్త్రీల పౌరాణికపు పాటల (1963)ను''[3] ప్రచురించారు. డా. బి. రామరాజు సంపాదకత్వాన త్రివేణి (1960), పిల్లల పాటలు (1960), తెలంగాణా పల్లె పాటలు (1968) సేకరణ సంకలన గ్రంథాలు వెలువడ్డాయి. ''సర్వశ్రీ గిడుతూరి సూర్యం, సీతారామనాయుడు వకీలు (హుజూరాబాదు), గంగుల శాయిరెడ్డి, ఇల్లిందల సరస్వతీ దేవి, గూడూరి, కనపర్తి, అచ్యుతరామరాజు గారలు తెలంగాణపు పాటలు సేకరించిరి.''[4]

2.5. పొడుపు కథలు(1931), తెలుగు సామెతలు లేక పొడుపు కథలు (1953), అత్త కోడండ్ర కథలు (1964) ప్రచురింపబడ్డాయి. కోడూరి శ్రీరామమూర్తి జానపద వస్తుజాలాన్ని, కె. రాజయ్య ప్రాచీన జానపద చిత్రాలను, జగదీశ్ మిత్తల్ జానపద కళావస్తువులను సేకరించారు.

ముసునూరి వేంకటశాస్త్రి 'తెలుగు జాతీయముల కథలు, ప్రతాప్ ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ ఆదిమ జాతులు కొండరెడ్లు, యానాదుల చరిత్రలు జానపద విజ్ఞాన దృష్టిని పెంచాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సేకరణ గ్రంథాలు 'తెలుగు సామెతలు' (1959), జానపద గేయాలు-సాంఘిక చరిత్ర (1974), పొడుపు కథలు (1975), కాటమరాజు కథలు (1976) విలువైన పీఠికలతో ప్రచురించింది.

జానపద సమితి, బెంగుళూరు అలిచిప్పలు-ఆణిముత్యాలు (1972) పేరుతో జానపద గేయాలు ప్రచురించింది. విశాలాంధ్ర ప్రచురణాలయం లక్ష్మీకాంత మోహన్ సేకరించిన 'తెలంగాణా జానపద గేయాలు' (1972) వెలువరించింది.

2.6. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు పది యక్షగాన సంపుటాలను ప్రచురించింది. ఒకటి ఎక్కువయినా తక్కువయినా ప్రతి సంపుటం నాలుగు యక్షగానాలతో వుంది. తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం నుంచి సేకరించి తెచ్చిన వాటిని ప్రకటించింది. 1955, 56, 57, 59, 60, 64 సంవత్సరాలలో ముద్రించబడ్డ ఆరు సంపుటాలకు సంపాదకుడు విద్వాన్ గంటి జోగిసోమయాజి. 1972లో ఒకటి, 73లో మూడు యక్షగాన సంపుటాలు వెలువడ్డాయి. వాటికి సంపాదకుడు ఆచార్య కాకర్ల వెంకట రామనరసింహం. తరువాత రెండు సంపుటాలు వెలువడ్డాయని తెలుస్తూవుంది.

ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు ప్రచురించిన ప్రతి సంపుటానికి ఒక లఘు ఉపోద్ఘాతం ఉంది. చివరకు వెలువడ్డ 9, 10 సంపుటాలకు తప్ప ప్రతి యక్షగానానికి ఒక పరిచయం ఉంది. కథను సంక్షిప్తంగా ఇవ్వటం, యక్షగాన కర్త జీవిత వివరాలు తెలపటం, ఔచిత్య అనౌచిత్య పరామర్శ చేయటం, చారిత్రక విషయాలు ప్రస్తావించటం, సాహిత్య చర్చ చేయటం కనిపిస్తుంది. ''ఇందు ఆనాఁటి యాంధ్ర భాషా సారస్వత స్వరూప స్వభావములు; తెలుగు నుడికారములు, జాతీయములు, సామెతలు, పద ప్రయోగములు, సాంఘికాచారములు, మత విషయములు, సంఘములో వివిధ వర్గముల వారి వేష భాషలు, హాస్యము, వర్ణనాచాతుర్యము, మానసిక భావ ప్రకటనము, రాజాస్థాన మర్యాదలు, పాలకులకుఁగల సంగీత సాహిత్య కళాప్రియత్వము, కవులకుఁగల వివిధ భాషా పాండిత్యము కవితా పాటవము, మూలకథలోఁ జేసిన మార్పులు కూర్పులు, అందువలన గల్గిన ఔచిత్యానౌచిత్యములు తెలియగలవు'' [5] అని యక్షగాన సాహిత్యంలో నిక్షిప్తమై ఉన్న జానపద విజ్ఞాన స్వరూపం వివరించినట్లయింది.

2. 7 - జానపద సాహిత్య సంబంధి పరిశోధన ప్రాథమికంగా సేకరణ రూపంలో జరిగింది. పండితులేకాదు పరిశోధకులు కూడా తమ పరిశోధన కోసం కావలసిన జానపద సాహిత్యం సేకరించటం కోసం క్షేత్ర పరిశోధన చేయక తప్పలేదు. ఇప్పటికి లభించిన జానపద సాహిత్యం అల్పమే! లభించవలసిందే అధికంగా ఉంది. లభించిన దానిలో ప్రచురితమయింది కొంతే! ఎంతో ప్రచురింపబడవలసి ఉంది. ఈ తెలుగు జానపద సాహిత్యం తెలుగు జాతి జీవితమంత విశాలం, విభిన్నం, విస్తృతం. పలువురు ఈ జానపద సాహిత్యాన్ని సేకరించారు. కొందరు పండితులు విజ్ఞులు ఈ సాహిత్యాన్ని గూర్చి ఉపోద్ఘాతాల రూపంలో, వ్యాసాల రూపంలో, గ్రంథాల రూపంలో వివరించారు. ఆ వివరణ పరిశోధనకు నేపథ్యమై పూర్వరంగం సిద్ధం చేసింది.

3. వివరణ : జానపద సాహిత్యాన్ని సేకరించడంతోపాటు వివరించడం అవసరంగా కొందరు పండితులు గుర్తించారు. జానపద సాహిత్య మాధుర్యం అనుభవించడమే కాదు, వివరించారు. ఆంధ్రులకు ఆసక్తి కలిగించారు. వ్యయ ప్రయాసల కోర్చి పట్టుదలగా ప్రయత్నించారు. జానపద సాహిత్యాన్ని సామాజికంగా సమన్వయించి చూపారు. వాళ్ళలో వెంటనే స్ఫురించే అనాదృత వాఙ్మయ భిక్షువు నేదునూరి గంగాధరం.

''వారి జీవితమంతయు ఈ విజ్ఞాన గవేషణమున కంకితమైనది. నిరుపేదయైనను తనకున్న ఆస్తిపాస్తులను అమ్మి జానపద గాయకులను సత్కరించిన వదాన్యుడాయన. గంగాధరంగారు దాదాపు పదివేల పుటల జానపద విజ్ఞానమును సేకరించిరి. నూర్ల

కొలది గేయములు వ్యాసములు వివిధ పత్రికలయందు ప్రచురించిరి''[6] ''జానపద విజ్ఞానాన్ని అసంఖ్యాకంగా సేకరించి తమ జీవితాన్నే దానికి అంకితం చేసినవారు నేదునూరి గంగాధరంగారు''[7]. ''శ్రీ నేదునూరి గంగాధరం జానపద సాహిత్య సేకరణమున కృషి చేసినవారిలో మున్నెన్నదగినవారు''[8].

నేదునూరి గంగాధరం ప్రచురించిన గ్రంథాలు 1. మేలుకొలుపులు (1949), 2. మంగళహారతులు, రెండు సంపుటాలు (1951), 3. సెలయేరు (1955), 4. వ్యవసాయ సామెతలు (1956), 5. పసిడి పలుకులు (1960), 6. స్త్రీల వ్రతకథలు, రెండు సంపుటాలు (1960), 7. జానపద గేయవాఙ్మయ వ్యాసావళి (1960), 8. ఆట పాటలు (1964), 9. మిన్నేరు (1968), 10. మున్నీరు (1973). ఇంకా అనేకం పత్రికలలో, సంకలనాలలో సేకరణలుగా వ్యాసాలుగా చేరాయి. వీటిలో సేకరింపబడ్డ పాటలు, సామెతలు, జాతీయాలు, పలుకుబళ్ళు, పొడుపుకథలు, కిటుకుమాటలు, జమిలి పదాలు, నోముల కథలు, క్రీడలు చాలా ఉన్నాయి. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి విమర్శనాత్మక వివరణ వ్యాస సంకలనం. ఇందులో జానపద సాహిత్యం విస్తృతంగా ఉదాహృతమయింది. ఇది ''జానపద గేయం స్థానం నిర్ణయిస్తూ రసం, ప్రణయం, సాహసం, వీరత్వం, నీతి తెలుపుతూ వాఙ్మయం ప్రాముఖ్యం వివరించటం పరికింపవచ్చు. పదవాఙ్మయం విస్తృతంగా సేకరించిన ఈ రచయిత కృషి తదుద్ధరణార్థం ఉపయోగపడింది. అనాదృత వాఙ్మయ భిక్షువుగా ఈ రచయిత సాగించిన సేవ మిక్కిలి అధికం. తన జీవిత కాలంలో సముచిత గౌరవం ఎరుగని ఈ సాహితీ తపస్వి అనాదరంగా ఉన్న జానపద వాఙ్మయం వెలుగులోకి తేవటం ప్రశంసాపాత్ర కృషి.''[9]

3.1 తేకుమళ్ళ కామేశ్వరరావు జానపద సాహిత్య వివరణ దృష్టితో 'పాత పాటలు' శీర్షికతో చాలా వ్యాసాలు వ్రాసి, 1953-55లలో గృహలక్ష్మి, సౌభాగ్య, కిన్నెర మాసపత్రికలలో ప్రచురించిన ఆ వ్యాసాలను పునర్ముద్రించి, ఆ సంకలన గ్రంథానికి 'ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర' మొదటి సంపుటము అని పేరు పెట్టటం గమనించవచ్చు.

3.2. డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (కృష్ణశ్రీ) అనేక గేయాలు సేకరించటమే కాదు, వాటిని వివరిస్తూ చాలా వ్యాసాలు భారతి, గృహలక్ష్మి, కిన్నెర మొదలగు పత్రికలలో ప్రచురించడం జరిగింది. పల్లెపదాలు (1953), స్త్రీల రామాయణపు పాటలు (1955), స్త్రీల పౌరాణికపు పాటలు (1963) చక్కని ఉపోద్ఘాతాలతో డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి అలంకరించగా, వీటిని ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురించింది. కృష్ణశ్రీ జానపద సాహిత్యం మీద దీక్షతో విశేష కృషిచేసి, దాని వైశిష్ట్యాన్ని గూర్చి వ్యాసాలు వ్రాసి, ఉపన్యాసాలిచ్చి ప్రాచుర్యం ప్రసిద్ధి కలగటానికి చేసిన సేవ అమూల్యం.

3.4. 1954 లో శ్రీహరి ఆదిశేషువు వ్రాసిన 'జానపద గేయ వాఙ్మయ పరిచయము' తెలుగు భాషా సమితి బహుమతి పొందింది. ఇది ప్రప్రథమంగా పరిశోధన దృష్టితో తెలుగులో వెలువడ్డ విమర్శనాత్మక, వివరణాత్మక గ్రంథం. ఇది జానపద సాహిత్య తత్త్వం పరిచయం చేయగల దీక్షతో వెలువడింది.

3.5. శ్రీ గొడవర్తి భాస్కరరావు 'ఎల్లోరా' అనే కలం పేరుతో చాలా జానపద సాహిత్యం సేకరించి వివరించిన రచయిత. కవిగా పత్రికాసంపాదకుడుగా రచయితగా ప్రసిద్ధి పొందిన ఎల్లోరా జానపద సాహిత్య సేకరణ వివరణ పట్ల శ్రద్ధ చూపటం విశేష కృషి. జానపద గేయాలు, రెండు సంపుటాలు (1955-57), మన ప్రాచీన కళలు - పుట్టుపూర్వోత్తరాలు (1960), సరాగాలు (1961), మధుర కవితలు (1961) ఉత్తమ సేకరణ విశ్లేషణ గ్రంథాలు. ఎల్లోరా సంపాదించిన గేయాలను వర్గీకరించి, వ్యాఖ్యా

నించి జానపదుల జీవనమాధుర్యాన్ని, సరాగాలనీ విశదీకరించటంతోపాటు కళావిర్భావాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించటం గమనార్హం.

3.6. శ్రీ దేవులపల్లి రామానుజరావు 'సారస్వత నవనీతము' వ్యాస సంకలనంలోని స్త్రీల పాటలలోని కవిత్వము (1940), జానపద గేయములు (1946) జానపదసాహిత్యాన్నీ ; గ్రామాలలోని వేడుకలు-క్రీడా వినోదాలు (1959), జానపద నృత్య సంగీతాలు (1959) జానపదవిజ్ఞానాన్నీ; విశ్లేషించి వివరించే చక్కని వ్యాసాలు.

3.7. శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి 'ఆంధ్రనాటకరంగచరిత్ర' (1969)నటరాజరామకృష్ణ 'ఆంధ్రుల నాట్యకళ' (1959), మంచాళ జగన్నాధరావు 'ఆంధ్రుల సంగీతకళ' (1975) జానపద విజ్ఞానాంశ గ్రంథాలు. వీటిని జానపద సాహిత్యానుబంధాంశాలుగా వివరించవచ్చు.

3.8. డా. యస్. గంగప్ప అనేక గేయాలను సేకరించి, వాటిని వివరిస్తూ వ్యాసాలు వ్రాసి పత్రికలలో ప్రకటించటం, జానపద సాహిత్య ప్రయోజనాలను తెలపటం జరిగింది. జానపద గేయాల భాషను అనుశీలించి, కామన్న కథ, చంద్రమ్మ పాట, సారంగధర చరిత్ర, సిరియాళని కథ, కోలాట పాటలు, విసురురాతి పాటలు విస్తృతమైన ఉదాహరణలతో ఈ వ్యాసాలను రూపొందించటమయింది.

3.9. భారతి, గృహలక్ష్మి, కిన్నెర, స్రవంతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, ఆంధ్రభూమి,జానపదం,ఐఫూన్ పత్రికలలో ఈ వ్యాసాలు వెలువడ్డాయి. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో విభిన్న జానపద విజ్ఞానాంగాల మీద పరిశీలన రచన లున్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సారస్వత వ్యాసములు సంకలనములలో కొన్ని వ్యాసాలున్నాయి.

'ఆంధ్రుల జానపద శిల్పకళా ప్రపంచం' 'కొండపల్లి బొమ్మలు' 'జానపద కళ పరిశ్రమ' వంటి విలువైన వ్యాసాలు కుమారరాయ్ సుధాంశు రచనలు.

3.10. పలువురు పండితులు విమర్శకులు జిజ్ఞాసువులు జానపద సాహిత్య వ్యాసాలు వెలువరించారు. సర్వశ్రీ వేటూరి ఆనందమూర్తి, ఘట్టమరాజు ఆశ్వత్థ నారాయణ, చల్లా రాధాకృష్ణశర్మ, పోణంగి శ్రీరామ అప్పారావు, పి. యశోదారెడ్డి, హెచ్.ఎస్. బ్రహ్మానంద, జె.వరలక్ష్మి, నిడదవోలు వేంకటరావు, పిలకా నరసింహమూర్తి, పి. ఉమ, రావి ప్రేమలత, కె. దేశిపతిరావు, రాళ్ళపల్లి గోపాలకృష్ణ శర్మ, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, ఏ. వి. యస్. సుబ్బారావు, రాంభట్ల కృష్ణమూర్తి, వింజమూరి సీతాదేవి, పండా శమంతకమణి, రావూరి ప్రసన్న సత్యనారాయణ, పి. కృష్ణారెడ్డి, దేవరాజు మహారాజు, కె. లక్ష్మి, బండి నాగరాజు మొదలైన వాళ్ళు ఎంతోమంది ఎన్నో జానపద విజ్ఞానాంశాలు సేకరించి వివరించారు.

3.11. వీళ్ళు జానపద గీతాలు, కథలు,కళలు, సామెతలు, పొడుపు కథలు, వినోదాలు, క్రీడలు, పండుగలు వంటి విషయాల మీద వ్యాసాలు వ్రాశారు. జానపద సాహిత్యంలో భాష, అలంకారాలు, నిర్మాణ మార్మికత, గణాలు, శ్రుతి, లయ వంటి అభివ్యక్తి అంశాల మీద ఆలోచన సారించారు. జానపద సాహిత్యంలోని హాస్యం, కరుణం, శృంగారం మొదలైన రస విషయాల మీద వ్యాసాలు రూపొందించారు. జానపద నాటకం,సంగీతం, నృత్యం, శిల్పం, బయలాట, తోలుబొమ్మలాట, వీథి భాగోతం, హరికథ, బుర్రకథ, చిందు, శివం, కోలాటం వంటి కళాంశాల మీద వ్యాస సృష్టి చేశారు.

3. 12. చవాను సుదర్శనరావు రచించిన 'సామెతల స్రవంతి'(1979)ని కర్నూలు జిల్లా రచయితల సహకార సంఘం ప్రచురించింది. 'సామెతలు ప్రజాభాహుళ్యానికి గ్రాహ్యమగుటకు వ్యాఖ్య అవసరము' అనే దృష్టితో రచన జరిగింది.

ఒక సామెతను గ్రహించి, దానికి మూలం కాదగ్గ కథను అన్వేషించి ఆ సామెత ప్రయోగింప బడ్డ సాహిత్య సందర్భం ఉటంకించి, సామెతను వివరించి, అటువంటివే ఇతరమైన సామెతలుంటే తెలపటంతో ఆ సామెత చరిత్ర ముగుస్తుంది. గ్రంథం చిన్నదే. కొన్ని సామెతల వివరణ బాగుంది.

ఆడబోయిన తీర్థము యెదురైనట్లు - అనే సామెతను తెలిపిన సందర్భంలో అటువంటివే అంటూ మొక్కబోయిన దేవర ఎదురు వచ్చినట్లు, వెతక బోయిన తీగ కాలికి తగిలినట్లు అనేవి తెలపటం ఉంది. ఇలాగ్గే కొన్ని సామెతలను గూర్చి ఈ గ్రంథంలో ఉంది.

ఇటువంటిదే పద్మావతీ గంగాధర్ కొంతకాలం పూర్వం ఆంధ్ర సచిత్ర వార పత్రికలో సామెతలు నుడికారాలు ఆధారంగా కల్పించి ప్రచురించిన కథలు. యామిజాల పద్మనాభ స్వామి 'సామెతలు - సంప్రదాయాలు' రచన కూడా ఈ కోవకే చెందుతుంది.

**4. పరిశోధన**: తెలుగులో జానపద సాహిత్యం మీద పరిశోధన జరగటానికి ముందు విశేషమైన జానపద విజ్ఞాన సేకరణ కార్యం జరిగింది. ఏరంగంలో పరిశోధన ప్రారంభించారో, ఆ రంగంలో పరిశోధకులు జానపద సాహిత్య సేకరణ కార్యం ప్రారంభించారు. దానితోపాటు లభించిన ఇతరమూ సేకరించి భద్రం చేశారు. వ్యాసాలు వ్రాశారు. అనంతర పరిశోధకులకు ఆ సేకరణ అందించారు, సంకలన గ్రంథాలు వెలువరించారు. విశ్వవిద్యాలయాల్లో జానపద సాహిత్య పఠన పాఠన పరిశోధనలు ప్రారంభమయిన తర్వాత సేకరణ కార్యం, విమర్శన రంగం పరిశోధన కృషి క్రమంగా పెరిగాయి. పెరుగుతున్నాయి. జానపద విజ్ఞానం సేకరించటం, దీక్ష, కృషి, వ్యయ ప్రయాసలు, కష్టం - వీటితో కూడు కొన్న పని.

తెలుగులో జానపద సాహిత్యం కొంత సముపార్జించింతర్వాత అనుభూతి దృష్టి పెరిగి, ఆలోచన పరిధి విస్తృతమై, వివరణ విధానం అతిశయించి, విమర్శనా వివేకం సమన్వయపడి పరిశీలన పరిశోధనగా ఫలితాలు లభించాయి. అందులో సాహిత్య మర్యాదలు, సాంఘిక ధర్మాలు, రచనా రంగాలు రంగులు విరజిమ్మాయి.

విశ్వ విద్యాలయ విద్య విస్తృతి కారణంగా పరిశీలన నైశిత్యం పెరిగి పరిశోధన పాటిష్యం పొందింది. ఈ రంగంలో మొదటి ప్రయత్నం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా॥ బి. రామరాజు పరిశోధన కృషితో తలెత్తింది.

4.1. డా. బి. రామరాజు జానపద సాహిత్య పరిశోధన పథంలో పురోగామి. ఉస్మానియా విశ్వవిద్యాలయం డాక్టరేటు పట్టంకోసం చేసిన పరిశోధన 'తెలుగు జానపద గేయ సాహిత్యము' (1955) ఇది. పరిశోధన రంగంలో శ్రీకారం. ఇందులో పౌరాణిక, చారిత్రక, మతసంబంధ, పారమార్థిక, శ్రామిక గేయాలు ; స్త్రీల బాలల పాటలు ; శృంగార అద్భుత, కరుణ, హాస్యరసాంచితగేయాలు; నిశితంగా పరిశీలింపబడ్డాయి. ఇంకా ఇందులో భాషావిషయిక పరిశీలన, సాంఘికదృష్టి విస్తరింపబడ్డాయి. జానపద గేయాలు పాడేవాళ్లనీ, పాడే వరుసల్ని వివరించటం జరిగింది. అన్నింటికి మకుటంగా జానపద గేయధర్మా లనేకం ప్రకటించటం ఉంది. ఈ పరిశోధన గ్రంథం అనంతరం వెలువడ్డ అనేక పరిశోధన గ్రంథాలకు మార్గదర్శి.

డా. బి. రామరాజు, నేదునూరి గంగాధరం, డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, డా. తూమాటి దొణప్ప సంకలనంగా ఉన్న త్రివేణి (1960) ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ. ఇందులో 248 గేయాలు తొమ్మిది విభాగాలలో ఉన్నాయి. ఇందులోని తెలంగాణా పాటల్ని సేకరించింది డా. బి. రామరాజు.

ఈ రచయిత సేకరించిన గేయాలతో తెలంగాణా పిల్లల పాటలు (1960), తెలంగాణా పల్లె పాటలు (1960) వెలువడ్డాయి. డా. బి. రామరాజు, డా. నాయని కృష్ణకుమారి సంపాదకత్వం వహించిన సంకలనగ్రంథం 'జానపదగేయాలు- సాంఘికచరిత్ర, (1974) విలువైన ఉపోద్ఘాతంతో ఉంది. దీనిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించింది. ఇది గిరిరాజు కథతో మొదలుకొని చాలా అవతారాల కథలు కలుపుకొంటూ అనుముల బ్రహ్మారెడ్డి కథతో ముగిసిపోయే గేయకథల సంకలనం. సాంఘిక చరిత్ర చెప్పేదిగానేకాదు; సాంస్కృతిక సాంఘిక చరిత్రగా రూపం దిద్దుకొంది. 'యక్షగాన వాఙ్మయము' (1972) ఆ ప్రక్రియ దృష్టితో అది నిశిత పరిశీలన.

డా. బి. రామరాజు ఆంగ్లంలో గ్రంథరచన చేయటం వల్ల తెలుగు జానపద సాహిత్యసౌందర్యం భిన్న ప్రాంతాలకు, భాషా ప్రజలకు పరిచయమయ్యే భాగ్యం కలిగింది. Moharram Folksongs in Telugu(1964), Mysticism in Telugu Folksongs (1964), Folktales of Andhra Pradesh (1974), Folklore of Andhra Pradesh (1978) విలువైన ఆంగ్ల గ్రంథాలు.

డా. బి. రామరాజు జీవితకృషి జానపద సాహిత్య పరిశోధన. ఈ పరిశోధన చేయటం,చేయించటం జీవితదీక్ష. పల్లెజీవన మాధుర్యాన్ని, జీవితచైతన్యాన్ని, బుద్ధి దీప్తిని, హృదయశోభను ప్రపంచమానవ జీవిత నేపథ్యంగా నిలిపే కృషిలో నిరంతర పరిశోధకుడు డా. బి. రామరాజు.

తెలుగులో జానపద సాహిత్యాన్ని, తెలంగాణాలోని ఆసంపదని, గేయసాహిత్య ప్రత్యేకతని, ఈ సాహిత్య ప్రశంసని, అందులోని హాస్యాన్ని, జానపద రామాయణాలని, గేయభాషని, పిచ్చుకగుంట్లు, వీరముష్టివాళ్ళు,శారదకాండ్రు మొదలైన జానపద గాయకుల్ని ప్రచారకుల్ని గూర్చి పరిశోధక వ్యాసాలు వ్రాసి, విశ్వవిద్యాలయాలలో జానపద వాఙ్మయ అధ్యయన అవసరాన్ని నిర్ణయించిన జానపద విజ్ఞాన తపస్వి డా. బి. రామరాజు.

డా. బి. రామరాజు తన 'తెలుగు జానపద గేయ సాహిత్యము' ద్వితీయ ముద్రణ (1978) ప్రవేశికలో జానపద సాహిత్యంలో తనకంటే ముందూ, తన తర్వాతా, జరిగిన కృషిని వివరించటం విశేషంగా ఉంది. ఉపసంహారంలో ''జానపద గేయ స్రవంతి కూడ ఇప్పటికే చాల భాగము మనకు దక్కకుండ బోయినది. ఉన్నదానినైన నిక భద్రపరచి యుపయోగించుట తెలుగువారి కర్తవ్యము''10 అని హెచ్చరించటం గుర్తుంచుకోవాలి.

4.2. డా. యస్వీ జోగారావు 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర'తో (1956) ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జానపద సాహిత్య పరిశోధన ప్రారంభమయింది. ఈ సందర్భంలోనే ఆంధ్ర విశ్వకళా పరిషత్తు తంజావూరు యక్షగానాల ప్రచురణ (1955) ప్రారంభించటం గుర్తుంచుకోదగ్గ విషయం. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర రెండు భాగాల ఉద్గ్రంథం.

మొదటి భాగంలోది యక్షగాన ఉత్పత్తి పరిశీలన. ఇందులో యక్షులు - గానం, జక్కులజాతి సంబంధం, జక్కిణి, ఈ విషయమైన పూర్వవాద సమన్వయం, ఇతర వాదాలు, అభిప్రాయాలు, యక్షగాన ప్రాచీనత, ప్రాథమిక దశ తెలిపి, యక్షగాన పరిణామ చరిత్రలో యక్షగాన రచన ప్రారంభదశ, ఆంధ్ర ప్రాంతంలోని యక్షగానాలు, దక్షిణాంధ్ర దేశంలోని యక్షగానాలు, తెలంగాణా యక్షగానాల తీరు తెన్నులతోపాటు యక్షగాన ప్రయోగం, అందులోని సాంప్రదాయిక పాత్రల విషయం వివరించి, యక్షగాన వైవిధ్యం, లక్షణం, వైశిష్ట్యం బోధించి, అనుబంధంగా యక్షగాన రచనాంగాలలో ఛందస్సు ప్రాధాన్యం, తంజావూరులోని పదవాఙ్మయం, శహాజీ

దరువులు, వివిధ గేయరచనలు, యక్షగాన శబ్దజాలం, ఈ రచనల్లోని సామెతలు పొందుపరచటం జరిగింది.

ద్వితీయ భాగం స్థూలంగా అనేక యక్షగానాల పరిశీలనకు సంబంధించి ఉంది. ఇన్ని యక్షగానాలు సంపాదించటం శుద్ధ ప్రతి రాయటం పరిశోధనాత్మకంగా సమీక్షించటం గురుకార్యం. ఈ పనిని యక్షగాన కవులు, కావ్యాలను ఆంధ్రప్రాంతం దక్షిణదేశం తెలంగాణా ప్రాంతం పరిధిలో పరీక్షించటం జరిగింది. కవుల జీవితం కొంత, కాలం కొంత, కావ్యతత్త్వం కొంత ఈ పరీక్షలలో భాగాలు. అనుబంధంలో కాలం తేలని కవులను, కర్తృత్వం తేలని యక్షగానాలను వివరణాత్మకంగా పొందుపరచడం ఉంది.

జానపద సాహిత్యంలోని సేకరణ బాధ్యత ఈ యక్షగానాలకూ వుంది. డా. యస్వీ. జోగారావు తన పరిశోధన కోసం సేకరించడానికి పూనుకోవటం ఆంధ్ర విశ్వకళా పరిషత్తు సంపాదించ యత్నించటం ఏకకాలికాలు, పరస్పర లాభదాయకాలు. ఈ పరిశోధనవల్ల యక్షగాన సాహిత్యం సాధ్యమయినంత సంపూర్ణంగా సంపాదించటం, పరిశోధించటం జరిగింది.

డా. యస్వీ జోగారావు అనేక వ్యాసాలు భారతి, ఆంధ్ర పత్రికలలో వెలువరించటం విమర్శక లోకం గుర్తించిన విషయమే. ఈ మధ్య ఇతర సారస్వత ప్రయత్నాలతో పాటు బొమ్మలాట, తోలు బొమ్మలు పరిశీలించటం, ఉపనిషత్తులు – గేయాలు గుర్తించటం, నేదునూరి గంగాధరం సేవను ప్రశంసించటం వ్యాస రూపంలో జరిగింది.

4.3. 1958-59 ప్రాంతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డా. చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రి సామెతల మీద పరిశోధన ఆరంభించటం తెలిసిన విషయం. తర్వాత డాక్టరేటు పట్టం పొందటమూ తెలుసు. ఆ గ్రంథం ముద్రితంగా కనిపించలేదు. జానపద వాఙ్మయంలో జరిగిన పరిశోధనను గూర్చి కొంత కొంత వివరించిన గ్రంథాలలో కూడా ఈ పరిశోధన విషయం ప్రసక్తం కాలేదు. 'మహతి'లోకూడా ఈ గ్రంథ ప్రస్తావన లేదు. తెలుగు పరిశోధన సంహితలో కూడా దీని ప్రసక్తి లేదు. డా. చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రి డాక్టరేటు పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం ఏదో తెలియకుండా ఉంది.* స్రవంతిలో ఎప్పుడో డా. శాస్త్రి సామెతల మీద వ్రాసిన వ్యాసం చదివినట్లు గుర్తు. తెలుసుకొందామని ఉత్తరం వ్రాస్తే ఈ వ్యాసం ముగించేనాటికి ఏ సమాచారమూ అందలేదు. ఏమో, నేను పొరపాటు పడి ఉండవచ్చు.

4.4. డా. తూమాటి దొణప్ప డాక్టరేటు పట్టం కోసం ఆంధ్ర విశ్వ విద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత గ్రంథం భాషా శాస్త్రానికి సంబంధించింది, జానపద సాహిత్యానికి సంబంధించింది కాదు. కాని, భాషాశాస్త్రానికి సంబంధించిన కృషి కంటె జానపద సాహిత్యానికి సంబంధించిన కృషి ముందటిది. విద్యార్థిగా ఉన్నప్పటినుంచి సామెతలు, పొడుపు కథలు, గేయాలు, పాటలు మొదలైన జానపద సాహిత్యం సేకరించటం అరంభమయింది. ఆ సేకరణ ప్రేరణతో చాలా వ్యాసాలు వ్రాయటం, అవి పత్రికలలో ప్రకటింపబడటం, ఆకాశవాణిలో ప్రసారం కావటం జరుగుతూ వచ్చింది. ఈ కృషి 1954 నుంచీ వుంది. తెలుగులో కొత్త వెలుగులు (1972) భిన్న వ్యాసాల సంకలన గ్రంథం, ఇందులో అరు జానపద సాహిత్య వ్యాసాలున్నాయి. మిగతావి సాహిత్య భాషావ్యాసాలు. జానపద కళా సంపద (1975) లో ఎనిమిది పెద్ద వ్యాసాలున్నాయి. ఇవి అంతకుముందు ముప్ఫై ఏళ్ళనుంచి జానపద క్షేత్రంలో రచయిత చేస్తూ వచ్చిన పరిశ్రమ ఫలితాలు. తెలుగులో హరికథా సర్వస్వం (1978) 1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ బహుమతి పొందింది. 1983 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం డి. లిట్ గౌరవ పట్టం ఈ పరిశోధన గ్రంథానికి లభించింది.

---

* శ్రీ శాస్త్రిగారి సిద్ధాంత గ్రంథం పేరు – "ఆంధ్ర సాహిత్యంలోని సామెతలు, నుడికారాలు–సేకరణ, వివరణ" – (సంపాదకుడు)

విస్తృత ప్రణాళికతో ప్రభవించిన 'తెలుగు హరికథా సర్వస్వం' త్రిదశాత్మకంగా వుంది. అవి తత్త్వసందర్శనం, జీవిత రేఖా దర్శనం, నిదర్శన ప్రదర్శనం. తత్త్వ సందర్శనంలో హరికథ నేపథ్యం, ఇరుగు పొరుగు సీమల కథా క్రమామిషు, దాని స్వరూపస్వభావాలు, ప్రయోగాంగివివరణ, సంగీతం, హరికథా వాఙ్మయ చరిత్ర, భాషాదిక విశేషాలు కూలంకషంగా సమగ్రంగా విశిష్టంగా స్పష్టంగా మంచి శైలిలో వివరణ పొందాయి.

జీవిత రేఖా దర్శనంలో ఆయా హరికథల రచయితల జీవితాంగ వివరణ ముంది. ఛాయా చిత్రాలున్నాయి. ఇదీ వ్యయప్రయాసలకు గురి అయిన సేకరణ సందర్భం. నిదర్శన ప్రదర్శనలో హరికథల వివరాలు, రచన, ప్రసార విషయా లున్నాయి.

ఇది హరికథా తత్త్వం వివరించటంతోపాటు హరికథకుల జీవిత విశేషాలకూ సర్వస్వం అయింది. హరికథావసరం గుర్తించి దానిమీద ఇంత విపులంగా పరిశ్రమించటం విశేషమే. నేల నాలుగుమూలల చెదరి ఉన్న సమాచారం సేకరించటమేకాక, అన్ని ప్రాంతాలకు వెళ్ళి హరికథకుల్ని, రచయితల్ని కలిసి, ఫొటోలు తీయించి ప్రచురించిన ఈ చర్య ఖర్చుతో కూడిందేకాదు, దీక్షతో చేసిందేకాదు, ఆ సాహిత్య విశ్లేషణ దృష్టితో నిర్వహించిందే కాదు. డా. బి. రామరాజు ఈ గ్రంథం ఆవిష్కరణ సభలో అన్నట్లు 'కసి'తో కూడింది. ఈ కసి నిర్వహణ దీక్షకు సంబంధించింది. అంత పట్టుదలతో ఈ పని తల పెట్టటం నిర్వహించటం అందరికీ సాధ్యం కాదు. అంత సుభలసాధ్యం కాదు.

'మన జానపద సాహిత్యం' సౌందర్యాలు పల్లెల్లోనే చూడాలన్న దృష్టి ఆకాశవాణి అందంగా వినిపించింది. 'జానపద సాహిత్యంలో ప్రజల కష్ట సుఖాలు' ఆ సాహిత్య నిర్మలీ మసనిసర్గమనోజ్ఞ దృష్టిని విశ్లేషించింది. 'కోలాటం పాటల రూపరేఖలు' ఉదాహరణం ఊతగా తత్త్వ వివరణ కలిగించింది. 'వరసపాటల సరసాలు' హాస్యం ఎగతాళి అందంగా సంతరించే పల్లెపట్టుల గుండెపట్టులు చూపించింది. 'జానపద సాహిత్యంలో మేలుకొలుపులు' దేవాలయాల లోని దేవుళ్ళ దేవతలపరిధిలోని మేలుకొలుపులు'. 'కడిలె పాటల తీరుతెన్నులు' గుండెబావుల ఊటలకు ఊపిరి పోశాయి. ఇవి 'తెలుగులో కొత్త వెలుగులు' గా వెలువడ్డాయి. ''నాకు తెలిసినంతవరకు గ్రామిక స్త్రీల కథల పాటలను సేకరించి వానిని వ్యాస రూపమున తెచ్చినవారు డా. తూమాటి దొణప్ప గారు మాత్రమే''11 అన్నది బాధ్యత గుర్తించిన మాట.

'జానపద సాహిత్యం' తెలుగు సాహిత్యంలో విస్మృతాధ్యాయం కారాదన్న సూచన కలిగివుంది. 'యక్షగానములు : ప్రాచీనాంధ్ర నాటక స్వరూపము' యక్షగాన లక్షణతత్త్వ వివరణాత్మకంగా ఉంది. 'రాయలసీమ పల్లె పాటలు - రామాయణము' తీరు మారుతూ మానవ జీవిత మార్మికతను వివరిస్తూ వుంది. 'మెరవణిగద్య' జానపధ జీవితంలో పరాచికాలు వచనంలో ఎన్నెన్ని రూపాల్లోనో ప్రవర్తించడాన్ని ప్రదర్శిస్తుంది. 'కలుపు పాటలు' జీవిత వ్యవసాయంలో తీయనయ్యే గీతాలు, 'మొహరము గీతికలు' హిందూ మహమ్మదీయ జీవిత సమన్వయ సూత్ర నేపథ్యప్రస్తావన కావిస్తాయి. 'విసరుర్రాతి పాటలు' తిరగలి శ్రమ నుంచి జీవిత ధన్యతను వెలికి విరజిమ్ముతున్నాయి. 'జట్టిజాము పాటలు' ఆడపిల్లల ఆటల్లోని అక్షరసౌందర్యాలు, ఇవీ 'జానపదకళా సంపద'లు.

ఈ వ్యాసాలన్నింటికి ప్రాణం సేకరణ. ఈ సేకరణ కార్యం అనంతపురం జిల్లాలో ప్రధానంగా రాయలసీమ జీవిత సంబంధిగా అనేక గ్రామాలలో జరిగింది. ఈ వ్యాసాలలో విస్తృతంగా ఈ సేకరణ సాహిత్య ఉదాహృతమయింది. జానపద గేయమెంత మధురమో అంత మధురంగా వ్యాఖ్యానముంది.

'మెరవణి గద్య' విశేష చమత్కార విలసితం. లయ దృష్టి చెడని సేకరణ కార్యం గేయసాహిత్య కోణం ఇనుమడింప చేసింది.

డా. తూమాటి దొణప్ప విభిన్న పత్రికలలో ప్రచురించిన వ్యాసాలు అనేకం. కొన్నే ఈ సంకలనాలలో చేరాయి. ఎన్నో ఇంకా చేరవలసే ఉన్నాయి. బొమ్మలాట, పగటి వేషములవంటి వ్యాసాలు ఏ సంకలనంలోనూ చేరలేదు. డా. తూమాటి దొణప్ప జానపద సాహిత్య సంపదను సేకరించడంలో భద్రపరచడంలో వాఖ్యానించటంలో కనబరచింది ఉత్తమ దీక్ష, అత్యుత్తమ కృషి. సాధించింది శాశ్వత ఫలితం.

4.5 డా. తంగిరాల వెంకట సుబ్బారావు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం పిహెచ్.డి. పట్టం కోసం సమర్పించిన సిద్ధాంత గ్రంథం ''తెలుగు వీర గాథా కవిత్వము' (1968) విశేషమైన సేకరణ కృషి ఈ గ్రంథ రచనకు నేపథ్యంగా ఉంది. ''ఇది 25 ప్రకరణముల గాథాగేయ విమర్శన సర్వస్వము. వీరగాథల పుట్టు పూర్వోత్తరములు, భారతీయ భారతీయేతర వీరగాథల చరిత్రము, వీరగాథా విభజనము, శక్తి కథాచక్రము, పలనాటివీర కథాచక్రము, కాటమరాజు కథాచక్రము, బొబ్బిలి వరుస కథలు, పదములు, జంగం కథలు, లఘువీర గాథలు, వీర గాథానుకరణములు, వీరగాథలందలి రసము, భాష, ఛందస్సు, వీరగాథల వైశిష్ట్యము, గాథాకారుల ముద్రితా ముద్రితములగు 980 వీరగాథల సమాచారమున్న అమూల్యగ్రంథమిది.''[12] ''ఈ సిద్ధాంత వ్యాసంలో ఉన్న ప్రకరణాలు 25. ఈ 25 ప్రకరణాలూ 4 భాగాలుగా విభజితమైనాయి. మొదటి భాగంలో వీరగాథల నిర్వచనము లక్షణాలు, రెండో భాగంలో తెలుగు వీరగాథలలోని వివిధ వర్గాలు; మూడో భాగంలో వీరగాథలలోని ఛందస్సు సంగీతము; నాలుగో భాగంలో వీరగాథల వైశిష్ట్యము మొII చర్చకు వచ్చినాయి.''[13]

ఈ రచయిత సంకలనంగా రూపొందించిన కాటమరాజు కథలు (1976) రెండు సంపుటాలుగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ముద్రించింది. పీఠికలు సుదీర్ఘంగా విశేష విషయ విన్యాస్తాలుగా ఉన్నాయి. జానపద సాహిత్యము-వీరగాథలు (1975) ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో ప్రచురించింది.

డా. తంగిరాల వెంకట సుబ్బారావు వ్రాసిన వ్యాసాలు చాలా ఉన్నాయి. రాయలసీమ జానపద సంస్కృతిని తెలిపే చౌడమ్మ పాటలు, మాఱుకథలు, అలరాచమల్లు గురజాల రాయబారం, నాయకురాలు నాగమ్మలను గూర్చిన వ్యాసాలతోపాటు కాటమరాజు కథా చక్రం, దాని చారిత్రక సంశయాలు, బుర్ర కథలు, బొబ్బిలి కథ, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కథ, బుడ్డా వెంగళరెడ్డి పాటలను వివరించి, వీర గాథలు-వారానువర్తనములు మొదలైన విషయాలను వ్యాసాలుగా వ్రాసి భారతి మొదలైన పత్రికలలో ప్రచురించి వీరగాథల విశ్లేషణకు పరిశోధనకు డా. తంగిరాలి వెంకట సుబ్బారావు చేసిన కృషి విశేషంగా విశిష్టమయింది.

4.6. డా. నాయని కృష్ణకుమారి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పట్టం పొందిన పరిశోధనగ్రంథం 'తెలుగుజానపద గాథలు' (1970) ఈ కృషి గాథల సేకరణతో ఆరంభమయింది. తాము సేకరించి దాచుకొన్న గేయ గాథలను డా. బి. రామరాజు, డా. తూమాటి దొణప్ప ఇచ్చారు. ఈ పరిశోధనాత్మ మానవశాస్త్ర పరిధి నుంచి జానపద గాథల్ని పరికించటంలో ఉంది. పురాణ గాథలు, ఇతిహాసిక గాథలు, చాలా శ్రద్ధగా పరిశీలన పొందాయి. బుర్ర కథలుగా వీటి ప్రాశస్త్యం గుర్తింపు పొందింది. గాథల మౌలికతను నిర్ణయించటంలో పరిశోధకురాలి ప్రతిభ పరిశ్రమ గోచరమయ్యాయి. గాథలలోని కథాంశ

విశ్లేషణ శ్రద్ధకు నిదర్శనం. ఒక ప్రధానాంశం విభిన్న గాథలలో ప్రవర్తిల్లిన తీరు తులనాత్మకంగా పరీక్షించి గాథా లక్షణ సమన్వయం చేయటం మంచి కృషి. జానపదగేయ గాథా నిర్మాణంలోని సర్వసాధారణమైన నమూనాలు గుర్తించటంలో ప్రసిద్ధ పాశ్చాత్య సిద్ధాంత సమన్వయంలో, రచయిత్రి శక్తి స్పష్టమవుతూవుంది. జంతు పూజా పద్ధతి, మంత్రారాధన, వీరారాధనం-మౌలికాంగ దర్శనం ఉంది. గాథలలోని రాజకీయ విషయాలు భాషా విశేషాలు, జానపదుల వాడుకలోని పదజాలం, నిఘంటువుల కెక్కని పదాల గూర్చిన ఆలోచన విశిష్టంగా ఉంది. ''ఈ ఉత్తమ సిద్ధాంత వ్యాసమున జానపద గాథల సౌందర్యముతో పాటిం తకు ముందెవ్వరి చేతను స్పష్టము చేయబడని నృశాస్త్ర సంబంధి దృక్పథము కూడ గోచరమగు చున్నది.''[14]

డా. నాయని కృష్ణకుమారి వ్రాసిన జానపద సాహిత్య వ్యాసాలు అనేకం ముద్రితాలు. మన తెలుగు జానపద వాఙ్మయం, సాహిత్యం, దాని చరిత్ర రచన, ఆ చరిత్ర స్వరూపం, ఆ సాహిత్య భాష, అందులో మార్పులు-చేర్పులు, గాథా పరిశీలనావశ్యకత, కథా నిర్మాణ సూత్రాలు, తెలుగు సామెతలు, అల్లోనేరేళ్ళు, పల్లె ప్రజల పండుగలు, పదవాఙ్మయంలో స్త్రీ పిల్లల ప్రసక్తి, సాంఘిక చరిత్ర, ఆచార వ్యవహారాల మీద అనేక వ్యాసాలు వెలువడ్డాయి. డా. నాయని కృష్ణ కుమారి జానపద సాహిత్య పరిశోధన మానవ శాస్త్ర పరిధి ప్రవర్తకం. ఆ దృష్టితో జరుగుతున్న ఈ విశ్లేషణ జానపద సాహిత్య దర్శనానికి మేలిబాట.

4.7. డా. ఆర్వియస్ సుందరం 'తెలుగు కన్నడ జానపద గేయాలు' (1973) మైసూరు విశ్వ విద్యాలయానికి డాక్టరేటు పట్టం కోసం సమర్పించిన పరిశోధన గ్రంథం. ఇందులో జానపదగేయ స్వరూపం నుంచి వైశిష్ట్యందాకా వివరణ వుంది. పని పాటలు, పారమార్థికగేయాలు, బాంధవ్యగీతాలు, పిల్లల పాటలు, వేడుక పాటలు, వలపు పాటలు, హాస్య గీతాలు, కన్నిటి పాటలు తెలుగు కన్నడ భాషల్లోవి తులనాత్మకంగా పరిశీలించటం ఉంది. జానపద గేయాలలోని సంస్కృతిని, వాటి భాషావిశేషాలను, ఛందస్సు, సంగీతం వంటి విషయాలను తెలపటం ఉంది. ఈ పరిశోధన వల్ల తెలుగు కన్నడ జానపద జీవిత సామీప్యం అర్థమవుతుంది. ఇది మంచి కృషి.

జానపద సాహిత్య స్వరూపం (1976) చిన్నదైనా విలువయింది. దీని ప్రవేశికలో జానపద విజ్ఞానం సాహిత్యం గూర్చి ఆంగ్ల కన్నడ గ్రంథాధారంతో చక్కని విశ్లేషణ ఉంది. డా. ఆర్వియస్ సుందరం 'ఆలిచిప్పలు - ఆణిముత్యాలు' (1972) సేకరణ గ్రంథ సంపాదకత్రయంలో ఉండి వ్రాసిన ప్రస్తావన జానపదగేయం జానపద విజ్ఞానంలో భాగంగా పరామర్శించటం మంచి అవగాహన. ఈ దృష్టి జానపద సాహిత్య స్వరూపంలో విస్తృతమయింది. ఈ గ్రంథంలో జానపద గేయాలను, కథాగేయాలను, సామెతలను, పొడుపుకథలను గూర్చి విడివిడిగా ప్రత్యేక పరిశీలన ఉంది. జానపద సాహిత్యాంగాలను గూర్చి తాత్త్వికంగా పరిశీలించే ప్రయత్నం ఫలవంతమైన కృషి. జానపద సాహిత్యం (1982) గ్రంథం జానపద సాహిత్యస్వరూపం అడుగుజాడల్లో క్రొత్త సమాచారం సంతరించుకొంటూ సాగింది. నేటి ప్రయత్నాలను వివరించింది.

డా. ఆర్వియస్ సుందరం 'జానపద సాహిత్య మూలతత్వగళు' అనే కన్నడ రచన, జానపద విజ్ఞాన స్వరూపం అనే కన్నడమూలమైన డా. హ.మా. నాయక గ్రంథానికి తెల్గు అనువాద రచన. తెలుగు కన్నడ భాషలలోని జానపద సాహిత్యసంబంధి భావ వినిమయానికి దోహదకారులు. జానపద విజ్ఞానం పట్ల తెలుగులో కంటె కన్నడంలో ఆసక్తి ఎక్కువగా ఉన్నట్టు అనిపిస్తూవుంది. అందువల్ల ఈ ప్రయత్నాలు తెలుగు జానపద విజ్ఞానానికి మేలుచేకూర్చేవి అవు

తున్నాయి. జానపదం మీద పత్రిక నిర్వహించటం, దానిమీద సెమినార్లు నిర్వహించటం, అనేక వ్యాసాలు పత్రికలలో ప్రకటించటం డా. ఆర్వియస్ సుందరం కృషిలో భాగాలు.

జనపదం, జానపద విజ్ఞానం గూర్చి చర్చించటం, గేయ వాఙ్మయాన్ని, జానపద గేయ వాఙ్మయాన్ని ఆలోకించటం, యక్షగానాలను వివరించటం, కన్నడదేశంలోని జానపదసాహిత్యాన్ని, నెల్లూరులోని సామెతల్ని పరామర్శించటంతో పాటు జానపదవస్తు ప్రదర్శనాలయం ఆవశ్యకాన్ని వివరించిన అనేక వ్యాసాలు డా. ఆర్వియస్ సుందరం జానపదసాహిత్య కృషిని తెలుపుతున్నాయి. ఒక శాఖకు ఆరంభంలో పరిమితమై కృషిచేసినా అనంతరరం జానపదసాహిత్య సామస్త్యం రంగంగా ఏర్పరచుకొన్న డా. ఆర్వియస్ సుందరం పరిశోధన ఫలోన్ముఖంగా సాగటం పరికించవలసి ఉంది.

4.8. డా. యెల్దండ రఘుమారెడ్డి ఉస్మానియా విశ్వవిద్యాలయం డాక్టరేటు పట్టం పొందిన గ్రంథం పల్లె పదాలలో ప్రజాజీవనము (1974). ఇందులో జానపద మనస్తత్వం, కుటుంబ సామాజిక జీవనం, ఆచార వ్యవహారాలు, శృంగారప్రియత్వం పరికించి, ఆపైన జానపద సాహిత్యంలోని కవిత్వాన్ని, భాషా ప్రయోగాన్ని పరిశీలించటం ఉంది. జానపద జీవితంతో తాదాత్మ్యం పొందే రచయిత మనస్తత్వానికి అనుకూలంగా పరిశోధన జరిగింది. డా. రెడ్డి ఇంకా 'పండుగ శాయన్న వీరగాథ' 'పల్లెపదాలు - వేద మంత్రాలు' వంటి మంచి వ్యాసాలు ప్రకటించటం చూడవచ్చు.

4.9. డా. యం.కె. దేవకి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పట్టం పొందిన గ్రంథం 'తెలుగులో బాలగేయ సాహిత్యం' (1978), ఇందులో ముద్రితమైన జానపద బాల గేయాలను చిత్తూరు జిల్లాకు చెందిన జానపద బాల గేయాలను కూడా సేకరించి పరిశీలించటం జరిగింది. బాలల కోసం ఆధునికులు వ్రాసిన పాటలు కూడా ఇందులో పరిశోధించటం ఉందికాని, జానపద సాహిత్యం వరకే పరిమితంగా సమీక్షించవచ్చు. బాలగేయ వాఙ్మయ స్వరూపతత్త్వాన్నీ, ప్రాముఖ్యాన్ని ప్రదర్శించడమే ఈ పరిశోధన ప్రయత్నం. బాల సాహిత్య స్వరూపం తత్త్వం పరిణామం సామాజిక దృక్పథంతో పరిశీలన పొందాయి. జానపద బాల గేయాలు పిల్లలకోసం పాడేవి, పిల్లలు పాడుకొనేవిగా ఉన్నాయి. పిల్లల కోసం పాడేవాటిలో నిద్రపుచ్చేవి, ఆడించేవి, నేర్పించేవి ఉన్నాయి. పిల్లలు పాడుకొనే వాటిలో ఆట విడుపు, పండుగ ఎగతాళి పొడుపు గీతాలున్నాయి. 'తెలుగులో బాలగేయ సాహిత్యం' బాల మనస్తత్వం చక్కగా విశ్లేషించిన మంచి పరిశోధన.

4. 10. డా॥ జి.యస్. మోహన్ జానపద సాహిత్యం మీద ప్రకటించిన గ్రంథాలు మూడు. జానపద విజ్ఞాన వ్యాసావళి (1981), తెలుగు జానపద విజ్ఞాన సూచి (1982), స్త్రీల పాటలు, అనంతపుర మండలము (1982), సామెతలలో సాంఘిక జీవితం (1982) ముద్రితమైనట్లు తెలుగు జానపద విజ్ఞాన సూచిలోని వివరణాత్మక గ్రంథాల పట్టికలో ఉంది కాని 1983 మార్చిదాకా ముద్రితం కాలేదు. "వీరి తెలుగుకన్నడ సామెతల సమానార్థకములు ఇడీవలనే ప్రకటితమైనది"[15] అని డా. బి. రామరాజు 1983 లోనే తెలిపినా ఇంకా ప్రకటితం కాలేదు. 'కన్నడ తెలుగు గాదెగళు-సమానార్థకగళు' కన్నడంలో వెలువడింది. దాని అనువాదమో, ఆధారరచనో, తెలుగులో రావచ్చు. రాబోయేదాన్ని గూర్చి వచ్చిందనో, కన్నడంలో వచ్చిందాన్నిగూర్చి తెలుగు గ్రంథం అనుకొనో డా. బి. రామరాజు ఈ మాట అనివుండాలి. డా. జి. యస్. మోహన్ అచ్చుకోసం ఎదురుచూస్తున్నాయని తెలుపుతున్న గ్రంథాలలో 'తెలుగు కన్నడ సామెతలు సమానార్థకాలు' ఉంది.

జానపద విజ్ఞాన వ్యాసావళిలో 17 వ్యాసాలున్నాయి. జానపద విజ్ఞానం, ఆ సాహిత్యం, ఆ గేయాలు, ఆ కథలు రచయిత డాక్టరేటు సిద్ధాంత గ్రంథ సహాయం పొందినట్లుంది. జానపద వైద్యం, జా. మతం, జా. నృత్యం, జా. సంగీతం, జా. నాటకం జానపద విజ్ఞానాంశాలు. వీటిని గూర్చి మొట్టమొదటి సారిగా తెలుగులో ప్రస్తావించింది ఈ రచయితే. పద్య కథనాలు, సామెతలు, పొడుపు కథలు, జానపద విజ్ఞాన వస్తు ప్రదర్శనశాల వంటి విషయాలు మునుపు ప్రసక్తమైనా ఉదాహరణ బలంతో ఉన్నాయీ వ్యాసాలు. ఈ వ్యాసాలు ఆసక్తికరంగా రూపొందాయి. రచనలో దాగుడుమూతలు లేవు. స్పష్టత మేలిగుణం. ఋజుత్వం పరిశోధనకు ప్రాణ ప్రతిష్ఠ చేసింది.

తెలుగు జానపద విజ్ఞాన సూచి భావి పరిశోధకులకు బాగా ఉపయోగపడే రచన. దీనిలో జానపద సాహిత్యం, దానిమీది పరిశోధన గ్రంథాల వివరాలున్నాయి. ఒకే వ్యాసం పత్రికలో, సంకలనంలో ఉన్నప్పుడు దానిని రెండుగా కాక, ఒకటిగా చూపి ఉంటే బాగుండేది. ఇంత వైవిధ్యమున్న రచనల సమాచారం సేకరించటం అకారాది క్రమంలో ప్రక్రియా క్రమంలో క్రోడీకరించటం మంచి కృషి. ఈ సూచి విషయం ఇంతకుముందే ప్రస్తావించటమయింది.

స్త్రీల పాటలు 1979 లో డాక్టరేటు' పట్టం కోసం బెంగుళూరు విశ్వవిద్యాలయానికి సమర్పింపబడింది. 1982లో ప్రచురితం అయింది. ఇది అనంతపురం జిల్లా స్త్రీల పాటలకు పరిమితం. ఇందులో లాలి, జోల, సమర్త, పెండ్లి, సీమంతం, మేలుకొలుపు, పూజ, మంగళహారతి వంటి స్త్రీల పాటల పరిశీలన ఉంది. ఇంకా శ్రామిక, సాంప్రదాయిక స్త్రీల పాటలు కథల, వ్రత కథల సందర్భాలలోవి ఉన్నాయి. స్త్రీల పాటల్లోని సారస్వత, సాంఘిక, భాషా, ఛందః, సంగీత విషయ పరిశీలన ఉంది. స్త్రీల పాటల్లో కథన ఘటకాలు, అభివర్థిత పునరుక్తులు, వారానువర్తనాలు పరికించటముంది.

డా॥ జి. యన్. మోహన్ ఈ గ్రంథాలతో పాటు అనేక వ్యాసాలు ప్రకటించటం జరిగింది. రాయలసీమ జానపద సాహిత్యంలో అనంతపుర మండల వ్యావహారిక భాషా విశేషాలతో, తెలుగు జానపద విజ్ఞాన పరిశోధన పరిశీలన చేసి, పల్లెపాటలే జానపద గేయాలని తెలిపి, స్త్రీలపాటల వైశిష్ట్యం గుర్తించి, వాటి భాషా విశేషాలు ప్రకటించి, దానిని అమూల్య సంపదగా గమనించి, సామెతలు, ఎదురు కత, పొదుపు కథలు, మొలిక పాటల గురించి అనేక వ్యాసాలు వ్రాసి, వ్రాస్తూ డా. జి. యన్. మోహన్ జానపద విజ్ఞాన పరిధి విస్తృతం కావించటం పరిశోధక లోకం గుర్తిస్తుంది.

అయితే పరిశోధకుల కష్టాలు పరిశోధకులకు తెలుసు. ఇతరులకు చెప్పినా తెలియదు. బిడ్డల అందం చూచి మురుసుకునే బంధువులతో నేనింత ప్రసవవేదన పడ్డానని తల్లి నెత్తినోర్రు పెట్టి కొట్టుకొన్నా వినేవాళ్ళుండరు. అయినా నా గోడు నాది అన నక్కర లేదు. భాషా సౌష్ఠవం గుర్తించి పాడేవాళ్ళు, అలా పాడలేనివాళ్లు అని స్త్రీలను విభజిస్తేచాలు. అగ్రవర్ణాల స్త్రీలు, అగ్రేతర వర్ణాల స్త్రీలు అని విభజించ నక్కర లేదు. 1979 లో పట్టం పొందిన స్త్రీలపాటలు గ్రంథానికి 1981 లో వెలువడ్డ 'జానపద విజ్ఞాన వ్యాసావళి' ఉపయుక్త గ్రంథం కాలేదు. ముద్రణ సమయంలో సవరణ జరిగినట్లుకూడా లేదు. 1982 నవంబరు మాసాంతంలో ముద్రితమయింది కనుక 1982 ఆగస్టులో ముద్రిత మయిన 'తెలుగు జానపద విజ్ఞాన సూచి'లో దీని ప్రస్తావన ఉండటం, ఇంకా ముద్రితం కాని (18.3.83) 'సామెతలలో సాంఘిక జీవితం' 1982 ముద్రితమయినట్లు సూచిలో ఉండటం ఉచితం కాదు. రచయిత ముందెప్పుడో ముద్రించబోయే గ్రంథా

లను ముద్రితాలుగా తెలిపితే పరిశోధకులకు ఇబ్బంది కలిగి 'గ్రంథ సూచి' సమాచారం మీద సందేహం కలుగుతుంది.

4.11. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి డా॥ నాయని కోటీశ్వరి 'ప్రచురించిన జానపద గేయాలలో నిఘంటువుల కెక్కని పదాలు' (1978); డా॥ సుమతి 'తెలుగు జానపద కథలు'; డా॥ ప్రేమలత 'పౌరాణిక గాథలు'; డా॥ జి. లింగారెడ్డి 'తెలంగాణా గ్రామిక గేయాలు'; డా॥ వసుంధర 'తెలుగు జానపద సాహిత్యంలో ప్రతిబింబించే మత సంప్రదాయాలు'; డా॥ పి. సరస్వతి 'పిల్లల పాటలు' గూర్చి పరిశోధించి డాక్టరేటు పట్టాలు పొందారు.

4.12. డా॥ జి. యస్. రెడ్డి Telugu Folk Literature వ్రాసినట్లు, అది K. M. Institute of Hindi Studies, Agraలో ప్రచురణ అయినట్లు 'తెలుగు జానపద విజ్ఞానసూచి'లో ఉంది.

4.13. యం.లిట్, యం.ఫిల్ పట్టాల కోసం కూడా కొంత పరిశోధన జరిగింది. శ్రీమతి వింజమూరి సీతాదేవి జానపదుల సంగీతం గూర్చి పరిశోధించి మద్రాసు విశ్వవిద్యాలయ యం.లిట్ పట్టం పొందగా, శ్రీమతి జ్యోతిర్మయి వేదాంతపు పాటలు, శ్రీ దామోదరరావు తెలుగు సామెతలు మీద ఎం.లిట్ పట్టంకోసం పరిశోధన చేశారు. శ్రీ పేరాట్ల శివరామకృష్ణమూర్తి గిరిజనుల పాటలు; శ్రీమతి ఆర్. వసంతలక్ష్మి జానపద గేయములందలి సంగీతము; శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డి పొడుపుకథలమీద యం.లిట్ పట్టంకోసం పరిశోధన చేస్తున్నారు.

4.14. తెలుగు జానపద సాహిత్యం ఇతర భాషల జానపద సాహిత్యంతో తులనాత్మకంగా పరిశీలింపబడటంవల్ల భారతీయాత్మ సంబంధం విశదమయ్యే అవకాశం ఉంది. తెలుగు జానపద సాహిత్యంతో ఇప్పటికి హిందీ, కన్నడ జానపద సాహిత్యాలతో ఇటువంటి పరిశోధన జరిగింది. హిందీతో తులనాత్మక పరిశోధన జరిగినప్పుడు పరిశోధన గ్రంథాలు హిందీలోను, కన్నడంలో జరిగినప్పుడు ఎక్కువగా తెలుగులోనూ వెలువడ్డాయి.

4.15. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో హిందీ యం.ఏ. సిద్ధాంత వ్యాసాలుగా డా॥ వై. వెంకటరమణరావు 'తెలుగు ఔర్ హిందీ లోకోక్తియాం' (1962); శ్రీమతి ఫజులున్నిసా బేగం 'తెలుగు ఔర్ హిందీ క్రియావత్ ప్రయుక్తా మహావిరే' (1973) వెలువడ్డాయి.

డా॥ కర్ణరాజ శేషగిరిరావు హిందీలో సమర్పించిన 'తెలుగులో జానపద గీతములు' (1965) సిద్ధాంత గ్రంథానికి డాక్టరేటు పట్టం, డా॥ యస్. దక్షిణామూర్తి 'హిందీ ఔర్ తెలుగు కహావతోంకా తులనాత్మక అధ్యయన్'(1965)కి సాహిత్య మహోపాధ్యాయ పట్టం, డా॥ కారుమూరి వీరవెంకట లక్ష్మీనరసింహారావు 'తెలుగు ఔర్ హిందీ లోకోక్తియాం' (1967)కి డాక్టరేటు పట్టం పొందారు. డా॥ టి. మాచిరెడ్డి తెలుగు హిందీ కవితలలో ఉక్తిమీద పరిశోధన చేసినట్లు, శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ డాక్టరేటు పట్టం కోసం 'తెలుగు వ్రజ భాషలలోని జానపద కృష్ణకథలు' మీద పరిశోధన చేస్తున్నట్లు తెలుస్తూవుంది.

4.16. తెలుగు కన్నడ జానపద సాహిత్య రంగాలలో తులనాత్మక పరిశోధన జరిగింది. డా. ఆర్వియస్ సుందరం తెలుగు-కన్నడ జానపద గేయాలు (1973) మీదా, డా. సుందరం పర్యవేక్షణలో డా. టి. గోపాలకృష్ణరావు 'తెలుగు కన్నడములలో జానపద రామాయణములు' మీద పరిశోధన ముగించి డాక్టరేటు పట్టం పొందగా, శ్రీ పి.యస్. గోపాలకృష్ణ 'తెలుగు కన్నడ భాషలలో సామెతలు-ఒక తులనాత్మక పరిశీలన' 1975 నుంచి జరుగుతున్న

కృషి ఫలవంతం కావలసి వుంది. ఆకాశవాణి హైదరాబాదు ప్రసారం చేసిన 'భాషలమధ్య పోలికలు' (1980) వ్యాసంలో శ్రీ పి. యస్. గోపాలకృష్ణ తెలుగు-తుళు సామెతల పరిశీలన గమనార్హం. డా. ఆర్వీయస్ సుందరం, డా. జి. యస్. మోహన్ కన్నడంలో కూడా పరిశోధన గ్రంథాలు వెలువరించారు. ఇంగ్లీషులో పల్నాటి వీరగాథల మీద అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో పరిశోధన జరుగుతూ వుంది.

4.17 జానపద విజ్ఞానానికి, సాహిత్యానికి సంబంధించిన వివిధాంశాల మీద విశ్వవిద్యాలయాలలో పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టం పొందినవాళ్ళు మరి కొందరున్నారు. డా. కె. సుమతి-జానపద కథలు (1979), డా. పి. సరస్వతి - తెలుగు జానపద సాహిత్యం-పిల్లల పాటలు (1980), డా. రావి ప్రేమలత-తెలుగు జానపద సాహిత్యం - పురాణగాథలు (1980), డా. జి. వసుంధర - తెలుగు జానపద సాహిత్యం - స్త్రీల గేయాల్లో సంప్రదాయం (1981) ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచీ; డా. పి.హెచ్. రామనాథం - కూచిపూడి యక్షగాన విద్య-చారిత్రక సాహిత్య సాంకేతిక దృక్పథం (1980) ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచీ; డా. బిట్టు వేంకటేశ్వర్లు పల్నాటిసీమలో కోలాటం (?) నాగార్జున విశ్వవిద్యాలయం నుంచీ; డా. డి. నిర్మల తెలుగు తమిళ జానపద సాహిత్యం - తులనాత్మక పరిశీలన (?) మద్రాసు విశ్వవిద్యాలయం నుంచీ డాక్టరేటు పట్టం పొందారు.

డా. పోరంకి దక్షిణామూర్తి-తెలుగులో పరిశోధన వ్యాసం వల్ల, ఇంకా, కె. జ్యోతిర్మయి-తెలుగులో తాత్త్విక జానపదగేయాలు (1977), బొంతుగులపాటి దామోదరరావు - తెలుగు జానపద సామెతలు (1978), టి. వి. రామనరసయ్య-తెలుగు సామెతల్లో సంఘచిత్రణ (1977), ఎన్. రామేశం-కరీంనగర్ జానపద గేయాల్లో సాంఘిక జీవనం (1980), కె. హెచ్. లక్ష్మణరావు-తెలుగు సినిమా పాటలపై జానపద వాఙ్మయ ప్రభావం (1980), కురుగంటి శ్రీలక్ష్మి జానపదుల రామాయణపు పాటలు - స్త్రీపాత్ర చిత్రణం (1981) ఉస్మానియా విశ్వవిద్యాలయంలో; గుత్తి నరసింహులు-శ్రీకాకుళం మండలంలోని రామాయణ జానపద గేయ సమాలోచన (1979) నాగార్జున విశ్వవిద్యాలయంలో; కె. రామచంద్రారెడ్డి - ప్రాచీనాంధ్ర సాహిత్యంలో వినోదక్రీడలు (1979) శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో, జి. ఆర్. వేంకటేశులు-బయలాటలు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో, కె. లక్ష్మీనరసమ్మ-పెళ్ళిపాటలు-ఆచారాలు-సంప్రదాయాలు హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో యం. ఫిల్. పట్టం నిమిత్తం పరిశోధన చేసి ఫలితాలు సాధించారు.

5. తెలుగు జానపద సాహిత్యంలో జరిగిన పరిశోధన గూర్చి తెలుసుకోడానికి వ్యష్టిగా ప్రతి పరిశోధన గ్రంథం - ముద్రితమైనా, అముద్రితమైనా ఉపయోగపడుతుంది. ఆ పరిశోధన విశ్వవిద్యాలయాలలో జరిగినా, ఇతరత్రా జరిగినా ప్రయోజనకరమే. జానపద సాహిత్య సేకరణ వివరణ విశ్వవిద్యాలయేతర జిజ్ఞాసువులు చేసినంతగా విశ్వవిద్యాలయ పరిశోధకులు చేయలేదు. జానపద సాహిత్య పరిశోధన విశ్వవిద్యాలయ ప్రముఖులు చేసినంతగా ఇతరులు చేయలేదు. అది సహజం.

5.1. డా॥ బి. రామరాజు - తెలుగు జానపద గేయ సాహిత్యం ద్వితీయ ముద్రణంలో (1978) ప్రవేశికలో తన సిద్ధాంత గ్రంథానికి పూర్వాపరాలలో జరిగిన జానపద సాహిత్య పరిశోధనను గూర్చి తెలపటం ఉంది. డా॥ ఆర్వీయస్ సుందరం 'తెలుగు కన్నడ జానపదగేయాలు'తోను 'జానపద సాహిత్యం'తోను (1982) ఈ విషయపర్యాలోచన ఉంది. డా॥ జి. యస్. మోహన్ జానపద విజ్ఞాన వ్యాసావళి (1981)

లోను, తెలుగు జానపద విజ్ఞానసూచి(1982)లోనూ ఈ విషయం ప్రస్తావింపబడింది. ఇంతా 'మహతి' 'తెలుగు పరిశోధన సంహిత' గ్రంథాలు ఆధారంగా ఈ రంగములో జరిగిన పరిశోధనను గూర్చి తెలుసుకోవచ్చు. అన్ని గ్రంథాలలో ఉన్న సమాచారం గ్రహించి, లభించిన పరిశోధన గ్రంథాలు పరిశీలించి, జానపద సాహిత్యంలో జరిగిన పరిశోధనను వింగడించట మయింది. కొన్ని సందర్భాలలో పుస్తకం లభించక పోవటం, మరికొన్ని సందర్భాలలో వ్యక్తిగతమైన వినికిడినే మననం చేసుకోవడం, పరిశోధన చేసిన మనిషి తెలిసి, పరిశోధన తెలియకపోవటం వంటి ఇబ్బందులు ఎదుర్కోక తప్పలేదు. అందువల్ల ఏ పరిశోధన కృషి వివరణ గ్రంథం సంపూర్ణంగా సమగ్రంగా ఉందనలేనట్లే అయింది.

5.2. జానపద సాహిత్యంలో పరిశోధకులు ఒక్కొక్క శాఖను గ్రహించి ఆరంభంలో కృషి చేశారు. ఆ శాఖాస్థ సర్వ విషయ పరిశీలన చేశారు. వస్తువును గురించి, రసాన్ని గూర్చి, భాషను గూర్చి, ఒక మార్గ సాహిత్య కావ్యం గ్రహించిన పరిశోధకుడు చేసినట్లే, ఒక ప్రక్రియా శాఖను స్వీకరించిన జానపద సాహిత్య పరిశోధకులు అన్ని విషయాలూ ప్రస్తావించారు. డా. బి. రామరాజు, డా. యస్వీ జోగారావు, డా. తంగిరాల వెంకట సుబ్బారావు, డా. నాయని కృష్ణకుమారి సిద్ధాంత గ్రంథాలలో ఈ విథమైన కృషి కనిపిస్తూ వుంది. అనంతర కాలంలో వచ్చిన చాలా పరిశోధన గ్రంథాలు ఈ మార్గంలోనే సాగాయి.

5.౩. జానపద సాహిత్యంలో పౌరాణికధర్మం' జానపద సాహిత్యంలో భాష, జానపద సాహిత్యంలో శృంగారమనో, హాస్యమనో, వీరమనో అన్ని శాఖలను స్పృశిస్తూ పరిశోధన జరగవలసి ఉంది. ఇందుకు తాత్త్వికంగా అవసరమైన జానపద సాహిత్య సేకరణ, తద్విమర్శన, శాఖాపరిశోధన జరుగుతున్నాయి. కాబట్టి ప్రత్యేకాంశ ప్రశస్త పరిశోధన మార్గం ఏర్ప డుతూ వుంది.

5.4. పొడుపు కథల మీద కంటే, సామెతల మీద తగినంత పరిశోధన జరిగింది. సామెతల మీద కంటే కొంచెం ఎక్కువగా గద్య కథనాల మీద ఈ కృషి జరిగింది అని అనవచ్చు. విస్పష్టంగా గద్య జానపదం మీద కంటే గేయ జానపదం మీద ఎక్కువగా, బాగా ఎక్కువగా జరిగింది. ఎక్కువ అంటే తారతమ్యదృష్టితో మాత్రమే. గేయ జానపదం మీద కూడా జరగవలసినంత పరిశోధన జరగలేదు. జరుగుతూ వుందని, జరుగుతుందని మాత్రం ఆశాజనకంగా ఉంది పరిస్థితి.

5.5. తెలుగు జానపద సాహిత్య పరిశోధన విశ్వవిద్యాలయ స్థాయిలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆరంభమయింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆ తరువాత ఆరంభమయింది. ఇప్పుడు కర్ణాటక రాష్ట్రంలో ఈ పరిశోధన విస్తృతమయింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా. బి. రామరాజు, డా. నాయని కృష్ణకుమారి చాలామంది పరిశోధకుల చేత జానపద సాహిత్య పరిశోధన చేయించారు. చేయిస్తున్నారు. కర్ణాటక రాష్ట్రంలో డా. తంగిరాల వెంకట సుబ్బారావు, డా. ఆర్వియస్ సుందరం, డా. జి. యస్. మోహన్ ఈ రంగంలో గట్టి పరిశోధన ప్రయత్నంలో ఉన్నారు.

5.6. డా. ఆర్వియస్ సుందరం జానపద సాహిత్యంలోని ఒక శాఖను తులనాత్మకంగా చూచినా, అనంతర కాలంలో జానపద సాహిత్య సామస్త్యాన్ని తన పరిశోధన రంగంగా చేసుకోవటం కనిపిస్తుంది. జానపద గేయాలను, కథా గేయాలను, గద్య కథనాలను, సామెతలను, పొడుపు కథలను గూర్చి వాటి మౌలికాంశ సందర్శన ప్రయత్నం చేయగా, డా. జి. యస్. మోహన్ తన పరిశోధన రంగం మరింత విస్తృతం కావించుకొని జానపద విజ్ఞాన పరిశోధన-

అందరిలాగే తాను డాక్టరేటు పట్టంకోసం ఒక జానపద సాహిత్య శాఖను పరిశోధనకు గ్రహించినా- ప్రారంభించటం గమనార్హం. డా. ఆర్వియస్ సుందరం సిద్ధాంత పరంగా చేసిన జానపద గేయాలు, కథాగేయాలు, గద్యకథనాలు, సామెతలు, పొడుపుకథలు వాటిని ఉదాహరణాలతో ఇంకా విస్పష్టంగా డా. జి. యస్. మోహన్ వివరించటమేకాక, మొదటిసారిగా జానపద సంబంధమైన వైద్యం, మతం, నృత్యం, సంగీతం, నాటకం వంటి విషయాల లక్షణాలు ఉదాహరణ సహితంగా వ్యాసరచన చేయటం జరిగింది. డా. సుందరం చేసిన నూత్న ఆలోచనకు ప్రయత్నానికి డా. మోహన్ పురోభివృద్ధి కలిగించటం కనిపిస్తుంది. ఇద్దరికీ కన్నడ భాష వచ్చు. ఇద్దరూ కన్నడంలో గ్రంథ రచన చేశారు. తులనాత్మకంగా పరిశీలించారు. జానపద సాహిత్యంలో కన్నడంలో జరుగుతున్న కృషి ఫలితాలు తెలుగులోకి పరివర్తం చేసే ప్రయత్నంలో మాత్న అవగాహన అందించగలుగున్నారు. ఇద్దరూ ఆంగ్ల గ్రంథాలోకనం చేసి, తల్లక్షణాలు ఆంధ్ర జానపద సాహిత్యానికి సమన్వయం చేసే ప్రయత్నంలో ఉన్నారు. ఇంతగా వీళ్లు ఇతర భాషా ధర్మాలతో తెలుగు జానపద సాహిత్య సౌందర్యం ఇనుమడింప చేయడం విశేష ప్రయత్నమే !

5.7 ఆంధ్రదేశమంతటా జరగబోయే పరిశోధన సమగ్ర జానపద సాహిత్యదృష్టితో జరగవలసి వుంటి. శాఖ దృష్టితో కాదు. జానపదాంశ విశ్లేషణ దృష్టితో. బాహిరవలయంతో కాదు. ఆంతర ఆవరణంలో. పైన ఈదులాట కాదు. లోతులకు ఈదటం. జానపద సాహిత్యం అంతటిలో ఉన్న ఒకానొక అంశం యొక్క ఆంతర ప్రవృత్తి విశ్లేషణ కావాలి. సామస్త్యంనుంచి భిన్నాంశ పరిశోధన వ్యష్టిగా సమష్టిగా జరగవలసి ఉంది.

5.8 జానపద సాహిత్యం సామాన్యుల సాహిత్యం. అది సామాన్యుల భాషలో ఉంటుంది, ఉంది. దానిని పరిశోధనాంశంగా ఎన్నుకొన్నవాళ్లు వాళ్ళభాషను ప్రేమించటం ఆదరించటం మంచి గుణాలు. ఆ భాషను విశ్లేషించి చూపటం కూడా ధర్మం. ఈ ధర్మం పరిశోధకులు చాలామంది నిర్వహించారు. కొందరు సాంప్రదాయిక వ్యాకరణం ఆధారంగా, కొందరు భాషాశాస్త్రం ఆలంబనగా ఈ కృషి సాగించారు. అయితే ఆ విషయ వివరణ చేసే పరిశోధక గ్రంథాలు మాత్రం గ్రాంథికంలోనో, శిష్ట గ్రాంథికంలోనో, సరళ గ్రాంథికంలోనో ఉంటున్నాయి కాని వ్యావహారికంలో ఉండటం లేదు. ఆయా మాండలికాలలో వ్రాయవలసింది అని ఎవరూ అనరు. కొందరికి వ్యావహారికంలో రాద్దామనే అనిపించలేదు. కొందరికి అనిపించినా రాయలేదు. కొందరు సిద్ధాంత గ్రంథాలలో గ్రాంథికభాష, అనంతర వ్యాసాలలో వ్యావహారిక భాష ప్రయోగించారు. పరిశోధన గ్రంథాలు వ్యావహారిక భాషలో వ్రాయవచ్చునని విశ్వవిద్యాలయాలు అంగీకరిస్తున్న ఈ రోజుల్లో జానపద సాహిత్య పరిశోధక గ్రంథాలు గ్రాంథికంగా రాకుండా ఉంటే మంచిది. అలా ఒకటీ రెండు గ్రంథాలు ఈమధ్య వ్యావహారికంగా రావటం ముదావహం. ఏ భాషలో చెబితేనేం అభివ్యక్తి ముఖ్యం కదా అనే పరిశోధక గ్రంథాలు ఆంగ్లంలోనే ఉండాలన్న నియమం పోయి ఏ భాషా గ్రంథాలు ఆ భాషలోనే ఉండాలన్న నిర్ణయం ఏర్పడటానికి మూలహేతువు గమనించాలి. తెలుగులో ఉంటే చాలుకదా వ్యావహారికంలోనే ఎందుకు అనుకొంటే పరిణామం జీవద్వస్తువుల సహజధర్మం అనీ, భాషా జీవవంతం అనీ, అదీ పరిణామం చెందుతుందనీ, పరిణామ దశా విశేషమే ప్రసక్తం కావాలనీ గుర్తుంచుకోవాలి. ఏ భాషలో చెబితేనేం అభివ్యక్తి ఉంటేచాలు, అర్థమవుతుంటే చాలు, అదే పదివేలు అంటే అనవచ్చు, వినవచ్చు, తల వూపటం కష్టం. అంగీకరించటం అనిష్టం. జానపద పరిశోధకులకు సామాన్యులమీద సానుభూతి ఉద్ధరణ దృష్టికాదు ఉండవలసింది. తాదాత్మ్యం. రక్షణదృష్టి. అది మునుముందు కొదవ కాదని, కారాదని ఈనాడు భావించవచ్చు.

5.9 యక్షగానాలు, హరికథలు, కొన్ని వీర గాథలు కొన్ని స్త్రీల పెద్దపాటలు కర్తృకాలుగా ఉన్నాయి. జానపద ధర్మంలో అకర్తృకం, సామూహిక కర్తృకం అన్నది ఒక ప్రధాన లక్షణం. ఆ లక్షణం లోపించినా, వీటిని ఇతర కారణాలవల్ల జాన

పద సాహిత్య శాఖలుగానే భావించటం జరుగుతూ వుంది. కర్తృత్వం ఉన్నా, పల్నాటి వీరచరిత్ర జానపద దృష్టిని సంతరించుకొంది.ఆ దృష్టితోనే కర్తృత్వం ఉన్న బసవ పురాణంకూడా జానపద సంబంధాన్ని స్ఫురింపచేస్తుంది. ఆ స్ఫురణతో దేశివాఙ్మయం అంతా జానపద విజ్ఞాన సంబంధాన్ని విశ్లేషిస్తుంది. ఆ విశ్లేషణ దృష్టితో జ్ఞాత, అజ్ఞాత కర్తృకాలయిన చాటువులు ఈ శాఖను సమీపిస్తున్నాయి. ఈ అస్పష్ట సామీప్యం కారణంగానే చార్లెస్ ఇ. గోవర్ 'Folksongs of Southern India' (1871) గ్రంథంలో వేమన పద్యాలు ఉదాహరించటం జరిగింది. మార్గ సాహిత్యంలోను, ఆ అనుయాయి కవిత్వంలోనూ జానపద మనస్తత్వ విశ్లేషణ కొత్తది కాదుకదా! జానపద సాహిత్య విమర్శనం పరిశోధనం విస్తృతమవుతూ ఉండటం గుర్తింపబడాలి. జానపదత్వం విశ్లేషణ పొందాలి. కాలాంతరంలో సంభవించిన పరిణామాలు దృష్టిని సంకుచితం కావించనక్కరలేదు.

5. 10. అసలు జనపదం వేరు, జానపదులు వేరు. జానపద మనస్తత్వం వేరు. జనపదంలోని వాళ్ళంతా జానపదులని కానీ, జానపదులకంతా జానపద మనస్తత్వం ఉంటుందని కాని, పట్టణాలలో జానపద మనస్తత్వం లేదని కాని, జానపదులు లేరని కాని, అది జనపదం కాకుండా పోతుందని కాని నిశ్చయించటం న్యాయం కాదు. జానపద సాహిత్యం, జానపద విజ్ఞానం జానపద మనస్తత్వ సంబంధి సాహిత్యం. విజ్ఞానం. ఇది ప్రాదేశికమైన హద్దులు దాటుతుంది. భిన్న సంస్కృతుల సంపర్కం వల్ల నాగరికతా పరిణామం వల్ల జానపద సాహిత్యం, విజ్ఞానం అంతరించి పోవటానికి వీలుండటమే కాదు, అందువల్లే సంరక్షణ సంభావన పరిశోధన దృష్టి పెరుగుతుంది.

5. 11. తెలుగు జానపద సాహిత్యంలో పరిశోధన బాగా జరుగుతూవుంది. తెలుగు జానపద విజ్ఞానం మీద పరిశోధన ప్రారంభ మవుతుంది. భిన్న ప్రాంతాలలో, భాషలలో జరిగే జానపద సాహిత్య పరిశోధనవల్ల భారతీయాత్మ, ఏకత గోచరం కాగలవు. జానపద మనస్తత్వ దృష్టితో ఇంత నాగరకుడైన మనిషి ఎంత ప్రాచీనుడో, విశ్వమానవ సమాన ధర్మాలేమిటో తెలియటంతోపాటు విశ్వమానవ హృదయం వసుధైక కుటుంబం వైపు జానపదసాహిత్యం తీసుకుపోతుంది.ఆ దృష్టితో తెలుగు జానపద సాహిత్య విజ్ఞాన సేకరణ,వివరణ,పరిశోధన జరుగుతూఉంది. ఇంతవరకు తెలుగులో జరిగిన జానపద సాహిత్య పరిశోధన ఆ మార్గోన్ముఖంగా ఉంది.

**ఉదాహృత సూచిక**


| | | | | |
|---|---|---|---|---|
| 1. | డా. బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుటలు | 53, 54 |
| 2. | డా॥ కొలకలూరి ఇనాక్ | తెలుగు వ్యాస పరిణామం | పుట | 440 |
| 3. | డా॥ జి. యస్. మోహన్ | జానపద విజ్ఞాన వ్యాసావళి | పుట | 26 |
| 4. | డా॥ బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుట | 55 |
| 5. | డా॥ కాకర్ల రామనరసింహం | యక్షగానములు. 7 వ సంపుటము | పుట | 8 |
| 6. | డా॥ బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుట | 71 |
| 7. | డా॥ ఆర్వియస్ సుందరం | తెలుగు కన్నడ జానపద గేయాలు | పుట | 22 |
| 8. | డా॥ జి. యస్. మోహన్ | జానపద విజ్ఞాన వ్యాసావళి | పుట | 26 |
| 9. | డా॥ కొలకలూరి ఇనాక్ | తెలుగు వ్యాస పరిణామం | పుట | 440 |
| 10. | డా॥ బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుట | 83[illegible] |
| 11. | డా॥ జి. యస్. మోహన్ | స్త్రీల పాటలు, అనంతపుర మండలము | పుట | 352 |
| 12. | డా॥ బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుట | 67 |
| 13. | తెలుగు అకాడమీ | తెలుగు పరిశోధన సంహిత | పుట | 102 |
| 14. | డా॥ దివాకర్ల వేంకటావధాని | మహతి | పుట | 2-8 |
| 15. | డా॥ బి. రామరాజు | తెలుగు జానపద గేయ సాహిత్యము | పుట | 63 |

# దేశిరూపక ప్రక్రియలు

—వేటూరి ఆనందమూర్తి

**సమీక్ష :**

"హాల సాతవాహన మహారాజు సంపాదించిన గాధాసప్తశతిని బట్టి క్రీస్తుశకారంభమునకు పూర్వమే ఆంధ్రదేశములో నృత్య-సంగీత-నాటకములు ప్రచారమందున్నవని తెలియుచున్నది. ఆంధ్రులు 'దాక్షిణాత్య ప్రవృత్తికి చెందినవారనియు, దాక్షిణాత్యులు బహు నృత్త - గీత - వాద్య - లలితాభినయ ప్రియులనియు భరతుడు నాట్యశాస్త్రమందు పేర్కొనెను. మరియు 'ఆంధ్రి' యను విభాష ఆ దేశవాసులకు నాట్యమందుపయుక్తమగుననియు, మధ్యమ గ్రామాశ్రయములగు పదునొకండు జాతులలో 'ఆంధ్రి' ఒక జాతి (నేటిరాగము) అనియు అందే పేర్కొనబడుటను బట్టి క్రీ. శ. ప్రథమ శతాబ్ది నాటికే ఆంధ్రులు లలితకళల విషయములో ఎంతయో అభివృద్ధిని సాధించియుండిరనెడి విషయము స్పష్టమగుచున్నది. భారతదేశమందలి ముఖ్య నృత్య సంప్రదాయములకెల్ల ఆధారగ్రంథమైన నందికేశ్వరుని 'అభినయ దర్పణము' ఆంధ్రదేశముననే రచింపబడినదనియు, తత్కర్త ఆంధ్రుడే యనియు విశ్వసించుటకనేకాధారములు కలవు. ఇది క్రీ.శ. 3 లేదా 4 వ శతాబ్ది ప్రాంతముల రచింపబడి యుండును. అభినయ దర్పణ కాలమునుండి క్రీ.శ. 11వ శతాబ్ది వరకును గల కాలములోని తెలుగుదేశపు నృత్య-సంగీత-నాటక చరిత్ర మనకు తెలియదు. ఇది ఒక అజ్ఞాతయుగము వంటిది. కాని, అమరావతి, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములందు కనుగొనబడిన బౌద్ధ శిల్పాదులు మాత్రము ఆంధ్రదేశమున లలితకళలు నిరంతరముగా అభివృద్ధి పొందినవని తలంచుటకు తార్కాణములుగా నున్నవి.

"పాల్కురికి సోమనాధుని (క్రీ. శ. 12వ శతాబ్ది) బసవ పురాణము, పండితారాధ్య చరిత్రములలో నృత్య - సంగీత - నాటకాదుల ప్రసంగములు పెక్కులు కలవు. పండితారాధ్య చరిత్రనుబట్టి నాడు తెలుగుదేశమున ఖండితగతి నాటక ప్రదర్శనములు, సాంగ నాటక ప్రదర్శనములు విరివిగా జరిగినట్లు స్పష్టమగుచున్నది. ఈ నాటక ప్రదర్శనములతో పాటు నాటి ప్రసిద్ధ దృశ్య వినోదములలో వివిధ నృత్యములు, తోలు బొమ్మలాటలు, కట్టె బొమ్మలాటలు ప్రధానములైనవి. అటుపిమ్మట యక్షగానమొక గేయ సాహిత్య ప్రక్రియగా ఆవిర్భవించి, క్రమముగా దృశ్యరూపమును సంతరించుకొని తంజావూరు నాయక రాజుల కాలములో (క్రీ. శ. 17 వ శతాబ్ది) నాటకముతో అభేదమును చెందినది. ఈ యక్షగాన నాటకములకు 17వ శతాబ్ది స్వర్ణయుగము. ఈ నాటకములన్నియును 'దేశి' జాతికి చెందినవి. అనగా ఇవి యన్నియును నృత్య సంగీత ప్రధానములు. కాగా ఇవి సంస్కృత 'నాటక' లక్షణానుసారులు కావనుట స్పష్టము." (పోణంగి శ్రీరామఅప్పారావు. సొవెనీర్ ఆన్ డ్రామా సెమినార్. పు. 18. 1960).

**పరిధి :**

కళలు

లలితకళలు

సంగీతం | శిల్పం | చిత్రలేఖనం

గీతం | వాద్యం | నాట్యకళ

నాట్యం
1. యక్షగాన నృత్య నాటకాలు
2. గేయ, వచన నాటకాలు

నృత్యం
1. కథాప్రధానం
2. గీత ప్రధానం

నృత్తం
1. గతి 2. జతి
3. శబ్ద 4. రస
ప్రాధాన్యం కలవి.

శాస్త్రీయ నృత్య సంప్రదాయం

నట్టువమేళం
1 మార్గి
2 దేశి

దేవదాసి (ఆలయ నర్తకి)

గణిక (రాజనర్తకి)

1 కేళిక
2 మేజువాణి
3 మేళం (వీధి ఆట)

ఆరాధన పూజానృత్యం
1 శైవసంబంధి (నృత్యం రాదు)
2 వైష్ణవ సంబంధి

కేళిక (వినోదార్థం) కల్యాణమంటపంలో

నాట్య (భాగవత) మేళం

వీధి భాగవతాలు (బహుపాత్ర-నృత్య నాటకాలు)

కలాపాలు (ఏకపాత్ర-నాట్యము)

| భాగవత నాటకములందు స్త్రీలు పాల్గొనరు. పురుషులే స్త్రీ వేషము వేయుదురు. కనుక తాండవమే కాని శుద్ధ లాస్య ముండదు | **1. కూచిపూడి భాగవతులు**<br>నృత్య (వీధి) నాటకాలు<br>i భగవత్ సంబంధి<br>ii రాజసంబంధి | కూచిపూడి | దేవదాసి |
|---|---|---|---|
| | | భామాకలాపం (పారిజాతం)<br>గొల్లకలాపం<br>రాధామాధవం | |

**2. ఇతర భాగవతులు**

| | |
|---|---|
| పౌతకమూరి భాగవతులు | నక్కల భాగవతులు |
| గడ్డిపాడు భాగవతులు | గంటె భాగవతులు |
| కోటకొండ భాగవతులు | చిలుకల భాగవతులు |
| మాల భాగవతులు | జేగంట భాగవతులు |
| యానాది భాగవతులు | మేలటూరు భాగవతులు |
| చెంచు భాగవతులు | వంజు భాగవతులు |
| గొల్ల భాగవతులు | |

3. బొమ్మలాటలు-కీలుబొమ్మలు, తోలుబొమ్మలు, కట్టెబొమ్మలు, ఛాయానాటకములు

యక్షగానము- యక్షగాన నాటకాలు, యక్షగాన ప్రబంధాలు, యక్షగాన కావ్యాలు, బయలాటలు

కురవంజులు (శృంగార-, వేదాంత-)

పగటి వేషములు, వీధి నాటకములు, వీధి భాగవతాలు

గారడీ - విప్రవినోదము

చిత్ర కథావిధానము

బహు రూపములు, బుట్ట బొమ్మలు, కీలు గుఱ్ఱం

సాంగ నాటకములు

కథా కాలక్షేపాలు - హరికథలు, వీర గాథలు (ఊర్ధ కథలు), తందానలు, బుర్ర కథలు, జంగం కథలు

ఖండితగతి నాటకాలు, పాలకరం, కాశీ కావడి, ఫకీరు వేషాలు, జంతరు పెట్టె

జక్కిణి, గొండ్లి, గొబ్బి, కోలాటనృత్యం, చక్కభజనలు, కనకతప్పెట్లు, సేవ, గొల్ల సుద్దులు, బతుకమ్మ పాటలు, తుమ్మెద పాటలు, గరగ నృత్యం మొ॥

**దేశి - రూపక ప్రక్రియలు :**

''వాక్కు నాట్యమునకు తనువు. ఆంగిక, ఆహార్య సాత్త్వికాభినయములు మూడును వాక్యార్థమునే వ్యక్తము చేయును. వాక్కే సమస్తమునకును మూల కారణము.

పాఠ్యము సంస్కృత, ప్రాకృత భేదములచే రెండు విధములు. నాట్యప్రయోగమందు ప్రాకృత పాఠ్యము సంగ్రహముగా మూడు విధములు. సమానము (తత్సమము); విభ్రష్టము (తద్భవము), దేశీగతము (దేశి లేదా గ్రామ్యము).'' నాట్య శాస్త్రము- అనువా, పో. శ్రీరామ అప్పారావు, అధ్యా. 14-17 1959

''దేశే దేశే ప్రవృత్తోఽసౌ ధ్వనిర్దేశీతి సంజ్ఞితః
అబలా బాల గోపాలైః క్షితి పాలై ర్నిజేచ్ఛయా
గీయతే సానురాగేణ స్వదేశే దేశిరుచ్యతే'' అని

మతంగుని బృహద్దేశి ''ఈ మార్గదేశి విభాగము మొట్ట మొదట సంగీత విషయమున బాటిం పబడినట్లు తెలియు చున్నది.

సంగీతము< అనాహతము-ప్రకృతి జన్యము
ఆహతము-మనుష్యోపజ్ఞము
వైదికము-మార్గ సంగీతము-
(సామగానము మొ॥)

ఆహతము< వైదికము-మార్గసంగీతము
అవైదికము-వివిధ దేశోత్పన్నమైనది-
ఇదియే దేశి.

(ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. యస్. వి. జోగారావు పు. 59-1960)

సంగీతమున మార్గదేశి విభాగములను గూర్చిన క్రింది విషయములు గుర్తింపదగినవి.

''నియమ రహితమైన కామచార ప్రవర్తిత్వ మును దేశానుగుణ ప్రవృత్తియు దేశి రాగముల లక్షణమనియు, నియమ సాహిత్యమును సర్వదేశ సమాన రూపశాలిత్వమును మార్గరాగముల లక్షణ మనియు (సంగీత రత్నాకరమును బట్టి) విశదమగు చున్నది.

శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరమునందలి ప్రబంధాధ్యాయమున సంగీతమును రెండు రకములుగా విభజించి యందు మార్గమును 'గాంధర్వ' మనియు, దేశికి 'గాన' మనియు నామాంతరములు సూచించెను. [illegible] వ్యాఖ్యానము వ్రాయుచు గల్లినాథుడు మార్గః గానంతు దేశీ త్యవగరతవ్య తెలెను. ఈ నామములనే శార్ఙ్గదేవు రామయామాత్యుడు కూడ వాడి దేవుడు (గాంధర్వ మనాది సంప్ర నిర్వచించెను. 'అనాది సంప్రదాయ మిత్యనేన గాంధర్వస్య వేదవ దపౌరుషేయత్వ మితి సూచితం భవతి' యని కల్లినాథుడు దానికి జేసిన వ్యాఖ్యానము. దీని ననుసరించి గాంధర్వము లేక మార్గము అనాది కాలమునుండి వచ్చుచున్నదనియు, నపౌరుషేయ మనియు దేలుచున్నది. ''యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః'' అన్న శార్ఙ్గ దేవుని వాక్యమునందలి భావము కూడ నిదియే...

గాంధర్వము లక్షణానురోధముగా ప్రయో గింపబడును...అందు క్రొత్త పోకడలకు దావులేదు. దేశి సంగీత మట్లుకాదు. అది లక్ష్య ప్రధానమైనది... ఆయా దేశములందలి ప్రజలు తమ యభిరుచుల ననుసరించి భిన్నభిన్న విధములుగా వాడుకొందురు. దేశి పద్ధతిలో లక్ష్య లక్షణములకు వైరుధ్యము కలుగుచో లక్ష్యమునుబట్టియే లక్షణమును సవరించు గొనవలెను. (ప్రాజ్ఞన్నయ యుగము - పుటలు 359-361. శ్రీ దివాకర్ల వేంకటావధాని-1960)

భాషా విషయమునను ఛందస్సాహితీరీతుల విషయమునను ఈ దక్షిణ దేశ భాషలకు సహజము సమానమునగు సంప్రదాయ పద్ధతియే 'దేశి' అని వ్యవహరింపబడుచున్నది. ఈ భాషలకు సంస్కృత భాషా సాహిత్య సంప్రదాయముల సంపర్కము గలి గిన పిదప తద్రీతు లీదేశ భాషలలో ననుసరింపబడిన పద్ధతియే 'మార్గ' పద్ధతి యైనది''

(దక్షిణ భాషా సారస్వతములు, దేశి- కోరాడ రామకృష్ణయ్య. పు.2-1968 II Ed)

''క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్''- దృశ్యమును శ్రవ్యమును అయిన క్రీడ నీయకమును అనగా చూచుటకును వినుటకును వీలైన వినోద వస్తువును మేము కోరుచున్నాము''

(నాట్యశా. పో. శ్రీ. అ. పుట 5-1959)

''దశరూపములును 'నాట్యము' నకు చెందినవి. భరతుడు 'రూప' మనెడి పదమును మాత్రమే వాడెను.

అభినవగుప్తుడు రూప-రూపక పదములను రెండింటిని వాడెను. ధనంజయుని నాటికి 'రూప' మనెడి పదము ప్రచారమునుండి మరుగుపడిన దని చెప్పవచ్చును. భరతుడు 'దశరూపములు' అని పేర్కొనగా వామనుడు 'దశరూపక' మనుటయు, ధనంజయుడు తన గ్రంథమును 'దశరూపక'మనుటయు గమనార్హములు. ధనంజయుడు రూప-రూపక పదములను క్రింది విధముగా వివరించెను.

''అవస్థాను కృతిర్నాట్యం, రూపం దృశ్యత
యోచ్యతే
రూపకం తత్సమారోపాత్, దశ ధైవ
రసాశ్రయమ్.''
(దశరూపకము-ప్ర.ప్రకాశము 7 శ్లో)

అవస్థానుకరణము నాట్యము, అది దృశ్యమానమగుటచే 'రూప' మనబడును. రూప ఆరోపము కలదగుటచే 'రూపక' మనబడును. రసాశ్రయమైన ఈ నాట్యము పది విధములు.'' -నాట్యశాస్త్రము పో.శ్రీ. అప్పారావు, అధ్యా. 18, పు. 531 - 1959-

కనుక దేశ్యమై,పాఠ్యగేయములచేత మధురమై, భాషాచ్ఛందస్సాహితీరీతుల వ్యక్తమై, దృశ్యమై, శ్రవ్యమై, క్రీడనీయకమైన ప్రక్రియ దేశికళయే, దేశిరూపక ప్రక్రియయే. తెలుగున వెలసిన అట్టి దేశిరూపక ప్రక్రియల ఉత్పత్తి వికాసములను గూర్చిన పరిశోధన విమర్శ వాఙ్మయ పరిశీలనమే ప్రస్తుత కర్తవ్యము.

**దేశిరూపక వికాసము**

'వీథి నాటకాలనీ, జానపద నాటకాలనీ, గ్రామీణ నాటకాలనీ, లోకధర్మి నాటకాలనీ వేరువేరు పేర్లతో ప్రచారంలోవున్న అన్ని ప్రక్రియలనూ 'దేశిరూపకాలు' అన్న పేరుతో వ్యవహరించవచ్చు. నాగరకుల మార్గ నాటక విధానానికి భిన్నంగా జానపదులకు అందుబాటులోవుండి వారిని రంజింపజేయడానికి ప్రయుక్తం చేయబడే ముఖ్యమైన రూపక ప్రక్రియ దేశిరూపకం.

...ప్రపంచంలోని ఏ దేశానికి చెందిన నాటక చరిత్రగమనించినా ప్రస్ఫుటం అయ్యే సత్యం ఒక్కటే. అన్ని దేశాలలోని రూపకాల ఆవిర్భావానికి మతంతో ఎంతో కొంత సంబంధం ఉంది. ఆ మతాలకు సంబంధించిన ఊరేగింపులో, ఉత్సవాలలో మానవుడు ఆనంఎంతో వేసిన చిందు మొదటి నృత్యవిన్యాసం. రాను రాను అది సంగీతాన్ని, సంభాషణలను కూర్చుకొని దేశి రూపకం అయింది...

...క్రీ.పూ. 140కి చెందినవాడని చెప్పబడుతున్న పతంజలి మూడు రకాలైన జన నాట్యాలను పేర్కొన్నాడు ఇందులో మొదటిది సౌభిక అనే మూకనృత్యం. రెండవది చైత్రిక-చిత్రించబడిన బొమ్మల ద్వారా ప్రదర్శింపబడేది. మూడవది గ్రంథిక-పుస్తకాలలో నుంచి చూచి పఠించేది. ఈ జన నాట్య పద్ధతులను గమనిస్తే దేశిరూపకాల ప్రాథమిక రూపానికి పైవానికి జనకజన్య సంబంధం వున్నట్లు స్పష్టం అవుతుంది...

దేశిరూపక వికాసం మూడు దశల్లో సాగిందని చెప్పవచ్చు. 1. ఏకపాత్రాభినయాత్మకం (పురాణకాలక్షేపం), 2. ఇద్దరు పాత్రలు కల నాట్యాలు (యుగ్మనాటకాలు), 3. సమూహ నాట్యాలు (వీటినే దేశిరూపకకాలు అంటున్నాం). -నాట్యకళ-మొదలి నాగభూషణశర్మ-ఫిబ్రవరి, మార్చి 1970-

"దేశిరూపక (యక్షగాన) ప్రగతిలో మూడు దశలు కానవస్తున్నాయి. 1. సంగీత సంకీర్తన దశ, 2. కథాకథనప్రబంధ దశ, 3. నాటకదశ." -నాట్యకళ, శ్రీనివాస చక్రవర్తి. పు. 8. 1970-

ఈ తీరుగా విమర్శలోకం గుర్తించిన దేశికళ, దేశిరూపకం క్రమంగా యక్షగాన, యక్షాందోళన నృత్య, యక్షగాన నాటక, యక్షగాన ప్రబంధ, యక్షగాన చాటు కావ్య నామాలతో ప్రచలితమై ప్రాథమికముగా "యక్షగాన" నామంలో రూఢమైనది. అందుకే స్థూలదృష్టితోను, సూక్ష్మదృష్టితోను

కూడా పరిశీలించి 'యక్షగాన' నామం సంతరించు కొన్న అర్థవిస్తృతిని పరిశోధకులు సంభావించినారు.

"అసలు 'యక్షగాన' మంటే యక్షుల గురించి చేసే గానం, యక్షులు చేసే గానం, యక్షులు గానం చేసినట్లు చేయబడే గానం అని అర్థాలు. యక్షులు చేసే గానం యేదైనా కావచ్చు. వారి ననుకరించి చేసేదీ యేదైనా కావచ్చు. యక్షుల గురించి చేసేది అంటే యక్షుల ప్రీతికై చేసే గానం కావచ్చు. కేవలం యక్షుల గాథలే గానం చేసేదీ కావచ్చు. యక్షుల ప్రీతికి యక్షుల గాథలే కాక యితరగాథలూ వారి కిష్టమైనవి గానం చేయవచ్చును. ఈ దృష్ట్యా గాన యోగ్యమైన ప్రబంధం యేదైనా సరే కావ్య మేదైనా సరే 'యక్షగాన' మనడానికి సమర్థమైన దన్నమాట." సీతాకల్యాణం పీఠిక. వడ్లమూడి గోపాలకృష్ణయ్య. పు. xvi 1971

మన సంగీత రచనల గురించి వ్రాస్తూ శ్రీ రజనీకాంతరావుగారు 12 వ శతాబ్ది వరకు వున్న కాలాన్ని సామగాన యుగం, గాంధర్వ యుగం, ఆఖ్యాన యుగం, ధృవాగాన యుగం, రాగ కావ్య యుగం, గీతగోవింద యుగం అని ఆరు యుగాలు గాను, తరువాతికాలాన్ని దేశభాషా సంకీర్తన యుగం, యక్షగాన యుగం, ధాతుకల్పనా పరిణామ యుగం, సభా సంప్రదాయ యుగం, హరికథాయుగం అని ఐదు యుగాలుగాను విశ్లేషించి సమీక్షించారు. [ఆం॥వా॥చ. పు. 8. 288. 1958]

"యక్షగాన" మను సమస్తపదము న "గానము" దేశీయమైన సంగీతము. ఇక యక్ష-జక్క-ఎక్క-అక్క-యక్షేశ-ధనద-కుబేరాదులకు ఆంధ్రజాతివారికి గల సంబంధము భాషావిదులు చారిత్రకులు సంభావించినట్టిదే.

కనుక యక్షగానము ప్రాదుర్భావమున ఆంధ్రులు అభిమానించి రూపుదిద్దుకొన్న కళావిశేష మనవుగును.

**వివిధ దేశి కళారూపాలకు సంబంధించిన వికాసాన్ని గూర్చిన సంగ్రహ కథనం :**

బొమ్మలాటలు :- ఈ బొమ్మలాటలు మన దేశంలో రెండువేల ఏండ్లనుండి ప్రచారంలో నున్నట్లు ఆధారములున్నవి. తూర్పు తీరపు రేవులనుండే ఈ గ్రామీణ దృశ్య వినోదం ఆసియా ఖండమంతటా వ్యాపించింది. వీటి మూలంగానే మన ప్రాచీన కావ్యేతిహాసాలు ప్రపంచ ఖ్యాతిని పడసినవి. మన కావ్యాలు, శాసనాలు బొమ్మలాటల్ని గురించి, బొమ్మలాట మేళమును గురించి, ప్రభువులచేత 'బొమ్మలాట వారు' అగ్రహారాది సన్మానములను పొందుట గురించి వివరంగా తెలుపుతున్నవి. బొమ్మల తయారీలో ఉపయుక్తమయే వస్తువును బట్టి ఇవి ప్రధానంగా కొయ్య బొమ్మలు, తోలు బొమ్మలు అని రెండు రెండు రకాలు. ప్రదర్శన విధానాన్ని బట్టి ఈ క్రింది పేర్లతో ఇవి ప్రసిద్ధము.

1. తాళ్ల బొమ్మలు (Stringed puppets) సూత్రధారుని చేతి సూత్రము సహాయంతో ఆడింప బడునవి. అవయవాల కీళ్లవద్ద ఇవి కదులుతాయి కనుక వీటికి 'కీలుబొమ్మలు' అనీ పేరు.

2. తొడుగుబొమ్మలు (Glove puppets) చేతి వేళ్ళకు తగిలించుకొన్న బొమ్మలతో ఆడింప బడునవి. మన దేశంలో అరుదుగా కొందరు బిచ్చగాండ్రు ఈ వినోదాన్ని ప్రదర్శిస్తూ కనిపిస్తారు.

3. ఊచ బొమ్మలు (Rod Puppets) ఊచల సహాయంతో ఆడింపబడేబొమ్మలు. ఈ బొమ్మలు ఊచలమీద నిలిచి సూత్రముల సహాయంతో కదులుతాయి. 'కడు నద్భుతంబుగ గంబ సూత్రంబు లదరంగ బొమ్మల నాడించు' వారిని గూర్చిన ప్రశంస పండితారాధ్య చరిత్రలో ఉంది.

4. తోలుబొమ్మలు (Leather puppets) తెలుగు దేశంలో ప్రసిద్ధి గాంచిన ప్రాచీన దృశ్య

వినోద మిది. 'భారతాది కథలఁ జీరమఱుగుల నారంగ బొమ్మల' నాడించుచుండిన ప్రస్తావన పండితారాధ్య చరిత్రలో కలదు. అర్ధ పారదర్శకములు, పూర్ణపార దర్శకములు అయిన తోలు బిళ్లలతో చేయబడిన బొమ్మలివి. రంగులు పూయవచ్చును. తెరమరుగున దీపము, లేక, దివిటీల సహాయమున ఛాయపడేటట్లు ఆడింపబడుట చేత వీటికే 'ఛాయా నాటకము' లనియు, 'తెర నాటకము' లనియు పేరు. ఆధునికుల Shadow plays కి తోలుబొమ్మల ఆటయే ప్రేరకము.

తోలు బొమ్మలాటనుగూర్చి అన్నమయ్యగారి కీర్తన యిది చూడదగినది:

ఆటవారి గూడితౌరా
ఆటవారి గూడి అన్ని చోట్ల బొమ్మ
లాట్ల లాడించ నధికుండ వైతివి॥
గురుతరమగు పెద్ద కొట్టాము లోపల
తిరమైన పెనుమాయ దెరగట్టి
అరయ సుజ్ఞానము లవి యద్దము జేసి
పరగ సుజ్ఞాన దీపములు ముట్టించి॥
తోలు బొమ్మల దొరకొని గడియించి
గాలిచేత వానిగదలించి
తూలేటి రసములు తొమ్మిది గడియించి
నాలుగు ముఖముల నలువున నాడించ॥
(5-105)
(తాళ్లపాక కవుల పద కవితలు- వే.ఆ.పు. 538)

కొయ్యబొమ్మ (జంత్రపుబొమ్మ) కీలు బొమ్మలు ఆట తెరముందుగానే క్రనబడుతూ కదులు తాయి. బొమ్మలాట మేళము వారి సాహిత్యము యక్షగాన వీధి నాటకములే. జావాద్వీపవాసుల వాయంగ్ (బొమ్మలాట వాయంగ్‌వోంగ్, వాయంగ్ టిక్, వాయంగ్ పూర్వ, వాయంగ్ గెదక్ మొ॥) వినోదములకు మన బొమ్మలాటలే ప్రేరణ నిచ్చినవి.

అర్వాచీన కాలమున మన అశ్రద్ధ వలన ఆంధ్ర దేశమున ఈ ప్రాచీన కళ సన్నగిల్లినది. మహారాష్ట్రులీ కళను చేపట్టి ప్రసిద్ధికి తెచ్చుచున్నారు.

ఈ తోలుబొమ్మలాటలను పునరుద్ధరించుటకు శ్రీ రమణ (కాకినాడ)గారు ప్రయత్నించుచున్నారు :

['బొమ్మలాట-తోలుబొమ్మలు'- కూర్మా వేణు గోపాలస్వామి (నాట్యకళ పు. 111); తోలుబొమ్మ లాటలు- ఎం.వి. రమణమూర్తి(నాట్యకళ. పు. 119); తెలుగు తోలుబొమ్మల ప్రభావము-పి. ఆర్. ఆచార్య (నాట్యకళ పు. 123); బొమ్మలాటలు పో. శ్రీ. అప్పారావు. (తెలుగు నాటక వివేకము. పు. 147)]

15 వ శతాబ్దిలో తాళ్ళపాక కవులు రాతి బొమ్మల, మ్రాని బొమ్మల, తోలి బొమ్మల వినోదము లను వర్ణించినారు. అట్టి వినోదములపై ఆనాడు ఆ వృత్తిని చేపట్టి వారు సుంకమును కూడకట్టుచుండి రట. [తాళ్ళపాక కవుల పద కవితలు - వేటూరి ఆనందమూర్తి పు. 536- 1976]

**యక్షగానములు :**

''ఆంధ్రతామ్రుదను భద్రపరచిన ఘన దేశి సాహిత్య ప్రక్రియలకెల్ల దలమానికము యక్షగానము. అది ప్రాదుర్భావమున నేదో సాధారణ మత బీజక వినోద కాలక్షేపమై యుండినదేమో కాని రానురాను ఒక ప్రత్యేక సాహిత్యశాఖగా వర్ధిల్లుచూ వచ్చినది. అట్లని అది వట్టి సాహిత్య ప్రక్రియ మాత్రము కాదు. సంగీతాభినయ కళలకు దానకమై దేశి సంస్కృతి కోశమై పరిఢవిల్లినది. యక్షగాన గ్రంథములు ఆంధ్ర మున బహుళ్యతముగా తెలిసినవి. కథకళి కళాప్రతి ష్ఠలు గల మళయాళ రాష్ట్రము వినా యావద్దక్షిణ భారత దేశ వ్యాప్తమైన కళా స్వరూపము యక్షగాన మని చెప్పవచ్చును.'' [యక్షగానము-యస్.వి. జోగా రావు, పు. 2. 1975]

**యక్ష, యక్షగాన ప్రశంస**

యక్ష శబ్దము విచిత్రవస్తు వను నర్థమున జైమినీయ భారతమున గలదు. గృహ్య సూత్రము లలో భూతాదులతోపాటు యక్షావాహన విషయము కలదు. శాంఖాయణ గృహ్య సూత్రములలో యక్షాధి పులలోని వాడగు మణిభద్రుడు పేర్కొనబడినాడు.

యక్షులు నీతి ప్రవక్తలుగను, రక్షక శక్తులు గను బౌద్ధ సారస్వతమున గలదు.

యక్షులు స్తోత్ర పాఠకులుగా 'భట్టి కావ్యమున గలదు.

యక్షుల నృత్యరీతి ప్రీతిని కాళిదాసు వర్ణించెను.

యక్షుల గానశైలిని, యక్ష, నాగ, కిన్నర' గాంధర్వుల గానలోలుపత్వాన్ని సంగీతసుధ పేర్కొన్నది.

'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గంధర్వమున యక్షగాన సరణి' -శ్రీనాథుని భీమ ఖండము.

'యక్షగాన' మన్న సమస్త పదమునకు తెలుగున నిదే ప్రథమోదహరణము.

యక్షాందోళననృత్యము మల్లినాథ పురాణమున పేర్కొనబడినది.

'యక్షరాత్రి' అను క్రీడ వాత్స్యాయనుని కామ సూత్రములలో ప్రస్తుతము.

'జక్కరతి' అను రూపము 'యక్షరాత్రి'కి ప్రాకృతరూపము. దీపావళి అను నర్థమున హేమ చంద్రుడీ పదబంధమును పేర్కొనెను.

'యక్షిణివిద్య' అని 'యక్షిణి' అసి కనికట్టు, ఇంద్రజాలము అనే అర్థాలలో వ్యవహారమున్నది.

యక్షాది నేపథ్యములతోటి ఆటపాటల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో కలదు.

జక్కుల పురంధ్రి కామవల్లీ మహాలక్ష్మి కైటభారివలపు పాడుచు వచ్చిన వైనము క్రీడాభిరామమున కలదు.

నవరసాలంకృతముగ సౌభరిచరితంబు జక్కుల కథను ప్రోలుగంటి చెన్నశౌరి చెప్పిన విషయము హరిభట్టు నారసింహ పురాణమున కలదు.

యక్షేశ-ధనద-కుబేరాది నామములకు ప్రాచీనాంధ్రులైన ఇక్ష్వాకులకు గల సంబంధమును ధర్మామృత కథ చాటుచున్నది. ఈ కథను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 20-12-27 బళ్ళారి ఆంధ్ర సాహిత్య పరిషత్సభలో వెల్లడించిరి. ఇక్ష్వాకులు-వే.ప్ర. భారతి ప్రభవ-పుష్యం.

తదాధారముగా వారిట్లు వ్రాసిరి:-

"వేంగీదేశ పద మంధ్రదేశ పద పర్యాయముగా నుండుట సంగతమే ... ఇందు (ధర్మామృత కథయందు) పేర్కొనబడిన ప్రతిపాలపురము భట్టిప్రోలు గావచ్చును. ధనదమహారాజు కథాకల్పితుడు కాకపోవచ్చును. ఆతడు రాజ్యమేలి యుండవచ్చును. వెలనాటి చోడులకు రాజధానియైన ధనదు పురము (నేడు చందవోలు) ఆతని పేర వెలసినది కావచ్చును. ధనదుపురము త్రిలోచన పల్లవునిచే జోడరాజుల కొసగబడినట్లు శాసనములందు గలదు. త్రిలోచన పల్లవుడును, గరికాలుడును సమకాలమువారు గాన యా పురము మిక్కిలి ప్రాచీనమే యగును. భట్టిప్రోలి కది చేరువనే కలదు. దివిసీమ యను పేర నేడు పేర్కొనబడుచున్న కృష్ణా సముద్ర మధ్య ద్వీపము పూర్వము ధనదునిచే గల్పింపబడినదని గణపేశ్వరపు శాసనమున గలదు. 'ద్వీపంపురై తద్ధనదేన సృష్టమ్' అని. ధనదుడు కల్పించె ననగా మనుష్య నివాసార్థముగా గావించె నని యర్థమగును. గణపేశ్వర శాసనమున పేర్కొనబడిన ధనదుడు ధనదు పురాధిపతి యగును. క్రీ.పూ. మూడవ శతాబ్ది నాడు కట్టబడినదయి యుండవచ్చునని తలపబడుచున్న

భట్టిప్రోలి స్తూపము నట్టడుగున గల శాసనములలో 'కుబేరకు'డని రాజు పేరు గలదు. ధనద కుబేరక పదముల యర్థసంగతి యాలోచింపదగినది. తెలుగు దేశపు వైశ్యులకు 'కోమట్లు' అని పేరు గలదు. వారు కుబేర ధనద వంశ్యులని వ్యవహారము గలదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు 'కోమటి' పదము 'గోమటీశ్వరు'డను జైనదేవత పేర నేర్పడిన దని భట్టిప్రోలి స్తూపపు కుబేరునకు వీరికి సంబంధము కలదని రాజనరేంద్ర సంచికలో వ్రాసినట్లు స్మరించు చున్నాను. ఈ విషయములను ప్రబలపటుపగల సాధనములను వేటూకతూరి వెల్లడింతును."

యక్షులు దేవయోనులును కలరు. భౌమ జీవు లును కలరు. యక్షజాతి ప్రతిష్ఠ హిందూ, బౌద్ధ, జైన గ్రంథములలో సింహళము నుండి నేపాళము వరకును వ్యాపించియుండినట్లు తెలియుచున్నది. సింహళమున నేటికిని యక్షారాధన ప్రధానముగా 'వడ్డా' జాతి వారి ఉత్సవనృత్యములు మతబీజకములై కాననగుచున్నవి.

ఎక్క, జక్క శబ్దములు 'యక్ష' శబ్దభవ ములు. కర్ణాటకమున గల 'యెక్కలగణ' లేక 'యెక్కడిగలు', ఆంధ్రదేశము నందలి జక్కుల వారును ఒకేజాతి వారుగా తోచుచున్నారు. వీరి గాన ప్రీతి ప్రసిద్ధము.

ఆంధ్ర దేశమున జక్కులవారి ప్రశస్తి ప్రాచు ర్యము. జక్కులను కళావంతుల తెగకు చెందినవారి పేరును బట్టియు, ఆ జాతి వాచకమును సూచించు గ్రామ స్థల నామములను బట్టియు తెలియనగును.

మార్వారు దేశమున వైశ్యజాతికి చెందిన గంధర్వులను తెగవారున్నారు. జైనగాథ లితివృత్త ముద్రా నృత్యరూపకములను ప్రదర్శించుట వారివృత్తి.

నేపాళదేశపు గంధర్వగానము ఆ దేశపు దేశి సరళికి చెందిన నర్తనము అని తెలియుచున్నది.

యక్షగానము ఒక దేశిగాన శైలి. తొలుత అది గానరూప స్తోత్రపాఠమని భీమఖండోదాహృతిని బట్టి తెలియుచున్నది. క్రీడాభిరామ రచనా కాలమునకు గానరూప కథాఖ్యానమై నృత్యానుకూలమైనది.

**యక్షగానోత్పత్తి వాదములు :**

1. రీతినిబట్టి యక్షగానములు దేశిసరణికి చెందినవని వేటూరి ప్రభాకరశాస్త్రి గారు (1928, 1939), మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మొ॥ వారు అభిప్రాయ పడగా అవి మార్గ పద్ధతికి చెందినవని డా॥ ఆర్.కె. యాజ్ఞిక్, డా॥ వి. రాఘవన్ (1934) ప్రభృతులు తలచిరి.

2. వికాసమును బట్టియు, నిర్మాణమును బట్టియు యక్షగానోత్పత్తిని పరిశీలించిన ప్రధాన వాదములు మూడున్నవని విమర్శకు లభిప్రాయ పడిరి.

i. ఆంధ్ర దేశములోని జక్కులు బవినీడులు ప్రాచీనాంధ్ర కళాకౌశలములను వెలువరించుటలోను నిలువరించుటలోను ప్రముఖులనియు, తొలుత వారు వీర నారీమణుల గాథలనే పాడుచుండిరనియు, నీ జక్కులవారే యక్షగాన కళారూపమునకు నాధార భూతులనియు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు అభిప్రాయపడిరి (1921).

ii. 'ఆంధ్ర కర్ణాట ద్రావిడ దేశముల యరణ్యములందు వసించు నాటవికులు, చెంచులు, కురవలు (క్రోవ, కోయ) అనువారు. కురవ జాతివారి అంజె=అడుగు కురవంజె అనబడెను. చిందు, గంతు, గొండ్లి, అంగ-ఇత్యాదులు నృత్య విశేషములు-కొరవంజె అను పేరు తొలుత వారి నృత్యమునకు, పిదప నృత్య విశిష్టమైన వారి చిన్న చిన్న గేయ రచనలకు, నాపై కురవ జాతివారికిని గూడా బేరైనది. కాలక్రమమున నాయా పర్వత ప్రదేశముల స్థల మాహాత్మ్య కథలతోను, శివ విష్ణులీలా కథలతోను మిళితములయి గేయ విశిష్ట నాట్య రూపములను

బడసెను. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయముతో పాటుగా నధికముగా గేయవచస రూపమైన శ్రవ్య రచనము కూడ చేరెను. నృత్య ధర్మముకంటె గేయ ధర్మము లధికముగా గలవి కావునను, యక్ష గంధర్వాది వేషములు ధరించి వేశ్యలు ప్రదర్శించునవి కావున నివి యక్ష గానము లనబడెను. కళావంతులలో నొక తెగకు నేడు జక్కులవా రను పేరు కలదు. యక్షాది వేషములు ధరించి నృత్య గాన ప్రదర్శనములను గావించుట చేతనే వారి కా పేరు వచ్చి యుండును. కురవంజుల కంటె యక్షగానములు పర్యాప్తముగా శ్రవ్యములగు కవి రచనములు కలవి' అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు అభిప్రాయపడిరి (1939).

iii. 'మతబోధకొరకు మన ప్రాచీను లవలంబించిన మార్గములలో పురాణేతిహాసాదులలోని గాథలను జన సామాన్యమునకు కనులకు గట్టినట్లు ప్రదర్శించి చూపుట యొకటి. ఇట్టి ప్రదర్శనలు కొయ్య బొమ్మల మూలమునను తోలుబొమ్మల మూలమునను సాగెడివి. ఈ బొమ్మలాటల పరిణామమే మన యక్షగానము. ఆంధ్రదేశమున బౌద్ధయుగమున యక్ష జాతివారు కొందరు వసించుచుండిరి. యక్షగానమునకు వీరితో నెద్దియో సంబంధముండియుండును' అని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు అభిప్రాయపడిరి (1951).

మౌలికములైన ఈ ప్రధాన వాదములతో పాటు మరికొన్ని యితర వాదములను కూడ పరిశీలించి, సామంజస్యమును చర్చించి, సమన్వయించుటకు విమర్శకులు యత్నించిరి. యక్షగానముల ప్రాచీనతను ప్రాథమికావస్థను పరిశీలించుచు శ్రీ యస్. వి. జోగారావుగా రిట్లు వ్రాసిరి: 'యక్షరాత్రి, బౌద్ధ యక్షులు, జక్కిణి మొదలగు విషయముల తోడి సంబంధము నేదైన స్థిరపఱుపగలిగినచో యక్షగాన చరిత్ర మతిచిరంతనమైనదని చెప్పవచ్చును. కాని యట్టి సంబంధమును స్థాపించుటకు దగిన యాధార సామగ్రీ సౌలభ్యము కానరాని. యీనా డది కడు కష్ట సాధ్యము...

యక్షగానము యొక్క ప్రాథమిక స్వరూపమాపేరే చాటుచున్నట్లు గానమై యుండుట నిర్వివాదము. అయితే పురాణచరిత్ర ప్రసిద్ధులైన యక్ష జాతీయు లెవ్వరికిని గానకళాప్రతిష్ఠలున్నట్లు తగిన యాధారములు కానరానందున నెన్నడో యక్ష వేషధారణ మొక వృత్తిగా నవలంబించినవారని యూహింపదగిన యెక్కలణలగా, జక్కుల పురంధ్రుల గానకళాభిమానములే యక్షగానోత్పత్తికి బీజాక్షరప్రాయములైనవనియు, నా గానము స్తుత్యాత్మకముగా కథా కథాఖ్యానోపయోగిగా నృత్యానుకూలముగా నుండెడి యొక ప్రత్యేక శైలికి జెంది యుండుట యక్షగానము యొక్క ప్రాథమికావస్థయై యుండునన్నియు జెప్పవచ్చును.' ఆం॥ యా॥ చ॥ పు-88-95-1960.

కన్నడ యక్షగానములను గురించి వ్రాయుచు శ్రీ ముట్నూరి సంగమేశం గా రిట్లనిరి: ''అగ్గళుడు (12 వ శతాబ్ది) వ్రాసిన చంద్రప్రభా పురాణంలో (7-96) వనవిహారం చేస్తున్న నాయకుడు మేళతాళాలతో నిమిత్తం లేకుండా దేశీయ గీతా న్నొకదానిని ఒక 'ఎక్కల గాణ' యింపుగా పాడుతూ వుంటే విన్నాడని వర్ణించబడింది. అభినవ పంపని(12 వ శ॥) మల్లినాథపురాణంలో (6-98) కమలామోదియైన తుమ్మెద ఝుంకారం కమలాలయమైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే 'ఎక్కల' గానంతో పోల్చి వర్ణింపబడింది. రత్నాకరవర్ణి (16 వ శ॥) వ్రాసిన భరతేశ వైభవంలో (ఆస్థాన సంధి-58) వేడుక పాటకులతోనూ, మేళతాళాలతోను 'ఎక్కడిగాణలు' నాట్యమాడి నట్లు వర్ణించబడింది. ఆ యా వ్రాతలవల్ల యీ ఎక్కల గాణలు తెలుగు జక్కుల పాటకుల వలెనే జానపద గాయకులనీ, లక్ష్మీప్రశస్తిని వర్ణించడమే

వీరికి కూడ కులాచారమనీ, నృత్యంకూడా వీరెరుగుదురనీ, అందులో హంగుదారుల ఆటోపంకూడా వీరికవసరమే అనీ బోధపడుతూంది." (1956)

'యక్షగాన వాఙ్మయ' మను ఉపన్యాసమున శ్రీ బి. రామరాజుగారీ అభిప్రాయములు వెలిబుచ్చిరి:

"దేవయోనులైన యక్షులకును మనుష్యులయిన జక్కులకును నడుమగల సంబంధము నిర్వచించుటకు వీలులేనిది. అధునిక చరిత్రకారులవలె దేవతలనియు దేవయోనులనియు చెప్పబడిన వారందరును ఆదిమ మానవజాతులవారే యనుకున్నచో ఎట్టి చిక్కులు నుండవు.

యక్షగానము ప్రధానముగా జానపదుల వినోదార్థమై వారికి పురాణేతిహాసముల యందలి కథలను వ్యాఖ్యానించి చెప్పుట, ప్రదర్శించుట ప్రయోజనముగా నుద్భవించి, క్రమముగా తంజాపురాస్థానములో రాజుల సమకాలికేతివృత్తమును స్వీకరించి, ప్రాబంధిక మర్యాదలను మార్గరూప పద్ధతులను స్వీకరించినది." [పు. 3-18-1972]

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు తమ తెలుగు నాటక వికాసమున యక్షగానముల విషయము నిట్లు సమన్వయించి సమీక్షించిరి:

'యక్షగాన చరిత్రలో విస్పష్టములైన దశలు మూడు కన్పట్టుచున్నవి. 1. కేవలము గేయరూపమున నుండుట, 2. సంవాద రూపమును దాల్చుట, 3. వీధి నాటకములతో అభేదమును చెందుట. 15 వ శతాబ్ది నాటికి 'యక్షగానము' ఒక సాహిత్య ప్రక్రియగా స్థిరపడినది. సంగీతసుధ రచయిత తప్ప మరియే యితర సంస్కృత లక్షణకర్తయును యక్షగానముల మాట తలపెట్టలేదు. అతడు కూడ యక్షగానము సమస్త పదమును వాడకపోవుట గమనార్హము. కావున దీనిని సంస్కృత సాహిత్యముతో సంబంధము లేని కేవల దేశి సంగీత సాహిత్య ప్రక్రియగా నిర్ణయింపవచ్చును...దరువునకును ధ్రువకును సంబంధము కల్పించి కాలనిర్ణయమునకు కడంగుట సమంజసము కాజాలదు. ఇంకను రెంటికిని సంబంధ మున్నదనియే గట్టిగా వాదించినచో వేటూరి ప్రభాకరశాస్త్రిగారూహించినట్లు అతి ప్రాచీనమైన తెలుగు దరువే సంస్కృతమునందు 'ధ్రువ' అయినదని కూడ వాదింపవచ్చును...యక్షగాన రచన 14 వ శతాబ్ది ప్రాంతములందో, అంతకుముందో తెలుగు దేశమందే ఆరంభమైనదనియు, తెలుగుదేశము నుండియే కన్నడ తమిళదేశములకు వ్యాపించెననియు శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారు (1958) నిరూపించియున్నారు. కన్నడ తమిళ యక్షగానములను పరిశీలించినచో అవి యేవియును 17 వ శతాబ్దికి ముందరి రచనలు కావని తెలియగలదు. యక్షగానమను సమస్త పదము 'జక్కుల పాట' అను దానికి సంస్కృతీకరణమని విమర్శకుల నిర్ణయము.

సారాంశ మేమనగా సంగమేశంగారు (1956) తలంచినట్లు 'ఆటవిక జాతుల నాట్యగానాలవల్ల స్ఫూర్తిగొని, వారి సంప్రదాయాలను చాలవరకు స్వంతం చేసికొని, ఆనాటకానాటి సాహిత్యక లక్షణాలను పెంపొందించుకొంటూ వెలసిన దేశి రచనలే యక్షగానాలని నమ్మవచ్చును.' మరియు డా. యస్వీ జోగారావు పేర్కొన్నట్లు 'యక్షగానము హరికథవలె నాఖ్యానింపబడుచు, ఇంటింట నాడువారిచే బారాయణము గావింపబడుచు, బొమ్మలాటవలెనే వెనుక పాటగా బరిగణింపబడుచు, వీధి భాగవతులచే రూపకముగా బ్రదర్శింపబడుచు నిట్లు బహుముఖ ప్రయోజనములతో బహుముఖముగా వర్ధిల్లుచు వచ్చినది.' [తెలుగు నాటక వికాసము. పో. శ్రీ. అప్పారావు. పు. 151-155-1967].

పూర్వోక్తములైన చారిత్రక విషయాలను స్మరిస్తూ శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారిలా వ్రాశారు (1970): 'యక్షులు దేవయోనులే గాక భౌమజీవు లని

కూడా తెలుస్తోంది. వారి నివాస భూమి సింహళం. రాజు కుబేరుడు. బలిచక్రవర్తి కుమారుడు సుమాలి ఈ యక్షులను ఓడించి రాక్షస రాజ్యాన్ని స్థాపించాడని కొన్ని గ్రంథాలలో, రావణుడు లంకను జయించి కుబేరుని వెడలగొట్టి రాక్షస రాజ్యం స్థాపించాడని కొన్ని గ్రంథాలలో లిఖితమైంది... ఏమైన యీ యక్షులు ''మేళముగూడి పాడుచుండుదురు దిక్పాల సభల''... దీనిని బట్టి యక్షులు నృత్యగానాలలో ప్రజ్ఞావంతులని తేలుతోంది.' [యక్షగానము-నాట్యకళ. పు. 6. 1970]

**అన్నమయ్యగారి రామాయణ సంకీర్తన రచన యక్షగాన మనదగిన హరికథ యగునా?**

హరికథా - యక్షగాన పద బంధములను ప్రక్రియా పరముగా పరిశీలిస్తూ శ్రీ జోగారావుగారిట్లు వ్రాసిరి:

''మనకు యక్షగాన రచన ప్రాచీనము. హరికథా రచన యాధునికము. హరికథ ప్రయోగ విషయమున యక్షగాన ప్రారంభ దశను సూచించు ననవచ్చును.'' [ఆం॥ యక్ష. చ. పు. 80-81] అన్నమయ్య 'హరికథలను' విష్ణుకథలను పేర్కొన్నాడు. సంకీర్తన లక్షణ అనువాదంలో అన్నమయ్య చెప్పినట్లుగా యక్షగాన పదాల వివరణము, ఏలాదుల లక్షణము ఉన్నది. దీనినిబట్టి యక్షగానము కథావలంబనంతో సముచితానేక తాళ సంగతులు నవరసాలంక్రియా సవర్ణంబులు అగు పదములతో కావ్యరచనోపయుక్త స్వరూపమును కల్గియున్నట్లు తెలుస్తున్నది. అంతేకాక అన్నమాచార్య చరిత్ర ద్విపద రచన ఆధారంగా నాడు అన్నమయ్య (1424-1503) తన చిన్ననాటనే రామాయణ (యక్షగాన) రచన చేసినట్లు భావింపనగుచున్నది. ఆయన 'ప్రవిమల ద్విపద ప్రబంధ' రూపమున నవముగా రామాయణము వ్రాయుచునే నాత తాను 'శఠకోపముని' వద్ద సకల వేదాంత' పఠనం చేసిన అనంతరమును, సాళ్వ నరసింగరాయ డన్నమయ్యను దర్శించుటకు పూర్వమును వాల్మీకి రామాయణమును పాటల రూపమున వ్రాసినట్లు కలదు. [26-5-83 నాడు త్యాగరాయ గానసభ హైదరాబాదులో అన్నమాచార్య జయంతి సభలో నా ప్రసంగ విషయము]

> 'సకల వేదాంత
> పఠనంబు జేసి *యభంగవిస్ఫూర్తి*
> హరిపూజ హరిసేవ హరి *కీర్తనంబు*
> హరి మననము ధ్యాన మనిశంబు ధనకు
> ఘనతర సకలభోగంబులుగాగ
> మనుచు వాల్మీకి రామాయణ మెల్ల
> *రాగంబుతో ననురాగంబుతోడ*
> *బాగుగా గంధర్వ బాగుగా జదివి*
> *పాటలన్నియు దనపాట విమ్మటన*
> *పాటపాటనె పాట పాడి చూపగను*
> విన్నవారెల్ల నువ్విళ్లూరి యొక్క
> ప్రసన్నవీనులు నిండు పండువుల్ సేయ
> *తుంబురుడో* నారదుడొ కాక యీ వి
> ధంబున *బిరుగు గంధర్వుడో* కాక
> *మనుజుడో* ఖా యన్నమయ యని సర్వ
> జనులును గొనియాడి సంతసింపగను:''
> [అన్నమా. చరిత్ర, ద్విపద పు. 30-1946]

పై పంక్తులలో వాలు లిపిలోగల పదబంధములు పరిశీలనార్హములు. 'అభంగవిస్ఫూర్తి' 'హరి కీర్తనంబు' మహారాష్ట్రల సంత్ సంప్రదాయ సాదృశ్యమును తోపజేయు నవి, రాగముతో, అనురాగముతో వాల్మీకి రామాయణమును 'గంధర్వ బాగుగా' చదివి పిమ్మటన 'పాటపాటనె పాటపాడి' చూపుట 'పాఠ్యే గేయేచ మధురం' అనిపించుకొన్న రామాయణాన్ని 'గాంధర్వతత్వజ్ఞు' లైన కుశలవులు 'గంధర్వులవంటి రూపాలు' గలవారై పాడినట్లుగా ఉన్నది. అన్నమయ్య మూల రామాయణాన్ని గంధర్వబాగుగా రాగముతో

చదువుట మాత్రమే కాక దానికి వ్యాఖ్యాప్రాయంగా తాను వ్రాసిన పాటల్నికూడా 'పాడిచూపె'నట. చెవుల పండువుగా వాటిని విన్నవారు అన్నమయ్యను "తుంబురుడో - నారదుడో - (తిరుగు) గంధర్వుడో- మనుజుడో" అనుకొన్నారట. గంధర్వుడైన తుంబురుడు యక్షేశుని కొలువులోనివాడు, నారదుడు భక్తి గాన ప్రవక్త. గంధర్వులు మార్గ సంగీత ప్రియులు. వీరి సంగీతము గాంధర్వము. వీరు దివ్యులు. మనుజులు భౌమజీవులు.' తిరుగు గంధర్వుడో' అనడంలో నర్తన ప్రియులు భౌమజీవులునయిన ద్రిమ్మరిజాతిగంధర్వులు స్మృతికి వస్తారు. ఈ పంక్తులన్నీ చదివి కీర్తింతురెద్దాని 'కీర్తిగంధర్వులు-గాంధర్వమున యక్షగానసరళి'అన్న శ్రీనాథోక్తిని స్మరించుకొన్నప్పుడు అన్నమయ్య కూడ తన రామాయణ సంకీర్తన రాశిని దేశిమార్గముల మేళవింపుతో ఆరంభించినాడని గాని, హరికథా

("కొట్టగొనకు మతి గోరిపాడితే
జట్టిగ హరికథ చవిగలుగు
వినరోభాగ్యము విష్ణుకథ";) రూ పా న

ఆవిష్కరించినాడని గాని భావించడానికి వీలున్నది. "'వాల్మీకి రామాయణానికి దీటురాగల కావ్యాన్ని వాల్మీకి మహాకవి పేర్కొన్నట్లు 'పాఠ్యే గేయచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితం జాతిభిస్సప్తభిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్' కాగల కావ్యాన్ని మరొక దాన్ని ఇతరు లెవ్వరూ సృష్టించలేకపోయారు'' అన్నారు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు సీతా కల్యాణం పీఠిక పు. 22-1971 అన్నమయ్యగారి రామాయణ సంకీర్తన రచన ఆ లోటును తీరుస్తున్నట్లున్నది. యక్షగాన హరికథా రూప మనదగిన అన్నమార్యుని రామాయణ సంకీర్తన రచనకి తెలుగు దేశాన మంచి ప్రచారమే జరిగినట్లున్నది. తరువాతి కాలపు యక్షగాన రచయితలు అందరికీ కీర్తనలు కొన్నిటిని స్వాంతర్యం చేసుకొన్న ఆధారము ఉన్నవి. 'ఓహో రాకాసులారా' వంటి కీర్తనలు కొన్ని వృద్ధ వ్యవహారంలో నేటికీ వినవస్తున్నవి. నేడు లభ్యమవుతున్న గుత్తెనదీవి రామాయణ కీర్తనల్లో (మాచవోలు రాఘవయ్య అను పరమ భాగవతోత్తమునిచే రచింపబడినవి-ప్రకటన, మద్రాసు 1885) యుద్ధకాండ-50వ కీర్తన (కేదారగౌరి - ఆదితాళం) 'దదదద దశరథ తనయా - కదిసి వేయక కావవేమమ్మ' అనునది అచ్చముగా అన్నమయ్యగారి రామాయణ సంకీర్తనమే. రేకులలో ఉన్నది (సం॥ 2 కీ॥ 164). కాని తుదకు 'గతియైన గుత్తెనదీవి నిలయపతి- సతతము మము నేలు జయ జయ మీకు - అనుచు రావణు సేన లటు భ్రమయగను" అని ముద్రణలో మార్పు గావింపబడినది.

**ప్రాచీన యక్షగానాల ప్రసక్తి :-** 12వ శతాబ్దికి ముందు కాలము యక్షగాన చరిత్రలో అజ్ఞాత యుగము.

1. 'ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
విధమున బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడునట్లు'
—పాల్కురికి సోమన .పండితారాధ్య చరిత్ర 436 పు.

2. 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరళి' (శ్రీనాథుడు. భీమ ఖండము 3-65)

3. 'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు బాడుచు వచ్చె జక్కుల పురంధ్రి' (వల్లభరాయని క్రీడాభిరామము ప. 1.136) చూ. కామేశ్వరికథ-క్రీడాభిరామ పీఠిక. వేటూరి ప్రభాకరశాస్త్రి పు. 104 (1928) Ed. 1960.

4. అన్నమాచార్యుని (1424-1503) సంకీర్తన లక్షణమువకు చిన్న తిరుమలాచార్యుని ఆంధ్రాను వాదము.

'యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేక తాళసంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నలరు నని హరికీర్తనాచార్యు డనియె.'

5. ప్రోలుగంటి చెన్నశౌరి (15 శ. ఉత్తరార్థము) అష్టభాషా కవివర్యుడై 'సౌభరి చరితంబు జక్కులకథ చెప్పి లాలిత నవరసాలంకృతముగ' నరసింగరాయలచేత అగ్రహారాదికమును బడసెనట. (హరిభట్టు నారసింహ పురాణము).

6. వెల్లంకి తాతంభట్టు (1500 ప్రాంతము) తన కవిచింతామణిలో 'లక్ష్మీ కల్యాణము' లోని రేకు అని ఉదాహరణ మొసంగెను. రేకు అనునది యక్షగానములలో మాత్రమే కానవచ్చు రగడ భేదము.

7. యక్షగాన లక్షణమును వీలైనంత సమగ్రముగా చెప్పినవాడు చిత్రకవి పెద్దన.

"వృషభగతి త్రిపుట రేకంఘ్రియుగమగు దుదనేడు లఘువులు తొలగజేయ......యక్షగానాది కృతులలో నార్యు లిడిన రగడ భేదంబు లివి యౌను." లక్షణ సారసంగ్రహము - (1550 ప్రాంతము) 2-14.

8. ఓబయ మంత్రి గరుడాచల యక్షగానము ప్రాచీనమని పంచాగ్నులవారనిరి. ఇది స్థాపించుటకు సరియైన ఆధారము లింకను లభింపలేదు.

9. చక్రపురి రాఘవాచార్యుని కృతి విప్రనారాయణ చరితము విష్ణుభక్తి పారమ్యమును ప్రదర్శించు యక్షగానము - ఈ యక్షగానము నందలి షష్ఠ్యంతములు మార్గ కవితాశాఖ యొక్క ప్రాబల్యమును సూచించును.

10. రుద్రకవి (1568 ప్రాంతము) కృతి సుగ్రీవ విజయము కందుకూరి జనార్దనున కంకితము. ఈనాడు దొరికే వానిలో కవికాలం తేలినంతలో సుగ్రీవ విజయమే ప్రాచీనతమ మైనదిగా పరిగణింపబడుతోంది (వేటూరి వారి పీఠికతో ముద్రణము 1939).

11. వీరనరసింహరాయల కొలువున (1506-1509 క్రీ. శ.) కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు ప్రదర్శించిన సంచెట గురవరాజు నాటకము; కర్నూలు జిల్లా చెరవుగళ్ళ శిలాశాసనమున (1514 క్రీ. శ.) పేర్కొనబడిన 'తాయికొండ నాటకము' మొ॥ యక్షగానములుగా నీనాడు కొందరు పరిశోధకులచే భావింపబడుచున్నది.

12. తెలంగాణమున ఇప్పటికి లభించినవానిలో సారంగధర చరిత్రమే అత్యంత ప్రాచీనమైనది. దీని రచయిత సర్వజ్ఞ బిరుదాంచితుడైన ఒకానొక పద్మనాయక భూపాలుడు. పదునాల్గవ శతాబ్దమువాడై యుండునని శ్రీ బి. రామరాజుగారి ఊహ. 'సహజ విక్రమకీర్తి సర్వజ్ఞమూర్తి బహుమాన పురుషుడు పద్మనాయకుడు' అని మాత్రమితని గూర్చి గ్రంథమున గలదట. సర్వజ్ఞమూర్తి అని యున్నదికదా అని తొందరపడి సర్వజ్ఞ బిరుదాంచితుడైన సింగభూపాలునికృతి యని నిర్ణయము చేయరాదని శ్రీ జోగారావు గారు అభిప్రాయపడిరి.

13. అక్కమహాదేవి చరిత్రమును రచించిన బాలపాపాంబయే ప్రప్రథమాంధ్ర యక్షగాన కవయిత్రిగా నూహింపబడుచున్నది. ఆం.య.వా. చరిత్ర. యస్వీ.జో. పు. 18

15వ శతాబ్దిలో యక్షగానము కథావలంబనము, సముచితానేకవిధ తాళ సంగతములు, నవరసాలంక్రియా సవర్ణములునగు పదములును కలిగి కావ్యరచనోపయుక్త స్వరూపమును కల్గియున్నదని చెప్ప నగును. (యక్షగానము - యస్వీ - జో. పు. 20)

యక్షగానములు వేరు, నాటకములు వేరు అను భావముతో శ్రీ యండమూరి సత్యనారాయణరావు

గారు ఇట్లు వ్రాసిరి: 'యక్షగానముల విషయములో కూడ ఈ కాలములో వాడిన పద్ధతిని బట్టి ఒక గాయకుడు వచ్చి రంగస్థలముమీద గానము చేసి వినిపించునది యక్షగాన మనియు, వివిధ వేషభాషలలో బయలాటగా ప్రదర్శించునది నాటకముగాను ప్రయోక్తమైనది. ఈ విభేదములు తెలియక మన చరిత్రకర్తలు, విమర్శకులు యక్షగానములును నాటకములును అవినాభావ సంబంధముతో నున్నట్లు భ్రమపడిరి. నాటకములు ఒకచోట నిలకిడగా ఉండి ప్రదర్శించునవి, స్థావరములు. పల్లకీ సేవా ప్రబంధముల వంటి చలత్ రంగస్థలముపైన పల్లకీతో పాటు ముందుకి సాగిపోతున్నప్పుడు ప్రదర్శింపబడునవి జంగమములు... అయినను ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన నాటకములను యక్షగానములను శీర్షికతో ప్రకటించారు. ఈ విభేదము పాటింపక యక్షగాన నాటక శబ్దము లభేదములుగా తెలిపినారు." శారదా ధ్వజము - 1965. పు. 266-267.

శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు ఇట్లు వ్రాసిరి ఆం॥సార॥ప॥ రజోత్సవ సంచిక పుట. 295-1976 :'ఆంధ్ర యక్షగాన వాఙ్మయాన్నిగురించి శ్రీ జోగారావుగారు పరిశోధన వ్యాసాన్ని సమర్పించి ఉన్నా, వారు కేవలం నాగర కవులచే రచింపబడిన యక్షగానాల్ని మాత్రమే గ్రహించడం జరిగింది. అందువల్లనే జానపదుల్లో నేటికీ సజీవంగా ఉన్న యక్షగానాల సేకరణ పరిశీలన జరగడం అవసరం.'

'యక్షగానములు పుట్టిన నాటినుండియు క్రమముగా నెన్నియో మార్పులకు, పరిణామములకు గురియగుచు వచ్చినవి. ప్రబంధముల ప్రభావముమాత్రమే కాక హరికథాదులైన శ్రావ్యకథా సంప్రదాయముల ప్రాబల్యమును వీనిపై కానవచ్చును. తరువాతికాలమున బొమ్మలాట, వీధి భాగవతము, భామా కలాపము, కొరవంజి మొదలగు దృశ్య ప్రబంధముల ప్రభావము కూడా వీనిపై క్రమముగా ప్రసరించినట్లు కానసగును. అటుతర్వాత మార్గనాటక ప్రభావము కూడ పడినది. అందువలన అంకవిభాగము భరతవాక్యము మొదలైనవి చేరినవి. యక్షగాన సాహిత్య శాఖకు వసంత కాలము తంజాపురమున సంభవించినది.' (యక్షగాన వాఙ్మయము. బి.రా.రా. పు. 11-12).

'దాదాపు ఆరునూరేండ్లుగా వృద్ధిపొందుచున్న ఈ యక్షగానము సంగీత సాహిత్య కళాసంగమమై, పండిత పామర జనముల కానందదాయియై, రాజస భాంతరాళముల మన్ననలకు పాత్రమై, అనేక విధము లయిన ఇతివృత్తముల నిముడ్చుకొని దేశిచ్ఛందో వైవిధ్యమునకు నెలవై, తెలుగు నుడికారమునకు పలుకుబడికి తావై, సాంఘిక చరిత్రకు స్థానమై, ఇప్పటికిని సజీవ సాహిత్య శాఖగా నుండుట తెలుగు సాహిత్యము యొక్క పుణ్యము.' (యక్షగాన వాఙ్మయము. బి.రా.రా. పు. 22).

**కొరవంజి (కురవంజి)**

కొరవంజి విషయమై సుగ్రీవ విజయ యక్షగాన పీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి.. (చూ. పూర్వోదాహృత విషయము).

చెంచులు కురవలు... ఆటవిక వస్తువులను నగరములకు గొనివచ్చి అమ్ముచున్నప్పుడు తమ గేయ నృత్య విశేషములను నగరములందును పల్లెలందును ప్రయోగించుటచేత నవి నాగరక దేశములందును వ్యాపించెను. ప్రాచీను లయిన కురవంజి రచనములును యక్షగాన రచనా విధాన సంకలితములై ఈ కాలమున గూడ కొన్ని సాగుచునే వచ్చుచున్నవి."

ఒక ఆటవిక నృత్యశైలి క్రమమున దేశీయమగు నొక 'గానశైలిని' కూర్చుకొని పిదప కథాఖ్యాన విశేషములను చేర్చుకొని రూపారోపముతో, నాట్యోపేతమై నృత్త నృత్య నాట్యాత్మకమై లోకధర్మిని నాట్యధర్మిని కూర్చుకొని పరిణామ మందిన దృశ్య రచనా విశేష మిందు వివరింపబడినది.

కాని, 'కొరవంజి నుండి యక్షగాన ముత్పత్తి యా యెనని తలచుట సరికా' దాని శ్రీ నేలటూరి వేంకటరమయ్యగారు తలచిరి (యక్షగానము - తంజావూరు. 1951).

'అసలు ప్రభాకరశాస్త్రిగారి వాదమున కుపాధి కల్పించిన సందర్భము కొరవంజి పేరిట గొన్ని యక్షగానప్రాయ రచనలు తమిళ కర్ణాటాంధ్ర భాషా సామాన్యముగా గన్పట్టుటయే' అని తలపోసి 'కొరవంజి పేరిట యక్షగాన ప్రాయమైన దృశ్య రచనము క్రీ॥శ॥ 17 వ శతాబ్దికి ముందు వెలసిన జాడ కానరాదని ఈ వాదమున కొంత పూర్వపక్షము కలదని శ్రీ యస్వీ జోగారావుగారు విమర్శించిరి.

'ప్రాక్తనమానవుల 'అంజె'(ఆట పాట- Ballad dance) యే నృత్య సంగీత - సాహిత్యములకు మూలమైన దనుట ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞ విమర్శకు లంగీకరించినదే. కాని, దానిని కేవలము కొరవలను ఒక జాతికి మాత్రమే పరిమితము చేయనిచో శాస్త్రిగారి వాదము కొంతవరకును సమంజసమే. ఇంకి నటీ - నట- విదూషక- ధ్రువలు దేశి రచనలలో నుండియే రూపొందియుండుననెడి విషయము (శాస్త్రిగారి సుగ్రీవ విజయ విషయము) సాదరముగా ఆలోచింప దగిన విషయము' అని శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు విశదీకరించిరి.

కొరవలు ప్రాచీను లగు ఆటవిక జాతులలోని వారగుట, మళయాళమందలి 'కొఱతియాట్టమ్' అరవమందలి 'కురువై కూత్తు' కొరవల నృత్య విశేషములై ప్రాచీనకాలమందే కానవచ్చుట, ఋశ్యశృంగుని యెదుట వేశ్యల నృత్యమును వర్ణించుచు రామాభ్యుదయ కర్త (1500-1580) 'అణునిభమధ్య లాక్రియలు నాపరిభాషలు నొప్ప జిందు, జక్కిణి, కొరవంజి మేళముల గేళిక సల్పినట్లు వర్ణించుట, నాట్యోపయోగి యగు గీత ప్రబంధ విశేషముగ పేరొందిన జక్కిణి పాటు నాట్య ప్రభేదముగను, నృత్య విశేషముగను, పేరొందిన కొరవంజి మేళము ప్రస్తావింపబడుట, నృత్యగాన కళాత్మకములైన ఈ రెండు రచనలు పంణామమున అభిన్నములై వ్యవహరింపబడుట, మేళ తాళాలతో నిమిత్తం లేని ఎక్కిల గానం (జక్కిల పాట) గానం కన్న నృత్యమే ప్రధానమైన కొఱవల మేళం (కొరవల ఆట) జోడు కూడి పరిణామ వశమున 'కురవంజి యక్షగాన మహా ప్రబంధము' లవతరించుట, నృత్య గేయములు ఆవిర్భావ దశలో మానవోపజ్ఞములై మానవజాతి సామాన్యములే అయినప్పటికిని 'కొరత్తి యాట్టము' 'ఎక్కిల గానము' ప్రత్యేకములైన శైలులగుట అను హేతువులను సమన్వయించి చూచినపుడు శాస్త్రిగారి వాదము సాదరముగా నాలోచింపదగినదనియు, సమంజసమైనదనియు భావింపవచ్చును. కొరవంజి మేళములు ప్రాథమిక దశలో దృశ్య ప్రధానమైన నృత్య రచనా విశేషములు. అట్లే యక్షగానములును శ్రవ్య ప్రధానములైన గేయ రచనా విశేషములు. ఈ రెంటి కలయికయే తరువాతి కాలపు కురవంజులును యక్షగానములును.

శ్రీ నటరాజ రామకృష్ణగారు తమ దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్రలో ఇట్లు వ్రాసిరి: 'కురవంజి నాటకములు నృత్యప్రధాన మైనవి. ఆటవికుల కళగా నుండిన కురవంజి ప్రభువుల ఆదరణకు పాత్రమై పండితులచే సంస్కృతమై రాజనర్తకీమణుల కారాధ్యముగా యక్షగానరూపమున ఒక శాస్త్రీయ కళగా విరాజిల్లినది.' పు. 131-1968

అర్వాచీనములైనవి, 17 వ శతాబ్దికి తరువాతనే ఒక సాహిత్య ప్రక్రియగా స్థిరపడినవి అయిన కన్నడ మందలి కురవంజులను శ్రీ సంగమేశంగారు మూడు రకములుగా వివరించినారు. 1. కొరవంజి కొరవ నాయకుల ప్రణయ వృత్తాంతాన్నే వర్ణించేవి. 2. నాయకుడు ఎఱుకత వేషంలో వెళ్ళి నాయికకు సోదె చెప్పి, కొంత పూర్వరాగం ప్రదర్శించేవి.

సంబంధమున్నా లేకున్నా ఎఱుకత పాత్రను, ఎఱుక రాజును ప్రవేశపెట్టి వారి సంవాదాన్ని పరిహాస పూర్ణంగా వర్ణించేవి. (కన్నడ యక్షగానములు-1956).

ఈ కొరవంజులలో వేదాంత బోధాత్మకము లైనవి కూడా కలవని శ్రీ పో. శ్రీరామ అప్పారావు గారు వ్రాసిరి. (తె. నా. వి. పు. 157.)

కురవంజి నామం కురవజాతినుండి కాక తొల్కాప్పియంలో చెప్పబడినట్లు కురుంజి (కొండ ప్రాంతము), పాలై (మయప్రదేశము), ముల్లై (అడవి ప్రదేశము), కురుదం (మాగాణిప్రదేశము), నయ్‌దల్ (సముద్రప్రదేశము) అని అయిదు విధాలుగా నున్న దేశ విభాగములలోని 'కురుంజి' నుండి ఏర్పడినదా అను సందేహమును వెలిబుచ్చుచు 'కురుంజి-కురవంజుల' సంబంధ మేమైన నుండునా?' అని శ్రీ కోన రామకృష్ణయ్యగారు తలపోసిరి. (దేశి-పు. 83-84-1968 2వ ఎడిషన్).

శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగా రిట్లు వ్రాసిరి: 'కురవంజి జాతిపరమై వచ్చిందా లేక రాగ పరమై వచ్చిన రచన నామమా అని సందేహం కలుగుతున్నది. కురంజి రాగంతో కీర్తన గాన నృత్యాలు ప్రారంభమై అదే కథాపరమై చివరికి కురువంజి-యక్షగానం వంటి నాటకంగా రూపొం దిందా అనిపిస్తున్నది' (సీతాకల్యాణం పీఠిక. పు. XVII 1971).

**పగటి వేషములు :**

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో శివరాత్రి జాగరణ సందర్భంలో "ప్రచ్ఛన్న వేషముల్ దాల్చి యధికోత్సవము దులు కాడునట్లాడు" వారిని గూర్చి పేర్కొన్నాడు. చార చక్షుతైన రాజుల కొలువులలో నుండెడి వేగులవాండ్లు ప్రచ్ఛన్న వేషములు తాల్చి పట్టపగలు కూడా ప్రజలు గుర్తు పట్టుటకు వీలు లేనంత సూక్ష్మగా వేషధారణం చేయడం వలన ఆనాటి ప్రచ్ఛన్నవేషాలే అర్వాచీన కాలంలో పగటివేషాలుగా పేరు పొందియుండవచ్చు నని శ్రీ అప్పారావుగారు వ్రాసిరి. (తె॥ నా॥ వికాసము పు. 158) పరంపరాగతంగా వినవస్తున్న కళింగ గంగుని గూర్చిన ఐతిహ్యంలోను, వీరనరసింహ రాయలు కొలువున కూచిపూడి మేళమువారు ప్రదర్శిం చిన 'సంచెట గురవరాజు' ఘట్టములలోను పగటిపూట వేషంకట్టి పట్టపగలుకూడా గుర్తించరాని విధంగా వేసిన ఈ (ప్రచ్ఛన్న) పగటివేషాల ప్రస్తావన కనిపిస్తోంది.

పగటి వేషాలను వృత్తిగా స్వీకరించిన గడ్డి పాడు భాగవతులనుగూర్చి శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు నటన (1948)లో వ్రాసిన వ్యాససారాన్ని శ్రీ అప్పా రావుగారు తమ తెలుగు నాటక వికాసంలో పేర్కొ న్నారు.

కృష్ణాజిల్లాలోని గడ్డిపాడు ఈ భాగవతులకు కేంద్రము. ఈ గడ్డిపాడు భాగవతులకి పగటి వేషము లనే వృత్తిగా స్వీకరించిన పల్లావఝుల వెంకట్రామయ్యగారు గురువు. ఈ భాగవతుల శుశ్రూష చేసే 'ఈత ముక్కుజంగాలు' కూడా పగటి వేషాలలో ప్రసిద్ధి చెందారు. గడ్డిపాడు భాగవతులు కట్టే వేషాలు దాదాపు ఆరువైనాలుగు కలవట. వారి పరిభాషలో వాటికి 'జాతీయము' లని పేరు. వినోదము, హితోపదేశము వీరి ప్రధాన లక్ష్యములు. వీరి వేషములలో అర్ధనారీ శ్వర వేషము మనోహరమైనది.

వీరు తాల్చే ఫకీరు వేషం, బుడబుక్కల వేషం, వైష్ణవ వేషం, మందుల వేషం, జంగిందేవర వేషం, కోమటి లింగబల్జీలు, సోమిదేవి - సోమయాజి, కాశి కావళ్లు, శారదగాని వేషము మొదలైన వేషాల్ని గూర్చి శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహముగారు నాట్యకళ ఫిబ్రవరి-మార్చి 1970 సంచికలో వ్రాసినారు. అందే వారు పూర్వము కూచిపూడి భాగవతులు మరాఠీదండు

వేషాలు వేసుకొని, తమ ప్రదర్శనలకు అభ్యంతరం తెలిపిన గోదావరిసీమ వాసులను భయభ్రాంతులను, ఆశ్చర్యచకితులను గావించిన విషయాన్ని వివరించారు. ఈ పగటివేషం కళగాను, వృత్తిగాను నేడు అదృశ్యమై వినోదవేషధారణ (fancy dress) రూపాన మాత్రమే కానవస్తున్న దని శ్రీ అప్పారావుగారు వ్రాసినారు.

**గారడి - విప్రవినోదము :**

ఈ దృశ్య కళారూపములను గూర్చి శ్రీ అప్పారావుగారు "తెలుగు-నాటక వికాసము పు.160-162" వివరించినారు.

గడలపై నాడే దొమ్మరిసానులను గూర్చియు, మ్రోకులపై నాడే వారిని గూర్చియు పాల్కురికి సోమనాథుడు పండితరాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. దొమ్మరుల ఆటతీరును 'కాశీనాట్య' మందురు. "దా.నా.చ. నటరాజ రామకృష్ణ. పు. 174-1968". గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోను, వాసిష్ఠ రామాయణంలోను ఐంద్రజాలికుల కథ లున్నవి.

'ఆవియద్గతి బత్తులాడెడు నట్టి-భావన మ్రోకులపై నాడువారు' అన్న సోమనాథుని పంక్తులను The great Indian Rope Trickగా అన్వయించినారు అప్పారావుగారు. ఇది నేటి సర్కసులోని Rope walking వంటిది కూడ కావచ్చును. జల స్తంభన, శిలా స్తంభన, అగ్ని స్తంభన-ఇంద్రజాల, మహేంద్రజాల, అదృశ్యకరణ, నష్టవస్తు సముద్ధరణాది గారడీ విద్యలలో జైనులు సుప్రసిద్ధులని విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలో ఉన్నది. గారడీవారు జనపదములలో ప్రదర్శన లిచ్చునట్లే విప్రవినోదులు రాచనగరులలో ఆస్థానములలో ప్రదర్శన లిచ్చుచుండెడివారు. విప్రులను మాత్రమే యాచించి జీవించువారగుటచే వీరికి విప్రవినోదులని పేరు వచ్చెనట.

"ఇంద్రజాల విద్యలను, బహురూప విద్యలను, కనుకట్టు విద్యలను, చారి విద్యలను, కోపులనాటలను తాళ్ళపాక కవులు పేర్కొనినారు (10-190). ఇట్టి వృత్తులవారు ప్రజలకొరకై ప్రదర్శించు వినోదముల మీద నానాడు కొన్ని సుంకములుండెడివి. దొమ్మరుల వృత్తిమీద దొమ్మరి పన్నుండెడిది. (శాసనము 399 of 1939-39. క్రీ.శ. 1536)" "తాళ్ళపాక కవుల పదకవితలు-శ్రీ వేటూరి ఆనందమూర్తి. పు. 533-1976".

జానపద కళారూపములను గురించి శ్రీ లక్ష్మీకాంతమోహన్ నాట్యకళ (ఫిబ్రవరి-మార్చి) 1970లో వ్రాస్తూ 'కాటికాపర్ల' కనుకట్టు విద్యల్ని, 'విప్రవినోదు'ల అలమరా - పలహారాల తమాషాలను, 'సాధనాశూరు'లు గుండుదెబ్బల్ని ఎదుర్కోవడము, చొప్పపుల్లల పల్లకీలో ప్రయాణించడము మొదలైన చమత్కారాలను విశదీకరించారు.

**బహురూపము :**

బహురూప మను ప్రక్రియను గూర్చి శ్రీ యస్వీ జోగారావుగారు నాట్యకళ (ఫిబ్రవరి-మార్చి పు. 195-200;1970) లో సమగ్రముగా చర్చించి 'ఇంత చెప్పియు నిది బహురూప స్వరూపమును సమగ్రముగా నిరూపించినట్లు కాదు' అనిరి. బహురూపములనుగూర్చి పాల్కురికి సోమనాథుడు, యథావాక్కుల అన్నమయ్య, దామరాజు సోమయ్య, శ్రీనాథుడు, తాళ్ళపాక కవులు విశదీకరించిన అంశములను బట్టి నానా వేషధారణ మనియు, నటన మనియు, దేశినాట్యవిశేష మనియు, కుండలి, బహురూప, ధండలాస్య, విలాస, దేశి, మార్గంబు (దామరాజు సోమయ్య భరతం మరియు హరిభట్టు నారసింహ పురాణము) లను షడ్విధ నాట్య ప్రభేదములలో నొకటనియు, చతుర్విధాభినయోపేతమై నృత్త గీత వాద్యములతో మేళముగట్టి నాటకశాస్త్ర

లందు ప్రయోగింపదగు సర్వాంగ సుందరమైన ప్రబంధమనియు (తాళ్లపాక కవుల రచనలబట్టి) భావింపనగునని వారు వ్రాసిరి. బహురూప పదము అభినయ దర్పణాదులందు కానరాకున్నను నృత్త రత్నావళియందున్న విషయము నుట్టంకించి, అదియొక దేశి నృత్యముగా స్వీకరింపబడుట గమనార్హమని శ్రీ అప్పారావుగారు పేర్కొనిరి. 'ఆశు వేషాంతర గ్రాహీ ప్రస్తావోచిత పాఠకః' అను లక్షణములు ప్రధానములనియు, బహురూపమున సాత్వికాభినయ మునకు అవకాశముండదనియు వివరించిరి. బహు రూపులవారే 'బైరూపులు'గా జన వ్యవహారమున వ్యవ హృతులు. ఇది నేడు శ్రీ ధారా రామనాధ శాస్త్రి సోదరులు ప్రదర్శించుచున్న 'నాట్యావధానమును' బోలునదిగా నున్నది.

**ఖండితగతి నాటకములు:**

పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమ నాథుడు పేర్కొన్న తీరుతీరుల ఖండితగతి నాటకము లను గూర్చి వ్రాయుచు శ్రీ అప్పారావుగారు 'ఇవి సమగ్రమగు కథలుకూడ కావు. చిన్నచిన్న ఘట్టములు మాత్రమే. వీరనరసింహరాయల యెదుట కేళికను ప్రదర్శించుచు మధ్యలో కూచిపూడి భాగవతులు ప్రదర్శించిన సంచెట గురవరాజు కథయును ఇట్టి చిన్న ఘట్టమే. ఇట్టివానిని సోమనాథుడు 'ఖండితగతి నాటకము' లనినాడు'' అని తెలిపిరి. (తె॥ నా॥ వి- పు. 165).

వీటినే శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు నాట్య కళ - పు. 128 (ఫి. మా.) 1970 సంచికలో 'వాలకం'గా పేర్కొన్నారు. సంచెట గురవరాజు వృత్తాంతాన్ని వారు 'కమ్మవాలకం'గా వివరించినారు. ఇవి ఎవరినైనా ఎద్దేవా చేసే 'కమ్మకట్టి' డానికి 'తాటాకులు కట్టి' డానికి, తద్వారా వినోదాన్ని కూర్చి హితోపదేశాన్ని అందించడానికి పనికి వచ్చే రచనలు.

ఇవి కొంత ఆశువుగానూ సాగి బహురూప లక్షణాన్ని కూడా కూర్చుకొంటున్నవి.

**సాంగ నాటకములు:**

సోమనాధుడు 'సాంగ భాషాంగ క్రియాంగ పటునాటకంబుల నటియించువారి'ని ప్రస్తావించినాడు. సాంగము లనగా భరతుడు పేర్కొన్న నాందీ ప్రస్తావ నాది పూర్వరంగాంగములతో కూడినవని భావము. తొమ్మద అంతర్యవనికాంగములు, పది బహిర్యవని కాంగములు పూర్వరంగమున సంపూర్ణముగా నిర్వ హింపబడినవని భావము. ఇక భాషాంగ క్రియాంగ పదములకు వాచక ఆంగిక అభినయ ములనిగాని, సంగీత పరిభాషలోని దేశ్యరాగ విభేదములనిగాని అర్థము చెప్పవచ్చును. సోమనాథు డీసందర్భమున వాడిన 'పటు నాటకము'లను పదబంధమునుబట్టి ఇవి సంపూర్ణములని భావింపవచ్చును. (తె. నా. వి. అప్పారావు. పు. 168)

**కథా కాలక్షేపాలు :**

జక్కుల కథలు, హరికథలు, జంగం కథలు, బుర్రకథలు - ఇవి అన్నియు గాన రూపమున కథా ఖ్యానమే ప్రధానాశయముగా ప్రారంభింపబడినవి. పిదప ప్రక్రియాపరముగా వైశిష్ట్యమును గడించు కొన్నవి.

**హరికథలు** : హరికథ యన మహారాష్ట్రులది యని ప్రతీతి. తుకారాం హరికథా కాలక్షేపములు చేయుచుండినట్లు తెలియుచున్నది. దక్షిణదేశమున హరికథాకాలక్షేపము దిగివచ్చుట 17వ శతాబ్దిలో నటు కర్ణాటకమును నిటు తంజాపురాంధ్ర నాయక రాజ్యమును మహారాష్ట్రుల కైవసమయిన తర్వాతనే యని తోచును (ఆం.య.చరిత్ర. యస్వీ జోగారావు. పు. 78). శ్రీ తూమాటి దొణప్పగారు తమ తెలుగు హరికథా సర్వస్వము (1976 ఆం. సా. అకాడమీ

బహుమతి సంపిన రచన)లో హరికథా కాలక్షేపముల ప్రాచీనతను తులనాత్మకముగా పరిశీలించిన ప్రమాణముగా నిరూపించియున్నారు. "హరికథ ఏకపాత్రాశ్రయమైన కళ. పురాణకాలక్షేపము యొక్క క్రమ వికాసమే హరికథ ... రచనా దృష్టిలో హరికథకూ యక్షగానానికీ భేదంలేదు ... హరికథ యక్షగానానికి పూర్వరూపమేగాని పరిణత రూపం కానేరదు." (తె.హ. సర్వస్వం-దొణప్ప. పు. 207-208-1978) 'రంగప్రసాధన ప్రౌఢుడైన సూత్రధారునకే కాక హరికథకునికీ, బుర్రకథల్లోని ముఖ్య గాయకునికీ, భామాకలాపాలలోని మాధవునికీ పౌరాణికుడే మూలమూర్తి అని మా నిశ్చితాభిప్రాయం' (పు. 17) అన్నారు శ్రీ దొణప్పగారు.

ఇట అన్నమాచార్యుని రామాయణ హరికథాగాన కాలక్షేప విషయమునూ స్మరింపవలసియున్నది.

శ్రీ బాగేపల్లి అనంతాచార్యులుగారు, ఆదిభట్ల నారాయణదాసుగారు తమ హరికథలను యక్షగాన ప్రబంధములుగా పేర్కొన్నారు. కన్నడ హరికథల్ని యక్షగానముల శాఖకే చెందినవని శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు వ్రాసిరి. 'యక్షగాన ప్రబంధానికి రూపాంతరమే హరికథ' (నాట్యకళ 1970-పు-13). హరికథకులును, ఇతర విమర్శకులును ఇట్లు తలచినవారు కలరు. శ్రీ ముట్నూరి సంగమేశంగారు వివరించిన కన్నడ 'తాళమద్దెల'ను గూర్చి వ్రాస్తూ శ్రీ జోగారావుగారు 'ఈ సంప్రదాయము యక్షగానములపై హరికథల ప్రభావమును మాత్రమే సూచించును' అనిరి. హరికథ ప్రయోగ విషయమున యక్షగాన ప్రారంభదశను సూచించునని వారు వ్రాసిరి. యక్షగానములలో ద్విపదవలె హరికథలలో దోరాలు, తోహరాలు సంప్రదాయసిద్ధముగా వాడబడుచున్నవి. ద్విపదలు కందార్థాలు పితవ చేసినవి. ఈ రెండును సదృశ ప్రకియలేగాని జన్యజనక భావము కలవి కావని శ్రీ జోగారావుగారు తలపగా, అవి రెండును అభిన్న ములే అని శ్రీ మంచాళ జగన్నాధరావుగారు, శ్రీ రజనీకాంతరావుగారును తలచిరి. ఈ అభిన్నతావాదమునే శ్రీ దొణప్పగారును సమర్థించిరి.

**జక్కుల కథ :**

యక్ష శబ్దానికి 'జక్క' 'ఎక్క' అను రూపాంతరములే కాక 'అక్క' అను రూప వికృతియు నందీ కార్యమే. అక్కల కొలుపుతోపాటిదే జక్కుల పాట అన్నారు శ్రీ జోగారావుగారు. క్రీడాభిరామమున 'కామవల్లీమహాలక్ష్మి కైటభారి వలపు బాడుచువచ్చె జక్కుల పురంధ్రి' అని కలదు. ఈ కామవల్లియే కామేశ్వరి పాట యను స్త్రీల పాటలోని కామేశ్వరి యని ఆ కామేశ్వరి కథను శ్రీ వేటూరివారు క్రీడాభిరామ పీఠికలో విశదముగా వివరించినారు. (పు. 104-109)

'యక్షగానమంటే యక్షులను గూర్చి చేసే గానం, యక్షులు చేసే గానం. యక్షులు గానం చేసినట్లు చేయబడే గానం అని అర్థాలు చెప్పవచ్చు' అన్నారు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు.

కామేశ్వరి పాటవంటి జక్కుల పాట మొదటి అర్థాన్ని: దేశీయమైన 'గాన' శైలి రెండవ అర్థాన్ని: ఆ శైలిని పాడబడే రచన ఏదైనా మూడవ అర్థాన్ని ఇస్తుం దనుకోవచ్చును.

**జంగంకథలు-బుర్రకథలు :**

జంగములు ప్రముఖ బుర్రకథకులనీ ప్రస్తుత రూపంలో వున్న బుర్రకథ క్రీ.శ. 14 వ శతాబ్దంలో పుట్టిందనీ శ్రీ లక్ష్మీకాంత మోహన్‌గారు వ్రాస్తున్నారు. (నాట్యకళ. ఫి.మా. 1970. పు. 130)

జక్కుల కామేశ్వరి కథను, బవనీండ్ల ఎల్లమ్మ కథను, పిచ్చికుంటుల పల్నాటి వీరుల కథను గొల్లల కాటమరాజు కథను వీరు బుర్రకథలుగా పేర్కొన్నారు. పైకులాలవారే కాక మరొకళ్లు వీరన్న కథను, మీగొల్ల ఎల్లమ్మ కథను శారద గాండ్రు మామూలు బుర్రకథ

లన్నిటిని చెబుతూ వుంటారు. శ్రీ బి. రామరాజుగారు ఇట్టి గాయకులను గూర్చి వ్రాసియున్నారు. [తెలుగు జానపద గేయ సాహిత్యము. 15 వ ప్రకరణము-1958]. తెలంగాణా ప్రాంతంలో బహుళ ప్రచారం గాంచిన 'ఒగ్గుకథ' ప్రదర్శనలో భేదం కలిగిన బుర్ర కథా రూపమే. ఆంధ్ర జాతికి అతి ప్రధానమైన ఈ జానపద కళారూపాన్ని ఆధునికులు అనేక ప్రయోజనాలకు ఉపయోగించుకొంటున్నారు. మన వీర గాథలన్నీ ఇలా బుర్రకథలుగా గానం చేయబడుతున్నవే. మన వీర గాథలను గూర్చి శ్రీ తంగిరాల వెంకటసుబ్బరావుగారి పరిశోధన వ్యాసంలో సమగ్రంగా చర్చించబడినది.

''యక్షగానం బుర్రకథగా ఎపుడు రూపాంతరం పొందిందో చెప్పలేము గాని శ్రీనాథుని కాలానికే బుర్రకథలు బాగా ప్రచారంలో ఉన్నాయనితెలుస్తోంది.' [నాట్యకళ. 1970. శ్రీనివాస చక్రవర్తి. పు. 12.]

**చిత్రకథా విధానము :**

'పురాణం చదివితే చాలదు. చదవలేని వాడికి చెప్పే ప్రక్రియ కావాలి. అది ప్రజారంజకం కావాలి.' [ఆం॥ సార॥ ప॥ రజతోత్సవ సంచిక పు. 261 గొల్లపూడి మారుతీరావు] ఈ అన్వేషణలో వెలసిన దేశి దృశ్యకళా రూపాల్లో చిత్రకథా విధాన మొకటి. చిత్రంపు గద్దె పలకలద్వారా చిత్రకథలు చెప్పడం క్రీడాభిరామంలో వర్ణితమైంది. చిత్రపటాలద్వారా కథా కథనాన్ని నడిపే విధానం కాబట్టి దీని కాపేరు వచ్చినది. [సావెనీర్ ఆన్ డ్రామా సెమినార్- మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి పు. 45-1960 మరియు ఆంధ్ర నాటకరంగ చరిత్ర పు. 306] పదమూడవ శతాబ్ది మధ్యభాగంలో నుండిన పౌతకమూరి భాగవతులు (అయిదుగురు సోదరులు) అహోబలేశుని వాటి వినోదులై "పటము పన్నించి" ఆడుతూ పాడగా స్వామి వారానందించెడి వారని విష్ణునామ సంకీర్తనఫల మనే గ్రంథంలో ఉన్నది. [తాళ్ళపాకవారి పదకవితలు పు. 19. వేటూరి ఆనందమూర్తి] అది యిట్టి చిత్రకథా విధానాన్నే సూచిస్తున్నది. 'హరికథా ప్రవచనంలో పరిగణించదగ్గ భాగంగా రూపొందిన చిత్రాఖ్యానకాలు పిట్టకథలు. చిత్రకథలని కొందరి వ్యవహారం' అన్నారు శ్రీ దొణప్పగారు [తె. హ. స. పు. 161]

**బుట్టబొమ్మలు :**

మన ప్రాచీన దృశ్యకళారూపాల్లో బుట్టబొమ్మలాట ఒకటి. పేడతో చేయబడ్డ యీ బుట్టబొమ్మలు పెండిండ్ల ఊరేగింపులలోను, దేవుళ్ల ఉత్సవాలలోను ప్రదర్శిస్తూవుంటారు. [సో.ఆన్ డ్రామా సెమినార్ పు. 52. మిక్కిలినేని] ఆంజనేయోత్సవంలో భజనసంకీర్తనపరులు నేటికీ ముఖానికి ఇలాంటి బుట్టతొడుగులు (Masks) వేసుకొని నృత్యం చేయడం కద్దు. కీలుగుర్రాల ఆట, అశ్వనృత్యము మొదలైన కళా రూపాలలోను ఈ బుట్టబొమ్మల ప్రసక్తి ఉన్నది.

**జానపద ఆరాధన నృత్యములు:**

ఆంధ్రలోని జానపద ఆరాధన నృత్యములు అనేక రూపాలలో ప్రచారములో నున్నవి. గొబ్బిఆట, బతకమ్మ ఆట, కోలాట కోపులు, గరగ నృత్యం మొదలైనవి. ఇలాగే చక్కభజనలు, కనకతప్పెట్లు, తప్పెట గుండ్లు; సేవ; చిరుతల భజన మొదలైనవి ప్రాచీన జానపద కళారూపాలు [డా. నా. చరిత్ర - నటరాజ రామకృష్ణ 187-189; సావెనీర్ ఆన్ డ్రామా సెమినార్ - మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి పు. 43-57]

**వీధి భాగవతాలు - భాగవతులు:**

ప్రాచీన కళారూపాలు వినోద కార్యక్రమాలు వీధుల్లోనే సాగేవి. దొమ్మర్లు, దాసర్లు, బొమ్మలాటలవారు, భాగవతులు మొదలైనవారు ఎవరు వచ్చినా నడివీధిలో కార్యక్రమం జరిగేది. ఆనాడు వీధుల్లో నాటకాలాడేవారు గనుక వీధి నాటకాలనీ, ప్రదర్శించే వారిని

వీధి భాగవతులులనీ పిలిచేవారు, [నాట్యకళ-ఫి.మా. 1970, పు. 60]

వీధుల్లో ఆడబడే ఇట్టి జానపద దృశ్యకళల్ని పాల్కురికి సోమనాధుడు వర్ణించాడు. 13 వ శతాబ్ది చివరిభాగంలో పౌతకమూరి భాగవతులు పటము పన్నించి నాట్యమాడేవారు. క్రీడాభిరామంలో దోర సముద్రపు నటుల ప్రస్తావన ఉంది. జక్కుల పురంధ్రుల పాటలు, బవనీంద్ర పాటలు, వీరగాథలు వర్ణితములైనవి. అట్లే మాచల్దేవి చరిత నాటకంబుగ నాడిన ప్రస్తావన కూడ కలదు.

తాళ్ళపాక అన్నమాచార్యులు యక్షగాన పదంబులకు లక్షణము నేర్పరచుటే కాక స్వయముగా రామాయణ కీర్తనలను అభంగస్ఫూర్తితో గంధర్వు బాగుగా చదివి పాడి రామాయణ కథా కాలక్షేపమో యక్షగానమో కావించినట్లు తెలియుచున్నది.

వీర నరసింహరాయల కాలమున సంచెట గురవరాజు వృత్తాంతము వాలకముగా కూచిపూడి భాగవతులచేత ప్రదర్శింపబడినది. తాయికొండ నాటక ప్రదర్శన విషయము శాసనస్థమై యున్నది.

16 వ శతాబ్ది ఉత్తరార్ధంలో సుగ్రీవ విజయ యక్షగానము 'వీధియాటగా నాడబడుచుండినట్లు' శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిరి. ఆ విషయమునే శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారును వక్కాణించిరి.

తదుపరి 17 వ శతాబ్ది ఆరంభము నుండి ఆంధ్రదేశమందలి యక్షగానము 'కూచిపూడి కలాపముతో సంబంధము కల్గి', 'దక్షిణ దేశమునకు ప్రస్థానము గావించి' బహుముఖముగా విస్తరించినది.

ఇట్టి మన దేశినాటకములే, వీధినాటకములను పేర ప్రసిద్ధికెక్కినవి. ఆట వీధిలో నాడబడు నాటకములని యర్థము. ఇది కన్నడిగల 'బయలాట'కు, తమిళుల 'తెరుకూత్తు' అనువానికి సమానార్థకమైనది. (ఆం.యు.చ. పు. 99. యస్వీ-జో). యక్ష

గానం రూపక క్రియగా రూపొందిననాటికి ఆంధ్ర దేశంలో కూచిపూడి భాగవతులు భరతనాట్య శాస్త్ర విద్యా దురంధరులుగా విశేష ప్రసిద్ధి వహించారు దేశాటనం చేస్తూ నాటకాలను ప్రదర్శించటం వారి వృత్తి. వీరు తరతరాలుగా అనేక ప్రక్రియలను చేపట్టి ప్రసిద్ధికి తెచ్చారు. వీరు వీధినాటక ప్రదర్శనాలలో యక్షగానాలను, శాస్త్రీయమైన కూచిపూడి నృత్య సంప్రదాయాన్ని, కలాపాలను, అష్టపదులను, నృత్యరీతిలో దశావతారాలను, క్షేత్రయ్యపదాలను, బాలగోపాల తరంగాలను, మండూకశబ్దం లాంటి శబ్దాలను, జతులను, సోమయాజులు సోమిదేవమ్మ, జంగమదేవర మొదలైన పగటివేషాలను ప్రదర్శించే వారు...వీరి విధానాలను ఆంధ్రదేశంలో దేవదాసీలు, యానాదులు, యాదవులు, హరిజనులు, జంగాలు మొదలైన వారెందరో అనుసరించారు.' (నాట్యకళ-మిక్కిలినేని).

సిద్ధేంద్ర యోగి పెట్టిన భిక్షతో కూచిపూడి భాగవతుల ప్రఖ్యాతి జగద్విదితమైనది. గోల్కొండ నవాబు తానాషా కూచిపూడి కళాకారులకు కూచిపూడి గ్రామాన్ని అగ్రహారంగా దానం చేశాడు.

'కూచిపూడి వారిలో వేదాంతం వారనీ, చింతా వారనీ, వసుమర్తి వారనీ, భాగవతులవారనీ, వెంపటి వారనీ, ఇంగువవారనీ, బుక్కావారనీ, హరివారనీ ప్రసిద్ధ భాగవతుల కుటుంబాలవారున్నారు.'

[నాట్యకళ - మిక్కిలినేని]

'మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో 7 పారిజాతాలు, 4 భామాకలాపాలు ఉన్నాయి. వీటిలో కొన్ని ప్రాచీనాలు. వీటి సహాయంతో పరిష్కరణ జరగాలి' అని ఆరుద్రగారు వ్రాసిరి. (స. ఆం. సా. పు. 200-1967)

ప్రసిద్ధములైన భాగవత మేళాలివి కొన్ని:

పోతకమూరి భాగవతుల మేళం, తాయికొండ నాటక సమాజమేళం; సిద్ధేంద్ర యోగి (కూచిపూడి)

మేళం-, లేపాక్షిమేళం, వేమలపల్లి మేళం, తాడిపత్రి మేళం- నెల్లూరుమండలంలో వడకండ్ల, త్వరకవివారి మేళాలు, విశాఖపట్టణంలో నరసింగపల్లి, కల్లేపల్లి, కందాళ, చిదంబర మేళాలు, పల్నాటిసీమ మేళాలు, ప్రసిద్ధములైనవి. తానాషా ప్రభువు కాలమున అక్కన్న మాదన్నల భాగవతమేళ ముండేదని శ్రీ యస్వీ జోగారావుగారు వ్రాసిరి. నారాయణ తీర్థుల వారి శిష్యులు పంజు భాగవతులను గూర్చి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు వ్రాసిరి [క్రోధన - భారతి]. కూచిపూడి భాగవతమేళమునుండి స్ఫూర్తి గొన్న ఇతర భాగవతులు పలువురున్నారు. వారిలో కోట కొండ భాగవతులు, మాలభాగవతులు, యానాదిభాగవతులు, చెంచుభాగవతులు, గొల్లభాగవతులు, నక్కల భాగవతులు, చిన్నమాదిగలు, గంటె భాగవతులు, గడ్డిపాడు భాగవతులు, చిలుకల భాగవతులు, జేగంట భాగవతులు, మేలటూరు భాగవతులు, ఇంకా శూల మంగళం పుత్తుక్కుడి ప్రాంతాలలోని తెలుగు భాగవతులు పేర్కొనదగినవారు.

[నాట్యకళ-ఫిబ్రవరి-మార్చి సంచిక 1970]

**కలాప రచనలు :**

కలాపరచనల ఉత్పత్తి వికాసాలను గూర్చి నాట్యకళ (1970) సంచికలో శ్రీ ముట్నూరి సంగమేశంగారి వ్యాసం చూడదగినది. వారీక్రింది విషయాలను పేర్కొన్నారు:

—'ఏకధ్దేశాన్వయంగల్ల నాలుగుపద్యాల మొత్తానికి 'కలాపక' మని పేరు. ఈ దృష్ట్యా దరువులు కలాప కాలనిపించుకొంటాయి. 'కలాపక'నామమే'కలాపం'గా మారినందనుకోవచ్చును. తెలుగు దేశాన ఈ కలాపాలు ఎప్పటి నుండి ఉన్నవో ఇదమిత్థంగా చెప్ప జాలక పోయినా కూచిపూడి భాగవతులవల్లనే వీటికి ప్రచార ప్రసిద్ధులు కలిగినవని చెప్పవచ్చును. కూచిపూడి వారికి భామాకలాపాన్ని ప్రసాదించి కళాభిక్ష పెట్టిన మహాపురుషుడు సిద్ధేంద్రయోగి ఏ శతాబ్దానికి చెందినవాడో స్పష్టంగా తెలియదు.

15 వ శతాబ్ది చివరకు కూచిపూడి వారి కీర్తి ప్రతిష్ఠలు హంపీ విజయనగరాలకే కాక ఢిల్లీ వరకు వ్యాపించినవి. 'అయినీ అక్బరీ' లో పేర్కొనబడిన 17 గాయన సంప్రదాయాలలో కీర్తన సంప్రదాయం గురించిన విశేషాలు కూచిపూడి వారి ప్రఖ్యాతిని చాటేవిగా వున్నవి. 1500 క్రీ.శ. నాటికే కూచిపూడి వారి కలాప నాట్య ప్రదర్శనలు, వాటిని ప్రోత్సహించిన సిద్ధేంద్రయోగి ప్రసిద్ధి కెక్కినట్లు భావింపవచ్చును.

భామాకలాపంలోని మాధవి వేషం అన్నమాచార్యులవారి వేషభూషల ననుకరిస్తున్నట్లుంటుంది. అన్నమాచార్యుల వారి సంకీర్తన లక్షణంలో కల చందమామ పదాల లక్షణ నిర్వచన కలాప రచనల్లోని పదాలనే లక్ష్యంగా వ్రాసినట్లు కనిపిస్తున్నది. కూచిపూడి వారి కలాప నాట్యాలు 15 వ శతాబ్ది నాటివని తలపవచ్చును-'

[ఈ సందర్భంలో అన్నమయగారి ఈ కీర్తన పరిశీలింపదగినది: "జట్టిగొనేర నిన్ను జవరాలు-చిట్టంటు చేతల జెలగితి విపుడు,

వాలుక చూపులు వాడంగ నాటక - శాలలోన
[illegible] నిను జవరాలు
చాలుగ మురియుచు సరుగన జవుకన - కాల
జిమ్మినను గలిగితి వపుడు'' (3-392)

ఈ సన్నివేశము పారిజాత వృత్తాంత మందలి భామా కలాపమును స్మరించునదే అని తోచుచున్నది. 'అలరులు గురియగ నాడెనదే' అను అన్నమాచార్యువారి కృతిలో కలాప వృత్తాంతమందలి వేణీ ప్రబంధ విశేష స్ఫూర్తి కలదని శ్రీ శజనీకాంతరావుగారు వ్రాసినారు.]

'భామాకలాపం, గొల్లకలాపం వంటి దృశ్య రచనలు తమ పేరులోనే కలాప శబ్దాన్ని ఇముడ్చ

కొన్నవి. కొరవంజి వేషం, కూరాకుల వేషం వగైరా పగటి వేషాలు కూడా తమ కథనాదికాన్ని కలాపమనే పేరుతోనే వ్యవహరిస్తూ వుంటాయి. భామాకలాపాదులు యక్షగానాల వలెనే హంగులతో రాత్రి తెల్లవారేవరకు ప్రదర్శింపబడతాయి. భామా కలాపాదులలో గాని, వాటిల్లో వచ్చే చిల్లర పగటి వేష కలాపాల్లోగాని ప్రధాన కథకన్నా పాత్రల గుణ శీల వృత్తాదులే ప్రధానంగా వర్ణింపబడతాయి. గేయ నృత్య నాటకాలుగా, వీధి నాటకాలుగా, ఆటభాగవతాలుగా వీటికి కీర్తికలదు. వీటికే కేళికలనీ కీర్తనలనీ, ప్రసిద్ధి. ఇట్టికలాపప్రాయ రచనలు అన్యత్ర కూడా కనిపిస్తాయి. మన దేశపు పశ్చిమ ప్రాంతాల్లోని రాసా కావ్యలు, రాజస్థాన్ ప్రాంతాల్లోని మానలీలా దానలీలా నాట్యాలు ఈ కోవకి చెందినవే. మన యక్షగాన కలాప రచనలకు పోలినవే నేపాల్ ప్రాంతాలలోని రచనలు 'గాంధర్వ' గీతాలనీ, 'పారిజాతా' లనీ వ్యవహరింపబడుతున్నాయి. కళాపక శబ్దమే 'కల్పక' మై, 'పారిజాత కల్పక' స్ఫూరితో 'పారిజాతాలు' అనే ప్రసిద్ధి బడసినట్లుంది.

కలాప రచనలన్నీ సంగ్రధన రచనలు. కొన్ని దరువులు, వచనాలు, పద్యాలు కూర్చి వ్రాసిన ఈ రచనల్లో సందర్భానుసారంగా శ్లోకాలు, అష్టపదులు, తరంగాలు, చూర్ణికలు వగైరా లెన్నో చేరుతూ వుంటాయి. ఏకపాత్రాభినయమైన దశావతార గేయ నృత్యానికి విధిగా ఇందులో స్థానముంటుంది.

గొల్లకలాపంలో క్షీరసాగరమధన కథ, చోడిగాని కలాపంలో రామాయణ కథ యథావకాశంగా అభినయిస్తూ వుంటారు.'

**గొల్లకలాపము :** కూచిపూడివారు భామా కలాపమును, ప్రహ్లాదచరిత్ర, ఉషాపరిణయం వంటి నృత్య నాటకములను, దాదినమ్మ వేషము, బాలింత వేషము వంటి ఇతర వేషములను ఆడినట్లే గొల్ల కలాపమును విశిష్ట ప్రయోగము నొకదానిని కూడ చేపట్టిరి. గొల్లకలాపము అర్వాచీన మని, అది సిద్ధేంద్రుని రచన కాదని విమర్శకులు తలచిరి. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు ఇట్లు వ్రాసిరి ''గొల్లకలాపమందలి యజ్ఞపు పట్టు గురించి చెప్పేది తరిగొండ వెంకమాంబ రచన. క్షీరసాగరమధనమును వర్ణించిన గొల్లకలాపమును ఆత్రేయపురపు వెంకటదాసు, తమ్మన్నగారలు రచించారు. పిండోత్పత్తిని గురించి చెప్పే కలాపం సిద్ధేంద్రుని పేరను, భాగవతుల రామయ్యగారి పేరను చెల్లుబాటు అవుచున్నది'' (ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర పు. 201. 195) పామరులకు వేదాంత బోధ గావించు నుద్దేశముతో వెలసిన దృశ్యవచనాలలో గొల్లకలాప మొక యత్నము. ఇందు పిండోత్పత్తి మొదలుకొని అనేక విషయములు చర్చింపబడును. (కూచిపూడి నాట్య సదస్సు ఉత్సవ సంచిక 1959; తె. నా. వికాసము-పోణంగి శ్రీరామ అప్పారావు).

కూచిపూడి వారి కలాప కావ్యాలతో నారాయణ తీర్థులవారి పారిజాతాపహరణ యక్షగానము కూడ పరిశీలింపదగినది. నారాయణ తీర్థులకు సిద్ధేంద్ర యోగికి సాన్నిహిత్య మున్నట్లుగా చెప్పబడుచున్న ఐతిహ్యములను గూర్చియు వారి రచనలను గూర్చియు విమర్శకులు పలు అభిప్రాయములను వెలిబుచ్చిరి. కొన్ని విషయములు శారదాధ్వజము - (శ్రీ యండమూరి సత్యనారాయణరావు. పు. 129-134; 1965 నందును) సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర (ఆరుద్ర) పు. 193-202; 1967 లలో చూడనగును.

''కమలనయన పురాణపురుష కంసభంజన శ్రీనిధే
అమరవందిత పాదపంకజ ఆశ్రితార్తి విభంజన
శరణు శరణు మునీంద్ర సన్నుత శరణ కమలానాయక
శరణమచ్యుతపురనివాస స్వామి వరదరాజ ప్రభో''

అను తీర్థులవారి రచన అన్నమాచార్యులవారి రచనను తలపించుచున్నది.

ఇట్టి దేశి దృశ్యరూపక కళా ప్రక్రియ లెన్నిటినో స్వీకరించి సమన్వయించుకొని "యక్షగాన" ప్రక్రియ విస్తృతి నందినది. దక్షిణాంధ్రయుగ మీ సాహిత్య ప్రక్రియకు స్వర్ణయుగము. తదుపరి ఇంకను అనేక ప్రభావములకు లోనయి ఆంధ్ర నాటక రచన నిరంతర పరిణామము నందుచు వచ్చినది. తెలుగు నాటక ఆరంభ వికాసములను సమీక్షించుచు శ్రీ గొల్లపూడి మారుతీరావుగారు ఇట్లు వ్రాసిరి:

''అప్పటి ధోరణిలో నాటకమంటే దృశ్య ప్రసంగం...పురాణం చదివితే చాలదు. చదవలేని వాడికి చెప్పే ప్రక్రియ కావాలి. అది ప్రజారంజకం కావాలి. ఈ ఆదర్శం ఆధారంగా భజనలు రాసక్రీడలు మొదలైనవి వ్యాప్తిచెందాయి ... క్రమంగా పాత్యం పలుకుబడిలోకి వచ్చింది...రచయిత సాంఘిక చైతన్యంలో భాగం పంచుకొనే ధోరణి అలవడింది.

విదేశీ ప్రభావం ఆధునిక నాటకంమీద చాలా కనిపిస్తుంది... ఈ పరిణామాన్ని ఏడు శీర్షికల క్రింద క్రోడీకరించవచ్చును... 1924 సం॥ జూన్‌లో బందరులో జరిగిన సాహిత్యసభలలో నాటక స్వరూపం ఎలా వుండాలనే విషయంమీద తర్జన భర్జనలు జరిగాయి... నాటకాలలో వచనం వుండాలనీ సంగీతం అక్కరలేదనీ భమిడిపాటి కామేశ్వరరావు గారన్నారు. నాటకంలో సంగీతం తగ్గాలనీ, వచనానికి ప్రాధాన్యం పెరగాలనీ, అభినయానికి ప్రాముఖ్యాన్నిచ్చే రచనలు రావాలనీ బందరు సభలు గడుసుగా ఒక తీర్మానాన్ని చేస్తూ ముగిశాయి...

మారేకాలంతోపాటు అభిరుచులు వాటితోపాటు సాహిత్యం మారడం సహజమే కదా!, ఆం. సార. పరి. రజతోత్సవ సంచిక - గొల్లపూడి మారుతీరావు. పు. 261-268; 1976.

మనవి :-

తెలుగు నాటక ఆరంభవికాసాలను గూర్చి, దేశీయము ఆంధ్రదేశజము అయిన ''యక్షగాన'' ప్రక్రియా ప్రాదుర్భావ వికాసాలను గూర్చి; మన ప్రాచీన నృత్య సంప్రదాయములను గూర్చి; గంధర్వ గాన శైలులను గూర్చి మన పండితులు, పరిశోధకులు, సాహిత్య విమర్శకులు మౌలికమైన కృషిసలిపి ఎన్నో నూతన విషయములను తెలిపినారు. కాని, వాటిని గూర్చిన యెరుక తెలుగుభాషా పరిధుల్ని, తెలుగు దేశపు పొలిమేరల్ని అధిగమించి ప్రపంచ ప్రజా సామాన్యానికి వెల్లడికావలసినంతగా ప్రచారం జరగ లేదు. ఇప్పుడిప్పుడే ప్రాచీనమైన మన కూచిపూడి నృత్యశైలిని గూర్చి కాస్త పేరు వివవస్తోంది. మన యక్షగానాలను గూర్చి, ఇతర కళారూపాలను గూర్చి ఇంకా సలుగురికీ తెలియవలసియే ఉన్నది. ఆంగ్ల మాధ్యంలో విస్తృత ప్రాతిపదికమీద ఈ ప్రచారము నకు పూనుకొని ఆ ప్రాచీన కళారూపములను వాటికి తగిన చేయూతనిచ్చి నిలుపుకొన్ననాడు గాని ఆ ఆదర్శము నెరవేరజాలదు. అట్టి ప్రజ్ఞ మన జాతికి కలుగునుగాక అని ప్రార్థన.

ఇంతవరకు ఈ రంగమున జరిగిన కృషిని క్రింది పట్టిక దిఙ్మాత్రముగా ప్రదర్శింపగలదు. ఈ విషయమై ఎందరో ఎన్నో సందర్భములలో ఎంతో విషయమును వ్రాసి యున్నారు. యథావకాశముగా నాకందుబాటులో నుండిన రచనా విషయములు కొన్ని మాత్రమే ఇందు స్పృశింపబడినవి. ఇందు చేరవలసిన అంశము లింకను ఉండును. ఆ చేరమికి నేరమి నాదిగా నెరిగి మన్నించి పాఠకసహృదయులు వాటిని పరిష్కరించుకోవలసినదిగా ప్రార్థన.

**ఈ ప్రక్రియల విషయమై చూడదగిన వ్యాసములు, పీఠికలు, ప్రత్యేక సంచికలు, గ్రంథములు మొ॥ వాని వివరణ మీ దిగువ నీయబడినది.**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర పీఠిక | వేటూరి ప్రభాకరశాస్త్రి | — | 1914 |
| 2. | ఆంధ్రనాటక రచనము | ,, | కృష్ణాపత్రిక | 23-9-1916 |
| 3. | మధుర గీతములు | , | ,, | 10-3-1917 |
| 4. | మధుర కవితలు | ,, | ,, | 21-4-1917 |
| 5. | ,, | ,, | ,, | 16-6-1917 |
| 6. | యక్షగానములు | పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి | భారతి(దుర్మతి) | 1921 |
| 7. | శాసన విశేషములు | వేటూరి ప్రభాకర శాస్త్రి | | 1924 |
| 8. | బసవ పురాణ పీఠిక | ,, | | 1926 |
| 9. | ఆంధ్రులు-సంగీతము | ,, | ఆంధ్రపత్రిక | ? |
| 10. | క్రీడాభిరామ పీఠిక | ,, | — | 1928 |
| **11.** | **Yakshagana** | **V. Raghavan** | **Triveni** | **Sep. Oct 1934** |
| 12. | యక్షగానము | చింతా దీక్షితులు | ప్రతిభ (ధాత) | 1937 |
| 13. | యక్షగానము-పుట్టుపూర్వోత్తరాలు (సుగ్రీవ విజయ యక్షగాన పీఠిక) | వేటూరి ప్రభాకరశాస్త్రి | భారతి మే నెల | 1939 |
| 14. | కొరవంజి | చింతా దీక్షితులు | ఉగాది సంచిక. ప్రమాది | 1939 |
| 15. | మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భండాగారము డిస్క్రిప్టివ్-కేటలాగులు | వేటూరి ప్రభాకర శాస్త్రి | వాల్యూం 8 యక్షగానములు-దండకములు | 1941 |
| 16. | ఆట భాగవతం-కృష్ణకథ | | | 1948 |
| 17. | మృత్యుంజయ విలాసము | బులుసు వేంకట రమణయ్య | భారతి ఏప్రిల్ | 1948 |
| 18. | గడ్డిపాడు భాగవతులు | శ్రీనివాస చక్రవర్తి | నటన ఆ.సె. | 1948 |
| 19. | అన్నమాచార్య చరిత్ర పీఠిక | వేటూరి ప్రభాకరశాస్త్రి | — | 1949 |
| 20. | సాంబయ్య బొమ్మలాట | | భారతి(రజతోత్సవ సం.) | 1949 |
| 21. | దక్షిణదేశ భాషాసారస్వతములు-దేశి | కోరాడ రామకృష్ణయ్య | | 1949 |
| 22. | యక్షగానములు | ఆదిరాజు వీరభద్రరావు | శోభ అక్టోబరు | 1950 |
| 23. | యక్షగానములు-తంజావూరు | నేలటూరి వెంకటరమణయ్య | | ఖర 1951-52 |
| 24. | యక్షగానాలు | ఇల్లిందల సరస్వతీ దేవి | కిన్నెర డిసెంబర్ | 1953 |
| 25. | ఆంధ్ర వాఙ్మయము-యక్షగానములు | నేలటూరి వెంకటరమణయ్య | భారతి (విజయ) | 1954 |
| 26. | యక్షగానములు-ప్రాచీనాంధ్ర నాటక స్వరూపము | తూమాటి దొణప్ప | కిన్నెర మే నెల | 1954 |
| 27. | యక్షగానములు-వికాసము | ,, | ,, జూన్ | 1954 |
| 28. | యక్షగానములు | జోగయ్య శర్మ | భారతి అగస్టు | 1954 |

| | | | | |
|---|---|---|---|---|
| 29. | యక్షగానములు | జోగయ్యశర్మ | కిన్నెర నవంబరు | 1954 |
| 30. | యక్షగానములందలి సాంప్రదాయిక పాత్రలు | యస్వీ జోగారావు | భారతి డిసెంబరు | 1954 |
| 31. | కొన్ని యక్షగానములు | ఆదిలక్ష్మి | పరిశోధన | 1954-55 |
| 32. | తెలుగు సంస్కృతి సం॥ 3 | (తెలుగు భాషా సమితి) | — | 1959 |
| 33. | ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము | బాలాంత్రపు రజనీకాంతరావు | (తెలుగు భాషా సమితి వారి బహుమతినందిన రచన) | 1958 |
| 34. | బయలు నాటకాలు | గుత్తి రామకృష్ణరావు | పరిశోధన | 1954-55 |
| 35. | బొమ్మలాట | ,, | భారతి ఆగస్టు | 1955 |
| 36. | యక్షగానము-దేశిత్వము, వైశిష్ట్యము | ఆదిలక్ష్మి | కిన్నెర జనవరి | 1955 |
| 37. | యక్షగానకవులు | నిడుదవోలు వెంకటరావు | భారతి ఫిబ్రవరి-మార్చి | 1955 |
| 38. | యక్షగాన కవులు | కేతవరపు రామకోటిశాస్త్రి | భారతి మార్చి | 1955 |
| 39. | యక్షగానము-హరికథ | యస్వీ జోగరావు | ఆం.సా.ప. (మన్మథ) | 1955 |
| 40. | మేలటూరు భాగవత మేళ నాటములు | ,, | భారతి సెప్టెంబరు | 1955 |
| 41. | యక్షగానములు (సంపుటములు) | ఆంధ్ర విశ్వకళా పరిషత్తు | | 1955 మొ॥ |
| 42. | జావాద్వీప వాసుల వినోదము వాయంగ్ ఆటలు | మల్లంపల్లి సోమశేఖరశర్మ | | |
| 43.ఎ. | ఆంధ్రులు-నాట్యకళ | దివాకర్ల వేంకటావధాని | స్రవంతి (నంవంబర్) | 1956 |
| 44. | యక్షగాన నాటకములు | కొత్త భావయ్య చౌదరి | ఆంధ్రమహిళ | 1956 |
| 45. | బయలాట | ముట్నూరి సంగమేశం | ఆంధ్రప్రభ | 1956 |
| 46. | బుద్ధజయంతి మహోత్సవ సంచిక | (ముక్త్యాల) | | 1956 |
| 47. | కన్నడ యక్షగానములు | ముట్నూరి సంగమేశం | భారతి ఫిబ్రవరి | 1956 |
| 48. | బొబ్బిలి యుద్ధం కథ | మల్లంపల్లి సోమశేఖర శర్మ | భారతి అక్టో. | 1956 |
| 49. | నాట్యవేదము (అనువాదము) | జమ్మలమడక మాధవరామశర్మ | | 1957 |
| 50. | ,, | శిష్ట్లా రామకృష్ణశాస్త్రి | | 1958 |
| 51. | కూచిపూడి నాట్య సదస్సు ఉత్సవసంచిక | | | 1959 |
| 52. | నాట్యశాస్త్రము (అనువాదము) | పోణంగి శ్రీరామ అప్పారావు | | 1959 |
| 53. | ప్రాజ్ఞనన్నయ యుగము | దివాకర్ల వేంకటావధాని | | 1960 |
| 54. | ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర | యస్వీ జోగారావు | | 1960 |
| 5.. | Souvenir on Drama Seminar | A.P.S.N. Academy | | 1960 |

| | | | | |
|---|---|---|---|---|
| 56. | ఆంధ్ర యక్షగాన చరిత్ర (సమీక్ష) | బండారు తమ్మయ్య | ఆం.సా.ప. పత్రిక | 196 |
| 57. | యక్షగానములు | ఇంద్ల సుబ్బారావు | | 196 |
| 58. | ,, | రాధాకృష్ణశర్మ | | 196 |
| 59. | ప్రజాభిరుచుల్ని తీర్చిదిద్దిన పగటివేషగాళ్లు | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి | | 196 |
| 60. | కూచిపూడి నృత్యం–నాటకం | బండార్కు కనక లింగేశ్వరరావు | | 196 |
| 61. | భామాకలాపం | వేదాంతం పార్వతీశ్వర శాస్త్రి | | 196 |
| 62. | ,, | ఎం.వి. రమణమూర్తి | | 196 |
| 63. | శారదాధ్వజము | యండమూరి సత్యనారాయణ | | 1965 |
| 64. | నేటి తోలుబొమ్మలాట | ఎల్లోరా | | 1965 |
| 65. | ధర్మరావుపల్లి తోలుబొమ్మల ఉత్పత్తి కేంద్రం | వి. రామలింగారెడ్డి | | 1965 |
| 66. | యక్షగానములు–నాటకములు | శ్రీవాత్సవ | భారతి మే | 196 |
| 67. | తెలుగు నాటిక వికాసము | | | 1967 |
| 68. | సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర ( సం. 11, 12 ) | ఆరుద్ర | | 1967–68 |
| 69. | ప్రహ్లాద భక్తి విజయము | గిడుగు సీతాపతి (త్యాగరాజ ద్విశత జయంతి ఉత్సవ ప్రత్యేక సంచిక) ఆగస్టు | | 1967 |
| 70. | వాఙ్మయ వ్యాసమంజరి | వేటూరి వెంకటరమణయ్య | | 1967 |
| 71. | దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర | నటరాజ రామకృష్ణ | | 1968 |
| 72. | విష్ణుమాయా విలాసము–పీఠిక | వేటూరి వెంకటరమణయ్య | | 1970 |
| 73. | నాట్యకళ 'జానపద ప్రత్యేక సంచిక' | | | 1970 |
| 74. | యక్షగానం | శ్రీనివాస చక్రవర్తి | నాట్యకళ | 1970 |
| 75. | [illegible] | ముట్నూరి సంగమేశం | ,, | ,, |
| 76. | వీధి నాటకము | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి | ,, | ,, |
| 77. | పగటి వేషాలు | భాగవతుల లక్ష్మీనరసింహము | ,, | ,, |
| 78. | [illegible] | కూర్మా వేణుగోపాలస్వామి | ,, | ,, |
| 79. | [illegible] | రాంభట్ల కృష్ణమూర్తి | ,, | ,, |
| 80. | [illegible] | లక్ష్మీకాంత మోహన్ | ,, | ,, |
| 81. | [illegible] | | ,, | ,, |
| 82. | [illegible] | మొదలి నాగభూషణ శర్మ | ,, | ,, |
| 83. | [illegible] | యస్వీ జోగారావు | ,, | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 84. | సీతాకల్యాణము-పీఠిక | వడ్లమూడి గోపాలకృష్ణయ్య | — | 1971 |
| 85. | జంగం కథలు | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి | | జనవరి 1972 |
| 86. | యక్షగాన వాఙ్మయము | బిరుదరాజు రామరాజు | | 1972 |
| 87. | సుగ్రీవవిజయము (ఆముఖము) | జి. వి. సుబ్రహ్మణ్యం | | 1973 |
| 88. | తాళ్ళపాక కవుల పదకవితలు | వేటూరి ఆనందమూర్తి | | 1974 |
| 89. | యక్షగానము(ప్రపంచ తెలుగు మహాసభలు) | యస్వీ జోగారావు | | 1975 |
| 90. | ఆంధ్ర సారస్వత పరిషత్తు (రజతోత్సవ సంచిక) | | | 1976 |
| 91. | తెలుగు జానపద సాహిత్య చరిత్ర స్వరూపము | (ఆం.సా.ప. రజతోత్సవ సంచిక) | | 1976 |

92. ఇంకా - యక్షగాన ప్రక్రియను గూర్చి, యక్షగాన కవులను గూర్చి, దేశి దృశ్య కళారూపాలను గూర్చి పరిశోధించి సమీక్షించిన ఆంధ్ర వాఙ్మయ (సాహిత్య) చరిత్రకారుల రచనలు, పరిశోధన వ్యాసములును. చూ. మరియు వ్యాససూచి.

| | | | | |
|---|---|---|---|---|
| 93. | కాటమరాజు కథలు (2 సం॥) | ఆం.సా. అకాడమీ ప్రచురణలు | | 1976, 1978 |
| **94.** | **Yakshaganam and Harikatha** | **M. Jagannadha Rao** | **Deccan Chronicle** | **May 26 th 1975** |
| 95. | తెలుగు హరికథా సర్వస్వం | తూమాటి దొణప్ప (ఆం. సా. అకాడమీ బహుమతి నందిన రచన) | డి. లిట్ (A.U.) | 1978 |
| 96. | ఆంధ్ర నాటకరంగ చరిత్ర | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి (54-55 లో తెలుగు భాషాసమితి వారి బహుమతి నందిన రచన.) | | 1969 |
| 97. | వ్యాస రచనల సూచి | నేలనూతుల కృష్ణమూర్తి (రెఫరెన్సు) | ఆం.ప్ర.సా.అ. ప్రచురణ | 1977 |
| 98. | హరికథ | యస్. గంగప్ప | తెలుగువాణి | 1975 |
| 99. | కూచిపూడి యక్షగాన విద్య చారిత్రక, సాహిత్య, సాంకేతిక దృక్పథము | చింతా రామనాథం | పిహెచ్.డి. (AU) | 1980 |
| 100. | ఆదిభట్ల నారాయణదాసు జీవితము, సాహిత్యము | గూడవరపు లక్ష్మీనారాయణ | ,, | 1980 |
| 101. | తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు | పల్లె సుబ్రహ్మణం | ,, (బెంగుళూరు) | 1982 |
| 102. | బయలాటలు (అనంతపుర మండలం) | జి.ఆర్. వెంకటేశ్వరులు | ఎం.ఫిల్. ,, | 1980 |
| 103. | పల్నాటి సీమలోని కోలాటం | బిట్టు వెంకటేశ్వరులు | పిహెచ్.డి. (నాగార్జున) | ? |
| 104. | తెలుగు వీరగాథా కవిత్వం | తంగిరాల వెంకటసుబ్బారావు | పిహెచ్.డి. (SVU) | 1969 |
| 105. | తెలుగు జానపద గాథలు | నాయని కృష్ణకుమారి | పిహెచ్.డి. (OU) | 1970 |
| 106. | ప్రాచీనాంధ్ర సాహిత్యంలో వినోదక్రీడలు | కె. జయచంద్రారెడ్డి | ఎం.ఫిల్. (SVU) | 1979 |
| 107. | మహతి | యువభారతి ప్రచురణ | | 1972 |

## ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వెలువడిన రచనలు

| | | |
|---|---|---|
| 108. యక్షగానము | యస్వీ జోగారావు | 1975 |
| 109. తొలి సంకీర్తన కవులు | వేటూరి ఆనందమూర్తి | 1975 |
| 110. వాగ్గేయకారుల పద కృతి సాహిత్యము | పుట్టపర్తి నారాయణాచార్యులు | 1975 |
| 111. ఆంధ్రుల నాట్యకళ | నటరాజ రామకృష్ణ | 1975 |
| 112. ఆంధ్రుల సంగీత కళ | మంచాళ జగన్నాథరావు | 1975 |
| 113. జానపద సాహిత్యము వీర గాథలు | తంగిరాల వెంకటసుబ్బారావు | 1975 |
| 114. బుర్రకథలు | నదీరా | 1975 |
| **115. Kuchipudi Classical Dance** | **M.A. Naidu** | **1975** |



# తెలుగులో పరిశోధన - నవల - చిన్నకథ

—అక్కిరాజు రమాపతిరావు

ఆధునిక తెలుగు సాహిత్యంలో 'నవల' నూట పదేళ్ళ కిందట పుట్టింది. చిన్నకథ సుమారు డెబ్భై యేళ్ళ కిందట పుట్టింది. ఆధునికమైన ప్రమాణాలతో విశ్లేషించవలసివస్తే అంతకుపూర్వం 'నవల' అనే ప్రక్రియగాని, నేడు కథానిక, కథ, చిన్నకథగా ప్రచురమైన ప్రక్రియగాని మనకు లేవనే చెప్పాలి.

1872వ సంవత్సరంలో శ్రీరంగరాజుచరిత్రం వెలువడింది. దీనిని తెలుగులో తొలిసారిగా నవలా రచనకు ప్రయత్నంగా పేర్కొనవచ్చు. దీన్ని రచించినవారు నరహరి గోపాలకృష్ణమశెట్టి. ఆ నాడాయన కర్నూలులో డిప్యూటీ కలెక్టరుగా ఉన్నతమైన ప్రభుత్వాధికార పదవిని నిర్వహిస్తూవుండేవారు. అంటే ఆనాడు దేశీయులు పొందగలిగిన అత్యున్నతమైన పదవినే అధిరోహించారని చెప్పాలి. ఈయన ఇంగ్లీషు బాగా నేర్చిఉంటారు. ఇంగ్లీషువారి సారస్వతం సంస్కృతుల గూర్చి తగినంత పరిజ్ఞానం కూడా వీరు సాధించి ఉంటారు. అయితే శ్రీరంగరాజు చరిత్రమనే యీ నవల రాయడానికి ఆయనకు ఇంగ్లీషు సాహిత్యంలోని నవీన రీతుల ప్రోద్బలం కాక అధికారిక వృత్తాంతిని (ప్రభుత్వ గెజటు)లోని ఒక ప్రకటనం ప్రోత్సాహకారకమైంది.

శ్రీ రంగరాజు చరిత్రాన్ని గూర్చి ఈ శతాబ్దిలో తెలుగువారికి మొట్టమొదట తెలియచేసినవారు శ్రీ వేదుమళ్ళ కామేశ్వరరావుగారు. వీరేశలింగం పంతులుగారి సొంత గ్రంథ సంచయంలో ఈ పుస్తకం పొలకువను కనిపెట్టి లోకానికి పరిచయం చేశారు కామేశ్వరరావుగారు. ఆ రోజుల్లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వెలువరిస్తున్న ప్రబుద్ధాంధ్ర అనే సాహిత్య సాంస్కృతిక మాసపత్రికలో 1934 జనవరి సంచిక అంటే ఐదో సంపుటం మొదటి సంచికలో శ్రీ కామేశ్వరరావుగారు శ్రీరంగరాజు చరిత్రను గూర్చి విపులంగా సమీక్షించారు. వీరేశలింగం పంతులుగా రీనవలను చదివుండిన్నీ, వాతే సేకరించివుండిన్నీ, అనుసరించివుండిన్నీ ఆ విషయం ఎక్కడా ప్రస్తావించకపోవడం చింత్యం అని కూడా రావు గారా వ్యాసంలో ప్రసక్తించడం గమనార్హం. ఏతా వాతా తొలి తెలుగు నవలను గూర్చిన సమాచారం ముందుగా ప్రకటించినవారు శ్రీ కామేశ్వరరావు గారన్న విషయం మనం గుర్తుంచుకోవాలి.

ఇక శ్రీరంగరాజు చరిత్ర విషయం. ఈ నవల ఐదు ఉల్లాసాలుగా విభక్తం. ఉల్లాసమంటే ప్రకరణం లేదా అధ్యాయ మన్న మాట. డెమ్మీ సైజున 88 పుటల పుస్తకం. రచయిత అయిన గోపాల కృష్ణమశెట్టిగారు దీనికి రెండు ఉపోద్ఘాతాలుకూడా కూర్చారు. ఒకటి తెలుగున. రెండోదేమో ఇంగ్లీషున. ఇంతేకాదు - ఈ తన నవలా రచనా ప్రయత్నాన్ని "హిందువుల యాచారముల తెల్పునట్టి నవీన ప్రబంధంగా" సంభావించా డాయన. ఆనాటి భారత దేశపు గవర్నర్ జనరలైన లార్డు మేయోకి ఈ గ్రంథాన్ని అంకితం ఇచ్చాడాయన. అయితే గోపాల కృష్ణమశెట్టిగారు తన గ్రంథాన్ని 'నవల'గా పేర్కొనలేదు. వచనప్రబంధ మనీ, నవీనప్రబంధ మనీ మాత్రం ప్రస్తావించారు.

ఈ నవలా రచనకు తనను ప్రోత్సహించిన సంగతులేవో రచయిత ఇట్లా ప్రస్తావించారు: "పది నెలలనాడు లార్డు మేయోగారు బంగాళుల యాచారంబులు తెల్పు ప్రబంధము గావించువానికి బహుమానంబు చేయబడునని ప్రచురము చేసిరి. అది నేను చదివినప్పుడు తెలుగుదేశము వారి యాచారంబులు తెలుపునట్టి ప్రబంధం బొకటి రచియించుట తెలుగు వారి కుపయుక్తం బగునని తలంచి నా నేర్పు కొలదని ప్రబంధంబు చెప్పబూనితిని."

ఈ పై వాక్యాలవల్ల రచయిత సాంఘిక నవలనే ఉద్దేశించాడని స్పష్టపడుతున్నది. లార్డు మేయోగారి ప్రకటన బెంగాల్ గెజట్‌లో వచ్చింది. గోపాలకృష్ణమశెట్టి ఆనాటికే ఉన్నత ప్రభుత్వోద్యోగి కాబట్టి ఆ గెజటు వార్త నాయన చూసి తెలుగువారి సాంఘిక జీవితాచారాలు తెలియజేసే కథాత్మకమైన రచనను చేస్తే బాగుంటుందని ఉత్సహించి ఉంటారు. గోపాలకృష్ణమశెట్టిగారికి సాహిత్యాభిమానం ఉండేది. ఈయన చిన్నయసూరితో కలిసి హిందూధర్మశాస్త్ర సంగ్రహమనే గ్రంథాన్ని ఇంగ్లీషు నుంచి తెలుగులోకి అనువదించారు. ఇంగ్లీషులో స్ట్రేంజి దొరవారీ గ్రంథాన్ని రచించారు. కాబట్టి శెట్టిగారు ఇంగ్లీషులో మంచి పాండిత్యం కలవారని తేటతెల్లమవుతున్నది.

తన యీ గ్రంథాన్ని ఆయన రాజ ప్రతినిధి అయిన శ్రీ మేయోగారికే అంకితం చేయటం కూడా ఆయన అధికార హోదాను, ప్రభుభక్తిని వెల్లడి చేస్తున్నాయి. బంగాళీ రచయిత ఎవరైనా ఇందుకు పూనుకొన్నారో లేదో కాని, ఆ గెజటు వార్త తెలుగులో నవలా రచనకు బీజంవలె పనిచేయటం నేడు తెలుగు నవలా ప్రియులంతా సంతోషించాల్సిన విషయం.

శ్రీరంగరాజు చరిత్రము పూర్తిగా కల్పితమైన కథే అయినా తొలి ప్రయత్నం కాబట్టి చారిత్రక వాతావరణాన్ని కల్పించారు. నాయకుడు కులీనుడై ఉండాలన్న లాక్షణిక దృక్పథాన్ని కూడా ఆనాటికి రచయిత పూర్తిగా పరిహరించలేకపోయినారు. ఈ నవలకు సోనాబాయి పరిణయమనే నామాంతరం కూడా ఉండటం విశేషం. శ్రీరంగరాజు అనే ఒక సంస్థానాధిపతి సోనాబాయి అనే లంబాడి పిల్లను ప్రేమించి వివాహం చేసుకోవటం ఈ నవలిక ఇతివృత్తం. ప్రసక్తానుప్రసక్తంగా తెలుగువారి సాంఘికాచారాలను, సమకాలీన సాంఘిక జీవితాన్ని శెట్టిగారు ఈ గ్రంథంలో చిత్రించారు.

ఈ నవల వెలువడగానే అదే సంవత్సరం ఒక సమకాలీన సారస్వత సాంస్కృతిక మాస పత్రిక ఏ విధంగా సమీక్షించిందో తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉండకపోదు. 1872 జూలై నెల పురుషార్థ ప్రదాయిని అంటే 1 వ సంపుటం 7 సంచిక ఈ నవల నీ విధంగా సమీక్షించింది:

"శ్రీరంగరాజు చరిత్రము- అను నీ గ్రంథము కర్నూలు కాపరస్థులగు నరహరి గోపాలకృష్ణమశెట్టి గారిచే నాంధ్రంబున గద్యాత్మకంబుగ రచింపబడి ముద్రితమై ప్రచురింపబడియె. ఈ గ్రంథము రంగరాజును నాయకునిగంజేసి తత్కథా బాహుళ్యంబుగ కల్పించినటులం జూపట్టుచుండె - నీ గ్రంథకర్త మన హిందువుల పూర్వ యాచారంబు లెల్లరకు వెల్లడి సేయంగోరి మిగుల ప్రయాసంబుగ మృదుపాక శయ్యాదుల రసోల్లసితంబగునటుల రచించెను. కాబట్టి యిది డెందంబున కానందంబు నాపాదించుచుండె. నీ కాలంబున గద్యాత్మక కావ్యంబు లీ యాంధ్రంబున లేకుండుటచే నిది బాలురకు పఠనార్హంబై యుండు. పరీక్షలు మొదలయిన వానికి నుంచిన నుంచవచ్చు లేని యెడల గొన్ని తరగతులకు నియమించి వారిచే జదివించిన బాగుగా నుండునని తోచు...యీ కవి యీ కథ నింత విరివిగ రచించుటకు మనమెంత మెచ్చుకొనవలయును-ఇది యెంత కష్టము. పూర్వము కొంచెము కథ యున్న కొంచె మాలోచించి ప్రబంధము వ్రాయ

వచ్చును. గాని లేనిదాని నింత విరివిగ గూర్చుట యెంత వింత. ఇది వినోదార్థముగ నందరును జదువదగిన యాంధ్రగ్రంథము......"

ఈ విధంగా తెలుగు వాక్యాలలో సిఫార్సు చేయటమే కాక ఇంగ్లీషులో కూడా సంగ్రహ వాక్యాలలో ఆ పత్రిక యీ గ్రంథాన్ని శ్లాఘించింది.

'Rangaraju Charitra, by N. Gopala Krishnamah Chetty garu,is a *Novel* in a sweet, easy grammatical, and idiomatic Telugu prose. Its object is to delineate the manners and customs of our Telugu people, and it is a best story in which we believe the author has drawn a well colored picture of what he had a desi n. This manual of 88 pages contains iustructive and amusing matter throughout for general reading. It may be safely selected as a Text book of reading in schools for classes below the standard of Matriculation. We hope the Government would encourage and patronize such undertakings as this. This work which is got up with good taste and good object, is worth reading by all in general....''

తొలి తెలుగు నవల అని రచయిత చెప్పక పోయినా ఆనాటి పత్రికలు గోపాలకృష్ణయ్య శెట్టిగారి ప్రయత్నాన్ని నవలా రచనా ప్రయత్నంగానే భావించి నట్లు సమకాలీన పత్రిక అయిన పురుషార్థ ప్రదాయిని రాసిన పై సమీక్షావాక్యాలవల్ల స్పష్టమవుతున్నది. తెలుగు సమీక్షలో నవల అనే పేరుతో దీన్ని పిలవక పోయినా ఇంగ్లీషున నవలగానే ప్రసక్తిచేయడం గమనార్హం. ఇంతేకాకుండా ఆనాటి సెయింట్ ఫోర్ట్ జార్జి గెజెటుకూడా ఈ గ్రంథాన్ని నవలగానే పేర్కొన్నది. అయితే ఇంతవరకు శ్రీ రంగరాజు చరిత్రకు ద్వితీయ ముద్రణం వెలువడలేదు.

ఇటు తర్వాత సుమారు ఆరు సంవత్సరాలకు వీరేశలింగం పంతులు తన వివేకవర్థని పత్రికలో రాజశేఖర చరిత్రము అనే తన నవలను ధారావాహికంగా ప్రచురించి, 1880 లో దాన్ని పుస్తకరూపాన తెచ్చారు. ఇంగ్లీషులో ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచించిన 'ది వికర్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' అనేనవలను తన రాజశేఖర చరిత్రకు ఆధారంగా తీసుకున్నానని వీరేశలింగమే పీఠికలో చెప్పుకున్నాడు, అయితే ఇంగ్లీషు మాతృకకు తెలుగు అనుసరణానికి విశేషించి పోలిక లేవీ లేవనీ, తెలుగు వారి సాంఘిక జీవితం ప్రతిబింబింపచేసే ఉద్దేశంతోనే తానీ గ్రంథాన్ని రచించాననీ కూడా ఆయన ప్రస్తావించారు. అంటే నవలారచనకు పూనుకొన్న రెండోవారు వీరేశలింగం పంతులుగారన్నమాట. వీరేశలింగమే 1883లో ఇంకొక చిన్న నవల వ్రాశాడు. దీనిపేరు సత్యవతీ చరిత్రము. ఈ నవలను కూడా వీరేశలింగం తాను నడుపుతుండిన సతీహితబోధిని అనే పత్రికలో ధారావాహికంగా ప్రచురించారు. స్త్రీలను ప్రబోధించే ఉద్దేశంతో తానీ నవలను వ్రాసి నట్లూ అందువల్ల సులభశైలిలో మహిళలుకూడా చదివి ఆనందించటానికి అనువుగా ఆనాటి తెలుగు దేశపు కుటుంబ జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకున్నట్లూ ఆయన చెప్పారు. శ్రీ రంగరాజు చరిత్రకు సోనాబాయి పరిణయ మని నామాంతరం ఉన్నట్లే రాజశేఖర చరిత్రకుకూడా వివేక చంద్రిక అని నామాంతరం ఉన్నది. సత్యవతీ చరిత్రానికి మాత్రం రెండో పేరేమీ లేదు.

నవలారచనకు వీరేశలింగం పూనుకొన్న తర్వాత ఆనాటి కవి పండితులు నవలారచన పట్ల

అంతగా ఉత్సాహం చూపినట్లు కనపడదు. 1893 వ సంవత్సరం వరకూ, అంటే తెలుగులో నవలారచనకు శ్రీకారం చుట్టిన తర్వాత ఇంచుమించు ఇరవై సంవత్సరాల వరకూ తెలుగులో మూడే నవలలు వచ్చినట్లు, ఇంతవరకు తెలిసిన ఆధారాలవల్ల మనకు తెలుస్తున్నది. అసలు వచనరచన పట్ల కూడా ఆ రోజుల్లో కవి పండితు లెవ్వరూ ఆసక్తి చూపలేదేమో. సంస్కృతం నుంచి, ఇంగ్లీషు నుంచి నాటకాలు అనువదించటంలోను, స్వతంత్ర నాటకాలు కూర్చటం లోను, కావ్యరచనలోనూ ఆసక్తి చూపినంతగా వచన ప్రక్రియలపట్ల ఆనాడు రచయితలలో అభిమానం కలిగినట్లు కనపడదు.

1892 లో రాజమహేంద్రవరం నుంచి చింతామణి అనే సాహిత్య మాసపత్రిక వొకటి మొదలైంది. న్యాపతి సుబ్బారావు పంతులుగారు ఈ పత్రికకు యజమానులు- ముఖ్య నిర్వాహకులు. వీరేశలింగంగారూ, ఆచంట సుందరరామయ్య గారనే ఇంకొక రాజమండ్రి న్యాయవాదీ, వావిలాల వాసుదేవశాస్త్రిగారూ ఈ చింతామణిని నిర్వహిస్తూ ఉండేవారు. ఆధునిక తెలుగు సాహిత్యంలో తొలిసారిగా నవలారచనకుగాను పోటీ ప్రారంభించిందీ పత్రిక. న్యాపతి సుబ్బారావు పంతులుగారు నాటికే దేశరాజకీయాలలో ప్రముఖ వ్యక్తి, విశేషించి దేశపర్యటనం జరిపి దేశీయ మేధావులతో పరిచయం గలవారూ కాబట్టి తెలుగు సాహిత్యాన్ని నూతన రీతులలో అభివృద్ధికి తేవాలని ఉత్సహించి ఉంటారు. వారికి వీరేశలింగం చెలిమి కూడా ఇందుకు బాగా తోడ్పడి ఉంటుంది. కాబట్టి తెలుగు నవల పరిణామ వికాసాలకు చింతామణి పత్రిక చాలా దోహదం చేసిందని చెప్పాలి. 1893 వ సంవత్సరం మార్చినెల పత్రికలో నవలా రచనకు సంబంధించిన పోటీ వివరాలు ప్రచురించారు. బహుశా నియమ నిబంధనలు, స్వరూప స్వభావాలు గూర్చి వివరాలు, సందేహ నివారణలు ఆ రోజుల్లో కొందరు కోరి ఉంటారు. చాలా మంది జాబులు రాసినట్లు ఆ పత్రికే పేర్కొన్నది. అందువల్ల ఆ మరుసటి సంచికలో "ఈ బహుమానంబుల నందు బ్రయత్నించు వారిక్రింది నిబంధనల కొడంబడి యొక 'వచన ప్రబంధమును' వ్రాసియంపవలెను" అని ప్రకటించిన నిబంధనలకు సవివరణమైన వ్యాఖ్యానం ప్రకటించటం జరిగింది. ఆనాటికి కూడా వచనప్రబంధంగానే ఈ ప్రక్రియను వ్యవహరించటం గమనార్హం. అంతే కాని నవల అనలేదు. ఆ సంవత్సరం మార్చి, ఏప్రిల్ నెలల రెండు సంచికల నిండా ఈ బహుమాన ప్రకటనలే ప్రధానాంశాలైనాయి. ఈ వచన ప్రబంధం అంటే ఏమిటో, దానిలో కథ ఎట్లా ఉండాలో, రసము, నాయకుడు, పస్త్వైక్యం మొదలైనవి ఎట్లా నిర్వహించాలో ఈ వివరాలన్నీ పొందుపరుస్తూ, మార్గదర్శకంగా ఉండేందుకుగాను వీరేశలింగంగారి రాజశేఖర చరిత్ర, సత్యరాజు యాత్రలు, సత్యవతీ చరిత్రలు చదివి చూడాల్సిందిగా సిఫారసు చేసింది చింతామణి పత్రిక. అయితే ఇంత పెద్ద ఎత్తున ప్రథమ ద్వితీయ బహుమానాలు, పుస్తకం అచ్చువేసి ఐదు వందల ప్రతులు రచయిత కిస్తాము అని ఉదారంగా ప్రకటన చేసినప్పటికీ పోటీకి వచ్చినవి మూడే మూడు నవలలు. గంజాం జిల్లాలోని రసూల్‌కొండలో పాఠశాలాంధ్రోపాధ్యాయుడైన ఖండవిల్లి రామచంద్రుడు ధర్మవతీ విలాసం, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు కొవ్వూరు నుంచి సంజీవరాయ చరిత్ర, బులుసు పాపయ్యశాస్త్రి గారనేవారు గోదావరి జిల్లానుంచే భాస్కరవిలాసం పోటీకి పంపించారు. వీరేశలింగం, ఆచంట సుందరరామయ్య, వావిలాల వాసుదేవశాస్త్రిగారలు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. ధర్మవతీవిలాసానికి ప్రథమ బహుమానం, సంజీవరాయచరిత్రకు ద్వితీయ బహుమానం ఇచ్చారు. ఇక మిగిలిపోయినది ఒక్కటే కాబట్టి దానికి కూడా తగిన బహుమతి ఇస్తే బాగుంటుంది కదా అని పోటీ పరీక్షా బహుమాన నిర్ణాయకులలో ఒకరైన వావిలాల

వాసుదేవశాస్త్రిగా రభిప్రాయపడ్డారు. ఆ మరుసటి సంవత్సరం మళ్ళీ పోటీ ప్రకటనం జరిగింది. ఈసారి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రామచంద్ర విజయ మనే నవలను పోటీకి పంపించారు. చిలకమర్తివారు నవలా రచనకు పూనుకోవటం తెలుగు నవలాసాహిత్య చరిత్రలో అత్యంత ప్రధానమైన ఘట్టం. ఆ సంవత్సరం ప్రథమ బహుమానం చిలకమర్తివారికే దక్కింది.

రాజమహేంద్రవరం నుంచి ప్రకటితమవుతున్న ఈ చింతామణి పత్రిక ఆరు సంవత్సరాలకు మించి వెలువడకపోవటం తెలుగు నవల చరిత్ర కొక దురదృష్టమని చెప్పాలి. 1896, 97 ప్రాంతాలలో ఈ పత్రిక ఆగిపోయింది. అయితే తెలుగు సాహిత్యంలో నవలా రచనపట్ల గొప్ప ఆకర్షణ కలగజేసింది ఈ పత్రిక. ఈ ప్రక్రియకు పాఠకుల బహుళాదరణను సంపాదించి పెట్టింది. అంతకు పూర్వం ఇరవై సంవత్సరాలల్లో కేవలం ఒక చేతి వేళ్ళమీదనే లెక్కించాల్సిన తెలుగు నవల, చింతామణి పోటీలు ప్రారంభమైన తర్వాత ఐదారు సంవత్సరాలలో ఐదారుపదుల సంఖ్యావృద్ధి సాధించింది. చిలకమర్తి వారు నవలా రచయితగా గొప్ప ప్రసిద్ధిని, గణ్యతను పొందటానికి చింతామణి పత్రిక ఎంతగానో తోడ్పడింది. గోటేటి కనకరాజు, టేకుమళ్ళ రాజగోపాలరావు, రెంటాల సుబ్బారావు, కూనపులి లక్ష్మీ నరసయ్య, నంబూరి తిరునారాయణ స్వామి మొదలైనవారు తొలి తరం తెలుగు నవలా రచయితలు.

పందొమ్మిదో శతాబ్ది ఏడో దశకం నుంచి ఇరవయ్యో శతాబ్దికి పూర్వరంగంలో ఒక ఏభై అరవై నవలలు మాత్రమే వచ్చి ఉండవచ్చు. వీటన్నిటిని ఇలా ఉంచి ప్రధానంగా సంస్మరించవలసిన అతి ముఖ్య విషయం ఒకటి వుంది. పందొమ్మిదో శతాబ్ది చివరి దశకం సగపడిన దాకా ఈ ప్రక్రియ వచన ప్రబంధంగానే చెలామణీ అవుతుండగా, కాదు ప్రౌఢంగా వ్యవహరించదలచిన వాళ్ళు అఖ్యాయిక అంటూ నవల అనే పేరు ఎవరు పెట్టారు ? ఎవరు సూచించారు? నవల అనే పిలవండర్రా అని ఎవరు చెప్పారు ? అదీ ఆ ముఖ్యమైన విషయం !

ఈ నామకరణం చేసినవారు కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు. ఆ రోజుల్లో అంటే పందొమ్మిదో శతాబ్ది చివరి దశకంలో కాకినాడ నుంచి 'రాజయోగి' అనే సాహిత్య ఆధ్యాత్మిక పత్రిక వొకటి కొంతకాలం వెలువడింది. గురజాడ శ్రీరామమూర్తి గారీ పత్రికను నిర్వహిస్తూ ఇందులో తమ కవి జీవితాలు ప్రచురిస్తూ వచ్చారు. ఈ రాజయోగి పత్రికలో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వీరేశలింగం రచించిన రాజశేఖర చరిత్రను చాల విపులంగా విమర్శించారు. రాజశేఖర చరిత్రకు వివేక చంద్రిక అని నామాంతరం ఉన్నది కదా. అందువల్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ విమర్శకు వివేక చంద్రికా విమర్శనమని పేరు పెట్టారు. 1896వ సంవత్సరం రాజయోగి పత్రికలో ధారావాహికంగా వెలువడిన ఈ విమర్శ అటు తర్వాత పుస్తకరూపాన వచ్చింది. మూలగ్రంథమైన రాజశేఖర చరిత్రం కన్నా ఈ విమర్శే నిడివిలో పెద్దది. ఈ రాజశేఖర చరిత్రను మూలగ్రంథమైన గోల్డ్‌స్మిత్ నవలతో పోలుస్తూ వీరేశలింగంగారి భ్రమ ప్రమాదాల నన్నిటినీ పూసగుచ్చినట్లు చూపారు శాస్త్రిగారు. ఈ విమర్శను వెలయిస్తూ, ఇంగ్లీషున ఈ ప్రక్రియను నవల అంటున్నారు కాబట్టి, విశేషమైనది అని ఆ పదానికి ఆ భాషలో వ్యుత్పత్తి అర్థం వస్తుంది కాబట్టి, తెలుగులో కూడా ఇది కొత్త ప్రక్రియ కాబట్టి, విశేష విషయ సమన్వితం కాబట్టి, సంస్కృతం నుంచి కూడా ఈ పదానికి అర్థాన్ని సాధించటాని కవకాశం వుంది కాబట్టి, మనంకూడా 'నవల' అనే ఈ ప్రక్రియను ఇక నుంచి పిలుచుకుందా మన్ని బ్రహ్మయ్యశాస్త్రి గారు అందంగానూ, హితవుగానూ, నిష్కర్షగానూ చెప్పారు.

అనాటినుంచి తెలుగులో ఈ ప్రక్రియ నవల అయి పోయింది.

కాగా తెలుగులో నవలాప్రక్రియపై వెలువడ్డ తొలి విమర్శ గ్రంథం వివేకచంద్రికా విమర్శన మున్నూ, ఆ విమర్శకులు శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారూనూ అన్నమాట. ఇంకో మూడేళ్ళలో కాలయవనిక తొలగించి ఇరవయ్యో శతాబ్దం రంగ ప్రవేశం చేస్తున్న సమయంలో ఈ విమర్శగ్రంథం వెలువడిందన్నమాట. అటు తర్వాత వీరేశలింగం గారు సుమారు ఇరవై ఇరవై అయిదు సంవత్సరాలు జీవించి ఉన్నా ఈ వివేకచంద్రికావిమర్శపై ప్రతి విమర్శ ప్రకటించటానికి పూనుకోలేదు. అంతేకాదు, ఈ విమర్శవల్ల రాజశేఖర చరిత్రకు గొప్ప ప్రచారం కూడా ఏమీ లభించలేదు. మళ్ళీ వివేకచంద్రికా విమర్శనం కూడా రెండో కూర్పు రాలేదు.

1905 వ సంవత్సరం మద్రాసులో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు మహోదయులు విజ్ఞాన చంద్రికా మండలిని స్థాపించిన తర్వాత తెలుగు నవలా సాహిత్య వికాసంలో గొప్ప మలుపు సంభవించింది. విజ్ఞానచంద్రికా మండలి తెలుగులో చారిత్రక నవలల పోటీని నిర్వహించి, కేతవరపు వెంకటశాస్త్రి, భోగరాజు నారాయణమూర్తి, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగార్లవంటి మంచి నవలా రచయిత లను సృష్టించింది. అయితే ఈ నవలల్లో వాతావరణం, సన్నివేశ పరిపోషణం, కాల్పనిక ప్రతిభ, సృజనాత్మక వైదగ్ధ్యం ఒకే విధంగా, మూసపోసినట్లుగా తయారై నాయి అని గురజాడ అప్పారావుగారు వ్యంగ్య ధోరణిలో ఆక్షేపించారు. గురజాడ రచనల సంపుటా లలో దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారి విజయనగర పతనాన్ని వేళాకోళం చేసిన రచన కనపడుతుంది. తెలుగు రచయితకు చారిత్రక నవలా రచనకు కావల సిన అవగాహనకాని, శక్తి సామర్థ్యాలుకాని లేవని గురజాడ అప్పారావుగారు అధిక్షేపించారు. అటు

తర్వాత చలంకూడా 'తెలుగునవల' అని ఒక వ్యంగ్య హాస్య అధిక్షేపాత్మక విమర్శ ప్రకటించటానికి గుర జాడ విమర్శకూడా ప్రేరేపించి ఉండవచ్చు. ఈ శతాబ్ది మొదటి రెండు దశకాలలో వచ్చిన తెలుగు నవల లన్నిటా, అందునా ముఖ్యంగా చారిత్రక, పౌరాణిక, ఐతిహాసిక నవలలన్నిటా ఒకే రకమైన వర్ణనలు ఉండటం హాస్యాస్పదమని చలం తెలుగు నవలని గూర్చి 'పేరడీ' రాశాడు. నాయికా నాయకుల రూప రేఖావిలాసాదులు మొదలుకొని, దుర్గమ పర్వతారణ్య ప్రాంత వర్ణనలు మొదలుకొని, నాయకుడి అగచాట్లు, ప్రతినాయకుడి దౌష్ట్యోపాయాలు, మాయలు, అదృ శ్యాలు, వీటిని అధిగమించే ప్రతిక్రియలు, మారు వేషాలు, ఉత్కంఠను పోషించే కల్పనలు, వీటిలో కొత్తదనం ఏమీలేదు అని మలితరం తెలుగు నవలలపై ఆనాటి మేధావి రచయితల, విమర్శకుల తీర్పులాగా కనపడుతుంది.

పందొమ్మిది వందల ఇరవైలోనే అక్కిరాజు ఉమాకాంతం, మెడోస్ టెయిలర్ ఇంగ్లీషున రచించిన టిప్పుసుల్తాన్ నవలను అత్యంత ప్రతిభాపూర్ణంగా అనువదించాడు. అనువదించటంవల్ల మెచ్చవలసిందేమీ లేదుకాని, దీని కాయన ప్రపంచ సాహిత్యంలో నవల పుట్టుపూర్వోత్తరాలను గూర్చిన సాధికారమైన గొప్ప ఉపోద్ఘాతం కూర్చాడు. ఆధునిక ప్రపంచ సాహిత్యంలో ఇటలీ భాషనుంచి ఈ నవల ఇతర భాషలను ఆకర్షిం చిందనీ, ఇంకా ఇటువంటి విషయాలు ప్రస్తావించి, ఇంగ్లీషు నవల సాధించిన ఉన్నతి మొదలైనవి వివరిం చటం, ఈ ఉపోద్ఘాతానికి చాల విలువ నిచ్చాయి.

1922 వ సంవత్సరం తెలుగు నవలకు స్వర్ణో త్సవం. ఈ సంవత్సరం కారాగారంలో మాలపల్లి ప్రభవించింది. శ్రీకృష్ణ జన్మస్థానంలోనే ఈ నవల కూడా పుట్టటంవల్ల ప్రబోధనవలల్లో మాలపల్లిదే అగ్ర స్థానం. దీనికి దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు కూర్చిన పీఠిక చాలా విలువైనది.

1932 ప్రాంతాలలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు తెలుగు నవలల పోటీ నిర్వహించడం ద్వారా అడవి బాపిరాజు వంటి మహా ప్రతిభావంతుడు సాంఘిక నవల రచించడానికి ప్రేరణ కలగజేసింది. బాపిరాజు నారాయణరావు, విశ్వనాథ వేయి పడగలు, చలం మైదానం ఈ పోటీకి పంపారుట. బహుమానాన్ని నారాయణరావు, వేయి పడగలు నవలలు పంచుకున్నాయి.

1930 కి కూడా ముందుగానే నవలా ప్రక్రియను గూర్చి దేవులపల్లి అప్పల నరసింహం, దిగవల్లి వెంకట శివరావుగారల వంటి సాహిత్యవేత్తలు భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలలో విమర్శలు, సమీక్షలు వెలువరించారు. 1934 లో టేకుమళ్ళ కామేశ్వరరావు గారు ప్రబుద్ధాంధ్రలో శ్రీరంగరాజు చరిత్రను గూర్చి విపులమైన సమీక్షా వ్యాసం ప్రకటించడం ఇదివరకే ప్రసక్తం. అటుతర్వాత శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారే వీరేశలింగం నవలలన్నిటిపైనా భారతిలో సమగ్రమైన సమీక్షను వెలువరించారు. (1932 ఏప్రిల్, మే, జూన్, జూలై, ఆగస్టు సంచికలు)

స్వర్గీయ నిడుదవోలు వెంకటరావుగారు తొలి తెలుగు నవల గూర్చిన ఒక చర్చను లేవదీశారు. 1872 వ సంవత్సరంలో నరహరి గోపాలకృష్ణమ్మ శెట్టిగారు వెలువరించిన శ్రీరంగరాజు చరిత్రకన్నా ముందే కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు 'మహాశ్వేత' పేరున ఒక నవల వ్రాశారని, వేంకటరత్నం పంతులుగారి సమకాలికులు ఆ రచనను నవలగానే భావించారని, అందువల్ల తొలి తెలుగు నవలా రచయితగా వేంకటరత్నం పంతులుగారే కీర్తితులు కావాలని వేంకటరావు గారి ఆశయం. తమ సిద్ధాంత ప్రతిపాదనకు ఉపబలకంగా శ్రీ వేంకటరావుగారు వేంకటరత్నం పంతులుగారి విగ్రహతంత్రానికి శ్రీ శివశంకర పాండ్యా అనేవారు వ్రాసిన ఉపోద్ఘాత వాక్యాలను ప్రమాణంగా స్వీకరిస్తున్నారు. ఈ విగ్రహతంత్రం టిప్పణితో కూడుకొని 1875 లో వెలువడింది. శివశంకర పాండ్యా గా రానాటి చెన్నపట్నంలో ఒక పాఠశాలోపాధ్యాయులు. వేంకటరత్నం పంతులుగారి శిష్యప్రాయులు. ఈ విగ్రహతంత్రాని కాయన ఉపోద్ఘాతం వ్రాస్తూ, 1867 వ సంవత్సరంలోనే కొక్కొండ వారు మహాశ్వేత అనే నవల రచించారని, అది బాణభట్టు కాదంబరి ఆధారంగా రచితమైందనీ పేర్కొన్నారు. అయితే కొక్కొండ వేంకటరత్నం గారి ఈ రచన 1895 వ సంవత్సరం వరకూ ప్రకటితం కాలేదు. పనప్పాకం ఆనందాచార్యులవా రా కాలంలో నిర్వహిస్తూ వచ్చిన వైజయంతి అనే పత్రికలో కాదంబరిలో ఏకదేశ వృత్తాంతమైన మహాశ్వేత వృత్తాంతం ప్రచురితమైంది. ఇది సంస్కృత మాతృకకు యథాతథానువాదం. స్వేచ్ఛానువాదం కూడా కాదు. కాబట్టి ఈ ప్రయత్నానికి తెలుగు నవలా రచనలో ప్రాథమ్య పరిగణనం సంగతం కాదు. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు ఆంధ్ర వచన రచనా పరిణామం అనే తమ గ్రంథంలోనూ (ద్వితీయ ముద్రణం 1978), కొక్కొండ వేంకటరత్నం పంతులుగారిని మార్చి 1951 గూర్చి, ఏప్రిల్, జూలై, నవంబర్ సంచికలలో భారతి పత్రికలో వ్రాసిన సుదీర్ఘమైన జీవిత చరిత్ర, కృతుల సమీక్షా వ్యాసంలోనూ కొక్కొండవారే తొలిసారిగా తెలుగు నవలా రచనకు పూనుకొన్నారన్న అంశాన్ని ప్రతిపాదించి అందుకు తగిన సాక్ష్యాధారాలు చూపటానికి ప్రయత్నించారు. కాని వారి వాదం సరికాదని నిరూపితమైంది.

1960 తర్వాత తెలుగు దేశంలోని విశ్వవిద్యాలయాలలో ఆధునిక సాహిత్యం పట్ల పరిశోధనాసక్తి ప్రబలింది. కథా సాహిత్యాన్ని గురించి, నవలా సాహిత్యాన్ని గురించి పిహెచ్.డి. పట్టం కోసం పరిశోధనలు ప్రారంభమైనాయి. శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

గారి ఆంధ్ర నవలా పరిణామం, తెలుగు నవల ఉద్భవ వికాస పరిణామాలను నిరూపిస్తున్న ఉద్గ్రంథం. రెండో భాగం ఇంకా పుస్తక రూపాన వెలువడ లేదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు నవల శత జయంతిని పురస్కరించుకొని 1972 వ సంవత్సరం తెలుగు నవల-నూరు సంవత్సరాలన్న సమీక్షా వ్యాస సంకలనం ప్రచురించింది. అటు తరువాత 1979 లో సమాలోచనం పేరిట ఆధునిక సాహిత్యాన్ని గూర్చిన చర్చాసదస్సులో తెలుగు నవలా సాహిత్యంలోని ప్రయోగాలు, ప్రమాణాలు అనే పత్రం ఈ వ్యాస రచయిత సమర్పించాడు. ఈ గ్రంథం 1980 లో అచ్చైంది.

సాహిత్యంలో దృక్పథాలు అనేపేరిట శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం విశ్వనాథ, చలం, గోపీచంద్‌ల నవలా సాహిత్యాన్ని విపులంగా సమీక్షించారు. వివిధ పత్రికలలో తెలుగు నవలలో వచ్చిన వివిధ ధోరణులను గూర్చి, చైతన్య స్రవంతి, అస్తిత్వవాదాలను గురించి శ్రీ సుదర్శనంగారు ప్రామాణికమైన రచనలు వెలువరించారు.

తెలుగు నవలాసాహిత్యాన్నిగూర్చి వెలువడ్డ గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనదగినవి శ్రీ మొదలి నాగభూషణశర్మ గారి తెలుగు నవలా వికాసం, శ్రీ పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు గారి తెలుగు నవలా సాహిత్య వికాసం. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రతి సంవత్సరం నిర్వహించే పోటీలలో తెలుగు నవల-మనోవిజ్ఞాన విశ్లేషణ అనే అంశంపై శ్రీ కోడూరి శ్రీరామమూర్తి గారు బహుమానం పొందారు. తరువాత ఈ గ్రంథం అచ్చువేశారు. ఇదే విషయంపై కుమారి డి. విద్యేశ్వరిగారుకూడ తెలుగు నవల నధ్యయనం చేసి గ్రంథం వెలువరించారు. ప్రసిద్ధ కథారచయితల సృజనాత్మక కృషిని గూర్చి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇటీవల ఒకగ్రంథం వెలువరించింది. ఇదేవిధంగా ప్రసిద్ధ నవలా రచయితల నవలా సాహిత్యంపై కూడా విశ్లేషణాత్మక విమర్శాగ్రంథాన్ని వెలువరించే ప్రయత్నంలో ఉందని తెలుస్తున్నది. కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ వారు 'విమర్శిని' పేరుతో పరిశోధన పత్రికను కొన్నాళ్లు నిర్వహించారు. ఒక సంచిక తెలుగు నవల రూపురేఖలను గూర్చి ప్రసిద్ధమైన తెలుగు నవలల తాత్త్విక భూమికలను గూర్చి సాధికారమైన విశ్లేషణలు రూపొందించింది. ఉన్నవ లక్ష్మీనారాయణ, విశ్వనాథ, రావిశాస్త్రి నవలలపై సమగ్రమైన సమీక్షలు ప్రచురించింది విమర్శిని.

1979లో వరంగల్‌లోని చైతన్యసాహితి అనే సాహిత్యాధ్యయన సంస్థ ఆధునిక సాహిత్యంలో అత్యంత ప్రాచుర్యం పొందిన నవలా సాహిత్యంపై ఒక అధ్యయన గోష్ఠిని నిర్వహించి ఆ పత్రాలన్నిటినీ తెలుగు నవల పేరిట గ్రంథ రూపంగా అచ్చువేసింది. కాకతీయ విశ్వవిద్యాలయంలో విశ్వనాథ సాహిత్య దర్శనం గురించిన అధ్యయనం జరిగింది. విశ్వనాథ పురాణ వైరగ్రంథమాల పరంపరలో వెలువడ్డ నవలల గూర్చిన్నీ పరిశోధన జరిగింది. 1958 ప్రాంతాలకే తూర్పు గోదావరి జిల్లా ఆలమూరునుంచి తరుణ సాహితీ సంస్థ అనే వారు విశ్వశ్రీ పేరున విశ్వనాథ సాహిత్య దర్శనంపై ఒక ప్రత్యేక సంచికను వెలువరించారు. ఇందులో విశ్వనాథ నవలలను గురించి ముఖ్యంగా వేయి పడగలను గురించి సాధికారమైన సమీక్షావ్యాసా లున్నాయి. అటు తరువాత పంతొమ్మిది వందల అరవైలలో భారతిలో విశ్వనాథ 'చెలియలికట్ట'ను గూర్చి విమర్శ వెలువడగా ఆ చర్చలలో ఆరుద్ర, కాశూరి హనుమంతరావు, పి. శ్రీదేవి ప్రభృతులు పాల్గొన్నారు. తెలుగు స్వతంత్రలో కూడా ఆ కాలంలోనే విశ్వనాథ నవలా రచనా దృక్పథంపై ప్రశంసలు, విమర్శలు, సమీక్షలు వెలువడ్డాయి.

శ్రీ కె. వి. రమణారెడ్డి కొడవటిగంటి కుటుంబరావు నవలల గురించి భారతిలో 1967

ప్రాంతంలో చాలా విపులమైన సమీక్షను నవలా కుటుంబం పేరుతో ప్రకటించారు. స్వీయ చరిత్రాత్మకమైన తెలుగు నవల అని నవీన్ వేకువ పత్రికలో అధ్యయనశీలమైన మంచి వ్యాసం ప్రకటించారు. 1980 వ సంవత్సరం జనవరి సంచికగా 'అభ్యుదయ' తెలుగు నవలకాలిక పరిణామాన్ని విమర్శించే ప్రత్యేక సంచికగా వెలువడింది. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి స్మృతికి అంకితమైంది. గడచిన దశాబ్ది తెలుగు నవల వివిధ పరిణామాలను ముఖ్యంగా విశ్లేషిస్తూ ఈ అభ్యుదయ సంచిక తెలుగు నవల తీరు తెన్నులను సమీక్షించే రచనలు ప్రకటించింది.

శ్రీ డి. రామలింగం భారతి, స్రవంతి పత్రికలలో గోపీచంద్, పద్మరాజు, బుచ్చిబాబుల రచనా శిల్పాన్ని గురించి, వస్తువరణం గురించి, రచనా విశిష్టతను గురించి విశ్లేషణాత్మకమైన వ్యాసాలు ప్రకటించారు.

శ్రీ ఆర్.ఎస్. సుదర్శనం వివిధ పత్రికలలో, ప్రత్యేక సంచికలలో తెలుగునవల గూర్చిన ప్రతిభా పూర్ణమైన అంశాలు ప్రతిపాదించారు. కళాసాగర్ సంస్థ ప్రకటించిన సప్తమ వార్షిక సంచికలో తెలుగులో తాత్త్వికనవల గూర్చి శ్రీ సుదర్శనంగారు విశిష్టమైన రచన ప్రచురించారు.

నాగార్జున విశ్వవిద్యాలయం, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయాలలో ఉన్నవవారి మాలపల్లిపై పరిశోధన కృషి జరిగింది. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో మహిళల నవలల గూర్చిన పరిశోధన విశ్లేషణకు పిహెచ్.డి. పట్టం లభించింది ఒక మహిళకు. ఇతర విశ్వ విద్యాలయాలలో కూడా ఇప్పుడు ఆధునిక సాహిత్యం, అందునా ముఖ్యంగా నవలను గూర్చి పరిశోధన కృషిపట్ల ఆసక్తి పెరుగుతున్నది. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగు నవలలో మహిళ చిత్రణ గూర్చిన పరిశోధన జరుగుతున్నది. విశ్వనాథ నవలల్లో చిత్రించిన ప్రేమ, దాంపత్య జీవితాల విశ్లేషణను గూర్చి కూడా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒక అభ్యర్థి పరిశోధన కృషి సాగిస్తున్నారు. తెలుగు నవలలోని కుటుంబ జీవితంపై ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రసిద్ధ కథా, నవలా రచయిత్రి శ్రీమతి సి. ఆనందారామంకు డాక్టరేట్ బహూకరించింది. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగులో చారిత్రక నవలపై పరిశోధన జరిగింది. తెలుగుదేశంలో ఇప్పుడు విశ్వవిద్యాలయాలైతే నేమి, స్నాతకోత్తర కేంద్రాలయితే నేమి పదికి పైగానే ఉన్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా పరిశోధక విద్వాంసులు తమ విద్యార్హతలను మెరుగుపరుచుకొనే నిమిత్తం ఆధునిక సాహిత్య ధోరణులను గూర్చి పరిశోధనలు కొనసాగిస్తున్నారు.

సాలుకు అరవై డెబ్బై నవలలు కనీసంగా నేడు వెలువడుతున్నాయి. తెలుగులో అచ్చం సాహిత్య పత్రికలు, పరిశోధన వ్యాసంగాన్ని ప్రోది చేసేవి ప్రోత్సహించేవి అయిన పత్రికలు లేకపోయినా వైయక్తికమైన కృషి బాగానే కొనసాగుతున్నది. తెలుగు నవల పుట్టిన దశాబ్దంలోనే అంతర్జాతీయమైన గుర్తింపు కూడా పొందింది. ఇంగ్లీషులోకి అనూదితమై విదేశంలో ప్రచురణ కూడా పొందింది. 1887 వ సంవత్సరం లండన్ టైమ్స్ పత్రికలో వీరేశలింగం పంతులు రాజశేఖర చరిత్రం ఇంగ్లీషు అనువాదమైన 'ఫార్చ్యూన్స్ వీల్' సమీక్షితమైంది.

యువభారతి వారు 1975 వ సంవత్సరంలో 'తెలుగు నావెల్' అనే పేరిట తెలుగు నవలకు ప్రాతినిధ్యం వహించే వాటిని, ప్రముఖమైన వాటిని పన్నెండింటిని ఎన్నికచేసి ఇంగ్లీషులో సమీక్ష చేయించారు. ఈ గ్రంథంలోని సమీక్షలు చాలా ప్రతిభావంతంగా ఉన్నాయి.

గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర', చలం 'బ్రాహ్మణీకం' బుచ్చిబాబు 'చివరకు మిగిలేది',

తెన్నేటిసూరి 'చంఘిజ్‌ఖాన్', జి. వి. కృష్ణారావు 'కీలు బొమ్మలు', ఉన్నవ 'మాలపల్లి', విశ్వనాథ 'వేయి పడగలు', వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి', బలివాడ కాంతారావు 'దగాపడిన తమ్ముడు' శీలా వీర్రాజు 'మైనా', బీనాదేవి 'హేంగ్ మి క్విక్', దాశరథి రంగాచార్యుల 'చిల్లర దేవుళ్ళు' నూరేళ్ళ తెలుగు నవలకు ప్రాతినిధ్యం వహించేవిగా యువభారతి వారీ సమీక్షా గ్రంథం వెలువరించారు. మరో పద మూడు నవలను కూడా ఎంపికచేసి ఇంకొక సంపుటం కూడా వెలువరించే ఉద్దేశం వ్యక్తపరిచారు కాని ఆ ప్రయత్నం ఆకృతి ధరించినట్లులేదు. కేంద్ర సాహిత్య అకాడమీ భారతీయ సాహిత్యం (ఇండియన్ లిటరేచర్) పత్రికలో శ్రీ డి. రామలింగం మాలపల్లిని గూర్చి సమీక్షాత్మకమైన విపుల వ్యాసం ప్రకటించారు. ఇరుగు పొరుగు భాషా సాహిత్యాలైన తమిళ, మల యాళ, కన్నడాల వలె తెలుగు నవల అంతర్జాతీయ మైన పరిచయమూ, గుర్తింపూ ఇంతవరకూ పొంద లేదు. ఆయాభాషల్లో తమ మాతృభాషపట్ల, ప్రాంతీయ సాహిత్యం పట్ల మమకారమూ, అభిమానం గలిగి, ఇంగ్లీషులో కూడా వ్రాయడంలో మంచి ప్రతిభగల రచయితలు, విదేశ విశ్వవిద్యాలయాలలో వివిధశాఖల్లో ఆచార్యత్వం వహిస్తున్నవారూ తమతమ నవలలను, కథలను ఇంగ్లీషు ద్వారా అంతర్జాతీయ పాఠకుల కందిస్తున్నారు. తెలుగులో అటువంటి మంచి నవలలు ఎంపిక చేసి ఇంగ్లీషు ద్వారా ఇతరులకు అందించే ప్రయత్నం జరగటం లేదు. జరిగినా అతి తక్కువ. తెలుగులో ఇటీవల వచ్చిన చాల మంచినవల 'ఇంక్రెడి బిల్ గాడెస్' (డా. కేశవరెడ్డి)ను డా. ఎమ్. శివరామ కృష్ణ ఇంగ్లీషులోనికి అనువదిస్తున్నారు.

తెలుగు నవలకు నూట పదేళ్ళ చరిత్ర వుంది. భారతీయ భాషల్లో వచ్చిన గొప్ప నవలలకు దీటుగా తెలుగులో కూడా ప్రతిభావంతులైన రచయితలు కొన్ని నవలలు రాశారు. కాని హిందీ ద్వారా, ఇంగ్లీషు ద్వారా జాతీయ అంతర్జాతీయ పరిగణనం తెలుగు నవలారచయిత పొందే యత్నం ఇప్పుడిప్పుడే మొదలైంది. నేషనల్ బుక్ ట్రస్ట్ వారి ఆదాన్ ప్రదాన్ ప్రణాళికలో యువతరం ప్రతిభావంతులైన తెలుగు రచయితల నవలలు కొన్ని ఇతర భారతీయ భాషలలోకి అనూదితమైనాయి. ఇంకా కొన్ని అను వాదం పొందుతున్నాయి.

తెలుగు నవలగూర్చి సర్వసమగ్రమైన విమర్శ విశ్లేషణ గ్రంథం ఇంకా రూపొందవలసే ఉన్నది.

ఇక కథలు, కథానికలను గూర్చి ఈ నూరేళ్ళలో జరిగిన పరిశోధన ఇప్పుడు ప్రస్తావితం. 1820, 22 ప్రాంతాలకే వెన్నెలకంటి సుబ్బారావు మద్రాసు దేశ భాషా పాఠ్యపుస్తక నిర్ణాయక సంఘం వారికి వినోద కథలు (ప్లీజింగ్ టేల్స్) పేరిట నీతి, లోకరీతి తెలియజేసే తెలుగుకథలు కొన్ని కూర్చి యిచ్చాడు. ఆనాడు పాఠశాలల్లో పాఠ్యపుస్తకంగా కూడా అది నిర్ణయించబడింది. ఈ వినోద కథల పుట్టు పూర్వోత్తరాలను గూర్చి వెన్నెలకంటి సుబ్బా రావు జీవయాత్ర చరిత్రనుంచి తెలుసుకోవచ్చు. వెన్నెలకంటి సుబ్బారావు ఆనాటి సదర్ ఆదాలత్ కోర్టు మద్రాసులో భాషా పరివర్తకుడిగా అనువాద శాఖ ప్రధానాధికారిగా చాలా గణనీయంగా పనిచేసి పై అధికారుల మెప్పు పొందిన ప్రతిభావంతుడు. ఈయన యేనుగుల వీరాస్వామయ్యగారి సమకాలికుడు. బంధువుకూడాను. పందొమ్మిదో శతాబ్ది ప్రథ మార్ధంలో ఆనాటి ఉన్నత న్యాయస్థానాలలో తెలుగు వారు అత్యంత ప్రతిభ చూపారు. ఉన్నతమైన పదవులెన్నిటినో పొందారు. కుంఫిణీవారి కాలంలో, ఇంగ్లీషువారు తెలుగు నేర్చుకోవటానికీ, అప్పుడప్పుడే ప్రభుత్వ విద్యాశాఖ నెలకొల్పుతున్న పాఠశాలల్లో పాఠ్యపుస్తకాలుగా నిర్ణయించటానికీ కథల పుస్తకాలను దేశీయ పండితులచే కుంఫిణీ అధికారులు రచింప చేశారు. వీటి వివరాలు స్వర్గీయ నిడుదవోలు వెంకట

రావుగారి ఆంధ్ర వచన రచనా పరిణామం నుంచి తెలుసుకోవచ్చు. శుకసప్తతి కథలు, పంచతంత్ర కథలు, చార్‌దర్వేష కథలు మొదలైనవి కిందటి శతాబ్దిలో ప్రసిద్ధమైన కథలు. చిన్నయసూరిగారికన్నా ముందుగా చెన్న రాజధాని పాఠశాలలో ప్రధానాంధ్ర పండిత పదవి నధిష్ఠించిన రావిపాటి గురుమూర్తిశాస్త్రి పంచతంత్ర కథలను వాడుకభాషలోనే కూర్చడమూ, అది బహుకాలం పాఠ్య పుస్తకంగా ఉండటమూ గిడుగు రామమూర్తిపంతులుగారు చాలా చోట్ల ప్రస్తావించారు. కందుకూరి వీరేశలింగం పంతులు కూడా తమ వ్యాసాలలోను, స్త్రీలకు పిల్లలకు ఉపయుక్తంగా కూర్చిన రచనలలోను కొన్ని కథలు కూర్చారు. సమకాలీన వార్తాపత్రికలలోని వార్తలు ఆధారంగాను, పరంపరగా వస్తున్న నీతి కథలను ఆధారంగా చేసుకొని పంతులుగారు కొన్ని కథలు వ్రాశారు. అయితే ఈ కథారచనా వ్యాసంగమంతా వేల సంవత్సరాలుగా దేశీయమైన సంప్రదాయ కథా వాఙ్మయ శాఖగా వర్ధిల్లిందే కాని, అధునిక ప్రమాణాలతో ఒక నూత్న సాహిత్య ప్రక్రియగా నేడు మనం భావిస్తున్న శాఖలోకి చేరదు.

ఆధునిక ప్రమాణాలతో తెలుగు కథకి రూపరేఖ తేర్పరచినవారు గురజాడ అప్పారావు. అప్పారావుకన్నా ముందే ఆచంట సాంఖ్యాయనశర్మ తాము ఆనాడు నడుపుతున్న కల్పలత పత్రికలో కొన్ని కథలు-అంటే నేటి ప్రమాణాలతో మనం అనుకొనే సాహిత్య ప్రక్రియకు సంబంధించినవి - ప్రచురించారని అత్యంతాభినివేశంతో స్వర్గీయ పురిపండ అప్పలస్వామి వాదిస్తూ వచ్చారు. సాంఖ్యాయనశర్మగారు ప్రకటించిన కథలలో కొంత సంఘ జీవితం ప్రతిబింబింప చేసినా, శిల్ప నిర్వాహణలోగాని, ఇతివృత్త వరణంలోగాని, విన్యాసంలోగాని, సంభాషణాదికంలో కాని జానపదమైన కాల్పనిక బాణీయే ఎక్కువగా కనిపించటంవల్ల ఆధునిక ప్రక్రియగా ఆ రచనలు సంభావించలేము. కాబట్టి ఆంధ్ర భారతి పత్రికలో 1910 ప్రాంతంలో గురజాడ అప్పారావు నేటి నవ్యప్రక్రియ, పాఠక లోకంలో విశేష ప్రాచుర్యాన్ని పొందిన చిన్న కథను ప్రారంభించినట్లు స్పష్టం. ఈ కథ లేదా కథానిక అనే పేరు మనం ఎరువు తెచ్చుకొన్నదనీ, దేశీయమైన 'తిత్తవ' అంటే చిన్నకథ అనే స్ఫూర్తి ఉత్తరాంధ్రములో ఉందనీ, ఆ 'తిత్తవ' అనే పదాన్ని ప్రచారంలోకి తేవాలనీకూడా పురిపండావారు పదే పదే ప్రస్తావించేవారు. 'తిత్తవ' అంటే దృష్టాంతమనో, నీతికథ అనో, పిట్టకథ అనో మాండలికమైన స్ఫూర్తి ఉండవచ్చుగాక. సుమారు అర్ధశతాబ్దిగా ఈ నవ్యప్రక్రియకు తెలుగులో కథ లేదా కథానిక, ఇంకా చిన్నకథ అనే పేరు బాగా రూఢమైపోయింది.

అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుల త్రిలింగ చిన్నకథలు - సమకాలిక సాంఘిక వాతావరణానికి సంబంధించినవి కావు-పురా సాంఘిక వాతావరణానికి సంబంధించినవి. అలాగే షేక్స్పియర్ కథలు కూడా ఇంగ్లీషు నుంచి అనువాదాలు. త్రిలింగ పత్రిక స్థాపక సంపాదకులు ఉమాకాంత విద్యాశేఖరులే. త్రిలింగ 1914 లో ప్రారంభమైంది. ఇందులో ఆయన కొన్ని కథలు ప్రకటించారు. 1920లో సాహితి పత్రిక స్థాపనమైన నాటినుంచి తెలుగు కథ శిల్పవైవిధ్యం పెంపొందించుకొన్నది. అంతకు పూర్వం ఆంధ్రపత్రిక ఉగాది సంచికలలో కొమర్రాజు లక్ష్మణరావు, కోటంరాజు పున్నయ్యలవంటి ప్రతిభావంతులు కొన్ని కథలు ప్రకటించారు. ఇంగ్లీషు చదువులు; నగరీకరణం; సంధియుగం పరిణామాలు ఆనాటి కథకులంతా దృష్టిలో పెట్టుకొన్నారు. సువర్ణలేఖ పత్రిక ఆ రోజుల్లో కొవ్వూరునుంచి వెలువడేది. ఈ పత్రికలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు కొన్ని కథలు వ్రాశారు. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో పానుగంటి ప్రకటించిన 'కానుగ చెట్టు' గొప్ప శిల్పవైభవంగల కథ. గొప్ప భావుకులు పానుగంటివారు.

ఇరవయ్యో శతాబ్ది ప్రథమపాదంలో ప్రకటితమైన తెలుగు పత్రికలన్నీ తెలుగు జనానా, హిందూ జన సంస్కారిణి, భారతి (పిఠాపురం నుంచి 1909 ప్రాంతాలలో మొదలైంది), సువర్ణలేఖ, ఆంధ్రభారతి, కృష్ణాపత్రికలు సేకరించి పరిశీలిస్తే తెలుగు కథానిక శైశవరేఖలు స్పష్టపడతాయి.

1920లో మొదలైన సాహితి పత్రికలో చింతా దీక్షితులు, మునిమాణిక్యం, విశ్వనాథ, కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, చలం, వఝ్ఝు బాబూరావులు మంచి కథలు రాశారు. గురజాడ అప్పారావు తర్వాత తెలుగు కథని సుసంపన్నం చేసిన ప్రతిభావంతుడు దీక్షితులు. సాహితి పత్రిక తర్వాత సఖిపత్రికలో గొప్ప కథలు రాశారు చింతా దీక్షితులు.

తెలుగు కథా ప్రక్రియ చరిత్రలో 1922 వ సంవత్సరం బందరు నుంచి వెలువడ్డ 'శారద' పత్రికకు విశిష్టమైన స్థానమున్నది. 'భాసుడు' అనే గుప్త నామంతో చాలా గొప్ప కథలు రచించిన వారెవరో గాని 'శారద' పత్రికలో మంచి కథలు రాశారు. ఆయన వ్రాసిన 'లాజరస్' వంటి కథలు ఇవాళ్టికీ ఎంతో మెచ్చదగినవి. కథ, కథనం, శిల్పం, ఎత్తుగడ, నిర్వహణం, ముగింపు వంటి విషయాలలో 'లాజరస్' వంటి కథలు నేటికి కూడా అగ్రశ్రేణి కథలు. 'లాజరస్' బైబిల్‌లోని ఒక ప్రముఖ పాత్ర. ఆంధ్ర శేషగిరిరావు సంఘంలో ఆర్థికనీతిని గురించిన మంచి కథ వొకటి 'శారద'లో రచించారు. శారద పత్రిక కథలకు చాలా ప్రోత్సాహమిచ్చినట్టు కన్పిస్తుంది. చిల్లరిగె శ్రీనివాసరావుగారి వంటి ప్రముఖ విద్యావేత్తలు, చరిత్ర రచయితలు శారద పత్రికలో మంచి సాంఘిక కథలు రచించారు. అడవి బాపిరాజు గారి హిమబిందు నవల ఈ శారద పత్రికలోనే ప్రారంభమైంది. ఈ పత్రిక రెండు సంవత్సరాలు మాత్రమే నడిచి ఆగిపోయింది.

1924 లో భారతి పత్రిక వెలువడింది. నాటి నుంచి నేటిదాకా సుమారు ఈ అరవై సంవత్సరాలు కథా సాహిత్యానికి భారతి పత్రిక ఎనలేని సేవ చేసింది. చేస్తున్నది. కథా రచనలో వచ్చిన ప్రయోగాలు, శిల్పవైవిధ్య పరిణామాలు భారతి పత్రిక చక్కగా ప్రతిబింబింపచేసింది. తెలుగులో సుప్రసిద్ధ కథకులంతా భారతిలో తమ రచనలు వెలువరించిన వాళ్ళే. కొన్ని వందల కథలను ప్రకటించి వుంటుంది భారతి పత్రిక. భారతి వెలువడ్డ ఏడెనిమిదేళ్ళకు ఆంధ్ర శేషగిరిరావుగారు ఆంధ్రభూమి మాసపత్రికను ప్రారంభించారు. 1930 లోనే శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి 'ప్రబుద్ధాంధ్ర' ప్రారంభించారు. తాత కృష్ణమూర్తి, పురాణం కుమారరాఘవశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, కవికొండల వెంకటరావు, మొదలి సుబ్రహ్మణ్యశర్మ, కాళూరి రామారావులు ఆంధ్రభూమి పత్రిక ద్వారా లబ్ధప్రతిష్ఠులైన కథారచయితలైనారు. ఈ శతాబ్ది నాలుగో దశాబ్దంలో పత్రికా బాహుళ్యంవల్ల తెలుగు కథ కూడా అనేక అందచందాలు రూపుదిద్దుకొంది. ఢంకా, వినోదిని, చిత్రగుప్త, జ్వాల, కళ, ఉదయిని, తెలుగుతల్లి వంటి పత్రికలు తెలుగులో కథా రచయితలెందరినో సృష్టించాయి. 1936 లో నవ్యసాహిత్య పరిషత్తు తరపున ప్రతిభ పత్రిక ప్రారంభమైంది. ఈ పత్రిక పట్టుమని పదేళ్ళు కూడా సాగక పోవటం నవ్యసాహిత్యానికి పెద్ద ఆలంబనం కరువు కావటమేనని చెప్పాలి. చింతా దీక్షితుల వటీరావు కథలు ప్రతిభలో వచ్చాయి. ప్రతిభలో చాలా ప్రామాణికమైన, ప్రౌఢమైన పుస్తక సమీక్షలుండేవి. నోరి నరసింహశాస్త్రిగారి వంటి విద్వాంసులు, తల్లావఝ్ఝలవారి కథలను శాణోపలంగా సమీక్షించి పెదవి విరిచారు ప్రతిభలో సమీక్షిస్తూ అంటే, అనాటి సాహిత్య ప్రమాణాలు, మర్యాదలు ఎట్లా ఉండేవో తెలుసుకోవచ్చు. సృజనాత్మక సాహిత్యానికి ప్రతిభ పత్రిక చేసిన మేలు అపారం. సాహిత్య వికాసాన్ని సుసంఘటితమైన ఉద్యమ స్ఫూర్తితో

ప్రోదిచేసిన మేటి సాహితీపరులు నవ్య సాహిత్య పరిషత్తు సభ్యులు. అన్ని ప్రక్రియలలో అగ్రశ్రేణి రచనలు వెలువరించారు వాళ్ళు. అంతర్జాతీయ కథల పోటీలకు తెలుగు కథలను ఎంపికచేసే బాధ్యతను భారతి పత్రిక స్వీకరించి, పాలగుమ్మి పద్మరాజు గారికి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టింది. పురాణం సుబ్రహ్మణ్యశర్మ, బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, బుచ్చిబాబు, రావూరి భరద్వాజ, పన్యాల రంగనాధరావు, హితశ్రీ వంటి అగ్రశ్రేణి కథా రచయితలు ఈ పోటీలలో పాల్గొనటం విశేషం.

ఈ శతాబ్ది పూర్వార్థం గడచినదాకా కథా రచయితలు తమ కథల సంకలనాలు రావాలని ఉత్సహించినట్లు తోచదు. ఈ శతాబ్ది పూర్వార్థం గడిచే సరికి మరికొన్ని పత్రికలు బయలుదేరాయి. వార, పక్ష, మాస పత్రికలు తక్కిన అన్ని ప్రక్రియలకన్నా కథానిక ప్రక్రియనే ఆదరించాయి. ఎక్కువ మంచి కథలను ప్రచురించినప్పుడు మాత్రమే పాఠకుల ఆదరణను, ప్రాచుర్యాన్ని పొందగలమని గ్రహించాయి.

ఆదర్శ గ్రంథ మండలి అనే సాహిత్య ప్రచురణ సంస్థ విజయవాడ నుంచి కథా సాగరం పేరుతో ప్రసిద్ధ కథకుల సంకనాలు ప్రచురించింది. లబ్ధ ప్రతిష్ఠులైన రచయితలవే కాక యువతరం రచయితల కథా సంపుటాలను కూడా ఈ సంస్థ ప్రచురించటం విశేషం. మల్లాది రామకృష్ణ శాస్త్రి, బుచ్చిబాబు, గోపీచంద్‌ల కథాసంకలనాలు ప్రచురించి, దేశి కవితామండలి, ఆదర్శ గ్రంథ మండలి వంటి సాహిత్య ప్రచురణ సంస్థలు తెలుగు కథా రచయితల కృషిని ఒకచోట చేర్చటం జరిగింది.

ఒక రచయిత కథా సంపుటులే కాకుండా వివిధ రచయితల కథా సంకలనాలు కూడా వెలువడి ఒకే తరంలో ఒకచోట కథా ప్రక్రియ వికాసం, వైవిధ్యం దర్శించే అవకాశం కలిగింది. దక్షిణ భారత పుస్తక సంస్థవారు వివిధ రచయితల తెలుగు కథలను రెండు సంపుటాలుగా తెచ్చారు. ఈ కథలను తమిళ, మలయాళ, కన్నడ భాషలలోను అనుసరింపజేసి పుస్తక రూపాన ప్రచురింప చేశారు.

1946 వ సంవత్సరం నాటికే సాధన సమితి వారు సికింద్రాబాద్ నుంచి యావదాంధ్ర కథకులకు కథల పోటీని నిర్వహించటం విశేషం. ఈ పోటీకి న్యాయనిర్ణేతలుగా చింతా దీక్షితులు, అడవి బాపిరాజు, సురవరం ప్రతాపరెడ్డిగారలు వ్యవహరించారు. కథా రచయితలలో మహిళలు మగవారికన్నా ఏ మాత్రం వెనకపడకపోవటం ముదావహమన్నారు దీక్షితులు, ఈ పోటీ కథల బహుమానాలను గూర్చి ప్రస్తావిస్తూ.

గొప్ప కావ్యాలు రచించకపోయినా, పాండిత్య ప్రాగల్భ్యం ప్రదర్శించకపోయినా, విమర్శ ప్రతిభ విస్తరింప చేయకపోయినా సృజనాత్మక ప్రతిభాశాలురైన అగ్రశ్రేణి తెలుగు కథకులను తక్కిన కవి పండితులతో పాటుగా ఆదరించి అభిమానించారు తెలుగు పాఠకులు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కథకుడిగానే తెలుగు పాఠకులకు మిక్కిలి ప్రీతిపాత్రుడు. మునిమాణిక్యం నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, మల్లాది రామకృష్ణశాస్త్రి కథకులుగానే తెలుగు వారికి అత్యంత ఇష్టులు. ప్రీతిపాత్రులు.

వేలూరి శివరామశాస్త్రిగారు ఎంత గొప్ప కవి. పండితులైనా శతావధాని అయినా కథకుడిగా కూడా ఆయన తెలుగువారికి చిరస్మరణీయుడు. మల్లాది రామకృష్ణశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి తెలుగు కథను సాహిత్య శాస్త్రీయం చేశారు. కథలను శిల్ప పరమావధులుగా తీర్చి దిద్దారు.

ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రముఖ వార పత్రికలు ప్రతి సంవత్సరమూ కథారచనా పోటీలు

నిర్వహిస్తున్నాయి. ఈ పోటీలు యువతరం రచయితలకు ఎంతగానో ప్రోత్సాహకాలైనాయి. చాలా మంచి కథలు ప్రతి ఏడూ వెలువడుతున్నాయి. నేడు ప్రతి సంవత్సరమూ సహస్రాధికంగా కథలు వెలువడుతున్నాయంటే అది అతిశయోక్తి కాదు. నేడు విశ్వవిద్యాలయాల - తెలుగుశాఖలలో కూడా ఆధునిక సాహిత్య అధ్యయనం పట్ల విశ్లేషణం పట్ల ఆసక్తి ఎక్కువైంది. బుచ్చిబాబు, కరుణకుమార, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, గోపీచంద్, కుటుంబరావు, మునిమాణిక్యం, చలం, మల్లాది రామకృష్ణశాస్త్రి వంటి గొప్ప కథారచయితల కథారచనా శిల్పాన్ని గురించి వివిధ విశ్వ విద్యాలయాలలో పరిశోధన కృషి జరిగింది. ఇంకా కొనసాగుతున్నది. మధురాంతకం రాజారాంగారి కథలలోని ప్రాంతీయత, మాండలికతలను గూర్చి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో పరిశోధన జరగడం ఈ తరం రచయితలకు గొప్ప గుర్తింపుగా ఎంచవచ్చు. కాళీపట్నం రామారావుగారి కథలను గూర్చి 'కథాయజ్ఞం' పేరిట ఇటీవల సమీక్షా సంకలన గ్రంథం వచ్చింది. రామారావుగారి కథల సామాజిక చైతన్యాన్ని, కథా కథన శిల్పాన్ని ఎందరో యువ రచయితలు ఈ సంకలన గ్రంథంలో విశ్లేషించి చూపారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఆధునిక సాహిత్య ప్రక్రియగా తెలుగుకథ ఆవిర్భవించిన నాటినుంచీ నేటివరకూ ఆ యా తరాల, కాలాల, పదికాలాలపాటు నిలిచి ఉండగల ప్రాతినిధ్య కథలను సంపుటీకరింప చేయటం అభినందించాల్సిన విషయం. ఈ సంపుటీకరణం కూడా సుప్రసిద్ధ సృజనాత్మక రచయిత అయిన శ్రీ మధురాంతకం రాజారాం గారికి అప్పగించటం కూడా మెచ్చదగిన సంగతి. అర్ధశతాబ్ది తెలుగు కథలు అప్పుడే రెండు సంపుటాలుగా శ్రీ రాజారాం సాహిత్య అకాడమీ ద్వారా ప్రచురింపచేశారు. ఈ తరం కథకుల ప్రాతినిధ్య రచనలుకూడా శ్రీ రాజారాంగారు ఎంపిక చేస్తున్నారు. నేషనల్ బుక్ ట్రస్ట్ వారు కూడా తెలుగుకథ మేలిమిని అన్యభాషల వారికి తెలియచేయడానికి ఒక సంపుటిని తెచ్చారు. ఈ కథా సంకలన కర్తలు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ వాకాటి పాండురంగారావులు.

తెలుగుకథ శిల్ప నిర్మాణ రీతులను గూర్చి పరిశోధించి ఉస్మానియా విశ్వవిద్యాలయం పిహెచ్.డి. డిగ్రీని పొందారు శ్రీ పోరంకి దక్షిణామూర్తి. తెలుగుకథలోని వాస్తవికత అనే అంశంపై శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పరిశోధన సాగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఇటీవల, అంటే 1982లో సుప్రసిద్ధ తెలుగు కథారచయితలను గూర్చిన పరిశీలనాత్మక వ్యాస సంకలనం వెలువరించారు. గురజాడ అప్పారావు కథలను గూర్చి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి పరిశోధన డిగ్రీ సముపార్జించిన శ్రీమతి భాస్కర స్వర్ణాంబ, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిపై పరిశోధన కృషి జరిపి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్. డి. డిగ్రీ పొందిన శ్రీ చామర్తి కనకయ్య, కొడవటిగంటి కుటుంబరావు సాహిత్య కృషిని గూర్చి విశేష విషయ సేకరణం చేసిన శ్రీ కేతు విశ్వనాథరెడ్డి, వేటూరి శివరామశాస్త్రి మహోదయుల కృతులను సమీక్షించి పిహెచ్.డి. సముపార్జించుకొన్న శ్రీ జంధ్యాల మహతీ శంకర్ ప్రభృతులు ఈ పరిశీలనాత్మక వ్యాస సంకలనంలో విశిష్టమైన సమీక్షలు చేశారు. మల్లాది వారి గురించి శ్రీ ఆరుద్ర వ్రాశారు. బుచ్చిబాబు కథాకథన వైశిష్ట్యం గురించి శ్రీ డి. రామలింగం వ్రాశారు. ఆధునిక ప్రక్రియగా తెలుగుకథ మొదలైననాటినుంచి, అంటే గురజాడ నుంచి అత్యంతాధునికుడైన గోపీచంద్ వరకు కథా రచనలో విశిష్ట వ్యక్తిత్వం నిరూపించుకొన్న పన్నెండుమంది కథా రచయితలనుగూర్చి ఈ వ్యాస సంకలనంలో చేర్చటం జరిగింది.

బొంబాయినుంచి 'జైకో' సాహిత్య ప్రచురణ సంస్థవారు శ్రీ ఎ. ప్రుశశీధర్, శ్రీ వాడ్రేవు పతంజలి గారలు సంపాదకులుగా, అనువాదకులుగా తెలుగు కథల సంకలనాన్ని ఇంగ్లీషులో ప్రచురించారు. సుమారు పాతికకథలదాకా ఇందులో ఉన్నాయి. ధర్మ యుగ్, కహానీ, ఆజ్ కల్, సప్తాహిక్ హిందూస్తాన్ వంటి హిందీ పత్రికలలో తెలుగు కథల అనువాదా లెన్నో వెలువడ్డాయి. దక్షిణ భారత హిందీ ప్రచార సంస్థవారు తెలుగు కథకుల ప్రాతినిధ్య సంకలనాన్ని వెలువరించారు. వారు నిర్వహించే హిందీ పరీక్షలకు ఈ కథల సంపుటి పాఠ్యపుస్తకంగా కూడా నిర్ణీతం కావటం విశేషం. డా. భీమసేన్ నిర్మల్, శ్రీ దండ మూడి మహీధర్, శ్రీ బాలశౌరిరెడ్డి, శ్రీ మల్లేశ్వర రావు, డా. విజయరాఘవరెడ్డి, డా. అప్పలరాజు వంటి హిందీ విద్వాంసులు తెలుగు కథల నెన్నిటినో హిందీ లోకి అనువదించి, అన్యభాషీయులకు తెలుగుకథ అంద చందాలు పరిచయం చేస్తున్నారు. దక్షిణ భారతీయ భాషలలోకి కూడా తెలుగు కథ వెళ్ళవలసినంతగా వెళ్ళటం లేదనిపిస్తున్నది.

ఆధునిక తెలుగు సాహిత్యంలో నవలతో సరి సమానంగా ఆదరణ పొందుతున్న ప్రక్రియ కథానిక. ప్రతివారం సుమారు నూరు కథలైనా వెలువడుతున్నా యని ఒక అంచనా. ప్రత్యేక సంచికలలోను, సాహిత్య చర్చాగోష్ఠులలోను కథా రచనను గూర్చిన విమర్శ విశ్లేషణలు ప్రముఖస్థానం వహిస్తూనే ఉన్నాయి. కేవలం కథలకు మాత్రమే పరిమితమైన పత్రికలు కూడా ఇదివరలో కొన్ని వెలువడ్డాయి. ఇప్పుడుకూడా ఒకటి రెండు వెలువడుతున్నాయి.

కేంద్ర సాహిత్య అకాడమీ వారు కథా మంజూష పేరుతో పధ్నాలుగు తెలుగు కథలను ఎన్నిక చేసి పుస్తక రూపాన ప్రచురించారు. దీని సంపాదకులు శ్రీ శివశంకరస్వామి. శ్రీ స్వామి ఈ గ్రంథానికి విలువైన ఉపోద్ఘాతం వ్రాశారు. దీక్షితులు, నోరి వంటి తొలి తరం కథా రచయితలతో పాటు కొమ్మూరి వేణుగోపాలరావు, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, బలివాడ కాంతారావు గారలవంటి యువతరం రచయితల కథలు కూడా శ్రీ శివశంకరస్వామి ఈ సంపుటానికి ఎన్నిక చేశారు.

ఏడు దశాబ్దాల తెలుగు కథని గూర్చి ఇంత వరకు సమగ్రమైన విశ్లేషణాత్మకమైన పరిశోధన జరగలేదు. ఈ శతాబ్దిలో వివిధ ప్రక్రియలలో లబ్ధ ప్రతిష్ఠులైన ప్రముఖ రచయితులందరూ కూడా కథా రచనం కూడా చేపట్టటం గమనార్హం. ఒక్క కథైనా రచించని మహాకవి, మహా రచయిత పందొమ్మిది వందల తర్వాత సుమారు అర్ధ శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలో కనపడరేమోననే చెప్పాలి.

కవిత్వంలో లాగే కథా రచనలో కూడా అనేక ప్రయోగాలు చోటు చేసుకొన్నాయి ఈ ఏడు దశాబ్దాలలో. వీటన్నిటిని విశ్లేషించి, పరిశోధనాత్మక మైన గ్రంథం వెలువరిస్తే తెలుగు కథ విశేషాలు మరెన్నో దర్శించవచ్చు.

# తెలుగులో భాషాశాస్త్ర పరిశోధన

—కె. కె. రంగనాథాచార్యులు

ఇంతవరకు తెలుగులో జరిగిన భాషా శాస్త్ర పరిశోధనను అనుశీలన చేయటం ప్రస్తుత వ్యాస విషయం. భాషా శాస్త్రాన్ని నిర్వచించటంలో, దాని పరిధిని నిర్ణయించటంలో కొన్ని అభిప్రాయ భేదాలు లేకపోలేదు. క్రీ. శ. 18 వ శతాబ్ది ఉత్తరార్ధంలో పాశ్చాత్యులు సంస్కృతం నేర్చుకొని, ఆ భాషకు గ్రీక్, లాటిన్ మొదలైన యూరప్ ఖండంలోని భాషలకు గల సంబంధాన్ని గుర్తించటంతో భాషల తులనాత్మక పరిశోధనకు, ప్రపంచ భాషా కుటుంబాల నిర్ణయానికి పునాది పడింది. 19 వ శతాబ్దంలో యూరోప్‌లోను, ఇతరత్ర జరిగిన భాషా పరిశోధనలు ముఖ్యంగా తులనాత్మక, చారిత్రక రంగాలకు సంబంధించినవి. 20 వ శతాబ్ది పూర్వార్ధంలో ముఖ్యంగా వర్ణనాత్మక భాషా శాస్త్రం అభివృద్ధి చెందింది. 1933 లో Bloom Field 'Language' అవతరణతో భాషా పరిశోధన మరింత శాస్త్రీయతను సంతరించుకుంది. ఈ కాలంలో అనేక అలిఖిత భాషలకు వ్యాకరణాలు వచ్చాయి. అంతకుముందు సంస్కృతం, గ్రీక్, హీబ్రూ మొదలైన భాషల వ్యాకరణాల చట్రంలో ఇతర భాషలకు వ్యాకరణాలు రాస్తూ ఉండేవారు. కాని, ఒక భాషను ఆ భాషా స్వభావాన్ని అనుసరించి వ్యాకరించాలనీ, ప్రతి భాషకు సంబంధించిన వర్ణ నిర్మాణం, పద నిర్మాణం, వాక్య నిర్మాణం, వ్యాకరణ విభాగాలు భిన్న భిన్నంగా ఉండవచ్చుని భాషా శాస్త్ర పరిశోధనలు నిరూపించాయి. ఈ దృష్టితోనే వర్ణనాత్మక వ్యాకరణాలు ఏర్పడ్డాయి. గ్రంథస్థ భాషలే కాకుండా వ్యావహారిక రూపంలో ఉన్న భాషా సమస్యలన్నీ భాషా పరిశోధనకు లక్ష్యాలు అయినాయి. భాషా సామాన్య సూత్రాలను నిరూపించే ప్రయత్నం కూడా ఈ కాలంలో జరిగింది. 1956 లో Noam chomsky 'Syntactic Structures' వెలువడటంతో భాషకు సంబంధించిన కొత్త సిద్ధాంతాలనేకం వచ్చాయి. భాషల నిర్మాణాన్ని వ్యాకరించటమే కాకుండా వాక్య నిర్మాణంలో ఉన్న అంతర్గత సూత్రాలను పరిశీలించి నిర్వహించటం ప్రారంభం అయింది. 19 వ శతాబ్దిలో గ్రంథాలు, ఇతర రికార్డులు ఆధారంగా ప్రత్యేక భాషలకు సంబంధించిన పరిశోధనలను Philology అని, తరువాతి కాలంలో బ్లూంఫీల్డ్ మొదలైనవారితో మొదలైనవారి భాషా శాస్త్ర సిద్ధాంతాల ఆధారంగా జరిగిన పరిశోధనలను Linguistics అని పేర్కొనటం జరుగుతున్నది. చామ్స్కీ నుంచే నిజమైన భాషా శాస్త్రం మొదలైందని విశ్వసించేవారు కూడా ఉన్నారు. తెలుగులో అన్నిటిని భాషా శాస్త్రం అనే వ్యవహరించటం జరుగుతున్నది. కాకపోతే బ్లూమ్‌ఫీల్డుకు ముందు ప్రాచీన భాషా శాస్త్రం అని, బ్లూమ్‌ఫీల్డు తరువాత నవీన భాషా శాస్త్రం అని మనం వ్యవహరించవచ్చు. తెలుగుకు సంబంధించి నంతవరకు తెలుగువారెవరు భాషాశాస్త్రరంగంలో కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించటం జరగలేదు. అభివృద్ధి చెందిన భాషా సిద్ధాంతాలను అనుసరించి తెలుగు భాషకు అన్వయిస్తూ మౌలికమైన పరిశోధనలను చేసినవారు, పరిశోధనా పద్ధతులలో కొత్త మార్గాలను చూపినవారు తెలుగువారిలో ఉన్నారు. ప్రాచీన భాషా శాస్త్ర పద్ధతులలోగాని, నవీన భాషా శాస్త్ర పద్ధతు

లలోగాని తెలుగు భాషను గురించి జరిగిన పరిశోధనలన్నీ ఈ వ్యాసపరిధిలోకి వస్తాయి. తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి సంబంధించిందనేది ఈ రోజు వివాదాస్పదమైన విషయం కాదు. ద్రావిడ భాషల తులనాత్మక పరిశోధనలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన వారు తెలుగు వారిలో ఉన్నారు. కాని అది ఈ వ్యాస పరిధిలోకి రాదు. చారిత్రక పరిశోధనలో భాగంగా తులనాత్మక పరిశోధనకు సంబంధించిన ఫలితాలను అవసరమైన చోట పేర్కొనటం జరుగుతుంది.

తెలుగు భాషా పరిశోధన అనేక రంగాలలో జరిగింది. మొదట విశ్వవిద్యాలయాలకు వెలుపల, తరువాత ఎక్కువగా విశ్వవిద్యాలయాల్లోను భాషా పరిశోధన జరిగింది. విశ్వవిద్యాలయాల్లో కూడా పిహెచ్.డి., ఎమ్.ఫిల్., మొదలైన డిగ్రీల కోసం జరిగినవి, డిగ్రీలతో సంబంధం లేకుండా కూడా జరిగినవి ఉన్నవి. స్వదేశీ విశ్వవిద్యాలయాలతో పాటు విదేశీ విశ్వవిద్యాలయాలలో కూడా తెలుగు భాషను గురించి పరిశోధన చేసినవారు, చేస్తున్నవారు ఉన్నారు. భారతదేశంలోని విశ్వవిద్యాలయాలలో భాషా శాస్త్ర శాఖలతో పాటు, తెలుగు శాఖలలో కూడా భాషా పరిశోధనలు జరిగాయి.

మొదట తెలుగు భాషను గురించి ఆధునిక పద్ధతులలో పరిశోధన చేసినవారు, వ్యాకరణాలు రాసినవారు పాశ్చాత్యులే. 19 వ శతాబ్ది పూర్వార్ధం నుంచే A. D. Campbell, C. P. Brown, A. H. Arden మొదలైన వారు భారతదేశంలో అధికారాల్లో ఉంటూ తెలుగు భాషకు వ్యాకరణాలు రాశారు. నిఘంటువులు నిర్మించారు. చిన్నయసూరి వంటివారు సంస్కృత వ్యాకరణ పద్ధతులతో, పారిభాషిక పదాలతో, సంస్కృత భాషా చట్రంలో ఇమిడించి తెలుగు భాషా వ్యాకరణాలను రచించడానికి ముందే తెలుగు భాషాస్వభావాన్ననుసరించి సమకాలీన తెలుగు భాషకు వీరు వ్యాకరణాలు రచించారు. శబ్దాల సాధు, అసాధు రూపాలను నిర్ణయించడంగా కాకుండా తెలుగు వాక్య నిర్మాణం మొదలైన అంశాల పైన వారు కొత్త వెలుగుల్ని ప్రసరింప చేశారు. ద్రావిడ భాషల తులనాత్మక పరిశీలనకు కాంప్‌బెల్ (Campbell) తెలుగు వ్యాకరణంతో ప్రాతిపదిక పడింది. 1816 లో అచ్చైన కాంప్‌బెల్ వ్యాకరణం "A grammar of the Teloogoo Language" కి ఉపోద్ఘాతంగా రాసిన "Note to the Introduction : Dissretation on the Telugu Language" అనే వ్యాసంలో ఫ్రాంసిస్ వైట్ ఎల్లిస్ (Fransis whyte Ellis) అనే బ్రిటిష్ అధికారి తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం, తుళు, కొడగు, మాల్తో మొదలైన భాషలకు గల సామ్యాన్ని గుర్తించాడు. ఈ భాషలన్నీ ఒక ప్రత్యేక కుటుంబానికి చెందినవని, సంస్కృతంతో వీటికి జన్యజనక సంబంధం లేదని ఇందులో ఆయన మొదటిసారిగా పేర్కొన్నాడు. పదజాలంలోను,ఇతర వ్యాకరణాంశాలలోను ఈ భాషలకు గల సామ్యాన్ని ఉదాహరణ పూర్వకంగా ఆయన చర్చించాడు.

తెలుగువారికి సంబంధించినంతవరకు వ్యావహారిక భాషోద్యమ నిర్మాతయైన గిడుగు రామ్మూర్తి పంతులు గారిని తెలుగు భాషను గురించి శాస్త్రీయమైన ఆలోచనా విధానాన్ని ప్రారంభించినవాడుగా పేర్కొనవచ్చు. వ్యావహారిక భాషోద్యమంలో భాగంగా భాషా విషయక సూత్రాలను తెలుసుకోవలసిన అవసరం ఆయనకు కలిగింది. ఆ కాలంలో Danial Jones అనే ప్రఖ్యాత ధ్వని శాస్త్రజ్ఞునితో తెలుగులో మేక: మేకు; గోడ: గోడు మొదలైన జంటలలో ఏ,ఓ,లలో కనిపించే సంవృత వివృతోచ్చారణల భేదాన్ని గురించి ఆయన చర్చించాడు. సవర భాషకు వ్యాకరణం రాశాడు. ఆంధ్రభాషా చరిత్ర రాసిన చిలుకూరి నారాయణరావుగారు ఆయన శిష్యుడు. ఆంధ్రభాషను గురించి రామమూర్తిగారి కంటె ఎక్కువ కృషి చేసిన

వారు ఎవరూ లేరన్ని పేర్కొంటూ ఆంధ్రభాషా చరిత్ర పీఠికలో చిలుకూరి నారాయణరావుగారు ఇలా అంటారు: "ఈ గ్రంథ రచనమునందు నా గురువు గారగు మహారాజశ్రీ రావుసాహెబు గిడుగు రామ మూర్తి పంతులుగారు వాఙ్మయము నుండి గుర్తించు కొని యుండిన అనేక ప్రయోగముల నుపయోగించు కున్నాను. ఆంధ్రభాషను గూర్చి వారికంటె ఎక్కువ కృషి చేసినవారు లేరు. వారే ఈ ఆంధ్రభాషా చరిత్రను వ్రాయనర్హులు. కాని వారి జీవితములో ముఖ్య భాగమంతయు పండితులతోటి వాదనలతోను; వ్యావహారిక భాషా ప్రవర్తకోద్యమములతోడను గడచి పోయినది... రామమూర్తి పంతులు గారికిని నాకును ప్రధాన విషయమగు ద్రావిడ భాషలకును ఆర్య భాషల కును గల సంబంధమును గూర్చి అభిప్రాయ భేదము కలదు. నా వాదమును వారు అంగీకరించరని నాకు తెలియును." విశ్వవిద్యాలయాల్లో తెలుగులో జరిగిన తొలి పరిశోధన భాషా సంబంధి. 1927-29లో 11 వ శతాబ్ది తెలుగు భాషను గురించిన చిలుకూరి వారి సిద్ధాంత వ్యాసానికి మదరాసు విశ్వవిద్యాలయంనుంచి పిహెచ్. డి. పట్టా లభించింది. మొదట ఇంగ్లీషులో వచ్చిన ఈ సిద్ధాంత వ్యాసం 1937 లో ప్రచురితమైన ఆయన ఆంధ్రభాషా చరిత్రలో భాగంగా తెలుగులో అచ్చైంది.

తెలుగులో జరిగిన భాషా పరిశోధనను అనేక భాగాలుగా విభజించవచ్చు. చారిత్రక పరిశీలన, (ఇందులో భాగంగా తులనాత్మక పరిశీలన), వర్ణ నాత్మక వ్యాకరణాలు, అన్య దేశ్యాలు, మాండలికాలు, భాషా సామాజిక పరిశీలన, అర్థ నిర్మాణ శాస్త్రం, గ్రామనామాలు, ఛామ్స్కీ నుండి మొదలైన అత్యాధు నిక భాషాశాస్త్రం మొదలైన రంగాలలో తెలుగు భాషా పరిశోధన జరిగింది. విదేశాలలో విదేశీయులు తెలుగును గురించి చేసిన పరిశోధనను ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉంటుంది. ఇవికాక సంప్రదాయ వ్యాకరణాల పద్ధతిలో తెలుగు భాషను గురించి చేసిన పరిశోధనలు కూడ ఉన్నాయి. తెలుగులో భాషకు సంబంధించిన పరిశోధనలలో సిద్ధాంత వ్యాసాలు గాని, ఇతర వ్యాసాలు గాని అధిక భాగం ఇంగ్లీషు లోనే ఉన్నాయి. తెలుగు శాఖలలో మాత్రం మొదటి దశలో జరిగినవి తప్ప తక్కినవన్నీ తెలుగులోనే ఉన్నాయి.

తెలుగులో జరిగిన భాషా పరిశోధనల్లో చారిత్రక రంగానికి సంబంధించినవి చాలా ముఖ్య మైనవి. Caldwell "Comparative Grammar of Dravidian or South Indian Family of Languages" ప్రభావం వల్ల, ప్రేరణ వల్ల ఈ రంగంలో మొట్టమొదట పరి శోధనలు జరిగాయి. ఈ రంగంలో తొలిదశలో కొంత స్వతంత్ర పరిశోధన చేసినవారు కోరాడ రామ కృష్ణయ్యగారు. యూరప్‌లో వచ్చిన తులనాత్మక, చారిత్రక భాషా పరిశోధనలను బాగా చదివి, ఆక ళింపు చేసుకుని, తెలుగు భాషా చరిత్రకు సంబం ధించిన వ్యాసాలను, గ్రంథాలను ఆయన రచించారు. కాల్డ్వెల్ చెప్పిన ద్రావిడ భాషా ప్రత్యేక కుటుంబ వాదాన్ని ఆయన అంగీకరించి ఈ రచనలు చేశారు. సంధి, దేశి కోరాడవారి ముఖ్యమైన గ్రంథాలు. 1929 లోనే 'నన్నయకు పూర్వము ఆంధ్ర భాషాస్థితి' అనే వ్యాసాన్ని ఆయన రాశారు. 'ఆంధ్ర మహా భారత విమర్శనం'లో కూడ భాషా విషయక అంశాల్ని ఆయన చేర్చారు. నన్నయకు ముందు గల శాసనాలను ఆధారంగా చేసుకొని, నన్నయకు ముందు గల తెలుగు భాషా స్వరూపాన్ని, వికాసాన్ని దానికి ద్రావిడ భాషలతో ఉన్న సంబంధాన్ని నిరూ పించడానికి కోరాడ రామకృష్ణయ్య కృషి చేశారు. శాసనాల ఆధారంగా నన్నయకు పూర్వమే తెలుగు కావ్య వ్యావహారిక భాషలుగా రెండుగా చీలిందని ఆయన మొదటిసారిగా గుర్తించారు. "ప్రధాన విషయ మేమనగా నన్నయనాటికే అంతకు పూర్వమే

నన్నయ భారతకవిత్వ మా రీతిని రచింపబడుటకు దగిన పరిస్థితు లొక విధముగాఁ నేర్పడియున్నట్లు తెలియవచ్చుచున్నది'' అని ఆయన తెలియచేశారు. భాషా పరిణామంలో వస్తున్న మార్పుల్ని గమనించి భాషలో మార్పు తప్పదని కోరాడవారు నిర్ద్వంద్వంగా అభిప్రాయపడ్డారు. అంతకుముందే 1924 లో ప్రసిద్ధ చారిత్రకులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ చరిత్ర పరిశోధనలో భాగంగా 'ప్రాచీనాంధ్ర భాషా స్వరూపము' అనే వ్యాసాన్ని రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో ప్రచురించారు. నన్నయకు ముందు తెలుగు భాషా స్వరూపాన్ని ఆయన ఇందులో విశ్లేషించారు.

విశ్వవిద్యాలయాల్లో తెలుగులో మొదట పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం భాషా సంబంధి అని, అది చిలుకూరి నారాయణరావుగారిదని ఇంతకుముందే పేర్కొనడం జరిగింది. ''నన్నయ భారత భాగము భాష ఆనాటి శాసనాల మూలమునను ఇంచుమించు నూఱు వ్రాత ప్రతుల సహాయమునను నిరూపింప ప్రయత్నించితిని'' అని ఆయన తన సిద్ధాంత వ్యాసాన్ని గురించి పేర్కొన్నారు. ఆయన సిద్ధాంత వ్యాసానికి పిహెచ్.డి. పట్టం 1927 లేక 29* లోనే వచ్చినా ఆయన ఆంధ్రభాషా చరిత్ర 1937 లో వచ్చింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం దీన్ని రెండు భాగాలుగా ప్రచురించింది. సమకాలంలో వస్తున్న ధ్వనిశాస్త్రం, తులనాత్మక, చారిత్రక భాషా శాస్త్రాలలో చిలుకూరివారికి విపులమైన పరిచయం ఉంది. చిలుకూరివారు కాల్డ్వెల్ ద్రావిడభాషా ప్రత్యేక కుటుంబ వాదాన్ని కాదని సంస్కృత ప్రాకృత జన్య వాదాన్ని నిరూపించే ప్రయత్నం చేశారు. కాల్డ్వెల్ సంస్కృతానికి, ద్రావిడ భాషలకు సంబంధం లేదన్న విషయాన్ని ఏ ఉపపత్తులలో నిరూపించాడో అదే ఉపపత్తులలో వాటికి సంబంధాన్ని నిరూపించే ప్రయత్నం చిలుకూరివారు చేశారు. ''ప్రాచీనార్య భాషల నుండి తక్కిన ప్రాకృతములవలె ద్రావిడ భాషలును వికాసము నొందినవని తలంచుచు నా దృష్టితో పరిశోధనముల సాగించినచో ద్రావిడ భాషా తత్త్వము తేలగలదని చెప్పుట సాహసము కానేరదు'' అని ఆయన అభిప్రాయపడ్డారు. కాల్డ్వెల్ సిద్ధాంతం పండిత లోకంలో ఆనాటికే స్థిరపడటంవల్ల, ఆయన ప్రతిపాదనలు శాస్త్రీయ విధానాలకు లొంగకపోవడం వల్ల, సంస్కృత, ప్రాకృతాలకు తెలుగుకు ఉండే సంబంధాన్ని చాలా కృత్రిమమైన పద్ధతిలో నిరూపించే ప్రయత్నం చేయడంవల్ల ఆయన వాదం నిలువలేదు. ఈ కారణంవల్లనే ఆంధ్రభాషా చరిత్ర ఆయన చేసిన గొప్ప కృషి అయినా ప్రస్తుతం పఠన, పాఠనాదుల నుంచి దూరమయ్యింది. ఈ వాదం తప్పిస్తే తక్కిన అంశాలలో చిలుకూరివారి ఆంధ్రభాషా చరిత్ర ఆయన అపారమైన పాండిత్యానికి, పరిశోధనా కృషికి తార్కాణం. చరిత్రకు సంబంధించిన అనేక అంశాలు చాలా విస్తృతంగా, సోదాహరణంగా ఆయన పేర్కొన్నారు. రెండు భాగాలుగా వచ్చిన ఈ గ్రంథానికి విస్తృతమైన పీఠిక ఆయన రాశారు. తెలుగు ప్రాచీనత, జనసంఖ్య, మాట్లాడే ప్రాంతాలు, ఉపభాషలు, గ్రాంథిక వ్యావహారిక భాషా భేదాలు, తెలుగు లిపి పరిణామం, తెలుగులో అన్యదేశ్యాలు, ధ్వనులు, సంధి, పదజాలం, సమాసాలు, క్రియలు, అర్థానుస్వారం మొదలైన అంశాలను చాలా విపులంగా చిలుకూరివారు పరిశీలించారు. బెంగాలీ భాషకు సునీతికుమార్ చటర్జీ రాసిన చరిత్రను చదివిన తర్వాత తనకు తెలుగు భాషా చరిత్రను రాయాలన్న అభిప్రాయం కలిగిందని చిలుకూరివారు పేర్కొన్నారు.

* చిలుకూరి నారాయణరావుగారికి పిహెచ్.డి. లభించిన సంవత్సరం గురించి రెండు అభిప్రాయాలున్నాయి. కొందరు 1927 అని మరికొందరు 1929 అని అంటున్నారు. ఈ రెండు సంవత్సరాలలో ఏదైనా, ఆయన తెలుగులో మొదటి పిహెచ్.డి. పట్టం పొందినవాడని చెప్పడానికి అభ్యంతరం ఉండదు.

తెలుగులో భాషా పరిశోధనకు ఎక్కువ ప్రోత్సాహం దోహదం ఇచ్చినవారు గంటి జోగి సోమయాజిగారు. 1947 లో ఆయన 'ఆంధ్ర భాషా వికాసము' వెలువడింది. కాల్డ్వెల్ ద్రావిడ భాషా ప్రత్యేక కుటుంబ వాదాన్ని ఆయన అంగీకరించాడు. తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి సంబంధించిందనే సిద్ధాంతాన్ని కాల్డ్వెల్ చెప్పిన పద్ధతిలో సోమయాజిగారు నిరూపించారు. కాల్డ్వెల్ తరువాత జరిగిన పరిశోధనలను ఆధారంగా చేసుకొని ద్రావిడ భాషా వాదానికి ఆయన మరికొన్ని కొత్త ఉపపత్తులను చేర్చాడు. తెలుగు వర్ణ నిర్మాణంలోను, పదనిర్మాణం లోను వచ్చిన మార్పులను విపులంగా ఆయన చర్చించాడు. ఇప్పటికీ విశ్వవిద్యాలయాల్లో పఠన పాఠనాదులకు ఈ గ్రంథాన్నే చాలామంది ఉపయోగిస్తున్నారు.

తెలుగులో భాషాశాస్త్రం అనగానే భద్రిరాజు కృష్ణమూర్తి పేరు స్ఫురణకు వస్తుంది. ద్రావిడభాషల తులనాత్మక పరిశీలనలో అంతర్జాతీయ ఖ్యాతి పొందిన కృష్ణమూర్తిగారు తెలుగులో ఆధునిక భాషాశాస్త్ర రీతుల్లో చారిత్రక, వర్ణనాత్మక వ్యాకరణాలు రచించటానికి కావలసిన ప్రాతిపదిక వేశారు. ఇప్పటికీ ఈ రంగాలలో ఆయన చూపిన తోవలోనే పరిశోధనలు సాగుతున్నాయి. 'Telugu Verbal Bases - A Comparative and Descriptive Study' "తెలుగు క్రియా ప్రాతిపదికల చారిత్రక, వర్ణనాత్మక పరిశీలన" అన్న అంశంపైన ఆయన చేసిన పరిశోధనకు 1957 లో పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి. పట్టం లభించింది. కొన్ని చేర్పులతో 1961 వ సంవత్సరంలో University of California, Berkeley వారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు. పేరునుబట్టి తెలుగు క్రియాప్రాతిపదికలను గురించిన పరిశోధనగా మాత్రమే అనిపిస్తున్నా ద్రావిడ భాషల తులనాత్మక పరిశోధనా రంగంలో ఈ గ్రంథానికి ప్రముఖమైన స్థానం ఉంది. కృష్ణమూర్తిగారి ఈ గ్రంథాన్ని ఉటంకించని ద్రావిడ భాషా పరిశోధనలు ఇటీవలి కాలంలో లేవు. పై పరిశోధనా కాలంలోనే 'తెలుగు క్రియా ప్రాతిపదికలలో హ్రస్వదీర్ఘాలు' 'ద్రావిడ భాషలలో ఇ/ఎ ఉ/ఒ ల పర్యాయత, మొదలైన అంశాలపైన పరిశోధనా వ్యాసాలు రాశారు. ఇవి అమెరికన్ జర్నల్స్‌లో అచ్చయినాయి. ద్రావిడ భాషలకు సంబంధించిన అంతకుముందునుంచి చర్చలో ఉన్న అనేక ధ్వని సూత్రాలకు తుదిరూపం ఇచ్చారు కృష్ణమూర్తిగారు. వీటిల్లో క్రియా ధాతువుల్లో హ్రస్వదీర్ఘాలు, ఇ/ఎ, ఉ/ఒ ల మార్పు, వర్ణవ్యత్యయం, అచ్ సంకోచం మొదలైనవి చాలా ముఖ్యమైనవి. ఈ పరిశోధనా గ్రంథంలో అనేకమైన చారిత్రకాంశాలు ఉన్నాయి. క్రియా ధాతువుల ఆధారంగా ప్రాచీన ద్రావిడం నుంచి తెలుగు భాషా పరిణామాన్ని నిరూపించటం జరిగింది. ద్రావిడ భాషా కుటుంబంలో తెలుగుకుగల స్థానాన్ని సప్రమాణంగా ఆయన నిరూపించారు. తెలుగులో జరిగిన చాల్గా చారిత్రక పరిశోధనలకు ఆయన పర్యవేక్షకత్వం వహించారు.

పి.యస్. సుబ్రహ్మణ్యంగారి 'Dravidian Verb Morphology: A Comparative Study' "ద్రావిడ భాషా క్రియా నిర్మాణం - తులనాత్మక పరిశీలన" అన్న సిద్ధాంత వ్యాసం 1964 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి వెలువడింది. ద్రావిడ భాషలలోవి క్రియా పద నిర్మాణాన్ని వర్ణనాత్మకంగాను తులనాత్మకంగాను చర్చించినదే అయినా, చారిత్రక పరిశీలనకు కూడా ఉపయోగించే పరిశోధన ఇది. ఆయన 'Long Vowels before 'Y' in Telugu'(1970) అనే వ్యాసంలో సోదర ద్రావిడ భాషలలో కనిపించే హ్రస్వాచ్చు తెలుగులో 'య' కారానికి ముందు దీర్ఘం ఎట్లా అయ్యిందో చారిత్రకంగా నిరూపించారు. చేయి, చెయ్యి మొదలైనవి వీటికి ఉదాహరణలు. తులనాత్మక

పరిశోధనలో భాగంగా వ్యాసాలనేకం సుబ్రహ్మణ్యం గారు రాశారు.

క్రీ. శ. 300 ల నుంచి క్రీ.శ. 1000 వరకు తెలుగులో వచ్చిన శాసనాలను ఆధారంగా చేసుకొని, తెలుగు భాషా పరిణామాన్ని పరిశీలించే ప్రయత్నం "A Historical Grammar of Telugu" (1961) అన్న తన సిద్ధాంత వ్యాసంలో కోరాడ మహాదేవశాస్త్రి గారు చేశారు. ఈ సిద్ధాంత వ్యాసానికి కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి. పట్టం లభించింది. ఈ సిద్ధాంత వ్యాసంలో మధ్య యుగంలోను, ఆధునిక యుగంలోను కూడా తెలుగులో వచ్చిన మార్పులను వింగడించే ప్రయత్నం మహాదేవ శాస్త్రి గారు చేశారు. తెలుగు భాషా చరిత్రను మొదటి స్థారిగా యుగాలుగా, క్రీ. పూ. 600 నుంచి క్రీ. శ. 300 వరకు చరిత్ర పూర్వ యుగం, క్రీ. శ. 300 నుంచి క్రీ.శ. 1000 వరకు ప్రాచీన యుగం, క్రీ.శ. 1000 నుండి క్రీ.శ. 1600 వరకు మధ్య యుగం, క్రీ. శ. 1600 నుండి ఆధునిక యుగం అని విభజించే ప్రయత్నం ఆయన చేశారు.

తెలుగు శాసనాల ఆధారంగా తెలుగు భాషా పరిణామాన్ని గురించిన పరిశోధన తెలుగులో సమగ్రంగా జరిగిందనే చెప్పాలి. బూదరాజు రాధాకృష్ణ క్రీ. శ. 200 నుండి క్రీ.శ. 1100 వరకు, కీ॥శే॥ ఎమ్. కందప్పచెట్టి క్రీ. శ. 1101 నుండి క్రీ. శ. 1400 వరకు, కె. కె. రంగనాథాచార్యులు క్రీ. శ. 1401 నుండి క్రీ. శ. 1900 వరకు శాసన భాషా పరిణామాన్ని గురించి పరిశోధన చేశారు. ఎమ్. కందప్పచెట్టి విషయంలో చివర తప్ప ఈ పరిశోధన లన్నీ భద్రిరాజు కృష్ణమూర్తి గారి పర్యవేక్షణలోనే జరిగాయి. బూదరాజు రాధాకృష్ణ 'A Historical and Comparative Grammar of Early Telugu (Inscriptions)' 1964 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం. క్రీ.శ. 200 నుండి క్రీ.శ. 1100 వరకు గల 269 శాసనాలను పరిశీలించి శాస్త్రీయమైన పద్ధతులలో తెలుగు భాషా పరిణామాన్ని ఇందులో చర్చించారు. తొలిదశకు చెందిన భాషా పరిశీలన అయినందున ప్రాచీన తెలుగు భాషా లక్షణాలను తులనాత్మక దృష్టితో కూడా రాధాకృష్ణ పరిశీలించారు. తెలుగు వ్యావహారిక భాషలో కనిపిస్తున్న మార్పులనేకం నన్నయకు ముందే జరిగాయని ఆయన నిరూపించారు. నన్నయకు ముందు వాక్య నిర్మాణంలో నామాఖ్యానమే గాని క్రియాఖ్యానం లేదని అంతవరకు ఉన్న అభిప్రాయం సరియైంది కాదని, క్రియాశూన్యత లేదని నిరూపించటానికే ఎక్కువ నిదర్శనలున్నాయని కూడా ఆయన నిరూపించారు. తమ పరిశోధనల ఆధారంగా 'వ్యావహారిక భాషా వికాసం' అనే గ్రంథాన్ని ఆయన రచించారు. 12,13,14 శతాబ్దాల శాసనాల ఆధారంగా కీ॥ శే॥ ఎమ్. కందప్ప చెట్టి చేసిన 'A Historical Grammar of the Telugu Inscriptions' అన్న సిద్ధాంత వ్యాసానికి 1966 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పిహెచ్. డి. లభించింది. ఈ కాలం తెలుగు భాషా చరిత్రలో చాలా ముఖ్యమైంది. ముఖ్యంగా పద పదాంశ నిర్మాణంలో, వ్యాకరణాంశాలలో చాలా మార్పులు ఆధునికమనదగ్గవి ఈ కాలంలో కనిపిస్తాయి. వీటినన్నిటిని ఎమ్. కందప్ప చెట్టి విశ్లేషించారు. శాసన భాష ఆధారంగా తెలుగు భాషా మండలాలను నిరూపించే ప్రయత్నం కూడా ఇందులో ఆయన చేశారు. పిహెచ్.డి. పట్టం పొందిన తరువాత కూడా భాషా చరిత్రకు సంబంధించిన వ్యాసాలనేకం ఆయన రచించారు. క్రీ. శ. 1401 నుండి క్రీ.శ. 1900 వరకు గల శాసనాల ఆధారంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషా శాస్త్ర శాఖలో తెలుగు భాషా పరిణామాన్ని గురించి కె. కె. రంగనాథాచార్యులు పరిశోధన చేశారు. 'A Historical Grammar of Inscriptional Telugu - From 1401

A.D. to 1900 A.D.' అనే ఆయన సిద్ధాంత వ్యాసానికి 1978 లో పిహెచ్.డి. లభించింది. దీనితో తెలుగు శాసన భాషా పరిణామానికి సంబంధించిన పరిశోధన పూర్తి అయిందనే చెప్పాలి. తెలుగు శాసనాల్లో కనిపించే లేఖన భేదం ఆధారంగా ఆనాటి ఉచ్చారణ విధానాలను శాస్త్రీయమైన పద్ధతిలో నిరూపించటం ఈ సిద్ధాంత వ్యాసంలోని ప్రత్యేకత. ఆధునిక భాషలో కనిపించే అనేక సంధి విధానాలు, రెండు హల్లుల మధ్య అచ్చు లోపించటం, ఉదా. కోమ్రెడ్డి, కొంౘ్రాజు వంటివి, పెట్టేట్టులుగా, చేసే టట్టు మొదలైనవి 15, 16 శతాబ్దుల నుంచే కనిపిస్తున్నాయని నిదర్శనపూర్వకంగా చూపించారు. అనేక ఇతర ఆధునిక భాషా రూపాలు ఈ కాలంలో ఎట్లా పరిణామం చెందాయో ఇందులో పరిశీలించారు. తెలుగు భాషలో వచ్చిన పరిణామాల ఆధారంగా యుగ విభజన చేశారు. ఆర్. అన్నపూర్ణమ్మ అణ్ణామలై విశ్వవిద్యాలయంలో ప్రాచీన, ఆధునికాంధ్ర భాషలను తులనాత్మకంగా పరిశీలిస్తూ పరిశోధన చేశారు (1979). పై సిద్ధాంత వ్యాసాలన్నీ ఇంగ్లీషులోనే ఉన్నాయి. 1947 లో అచ్చైన టి. యం. శేషగిరి శాస్త్రిగారి 'అనుస్వార తత్త్వము', అనే గ్రంథానికి, 1942 లో భారతిలో అచ్చైన వక్కలంక శ్రీనివాసరావు 'అనుస్వారము' అనే వ్యాసానికి తెలుగు భాషా చరిత్ర పరిశోధనలో చాలా ముఖ్యమైన స్థానం ఉంది. నిడుదవోలు వెంకటరావు 'The Significance of Yati and Prasa in Telugu: A Linguistic Approach' అనే వ్యాసంలో ఉచ్చారణను బట్టి కవులు యతి, ప్రాసలను ఎట్లా కలిపారో చాలా విపులంగా చర్చించారు. వ్యావహారిక భాషా వికాస నిరూపణానికి ఇది ఎంతో ఉపయోగించే వ్యాసం. నిడుదవోలు వెంకటరావు గారు భాషకు సంబంధించి వ్యాసాలనేకం రచించారు.

ప్రధానంగా ద్రావిడ భాషల తులనాత్మక పరిశోధన రంగానికి సంబంధించినవే అయినా ఎన్. కుమారస్వామి రాజా Post-nasal voiceless Plosives in Telugu : a comparative study (1969) అన్న వ్యాసం, Post-nasal voiceless plosives in Dravidian' (1969) అన్న గ్రంథం, జి. సాంబశివరావు కార్నెల్ విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి పిహెచ్.డి. కోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం 'A comparative study of Dravidian noun derivation' (1973) తెలుగు భాషా చరిత్ర రచనకు ఎంతో ఉపయోగిస్తాయి. మూల ద్రావిడంలో అనునాసికంపైన శ్వాస స్పర్శాలు తెలుగు మొదలైన కొన్ని భాషలలో నాద స్పర్శాలుగా మారుతాయి. కాని తెలుగులో తోఁట మొదలైన చోట్ల అనునాసికం పైన శ్వాస స్పర్శం కనిపిస్తుంది. ఇలాంటిచోట మూల ద్రావిడంలో అనునాసికంపైన ద్విరుక్త స్పర్శం ఉండి ఉండాలని ఎన్. కుమారస్వామి రాజా తులనాత్మకంగా పరిశీలించి నిరూపించారు. ఇటువంటిచోట తమిళంలో ద్విరుక్తస్పర్శం కనిపిస్తుంది. జి. సాంబశివరావు ద్రావిడ ధాతువులలో హ్రస్వ,దీర్ఘతలకు సంబంధించి కృష్ణమూర్తి, ఎమెనో, జ్వెలబిల్ మొదలైన వారి ప్రతిపాదనలకు కొన్ని కొత్త వివరణలను ఇచ్చారు. దీని ఆధారంగా ద్రావిడ భాషలలో నామనిష్పాదనను గురించి చర్చించారు.

ఇంతవరకు తెలుగుభాషా పరిణామానికి సంబంధించి వచ్చిన పరిశోధన ఆధారంగా భద్రిరాజు కృష్ణమూర్తిగారి సంపాదకత్వంలో 1974లో 'తెలుగుభాషా చరిత్ర' వెలువడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ దీన్ని ప్రచురించింది. 1978లో మరిన్ని మార్పులతో, చేర్పులతో పునర్ముద్రణ వచ్చింది. తెలుగు శాసన, కావ్యభాషా పరిణామాన్ని గురించి పరిశోధన చేసిన వారు, తెలుగు భాషకు సంబంధించి ఇతర రంగాలలో

పరిశోధన చేసినవారు ఇందులో ప్రకరణాలను రచించారు. కృష్ణమూర్తిగారు 'సింహావలోకనం' అనే చివరి ప్రకరణంలో తెలుగు భాషా చరిత్రలోని యుగాలను శాస్త్రీయంగా నిర్ధారించారు. సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో ఇది ఇంగ్లీషులో కూడా వెలువడనుంది.

తెలుగు భాష వర్ణనాత్మక వ్యాకరణానికి ప్రాతిపదిక వేసినవారుకూడా భద్రిరాజు కృష్ణమూర్తిగారే. వారి Telugu Verbal Bases లో ప్రాచీన భాషలోను, ఆధునిక భాషలోను ఉండే తెలుగు క్రియాధాతువులను, ప్రత్యయాలను వేరు చేసిన విధానం తరువాత పరిశోధకులకు ప్రమాణంగా నిలచింది. రెండు హల్లుల మధ్య అచ్చులోపించి, హల్లులలో వచ్చే మార్పులను 'Sandhi in modern colloquial Telugu' (1957) అనే వ్యాసంలో కృష్ణమూర్తిగారు వివరించారు. అనేక ధాతువులు కలిసి క్రియాప్రాతిపదికగా ఏర్పడే విధానాన్ని 'Compound verbs in Telugu' (1964) అనే వ్యాసంలో చర్చించారు. స్థితి బోధకాలైన జ్ఞానాన్ని తెలియజేసే తెలియు, ఎరుగు వంటి క్రియలను గురించి "Verbs of cognition in Telugu" (1970) అనే వ్యాసంలో పరిశీలించారు. ఆధునిక భాషాశాస్త్రాన్ని పరిచయం చేయటానికి కృష్ణమూర్తిగారు తెలుగులో కొన్ని వ్యాసాలు రాశారు. 'భాష - వ్యాకరణం', 'ధ్వని - వర్ణం' (1959), 'పదం - పదాంశం' (1970) ఇందులో ముఖ్యమైనవి. 'తెలుగులో వర్ణ సమామ్నాయం' (1959) అనే వ్యాసంలో తెలుగు భాషకు వర్ణనిర్ణయం చేశారు.

1960 తరువాత తెలుగు కవుల, కావ్యాలభాషల కొన్నిటికి వర్ణనాత్మక వ్యాకరణాలు వచ్చాయి. జాస్తి సూర్యనారాయణ ప్రత్యేకంగా తిక్కన సమాసాలను దృష్టితో పెట్టుకొని, తెలుగు సమాసాల స్వరూపస్వభావాలను విశ్లేషిస్తూ 'A Study of Telugu Compounds' (1964) అనే సిద్ధాంత వ్యాసాన్ని భద్రిరాజు కృష్ణమూర్తిగారి పర్యవేక్షణలో రూపొందించి పిహెచ్.డి. పొందారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగులో జరిగిన తొలిపరిశోధన ఇది. తెలుగుకవుల సంస్కృత ప్రయోగాలు సూర్యనారాయణగారి ప్రత్యేక పరిశోధనారంగం. 'A Descriptive analysis of Nannaya's usage' (1965) అన్న కల్లూరి నాగభూషణరావుగారి సిద్ధాంతవ్యాసం నన్నయ భాషకు వర్ణనాత్మక వ్యాకరణం. వర్ణాలు, సంధి, పదనిర్మాణం, వాక్యనిర్మాణం, అర్థనిర్మాణం, నుడికారం మొదలైన అంశాలను ఆధునిక భాషాశాస్త్ర విధానాలలో ఇందులో పరిశీలించారు. లింగంనేని బసవశంకరరావు నన్నెచోడుని కుమార సంభవానికి వర్ణనాత్మక వ్యాకరణం రాశారు. 1968 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో దీనికి పిహెచ్.డి. పట్టం లభించింది. నన్నెచోడుని భాషా పరిశీలన తెలుగు పరిణామాన్ని అర్థం చేసుకోవటానికి ఎంతగానో ఉపకరిస్తుంది. 'Telugu Grammmar : a descriptive study of modern literary language' (1968) అన్న సిద్ధాంతవ్యాసానికి ఎన్. శివరామమూర్తి పూనా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి. పొందారు. శ్రీనాథుని రచనల ఆధారంగా ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులలో నేతి అనంతరామశాస్త్రి 'శ్రీనాథుని భాష - వర్ణనాత్మక విశ్లేషణ' (1978) అన్న అంశంపైన నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. శ్రీనాథుని భాషను అంతకు పూర్వపు కావ్యభాషతో తులనాత్మకంగా కూడా ఆయన ఇందులో పరిశీలించారు. అనంతపురం స్నాతకోత్తర కేంద్రంలో పి. ఎల్. శ్రీనివాసరెడ్డి కూడా ఇదే అంశంపైన పరిశోధన చేశారు. అనంతపురం స్నాతకోత్తర కేంద్రంలోనే పి. నరసింహారెడ్డి 'ఆముక్తమాల్యద - భాషాపరిశీలన' అన్న అంశంపైన పరిశోధన చేశారు. అక్కడే ఎమ్. సీత 'తిక్కన భాష, నామ పదాంశ పరిశీలన' (1980)

అన్న అంశంపైన పరిశోధన చేశారు. అణ్ణామలై విశ్వవిద్యాలయంలో ఎన్. కుమారస్వామిరాజా తమిళ నాడు రాష్ట్రంలోని రాజపాళెయం తెలుగు పైన పరిశోధన చేశారు. కె. లక్ష్మీనారాయణ శర్మ 'Linguistic Analyis of Telugu Folk Songs' 'తెలుగు జానపద గేయాలు-భాషా శాస్త్రీయ విశ్లేషణ' (1982) అన్న అంశంపైన అణ్ణామలై విశ్వవిద్యాలయంలో పరిశోధన పూర్తి చేశారు. రంగా జమ్మ కావ్యాల్లోని భాషపైన కొండూరు కుసుమా బాయి పరిశోధన చేశారు. కార్నెల్ విశ్వవిద్యాలయంలో ఎమ్. ఏ. పరీక్షలో భాగంగా జి. సాంబశివరావు 'Telugu verb - literary and colloquial' అన్న సిద్ధాంత వ్యాసం రాశారు. 'అన్నమా చార్యుల భాష-వర్ణనాత్మక విశ్లేషణ' అనే అంశంపైన మేడసాని మోహన్, 'తాళ్ళపాక అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల్లోని సమాసాలు - ఒక పరిశీలన' అన్న అంశంపైన దివాకర్. మద్రాసు విశ్వవిద్యా లయంలోను, 'అన్నమయ్య భాషా విశేషాలు' అనే అంశంపైన కె. శ్రీనివాసులు శెట్టి వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలోను, ఎం. రంగారావు 'పారిజాతాపహ రణం' భాషను గురించి ప్రస్తుతం పరిశోధన చేస్తు న్నారు. తిక్కన భాషలోని అనేక అంశాలను గురించి, తెలుగు పత్రికలలోని భాషను గురించి కూడా పరిశో ధనలు జరుగుతున్నాయి. ఆయా శతాబ్దాలలోని ప్రధాన మైన కవుల భాషకు వర్ణనాత్మక వ్యాకరణాలు వెలు వడితే కావ్య భాషా చరిత్ర నిర్మాణానికి, సమగ్రమైన తెలుగు భాషా చరిత్ర రచనకు ఎంతగానో ఉపకరి స్తాయి. సాహిత్య అకాడమీ ప్రకటించిన కవుల పద ప్రయోగకోశాలు వర్ణనాత్మక వ్యాకరణ రచనకు ఉపకరిస్తాయి.

తెలుగులో అన్య భాషా పదాలను గురించి కూడా చెప్పుకోదగ్గ పరిశోధన జరిగింది. చిలుకూరి నారాయణరావుగారి 'ఆంధ్ర భాషాచరిత్ర'లో ఈ విషయంపైన ప్రత్యేక ప్రకరణం ఉంది. మోడే కూరి సత్యనారాయణ భారతిలో రాసిన 'తెలుగు శాస నములలో అన్యదేశ్యాలు' (1959) అనే వ్యాసం ఈ రంగంలో వచ్చిన ముఖ్యమైన పరిశోధనావ్యాసంగా చెప్పుకోవచ్చు. విశ్వవిద్యాలయాలలో ఈ రంగానికి సంబంధించిన పరిశోధన తూమాటి దొణప్ప గారితో ప్రారంభమైందని చెప్పాలి. ఆయన సిద్ధాంత వ్యాసం- 'తెలుగులో వైకృత పద స్వరూప నిరూపణం'. 'Old and Middle Indo-Aryan Assimilated Loan words' (1965). వైకృత పదం అంటే ఏమిటో నిరూపించి, తెలుగులో చేరిన ప్రాచీన, మధ్య హిందార్య భాషాపదాలను గురించి, తెలుగులో అవి పొందిన ధ్వని విపరిణామాలను గురించి ఆయన ఇందులో విపులంగా చర్చించారు. తెలుగులో పోర్చు గీసు పదాలు, తెలుగులో హకారాది పదాల పుట్టు పూర్వోత్తరాలు, నన్నయ నన్నెచోడ కవిద్వయంలో అన్యదేశ్యాభాసాలు మొదలైనవి దొణప్ప గారు రాసిన అన్యదేశ్యాలకు సంబంధించిన వ్యాసాలు. ఈ వ్యాసాల నన్నిటినీ 'భాషా చారిత్రక వ్యాసావళి' అనే పేరిట ఆంధ్ర సారస్వత పరిషత్తు సంకలనంగా అచ్చు వేసింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లకంసాని చక్ర ధరరావు 'ఆంధ్ర శాసన సారస్వతము లందలి ఉర్దూ మరాఠీ పదాలు' (1967) అనే అంశంపైన పరిశోధన చేశారు. ఉర్దూ, మరాఠీ పదాలు తెలుగులో ప్రవేశించే టప్పుడు పొందే ధ్వని పరిణామాలతో పాటు, అర్థ విపరిణామాలను గురించి కూడా ఇందులో ఆయన చర్చించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషా శాస్త్ర శాఖలో పి. స్వరాజ్యలక్ష్మి 'The influence of Urdu on Telugu' (1976) అనే అంశంపైన చేసిన పరిశోధన కూడా ఈ కోవకు చెందిందే. ఆర్. శ్రీరామశాస్త్రి 'మెకంజీ కైఫీయతులలోని ఆధునిక ఇండో ఆర్యన్ ఆదాన పదాలు: ఒక పరిశీలన' అనే అంశంపైన

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. మెకంజీ సంకలనాల్లోని భాష పందొమ్మిదవ శతాబ్ది పూర్వభాగంలో తెలుగుదేశంలో శిష్టజనుల వ్యవహారానికి దగ్గరగా ఉంటుందని ఆయన అభిప్రాయపడ్డారు. ఈ కైఫియతుల తెలుగు భాషలోని ఉర్దూ, మరాఠీ, ఒరియా పదాలను గురించి ఆయన వివరించారు. ఎస్. అక్కిరెడ్డి 'తెలుగులో ఇంగ్లీషు ఆదాన పదాలు' 'English Loan words in Telugu' (1971) అనే అంశంపైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. 18, 19 శతాబ్దాలలో ఇంగ్లీషు నుంచి తెలుగులో చేరిన పదాలను వర్ణనాత్మక దృష్టితోను, ధ్వని పరిణామదృష్టితోను ఈ సిద్ధాంత వ్యాసంలో పరిశీలించటం జరిగింది. తెలుగులో తమిళ, కన్నడ ఆదాన పదాలను గురించి జి. వి. ఎస్. ఆర్. కృష్ణమూర్తి 'A Study of Loanwords in Telugu from Cognate Languages' (1977) అన్న సిద్ధాంత వ్యాసంలో పరిశీలించారు. ధ్వని పరిణామాలతోపాటు అర్థ విపరిణామాలను కూడా ఇందులో ఆయన చర్చించారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పి. కుసుమ కుమారి 'బ్రిటిష్‌కాలపు తెలుగు డాక్యుమెంట్లలో హిందూస్తానీ ఆదాన పదాలు' అన్న అంశంపైన ఇటీవలే పరిశోధన పూర్తి చేశారు.

నిఘంటువులను గురించిన పరిశోధన, నిఘంటువుల, పదకోశాల నిర్మాణం - వీటిని కూడా భాషా పరిశోధనలో భాగంగా తీసుకోవచ్చు. సి. పి. బ్రౌన్ తెలుగు భాషకు మొదటి సమగ్ర నిఘంటువును తయారుచేశాడు. బహుజనపల్లి సీతారామాచార్యుల 'శబ్దరత్నాకరం' - 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' తెలుగులో ప్రామాణిక నిఘంటువులు. ఇతర భాషలలో జరగనిదీ, తెలుగులో మాత్రమే జరిగిందీ మాండలిక వృత్తి పదకోశాల నిర్మాణం. భద్రిరాజు కృష్ణమూర్తి వృత్తి పదకోశాల నిర్మాణానికి కావలసిన సైద్ధాంతిక ప్రాతిపదికను ఇవ్వటమే కాకుండా 'వ్యవసాయ వృత్తి పదకోశా' (1912) న్ని, చేనేత వృత్తి పదకోశా (1971) న్ని సిద్ధంచేశారు. కుమ్మరం, కమ్మరం, వడ్రంగం పదకోశాలకు (1969) జి. ఎన్. రెడ్డి, వాస్తు పదకోశానికి (1969) బూదరాజు రాధాకృష్ణ సంపాదకత్వం వహించారు. మత్స్య పదకోశం, చేతివృత్తుల పదకోశం తయారీలో ఉన్నాయి. కవుల పదప్రయోగకోశాలను తయారుచేయటానికి శాస్త్రీయమైన సిద్ధాంత ప్రాతిపాదికను అందజేసినవారు కూడా కృష్ణమూర్తిగారే. ఇంతవరకు నన్నెచోడ, నన్నయ, తిక్కన, శ్రీనాథ పదప్రయోగకోశాలు వచ్చాయి. కుందూరి ఈశ్వరదత్తుగారి 'శాసన శబ్దకోశం' కూడా వచ్చింది. పైవన్నీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆధ్వర్యవంలో వచ్చినవే. కె. సూర్యనారాయణ 'అచ్చ తెనుగు నిఘంటువు' అన్న అంశంపైన ప్రస్తుతం కృషి చేస్తున్నారు. టి. ఉషారాణి 'తెలుగు నిఘంటువుల పరిశీలన' (1975) అనే సిద్ధాంతవ్యాసం తెలుగు నిఘంటువుల స్వరూపాన్ని, వాటి పరిణామ చరిత్రను తెలుపుతుంది. నాయని కోటేశ్వరి 'ముద్రిత జానపద గేయాల్లో నిఘంటువుల కెక్కని పదాలు' (1978) పరిశోధనా వ్యాసంతో జానపద భాషలోని నిఘంటువుల కెక్కని పదాలను గురించి, నిఘంటువుల్లోకి వచ్చినా జానపద సాహిత్యంలో కొన్ని పదాలకు గల విలక్షణ ప్రయోగాలను గురించి చర్చించారు. వేటూరి ఆనందమూర్తి 'విజయనగరయుగపు తెలుగు సాహిత్యంపై వైష్ణవతత్త్వ ప్రభావము' (1966) అనే తమ సిద్ధాంత వ్యాసంలో తాళ్ళపాక కవుల భాషలోని అపూర్వ ప్రయోగాలను గురించి కూడా చర్చించి, శబ్దార్థాల పట్టికను ఇచ్చారు.

తెలుగు భాషలో అర్థ నిర్మాణానికి సంబంధించి జరిగిన ప్రధానమైన పరిశోధన జి. ఎన్. రెడ్డి గారిది. 'A Study of Telugu Semantics' అనే పరిశోధనా వ్యాసానికి 1962 లో మద్రాసు విశ్వ

విద్యాలయం నుంచి ఆయన పిహెచ్.డి. పట్టం పొందారు. అర్థ నిర్మాణానికి సంబంధించి ప్రాచీన, ఆధునిక శాస్త్రకారుల సిద్ధాంతాలను ఆయన విస్తృతంగా ఇందులో చర్చించారు. ఆధునిక భాషా శాస్త్ర రీతులలో తెలుగు అర్థ విపరిణామాన్ని ఆయన పరిశీలించారు. జి.ఎన్. రెడ్డిగారి తరువాత ఈ రంగంలో అంతగా కృషి జరిగినట్టు కనిపించదు. డ్యూక్ విశ్వవిద్యాలయంలో ర్యాలి రాజగోపాలరావు 'Semantic analysis of Telugu kinship terminology' (1970) అనే పరిశోధనా వ్యాసంలో తెలుగు బంధు వాచక పదాల ఆర్థిక విశ్లేషణ చేశారు. లంకసాని చక్రధరరావు, జి.వి.ఎస్.ఆర్. కృష్ణమూర్తి తమ పరిశోధనా వ్యాసాలలో అన్య దేశాలు తెలుగులో ప్రవేశించేప్పుడు పొందే అర్థ విపరిణామాన్ని గురించి కూడా చర్చించారు. భాషా శాస్త్ర, సాహిత్య విమర్శ దృక్పథాలను సమన్వయిస్తూ, వాగ్వ్యాపరంగా వ్యంజనా వృత్తిని నిరూపించటమే హెచ్.ఎస్. బ్రహ్మానంద 'వ్యంజన సూత్రం' 'The Principle of Suggestivity' (1979) అనే సిద్ధాంత వ్యాసంలోని ప్రధానాంశమని తెలుస్తున్నది. దీనిని బట్టి ఈ పరిశోధన కూడా అర్థ నిర్మాణానికి సంబంధించినదిగా పరిగణించవచ్చు, కందాళ కనక మహాలక్ష్మి 'తత్సమ పదాల్లో అర్థ విపరిణామం' అనే అంశంపైన, టి.వి. సుబ్బారావు 'తెలుగులో అన్యదేశాలు - అర్థవిపరిణామ పరిశీలన' అన్న అంశంపైన కృషి చేస్తున్నారు.

తెలుగులో మాండలికాల పరిశోధనకు కూడా భద్రిరాజు కృష్ణమూర్తిగారే ప్రాతిపదిక వేశారు. మాండలిక వృత్తి పదకోశాలు తెలుగు భాషా వ్యవహార మండలాలను నిరూపించటానికి ప్రాతిపదిక అయ్యాయి. ఉచ్చారణ భేదం, పదరూప భేదాలు, పద భేదాలు ఆధారంగా తెలుగులో నాలుగు ప్రధాన మాండలికాలను కృష్ణమూర్తిగారు నిరూపించారు. 'తెలుగు మాండలికాలు : కరీంనగరం వాడుక' (1971) అనే వ్యాసంలో తెలుగులోని మాండలిక భేదాలను గురించి మరింత విపులంగా వివరించారు. తెలుగులో మాండలిక పరిశోధనకు కావలసిన సిద్ధాంతాలను సాంకేతిక పద్ధతులను కృష్ణమూర్తిగారు ప్రతిపాదించారు. తెలుగు అకాడమీ పక్షాన బూదరాజు రాధాకృష్ణ సంపాదకత్వంలో ఇంతవరకు కరీంనగర్, కడప, విశాఖపట్టణం, గుంటూరు జిల్లాల 'Telugu Dialect Bulletins' వెలువడ్డాయి. పి. సి. నరసింహారెడ్డి 'తెలుగు వ్యవహార మండలాలు: ఒక పరిశీలన' (1971), 'An appoach to the discription of dialects'(1972) మొదలైన వ్యాసాలలో తెలుగు మాండలికాలను గురించి చర్చించారు. ఇటీవలనే కడపజిల్లా మాండలికంపైన పరిశోధన చేసి రఘురామరాజు పూనా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి. పొందారు. ఈ రంగంలో జరుగవలసిన కృషి చాలా ఉంది.

ఛామ్స్కి నుండి ప్రారంభమైన అత్యాధునిక భాషా సిద్ధాంతాల ఆధారంగా తెలుగులో జరిగిన కృషి తక్కువే అయినా గుణాత్మకంగా మంచి కృషే జరిగింది. అత్యాధునిక భాషా సిద్ధాంతాల ఆధారంగా జరిగిన పరిశోధన చాలావరకు విదేశ విద్యాలయాలలోనే జరిగింది. ముఖ్యంగా అమెరికాలో, కొంతవరకు బ్రిటన్‌లోని విశ్వవిద్యాలయాలలో భాషాశాస్త్రాన్ని అధ్యయనం చేయటానికి వెళ్ళిన తెలుగువారు చాలామంది వాళ్ళ సిద్ధాంతాలతో పరిచయం చేసుకొని, ఆ సిద్ధాంతాలను తెలుగు భాషకు అన్వయిస్తూ పరిశోధనలు చేశారు. భద్రిరాజు కృష్ణమూర్తి వంటివారు ఎప్పటికప్పుడు విదేశాలలో తాము చేసే పర్యటనలలో భాషా పరిశోధనలో వస్తున్న క్రొత్త సిద్ధాంతలను తెలుసుకుంటూ వాటిని తెలుగు భాషకు అన్వయించే ప్రయత్నం చేస్తున్నారు. ముఖ్యంగా వాక్య నిర్మాణానికి సంబంధించిన పరిశోధనలు ఈ కాలంలో అభివృద్ధి చెందాయి.

చామ్స్కీ భాషా సిద్ధాంతాలను తెలుగు దేశానికి పరిచయం చేసినవారు చేకూరి రామారావు. 'A transformational study of Telugu' అనే తమ సిద్ధాంత వ్యాసానికి 1968 లో కార్నెల్ విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్. డి. పొందారు. తెలుగులో వాక్యభేదాలు, సామాన్య, సంయుక్త, సంశ్లిష్టవాక్యాల స్వరూపం, తెలుగులో నామ్నీకరణాలు మొదలైన అంశాలు ఈ సిద్ధాంత వ్యాసంలో ఉన్నాయి. తరువాత 'తెలుగులో నామ్నీకరణాలు '(Nominaligation)' అనే పేరుతో వారి వ్యాసా లనేకం భారతిలో వచ్చాయి. 'తెలుగులో వెలుగులు' అనే పేరిట ఈ వ్యాసాలను సంకలన రూపంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు ఇటీవలనే ప్రకటించింది. ఒక వాక్యాన్ని మరొక వాక్యంలో నామబంధంగా ఇమడ్చ డమే నామ్నీకరణం. విషయార్థక నామ్నీకరణం, సంబంధార్థక నామ్నీకరణం, ఇత్యర్థక నామ్నీకరణం, వ్యాపారార్థక నామ్నీకరణం, లుప్తవిభక్తిక నామ్నీకరణం మొదలైన తెలుగులోని నామ్నీకరణ విధానా లను ఆయన నిరూపించారు. వీటికి రామారావు ఇచ్చిన ఉదాహరణలు చాలా ఆసక్తిదాయకంగా ఉంటాయి. ఇవన్నీ చామ్స్కీ పరివర్తన సిద్ధాంతం (Transformational theory) ఆధారంగా జరిగిన పరిశోధనలు. ఈ సిద్ధాంతాన్ని పరిచయం చేస్తూ 'భాషాశాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం' (1971) అన్న వ్యాసాన్ని ఆయన రాశారు. తన పరిశోధన కొన సాగింపులో భాగంగా వాక్యనిర్మాణానికి సంబంధించిన వ్యాసాలనేకం ఆయన వెలువరించారు. తెలుగులో ప్రత్యక్ష, పరోక్ష కథన భేదాన్ని గుర్తించాలని ప్రతి పాదిస్తూ ఆయన రాసిన 'Direct and indirect reports : A hypothesis concerning the universals of language' (1967) వ్యాసం చాలా ముఖ్యమైనది. మానవ భాషలన్నిటి లోనూ ప్రత్యక్ష, పరోక్ష కథన భేదం ఉందని ఆయన ప్రతిపాదించారు. తెలుగులోను, ఇతర ద్రావిడ భాషలలోను వాక్యంలో క్త్వార్థక క్రియలు ప్రవర్తించే తీరు, తెలుగువాక్యంలో 'అని' పనిచేసే తీరు మొద లైన విషయాలను గురించి ఆసక్తికరమైన అంశాలను వివిధ వ్యాసాలలో రామారావు వెలికి తెచ్చారు. 'తెలుగు వాక్యం' (1975) అన్న గ్రంథంలో ఆయన తెలుగులోని వాక్యభేదాలను సమగ్రంగా విశ్లేషించారు. 'తెలుగులో బహువచనరూప నిష్పత్తి' (1970) అనే వ్యాసంలో ఆధునికాంధ్రంలోని బహువచన రూపాలను నియత సూత్రాల (ordered rules) పద్ధతిలో నిరూపించారు. తమ 'A Grammatical Sketch of Telugu' (1969) లో తెలుగు ధ్వనుల నిర్మాణాన్ని నిష్పాదక ధ్వని శాస్త్రం (generative phonology) పద్ధతిలో విశ్లేషించారు.

ఇంగ్లండులో ప్రచురంగా ఉన్న వ్యవస్థా భాషా సిద్ధాంతం (Systemic theory) విధానాన్ని అను సరించి యార్క్ విశ్వవిద్యాలయంలో వెన్నెలకంటి ప్రకాశం చేసిన పరిశోధనా ఫలితమే 'A Systemic treatment of certain aspects of Telugu Phonology' (1972). వ్యవస్థా వర్ణ సిద్ధాంతం ఆధారంగా తెలుగు వర్ణ నిర్మాణాన్ని, సంధిని, స్వర సమతను ఇందులో పరిశీలించటం జరిగింది. స్వరం, ఊనిక, ఆధునిక తెలుగుభాషలో నామాల్లోను, క్రియల్లోను కనిపించే స్వర సమత మొదలైన అంశాలను ప్రకాశంగారు చర్చించారు. బి. రామకృష్ణారెడ్డి 'Localist studies in Telugu syntax' (1976) అనే సిద్ధాంత వ్యాసాన్ని ఎడింబరో విశ్వవిద్యాలయం నుంచి వెలువ రించారు. సమకాలీన వ్యవహారభాష, ముఖ్యంగా రాయలసీమ మాండలికం పైన ఆధారపడి తెలుగు వాక్య నిర్మాణంలోని విశేషాలను అధికరణ (Localist) సిద్ధాంతాన్ని అనుసరించి ఇందులో పరిశీ లించటం జరిగింది. ఈ సిద్ధాంతాలన్నిటికి తెలుగు దేశంలో అంతగా ప్రచారం రాలేదు. ఎడింబరో

విశ్వవిద్యాలయంలోనే కె. నాగమ్మరెడ్డి 'An Instrumental Study of Telugu vowels and consonants' (1981) అనే అంశంపైన పరిశోధన చేశారు. తెలుగులోని స్వరాలను, వ్యంజనాలను యంత్రాల సహాయంతో పరిశీలించి ఉచ్చారణాత్మక ధ్వనిశాస్త్రానికి, ధ్వన్యుత్పత్తి శ్రవణశాస్త్రానికి ఉన్న సంబంధాన్ని ఇందులో పరిశీలించటం జరిగింది. ఛామ్స్కీ పరివర్తన (transformational), ఉత్పాదక (generative) సిద్ధాంతాలపైన అమెరికాలో ప్రచారంలోకి వచ్చిన ఉత్పాదక అర్థ పరిణామ (generative semantics) సిద్ధాంతాన్ని అనుసరించి 'Auxiliary verbs in Telugu' (1982) 'తెలుగులో సహాయక క్రియలు' అన్న అంశంపైన కిలారి నాగ ప్రభాకరరావు అణ్ణామలై విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. ఏ.విశ్వనాథం Tagmemic సిద్ధాంతాన్ననుసరించి 'Telugu Phrase structure' అనే విషయంపైన ఇటీవలే పరిశోధన పూర్తిచేశారు. పూనా విశ్వవిద్యాలయానికి చెందిన షేరి భాస్కరరావు 'A grammar of Telugu Consative Constructions' (1971) అనే వ్యాసంలో, తెలుగు ప్రేరణార్థకాలను గురించి, 'On the syntax of Telugu existential and copulative predication' (1971) అనే వ్యాసంలో తెలుగులో ఉండు, అగు - క్రియల తత్త్వాన్ని గురించి-ఆధునిక భాషా శాస్త్ర పద్ధతులలో చర్చించారు. కె.వి. సుబ్బారావు 'Some phonological changes in Telugu' (7 ). 'Vowel harmony in Telugu and paren theses and infinite rule schematanotation' (72) మొదలైన వ్యాసాలలో తెలుగులో ధ్వని విపరిణామాలను గురించి, స్వర సమీకరణాన్ని గురించి పరిశీలన చేశారు.

ఇటీవల యుగోస్లావియా ధ్వని శాస్త్రజ్ఞుడైన కోస్టిచ్ (Djordje Kostic) తో కలసి భద్రిరాజు కృష్ణమూర్తిగారు సిద్ధంచేసిన 'Telugu phonetics' అనే గ్రంథంఆధునిక పద్ధతులలో తెలుగు భాషా పరిశోధనకు ఎంతగానో ఉపకరిస్తుంది.

భాషా శాస్త్రంలో ఇటీవల బాగా ముందుకు వచ్చిన రంగం భాషా - సామాజిక పరిశోధన (Socio - linguistics). తెలుగులో ఈ రంగంలో కూడా కొంత ప్రాతిపదిక వేసినవారు కృష్ణమూర్తి గారే. 'Bilingualism and social dialets in Telugu' (1972), అనే వ్యాసంలో విద్యావంతులు నిత్యవ్యవహారంలో అవసరం లేకుండా కూడా ఇంగ్లీషు పదాలు ఎక్కువగా వాడినా, లిఖిత భాషలో మాత్రం ఇంగ్లీషు పదాలను వాడటం కన్న సంస్కృతం వాడటానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారన్న విషయాన్ని చర్చించారు. తెలుగు భాషా ప్రామాణికీకరణకు సంబంధించిన సమస్యలను అనేక వ్యాసాలలో కృష్ణమూర్తిగారు చర్చించారు. బూదరాజు రాధాకృష్ణ 'Diglossia in Telugu' (1971) 'Study of diglossia and the Telugu Situation' మొదలైన వ్యాసాలలో తెలుగు విద్యావంతుల సమాజంలో రెండు రకాల భాషా రూపాలను, అంటే శిష్ట, శిష్టేతర భాషా రూపాలను భిన్నసందర్భాలలో ఉపయోగించేపరిస్థితుల వలన ఉత్పన్నమయ్యే సమస్యలను పరిశీలించారు. విశ్వవిద్యాలయాలలో భాషా-సామాజిక పరిశోధనా రంగంలో కొంత కృషి సాగుతున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషా శాస్త్ర శాఖలో త్రేట్లూరి బాపూజీ చౌదరి 'Language standardization versus Identity in Hyderabad Telugu' (1979) అనే అంశంపైన పరిశోధన చేశారు. అమెరికన్ సామాజిక భాషా శాస్త్రపండితుడు విలియం లెబోవ్ (Villiam Labove) పద్ధతు

లను అనుసరించి చేసిన పరిశోధన ఇది. భాషా వ్యవహారంలో జరిగే మార్పుల్ని ప్రభావితం చేసే సామాజిక విషయాలను బాపూజీ ఇందులో చర్చించారు. పి.సి. నరసింహారెడ్డి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 'తెలుగు-తమిళ ద్విభాషుల భాషా సామాజిక పరిశీలన' పైన పరిశోధన పూర్తి చేశారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో భాషా-సామాజిక పరిశోధన రంగంలో ఇంకా కొందరు పరిశోధనలు కొనసాగిస్తున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషాశాస్త్ర శాఖలోను, తెలుగు శాఖలోను కూడా ఈ రంగంలో పరిశోధన సాగుతున్నది.

ఇటీవలి కాలంలో విశేషంగా పరిశోధన సాగుతున్న రంగం గ్రామనామాలు (Onomastics). ఈ రంగంలో మొదట నాయని కృష్ణకుమారి మొదలైనవారు కొంత కృషి చేశారు. దీనికి సంబంధించి మొదటి పిహెచ్.డి. పట్టం పొందినవారు కేతు విశ్వనాథరెడ్డి. 'కడప జిల్లా గ్రామనామాలు' అన్న అంశంపైన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధనచేసి 1975 లో డిగ్రీ పొందారు. ఇది ప్రధానంగా వర్ణనాత్మక విశ్లేషణపై ఆధారపడిన పరిశోధన. గ్రామనామాల చారిత్రక రూపాలను శాసనాల నుంచి గ్రహించి వాటికి వ్యుత్పత్తి నిర్ణయం చేశారు. ఇందులో మూడు ప్రధానమైన అంశాలు ఉన్నాయి. (1) భాషను విశ్లేషించటం, (2) సామాజిక పరిస్థితులను పరిశీలించటం, (3) చారిత్రక, సాంస్కృతిక, భౌగోళిక విశేషాలను నిర్ణయించటం. ఒక ప్రాంతపు భౌగోళిక, సాంస్కృతిక, చారిత్రక, భాషాస్థితిగతుల ప్రభావం ఆ ప్రాంతపు గ్రామనామాల నిర్మాణంపైన ఉంటుందన్న విషయాన్ని పరిశీలించే ప్రయత్నం విశ్వనాథరెడ్డిగారు చేశారు. తెలుగులోనే కాదు, భారతీయ భాషల్లోనే ఈ రంగంలో ఇది తొలిప్రయత్నం. తరువాత గ్రామనామాల మీద పరిశోధన చేసిన వారంద్దరూ ముఖ్యంగా ఈ సిద్ధాంత వ్యాసం చట్రంలోనే పరిశోధనలను వెలువరించారని తెలుస్తుంది. యార్లగడ్డ బాలగంగాధరరావు (నాగార్జున విశ్వవిద్యాలయం) 'అనంతపురం జిల్లా గ్రామనామాలు' (1980), ఎస్. జయప్రకాష్ (మద్రాసు విశ్వవిద్యాలయం) 'చెంగల్పట్టు జిల్లా గ్రామనామాలు' (1981) ఈ రంగంలో జరిగిన ప్రధానమైన పరిశోధనలు. శివలెంక శ్రీరామచంద్రమూర్తి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 'తెలుగు శాసనాల్లోని గ్రామనామాలు' (1975) అనే పేరుతో 13వ శతాబ్దానికి చెందిన శాసనాలలోని గ్రామనామాలను విశ్లేషిస్తూ పరిశోధస చేశారు. మద్రాసునగర స్థలనామాలను కె. సరస్వతీదేవి పరిశీలించారు. ప్రస్తుతం ఆదిలాబాద్, ఖమ్మం, చిత్తూరు, మెదక్, నల్గొండ, నెల్లూరు, పశ్చిమ గోదావరి మొదలైన జిల్లాలకు సంబంధించిన గ్రామనామాలపైన వివిధ విశ్వవిద్యాలయాలలో పరిశోధన సాగుతున్నది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో దీని కొక ప్రత్యేక కేంద్రం ఏర్పరచారు. ఆ విశ్వవిద్యాలయం పరిధికి చెందిన ప్రాంతాల గ్రామనామాల పరిశీలన అక్కడ సాగుతున్నది. ఈ విశ్వవిద్యాలయంలో ఇంటిపేర్లను గురించి కూడాకొంత పరిశోధన జరిగింది. కాటూరి శారద 'చంద్రగిరి ఇంటిపేర్లు' (1978), కంభం సిద్ధారెడ్డి 'పాకాలపౌరుల ఇంటిపేర్లు' (1978 అనే అంశాలపైన ఎమ్.ఫిల్., పొందారు. 'తెలుగులో ఇంటిపేర్లు-భాషా సామాజిక పరిశీలన' అన్న అంశంపైన నాగార్జున విశ్వవిద్యాలయంలో టి. సత్యవతి పరిశోధన చేస్తున్నారు. 'వ్యక్తినామాలు-భాషా సామాజిక పరిశీలన' అన్న అంశంపైన జె. వి. వెంకటేశ్వరరావు, 'మహాభారతంలోని వ్యక్తినామాల భాషా సామాజిక పరిశీలన' అన్నఅంశంపైన యలకుర్తి సోమసుందరనాయుడు శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. కోసం పరిశోధన చేస్తున్నారు. బంధువాచకాలపైన కూడా కొంత పరిశోధన జరిగింది.

ఇప్పుడిప్పుడే భాషా శాస్త్రంలో ముందుకు వస్తున్న రంగం శైలీశాస్త్రం. చేకూరి రామారావు, కె. సంపత్కుమారలకు 'వచన పద్యంలక్షణం' విషయంలో జరిగిన చర్చకు సంబంధించిన వ్యాసాలలో శైలికి సంబంధించిన విషయా లనేకం చర్చకు వచ్చాయి. రామారావుగారు ఇటీవలి వారి వ్యాసం 'Teaching of poetry' లో ఒక కవిరచనలోని వాక్య నిర్మాణాన్ని ఆలంకారిక లేక కళాపద్ధతితో ఎట్లా సమన్వయించ వచ్చునో ఎంకి పాటలను ఉదాహరణగా తీసుకొని పరిశీలించారు. కె. లక్ష్మీనారాయణ శర్మ ఎంకి పాటలను శైలీ శాస్త్ర పద్ధతిలో విశ్లేషించే ప్రయత్నంచేస్తూ కొన్ని వ్యాసాలు రాశారు. పాటిబండ మాధవశర్మ గారి 'మహా భారత ఛందః పరిశీలన' కూడా శైలీ శాస్త్రానికి సంబంధించిన పరిశోధనగా తీసుకోవచ్చు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో నాయని కృష్ణకుమారి ఈ విషయంలో కొంత కృషి చేశారు. 'ఆలంకారిక రచన-గణాంక శాస్త్రము' (1976) అన్న వ్యాసం ఈ మార్గంలో చేసిన ప్రయత్నం. ఆమె పర్యవేక్షణలో కె. కనకవల్లి 'శైలీశాస్త్రం, గణాంక పద్ధతి- ఆముక్తమాల్యద, మనుచరిత్రల పరిశీలన' అన్న అంశంపైన ఎమ్. ఫిల్‌కోసం పరిశోధన చేస్తున్నారు. నాగార్జున విశ్వవిద్యాలయంలో "తెలుగు పద్యశైలి" అన్న అంశంపైన చేరెడ్డి మస్తాన్‌రెడ్డి పిహెచ్. డి. కోసం కృషి చేస్తున్నారు.

పై ప్రత్యేక రంగాలలోనే కాకుండా భాషకు సంబంధించిన అనేక అంశాలపైన విశ్వవిద్యాలయాల్లోను, కొంత బయటా అనేక రకాలుగా పరిశోధనలు సాగాయి, సాగుతున్నాయి. తెలుగులో న్యాయ పరిభాషా పదాల వికాసం, పరిపాలనా పదాల వికాసం మొదలైనవి ఇక్కడ పేర్కొనవలసిన ముఖ్యమైన అంశాలు. రెండు భాషలకు సంబంధించిన లక్షణాలను తులనాత్మకంగా పరిశీలించటం మరొక ముఖ్యమైన అంశం. హైదరాబాదులోని సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీషు అండ్ ఫారిన్ లాంగ్వేజెస్‌లో ఎ. సుబ్బారావు 'ఇంగ్లీషులో, తెలుగులో ప్రసంగ స్వరూపం: ఒక తులనాత్మక పరిశీలన' (Discourse in English and Telugu : A Contrastive analysis) అన్న అంశంపైన పరిశోధన పూర్తి చేశారు. ప్రత్యేక వాక్యాలలో గాక సంఘటిత వాక్యాలలో, ప్రసంగ భాషా స్థాయిలోని వాక్యాల పరస్పర సంబంధాలను గురించి ఇందులో చర్చించటం జరిగింది. ద్రావిడ భాషల్లోని ముఖ్యమైన ఉర్దూ పదాలను తులనాత్మకంగా పరిశీలిస్తూ ఎలవర్తి విశ్వనాథరెడ్డి పరిశోధన చేస్తున్నారు. లక్కింశెట్టి కోట మల్లేశ్వర రావు ప్రసిద్ధ ద్రావిడ భాషల్లోని తద్భవాలను తులనాత్మకంగా పరిశీలిస్తున్నారు. తెలుగులో విభిన్న వ్యాకరణ విభాగాలపైన పరిశోధన సాగుతున్నది. తెలుగు వార్తా పత్రికల భాషపైన కూడా పరిశోధన కొనసాగుతున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయం భాషాశాస్త్ర శాఖ పత్రికాభాషపైన ఏర్పాటు చేసిన సదస్సు కొంత ఈ విషయంలో కొత్త దృక్పథాన్ని కలిగించటానికి తోడ్పడింది. తెలుగులో భాషా శాస్త్ర పరిభాషా వికాసం మీద కూడా పరిశోధన జరుగుతున్నది.

ఆధునిక భాషా శాస్త్ర పద్ధతిలో కాకుండా సంప్రదాయ వ్యాకరణ పద్ధతులను అనుసరించి కూడా భాషా పరిశీలన జరిగింది. వేటూరి ప్రభాకర శాస్త్రి గారు 'బసవ పురాణ' పీఠికలోను, వేదం వేంకటరాయశాస్త్రి గారు 'ఆముక్త మాల్యద' పీఠికలోను, ఆ గ్రంథాల భాషను గురించి పరిశీలన చేశారు. చిలుకూరి నారాయణ రావుగారు కొంత సంప్రదాయ పద్ధతిలో, కొంత ఆధునిక దృష్టితోను 'పండితారాధ్య చరిత్ర' లో భాషను పరిశీలించారు. భారతి మొదలైన సాహిత్య పత్రికలలో అనేక కావ్యభాషా ప్రయోగాలను గురించి వ్యాసాలు, చర్చలూ జరిగాయి. వాటినన్నిటినీ పేరు పేరునా పేర్కొనటం పరిమితమైన ఈ వ్యాసంలో సాధ్యంకాదు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంప్ర

దాయ వ్యాకరణ పద్ధతులలో భాషను విశ్లేషిస్తూ కొన్ని పరిశోధనలు జరిగాయి. జె. హేమలత 'దక్షిణాంధ్ర వాఙ్మయం-భాషా విశేషాలు' (1966) అనే సిద్ధాంత వ్యాసంలో దక్షిణాంధ్ర వాఙ్మయ యుగంనాటి వచన రచనలు, యక్షగానాలు, పదాలు మొదలైన దేశి ప్రక్రియలలో పాత్రోచిత భాష, తమిళ ప్రభావం మొదలైన అంశాలను పరిశీలించారు. రావి భారతి 'శ్రీకృష్ణదేవరాయల యుగ ప్రబంధాల్లో భాష'(1975) అనే సిద్ధాంత గ్రంథంలో చిన్నయసూరి బాలవ్యాకరణా న్ననుసరించి విషయ విభాగం చేసినా, అందులో లేని మాండలికాలు, వ్యావహారిక పదాలు, అన్య దేశ్యాలు, జాతీయాలు, సామెతలు మొదలైన విషయాలను కూడా పరిశీలించారు. కొకుంట్ల రామకృష్ణ శర్మ ఆంధ్ర వ్యాకర్తల దృష్టిలో తెలుగు ధాతువుల ప్రకృతి రూపాల్లో కలిగే వర్ణవికారాలను గురించి పరిశోధించారు. బి. వి. ఎల్. నారాయణరావుగారు తెలుగులో తత్సమ నిర్మాణాన్ని గురించి పరిశోధన చేసి కార్నెల్ విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్. డి. పొందారు. కె. వి. సుందరాచార్యులు అచ్చ తెనుగు రామాయణంలో భాషను గురించి పరిశోధించారు. కె. ఏ. సింగరాచార్యులు సంప్రదాయ దృష్టితోనే 'కవిత్రయ భారతంలో కృత్తద్ధితాలు' అన్న అంశంపైన పరిశోధన చేస్తున్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో రాజుల వెంకటసుబ్బయ్య పాల్కురికి సోమన రచనల్లోని భాషా ప్రయోగ విశేషాలు (1979) అన్న విషయంపైన పరిశోధన చేశారు. బాల ప్రౌఢ వ్యాకరణాలు సూత్రీకరించిన ప్రయోగాలకంటే భిన్నంగా పాల్కురికి సోమనలో కనిపించే ప్రయోగాలను చారిత్రక దృక్పథంతో పరిశీలించారు. భాషను గురించిన శాస్త్రం అనేక రకాలుగా వృద్ధి చెందుతున్న ప్రస్తుత కాలంలో సంప్రదాయ పద్ధతిలో భాషా పరిశీలన అంత సత్ఫలితాల నిచ్చే అవకాశం లేదు.

విదేశీయులు చాలామంది తెలుగు భాషను గురించి విభిన్న దృక్కోణాలతో పరిశోధనలు చేస్తున్నారు. వాటిని గురించి చెప్పాలంటే మరో ప్రత్యేక వ్యాసమే రాయవలసి ఉంటుంది. అయినా స్థూలంగానైనా ఇక్కడ కొంత పేర్కొనటం తప్పనిసరి. కార్నెల్ విశ్వవిద్యాలయానికి చెందిన జెరాల్డ్ కెల్లీ (Gerold Kelley) తెలుగు ధ్వనులను గురించి కొంత పరిశోధన చేశారు. టెక్సాస్ విశ్వవిద్యాలయంలో తెలుగుపైన ప్రత్యేక కృషి జరుగుతున్నది. అక్కడ ప్రొఫెసర్‌గా ఉన్న ఆండ్రేస్యోబర్గ్ (Andree sjoberg) 'The Problems of Telugu dialects' (1951) అనే అంశంపైన పరిశోధన చేసి పిహెచ్.డి. పొందారు. Formal, infomal వ్యవహారాలలోను, శిష్టశిష్టేతర వ్యవహారాలలోను కనిపించే ధ్వని నిర్మాణాన్ని గురించి, తెలుగులో వ్యక్తి నామాల గురించి, తెలుగులో అధికరణార్థాన్ని సూచించే విభక్తి ప్రత్యయాన్ని గురించి, క్రియా నిర్మాణం గురించి వ్యాసాలు రాశారు. రాయలసీమ భాష మీద ఆమె ప్రత్యేకంగా పరిశోధన చేశారు. స్టెఫెన్ మాంట్ గోమరి (Stephen E. Montgomary), ఎర్నెస్ట్‌వెల్స్ (Ernest wells), ఇయర్నెల్ బోల్టన్ (Iearnell B. Bolaton) తెలుగును గురించి పరిశోధన చేసిన వారిలో ఉన్నారు. నార్త్‌వెస్టరన్ విశ్వవిద్యాలయానికి చెందిన రాబర్ట్ విల్కిన్‌సన్ (Robert W. Wilkinson) ఆధునిక భాషలో పద మధ్య అక్షేప సూత్రాన్ని, రెండు హల్లుల మధ్య అచ్చు లోపించినప్పుడు జరిగే పరిణామాన్ని 'A Phonetic Constraint on a syncope rule in Telugu' లో చర్చించారు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన వోన్ బోయర్ (Curnelius Von Boyer), బ్రూస్ ప్రే (Bruce Frary) మొదలైన వారు కూడా తెలుగు పరిశోధనా రంగంలో చెప్పకోదగినవారు. ఇటీవలే ఎలెన్ జిమ్మర్‌మన్ (Ellen Zimmarman) తెలుగులో దబదబ, గబగబ మొదలైన అనుకరణాత్మక శబ్దా (onomatopoetic words) లకు ధ్వనులకు, అవి సూచించే భావాలకు గల సంబంధాన్ని గురించి M.A. పరీక్షలో భాగంగా చక్కని థీసిస్ రాశారు. ఆమె ప్రస్తుతం తెలుగు వారి ఇంగ్లీషు వాక్య నిర్మాణంపైన తెలుగు ప్రభావాన్ని గురించి పరిశోధన చేస్తున్నారు. విదేశ విద్యాలయాలలో తెలుగు బోధించటానికి ఎన్నో వాచకాలు, సంగ్రహవ్యాకరణాలు వచ్చాయి. ఒకప్పుడు

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ కార్యదర్శి, ప్రస్తుతం బ్రిటన్‌లో స్థిరపడ్డ జె.పి.ఎల్. గ్విన్‌తో భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఆధునిక తెలుగుభాషకు "Reference grammar of Telugu" పేరిట ఒక సమగ్ర వ్యాకరణాన్ని సిద్ధం చేశారు. రష్యాలో మిసెస్ స్వెత్లానా జేనిత్, మిసెస్ పెత్రూనిచెవా, నికితాగురోవ్ తెలుగు భాషారంగంలోకృషిచేస్తున్నారు. వీరు ముగ్గురూ కలిసి 'తెలుగు-రష్యన్‌నిఘంటువు'ను, తెలుగు సంక్షిప్త వ్యాకరణాన్ని తయారుచేశారు.

ఇంతవరకు తెలుగు భాషా శాస్త్ర రంగంలో జరిగిన పరిశోధనలను పరిశీలించి చూస్తే చాలా కృషి జరిగినట్టు కనిపిస్తుంది. భాషకు సంబంధించిన అనేక రంగాలలో ఈ కృషి జరిగింది. తెలుగుకు సంబంధించిన సాహిత్యాది ఇతర రంగాలలోలాగే భాషా పరిశోధనలో కొంత స్థాయి లేని కృషి జరిగి ఉండవచ్చు. కాని పరిమాణాత్మకంగానే కాకుండా గుణాత్మకంగా కూడా చెప్పుకోవలసిన కృషి జరిగిందని చెప్పవలసి ఉంటుంది. మొదటిసారిగా భద్రిరాజు కృష్ణమూర్తి గారు విదేశాలలో ఆధునిక భాషాశాస్త్ర రంగంలో శిక్షణ పొంది వచ్చిన తరువాత ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులతో తెలుగువారికి పరిచయం ఏర్పడింది. విశ్వవిద్యాలయాలలో ఆధునిక పద్ధతులలో భాషా పరిశోధనకు వారు తోవచూపారు. కృష్ణమూర్తిగారు ఆచార్యులుగా 1962 లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్ర శాఖ ప్రారంభమైంది. ఇప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో ఇదొక్కటే భాషాశాస్త్ర శాఖ. భాషాశాస్త్ర శాఖ అన్ని భాషలకి సంబంధించిందే అయినా ఇక్కడ కూడా తెలుగుకు సంబంధించే ఎక్కువగా కృషి జరిగింది. అన్ని విశ్వ విద్యాలయాలలోని తెలుగుశాఖలలో కూడా భాషా పరిశోధన సాగుతున్నది. సాహిత్యరంగంలో లాగా భాషారంగంలో విశ్వవిద్యాలయం బయట జరుగుతున్న కృషి తక్కువ. తెలుగు అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, మైసూరులోని భారతీయ భాషల కేంద్ర అధ్యయన సంస్థ 'CIIL' తెలుగు భాషాపరిశోధనకు కొంత దోహదం చేస్తున్నాయి. విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖలో ఆచార్య జి.ఎన్. రెడ్డిగారి ఆధ్వర్యంలో భాషాపరిశోధనకు ఎక్కువ ప్రాముఖ్యం లభిస్తున్నది. కొత్తకొత్త రంగాలలో పరిశోధన ఇక్కడ ప్రారంభమైంది. తూమాటి దొణప్పగారి ఆధ్వర్యంలో ఒకప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయంలోను, ప్రస్తుతం నాగార్జున విశ్వ విద్యాలయంలో భాషా పరిశోధనకు కొంత ప్రాముఖ్యం లభిస్తున్నది. కాని, భాషాశాస్త్ర పరిశోధనలను అన్ని తెలుగుశాఖలు అవసరమైన పద్ధతిలో ఉపయోగించుకుంటున్నట్టు కనిపించటం లేదు. అధికార భాషగా, బోధనాభాషగా తెలుగు ప్రయోగం అనేక రంగాలలో విస్తృతం అవుతున్న దశలో కావ్య ప్రయోగాలను మాత్రమే దృష్టిలో పెట్టుకొని భాషాధ్యయనం చేసినందువలన ప్రయోజనం లేదు. ప్రత్యేకంగా ఆ రంగంలో కృషి చేసేవారికి, భాషా పరిణామ పరిజ్ఞానానికి అది అవసరమే కావచ్చు కాని ఆధునిక అవసరాలకు, ప్రయోగాలకు అనుగుణంగా భాషను అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆధునిక అవసరాలకు అనుగుణంగా ప్రయోగదృష్టితో తెలుగుభాషా పరిశోధన జరుగవలసి ఉంది. ఈ దిశలో కూడ భద్రిరాజు కృష్ణమూర్తిగారే కొంత కృషిచేస్తున్నారు. భాష-ప్రామాణికత, వయోజన విద్య, భాషాయోజన (Language planning) మొదలైన విషయాలకు సంబంధించి పరిశీలనాత్మక వ్యాసాలు వారు రాశారు. పాఠ్యగ్రంథాలలో భాషను గురించి, అధికార భాషా పదజాలాన్ని గురించి వారు రాసిన విమర్శనాత్మక వ్యాసాలు ఎంతో నిశిత పరిశీలనతో కూడినవి. ముఖ్యంగా ఈ పద్ధతిలో భాషా పరిశోధన జరిగినప్పుడే తెలుగు భాషా పట్టభద్రులు బోధనారంగంలోనే కాక ఇతర రంగాల్లో కూడా ఎంతగానో ఉపయోగించే అవకాశం ఉంది. తెలుగుశాఖకు చెందినవారు అన్నిరంగాల్లో ప్రధాన పాత్ర వహించే అవకాశం ఉంది. ఈ అవసరాల్ని గుర్తించినప్పుడే భాషా శాస్త్రాన్ని సామర్థ్య దృష్టితో అంగీకరించే అవకాశం ఉంది. భాషాశాస్త్రజ్ఞులు కూడా శాస్త్రదృష్టికి, శాస్త్రపరిజ్ఞానానికి శాస్త్రీయదృష్టి, సామాజికదృక్పథం తోడైనప్పుడే శాస్త్రంగా భాషాశాస్త్ర ప్రాముఖ్యాన్ని సమాజానికి తెలియజేయగలరు. అప్పుడే తెలుగుదేశంలో భాషాశాస్త్రానికి భవిష్యత్తు ఉంటుంది.

# తెలుగులో ఛందఃపరిశోధన

—కోవెల సంపత్కుమారాచార్య

ఛందస్సూ, వ్యాకరణం, అలంకారం — ఈ మూడూ వేరువేరు శాస్త్రాలే కావచ్చు గాని, సాహిత్యం దృష్ట్యా ఇవి మొత్తంగా ఒక త్రిపుటి. భాషాశాస్త్రం వేరే ననుకున్నా, శాబ్దిక చర్చలు సాధారణంగా వ్యాకరణంలోనే అంతర్భవిస్తాయి. అలంకార మంటే కేవలం ఉపమా-ఉత్ప్రేక్షాదులని కాదు-సాహిత్య శాస్త్రానికి అది మొదటి పేరు. భాషా వ్యవస్థితిని వ్యాకరణం తెలివిడిపరిస్తే, దాన్ని రకరకాల కొలతల కొదిగించి, ఒడుపుల్లో విడియించి, చిత్ర విచిత్రమైన గతులతో, ప్లుతులతో నాద సౌందర్య సంధాన విధానాలను అన్వయించి రసభావాల ఉద్దీప్తిని ఛందస్సు సంతరించగా, ఈ మొత్తాన్నీ సాహిత్యీకరించి ప్రయోజనవంతంగా రూపు కట్టించేది అలంకారం. ఈ విధమైన ఏకముఖీనతవల్ల ఈ మూడూ కలిసి మెలిసి ఒక త్రిపుటి. అనుభవ దశలో ఈ త్రిపుటి ఏకీభవించి సహృదయుడికి 'చమత్కార' మయంగా ప్రయోజనవంతమైన అనుభూతి విశేషాన్ని కలిగించగా, వివేచన దశలో వీటిని విడివిడిగా పరిశీలించుకోవటం అంగాంగ వివేకానికీ,సమ్యగవగాహనకు ఉపకారకమయితుంది. ఈ యీ శాస్త్రాల్లో సాగిన కృషి, యెదిగిన పరిశోధన విజ్ఞాన దాయకమయితుంది. ముందు ముందు సాగవలసిన పరిశోధనకు ప్రేరకమయితుం దీ అనుశీలన.

స్థూలంగా భావిస్తే, ఈ మూడు శాస్త్రాల్లోనూ కృషి, పరిశోధన సమాన స్థాయిలో జరుగుతుందనీ, జరుగవలసి ఉంటుందనీ అనిపించవచ్చు కాని, తులనాత్మకంగా గమనిస్తే, ఈ మూడింటిలోనూ వ్యాకరణ అలంకార శాస్త్రాల విషయంగా జరిగిన కృషి-పరిశోధన ఛందశ్శాస్త్ర విషయంలో జరక్కపోవటం కొంత విచిత్రంగానూ, ప్రత్యేకంగా విచారించవలసిన అంశంగానూ కన్పిస్తుంది. అన్ని భాషల్లోనూ ఈ స్థితి ఇంతే. తెలుగు కూడా ఇందుకు భిన్నమేమీ కాదు. 1875 నుండి 1972 దాకా- అంటే, తొంభయ్యేనిమిది సంవత్సరాల సుదీర్ఘ కాలంలో వివిధ పత్రికల్లోనూ, ప్రత్యేక సంచికల్లోనూ అభినందన గ్రంథాల్లోనూ వెలువడ్డ 'వ్యాస రచనల సూచి'[1]ని ఒక ఆధారంగా తీసుకొని గమనిస్తే, వ్యాకరణానికి సంబంధించిన వ్యాసాలు 442 నమోదయి ఉన్నాయి. శాబ్దిక రచ్చలకు సంబంధించినవి కూడా కలుపుకుంటే, మొత్తంగా 793. మరి, అలంకార సంబంధి వ్యాసాలను లెక్కవేస్తే నమోదయినయి 333. కాగా, ఛందస్సుకు సంబంధించిన వ్యాసాలు మాత్రం కేవలం 198 మాత్రమే. అంటే, రెండు వందలు కూడా పూర్తిగా దాటలేదు. వీటిలో ఒకటి రెండు వ్యాసాలు రెండేసిసార్లు నమోదయినయి. వ్యాసకర్తలు డెబ్భయ్యేనమండుగురు. మరి, ఈ 'సూచి' లో నమోదుకాని వ్యాసాలు మరి కొన్ని కూడా ఉంతవచ్చు ననుకుంటే-ఉన్నయి కూడా. మచ్చుకి-పాడి వేంకట నారాయణమూర్తి అను వేంకట స్వామిగారి 'నన్నయ భట్టారకుని కవిత్వములోని ఛందో విశేషములు' (అముద్రిత గ్రంథ చింతామణి; జూన్-జూలై, 1897), అన్న వ్యాసం ఈ 'సూచి'

1. 'వ్యాస రచనల సూచి' – సంకలన కర్త : నే. శ్రీకృష్ణమూర్తి; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ – 1977.

లెక్కలేదు. దువ్వూరి రామిరెడ్డిగారి 'ద్విపద రచన: గణభేదము' (ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధం; 17-6-1922) ఇందులో కన్పించదు. శ్రీశ్రీగారి 'ముత్యాల సరం: ఒక కృషి' (ఉదయిని; ఫిబ్రవరి, 1935; సంపత్కుమారగారి 'దేశీయ గణములు: లాక్షణిక మతభేదము' (సాహితి; నవంబరు, 1963)- ఇట్లాగే ఇంకా చేరని వ్యాసాలు మరికొన్ని ఉండి ఉండవచ్చు.[1] కాగా, వీటివల్ల ఆ 192 అన్న సంఖ్య కొంత పెరుగవచ్చుగాని, మిగతా విభాగాల్లో స్థితి కూడా ఈ విధమైందే కావటాన, వాటి సంఖ్య కూడా పెరుగవచ్చు. ఈ లెక్కలు కేవలం ఉజ్జాయింపుగా ఉన్న పరిస్థితిని స్థూలంగా రూపుగట్టించటానికి మాత్రమే. దీనివల్ల వ్యక్తమయ్యే అంశం వ్యాకరణ-అలంకార శాస్త్ర విషయాల్లో కన్నా ఛందో విషయంగా జరిగిన కృషీ, పరిశోధనా మొత్తం మీద కొంత తక్కువగా ఉన్నదనేదే. ఇందుకు ఆ శాస్త్రానికి ఉన్న కొన్ని కొన్ని అసాధారణ పరిమితులే కారణం కావచ్చునేమో!

విడివిడి వ్యాసాల విషయ మిట్లా ఉండగా, వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన 'పరిశోధన' తరహాను గమనించినా పరిస్థితిలో పెద్ద మార్పేమీ కన్పించదు. వివిధ విశ్వవిద్యాలయాల్లో పిహెచ్.డి.; ఎం. లిట్.; ఎం. ఫిల్., పట్టాల కోసంగా తయారయిన 'పరిశోధన పత్రాల' సూచి - 'తెలుగు పరిశోధన'[2]ను ఎంత పరిశోధించినా గూడా, ఛందస్సుకు సంబంధించి కేవలం నాలుగు 'పరిశోధన పత్రాలు' మాత్రమే నమోదయి ఉన్నాయి. మరికొన్ని ఉండవచ్చుననుకున్నా గూడా అవి మరో రెండు మూడింటికన్నా ఎక్కువగా ఉండి ఉండకపోవచ్చు. అదీ సందేహమే. మిగతా విషయాలకు చెందిన పరిశోధన పత్రాల సంఖ్య దృష్ట్యా ఛందో విషయ పరిశోధన పత్రాలసంఖ్య పెద్దగా గణించదగినంతదేమీ కాదు. ఇంతకూ ఈ నమోదయి ఉన్న నాల్గింటిలోనూ మూడు ఈనాటివరకూ వెలుగు చూడ నోచుకున్నట్టు కన్పించదు. మన దేశంలో ఈనాడు పరిశోధకుల, విమర్శకుల గ్రంథాల ప్రచురణకు లభించే అవకాశ-ప్రోత్సాహ- సహకారాలకు ఈ స్థితి ఒక ఉదాహరణ కావచ్చు.

'పరిశోధన' అనేది కేవలం విశ్వవిద్యాలయాల్లోనే జరుగుతుందని కాదు. 'స్నాతకోత్తర' పట్టాలు సాధించి, స్వేచ్ఛగానో, పరేచ్ఛగానో ఏదో ఒక విషయం అధికారికంగా నమోదు చేయించుకొని, పర్యవేక్షకులను సంపాదించుకొని, సవ్యంగా సాగి... అక్కడ అదో పెద్దవ్యవహారం. ఈనా డిది అందరికీ అనుభవంలో ఉన్నదే. కాని, ఇవేవీ లేకుండానే గాఢమైన అభినివేశంతో విశ్వవిద్యాలయాలకు వెలుపల ప్రయోజనవంతమైన 'పరిశోధన' ఎంతగానో జరిగింది, జరుగుతున్నది గూడా. ఎందరో గాఢ శీలురైన మహానుభావులు, పండితులు తమ జీవితాలకు జీవితాలను కేవలం పరిశోధనకుగా ధారపోసినారు. వాళ్లకు 'డాక్టరేటు' పట్టాలు లేవు, రావు. కాని, ఎంతో మంది 'డాక్టర్' లకు వారు ప్రాణ ప్రతిష్ఠ చేసినారు. అది అట్లా ఉండగా, అటువైపు చూసినాగూడా ఛందో విషయంగా పరిశోధన గ్రంథాలు మొత్తంమీద నాలుగైదింటికి మించినట్టు కన్పించదు. అచ్చయితే తప్ప ఇట్లాంటి గ్రంథాల ఉనికి ఈనాడు సామాన్యంగా తెలిసే అవకాశం లేదు. అందువల్ల అచ్చయిన, లభ్యమవుతున్న గ్రంథాలనుబట్టి మాత్రమే ఇట్లా అనవలసి వస్తున్నది.

---

1. పరిశోధకులకు ఎంతో ఉపయోగకరమైన ఈ 'సూచి'ని సమకూర్చిన కృష్ణమూర్తి గారు నిజంగా అభినందనీయులు. అయితే, ఇట్లాంటివి ఎవరు చేసినా, ఎంత చేసినా ఎంతో కొంత అసమగ్రత తప్పదేమో! ఆ పని అట్లాంటిది.
2. కూర్పరి: డా. పోరంకి దక్షిణామూర్తి; అనుబంధం 1.

మరి, పూర్వకాలీనంగా గమనిస్తే, ఆనాళ్ళలోని ఛందోగ్రంథాల్లో కొన్నింటిని 'శాస్త్ర' గ్రంథాలనీ, మరికొన్నింటిని 'పరిశోధనాత్మక' గ్రంథాలనీ వింగడించవచ్చు. కవిజనాశ్రయం, కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందం వంటివి 'శాస్త్ర' గ్రంథాలయితే, కవి సంజీవని, అప్పకవీయం, లక్షణ సారసంగ్రహంవంటివి 'పరిశోధనాత్మక' గ్రంథాలు. శాస్త్ర గ్రంథాలుగూడా వివేచన, విచారణ, పరిశోధన లేకుండా రూపొందవుగాని, వాటిలో కేవలంగా, ప్రధానంగా సూత్రీకరణలే కన్పించి, వివేచన చర్చలు వ్యాఖ్యలు వంటివి మరుగుపడి ఉండటాన అట్లా అన్పిస్తుంది. పరిశోధనాత్మక గ్రంథాల్లో ప్రముఖంగా చెప్పుకోవలసింది 'అప్పకవీయం'. అప్పకవి ఉపయోగించిన, ఉదాహరించిన గ్రంథాల సంఖ్యనూ, వైవిధ్యాన్నీ గమనిస్తే, ఆయన నెరపిన పరిశోధన తీరు అవగతమయితుంది. 'ఆధునికం'గా గ్రంథాంతాన 'అనుబంధం'గా చేర్చబడే 'ఉపయుక్త గ్రంథసూచి' వంటిది అప్పకవీయంలో గ్రంథాదిన (1-5) కన్పిస్తుంది. ఇదిట్లా ఉండగా, యతులను గూర్చి విస్తృతంగా వివేచించి చివరకు-

వికటకవులు కొన్ని వింతలు కల్పించి
కవి జనాశ్రయమున గలిపినారు
వానిగైకొనంగ వలద ప్రయుక్తంబు
లెలసెప్పు భీము *డెఱిగియెఱిగి* - 8.261

అన్నాడాయన. 'అప్రయుక్తంబులు...ఎఱిగి యెఱిగి' అనటంతో భీముడు (కవిజనాశ్రయ కర్త)[1] తానూ ప్రయోగ పరిశోధన, పరిశీలన విస్తృతంగానూ, జాగ్రత్తగానూ సాగించినట్టు సూచించినాడు. పైగా -

ఇది చదివిన పిమ్మట మఱి
యెదియేనియు జదువు బుద్ధియేలా వాదమున్
బదపడి గ్రంథము లన్నియు
*వెదకి వెదకి* సారమెల్ల వివరింపంగన్. 1-7

అనీ అన్నాడు. తన పరిశోధనపై ఆయన కంతటి ధీమా. ఆ ధీమాను కాదనటం కష్టమే మరి. అప్పకవి సాగించిన పరిశీలనలో, చేసిన నిర్ణయాల్లో ఏవోకొన్ని 'లోపాలు' ఉండవచ్చు, ఆయన నిర్ణయాలు, 'అన్నీ' అంగీకరించటానికి వీలయినయి కాకపోవచ్చు కాని, ఆయన 'పరిశోధన' మాత్రం నిర్లక్ష్యం చేయదగిందేమాత్రమూ కాదు. వ్యాకరణ గ్రంథంగా మొదలై, సాగి ఛందోగ్రంథంగా ప్రసిద్ధమై విశేషంగా ప్రచారంలో కోటికెక్కిన ఆధికారిక మహాగ్రంథం అప్పకవీయం.తెలుగు ఛందోగ్రంథాల్లో మొదటగా 1859లో తాటాకులమీదనుంచి కాగితాలమీదికి అచ్చయి వచ్చిన గ్రంథ మిది. ఈ గ్రంథ ప్రణాళిక,పరిశోధన విధానంలోని శ్లిష్టత, పటిష్ఠతల సమ్మోహనత్వం కారణంగా కొన్ని ఇబ్బందులూ, కొన్ని సబ్బందులూ కలిగితే కలుగవచ్చుగాని, పూర్వకాలీనచ్ఛందోగ్రంథాల్లో పరిశోధనాత్మకత దృష్ట్యా అది ఎదిగిన ఎత్తు మరి దేనికీ అందలేదు.

## 2

భారతాది పూర్వ కావ్యాలను ప్రచురించటం మొదలయినప్పుడు వీటి కాధారమైన తాళపత్ర గ్రంథాల్లో రకరకాలుగా, అనేక సందర్భాల్లో అస్తవ్యస్తంగా ఉండిన 'పాఠాల'ను పరిశీలించి సుపాఠాలను ఎన్నుకోవలసిన, లేదా 'పరిష్కరించ' వలసిన అవసరం ఏర్పడింది. ఈ ఎన్నుకోవటం, పరిష్కరించటంలో - అంటే, 'పాఠనిర్ణయం'లో యతి - ప్రాసలు ఎంతగానో ఉపకరించిన అంశాలు. ఈనాడీ యతి-ప్రాసలనూ, వాటి ప్రయోగాన్నీ గూర్చి ఏమేమనుకున్నా, '-దీనివలన ఎన్ని బాధలు కవులు పడినను భాషాజిజ్ఞాసువుల కొక్కమేలు కలిగినది. ఈ

---

1. కొన్నేళ్ళ క్రితం దాకా కవి జనాశ్రయ కర్త ఎవరు? - భీముడా (వేములవాడ భీమనా)? రేచనా? అనేది ఛందః పరిశోధన రంగంలో తీవ్ర చర్చలకూ, రకరకాల వివాదాలకూ మూల ద్రవ్యం. మరి, ఈనాటిక్కూడా ఇది నిర్వివాదంగా కుదురుకొన్న అంశమేమీ కాదు.

తెలుగువారి ఛందోరీతులలో ఒక భాగముగా నున్న ప్రాసముల నున్న అర్ధానుస్వారముల బట్టియు, వడి స్థలముల నున్న అక్షరములను బట్టియు ప్రాచీనభాషా రూపములను గుర్తించుటకు ఒకమార్గము కనబడినది.[1] అందుకే వఝల చినసీతారామస్వామి శాస్త్రిలువారి వంటి వైయాకరణులు ఛందో విషయాలమ పరిశీలించ టానికి ఉత్సహించినారు. ఇదిట్లా ఉండగా, ఈ యతి-ప్రాసప్రయోగాల్లోనూ సంభవించిన 'లోపాల'ను 'సరిదిద్ద'టానికి అప్పకవీయం ప్రధాన ప్రమాణమైంది.[2] మిగతా లక్ష్యగ్రంథాలకన్నా ఒక స్పష్టమూ, పటిష్ఠమూ అయిన ప్రణాళికతో విస్తృత ప్రాతిపదికమీద రచింపబడిన పరిశోధన గ్రంథం కావటాన, ఇతర లక్షణ గ్రంథాల అలభ్యత కూడా ఒక కారణమై, దానికి ప్రాధాన్యం, ప్రామాణ్యం పెరిగింది. అప్పకవీయములో ఎన్ని లోపములున్నను తెలుగులోగల ఛందోరీతులను వివరించుటలో దానిని మించిన లక్షణ గ్రంథ మింకొకటి లేదు' అన్నారు గిడుగు సీతాపతిగారు. (తెలుగులో ఛందోరీతులు.పు.238). అందువల్ల దాన్ని ఆధారంగా తీసుకొని భారతాదుల్లోని పాఠాలను 'పరిష్కర్త'లు 'దిద్దటం' మొదలుపెట్టినారు. అసలు ఈ 'దిద్ద'టానికి మార్గదర్శకుడు అప్పకవే. తనకు అఖండ యతి అనిష్టం కావటాన (ఎందుకో మరి?) భారతంలో తన దృష్టికి వచ్చిన కొన్ని పాఠాలను దిద్దినాడు. (3-203-212). ఈ దిద్దటంలో ఆయన తాత్పర్యం—

వన్నయ ముఖ్యసత్కవిజనంబుల
కావ్యములందు లేఖకుల్
గొన్నియు, బాఠకాధములు గొన్నియు
బోకటవట్టి తక్కువై
యున్నెడ గాంచి జానపదు లోడక
దిద్దిన తప్పు దోవ లె
ల్లన్నిజమంచు గైకొనిన లక్షణవేత్తలు
సమ్మతింతురే!
3-202

అని. అప్పకవి తాత్పర్యం పూర్తిగా తప్పనటానికి వీల్లేదుగాని, తనకు అనిష్టమైన ప్రతిదాన్నీ ఇట్లాగే అనుకోవటంలో ఔచిత్యం లేదు. అప్పకవి ఈ తాత్పర్యాన్ని అనంతరకాలీనులూ; ఆధునికంగా, ముఖ్యంగా తొలినాళ్ళ 'పరిష్కర్త'లూ పాటిస్తూఉండటం చూసిన, అందులోని అనౌచిత్యాన్ని గుర్తించిన కూచిమంచి వేంకటరాయడు వీరి పాటింపునుగాక, అసలు అప్పకవీయాన్నే ఎదిరించినాడు. ఈ ఎదిరింపుకోసం ఆయన చేసిన పరిశోధన ఫలితమే 'సుకవి మనోరంజనం'. అనేక కావ్యాలనుంచేగాక, ప్రత్యేకంగా భారతంలోనుంచి నలభై అఖండయతి ప్రయోగాలను వివేచనపూర్వకంగా ప్రదర్శించినాడు. అప్పకవి చెప్పిన అనేకాంశాలను, ఆయనతోబాటుగా ఇతర లాక్షణికుల పొరబాట్లను అనేక ప్రమాణాలతో నిరసించి, నిరూపించి 'సరయిన' అంశాలను తేల్చినాడు. అయితే, వేంకటరాయడు చెప్పిందంతా ఒప్పే అనటం కాదుగాని ఆధునికమైన పరిశోధన స్ఫూర్తి, వ్యక్తీకరణవిధానం వేంకటరాయనిలో కన్పించటం విశేషం.

'ఇంచుకంత సంస్కృతమందు నించుకంతయాంధ్రమందు తెలిసి తెలియని పండితంమన్యులు నన్నయభట్టుగారి సూత్రముల ననుసరించిన

1. గిడుగు సీతాపతి-తెలుగులో ఛందోరీతులు పు.196.
2. 'లక్షణ గ్రంథము లన్నింటిలోను అప్పకవీయము మాత్రమే ముందుగా అచ్చుపడి ప్రచారములోనికి వచ్చి యుండుటచేత చాలా మందికి తక్కిన లాక్షణికుల అభిప్రాయములు తెలియలేదు. స్వతంత్రించి లక్ష్యములు పరిశీలించి లక్షణము సరిచూచుకొనుట సుకరము కాదు. గనుక అప్పటికి ముద్రితమై ప్రచారములో ఉన్న అప్పకవీయము మాత్రమే చదువుకొని అప్పకవి లక్షణములు వేద వాక్యములుగా పండితులు శిరసావహించిరి' – అప్పకవీయ విమర్శనము. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు. (వావిళ్ళ వారి 1934 నాటి 'అప్పకవీయ' పీఠిక.) పు. 61.

ప్రయోగములే సాధువులుగాని, సూత్రముల ననుసరించనివి అసాధువు లంటారు.' (1-167)

'రేఫ అకారములపట్ల పరిశీలించుటలో అందఱికినీ లోపమే.' (4-211)

'మహాకవుల ప్రయోగములకు, లాక్షణికులు నిర్ణయించిన రేఫ అకారములకు-సరిగా పరిశీలించనందున వ్యత్యస్తములు గలవు.'(4-232)

'భారతమందే రేఫ అకార సాంకర్యముంటే రేఫ అకార నిర్ణయమే పనిలేదు.'(4-277)

'సూత్రమొకరీతినుంటే మహాకవి ప్రయోగము లొకరీతి బహుళములు గలవు.' (1-169)

ఈ విధమైన వేంకటరాయని అభిప్రాయాలు ఆయన 'ఆధునిక'మైన ఆలోచనా విధానాన్నీ, అభివ్యక్తినీ పట్టిస్తయి. ఈ చివరి అభిప్రాయం తిరుపతి వేంకటకవుల దేవీభాగవత పీఠికలో ప్రతిధ్వనించింది. కాగా, సుకవిమనోరంజనం 1872లో రచింపబడింది. అది అచ్చుకావటం ఇటీవలే[1] అయినా, రాతప్రతులుగానే అది పండిత-పరిశోధక లోకంలో ప్రచారం పొందింది. గిడుగు సీతాపతి, రావూరి దొరస్వామి ప్రభృతులు అందులోని విషయాలను ప్రమాణీకరించి, వివేచించి ఉపయోగించుకున్నారు గూడా.[2] ఈవిధంగా వేంకటరాయని 'సుకవి మనోరంజనం' ఆధునికంగా ఛందః పరిశోధన, పరిశీలనలకు సూత్రం పట్టింది.

### 3

ఇంతకూ ఛందస్సులో పరిశోధించటానికి ఏముందని? — లక్షణ గ్రంథాలు ఏవో కొన్ని లక్షణాలను, నియమాలను ఏదో విధంగా రూపొందించినయి. వాటిని యథాతథంగా స్వీకరించటం, చేతనయితే, వాటినిబట్టి పద్యాలు రాసుకోవటం తప్ప! రెండురకాల అక్షరాల, అంటే, గురు-లఘు వర్ణాల వరుస ఏదో ఉంటుంది. మరి, అక్షరాల ఆ వరుసలో, సంఖ్యలో కొన్ని రకాల మార్పులుంటాయి. ఇష్టమైన వరుసల్ని పాటించటం, యతి చెల్లించటం, ప్రాస పొందించటం; తప్పయితే తప్పు, ఒప్పయితే ఒప్పు; ఇంతకంటే ఏముంది ?

—ఈ రకంగా అనుకుంటే, ఒక ఛందో విషయంలోనేగాదు, ఏ విషయంలోనూ పరిశీలించవలసింది గానీ, పరిశోధించవలసిందిగానీ ఏమీ ఉండదు. కాని వాస్తవం అదికాదు. ఎందుకంటే, ఆయా గ్రంథాలు చెప్పిన అంశాలు స్వతస్సిద్ధాలేమీ కావు. మహాకవుల ప్రయోగాల పరిశీలన మీద ఆధారపడి రూపొందినయి. ఆయా ప్రయోగాల్లోనూ క్రమ వికాసం, విస్తృతి, వైవిధ్యం కావలసినంతగా ఉంది. ఈనాటికీ లాక్షణిక విలక్షణ ప్రయోగాలు గుర్తింపబడుతూనే ఉన్నయి.[3] ఆయా లక్షణ గ్రంథాలు కూడా కాలక్రమంలో ఆయా లక్షణకర్తల పరిశీలన, పరిశోధన, అవగాహన ధోరణివల్ల వచ్చిన అభిప్రాయాల మేరకు కొత్తకొత్త అంశాలను పరస్పరం విభేదిస్తూనో; పూరిస్తూనో, సవరిస్తూనో వెల్లడిస్తూనే ఉన్నయి. పూర్వగ్రంథంకన్నా తదుత్తరగ్రంథం ఏదో ఒకానొక వినూత్నాంశాన్ని ఆవిష్కరిస్తూనే ఉన్నదనే విషయం అప్పకవే గుర్తించినాడు.

'ఒకదానికంటె మఱి వే
ఱొకటి విశేషంబు చెప్పుచుండు కతమునన్
సకల గ్రంథములను జదు
వక తెలియునె లక్షణ ప్రపంచం బెల్లన్-'1-6

అన్నాడాయన. 'సకల (లక్షణ) గ్రంథా'లనే కాదు;

---

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రప్రథమంగా 'సుకవిమనోరంజనం' పరిష్కరింప జేసి 1976లో ప్రచురించింది. పరిష్కర్త : కోవెల సంపత్కుమారాచార్య.
2. అప్పకవీయానికి గిడుగు వారి పీఠిక, పు. 60,61; రావూరి దొరస్వామి శర్మ-' తెలుగు భాషలో ఛందోరీతులు' (1962) పు. 308.
3. 'విశ్వనాథ ప్రయోగ వైలక్షణ్యసమీక్ష' - రావూరి దొరస్వామిశర్మ. భారతి, జనవరి 1962- మొదలయిన వ్యాసాలు

లక్ష్యగ్రంథాలను—కవుల ప్రయోగాలను అధ్యయనం చేస్తూ ఉంటే ఎన్నోవిధాల కొత్త కొత్త అంశాలు బయటపడుతూనే ఉంటయి. కొత్త అంశా లంటే, ప్రయోగించేవారికి ఆ అంశా లేమిటో సాధారణంగా తెలిసే ఉండవచ్చుగాని, వారు ప్రయోక్తలే తప్ప వ్యాఖ్యాతలు కాకపోవటాన అవి వెల్లడి కానప్పుడు, అప్పటివరకు తెలివిడికి రాకుండా ఉండిపోయిన అంశాలు.

లక్ష్య - లక్షణ గ్రంథాలకు సంబంధించీ, తదితరంగా కూడా పరిశోధన, పరిశీలన, వివేచనలు సాగుతున్నయి. లక్షణ గ్రంథాలకు సంబంధించి—ప్రత్యేక గ్రంథంలోని వివిధాంశాలను వింగడించి, వైరుధ్యాలను విశ్లేషించి, విశేషాలను నిరూపించటం; వివిధ గ్రంథాల, గ్రంథాల్లోని అంశాల తులనాత్మక పరిశీలన ఒక తరహా పరిశోధన కాగా, చెప్పబడిన అంశాలు ఆ విధంగా చెప్పబడటంలోని మౌలిక తత్త్వాన్నీ, కారణజాతాన్నీ గవేషించటం మరొక తరహా పరిశోధన. ఇరుగు పొరుగు ఛందో విధానాలతో, సంస్కృత విధానాలతో తెలుగు ఛందో విధానాన్ని వివిధాంశాల్లో పోల్చి సామ్య వైషమ్యాలనూ, అభిన్నత్వంలోని విభిన్నత్వాన్నీ, విభిన్నత్వంలోని అభిన్నత్వాన్నీ, విశేషాలనూ తులనాత్మకంగా ఆవిష్కరించటం మరొక మార్గం. వివిధ పద్యాలు రూపొందటంలోని ఆధార తత్త్వాలనూ, నాదసంధానంలోని, అభివ్యక్తిలోని విశేషాలనూ, ప్రత్యేకతలనూ, పద్యవైవిధ్యానికి ఉపకరించే, అపకరించే అంశాలను, పద్యస్వరూప నిరూపణకు అనువైన విధానాలను, పద్యగతి-ప్లుతులకు కారణమయ్యే రీతులనూ విశ్లేషించి ఉపయుక్త పద్ధతులను గవేషించటం; పద్యప్రయోగంలోని వైచిత్రిని, శిల్ప మార్మికతను పరిశీలించి నిరూపించటం; ఛందో విధానం రస-భావాదికానికి, ధ్వని రీతులకూ ఉద్దీపకమయ్యే తీరుతెన్నులను విశ్లేషించటం;—ఇట్లా ఉండగా, ఛందః ప్రయోగంలో ప్రత్యేక ప్రయోక్త రచన(ల)లోని వైలక్షణ్యాన్ని; లేదా ఒక ప్రత్యేకయుగం, ఒక ప్రత్యేక ప్రక్రియకు సంబంధించిన వివేచన; ఛందస్సు ద్వారా ఉద్గమించే వ్యాకరణ-అలంకార విషయాల పరిశీలన; ఛందః పరిమితుల - అపరిమితుల స్వరూప విచారణ—ఈ మొదలయిన అంశాలన్నీ ఛందఃపరిశోధనకు అందివచ్చే విషయాలు.

లక్షణ గ్రంథకర్తలందరూ పరిశోధకులే. వారి విషయం ప్రస్తుతాని కట్లా ఉంచి, ఛందోవిషయంలో పరిశోధన చేసినవారు గర్భకవిత్వం, బంధకవిత్వం అంటూ రాసినవారు ఒక తరహావారు. ఒక్కొక్క పద్యాన్ని, అందులోని వర్ణాల స్వరూప స్వభావాలను బట్టి ఎన్నెన్ని రకాల ఒడుపులతో మలుపులు తిప్పవచ్చు ననేదీ, ఒక్కొక్కపద్యంలో తదితర పద్యాలు ఏవేవి ఎన్నెన్ని ఇమిడి ఉన్నాయనేదీ వారు 'పరిశోధన' ద్వారా ఆవిష్కరించిన విషయాలు. చట్టం పరిధిని అధిగమించకుండానే ఎన్నెన్ని చమత్కారాలు సాధించటానికి వీలయితుందనేది వారు ప్రదర్శించినారు. ఈ విషయాన్ని కొస్తే, పూర్వుల్లో గణపవరపు వేంకటకవి ముమ్ముడు. ఆయన 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసం' ఇందుకు అద్భుతమైన ఉదాహరణ. మరి, గత శతాబ్ది ఉత్తరార్ధంలో మండపాక పార్వతీశ్వరకవిగారు ఇందులో ఉద్దండులు. ఆయన రచించిన 'ప్రబంధ సంబంధ నిబంధన' (అముద్రిత గ్రంథ చింతామణి ప్రచురణ-1896) గ్రంథం పరిశీలిస్తే ఈ అంశం స్పష్టపడుతుంది. అయితే, ఈ వ్యవహారమంతా సర్కస్-గారడీ లంటూ 'ఏద్దేవా' చేయవచ్చు. నిరసించవచ్చు. అది సులభమే. ఆ నిరసనలోని తాత్పర్యం ఏమయితేనేం గాని, ఇదంతా పరిశోధన పరిధిలోని దవటం మాత్రం కాదనరానిది. గమనించవలసిన మరో అంశ మేమిటంటే, పూర్వం చతుర్విధ కవితా ధురీణత ఒక ప్రతిష్ఠాకరమైన అంశం గానే భావించబడింది. తాను 'చతుర్విధ కవితామ

తల్లకు'డనని అల్లసాని పెద్దన, 'చతుర్విధ కవితా నిర్వాహకు' డ న సి రామ రా జ భూషణుడూ, తత్పూర్వోత్తరులు కూడా పలువురు ఒక గొప్పగా చెప్పుకున్నారు. బంధ-గర్భ విధానాలు 'చతుర్విధ కవిత' లోని 'చిత్ర' విధానానికి చెందినయి. రాఘవ పాండవీయం వంటివి భాషమీద ఆధారపడిన ద్వ్యర్థి (కథాద్వయ) కావ్యాలు కాగా, రావిపాటి లక్ష్మీనారాయణ గారి 'భారత (గర్భ) రామాయణం' గర్భ విధానం మీద ఆధారపడిన కథాద్వయ కావ్యం.[1] ఉత్పలమాలా పద్యం రామాయణ కథను నిర్వహించగా, ఆ పద్యంలో గర్భితమై ఉన్న గీత పద్యభాగం భారత కథను నిర్వహిస్తుంది. ఇదిట్లా ఉండగా ఆయా కవులు ఈ విధమైన పరిశోధనలు భూమికగా తమ రసమయ కావ్యాల్లో అనేక విధాలుగా ఛందఃప్రయోగంలో 'ప్రయోగాలు' చేసి ఉద్దీప్తిని సాధించినారు.

ఈ విధమైన కొన్ని అంశాల్లో సంస్కృతీయత ఉన్నా, దేశీయ చ్ఛందస్సులకూ, యతి - ప్రాసలకు సంబంధించిన పరిశోధన అంతా అచ్చంగా తెలుగుదే. ఉదాహరణకు సీసపద్యంగురించి సాగిన వివేచన గమనించవచ్చు. ఎక్కడో సంస్కృతంలో ఏమూలనో తొంగిచూచే అప్రసిద్ధమూ, అప్రయుక్తమూ అయిన 'శీర్షకం'తో తెలుగు పద్యాన్ని ముడిపెట్టబోవటం అనవసరమే కాదు, అసంగతం కూడా. ఒక పద్యాన్ని అదే పద్యంతో రెట్టించి, కొంతమార్చి, మరో పద్యంతో అనుబంధించి ఒక 'సమష్టి' పద్య స్వరూపాన్ని సంకల్పించిన సమష్టి భావ లక్షణం తెలుగుది. గీతం, ఆటవెలది పద్యాలను సీసానికీ, ఉత్సాహ పద్యానికీ[2] అనుబంధించి 'సీస' పద్యాన్ని విస్తరించింది తెలుగు ఛందః ప్రతిభ. దీని ప్రభావంతో అనంతరకాలాన కన్నడంలోనూ ఈ రూపం ఒక విధంగా ప్రచారంలోకి వచ్చింది. 'జనాశ్రయి' చ్ఛందంలో ఒక పద్యానికి మరొక పద్యం అనుబంధించే విషయం చెప్పబడింది గాని సంస్కృత కవు లెవరూ దాన్ని ఖాతరు చేసిన దాఖలా కన్పించదు. అదీగాక, ఈ విషయంలో జనాశ్రయికి మూలస్రోతస్సు తెలుగు సీస పద్య స్వరూపమే. యతిప్రాసలను ఉపయోగించటంలోని వైవిధ్యంతో, గణ ప్రయోగంలోని వైలక్షణ్యంతో రకరకాల అందాల నడకలు సాగే సీస పద్యస్యందనం తెలుగువారి స్వంత ఆస్తి. 'సీసమను పేరు సాంస్కృతికులు నీచార్థమున నీ ప్రాచీనాంధ్ర పద్యమునకు బెట్టిన బెట్టియుండ వచ్చును' కాని, నిజానికి అది బంగారమని చేకుమళ్ళ రాజగోపాలరావు గారు అభిప్రాయపడినారంటే,[3] ఆయనకీ పద్యంపై ఎంత ఆస్థ కుదిరిందో స్పష్టపడుతుంది.

తెలుగు ఛందః పరిశోధకులకు నన్నయగారి భారతం దొరికిన మొదటి నిధి. పరమ ప్రమాణం. కంద పద్య విషయం అట్లా ఉంచితే[4] దేశీయచ్ఛందస్సుల్లో నన్నయగారు అత్యధికంగా ఉపయోగించింది సీస పద్యం. ఆ సీస పద్యాలను పరిశీలించి యతి-ప్రాసయతి-ప్రాసల ప్రయోగ వైవిధ్యంతో అది పదహారు విధాలుగా ప్రయోగింపబడిందని 'ఆధునికం'గా ఒక పట్టికవేసి 'తెలుగు'పత్రిక (1919-20)లో గిడుగు సీతాపతిగారు ప్రదర్శించినారు. లభ్యత్వం కారణంగా ఈ పట్టిక, సీతాపతిగారు చెప్పిన అంశాలే బాగా వ్యాప్తిలో ఉన్నయి. అయితే, సీస పద్యం గూర్చి పరిశోధన అంతకు చాలా నాళ్ళ ముందే మొద

1. వివరాలకు విక్రాల శేషాచార్యులు గారి 'కథాద్వయ కావ్యములు' - భారతి, జూన్ 1958.
2. ఉత్సాహ పద్యానికి ఆటవెలది పద్యాన్ని అనుబంధిస్తే 'విషమ సీస' మంటారు. గీత పద్యాన్ని అనుబంధించ గూడదనే చండశాసనమేమీ లేదు.
3. 'సీస పద్యములు : వాని వలన తెలియనగు ఛందోవిశేషములు' - చేకుమళ్ళ రాజగోపాలరావు, శారద, అక్టోబరు 1924.
4. కంద పద్యం అచ్చంగా దేశీయమా? కాదా? అనేది ఒక చర్చనీయాంశం.

లైంది. 1897 లో పాడి వేంకట నారాయణమూర్తి అను వేంకట స్వామిగారు అముద్రిత గ్రంథ చింతామణి (జూన్-జూలై)లో 'నన్నయ భట్టారకుని కవిత్వములోని ఛందో విశేషములు' అనే వ్యాసం వెలువరించినారు. అందులో నన్నయగారి సీసపద్యాల్లో నాలుగు ప్రధాన భేదా లున్నయనీ, ఇవి ఆధారంగా మరికొన్ని అవాంతర భేదాలున్న యనీ; సీసాని కను బంధంగా లేని స్వతంత్రమైన ఆటవెలది, తేటగీతుల్లో గూడా ఈ విధమైన భేదాలున్నయనీ నిరూపించినారు. ఆతరువాత వేకుమళ్ళ రాజగోపాలరావుగారు 1910-11 ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలోనూ, ఆ నాళ్ళలోనే శశిలేఖ పత్రికలోనూ మరికొన్ని విశేషాలను వెలువరించినారు. అంతేకాదు, 1924 అక్టోబరు 'శారద' పత్రికలో 'సీస పద్యములు: వాని వలన తెలియనగు ఛందో విశేషములు' అనే వ్యాసంలో సీస పద్యానికీ, జానపద గీతాల్లోని నడకలకూ ఉండిన దగ్గరి సంబంధాన్నీ రకరకాలుగా నిరూపించినారు. పైగా ఆ వ్యాసంలో—

(1911 నుంచి) "ఇంచు మించుగా పదుమూడేండ్లు గడచినవి కాని, నేను ఋజువు చేసిన స్థితి యందే ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నిలిచి యుండెను గాని ఎవ్వరును నూతన విషయములను మన భాషకు జేర్ప జాలకపోయిరి. పైవిషయములు ఋజువు చేసిన తరువాత నేనును చాల అల్లరి పడితిని. బహు కష్టముల పాలైతిని. అందువలన నితరు లెవ్వరైన నీ పనిని జేయుదురు గాక యని నేను ఈ రంగము నుండి నిష్క్రమించితిని. కాని, ఎన్నా ళ్లూరుకొనవచ్చును? ఆయువు స్థిరమైనది కాదు. నా మిత్రు లొక్కరొక్కరే లోకయాత్ర చాలించుకొనిరి. ఆంధ్ర భాష కెంతో చేయనున్న (కొమర్రాజు) లక్ష్మణరావుగారు దివి కేగిరి. నెల్లూరి శాసనముల నించుక కదిలించి వంగూరి సుబ్బారావుగారు కీర్తిశేషులైరి. అందువలన యుద్ధ మల్లుని[1] కాలముననే గాక అంతకు పూర్వమునందు గూడ నుండిన యాంధ్ర పద్యముల లక్షణములను నా పరిశోధన వలన తెలిసినంత వరకు ఆంధ్రుల కొసగవలెనను తలంపుతో నిప్పు డీ వ్యాసములను వ్రాయుటకు నే నుపక్రమించితిని. సహృదయులై విద్వజ్జనులు అందు గుణ మేదేని యున్న యెడల నంగీకరింతురు గాక.

అన్నారాయన. (క్రికీతలూ, కుండలీకరణం నావి) ఈ ఉటంకింపు కొంచెం దీర్ఘమైతే అయి ఉండవచ్చు గాని, ఆనాడు సహృదయులైన ఆ మహా పండితులకు, పరిశోధకులకు పరిశోధన విషయంలో, తద్వారా ఉద్గతమైన విజ్ఞానాన్ని తమ ప్రజలకు అందించే విషయంలో వారికి ఎంతటి ఆస్థ, ఆత్రం, ఆవేదన, గాఢ శీలం, ఇబ్బందులకు వెనుకాడని స్థైర్యం ఉండేవనేది స్పష్టపరుస్తుంది.

ఈ వ్యాసంలో రాజగోపాలరావు గారు సాంప్రదాయికమైన ఇంద్ర గణాలను 'ప్రాచీన' గణాలని గూడా వ్యవహరించారు. జానపద గీతాల్లో మూడు ప్రాచీన గణాల తరువాత ఒక చిన్న గణం ఉండే స్థితి నుంచి ఏడు ప్రా. గణాలు + ఒక చిన్న గణం వరకు ఎదుగుదల సాగి, సీసపద్యం నిష్పన్నమైనదని ఆనా డాయన భావించినారు. చిన్న గణం అంచే స్థూలంగా సాంప్రదాయికమైన సూర్యగణ మని ఆయన అభిప్రాయం. చిన్నగణం స్థానంలో ఒకక్షరం, రెండక్షరాల (ప్రధానంగా లఘువుల) ఉనికిని గూడా ఆయన గుర్తించినారు. తురగవల్గన రగడ రెట్టింపై విజయ మంగళ రగడ రూపొందినట్టు సీసం కూడా

1. పదవ శతాబ్దానికి చెందిన యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో మధ్యాక్కర పద్యా లుండటాన ఛందః పరిశోధనలకు అదొక అమూల్య విషయమైంది. అంతకుముందే ధర్మవరం, కంచుకూరి శాసనాల్లో సీస పద్యం ప్రయుక్తమైంది.

ఒక విధమైన రెట్టింపురూపమే నన్న నిర్ధారణకు వచ్చినారు. అయితే, ఈ విషయంలో అనంతర కాలాన మరింత విస్తృతమైన పరిశోధన జరిగినా, సీసపద్య స్వరూప, స్వభావ, భేద పరిశీలనకు వేంకటస్వామి, రాజగోపాలరావు, సీతాపతి గారలు ఆద్యులనిపిస్తుంది. దేశీయ చ్ఛందస్సుల అవగాహన కోసం సంస్కృత చ్ఛందః ప్రభావిత లక్షణ గ్రంథాలను ఆశ్రయించటానికి బదులు, జానపద గీతాల నాశ్రయించటం, తమిళ-కన్నడ చ్ఛందోరీతుల ఆసరా తీసుకోవటం ప్రయోజనవంత మనీ, ప్రాచీనాంధ్ర చ్ఛందస్సంప్రదాయం అక్కడ మనకు లభ్యమయితుందని రాజగోపాలరావుగారు గుర్తించటం ప్రధానంగా గమనించదగిన విశేషం. 1913 లోనే ఆయన ఆ మేరకు ఈ అంశాలను వివరిస్తూ ఆంగ్లంలో ఒక గ్రంథం వెలువరించినారు.[1]

రాజగోపాలరావుగారు గమనించిన మరొక ప్రధానాంశం నన్నయగారి మధ్యాక్కరల్లోని కొన్ని పాదాలు అనంతాప్పకవుల ననుసరించి లక్షణ విరుద్ధంగా ఉన్నట్టు గుర్తించటం, వాటి సల్లక్షణత్వాన్ని నిరూపించటం. నన్నయగారి మధ్యాక్కరలకు సంబంధించి - 'ఈ విషయమును పరిశీలించిన వారిలో మొదటివారు టేకుమళ్ల రాజగోపాలరావు, బొడ్డుపాటి రాజన్న పంతులుగారలు. మరికొంత కాలమునకు వఝల చిన సీతారామస్వామి శాస్త్రుల వారలు' అన్నారు గిడుగు సీతాపతిగారు. (తెలుగులో ఛందోరీతులు.పు.204) ఆ ముగ్గురిలో చివరి ఇద్దరిలో ఆక్షేపణలు చేసినవారు మొదటివారైతే, లక్షణం కుదిరించటానికి ప్రయత్నించినవారు రెండవవారు. సీతాపతిగారు కూడా ఒక పరిష్కారం సూచించినారు. అయితే, అనంతాదులకు పూర్వం సూర్య- ఇంద్ర గణాల్లో వరుసగా గగ - సగణాలనూ; మ - సగ గణాలనూ కన్నడ ఛందస్సంప్రదాయం ప్రకారం తెలుగులోనూ పరిగణించి ఉంటారని[2] రాజగోపాలరావుగారు తమ పరిష్కారానికి ఆధారంగా పేర్కొనటం మరొక విశేషం. ఆయా పరిష్కార స్వరూపాలను[3] చర్చించటం ప్రస్తుతానికి వీలులేదుగాని, వాటి వల్ల కొన్ని ఛందో విషయాలు వెలుక్కి రాపటం గమనించదగిన విశేషం.

సీస పద్యాన్ని, మధ్యాక్కరను గమనించిన వీని దృష్టి నన్నయగారి తేటగీతి, ఆటవెలది పద్యాల మీదికి ప్రసరించినట్టు లేదు. కాని, పరుచూరి వేంకట సుబ్బయ్య చౌదరి'నన్నియ జాతులు: కొన్నిటి రీతులు' (ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక, ధాత. 1936) లో 'నేటి విమర్శకులు గూడా నా జూచినంత వరకు వాని ( గీతి - ఆటవెలదిభేదములు ) దడవలే దనియే నా తలంపు' అంటూ వీటిని పదమూడు భేదాల్లో వర్గీకరించి ప్రదర్శించినారు. సీస భేదాలకు తోడుగా ఈ గీతభేదాలుగూడా విశిష్టంగా గమనించదగినవి.

## 4

అముద్రిత గ్రంథ చింతామణి, శశిలేఖ, సుజనరంజని వంటి ప్రాచీన పత్రికలను, 'వ్యాస రచనల సూచి'ని గమనిస్తే అధికంగా యతిప్రాసలకు సంబంధించిన విచారణ, వివేచన కన్పిస్తుంది. అటు సంస్కృతంలోనూ, ఇటు తమిళ కన్నడాల్లోనూ లేని సరూపాక్షరయతి, తమిళ సంస్కృతాల్లో లేని ప్రాస తెలుగు పద్యాలకు నియతంగా అలవడటం, ఈ రెండూ జమిలిగా తెలుగు ఛందస్సుకు స్వంత విషయం కావటం వల్లనే వీటి విచారణ ఇంత విస్తృ

1. 'శారద'లోని వ్యాసంలో ఈ గ్రంథం నుంచి ఒక ఉటంకింపు ఉన్నది.
2. ఈ అంశం నా 'దేశీయ గణములు : లాక్షణిక మత భేదము' అనే వ్యాసంలో వివిధ ఉప పత్తులతో విస్తృతంగా చర్చించబడింది.
3. మధ్యాక్కరల సవరింపు సూచనలు చేసిన ఇతరులు- రావూరి దొరస్వామిశర్మ, దివాకర్ల వేంకటావధాని, సంపత్కుమార, పాటిబండ మాధవశర్మ.

తంగా జరిగిందనిపిస్తుంది. తెలుగు పద్యానికి ఒక బిగింపును, నాదసౌందర్యాన్ని సంపాదించటంలోనూ, ప్రాచీన భాషా స్వరూప నిర్ణయంలోనూ ఇవి ఉపయోగపడటం మరో కారణం. కవులు భావో ద్దీప్తికి వీటని రకరకాలుగా ఉపయోగించుకోవటం గూడా విశేషంగా గమనించవలసిన అంశం.[1] ఈ మొదలైన పలుకారణాలవల్ల యతి-ప్రాసల విచారణ, ప్రధానంగా యతుల విచారణ విస్తృతంగా సాగింది. పూర్వ లాక్షణికులు గుర్తించిన యతులనే గాకుండా విలక్షణమైన మరికొన్ని యతులను గుర్తించటం[2], పూర్వులు చెప్పిన యతి భేదాల్లోని మతభేదాలు, వాటి ఆవశ్యకత - అనావశ్యకతలు, ఔచిత్య-అనౌచిత్యాలు ఈ పరిశీలన వ్యాసాల్లో విషయాలు. శివకవులు— అంటే, పాల్కురికి సోమనాథాదుల యతిప్రాస ప్రయోగవైచిత్రిని ఆవిష్కరించటం వల్ల భాషావిశే షాలు గూడా వెలుగులోనికి వచ్చినయి. నిడుదవోలు వేంకటరావు, రావూరి దొరస్వామిశర్మ, దీపాల పిచ్చయశాస్త్రి, వంతరాం రామకృష్ణారావు మొదలైన వారి పరిశోధన-పరిశీలనలు ఈ విషయంలో విలు వైనవి. కవులను శివకవులు-భవికవులు (తదితర కవులు) అని విభేదించటం ఆరోగ్యకరమైన అంశం కాకున్నా, ఆ దృష్టితో సాగిన చర్చల్లో దేశీయ చ్ఛందోరీతులకు సంబంధించిన అనేకాంశాలు వెలుగు లోకి వచ్చినయి. గత శతాబ్ది ఉత్తరార్ధంలో జరిగిన కృషి స్వరూపం అలభ్యమైపోతున్న కారణంగా పునః అనే అంశాల పరిశీలన వాద-వివాదాల్లో, చర్చల్లో కొంత కొంత చర్విత చర్వణం ఉన్నా విశేషాంశా లను ఆవిష్కరించిన వ్యాసాలు చాలానే ఉన్నయి. ఇదివరకు ఉదాహరించినవే కాక— టేకుమళ్ళ రాజ గోపాలరావుగారి 'సంస్కృత వృత్తములు : ఆంధ్ర భాష' (భారతి. 1925 ఫిబ్ర.), 'కర్ణాటక భాష యందలి సంస్కృత వృత్తములు' (భా. 1928 జులై), 'ఛందశ్శాస్త్రము' (భా. 1929 జూన్); గిడుగు సీతాపతిగారి 'ఛందో రహస్య దర్పణము : పద్యరచనా వ్యవస్థ' (ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1921-22); నిడుదవోలు వేంకటరావుగారి 'ఛందస్సు: ద్విపద పద్ధతి' (భా. 1924) వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారి 'అప్పకవీయము : క్రొత్త తాళపత్ర ప్రతి' (భా. 1950 జూలై), 'ఛందో దర్పణ విశేష ములు'(ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక 1-3,1950); వంతరాం రామకృష్ణరావుగారి 'అప్పకవీయమందలి యతుల సంఖ్య పరిశీలన' (భా. 1972 మే); సంప త్కుమార గారి 'ద్విపద గణములు' (భా. 1963 జూన్), 'దేశీయ గణములు: లాక్షణిక మతభేదము' (సాహితి. 1963 నవం.); 'కమ్మని లతాంతములకు మ్మొనసి...' (భా. 1963 ఆగ.) ఖండి నాగరాజు గారి 'జాతిపద్యం : అంతరాక్కర' (భా. 1965 ఏప్రిల్),సామెతలు : ఛందస్సామ్యములు (భా. 1966 మార్చి), 'రగడల తాళ నిర్ణయము' (భా. 1968 ఆగస్టు);వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి 'ఆంధ్ర ఛ్ఛందసు' (ఆం. సా. ప. ప. 57, 1920), దేవర పల్లి వేంకటకృష్ణారెడ్డిగారి 'కవిరాజ విరాజితము : దేశికవిత' (భా. 1962 మే); ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారి 'సంస్కృతమున రెండపూర్వ వృత్తములు, (ఆం.సా.ప.ప.—సం. 28. సంచి. 2), సులోచనగారి 'పాత తెలుగు పద్యాల్లో 'యతి నియతి లేదా ?' (భా. 1967 జూన్), ఉమాపతి పద్మనాభ శర్మగారి 'ప్రాఁదెలుగు : యతి' (భా. 1967 ఆగస్టు) మొదలైన పలువ్యాసాలు పరిశోధనాత్మకంగా విశే షాంశాలను ఆవిష్కరించిన వ్యాసాలు. ఇవి కేవలం మచ్చుకి మాత్రమే.

---

1. 'తెలుగు ఛందో వికాసం' (కోవెల సంపత్కుమా రాచార్య) పీఠికలో విశ్వనాథ సత్యనారాయణ గారు యతిప్రాసలతో కవుల చమత్కారాలను సూచించి నారు.
2. ఋ-రు యతి, సౌభాగ్య యతి, ఉ-వు యతి మొద లైనవి.

తమిళ కన్నడ ఛందో విధానాలతో తెలుగు ఛందో విధానానికి సంబంధించి తులనాత్మక పరిశీలనకు దాదాపుగా ప్రథములు పేకుమళ్ళ రాజగోపాలరావుగారే నన్పిస్తుంది. నన్నయగారి మధ్యాక్కర పాదాల పరిశీలనలో ఈ అంశం వ్యక్తమయితుంది. అదట్లా ఉండగా, తెలుగులోని 'కుచ్చుల కథ, కామేశ్వరి (అక్కల) పాట ఛందస్సుకీ తమిళంలోని 'అహవల్పా'ఛందస్సుకీ ఉన్న సామ్యాన్ని గమనిస్తూ, సీత సురటి వంటి పాటల ఛందస్సయిన తరువోజ 'అహవల్పా'కు కేవలం రెట్టింపనీ ఆయన అభిప్రాయపడ్డారు. ఈ అంశాలు ఆయన ఆంగ్లగ్రంథంలో స్పష్టపరచబడినయి. ఈ మార్గంలో చిలుకూరి నారాయణరావుగారి 'మాత్రా ఛందస్సులు' (వ్యాస సంగ్రహం. గిడుగువారి అభినందన సంచిక 1933) వ్యాసం చాలా విలువైంది. యతి ప్రాసలకు సంబంధించి తమిళ తెలుగు విధానాలకు సంబంధించిన పరిశీలన విశేషంగా పరిశీలింపబడింది. కోరాడ రామకృష్ణయ్యగారు 'దక్షిణ దేశ భాషా సారస్వతములు: దేశి' (కోరాడ ప్రచురణాలయం, 1954) అన్న తమ గ్రంథంలో ఛందస్సాహితీ రీతులు, దేశి రచనలు అనే రెండధ్యాయాల్లో విస్తృతంగా తమిళ-కన్నడ-తెలుగు దేశీయ చ్ఛందో రీతుల పరిశీలన నెరపినారు. ఛందః పరిణామ క్రమంలో చారిత్రకంగా వివరించిన ఈ పరిశీలన అనేక వాస్తవాలను వెలుక్కి తెచ్చింది. తులనాత్మక పరిశీలనలో ఈ రెండధ్యాయాలు కలిసి ఒక ప్రత్యేక గ్రంథంగా భావించవచ్చు. ఈ ధోరణిలో తెలుగు కన్నడ లాక్షణిక గ్రంథాలు ఆసరాగా సంపత్కుమారగారి 'తెలుగు కన్నడ ఛందోరీతులు: ఏకత్వములోని భిన్నత్వములు' (భారతి. 1974 సెప్టెం:) అన్న విస్తృత వ్యాసం ప్రత్యేకంగా గమనించదగింది. సూర్యేంద్రగణాల్లోని మాత్రాసంఖ్యా వైవిధ్యానికి జానపద గీతాల రీతుల ప్రభావం ఇందులో ప్రతిపాదించబడింది.

తెలుగులో వివిధ లక్షణ గ్రంథాల ప్రచురణ క్రమంగా విస్తరించటంతో వాటికి విమర్శనాత్మక విపుల పీఠికలు సంతరించటం పరిశోధనలోని ఒక ప్రముఖ భాగమైంది. ఈ పీఠికల్లో ఆయా గ్రంథాల్లోని వివిధాంశాలను వివేచించటమే కాకుండా ఇతర లక్షణ గ్రంథాల్లోని, వివిధ ప్రయోగాల్లోని అంశాలతో తులనాత్మక పరిశీలన చేయటం గూడా ఒక గమనించదగిన విశేషం. ఈ పీఠికల్లో అప్పకవీయానికీ, అనంతుని ఛందోదర్పణానికీ గిడుగువారి పీఠికలు, ఛందోదర్పణానికి నిడుదవోలు వేంకటరావు, రావూరి దొరస్వామిశర్మగారల పీఠికలు, కవిజనాశ్రయానికి చిలుకూరి నారాయణరావు, జయంతి రామయ్య పంతులు, చివుకుల పాపయ్యశాస్త్రిగారల సమీక్షా పీఠికలు, లక్షణ సారసంగ్రహం, సుకవి మనోరజన గ్రంథాలకు సంపత్కుమారాచార్య పీఠికలు మొదలయిన పీఠికలు ఛందోవిధానంలోని అనేక విషయాలను పరిశీలన-పరిశోధనాత్మకంగా వెలువరిస్తున్నయి. వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి 'ధ్వని - లిపి - పరిణామం' అచ్చంగా ఛందస్సుకే సంబంధించింది కాకపోయినా యతి ప్రాసలాధారంగా భాషా పరిణామానికి ధ్వని మార్పిడులకూ సంబంధించిన అనేక విషయాలను వివరిస్తున్నది.

## 5

తెలుగులో ఛందో విధానానికి సంబంధించి వీలయినంత సమగ్రంగా ఒక గ్రంథం అవసరంగా భావించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1960లో 'తెలుగు భాషలో ఛందోరీతులు' అనే అంశంపై గ్రంథ రచనకు బహుమతి ప్రకటించింది. ఆ సందర్భంలో ఎన్ని గ్రంథాలు వచ్చినాయనేది అప్రస్తుతం కాని, అకాడమీ ప్రయత్నంవల్ల మూడు గ్రంథాలు వెలువడినయి. ఒకటి: గిడుగు సీతాపతిగారి 'తెలుగులో ఛందోరీతులు' (1961), రెండు: కోవెల సంపత్కుమారాచార్యగారి 'తెలుగు ఛందోవికాసం' (1962),

రామారావుగారు అభ్యుదయ మొదలైన పత్రికల్లో రాసిన వ్యాసాలు అట్లా ఉండగా "శ్రీశ్రీ ఛందోన్వేషణ" (సృజన 1980 జనవరి) వ్యాసం విశిష్టమైంది. ఒక ప్రత్యేక కవి ఛందః ప్రయోగం గూర్చి నిశితంగా సాగిన విశ్లేషణ ఈ తరహా పరిశీలనలో దాదాపు మొదటిదేమో! 'వచన కవిత్వం శ్రీశ్రీకి బాగా నలిగిన మార్గంలాగా కన్పించదు' వంటి వ్యాఖ్యలు రామారావు వంటి పరిశీలకుడే చేయదగినవి, పరిశీలింపదగినవీ ఇందులో ఉన్నాయి. అయితే, కేవలం శ్రీశ్రీని ప్రధానీకరించినా, మాత్రాఛందస్సంయోజనం, గతుల మార్పిడులు మొదలైన అంశాలను గూర్చి రామారావు పరిశీలన విశిష్టంగా గమనించదగింది. ఆలోచింపజేసే అంశాల నీ వ్యాసం నింపుకొని ఉంది.

ఈ సందర్భంలో ఛందోరంగంలోనే గాదు, మొత్తం విమర్శక రంగంలోనే ఒక ప్రయోగాత్మకంగా వెలువడిన గ్రంథం ప్రస్తావించవలసి ఉంది. అది 'వచన పద్యం: లక్షణ చర్చ' (1978). వచన పద్యం అసలు ఛందో విభాగంలో చేరుతుందా? చేరితే దాని స్వరూపస్వభావా లేమిటి ? చేరుకుంటే దాని విధానం ఏమిటి?— ఈ అంశాలు భూమికగా చేకూరి రామారావు-సంపత్కుమారల మధ్య జరిగిన వాదవివాదాలు ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక - భారతి పత్రికల్లో సాగినయి. ఆ ఉభయ వాదాల వ్యాసాలను కలిపి సంయుక్తంగా ఇద్దరు పరిశోధకులూ కలిసి ఒక గ్రంథంగా వెలువరించటం ఒక అపూర్వ ప్రయోగం. అనుబంధంగా బండి నాగరాజు గారి 'వచన పద్యం : ఒక పరిశీలన' (భారతి 1978 ఏప్రిల్) కూడా చేర్చటం ఒక విశేషం. ఈ వాద-వివాదాలలో వచన పద్యం ప్రధాన వాద విషయమే అయినా అది ఆసరాగా ఛందో భాషా వ్యాకరణ సాహిత్యాలకు సంబంధించిన ఎన్నో విషయాలు ప్రస్తావనకు వచ్చి చర్చింపబడినయి. వృత్త నిర్మాణ యంత్రం వంటి ఆధునికావిష్కారాలు, ఒకే పద్యం యొక్క వివిధ స్వరూప నిర్మాణాలూ మొదలైన అంశాలు గణ స్వరూప స్వభావాలు, పద్య నిర్మాణంలో వాటి ఉపయోగ అనుపయోగ దశలూ, అంతర్నిర్మాణం ఉనికి - లేములు సాంప్రదాయిక గణ విధానంలోని లోపాలు, పరిమిత ప్రయోజనం మొదలయిన అనేకాంశాలు ఆలోచనలకు ఉత్ప్రేరకంగా ఈ గ్రంథంలో చర్చింపబడినయి. ఈ గ్రంథ ప్రయోగం ఛందః పరిశోధన రంగంలో విశిష్ట రీతికి మార్గదర్శకంగా నిలిచింది.

## 8

తెలుగు ఛందః పరిశోధన రంగంలో జరిగిన కృషిని సమగ్రంగా, బీరువోకుండా సమీక్షించటం ప్రస్తుత పరిధిలో అసాధ్యమనేది నిర్వివాదం. అందని సమాచారం కూడా ఇందుకు ఒక కారణం. ఏదేమైనా ఛందోరంగంలో జరిగిన పరిశోధన వ్యాస-గ్రంథాల రూపంలో—మిగతా వాటితో పోల్చినప్పుడు కొంత తక్కువగానే అనిపించినా—విషయ విస్ఫోటనంలో మాత్రం వెనుకబడిపోలేదనేది మాత్రం మొత్తం మీద గమనించదగిన అంశం. అయితే జరుగవలసిన పరిశోధన అంతా జరిగిపోయిందని అనలేము. దేశీయ చ్ఛందస్సులనుగూర్చి ఇంకెంతో పరిశోధనకాస్కారం ఉంది. ఛందశ్శిల్పం విశేషంగా విశ్లేషించదగింది కూడా ఉన్నది. బహుముఖంగా విస్తరిస్తున్న పద్య సాహిత్యం ఉండగా పరిశోధన కేమీ కొదువలేదు. ఛందశ్శ్రుతత్వం పెరుగుతున్న దనుకొంటున్న ఈ కాలంలోనూ పద్యాలలో రకరకాల ప్రయోగాలు జరుగుతూ ఉండగా ఛందః పరిశోధనకు సమాప్తి అంటూ ఎక్కడ?



# ఇతిహాసాలు - పరిశోధన

—శలాక రఘునాథశర్మ

## 1

భారతదేశంలో మనకున్న ప్రసిద్ధేతిహాసాలు రెండు. రామాయణ మహాభారతాలు. ఇవి రెండూ మహోత్కృష్ట గ్రంథా లనటానికి ఒక్క భారతీయ భాషలలోనే కాక ప్రపంచంలోని పలుభాషలలో ఇవి అనేక రూపాలలో రూపొందా యనేది ప్రబల తార్కాణం. అసలు ఇతిహాస మనేదానికి ఏర్పడిన లక్షణాలన్నీ వీనినిబట్టే రూపొందాయేమో అన్నంత గొప్ప గ్రంథాలు ఈ రెండూ. గ్రంథ ప్రమాణంలో, తాత్త్విక భావాంతర్లీనతలో ఉపదేశంలో, పెద్దతనం ఈ రెండు గ్రంథాలకు సమగ్రంగా ఉంది. జనానికి వీనిపై గల ఆకర్షణ చాలా దొడ్డది. కాబట్టే "రాఘవేశ్వరు చారిత్రము నెంద రెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే" అన్న స్ఫూర్తితో ఎన్నో పునారచనలు ఏర్పడ్డాయి. అంతేకాదు, ఈ రెండు గ్రంథాలమీద తెలుగుభాషలో వచ్చిన విమర్శాదిరూప వాఙ్మయం అపారమైనది.

తెలుగుదేశంలో తెలుగుభాషలో ఈ రామాయణ మహాభారతేతిహాసాల నధికరించి ఏర్పడిన పరిశోధనను రేఖామాత్రంగా పాఠకుల కందించటం ఈ వ్యాసం ప్రధానోద్దేశం. సౌకర్యం కోసం ఈ విషయాన్ని ప్రతిపాదించటానికి ఒక విధమైన విశ్లేషణను ముందు మీముందుంచుతాను.

పరిశోధన రెండు విధాలు. ఒకటి పంధొమ్మిది యిర్వై శతాబ్దాలలో పండిత విమర్శకులు ఈ గ్రంథాలపై చేసిన కృషి. రెండవది విశ్వవిద్యాలయాలలో పరిశోధన పట్టాలకోసం ఆయా విద్వాంసులు చేసిన కృషి. ముందు రామాయణాన్ని గురించీ, తరువాత భారతాన్ని గురించీ.

## 2

మొదటి ఘట్టం. తెలుగు పొలంలో పుట్టిన మహామనీషులు ఈ రామాయణ మహాభారత గ్రంథాల లోతుకు చొచ్చుకొనిపోయి తెచ్చి మన కిచ్చిన గ్రంథ రత్నాలు కొల్లలుగా ఉన్నాయి. ఆయా గ్రంథాల లోతులకు వెళ్ళి విమర్శనాత్మకంగా చూడటం ఈ స్వల్ప పరిధిలో సాధ్యం కాదు కనుక నా దృష్టికి వచ్చిన గ్రంథాలను, గ్రంథకర్తలను ఇక్కడ స్థూలంగా నిర్దేశించి వదిలిపెడతాను.

రామాయణాన్ని అనుశీలించి అందలి వైశిష్ట్యాన్ని అనేక కోణాలనుండి సమీక్షించి గ్రంథానికీ గ్రంథకర్తకూ నివాళు లర్పించే ధోరణిలో వ్రాసిన గ్రంథాలు తెలుగులో సమృద్ధిగా ఉన్నాయి. వానిలో సురవరం ప్రతాపరెడ్డిగారి రామాయణ విశేషములు, ములుకుట్ల నరసింహావధానులుగారి రామాయణ సారోద్ధారము, దేవత సుబ్బారావుగారి రామాయణ వ్యాస తరంగిణి, పొన్నాడ సుబ్రహ్మణ్యంగారి శ్రీ రామాయణ విమర్శామృతము, గుంటి సుబ్రహ్మణ్యశర్మగారి శ్రీరామ చరితామృతము, గుంటూరి శేషేంద్ర శర్మగారి షోడశి-రామాయణ రహస్యాలు, శ్రీ విద్యా శంకర భారతీ స్వాములవారి రామాయణ కౌముది, దివాకరుని వేంకట సుబ్బారావుగారి శ్రీ రామావతారము మొదలైనవి ప్రముఖ గ్రంథాలు. వావిలకొలను

సుబ్బారావుగారు వ్రాసిన మంథర వ్యాఖ్యలో కూడ అనేక పరిశోధనాంశాలు కానవస్తాయి. ఇంకా రామాయణం పైన భక్తి తాత్పర్యాలతో కృషి చేసిన మహానుభావులు విశ్వనాథ సత్యనారాయణ, కల్లూరి చంద్రమౌళి వంటివా రెందరో ఉన్నారు.

కేవలం చారిత్రక దృష్టితో ఆధునిక భావనలతో ఒక్కొక్క సన్నివేశంలో దోషోద్ఘాటనయే ప్రధాన లక్ష్యంగా రూపొందిన గ్రంథాలు కూడా లేక పోలేదు. అట్టివానిలో క్రొత్త సత్యనారాయణచౌదరి గారి రామాయణ రహస్యాలు, రంగనాయకమ్మగారి రామాయణ విషవృక్షం పేర్కొనదగినవి. అయితే ఈ గ్రంథాల ఖండన గ్రంథాలు కూడా అతి శీఘ్ర కాలంలోనే వెలువడ్డాయి. ఒకరకంగా ఈ విధమైన పరిశోధన సత్ఫలితాలనే యిస్తున్నది. విషవృక్షం లాంటి గ్రంథాల ప్రేరణతో రామాయణాన్ని గూర్చి ఆలోచించే వారి సంఖ్య బాగా పెరిగింది. 'ముఖే ముఖే సరస్వతీ' అన్నట్లు ఆ ఆలోచన మథనంతో ఏ అమృతం ఆవిర్భవిస్తుందో ఊహించలేము.

## 3

ఇక మహాభారత గ్రంథం దగ్గరకు వస్తే దీన్నిపై వచ్చిన విమర్శలలో ప్రధానంగా పేర్కొనదగినవి పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన మహాభారత విమర్శనము, సప్రే పండితుని హిందీ గ్రంథానికి అనువాదమైన చర్ల నారాయణశాస్త్రిగారి మహాభారత మీమాంస, బంకించంద్ర చటోపాధ్యాయుని బెంగాలీ గ్రంథానికి బాలాంత్రపు సూర్యనారాయణరావుగారు చేసిన అనువాదం శ్రీకృష్ణచరిత్రము, కోటమర్తి చినరఘుపతిరావుగారి సుయోధన విజయము మొదలైనవి. ఇవన్నీ వ్యాసమహాభారతాన్ని పవిత్ర దృష్టితోకాక చరిత్రదృష్టితో చూచిన గ్రంథాలు. వీనిలో ముఖ్యంగా ధర్మరాజాదుల దోషాలను దుర్యోధనాదుల గుణవిశేషాలను పరామర్శించటం ప్రధాన తాత్పర్యం.

అయితే ఇది భారతీయ సంప్రదాయాభిమానం కలవారికి సహించరాని విషయం. వారికి వేదాలు, శాస్త్రాలు, స్మృతులు, పురాణేతిహాసాలు పవిత్రమైన గ్రంథాలు. దానికి ఆర్షవాఙ్మయమని పేరు. అందులో చరిత్రకంటె తత్త్వానికి, కథకంటె ప్రతీకార్థానికి, కుతూహలాన్ని రేకెత్తించే కథన శిల్పంకంటె విజ్ఞాన సర్వస్వప్రాయంగా రూపుదిద్దుకోవడానికి ప్రాధాన్యం ఉంటుంది. ఆ విధంగా సంప్రదాయమర్మా లెరిగిన మనీషి ప్రవరులు పైగ్రంథాలకు అనేక ప్రమాణాలతో కూడిన సమాధానాలు పటిష్ఠంగా చెప్పారు. వానిలో మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనుల వారి "మహాభారత కథాతత్త్వ నిర్ణయము", కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి 'మహాభారత చరిత్ర నిరాకరణము', శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి గారి 'మహాభారత రహస్యము', బాలవ్యాస బిరుదాంకితులు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారత తత్త్వ కథనము అనేవి ప్రసిద్ధ గ్రంథాలు. ఇవి ప్రాస్తావికంగా అనేక మహావిషయాలను సోపపత్తికంగా నిరూపించిన గ్రంథాలు. మహాభారత కర్త ఏ తాత్పర్యంతో ఆ గ్రంథాన్ని వ్రాశాడో ఆ తాత్పర్యాన్ని ఈ గ్రంథ దర్పణాలలో మనం విస్పష్టంగా చూడవచ్చు. పండిత వరేణ్యులు కాశూరి వ్యాసమూర్తిగారు 'భారతామృత రసమ'ను పరిశోధన గ్రంథ సంపుటాలను వ్రాసి ప్రచురించారు. అవికూడ భారత భారతీయ సంస్కృతికి దర్పణప్రాయాలే. మహాకవి, సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులుగారు మహాభారత విమర్శన మను గ్రంథాన్ని రచించారు. ములుకుట్ల నరసింహావధానులుగారు శ్రీ మహాభారత సారోద్ధారమనే గ్రంథంలో కొన్ని కీలకప్రాయమైన విషయాల మీద చక్కని పరిష్కారాలు సూచించారు.

తెలుగులో తెలుగు సంస్కృత భారతాల తులనాత్మక పరిశీలన రూపమైన తొలి పరిశోధన గ్రంథం కోరాడ రామకృష్ణయ్యగారు వ్రాసిన ఆంధ్ర భారత

కవితా విమర్శనము'. ఇందులో వారు ''భారత కవుల చాతుర్య విశేషములను మూలగ్రంథముతో పోల్చి విడదీయుటకు" సంస్కృతాంధ్ర భారతాలలోని విరాటపర్వాన్ని తీసికొన్నారు. ఈ ధోరణి తరువాతి పరిశోధకులకు చాలమందికి ప్రేరణ నిచ్చింది. అట్టి వారిలో మహాకవి గడియారం వేంకటశేష శాస్త్రిగారు పేర్కొనదగినవారు. వారు తిక్కన, కంకంటి పాప రాజుల ఉత్తర రామాయణాలను తులనాత్మకంగా పరిశీలిస్తూ ఒక గ్రంథం వెలువరించారు.

ఇక సంస్కృతంతో సాల్యాన్ని పెద్దగా పట్టించుకోకుండా కేవలం తెలుగు కవిత్రయం వారి కవితా శక్తియుక్తులను లోకానికి పట్టిచూపటానికై వ్రాసిన గ్రంథాలుకూడా చాలా ఉన్నాయి. అట్టివానిలో ప్రథమ గణ్యమైనది విశ్వనాథ సత్యనారాయణగారి ''ప్రసన్న కథా కలితార్థయుక్తి.'' తెలుగు విమర్శలో లోకానికి క్రొత్త వెలుగు చూపించిన మహాగ్రంథం అది. కవిత్రయంవారి కవితావిశేషాలను శ్లాఘించే మరో పరిశోధన గ్రంథం డా. నండూరి రామ కృష్ణమాచార్యులు గారి ''కవిత్రయము.'' ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రసిద్ధ విద్వాంసులచేత ఆంధ్ర మహాభారతోపన్యాసాలను ఇప్పించి, వారి ఉపన్యాస వ్యాసాలను ఒక గ్రంథ రూపంలో ప్రక టించారు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 'సారమతి నన్నయ' అనే గ్రంథాన్ని వ్రాశారు. డా. శలాక రఘునాథశర్మ 'భట్టారక భారత భారతి'అన్న పేరుతో నన్నయగారి కవితలో ఉండే విశిష్టతను వక్కాణించే వ్యాసాల సంపుటిని ప్రచురించారు. నెల్లూరు వర్ధమాన సమాజం వారు కూడా పండితులచేత ఉపన్యాసా లిప్పించి వానికి అక్షరాకృతి కల్పించారు. ఆ గ్రంథం పేరు "కవిత్రయ కవితా జయంతి." ఇంకా ఇటు వంటివి యెన్ని ఉన్నాయో !

**4**

క్రమంగా పరిశోధన విశ్వవిద్యాలయాల బాధ్య తగా రూపొందింది. పరిశోధన పట్టాల కోసం అనే కులు భారత రామాయణ గ్రంథాలలోని ఆయా అంశా లపై కృషిచేసి సిద్ధాంతవ్యాసాలను రచించారు. చాల మంది ఆ గ్రంథాలను ప్రచురించారు కూడా. అట్టి పరిశోధన వ్యాసాల స్వరూపాన్ని పరిశీలిద్దాం.

ఆయా విశ్వవిద్యాలయాలలో శ్రీ రామాయణ భారత గ్రంథాలపై జరిగిన పరిశోధన గణనీయంగానే ఉందని చెప్పాలి. ఇక్కడ ఒక్కమాట. తెలుగులో పరిశోధకులు రామాయణ భారత గ్రంథాలను ఇతి హాస దృష్టితో కాకుండా కావ్యదృష్టితోనే ఎక్కువగా అనుశీలించారని చెప్పక తప్పదు. కనుకనే ఇతిహాస లక్షణ సమీక్షకై చేసిన పరిశోధనల కంటె అలంకా రాది శాస్త్ర సమన్వయం, తులనాత్మక పరిశీలన, పాత్ర నిర్మాణ నైపుణ్యం, భాషాదృష్టి అనువానిపై సాగిన సిద్ధాంత వ్యాసాలే అధికసంఖ్యలో ఉన్నాయి.

తెలుగు రామాయణాలమీద నా దృష్టికి వచ్చిన పరిశోధన వ్యాసగ్రంథాలు పదునాలుగు. ఇందులో ముందు తులనాత్మక సిద్ధాంత వ్యాసాలను గూర్చి పరి శీలిద్దాం.

డా॥ చల్లా రాధాకృష్ణశర్మ తమిళ, తెలుగు భాషలలో వచ్చిన రామాయణాలను గూర్చి పరిశోధిం చారు. (మద్రాసు - 1968). డా॥ మరుటూరి పాండు రంగారావు తిక్కన, కాచవిభలుడు, కంకంటి పాప రాజు వ్రాసిన ఉత్తర రామాయణాలపై కృషిచేశారు. (ఆంధ్ర-1968). డా. కోలవెన్ను మలయవాసిని గారి పరిశోధనాంశం 'ఆంధ్ర వాఙ్మయం - రామాయణం, అనేది (ఆంధ్ర - 1971). డా. వి. సూర్యకాంతం 'వాల్మీకి రామాయణము - రంగనాథరామాయణము- తులనాత్మక విమర్శనాత్మక పరిశీలనము' అనే అంశ ముపై పరిశోధన చేశారు (ఆంధ్ర-1976). డా. ఎన్. వి, సత్యవతి 'కంకంటి పాపరాజు - ఆతని సమకాలి కులు' అనే అంశంపై పరిశోధించి పట్టం పొందారు. (ఉస్మానియా - 1976) డా. జంగా వేంకటసుబ్బా రాయుడు 'తెలుగులో ద్విపద రామాయణాలు - తుల

నాత్మక పరిశీలన' అనే అంశంపై సిద్ధాంత వ్యాసం వ్రాసి ప్రచురించారు (శ్రీ వేంకటేశ్వర- 1979).

ఈ విభాగంలోనికి వచ్చే లఘు నిబంధనలు (M.Phil) కొన్ని ఉన్నాయి. శ్రీ వావిలాల సత్యనారాయణశాస్త్రి 'వాల్మీకి విశ్వనాథలసుందరకాండలు-తులనాత్మక పరిశీలన' అనే విషయం పరిశోధనకు తీసుకున్నారు (బెంగుళూరు-1978). ఎం. వేదవతి గారు 'తెలుగు కన్నడ సాహిత్యాలలో కుమారరాముని కథ'పై పరిశోధన చేశారు (శ్రీ వేంకటేశ్వర-1981).

పాత్ర చిత్రణపై సాగిన పరిశోధన స్వరూపం ఇలా ఉంది: డా. పరవస్తు లక్ష్మి 'రామాయణ కల్పవృక్షంలోని ప్రధాన స్త్రీ పాత్రలు' అనే విషయంమీద కృషిచేశారు (కాకతీయ - 1980). కురుగంటి లక్ష్మి గారి పరిశోధనాంశం 'జానపదుల రామాయణపు పాటలు - స్త్రీ పాత్ర చిత్రణ' (M.Phil - ఉస్మానియా-1981).

కేవలం ఏదో ఒక రామాయణ గ్రంథాన్ని తీసుకొని విమర్శనాత్మకంగా అనుశీలించిన పరిశోధకులు కొందరు. వారిలో డా॥ రవ్వా శ్రీహరి 'భాస్కర రామాయణము-విమర్శనాత్మక పరిశీలన' అనే విషయంపై పరిశోధన చేశారు. (ఉస్మానియా-1980).

ఇటువంటి అంశాలపై వచ్చిన లఘు నిబంధనలు (M.Phil.) మరికొన్ని. సి. హేమగారి 'మొల్ల రామాయణానుశీలన' (ఉస్మానియా-1977), సత్యవల్లి గారి 'మొల్ల రామాయణము - ఒక అనుశీలన' (మద్రాసు - 1979) పంపన సూర్యనారాయణగారి 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము - పద్యశిల్పము' (బెంగుళూరు-1979) అనేవి యీ విభాగంలోనికి వస్తాయి.

రామాయణాలలో భాషా విశేషాలను గూర్చి ప్రత్యేకంగా జరిగిన పరిశోధన నా దృష్టి కందినది ఒకటి మాత్రమే. అది 'అచ్చతెలుగు రామాయణంలో భాషావిశేషాలు' అనేది. కర్త కందాడై వేంకట సుందరాచార్యులుగారు (M.Phil. - ఉస్మానియా 1978).

స్థూలంగా రామాయణ గ్రంథాలమీద జరిగిన పరిశోధన స్వరూపం ఇది. ఇవికాక వ్యాసాలెన్నో ఉన్నాయి. వానిని ఈ సందర్భంలో ఉట్టంకించటం కూడా సాధ్యం కాదు. ఈ కృషి ప్రశంసనీయమే. అయితే రామాయణం ఇతిహాసం. ఇతిహాస లక్షణ సమన్వయ రూపంగాగాని, ఇతిహాస ప్రయోజనసిద్ధిని గూర్చిగాని, ఐతిహాసిక ఉపదేశ వివరణను గూర్చి గాని జరిగిన పరిశోధన ఇంతవరకు రాకపోవటం గమనించదగ్గ విషయం. రావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఇట్టి కృషి మహాభారతేతిహాస విషయంలో కొంతవరకైనా జరిగిందని చెప్పవచ్చు. ఇక భారత గ్రంథ పరిశోధన సమీక్షకు వస్తాను.

ఇతిహాసిక దృక్పథం ప్రధానంగానో, రేఖా మాత్రంగానో పెట్టుకొన్న పరిశోధనాంశాల తీరు తెన్నులు ఇలా ఉన్నాయి:

గురు నిబంధనలు అంటే Ph. D. సిద్ధాంత వ్యాసాలను ముందు నివేదిస్తాను. డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి తిక్కన కావ్య శిల్పాన్ని ప్రధానంగా అనుశీలిస్తూ భారతంలోని తత్త్వదర్శనాన్ని గూర్చి పరిశోధించారు (ఉస్మానియా-1960). డా॥ ధారా రామనాథశాస్త్రి పరిశోధనాంశం 'ఆంధ్ర వాఙ్మయం-కృష్ణ కథ. ఇందులో భారత కృష్ణుడూ, అతనితోపాటు అతని తత్త్వము అనుశీలనకు వస్తాయి కదా ! (ఆంధ్ర-1975). డా॥ పెన్మత్స వేంకటరాజు 'మహా భారతము - ఉపాఖ్యాన తత్త్వము' అన్న సిద్ధాంత వ్యాసం వ్రాశారు (ఆంధ్ర-1975). డా॥ భాస్కర సాయి కృష్ణ యాచేంద్ర 'కవిత్రయ శ్రీ కృష్ణ దర్శనము'ను అనుశీలించారు. (మద్రాసు - 1980) డా॥ నండూరి గోపాలకృష్ణమూర్తి "ఆంధ్ర మహా భారతము-ఔపదేశిక ప్రతిపత్తి' అనే విషయం మీద

కృషి చేశారు (ఆంధ్ర-1980). డా. ఎం. కృష్ణ స్వామి 'తిక్కన భారతం - ధర్మాద్వైతం' అనే విషయంపై పరిశోధించారు (ఆంధ్ర-1981).

ఈ విభాగంలో వచ్చిన లఘు నిబంధనలు - ఎన్. నిర్మలాదేవిగారి 'నన్నయ భారతంలోని ఉపాఖ్యానాలు' (ఉస్మానియా 1975), మల్లాది సావిత్రిగారి 'నన్నయ భారతం - ఉపదేశాంతం' (ఉస్మానియా-1978) అనేవి.

ఈ పై నిబంధనలలో ప్రధానంగా తత్త్వం, ఉపదేశం అనే వానికి ప్రాధాన్యం ఉన్నది కనుక ఇవి ఇతిహాస వ్యక్తిత్వానికి దగ్గరలో ఉన్న పరిశోధనలుగా పేర్కొనటం జరిగింది.

ఇంక రెండవ దశలో కవిత్రయ భారత గ్రంథాన్ని ఆలంబనంగా తీసికొని రసధ్వన్యలంకారాది దృష్టితో జరిగిన పరిశోధనల స్వరూపం చూద్దాం. ముందు ఒక్కమాట: సాధారణంగా ఇతిహాసాలలో రసాదులకు కావ్యాలలో ఉన్నంత ప్రాధాన్యం ఉండదు. అయినా తెలుగులో కవిత్రయం వారు ఇతిహాసాన్ని కావ్యరూపంగా, శిల్పభూయిష్ఠంగా, సముచితాలంకారభరితంగా తీర్చిదిద్దిన కారణంగా రసధ్వన్యలంకార శిల్ప విషయాలలో ఆంధ్ర మహాభారత గ్రంథ పరమౌన్నత్యాన్ని ప్రదర్శిస్తున్న సిద్ధాంత వ్యాసాలు అనేకం వచ్చాయి. వీనిలో చాలా ముద్రితాలు కూడ అయ్యాయి.

డా॥ దివాకర్ల వేంకటావధాని గారు నన్నయ భారతం మీద కూలంకష పరిశోధన గావించారు (ఉస్మానియా-1957). డా॥ రామకోటిశాస్త్రి తిక్కన కావ్యశిల్పాన్ని ఆవిష్కరించారు(ఉస్మానియా-1960). డా॥ పాటిబండ మాధవశర్మ గారు ఆంధ్ర మహాభారతములోని ఛందఃశిల్పాన్ని పరమమనోజ్ఞంగా దర్శించి ప్రదర్శించారు (ఉస్మానియా - 1964). డా॥ వి. వి. యల్. నరసింహారావు నన్నయ అక్షర రమ్యతను ఆవిష్కరించారు.(శ్రీ వేంకటేశ్వర-1974). డా॥ శలాక రఘునాథశర్మ కవిత్రయ మహాభారతములో ధ్వని సిద్ధాంతాన్ని సమన్వయించి చూపించారు (శ్రీ వేంకటేశ్వర - 1975). డా॥ ఎస్. ఎల్. నరసింహారావు ఆంధ్ర మహాభారతములో అలంకారాలను సమీక్షించారు. (శ్రీ వేంకటేశ్వర-1978). డా॥ బి. రుక్మిణి నన్నయ భారతంలో ఉపమను గూర్చి పరిశోధన చేశారు (ఉస్మానియా - 1978). డా॥ జి.హరిహరనాథ్ మహాభారతంలో కరుణరసాన్ని పరిశీలించారు. (ఉస్మా - 1980). డా॥ ఎ. శివారెడ్డి 'ఆంధ్ర మహాభారతంలో రసపోషణ'ను గూర్చి పరిశోధించారు (ఉస్మా.-1982).

ఈ విభాగంలోని లఘునిబంధనలు ఆంధ్ర కమలాదేవిగారి తిక్కన భారతం - రసపోషణ (ఆంధ్ర-1978), ఎ. వేంకటరామిరెడ్డిగారి నన్నయ అలంకార శిల్పం (హైదరాబాదు-1982) అనేవి.

ఇక మూడవ విభాగం తులనాత్మక దృష్టితో ఏర్పడ్డ సిద్ధాంత వ్యాసాల సమీక్ష. దీనిని మళ్లీ రెండు భాగాలు చేయవచ్చు. మొదటి దానిలో మూలంతో తులనాత్మకంగా చూచిన వానినీ, రెండవ దానిలో ఇతర భాషా గ్రంథాలతో తులనాత్మకంగా చూచిన వానినీ చేర్చుకోవచ్చు.

డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు 'వ్యాస భారతము-నన్నయ పరిష్కారము' అనే విషయంపై పరిశోధన చేశారు. (ఆంధ్ర-1974). డా॥పి. సుమతి 'తిక్కన చేసిన మార్పులు - ఔచిత్యపు తీర్పులు' అన్న అంశంపై కృషిచేశారు. (ఉస్మా. - 1979).

రెండవ ఘట్టంలోనికి వస్తే డా॥ మాదిరాజు రంగారావు 'కవిత్రయం - నాచన సోమన - కావ్యానుశీలనము'ను గూర్చి చర్చించారు. (ఉస్మా.-1966). డా॥ పి. యశోదారెడ్డి 'తెలుగులో హరి వంశములు' అనే విషయంపై పరిశోధన చేశారు.(ఉస్మా.-1969). డా॥ కంబాహూరు వేంకటేశాచార్య 'మహాభారతము

పెరుందేవనార్, పంప, నన్నయల తులనాత్మక పరిశీలనము' చేశారు (కర్నాటక-1979). డా॥ బయ్యా రత్నావళి 'పంప నన్నయల భారతములు-తులనాత్మక పరిశీలనము' అనే సిద్ధాంత వ్యాసం వ్రాశారు (బెనారస్-1980). ఇవన్నీ పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాలు M. Phil. వ్యాసాల స్వరూపం ఇలా ఉంది:

కె. సౌజన్యకుమారి గారు 'తిక్కన కుమార వ్యాసుల విరాటపర్వాల తులనాత్మక పరిశీలన' ను (బెంగుళూరు-1978) బులుసు వేంకట సత్యనారాయణ మూర్తిగారు తిక్కన కుమార వ్యాసుల ఉద్యోగ పర్వము- తులనాత్మక పరిశీలనమును (బెంగుళూరు-1980) కావించారు.

నాల్గవ శాఖ పాత్ర చిత్రణను గూర్చిన పరిశోధన. డా. అప్పజోడు వేంకటసుబ్బయ్య గారి 'మహాభారతము - మానవ స్వభావచిత్రణ' (ఉస్మా-1972), డా. మల్లిసెట్టి సత్యవతిగారి 'కవిత్రయ దుర్యోధనుడు' ఈ విభాగంలో వచ్చిన పరిశోధనలు.

జక్కా వేంకటరమణప్ప గారి 'కవిత్రయ ఆంధ్ర మహాభారతము- ప్రముఖ స్త్రీ పాత్ర చిత్రణ' (అనంతపురం - 1978), కె. ఎస్. ఇందిరాదేవి గారి 'విరాటపర్వం- ద్రౌపది పాత్ర చిత్రణ' (ఉస్మా - 1980), వారణాసి వీరనారాయణశర్మ గారి 'ఆంధ్ర మహాభారతం ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణ ప్రాముఖ్యం-పాత్ర చిత్రణ' (ఉస్మా - 1980), పిన్నమనేని తిరుపతయ్యగారి 'తెలుగు భారతంలో ఉత్తర' (నాగార్జున - 1981) అనేవి ఈ అంశానికి సంబంధించిన లఘు సిద్ధాంత వ్యాసాలు.

తెలుగులో కవిత్రయం వారి భారతానికి తక్కిన సర్వకావ్య సముదాయం కంటె అన్ని విషయాలలోను ఒక విశిష్టత ఉంది. ముఖ్యంగా నన్నయ ఆదికవి. ఆతని ఒరవడిలో పయనించిన తిక్కన ఎఱ్ఱన్నలు కూడ తరువాతి తెలుగు కవులకు ఆదర్శప్రాయులయ్యారు. కాబట్టి వారి రచనలలోని ఆయా అంశాలతోపాటు భాష కూడ ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది. ఆ దృష్టితో కవిత్రయ భారతంలో భాషా పరిశీలన కూడా చాలమంది పరిశోధకులు చేశారు. వాని తీరుతెన్నులిలా ఉన్నాయి :

సుప్రసిద్ధ మహావిద్వాంసులు కీ॥శే॥ చిలుకూరి నారాయణరావు గారు పదకొండో శతాబ్ది తెలుగు భాషను గూర్చి పరిశోధించి మద్రాసు విశ్వవిద్యాలయ పట్టం పుచ్చుకున్నారు. ఇది తెలుగులోని తొలి పరిశోధన గ్రంథం (1929). డా. దివాకర్ల వేంకటావధానిగారి పరిశోధన గ్రంథం 'ప్రాఙ్నన్నయ యుగము-నన్నయ భారతము' అనే దానిలో కూడా భాషా విషయక పరిశోధన సుదీర్ఘంగా జరిగింది (ఉస్మానియా-1957). డా. జాస్తి సూర్యనారాయణ 'తెలుగు సమాసాల పరిశీలన - తిక్కన ప్రయోగాలు' అనే విషయంపై పరిశోధన చేశారు (శ్రీ వేంకటేశ్వర-1964). కీ॥ శే॥ డా. కల్లూరి నాగభూషణరావు 'నన్నయభాష-వర్ణనాత్మక వ్యాకరణం' అనే అంశంపై సిద్ధాంత వ్యాసం వ్రాశారు (శ్రీ వేంకటేశ్వర-1965). డా. ఎం. సీత 'తిక్కన భాష- నామ పదాంశ పరిశీలన' అనే అంశంపై పరిశోధించారు (అనంతపురం - 1980). గాదిరాజు సుబ్రహ్మణ్యం గారు 'తిక్కన భాష- క్రియా పదాంశ పరిశీలన' అనే విషయంపై సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించారు (శ్రీ వేంకటేశ్వర - 1982).

గార్లపాటి దామోదరనాయుడు గారు 'నన్నయ భారతం- సంస్కృత ప్రయోగాలు' అనే అంశంపై పరిశోధన చేశారు (M. Phil. - శ్రీ వేంకటేశ్వర 1978).

ఈ పై చూపిన అంశాలన్నీ ఒక అనుగతిలోనికి తొంగి వస్తున్నందువల్ల విభాగాత్మకంగా ప్రదర్శించటం సాధ్యమైనది. అలాకాక ఇంకా అనేక విషయాలపై సాగిన పరిశోధన ఎంతో ఉంది. దాని స్వరూపాన్ని ఈ క్రింది పట్టికలో పొందుపరుస్తున్నాను. హరివంశం, జైమిని భారతం వంటివి కూడ ఇతిహాస విభాగంలోనివిగా పరిగణించటం జరిగింది.

| వ. నం. | పరిశోధకులు | విషయం | విశ్వ విద్యాలయం | సం॥రం | పట్టం |
|---|---|---|---|---|---|
| 1. | డా॥ నండూరి రామకృష్ణమాచార్యు | తిక్కన భారత దర్శనం | మైసూరు | 1963 | Ph.D. |
| 2. | డా॥ వి. రామచంద్ర | ఎఱ్ఱాప్రెగ్గడ కృతులు-పౌర్వాపర్యం | శ్రీవేంకటేశ్వర | 1966 | ,, |
| 3. | డా॥ వి. విశ్వనాథశాస్త్రి | ఎఱ్ఱాప్రెగడ-అతని కృతులు | మైసూరు | 1969 | ,, |
| 4. | డా॥ ముదిగొండ వీరేశలింగం | జైమిని భారతం-సంశోధనాత్మక పరిశీలన | ఉస్మానియా | 1978 | ,, |
| 5. | డా॥ మూలంపల్లి చంద్రశేఖరశాస్త్రి | మహాభారతం - విజ్ఞానకోశం | ఉస్మానియా | 1979 | ,, |
| 6. | డా॥ డి. వి. రమణమ్మ | ద్విపద భారత కావ్య పరిశీలన | ఆంధ్ర | 1980 | ,, |
| 7. | వి. వసంతలక్ష్మి | సభాపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1977 | M.Phil. |
| 8. | సి. లలితకుమారి | తిక్కన ఉద్యోగపర్వం-రాజనీతి | ఉస్మానియా | 1977 | ,, |
| 9. | N. S. జయశ్రీ | ఉద్యోగపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1977 | ,, |
| 10. | మన్నేపల్లి గిరిజ | విరాటపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1978 | ,, |
| 11. | హెచ్. జి. హరి | భీష్మపర్వం - ఒక పరిశీలన | మద్రాసు | 1978 | ,, |
| 12. | ఏల్చూరి మురళీధరరావు | ద్రోణపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1978 | ,, |
| 13. | మాడభూషి రంగాచార్యులు | ఆంధ్ర మహాభారతంలో ప్రకృతి వర్ణనలు | ఉస్మానియా | 1979 | ,, |
| 14. | జి. సుగుణ | కవిబ్రహ్మకర్ణపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1979 | ,, |
| 15. | శేషగిరిరావు | ఆరణ్యపర్వం-ఒక పరిశీలన | మద్రాసు | 1980 | ,, |

మన ప్రసిద్ధేతిహాసాలకు తెలుగులో వచ్చిన రచన మీద జరిగిన పరిశోధన స్వరూపం ఇలా ఉంది. తక్కువ పరిధిలో వ్రాయవలసి వచ్చిన ఈ ఈ వ్యాసంలో చాలా భాగం నామనిర్దేశం మాత్రం గానే జరిగింది. వేరే మార్గం లేదు. ఈ వ్యాస నిర్మాణంలో నాకు బాగా ఉపకరించిన పట్టిక డా॥పోరంకి దక్షిణామూర్తిగారి 'తెలుగులో పరిశోధన.' మహాభారత విమర్శలో తప్పక పేర్కొనదగిన గ్రంథం వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి గారి మహాభారత తత్త్వకథనము.



# ప్రబంధములు - పరిశోధన

—దివాకర్ల వేంకటావధాని

ఆంధ్రవాఙ్మయమున ప్రబంధ యుగమునకు విశిష్టమైన స్థాన మున్నది. తిక్కన తాను భారతమున రచించిన పదునైదు పర్వములను ప్రబంధమండలి యని పేర్కొనెను. ఎఱ్ఱనకు ప్రబంధ పరమేశ్వరు డను బిరుద మున్నది. క్రీ.శ. 16వ శతాబ్దికి పూర్వముండిన కవులు కొందఱు తమ రచనలకు ప్రబంధ నామమునే వాడియుండిరి. సంస్కృతమున కావ్య ప్రబంధ శబ్దములు సమానార్థకములే. అందు దృశ్య ప్రబంధ గద్య ప్రబంధములను నామములు వినవచ్చుచుండును. అయినను శ్రీకృష్ణదేవరాయల కాలమున పెద్దనాదులు రచించిన మనుచరిత్రాది కావ్యములకే తెలుగున ప్రబంధము లను రూఢి యేర్పడినది. ప్రబంధ శబ్దము వినగానే తెలుగువారి కవియే స్మృతిపథమున నిల్చును. ప్రకృష్టమైన బంధము (చిక్కని చక్కని కూర్పు) కలది ప్రబంధ మను వ్యుత్పత్త్యర్థ మున్నను రూఢిని బట్టి ప్రఖ్యాత వస్తుకము, శృంగార రస ప్రధానము, ధీరోదాత్త నాయకము, అష్టాదశ వర్ణన భూయిష్ఠము, ఆలంకారిక రచనాబంధురము, పంచషాశ్వాస పరిమితము నైన చంపూకావ్యమునే తెలుగువారు ప్రబంధముగా భావింతురు. ఈ లక్షణములు గల కావ్యములు రాయలయుగమున పెక్కు వెలసి యుండుటచే దానికి ప్రబంధయుగ మను ప్రసిద్ధనామమేర్పడినది.

ఆంధ్ర ప్రబంధములందు సంస్కృతమునందలి మహాకావ్య, చంపూకావ్య, దృశ్యకావ్యముల లక్షణములు పుంజీకృతములై కనిపించును. రచనా ప్రౌఢియందును, భావ గాంభీర్యమునందును, వర్ణన సౌందర్యమునందును, శబ్దార్థాలంకార సౌష్ఠవమునందును, పాండితీ శౌండీర్యము నందును అవి సంస్కృత కావ్యముల కెందును తీసిపోవు. ప్రబంధ కవుల ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములును కావ్యహేతువులకు పట్టుగొమ్మలు. వారి రచనలు శ్రద్ధగా పఠించినచో ఆంధ్రమున అనవద్యమైన పాండిత్య మలవడునను టలో అతిశయోక్తి యుండదు. అందుచేతనే ఆంధ్ర సారస్వతోపాసకులు వానిపై దృష్టి సారించి వాని గుణదోషములను పరికించుటకు యత్నించిరి. అట్టి విమర్శ లాంధ్రమున అసంఖ్యాకములుగా నున్నవి.

ఆంధ్ర ప్రబంధములపై వెలువడిన విమర్శలను గూర్చి తెల్పుటకు ముందు వానిపై వెలసిన వ్యాఖ్యానములను గూర్చి యించుక ప్రస్తావించెదను. బ్రౌను దొరగారు (1798-1884) పాశ్చాత్య విమర్శన పరిశోధన పద్ధతులను తెలుగున ప్రవేశపెట్టి తెలుగు సారస్వతమున కపారమైన సేవ యొనరించిరి. వారు ప్రసిద్ధములైన గ్రంథములకు సంబంధించిన వివిధ తాళపత్ర ప్రతులను సేకరించి సముచిత పాఠములతో కూడిన మంచి ప్రతులను సిద్ధము చేయించిరి. పిమ్మట వానికి వ్యాఖ్యానములు కూడ వ్రాయించిరి. వ్యాఖ్యానము వ్రాయుట పాఠకుల ఉపయోగము కొఱకే కాని వ్యాఖ్యాత పాండిత్య ప్రదర్శనము కొఱకు కాదని భావించి వారు జూలూరి అప్పయ్యగారిచే మను వసు చరిత్రలకు వ్యాఖ్యానములు వ్రాయించిరి (1844, 1851). వసు చరిత్రకు పీఠిక వ్రాయుచు వారు "...the present notes have a diffe-

rent object, being intended to explain the text word by word in the clearest manner so as to do away with the necessity of oral instruction'' అని వ్రాసియుండిరి. విద్వత్కవులైన శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు కూడ (19 వ| శతాబ్ది పూర్వార్థము) వసుచరిత్ర కొక వ్యాఖ్యానము వ్రాసినట్లు చెప్పుదురు. మనుచరిత్రకు జూలూరి అప్పయ్య వ్రాసిన వ్యాఖ్యయేకాక మరికొన్ని వ్యాఖ్యలు కూడ వెలసినవి. వానిలో వావిళ్ళవా రొక దానిని ప్రచురించిరి. ఇటీవల పండిత ప్రకాండులైన పెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు విపులములైన పీఠికలతో మనుచరిత్రకును ప్రభావతీ ప్రద్యుమ్నమునకును సమగ్రములైన వ్యాఖ్యలు రచించిరి. ప్రౌఢప్రబంధమైన ఆముక్తమాల్యదకు వావిళ్ళ రామస్వామిశాస్త్రుల వారి పేరనే ఒక వ్యాఖ్య ప్రకటింపబడినది. తరువాత అపర మల్లినాథులని చెప్పదగిన వేదము వేంకటరాయశాస్త్రిగారు దానికి సర్వంకషమైన వ్యాఖ్య వ్రాసి ప్రచురించిరి. పారిజాతాపహరణమునకు జి. రామమూర్తిశాస్త్రిగారును నాగపూడి కుప్పుస్వామి శాస్త్రిగారును రచించిన వ్యాఖ్య లున్నవి. రాఘవపాండవీయమును, హరిశ్చంద్ర నలోపాఖ్యానమును అర్థ వివరణముల తోడను సమగ్రములైన పీఠికలతోడను వావిళ్ళ వారు ప్రచురించి యుండిరి. తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యమునకు సంగ్రహమైన టీక యొకటుండగా శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు విపులమైన వ్యాఖ్యానము రచించిరి. ఇటీవలనే శ్రీ వంతరాం రామకృష్ణరావుగారు మంచి పాఠ భేదములను సేకరించి దానికి సర్వ సమగ్రమైన వ్యాఖ్యానము వెలయించిరి. శ్రీకాళహస్తి మాహాత్మ్యము చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి వ్యాఖ్యతో ముద్రితమైనది. కీ.శే. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును, కాశీభట్ట సుబ్బయశాస్త్రిగారును పింగళి సూరన్న కళాపూర్ణోదయమునకు సంగ్రహ టీకలను రచించిరి. ప్రబంధ యుగమున వెలసిన ప్రబంధములకే యీ వ్యాసమును పరిమితము చేయుటచే విజయ విలాసాదులగు తరువాతి ప్రబంధములకు వ్రాయబడిన వ్యాఖ్యానముల నిచ్చట పేర్కొని యుండలేదు. పైని పేర్కొనబడిన వ్యాఖ్యాతలలో పలువురు వ్యాఖ్యానములతో పాటు ఆయా ప్రబంధములకు వివిధాంశ వివరణ విమర్శన పూర్వకములైన ఉపోద్ఘాతములను కూడ వ్రాసి యుండిరి. వ్యాఖ్యానములు వ్రాయక పోయినను మను చరిత్రాది ప్రబంధములకు సవిమర్శములైన యుపోద్ఘాతములను వ్రాసినవారు కొందఱు కలరు. వారిలో కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, నిడుదవోలు వేంకటరావు గారును, మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారును పేర్కొనదగినవారు.

తెలుగులో విమర్శ వ్యాస రచనకు పత్రికలెన్నో విధముల తోడ్పడినవి. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థమున వెలువడిన యిట్టి పత్రికలలో తత్త్వబోధిని (1864), ఆంధ్ర భాషా సంజీవని (1871), వివేకవర్ధని (1874), అముద్రిత గ్రంథ చింతామణి (1885), సరస్వతి (1898) మున్నగునవి ముఖ్యములైనవి. ఇరువదవ శతాబ్దిలో విమర్శ వ్యాస రచనకు దోహదము కల్పించినవి కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, భారతి మొదలైనవి. క్రీ.శ. 19 వ శతాబ్దిలో వెలువడిన విమర్శ వ్యాసములను భాషా వ్యాకరణ సంబంధులు, సాహిత్య సంబంధులు అని రెండు తెఱగులుగా విభజింపవచ్చును. పూండ్ల రామకృష్ణయ్యగారి అముద్రిత గ్రంథ చింతామణి 1885 నుండి సుమా రిరువది సంవత్సరములు నిర్విఘ్నముగ నిర్వహింప బడినది. అప్పటి ప్రసిద్ధ పండితులతో అందలి వాదోపవాదములలో పాల్గొనని వారు లేరు. హరిశ్చంద్ర నలోపాఖ్యానము మొదట నందే ప్రకటింప బడినది. అముద్రిత గ్రంథ చింతామణి యందును, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక యందును ప్రబంధములకు

సంబంధించిన విమర్శ వ్యాసములు కూడ పెక్కు ప్రకటింప బడినవి. కీ. శే. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగా రాంగ్లభాషతో కూడ పరిచయము కలవారు. వెన్నేటి రామచంద్రరావుగారు మను వసు ప్రకాశిక అను గ్రంథము వ్రాయగా బ్రహ్మయ్య శాస్త్రిగారు దానిపై విమర్శ వెలయించిరి. కీ.శే. తంజనగరము తేవ ప్పెరుమాళ్ళయ్యగారు (1872-1921) పెక్కు గ్రంథములకు పీఠికలను అనేక విమర్శ వ్యాసములను రచించిరి. కీ. శే. వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు ప్రధానముగా వైయాకరణులే అయ్యును కొన్ని సాహిత్య వ్యాసము లను కూడ రచించిరి. వారి వసుచరిత్ర విమర్శనము (1915) సాంప్రదాయిక విమర్శనకు మార్గదర్శకమై నట్టిది. కీ.శే. జనమంచి శేషాద్రి శర్మగారు మను చరిత్ర హృదయావిష్కరణ మను పేర విమర్శ నాత్మకమైన యొక గ్రంథమును ప్రచురించిరి. డా॥ పింగళి లక్ష్మీకాంతముగారు మదరాసు విశ్వ విద్యాలయమున పరిశోధకులుగా పని చేసినప్పుడు పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునకు మూలములను గ్రంథమును రచించి, దానికి రవివర్మ భూపాలుని నాటకము కూడ కొంతవఱ కాధారమైన దని సూచించిరి. సుప్రసిద్ధ విమర్శకులైన రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ప్రబంధము లన్నియు పఠించి అప్పటి మత సాంఘికాది ప్రవృత్తులను సరసముగా వివరించుచు పరిమాణమున చిన్నదైనను ఎన్నదగిన యొక గ్రంథమును రచించిరి. సరస్వతీ పుత్రులు డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు ప్రబంధ కవులను గూర్చి చేసిన కృషి ప్రశంసా పాత్రమైనది. విజయనగర సామ్రాజ్యము నాటి సాంఘికాది పరిస్థితులను వివరించుచు నొక ఉద్గ్రంథ మును వ్రాయుటే కాక వారు రాయలనాటి రసికతా జీవనము, రామరాజ భూషణుడు, ప్రబంధ నాయకులు అను గ్రంథములను కూడ రచించిరి. రామరాజ భూషణుడను గ్రంథము భీమవరము నందలి రామరాజ భూషణ సమాజము వారిచే ప్రకటింపబడినది. శ్రీ మధ్వాచార్యుల వారందు భట్టుమూర్తి కవితా పాండితీ పాటవములను గూర్చి యెన్నో క్రొత్త విషయములను వెలువరించిరి. తెలుగు తీరులను గ్రంథమున వారు తెనాలి రామకృష్ణుని గూర్చి వ్రాసిన వ్యాసము మహాకవి కవితా రస పాత్ర పోషణములను సమగ్రముగా వివరించుచున్నది. శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు రచించిన ప్రబంధపాత్ర లను గ్రంథ మాంధ్ర సారస్వత పరి షత్తు వారిచే ప్రకటింపబడినది. శ్రీ వెల్దండ ప్రభాకరా మాత్యులు ఆముక్తమాల్యద - పర్యాలోకనమును గ్రంథమును ప్రచురించిరి. పెనుగొండ కళాశాలలో ఆంధ్రోపన్యాసకు లొకరు అయ్యలరాజు రామభద్రుని గూర్చి సవిమర్శమైన గ్రంథము రచించిరి. సుమా రిరువది ఏండ్ల క్రింద శ్రీ కౌతా శివరామకృష్ణ శాస్త్రి గారు, డా. సుమిత్ర మున్నగు వారొక సంఘముగా ఏర్పడి పండితులచే అష్ట దిగ్గజములనుగూర్చి ఉప న్యాసము లిప్పించి ఆ ఉపన్యాసములను గ్రంథ రూప మున ప్రకటించిరి. అందలి ప్రథమ వ్యాసమున కీ.శే. నేలటూరి వేంకట రమణయ్యగారు కందుకూరి రుద్రకవి భువన విజయ సభలో ఈశాన్య భాగమందలి సింహాసనము నధిష్ఠించుచుండె ననియు అతడుకూడ అష్టదిగ్గజ కవులలో నొకడుగా నుండెననియు అభి ప్రాయపడియుండిరి. కీ.శే. టేకుమళ్ళ అచ్యుతరావు గారు విజయనగర సామ్రాజ్యమున వెలసిన వాఙ్మయ మును గూర్చి రెండుభాగాల్లా గ్రంథములను రచించు టయే కాక ఆంగ్లమున పింగళి సూరనను గూర్చి ప్రత్యేకముగా నొక గ్రంథమును వ్రాసి యుండిరి, అందు వారు కళా పూర్ణోదయమున గర్భిత గాథ కలదని సూచించిరి.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు రచించిన విమర్శ గ్రంథములలో అల్లసాని వాని అల్లిక జిగిబిగి అనునది యొకటి. అందు వారు పెద్దన కవితా శైలిని గూర్చియు, రసపాత్ర పోషణములను

గూర్చియు ప్రస్తావించుచు మనుచరిత్రమున వస్త్వైక్యము కలదని తమ సహజమైన ప్రతిభతో నిరూపించి యుండిరి. హైదరాబాదు నగరమందలి యువభారతి వారు ప్రకటించిన లహరీ పరంపరలో కొన్ని ప్రబంధములను గూర్చి రచింపబడిన వ్యాసములు కలవు. అందు మనువసు చరిత్రములను గూర్చియు, పారిజాతాపహరణ కళాపూర్ణోదయములను గూర్చియు, ఆముక్తమాల్యదా పాండురంగ మాహాత్మ్యములను గూర్చియు వ్రాయబడిన వ్యాసములు పేర్కొనదగినవి. డా.పల్లా దుర్గయ్యగారి 'చతురవచోనిధి'అను గ్రంథము పెద్దన కవితా కౌశలమును చక్కగా ప్రకటించుచున్నది. ఈ వ్యాసకర్త భారతిలో ఆముక్తమాల్యదను గూర్చియు, మను చరిత్రను గూర్చియు ప్రకటించిన వ్యాసములు పండితుల దృష్టి నాకర్షించినవి.

ఆంధ్ర విమర్శ వాఙ్మయమున డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వ తత్త్వ విచారము విమర్శన విధానమున క్రొత్త మార్గమునకు దారి చూపినది. వారాంధ్రాంగ్ల వాఙ్మయములు రెండింట నిష్ణాతులైన ప్రతిభావంతులు. వారాంగ్లమునందలి విమర్శన పద్ధతులను దృష్టిలో నుంచుకొని ఆంధ్ర ప్రబంధములలోని వర్ణనలందలి అనౌచిత్యమును, అనవసర సమాసాడంబరమును, కథావైవిధ్యలోపమును, అనుచిత శృంగార తత్పరతను, లక్షణాతివిధేయత్వమును నిరసించి యుండిరి. ఆంధ్ర ప్రబంధములలో వారి మనస్సునకు మెప్పు గొల్పిన దొక్క కళాపూర్ణోదయమే. వారందలి కథా కథన కౌశల్యమును, సన్నివేశ సంఘటన చాతుర్యమును, సంభాషణల సౌందర్యమును, శృంగార రసవైవిధ్యపోషణమును ప్రశంసించి యుండిరి. కాని, సూరన కూడనందు చివరి ఆశ్వాసమున గతానుగతికమైన ప్రబంధపద్ధతినే అవలంబించుట వారికి బాధ కలిగించినది. ఏదైనను వా రాంధ్రమునందలి విమర్శన విధానమున ఒక క్రొత్త మలుపు సృజించి ఆంధ్ర విమర్శకుల దృష్టి నాకర్షించి యుండిరనుటలో అతిశయోక్తి లేదు. సంస్కృత లక్షణము నభ్యసించి ఆ మార్గమునే అనుసరించు కొందఱు పండితుల కది వైముఖ్యము కలిగించియుండకపోలేదు. పండిత ప్రకాండులైన కీ.శే. కాశీహరి వ్యాసమూర్తిగారు కవిత్వతత్త్వ విచార విమర్శ అను గ్రంథమునందు శ్రీ రెడ్డిగారి విమర్శన విధానమును ఖండించియుండిరి. అందు వింత లేదు. ఏ గ్రంథమునైన విమర్శించునప్పుడు కవి యే ఆదర్శమును దృష్టిలో నుంచుకొని ఆ గ్రంథమును రచించెనో గుర్తించి దాని ననుసరించి దానియందలి మంచి చెడ్డలను ప్రకటించుట యుక్తము. అంతేకాని పరభాషా లక్షణ సంప్రదాయముల ననుసరించి దానిని చెండాడుటలో ఔచిత్యము లేదు. షేక్స్పియర్ నాటకములు జగత్ప్రఖ్యాతి పొందినవి. కాని, సంస్కృత నాటక లక్షణము ననుసరించి వానిని విమర్శింప దొడగినచో అందనౌచిత్యము లెన్నియో కనిపించును. కాని ఉత్తమ లక్షణములను పరభాషలనుండి కూడ గ్రహించి అనుసరించుటలో దోషము లేదు. ఆంగ్లభాషా సంప్రదాయము మాత్రమెఱింగి సంస్కృత లక్షణ సంప్రదాయముల యెడ నంతగా నాదరములేని నవీనులలో కొందఱికి శ్రీ రెడ్డిగారి కవిత్వతత్త్వ విచార మాదర్శప్రాయమైనది. ఆధునిక కవిశ్రేష్ఠులైన కీ.శే. దువ్వూరి రామిరెడ్డిగా రొక వ్యాసమున మనుచరిత్రలో తత్కాల ప్రవృత్తు లెట్లు ప్రతిఫలించుచున్నవో చక్కగా ప్రదర్శించియుండిరి.

ఇంతవఱకు విశ్వవిద్యాలయములలో పట్టముల కొఱకు పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసములు వ్రాసిన వారు కాక యితరులు కావించిన విమర్శలను గూర్చి మాత్రమే స్థూలముగా పరిశీలించుట జరిగినది. ఇంక విశ్వవిద్యాలయములలో యమ్.లిట్., యమ్.ఫిల్., డాక్టరేటు పట్టములను బడయుటకై సిద్ధాంత వ్యాసములు వ్రాసిన వారిని పేర్కొందును. పీ రాంగ్లాంధ్ర

ములు రెండును పఠించినవారు కావున వీరి విమర్శలలో ఆ రెండు భాషల యందలి విమర్శన విధానముల సమ్మేళనమును కానిపించును. ఆంధ్రమందలి విమర్శ వాఙ్మయమున కీ పద్ధతి వన్నె చేకూర్పగలదని నా విశ్వాసము.

విశ్వవిద్యాలయములలో వెలువడిన సిద్ధాంత వ్యాసములలో స్వల్పసంఖ్యాకములు మొత్తము ప్రబంధములన్నింటి యందలి కౌశలమును సమీక్షించినవి. ఒకటి రెండు అప్పటి భాషా స్వరూపమును తెల్ప యత్నించినవి. పెక్కు ప్రబంధ కవులలో నొక్క కవిని అతని రచనములను సమీక్షించినవి. కొన్ని యేదో ఒక్క ప్రబంధమునకు మాత్రమే సంబంధించినవి. ధూర్జటి, తెనాలి రామకృష్ణుల రచనలు క్షేత్ర మాహాత్మ్యములేయైనను ప్రబంధ యుగమున వెలసిన వగుటచేతను, కతిపయ ప్రబంధలక్షణ లక్షితములగుట చేతను ప్రబంధములుగానే పరిగణింపబడినవి.

ప్రబంధములనన్నిటిని పరిశీలించిన సిద్ధాంత వ్యాసములు మూడున్నవి. మొదటిది డా॥ కే.వి.ఆర్. నరసింహంగారి ఆంధ్ర ప్రబంధావతరణ వికాసములు (1945) అనునది. రెండవది డా॥ పల్లా దుర్గయ్యగారి ప్రబంధ వాఙ్మయము-తద్వికాసము (1960)అనునది. ఈ రెండును ప్రబంధ మెట్లవతరించి క్రమముగా నెట్లు బహువిధముల వికసించినదో పరిశీలించిన సమగ్ర సిద్ధాంత వ్యాసములు. మూడవది శ్రీమతి డా॥ రావి భారతిగారి కృష్ణరాయల కాలము నందలి ప్రబంధము లందలి భాష అనునది (1975). ఇందు ప్రబంధము లందలి భాషా పరిణామమును వ్యాకరణ విశేషములును, నూత్న ప్రయోగములును పరిశీలింపబడినవి. డా. అంతటి నరసింహము గారి సిద్ధాంత వ్యాసము కొన్ని ముఖ్య ప్రబంధములందలి ప్రకృతివర్ణనల సమీక్ష(1974). డా. వేటూరి ఆనందమూర్తిగారి ''విజయనగర యుగపు తెలుగు ప్రబంధములపై వైష్ణవ ప్రభావ''మను గ్రంథము (1966) ఆ యుగమునందలి కవుల గ్రంథములపై- ముఖ్యముగా తాళ్ళపాక కవుల రచనలపై- గల వైష్ణవ మత ప్రభావమును వివరించును. డా. జి. వి. జి. కృష్ణమాచార్యులవారు "తెలుగులో స్థలపురాణములు-వాని స్వభావ పరిశీలన'' (1962) అను సిద్ధాంత వ్యాసమున ధూర్జటి రామకృష్ణుల రచనలను కూడ పరిశీలించిరి. శ్రీ జి. జయరాములు గారు సాంత్వన కావ్యములు శృంగార నాయికలు (1982) అను వ్యాసమున పారిజాతాపహరణమున కృష్ణుడు సత్యభామ ననునయించిన విధము కూడ విశదీకరించిరి. శ్రీమతి డా. అద్దేపల్లి విద్యావతీదేవి ''తాళ్ళపాక కవుల సాహిత్యసేవ'' (1975) అను సిద్ధాంత వ్యాసమున తాళ్ళపాకవంశజులైన కవులందఱి కృతులందలి కవితా కౌశలమును వెల్లడించిరి. డా. జి.వి. సుబ్రహ్మణ్యం గారి ''మార్కండేయ పురాణము- ప్రబంధ కథామూలము'' (1969) అను వ్యాసమున మనుచరిత్రాది ప్రబంధములందలి వస్తువునకు ప్రథమాంధ్ర పురాణమగు మార్కండేయపురాణమెట్లు మూలమైనదో చక్కగా ప్రదర్శించియుండిరి.

శ్రీ సాళ్వ కృష్ణమూర్తిగారు పెద్దన కవిత్వ నిర్వచనమును గూర్చి (1975) నిశితమైన పరిశీలన కావించి యం.ఫిల్ పట్టమును పొందిరి. ఇందు పెద్దన ఆశువుగా రచించిన ఉత్పలమాలిక యందలి భావము విశదీకరింపబడినది. శ్రీ డా. రాజన్న శాస్త్రి గారి ''మనుచరిత్ర - ధ్వని'' అను సిద్ధాంత వ్యాసము (1980) ధ్వని స్వరూపమును వివరించి పెద్దన ప్రకటించిన ధ్వని విశేషములను పాండితీస్ఫోరకముగా వెల్లడించిన ప్రశస్త రచన. శ్రీమతి డా. సుజాతా రెడ్డిగారి మను వసు చరిత్రల తులనాత్మక పరిశీలనము (1977) వారి విమర్శన పాటవమును చాటుచున్నది. డా. టి. కోటేశ్వరరావు గారు ఆముక్తమాల్యద సౌందర్యమును సిద్ధాంతవ్యాసమున (1967) రాయల వారి కవితాప్రతిభా పాండిత్యములను వివరించుచు

అందు వీరరసము ప్రధానమని నిరూపించియున్నారు. డా. వి. లక్ష్మీపతెరావుగారు "పారిజాతాపహరణ సౌందర్య సమీక్ష" (1978) అను వ్యాసమున తిమ్మన రచనా రామణీయకమునంతను సోదాహరణముగా వివరించి యున్నారు. శ్రీ కొత్తపల్లి కాశీ విశ్వేశ్వరశాస్త్రిగారు అయ్యలరాజు రామభద్రుని కవితారీతులను గూర్చి వ్యాసము వ్రాసి (1974) యం.ఫిల్ పట్టమును బడసియున్నారు.

మహాకవి ధూర్జటి రచనను గూర్చి నాలుగైదు సిద్ధాంత వ్యాసములు వెలువడినవి. డా. జి. మదన్ మోహన్‌గారి ధూర్జటిసమ్యక్పరిశీలనము (1974), డా. టి. బి. యమ్. అయ్యవారి మహాకవి ధూర్జటి కావ్యానుశీలనము (1974), శ్రీమతి డా. కల్లూరి రత్నమోహిని ధూర్జటి జీవితరచనలు (1981), డా. పొన్నెకంటి హనుమంతరావుగారి మహాకవి ధూర్జటి కవిత్వ వ్యక్తిత్వములు (1974), శ్రీమతి పి. సరస్వతి శ్రీ కాళహస్తి మాహాత్మ్య పరిశీలనము (1979) అనునవి ముఖ్యములైనవి. ఇటీవలి శ్రీమతి డా. వి. కాంతలక్ష్మిగారు ధూర్జటి వంశ కవులను గూర్చి సమగ్ర పరిశీలనతో కూడిన సిద్ధాంత వ్యాసము రచించి పి.హెచ్.డి. పట్టము పొందినారు (1983).

ధూర్జటి వలెనే పలువురు విమర్శకుల దృష్టి నాకర్షించినవారు పింగళి సూరనయు భట్టుమూర్తియు. డా. జి.వి. కృష్ణారావుగారి "Studies in Kalapurnodayam" (1958) అను ఆంగ్ల భాషా రచితమైన సిద్ధాంత వ్యాసము చాల విలువైనది. డా॥ ఆర్. చంద్రశేఖరరెడ్డిగారి శిల్పప్రభావతియు (1977), డా॥ యన్. బాపిరెడ్డి గారి ప్రభావతీ ప్రద్యుమ్న సమగ్ర పరిశీలనయు (1980), శ్రీమతి యం.యన్. లక్ష్మిగారి పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమును (1980) ప్రభావతీ ప్రద్యుమ్నమును గూర్చి ప్రత్యేకముగా వెలువడిన సిద్ధాంత వ్యాసములు. డా॥ రామకృష్ణరాయణం గారి పింగళి సూరన-ఆతని రచనలు (1977) అను సిద్ధాంత వ్యాసము సూరన రచనలన్నిటిని గూర్చి సమగ్రమైన పరిశీలనముతో కూడిన ఉత్తమ రచన. అందు వారు కళాపూర్ణోదయమునందలి కొంత కథాభాగమునకు అద్భుత రామాయణమున. దాకరము కలదని సోదాహరణముగా నిరూపించియున్నారు. యువభారతి వారి యొక లహరిలో డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు కళాపూర్ణోదయమందలి కథాసంవిధానమును గూర్చి కావించిన క్రొత్త సూచన విద్వాంసుల మన్ననలు పొందజాలినది. ఆంధ్ర ప్రబంధములలో వసుచరిత్ర కున్న ప్రశస్తి అనన్య సామాన్యమైనది. డా. కె. సుప్రసన్నగారు రామరాజభూషణుని కృతులు (1962) అను సిద్ధాంత వ్యాసమున ఆ మహాకవి రచన లందలి సౌందర్యమును వివరించుచు వసుచరిత్రలో గల గర్భితగాథను (Allegary) విశదీకరించియున్నారు. డా. సురేంద్ర కుమార్‌గారు వసుచరిత్రకు 17, 18 శతాబ్దులందలి కవులపై గల ప్రభావమును (1978) విశదీకరించి యున్నారు. శ్రీమతి డా. కిళాంబి జ్యోతిర్మయిగారు వసుచరిత్రమందలి శ్లేషధ్వనులను ప్రదర్శించుటలో అద్భుతమైన కృషి కావించియున్నారు (1978). శ్రీమతి బి.వి. శారదగారు వసుచరిత్రలోని సంగీత కళా రహస్యములను వివరించి తమకు కూడ వాకళతో గల పరిచయమును ప్రకటించియున్నారు.

తెనాలి రామకృష్ణుని రచనలు మూడింటిలో రెండు క్షేత్రమాహాత్మ్యములు; మూడవది ఉద్భటారాధ్య చరిత్రము. అతని తొలిరచన ఉద్భటారాధ్య చరిత్రమే. అప్పటి కింకను అతడు శైవమతాభిగానే యుండినట్లు కనిపించును. ఈతని రచనలన్నిటిని గూర్చియు సమగ్ర పరిశీలన కావించినవారు డా. ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు (1967), డా. దేవళ్ళ చిన్నకృష్ణశర్మగారు తెనాలి రామకృష్ణుని రచనలను విషయముపై సిద్ధాంత వ్యాసము వ్రాసి యం.ఫిల్. పట్టము పొందిరి (1983). శ్రీమతి సుంకర కుమారదేవిగారు ఘటికాచల మాహాత్మ్యము

సందలి భాషావిశేషములను గూర్చియు (1979), శ్రీ యస్. పద్మనాభరెడ్డిగారు రుద్భటారాధ్య చరిత్రయందలి కవితా విశేషములను గూర్చియు (1979) పరిశీలన కావించిరి. శ్రీరామచంద్రాచార్యులుగారు పాండురంగ మాహాత్మ్యమునందలి కృత్తద్ధిత సమాస విశేషములను గూర్చి పరిశోధన చేసియుండిరి (1979). రామ కృష్ణునికి వికటకవిగను హాస్యప్రియుడుగను లోక మున విశేష ప్రఖ్యాతి యున్నను ఆ విషయమును గూర్చి ప్రత్యేక పరిశోధన యొనరించినవారు లేరు. డా. పుట్టపర్తివారును, డా. కృష్ణమాచార్యులవారును ఆ విషయమును తమ రచనలలో నించుక స్పృశించి యుండిరి.

చింతలపూడి ఎల్లనార్యునికి కృష్ణదేవరాయల వారే రాధామాధవకవి యను బిరుద మొసంగినట్లు ప్రతీతి. ఆ విషయము నాతడు తన గ్రంథమున కూడ సూచించియున్నాడు. శ్రీమతి జంధ్యాల సంధ్యా దేవిగారు ''రాధామాధవము-ఒక పరిశీలన'' (1975) అను సిద్ధాంత వ్యాసమును వ్రాసియున్నారు. ఎల్ల నార్యుడు విష్ణుమాయావిలాసమును కూడ రచించెనని ముద్రిత ప్రతులవలన తెలియుచున్నది. శ్రీమతి ఐ. రెడ్డమ్మగారు ఈ గ్రంథమును గూర్చి సవిమర్శ సమీక్ష కావించియుండిరి (1978). కాని శ్రీ చాగంటి శేషయ్యగారీ గ్రంథకర్త మడికి అనంతయ్య యని నిశ్చయించియుండిరి. 1979 లో శ్రీమతి వి. రేణుకా దేవిగారు తాళ్ళపాక చిన్నన్న అష్ట మహిషీ కల్యాణ మును గూర్చి విమర్శాత్మక పరిశీలన చేసి, యం.ఫిల్. పట్టమును పొందియుండిరి. శ్రీ డా. ఆర్.ఏ. పద్మ నాభరావుగారు "కందుకూరి రుద్రకవి - సవిమర్శ పరిశీలనము" అను గ్రంథమున రుద్రకవి రచనలను గూర్చి సమగ్ర పరిశీలన చేసియుండిరి (1977). డా. ఏ.వి. పద్మాకరరెడ్డిగారును, శ్రీమతి డా. వాసా ప్రభావతీదేవిగారును తెలుగులో హరిశ్చంద్ర కథ అను విషయముపై కావించిన పరిశోధనలో (1978) భట్టుమూర్తి హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందలి కథావిశేషములను కూడ సూచించియుండిరి.

పైని పేర్కొనబడిన గ్రంథములును, సిద్ధాంత వ్యాసములును కాక ఆంధ్ర ప్రబంధములందలి వివిధ విషయములను గూర్చి పలువురు పండితులు విమర్శా త్మకములైన వ్యాసములను పత్రికలలో ప్రచురించి యుండిరి. వానిని గూర్చి నేనిందు ప్రసంగించియుండ లేదు. ఆంధ్ర సారస్వతమున కలంకారములని చెప్ప దగిన ప్రబంధయుగమునకు సంబంధించిన ప్రబంధ ములను గూర్చి యెవ రెవ రెప్పు డెట్టి పరిశోధన కావించియుండిరని స్థూలముగా సూచించుటయే యీ వ్యాసమున నే నుద్దేశించిన ప్రయోజనము. ఆ గ్రంథములన్నియు చదివి వానియందలి విషయమును గూర్చి నేను విమర్శ చేసియుండలేదు. అది ఒక వ్యాసములో జరుగునట్టి పనికాదు. పై గ్రంథములయు వ్యాసములయు నామములను బట్టి పలువురు కవితారస పాత్రపోషణాదులకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చినట్లు కనిపించును. ముప్వురు నలుగురు మాత్రము భాషా విషయమును గూర్చి పరిశ్రమ చేసియుండిరి. పలువురు విద్వాంసులును యువతీ యువకులును సారస్వత పఠన పరిశీలనములం దింత అభినివేశము చూపు చుండుట ముదావహము.



# తెలుగులో పరిశోధన - నాటక ప్రక్రియ

—తిరుమల శ్రీనివాసాచార్య

'నాటకాంతం హి సాహిత్యమ్', 'కావ్యేషు నాటకం రమ్యమ్' అన్న అభియుక్తోక్తులు భారతీయుల సాహిత్యాధ్యయన ప్రణాళికలో రూపక ప్రక్రియ సంతరించుకున్న ప్రాముఖ్యాన్ని వివరిస్తున్నాయి. ప్రాచీనాలంకారికులు రూపక మర్యాదలను గూర్చి రసానుభూతిని గూర్చి చేసిన విశ్లేషణ ఎంత తర్క బద్ధంగా ఎంత తాత్త్వికంగా సాగిందో విజ్ఞులెరుగనిది కాదు. భారతీయ సాహిత్య శాస్త్రానికి పునాది భరతుని నాట్యశాస్త్రం. నాట్యశాస్త్రం రూపకాలకు సంబంధించిన వివిధాంశాలను సూత్రబద్ధంగా అందించిన ఆద్య గ్రంథం. ఆ గ్రంథం చూపిన వెలుగులోనే ఆ గ్రంథం చదివిన సంస్కారంతోనే సాహిత్యశాస్త్రం రూపురేకలు దిద్దుకున్నది. ఆనంద వర్ధనుడు అభినవ గుప్తుడు మున్నగువారు చేసిన పర్యాలోచనం రూపక సాహితీ సందర్శనానికి చక్కని మార్గాలను నిర్దేశించగలిగింది. సాహిత్యపరమైన అంశాలకు నాట్యశాస్త్ర సిద్ధాంతాలను అనువర్తింపజేసి, సమన్వయించి, సాహిత్య శాస్త్రాన్ని స్వతంత్రంగానూ సప్రమాణంగానూ పరిపుష్టం చేసినారు ఎందరో లాక్షణికులు. భరతుడు ప్రతిపాదించిన రససిద్ధాంత ప్రసక్తి లేనిదే ఆయన తరువాత వచ్చిన ఏ అలంకారశాస్త్ర గ్రంథం కూడా పూర్తి కాలేదు. విద్యానాథుడనే అలంకారికుడు ప్రతాపరుద్రీయమనే సాహిత్య శాస్త్రగ్రంథంలో రూపకలక్షణాలను పేర్కొని అందుకు లక్ష్యంగా ఐదంకాల నాటకాన్నే వ్రాసినాడు.

భారతీయ సాహిత్యాధ్యయన సంప్రదాయంలో రూపకప్రక్రియ ఒక విలక్షణాంశంగా ఉంటూవచ్చినా తెలుగులో ఆదికావ్యం పుట్టకముందే యావద్భారతంలో రూపక కళా విన్యాసం మహోన్నత శిఖరాల నందుకున్నా తెలుగులో పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధం వరకూ రూపకాలు లేకపోవడం అతి విచిత్రమైన విషయం. అయితే మార్గపద్ధతిలోగాక దేశిపద్ధతిలో జానపదులూ పల్లీయులూ సృజించుకుని పెంపొందించుకున్న యక్షగానాది రూపక ప్రక్రియలు లేకపోలేదు. కాని, దేశిరూపక ప్రక్రియలను గూర్చిన ప్రస్తావన ఈ సందర్భంలో అప్రస్తుతం. నన్నయ తిక్కనాది ప్రాచీనాంధ్ర కవులకు సంస్కృత రూపకాలతో పరిచయమున్న మాట వాస్తవమే. కాని, సంస్కృతంలోని అన్ని ప్రక్రియలను తెనిగించిన నాటి కవులు రూపకాలను మాత్రం వదిలిపెట్టినారు. సంస్కృత నాటకాలలో వలె తెలుగులో పాత్రానుగుణ భాషా ప్రయోగం సాధ్యం కాకపోవడం వల్లనైతేమి, వర్ణనా ప్రియులైన ప్రబంధకవుల ఉపేక్షవల్లనైతేమి, కవి పండిత పోషకులైన ప్రభువుల అనాసక్తి వల్లనైతేమి, నాటక లక్షణాలను తెల్పే గ్రంథాలు తెలుగులో లేనందువల్లనైతేమి, నాటక ప్రదర్శనకు కావలసిన రంగ పరికరాదులు లేనందువల్లనైతేమి, నటులకు సంఘంలో గౌరవాదరాలు లేనందువల్లనైతేమి తెలుగులో పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధం వరకూ రూపకాలు వెలువడలేదు. 1860 లో శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు 'మంజరీ మధుకరీయము'ను రచించి ప్రథమాంధ్ర నాటకకర్తలైనారు. 'నరకాసుర విజయవ్యాయోగము'ను రచించి సంస్కృత నాటకానువాదానికి నాంది పలికినారు శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు. శ్రీమాన్ పరవస్తు వెంకట

రంగాచార్యులుగారు. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నాంధ్రీకరించినారు. శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు సంస్కృత నాటకాంధ్రీకరణంతో పాటు ఆంగ్ల రూప కాలకుఅనువాదాలువెలయించినారు. వీరి 'సీజరుచరిత్రము' ప్రప్రథమాంగ్లనాటకానువాదము. 'నందకరాజ్యము'అనే తొలి తెలుగు సాంఘిక నాటకాన్ని కూడా రచించినారు వారే. తరువాత కందుకూరి వీరేశలింగం పంతులు, గురుజాడ శ్రీరామమూర్తి, వడ్డాది సుబ్బారాయుడు, నాదెళ్ళ పురుషోత్తమ కవి, ధర్మవరం రామకృష్ణమా చార్యులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, వేదం వేంకటరాయశాస్త్రి, గురజాడ అప్పారావు, కోలాచలం శ్రీనివాసరావు,పానుగంటి లక్ష్మీనరసింహారావు,శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, తిరుపతి వేంకటకవులు, బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, కాళ్ళకూరి నారాయణరావు వంటి ప్రతిభావంతు లెందరో ఈ నాటక ప్రక్రియను పరి పుష్టం చేసినారు. తరువాత శతాధిక నాటక కర్తలు సహస్రాధికంగా నాటకాలు రచించి రూపకప్రక్రియకు పరిణతిని సమకూర్చి పెట్టినారు. ఈ నాటి వరకూ సహస్రాధికంగా తెలుగులో అనువాద నాటకాలూ స్వతంత్ర నాటకాలూ వస్తూనే ఉన్నాయి. అన్య భాషా సాహిత్య సంస్కృతుల ప్రభావంవల్ల నాటక రచనా ప్రయోగాలలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. కొత్త ప్రక్రియలు బయలుదేరినాయి. ఎన్నో మార్పులు వస్తున్నాయి. కొత్త ప్రక్రియలు బయలుదేరినాయి. తెలుగులో రూపక రచనకు పూనుకున్న వాళ్ళల్లో పలువురు బహుభాషా వేత్తలు, అనేకసాహితీ ప్రక్రియా నిర్మాతలు. కొందరు స్వయంగా నటులూ ప్రయో క్తలూ. వీరు ఎన్నెన్నో పౌరాణిక సాంఘిక చారిత్ర కేతివృత్తాలను రూపకాలుగా అవతరింపజేసినారు.

ఇలా తెలుగులో అనంతంగా అవిచ్ఛిన్నంగా వైవిధ్యంతో ముద్దుకు సాగుతున్న రూపక ప్రక్రియను గూర్చి అనేక విశ్వ విద్యాలయాలల్లో పరిశోధన జరిగింది. ఇంకనూ జరుగుతున్నది. అనేక సాహిత్య ప్రమాణాలను దృష్టిలో పెట్టుకొని భిన్నభిన్న దృక్పథాలతో విద్వాంసులు రూపక పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసాలను రచించి ఆయా విశ్వవిద్యాలయా లకు సమర్పించినారు. వానిలో కొన్ని వ్యాసాలు గ్రంథాలుగా వెలువడినాయి. పరిశోధకులు రూప కాలను ప్రక్రియాపరంగానూ, వ్యక్తి సమష్టి పరం గానూ ప్రత్యేక నాటక పరంగానూ సమీక్షించి గ్రంథాలను వెలయించినారు. కొన్ని ప్రసిద్ధ సాహిత్య సంస్థలు ప్రకటించిన బహుమతులను అందుకోవడం కోసం కొందరు విద్వాంసులు పరిశోధన చేసి రూపక ప్రక్రియను గూర్చి సమీక్షా గ్రంథాలు రచించినారు. ప్రస్తుతం నాకు దొరికినంతవరకు ఆయా పరిశోధనా వ్యాస గ్రంథాలను గూర్చి దిఙ్మాత్రంగా పరిచయం చేయడానికి ప్రయత్నిస్తాను.

ఆధునికాంధ్ర సాహిత్యాచార్యులు డా. దివా కర్ల వేంకటావధానిగారు 1937 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి ఎం. ఏ. ఆనర్సు పట్టం కోసం 'ఆంధ్ర నాటక పితామహుడు' అనే సిద్ధాంత వ్యాసాన్ని రచించినారు. తరువాత ఇది గ్రంథ రూపం దాల్చింది. ఆంధ్ర నాటక పితామహుడుగా ప్రఖ్యాతి గాంచిన ధర్మవరం రామాకృష్ణమాచార్యులుగారు ముప్పైకిపైగా నాటకాలను రచించినారు. వానిలో ముద్రితాలైన చిత్రనళీయము, విషాద సారంగధర, పాదుకా పట్టాభిషేకము మున్నగు పద్యాలుగు నాట కాలను శ్రీ వేంకటావధానిగారు ఈ గ్రంథంలో విపు లంగా సమీక్షించినారు. పదమూడు భాగలుగా సాగిన ఈ గ్రంథంలో మొదటి భాగం ఆంధ్ర నాటకాల ఆరంభ దశను వివరిస్తుంది. ధర్మవరం వారి నాటక వస్తువులకు ఇతిహాస పురాణ ప్రబంధాలు మూలాలని రెండవ భాగం నిరూపిస్తుంది. మూడవ భాగంలో పాశ్చాత్య విషాదాంత నాటక లక్షణాలనూ భేదాలనూ వివరించి అభిజ్ఞాన మణిమంతము పాదుకా పట్టాభిషే కము విషాద సారంగధర నాటకాలను ఆ దృక్ప థంతో విమర్శించినారు ఆచార్య అవధానిగారు. ధర్మ వరం వారి నాటకాలలోని వస్తు నిర్మాణ సంవిధానాన్ని

మూల భిన్న కల్పనలనూ, వాని ప్రయోజనాలనూ పరిశీలించినారు నాలుగవ భాగంలో. ప్రాచ్య పాశ్చాత్య నియమాలను గ్రహించడంలో ధర్మవరం వారు చూపిన స్వతంత్రతను వ్యక్తం చేసినారు ఐదవ భాగంలో. పూర్వ రంగాదుల విషయంలో ధర్మవరం వారు అనుసరించిన ప్రాచ్య పాశ్చాత్య పద్ధతుల సమీక్ష ఆరవ భాగం. నాటక సమయములు ఏడవది. పాత్ర పోషణను గూర్చిన రచనా విశేషాలను గూర్చిన పరిశీలనం ఎనిమిదవ తొమ్మిదవ భాగాలు. మానవ జీవితం పట్ల ధర్మవరం వారికున్న అవగాహననూ, వారు నాటకాలలో వ్యక్తీకరించిన నీతినీ ప్రకటించేవి పదవ పదకొండవ భాగాలు. ధర్మవరం వారి నాటకాలలో హాస్యాన్నీ చమత్కారాన్నీ సమీక్షించే భాగం పన్నెండవది. ఆంధ్ర నాటక పితామహుని వ్యక్తిత్వాన్ని సందర్శించుటతో ఈ గ్రంథం ముగుస్తుంది. ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణాలను ఈ గ్రంథంలోని ప్రతి ప్రకరణం మొదట వివరించి, వాటిని ధర్మవరం వారి నాటకాలకు సమన్వయించి చూపడంలో శ్రీ అవధానిగారు ప్రదర్శించిన వైదుష్యం సహృదయ పరిశోధకుల ప్రశంస లందుకుంటుంది.

ఆంధ్ర నాటకాల ఆరంభదశను స్థూలంగానూ ధర్మవరం వారి నాటకాలను ప్రత్యేకంగానూ పరిశీలించే పరిశోధనా గ్రంథాలలో మొదట కనిపించే గ్రంథం ఈ 'ఆంధ్ర నాటక పితామహుడు.'

'శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యుల నాటక సమీక్ష' అనే అంశాన్ని గ్రహించి శ్రీ వీరాస్వామి నాయుడుగారు పరిశోధనచేసి 1973 లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. కాని దీనిని చూసే అవకాశం నాకు చిక్కలేదు.

బహు భాషావేత్తలూ విద్వద్విమర్శకులూ సహృదయులూ అయిన ఆచార్య డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి 1956 లో 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అనే సిద్ధాంత వ్యాసాన్ని రచించినారు. ఇది 1960 లో ముద్రింపబడింది. ఈ పరిశోధనా గ్రంథంలోని 'వీరేశలింగ యుగము' అనే అధ్యాయంలో పందొమ్మిదవ శతాబ్దంలోని ఆంధ్ర నాటక రచనా ప్రయోగ పరిణామాలను సుదీర్ఘంగా సమీక్షించినారు వీరభద్రరావుగారు. తెలుగులోని వివిధ శాఖలపై వలెనే నాటకాలపై కూడా ప్రసరించిన పాశ్చాత్య ప్రభావాన్ని వీరు విపులంగా చర్చించినారు. మొదట వావిలాల వాసుదేవ శాస్త్రిగారి 'సీజరు చరిత్రము'ను, గురజాడ శ్రీరామమూర్తిగారి 'వెనీసు వణిజనాటకము' ('సుహృత్ సుభాషితము') ను గ్రహించి వాని ఆంధ్రీకరణ విధానాన్ని మూలాంగ్ల నాటకాలతో పోల్చి, వానిలోని ఔచిత్యానౌచిత్యాలను ఎత్తి చూపినారు.

కందుకూరి వారి ప్రహసనాలపై ఆంగ్ల సాహిత్య ప్రభావాన్ని నిరూపించినారు. అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనం, విచిత్ర వివాహ ప్రహసనం, మహాబధిర ప్రహసనము, పునర్మరణ ప్రహసనము మొదలగు పది ప్రహసనాలకు ఆంగ్ల మాతృకలను చూపినారు. కందుకూరి ఆంగ్ల నాటకానువాదాలైన 'చమత్కార రత్నావళి'నీ 'వెనీసు వర్తక చరిత్రము'నూ 'కల్యాణ కల్పవల్లి'నీ 'రాగమంజరి'నీ మూలంతో పోల్చి వానిలోని మార్పులనూ చేర్పులనూ విపులంగా విశ్లేషించి చూపినారు. కందుకూరివారికి సమకాలికులైన నాటక కర్తలపై వారి నాటకాలపై ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ పాశ్చాత్య ప్రభావం ఎలా ప్రసరించిందో సుదీర్ఘంగా విషయ గభీరంగా సోపపత్తికంగా నిరూపించినారు. కోరాడ రామచంద్ర శాస్త్రి, పరవస్తు వేంకట రంగాచార్యులు, కొక్కొండ వేంకటరత్నం పంతులు, వేదం వేంకట రాయశాస్త్రి, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, వడ్డాది సుబ్బారాయకవి, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి, నాదెళ్ల పురుషోత్తమ కవి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కూచి నరసింహం, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,

చిలకమర్తి లక్ష్మీనరసింహం, తిరుపతి వేంకట కవులు, కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణా రావు, పనప్పాకము శ్రీనివాసాచార్యులు, బి. శ్రీనివాస రావు, రెంటాల వెంకట సుబ్బారావు, శ్రీరామ్ వీరబ్రహ్మం గార్ల నాటకాలపై గల ఇంగ్లీషు ప్రభావాన్ని సోదాహరణంగా నిరూపించినారు శ్రీ వీర భద్రరావుగారు. నాకు తెలిసినంతవరకు పందొమ్మి దవ శతాబ్దం ఆంధ్ర నాటకాలపై ఆంగ్ల సాహిత్య ప్రభావాన్ని నిరూపించే ప్రథమ పరిశోధనా గ్రంథం ఇదే. పరిశోధకులకూ విద్వద్విమర్శకులకూ పరమ ప్రమాణం ఈ సిద్ధాంత గ్రంథం.

రూపక కళ పుట్టు పూర్వోత్తరాలనూ నాటక స్వరూప స్వభావాలనూ తెలుగు నాటకోత్పత్తి వికాస విశేషాలనూ సమగ్రంగా సమీక్షించే పరిశోధనా గ్రంథం డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసము.' ఇది ఉస్మానియా విశ్వ విద్యాలయం వారికి 1961లో సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసం. ఇది 1967లో గ్రంథంగా వెలువడింది. ఈ గ్రంథం తెలుగు నాటక కళా పరిశోధకుల పాలిటి కల్పతరువు. ఆధునిక నాటక రచనా ప్రయోగ విశేష జిజ్ఞాసువులకు గురువు. 1860 నుంచి 1960 వరకు నూరేళ్ల తెలుగు నాటక వికాసాన్ని సమగ్రంగా సమీ క్షించే ప్రథమ పరిశోధన గ్రంథం ఇది. 1961 తరువాత జరిగిన అనేక రూపక పరిశోధనలకు ఇది ఆదర్శగ్రంథం. "భావి పరిశోధనలకు ఈ నా పరి శోధన పునాది కాగలదనియు విశ్వసించుచున్నాను"[1] అన్నవారి మాటలు అక్షరాలా సత్యమని నిరూపితమై నది. ఈ పరిశోధనా గ్రంథంలో ఐదు భాగాలున్నాయి. ప్రథమ భాగం ఆంధ్ర నాటక చరిత్రకు పూర్వ రంగంగా ఉంది. నాలుగు అధ్యాయాలుగా విభక్త మైన ప్రథమభాగంలో నాట్యకళా విశిష్ట స్వరూపాన్ని వివరించేది ప్రథమాధ్యాయం. ద్వితీయాధ్యాయం ప్రాచ్య పాశ్చాత్య రూపక స్వరూప స్వభావ సందర్శనం. ప్రాచీనాంధ్ర దేశంలో సంగీత నృత్య నాట్య వికాస విశేష వివరణం తృతీయాధ్యాయం. ఇక చతుర్థాధ్యాయం బొమ్మలాటలు, యక్షగానాలు, కొరవంజి, పగటివేషాలు మున్నగు దేశిదృశ్యకళా రూపలక్షణ సమాలోచనం.

ఆధునికాంధ్ర నాటకాల ఆరంభ వికాసాలను గూర్చి వివరించే ద్వితీయభాగం ఈ పరిశోధనా గ్రంథమూర్తికి హృదయం. ఆరు అధ్యాయాలుగా విస్తరించిన ఈ భాగంలో మొదటి అధ్యాయం 1860 నుంచి 1886 వరకు గల ఆంధ్ర నాటక రచనా ప్రదర్శనల ప్రారంభదశలను పరిశీలిస్తుంది. కోరాడ రామచంద్రశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వెంకటరంగాచార్యులు, వావిలాల వాసుదేవ శాస్త్రి, కందుకూరి వీరేశలింగం పంతులు, గురుజాడ శ్రీరామమూర్తి, కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు, నాదెళ్ల పురుషోత్తమకవి రచించిన నాటకాలను ఇందులో విషయవిపులంగా సమీక్షించినారు శ్రీ అప్పారావుగారు. 1886 నుంచి 1900 వరకు తెలుగు నాటక రచన ఎలా బహుముఖా లుగా వికసించిందో వివరించేది ద్వితీయాధ్యాయం. ధర్మవరం, చిలకమర్తి, వేదం, గురజాడ, కోలాచలం, పానుగంటి వంటి ప్రముఖ నాటకకర్తల నాటకాలు ఇందులో పరిశీలింపబడ్డాయి. తృతీయాధ్యాయం (1900-1920) లో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకట కవులు, బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, కాళ్లకూరి నారాయణరావు ప్రభృతులు నాటక రచనా ప్రయోగ విస్తృతికై చేసిన కృషిని వివరించినారు డా. అప్పారావుగారు. దేశభక్తి, సంఘ సంస్కరణం వంటి దృక్పథాలతో 1920-44 మధ్య నాటక రచనలో వచ్చిన నవీన ప్రయోగాల వివరణం నాల్గవ అధ్యాయం. నాటికల ఏకాంకికల వికాసాన్ని ప్రసిద్ధ నాటికా కర్తల

1. 'తెలుగు నాటక వికాసము' – ప్రస్తావన పుట XIV ప్రథమ ముద్రణ 1967.

కృషినీ పరిశీలించేది పంచమాధ్యాయం. ఆరవ అధ్యాయంలో 1944 తరువాతి నాటక చరిత్రనూ కొన్ని ప్రక్రియలనూ రేఖా మాత్రంగా నిరూపించడం జరిగింది. ఈ గ్రంథంలోని తృతీయ భాగం ఆంధ్ర నాటక చరిత్ర సింహావలోకనం. ఇందలి మూడు అధ్యాయాలలో ఇతివృత్త రచనా స్వరూపానుగుణంగా నాటక రచనను సమీక్షించటం, ఆధునిక నాటక ప్రయోగదశలను పరిశీలించటం, తెలుగు నాటక విమర్శ చరిత్రను అవలోకించటం, సమస్యలను సమీక్షించటం జరిగింది. సంస్కృత రూపకానువాదాలు, ఆంగ్ల రూపకానువాదాలు, స్వతంత్ర రూపకాలు, విషాద రూపకాలు, ప్రహసనాలు, ఏకాంకికలు, పద్య నాటికలు, గేయనాటికలు, రేడియో నాటికలు పరిశీలింప బడినాయి.

చతుర్థ పంచమభాగాలు అనుబంధాలకు సంబంధించినవి. మొదటి అనుబంధం- రచనలు (నాటికా నాటకాలు) విమర్శలు. రెండవ దానిలో రచయితల జాబితా, మూడవదానిలో ప్రసిద్ధ నటుల- ప్రసిద్ధ నాటక సమాజాల పేర్లూ, నాల్గవదానిలో ఉపయుక్త గ్రంథాలూ, ఐదవదానిలో ముఖ్య పదానుక్రమణికా సూచింపబడ్డాయి. కొందరు ప్రసిద్ధ రచయితల- విమర్శకుల- పోషకుల- నటీనటుల చిత్రాలు చోటు చేసుకున్నాయి పంచమ భాగంలో. ఈ అనుబంధాలు పరిశోధకుల కెంతో ఉపయోగపడతాయి.

డా॥ అప్పారావుగారి వైదుష్యానికీ పరిశోధనా పటిమకూ విజ్ఞానానురక్తికీ విమర్శనా నైశిత్యానికీ రచనా సారళ్యానికీ ఈ గ్రంథం పతాక సదృశం. వారి పరిశోధనకు విరాడ్రూపం ఈ పుస్తకం. అలంకార శాస్త్రానికి భరతుని నాట్య శాస్త్రంలా ఆంధ్ర నాటక పరిశోధనకు ఈ 'తెలుగు నాటక వికాసము' ఆదర్శం అంటే అతిశయోక్తి కాదు.

నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలలో ఒకరైన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు ఆంధ్ర షేక్స్పియరుగా ప్రఖ్యాతి వహించినారు. వారి రూపక వాఙ్మయ సర్వస్వాన్ని సూక్ష్మేక్షికతో పరిశీలించినారు డా. ముదిగొండ వీరభద్రశాస్త్రి గారు, తమ పరిశోధనా వ్యాసం 'పానుగంటివారి సాహిత్యసృష్టి- సవిమర్శ పరిశీలనము'లో. 1963 లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పితమైన ఈ సిద్ధాంతవ్యాసం 1968లో ముద్రితమైనది. అయిదు అధ్యాయాలుగా వరుచుకున్న ఈ గ్రంథంలోని రెండవ అధ్యాయం పానుగంటివారి రూపకవాఙ్మయ పరిశీలనం. ఇందులో పానుగంటివారి ముప్పై నాటకాల రచనా కాలక్రమాన్ని నిర్ణయించి ఒక్కొక్క దానిని గూర్చి సవిమర్శంగా పరిశీలించినారు శ్రీ వీరభద్ర శాస్త్రిగారు. నర్మదాపురుకుత్సీయము, సారంగధర, ప్రచండ చాణక్యము, రాధాకృష్ణ, పట్టభంగ రాఘవము, విప్రనారాయణ చరిత్రము, కంఠాభరణము ఇలా క్రమంగా నాటకాలన్నింటిలోని కథా పాత్ర చిత్రణ రసపోషణాది వివిధాంశాలను గూర్చి సమగ్రంగా వివరించినారు. ఆయా నాటకవస్తువులకు గల మాతృకలను ఎత్తిచూపి, పానుగంటివారిపై మహనీయుల ప్రభావాన్ని నిరూపించినారు. పాత్రల సంభాషణలో నాటక పద్య రచనలో పాత్ర చిత్రణలో సన్నివేశకల్పనలో ప్రాచ్య పాశ్చాత్య లక్షణ సమన్వయంలో పానుగంటివారు ప్రదర్శించిన ప్రతిభను సహృదయ హృదయ గమ్యంగా అనుశీలించినారు డా. వీరభద్రశాస్త్రిగారు. పానుగంటివారి నాటకాల ప్రదర్శనా యోగ్యతను గూర్చి చక్కగా పరిశీలించినారు. నాలుగవ అధ్యాయంలో నాటకాలలోని హాస్యాన్ని హాస్యాలంబన పాత్రలను సోదాహరణంగా సమీక్షించినారు. పానుగంటి వారి కవితా ప్రతిభనూ, రసపోషణనూ, ఆలంకారిక రచనా సంవిధానాన్నీ భాషాశైలీ విశేషాలనూ తార్కిక ప్రజ్ఞనూ లోకజ్ఞతనూ ఐదవ అధ్యాయంలో వివరించినారు. తమ బహుముఖీనమైన ప్రతిభతో వైదుష్యంతో శ్రీ వీరభద్రశాస్త్రిగారు పానుగంటివారి రూపక విరాణ్మూర్తిని సహృదయులకు దర్శింపజేసినారు ఈ పరిశోధనా

గ్రంథంలో. తరువాతి కాలంలో పానుగంటి కృతులను గూర్చి జరిగిన విశేష పరిశోధనలకు ఈ గ్రంథం ఆదర్శమై, మార్గదర్శకమై భాసించింది.

భారతీయ సంస్కృతిని పరిరక్షించిన మహా పురుషుడూ, సంఘ సంస్కర్తా, కావ్యకారుడూ అయిన శ్రీ వీరేశలింగం పంతులుగారి సమగ్ర వ్యక్తిత్వాన్నీ సాహిత్య కృషినీ గూర్చి పరిశోధనచేసి 1965 లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించినారు డా॥ అక్కిరాజు రమాపతి రావు ('మంజుశ్రీ') గారు. 1972 లో ఈ వ్యాసమే 'వీరేశలింగం పంతులు- సమగ్ర పరిశీలన' అనే గ్రంథంగా రూపు దిద్దుకొని సహృదయుల నలరించింది.

పదిహేను భాగాలుగా పరివ్యాప్తమైన ఈ గ్రంథంలోని ఐదవ భాగంలో వీరేశలింగం పంతులుగారి నాటకాలను గూర్చి పరిశీలనం జరిగింది. పంతులుగారి ప్రహసనాలనూ సంస్కృతాంగ్ల నాటకానువాదాలనూ స్వతంత్ర పౌరాణిక సాంఘిక నాటకాలనూ సమగ్రంగా సమీక్షించినారు 'మంజుశ్రీ'గారు. తెలుగులో ప్రహసనాలను రచించడంలో ఆద్యులు పంతులుగారే అని వారు నిరూపించినారు. హాస్య సంజీవని ప్రథమ ద్వితీయ తృతీయ భాగాలలోని ప్రహసనాలను క్రమంగా పరిశీలించి వాటి రచనోద్దేశాలను ఎంతో చక్కగా వివరించినారు. ప్రహసనాలను ప్రకటించిన పత్రికలనూ తేదీలనూ ఎత్తి చూపినారు. ఆంగ్లేయ ప్రహసనాలను అనుసరించి పంతులుగారు రచించిన అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, విచిత్ర వివాహ ప్రహసనము, మహాబధిర ప్రహసనము మున్నగు వాటిని గూర్చి పరిశీలిస్తూ వాటి మాతృకలను ఎత్తిచూపి దేశకాల పాత్రానుగుణంగా పంతులుగారు చేసిన మార్పులను చూపినారు. ప్రహసనాలలోని వ్యంగ్య మర్యాదలనూ హాస్యధోరణులనూ తెలిపినారు. పంతులుగారి ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్, అభిజ్ఞాన శాకుంతలము, బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని, శ్రీ పునర్వివాహ సభా నాటకము, చమత్కార రత్నావళి, రత్నావళి, మాళవికాగ్ని మిత్రము, ప్రబోధచంద్రోదయము, రాగమంజరి, సత్య హరిశ్చంద్ర, కళ్యాణ కల్పవల్లి మున్నగు పందొమ్మిది నాటకాల రచనాక్రమాన్ని పేర్కొని, వస్తువును బట్టి వాటిని వర్గీకరించి ఒక్కొక్క నాటకాన్ని విపులంగా సమీక్షించినారు. అనువాద నాటకాలను మూలంతో పోల్చి పరిశీలించినారు. పంతులుగారి కావ్యదృష్టిని గూర్చి భాషా శైలినిగూర్చి లోకజ్ఞతాతార్కిక ప్రతిభలను గూర్చి ఈ గ్రంథంలోని వేర్వేరు భాగాలలో వివరించినారు.

వీరేశలింగం పంతులు గారిది బహుముఖీనమైన సాహిత్య సృష్టి. అందులో ఒక ముఖం నాటక సాహితీ సృష్టి. ఆ సృష్టి విశేష విన్యాసాలను ఈ గ్రంథంలో సమగ్రంగా పరిశీలించటంలో కృతకృత్యులైనారు 'మంజుశ్రీ'గారు. వీరేశలింగం పంతులుగారి సర్వతోముఖ ప్రతిభకు దర్పణం ఈ గ్రంథం.

"సంఘ సంస్కరణ - వీరేశ లింగంగారి సాహిత్యం" అనే విషయాన్ని గూర్చి వి. కోటేశ్వరమ్మగారు పరిశోధన చేసి 1981లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. పంతులుగారి రూపక సాహితీ విశేషాలు ఈ వ్యాసంలో చోటు చేసికొని ఉంటాయి. కాని, నాకు ఆ పరిశోధనా వ్యాసాన్ని చూసే భాగ్యం దక్కలేదు.

ఆంధ్ర చారిత్రక నాటక పితామహుడుగా నాటక ప్రయోక్తగా ఉత్తమ విమర్శకుడుగా ఆంధ్ర నాటక చరిత్రలో కోటికెక్కిన కోలాచలం శ్రీనివాస రావుగారి నాటక సాహిత్యాన్ని గూర్చి పరిశోధన చేసి ఒక సిద్ధాంత వ్యాసాన్ని 1972లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించినారు, డా॥ ఎన్. గంగప్ప గారు. ఈ వ్యాసం 1977లో 'కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య సమాలోచనము' అనే గ్రంథంగా రూపుదిద్దుకున్నది.

కందుకూరి, ధర్మవరం, చిలకమర్తి, వేదం, గురజాడ, పానుగంటి వంటి వారికి సమకాలికుడై ఇరవై ఎనిమిది నాటకాలనూ నాలుగు ప్రహసనాలనూ (ఇందులో ఒకటి కన్నడం) రచించి, తమ వైలక్షణ్యాన్ని వ్యక్తిత్వాన్ని భద్రంగా నిలుపుకున్నవారు కోలాచలం శ్రీనివాసరావుగారు. కోలాచలంగారి నాటకాలన్నింటినీ ఇతివృత్తాన్నిబట్టి వర్గీకరించి ఒక్కొక్క నాటకాన్ని గూర్చి సమగ్ర పరిశీలనం చేసినారు డా॥ గంగప్పగారు ఈ గ్రంథంలో. వర్గీకరణంలో సుఖమంజరీ పరిణయము, సుల్తానా చాందుబీ, రామరాజు చరిత్రమువంటి చారిత్రక నాటకాలూ, శ్రీరామ జననము, సీతా కల్యాణము. పాదుకా పట్టాభిషేకము వంటి పౌరాణిక నాటకాలూ, ద్రౌపదీ వస్త్రాపహరణము, కీచకవధ వంటి భారతకథామూలకాలైన నాటకాలూ, మదాలస, రుక్మాంగద, గిరిజా కల్యాణము వంటి ఇతర పౌరాణిక నాటకాలూ, రాక్షసీమహత్వాకాంక్ష వంటి ఆంధ్రీకృత నాటకాలూ, సునందనీ పరిణయము అనే కల్పిత నాటకమూ, యువతీ వివాహము అనే సాంఘిక నాటకమూ ఉన్నాయి. ఇవికాక నాచిపార్టీ వంటి ప్రహసనాలూ ఉన్నాయి. పదకొండు భాగాలున్న ఈ గ్రంథంలోని ఐదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ భాగాలలో కోలాచలం వారి ఇతివృత్త నిర్మాణ దక్షతనూ పాత్రపోషణ చాతుర్యాన్నీ రచనా శిల్పాన్నీ రచనా ప్రయోజనాన్నీ వివరించినారు డా॥ గంగప్పగారు. చారిత్రక విషాదాంత నాటక హాస్యరస నిర్వహణలో ఔచితీపోషణలో కోలాచలం వారి కొన్ని విశిష్టలక్షణాలను వివరించినారు తొమ్మిదవ భాగంలో. కోలాచలంవారి నాటకేతర రచనలనూ, ఆంధ్ర నాటక వాఙ్మయంలో ఆతని కున్న స్థానాన్నీ పరిశీలించినారు చివరి రెండు భాగాలలో. కోలాచలంవారి రూపక వాఙ్మయ పరిశోధనా సర్వస్వం ఈ గ్రంథం. డా॥ గంగప్పగారి పరిశోధనా పటిమకూ వైదుష్యానికీ ప్రతిబింబం ఇది.

'తెలుగులో విషాదరూపకాలు' అనే అంశాన్ని గూర్చి పరిశోధన చేసి శ్రీమతి కస్తూరి ఉదయ భాస్కరలక్ష్మిగారు ఒక సిద్ధాంత వ్యాసాన్ని 1977లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. ఈ వ్యాసం నాకు లభ్యం కాలేదు.

ప్రక్రియాపరంగా జరిగిన పరిశోధన 'తెలుగులో ప్రహసనాలు.' శ్రీ జి. శేషారెడ్డిగారు ఈ పరిశోధన వ్యాసాన్ని 1978లో రచించి మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. ఈ వ్యాసాన్నికూడా దర్శించే అవకాశం నాకు లభించలేదు.

ప్రక్రియా దృష్టితో జరిగిన మరో పరిశోధన 'తెలుగులో గేయ నాటికలు', ఈ విషయాన్ని గూర్చి నేను పరిశోధన చేసి ఒక సిద్ధాంతవ్యాసాన్ని 1978లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించినాను. తెలుగులో విద్వత్కవులైన శ్రీ శివశంకర స్వామి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ, శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ వానమామలై వరదాచార్యులు, డా॥ బోయి భీమన్న, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, డా॥ యస్వీ జోగారావు, డా॥ కె. వి. ఆర్. నరసింహం, డా॥ నండూరి రామకృష్ణమాచార్య, శ్రీ జె. బాపురెడ్డి మున్నగు వారెందరో గేయనాటికా ప్రక్రియా లతకు రంగు రంగుల పూలు పూయించి రకరకాల పరిమళాలను గుబాళింపజేసినారు. 1930 లో ప్రారంభమైన ఈ గేయనాటికా ప్రక్రియలో 1977 దాకా వచ్చిన శతాధిక నాటికలను భిన్నభిన్న దృక్కోణాలతో పరిశీలించినాను ఈ సిద్ధాంతవ్యాసంలో. అరవైకి మించిన గేయనాటికా కర్తల నాటికలను ఈ సిద్ధాంత వ్యాసంలో సమీక్షించినాను.

పద్నాలుగు భాగాలుగా పరుచుకున్న ఈ సిద్ధాంత వ్యాసంలో నాటికా స్వరూప స్వభావాలనూ, సాహిత్యంతో గేయానికున్న ప్రమేయాన్ని, సంగీత

ప్రాశస్త్యాన్ని మొదటి రెండవ మూడవ భాగాలలో వివరించినాను. గేయ నాటికలలోని ప్రధానాంశాలైన గీతనృత్యాలు భరతుని కాలంనుంచి ఉన్న రూపకాలలో చోటు చేసికొన్న తీరుతెన్నులనూ, కైశికీ వృత్తికీ ధ్రువగానాదులకూ రూపకాలలో గల ప్రాధాన్యాన్నీ వివరించాను నాల్గవ భాగంలో. త్రోటకం, సట్టకం, నాట్యరాసకం, ఉల్లాప్యం, ప్రేంఖణం, సంలాపకం, శ్రీగదితం, శిల్పకం, హల్లీసం, భాణిక, డోంబిక, మల్లిక వంటి అనేక సంస్కృతోప రూపకాల లక్షణాలను ఎత్తి చూపి, సమకాలికమైన అభిరుచుల కనుగుణంగా కొన్ని మార్పులతో చేర్పులతో అవి ఈ నాటి గేయనాటికలలో ఎలా భాసిస్తున్నవో వివేచించి చూపినాను ఐదవ భాగంలో. దేశిదృశ్యకళా రూపాలైన కొరవంజి యక్షగానాదుల స్వరూప స్వభావాలను వివరించి, గేయనాటికలకూ వానికి గల సాదృశ్యాన్నీ పరిశీలించి, గేయనాటికలపై వానికి గల ప్రభావాన్ని చర్చించినాను ఆరవ భాగంలో. ఏడవ భాగం వివిధ భాషలలోని గేయనాటికా వికాస పరిశీలనం. ఎనిమిదవ భాగం తెలుగులో గేయనాటికావతరణం. శ్రీ తల్లావజ్ఝల శివశంకరస్వామి వారి 'పలితకేశం' (1930) తెలుగులో మొట్ట మొదటి గేయనాటిక అని నిరూపింపబడింది ఇందులో. తొమ్మిదవ భాగం గేయనాటికా వైవిధ్య పరిశీలనం. ఛందోదృష్టితోనూ వస్తు దృష్టితోనూ గేయ నాటికలను పౌరాణికాలుగా, చరిత్రాత్మకాలుగా, సాంఘికాలుగా, సాంస్కృతికాలుగా, అనుసరణాత్మకాలుగా, ప్రకృతి సంబంధాలు (ప్రతీకాత్మకాలు)గా, ప్రబోధాత్మకాలుగా వర్గీకరించి వాటిలోని విశేషాలను వివరించాను. ఈ భాగం చివరలో బాలల గేయనాటికలనూ సినిమా గేయ నాటికలనూ కూడా పరిశీలించినాను. పదవ భాగం గేయనాటికా స్వరూప స్వభావ నిరూపణం. గేయ నాటికా ప్రయోగ పరిశీలనం పదకొండవది. గేయ నాటికలలోని కావ్యత్వాన్ని వివరించేది పన్నెండవ భాగం. గేయ నాటికలలోని పద్య-గేయ-వచన కవితా ప్రయోగ విశేషాలనూ గతివైవిధ్యానికీ అక్షర సంయోజనానికీ రసపోషణకూ ఉన్న సంబంధాన్నీ, గ్రాంథిక-వ్యావహారిక-అన్యదేశీయ-భాషా పదప్రయోగ విశేషాలనూ పదమూడవ భాగంలో పరిశీలించినాను. గేయ నాటికల భవితవ్య సమాలోచనం చివరి భాగం. అనుబంధాలలో గేయనాటికా ప్రక్రియకు ఆద్యులైన శ్రీ శివశంకర స్వామివారితో నేను జరిపిన గోష్ఠి విశేషాలనూ, ఉత్తర ప్రత్యుత్తరాలనూ ఉట్టంకించినాను. గేయ నాటికలనూ రచయితలనూ పేర్కొన్నాను.

శ్రీమతి సి. రాజేశ్వరి గారు 'ఆంధ్రమున ప్రబంధరూపము నొందిన సంస్కృత నాటకములు' అనే విషయంపై పరిశోధన చేసి 1978 లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని బెంగుళూరు విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. ఈ వ్యాసం 1981 లో గ్రంథ రూపం దాల్చింది. ఈ సిద్ధాంత గ్రంథంలో ప్రధానంగా రెండుభాగా లున్నాయి. మొదటి భాగం పరిశోధనాంశానికి ఉపోద్ఘాతప్రాయం. ఆరు భాగాలుగా విభక్తమైన ఈ ప్రథమ భాగంలో ప్రబంధాలకూ నాటకాలకూ గల సామ్య భేదాలనూ నాట్యోత్పత్తినీ సంస్కృత నాటక వాఙ్మయాన్నీ సంగ్రహంగా సమీక్షించినారు డా॥ రాజేశ్వరిగారు. కావ్యాలలో నాటకాలకు గలవైశిష్ట్యాన్నీ, ఆంధ్రవాఙ్మయంలోని అనువాద విధానాలనూ వివరించినారు. తెలుగులో నాటకాలు ఆలస్యంగా రావడానికి గల కారణాలను పరిశీలించి, ఆధునికాంధ్ర నాటక వికాసాన్ని రేఖామాత్రంగా సమీక్షించినారు. శ్రవ్యకావ్యాలలో నాటకీయత చోటుచేసుకున్న తీరు తెన్నులను ఎత్తిచూపినారు.

ఆంధ్రమున ప్రబంధరూపాన్నిపొందిన ఆరు సంస్కృత నాటకాల పరిశీలనమే ద్వితీయభాగం. సిద్ధాంత గ్రంథములోని ప్రధాన విషయ మిదే. సంస్కృత నాటకాన్ని అనుసరించి ప్రబంధాన్ని రచించిన ప్రథమాంధ్ర కవి మంచన. అతని కేయూర బాహు చరిత్రము రాజశేఖరుని 'విద్ధసాలభంజిక'కు

అనుసరణం. వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామమునకు మూలం రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామము'. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలమునకు మూలం కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము'. జంటకవులైన నందిమల్లయ, ఘంటసింగనల ప్రబోధచంద్రోదయ ప్రబంధం కృష్ణమిశ్రుని 'ప్రబోధ చంద్రోదయము'నకు ఆంధ్రీకరణం. బొడ్డుచర్ల చిన తిమ్మయ్య రచించిన ప్రసన్నరాఘవ నాట్యప్రబంధానికి మూలం జయదేవుని 'ప్రసన్న రాఘవ నాటకము'. బిజ్జుల తిమ్మభూపాలుని 'అనర్ఘ రాఘవము' మురారి 'అనర్ఘరాఘవమున'కు అనుకరణం. మూల నాటక కర్తల-ఆంధ్రీకర్తల జీవితకాలాదులనూ వారి నాటక కథా విశేషాలనూ ఆంధ్రీకరణవిధానాలనూ నామౌచిత్యకథా రసపాత్రపోషణాలను భాషాశైలీ విశేషాలను వివరించే సందర్భంలో డా. రాజేశ్వరిగారు ప్రదర్శించిన ఉభయభాషా వైశారద్యమూ పరిశోధనా గరిమా సమగ్ర విషయ ప్రదర్శనా కౌశలమూ విద్వత్సంస్తవనీయం. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునూ రవివర్మభూపాలుని ప్రద్యుమ్నాభ్యుదయ నాటకాన్నీ గ్రహించి తులనాత్మకంగా పరిశీలించి విషయసమగ్రతకు కృషిచేసినారు డా.రాజేశ్వరిగారు. గ్రంథంలో ఏడవ భాగం ఇది. ఆధునిక యుగంలో శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము స్వప్న వాసవదత్తము నాటకాలను మూలంగా గ్రహించి 'శ్రీ వాసవదత్తా వత్సరాజము' అనే ప్రబంధాన్ని రచించినారు. ఈ ఉభయకావ్య విశేషాలను కూడా డా. రాజేశ్వరి గారు స్పృశించి పరిశోధనా సమగ్రతను సాధించినారు.

ఆధునిక జీవితరంగంలో కనిపించే సంఘర్షణకు మూలం భిన్నభిన్న సమస్యలు. ఇట్టి సమస్యలను ప్రధానవస్తువుగా గ్రహించి అనేక సాంఘికరూపకాలు అవతరించినాయి, అవతరిస్తున్నాయి. ఆధునిక యుగంలో రూపకసాహిత్యానికి ప్రతినిధిగా సాంఘిక నాటకం భాసిస్తున్నది. వస్తువైవిధ్యంతో ప్రయోగ బాహుళ్యంతో అనేకంగా అల్లుకుపోతున్నది సాంఘిక నాటకం. 'తెలుగు సాంఘిక నాటకం' అనే అంశాన్ని గ్రహించి పరిశోధన చేసి 1979 లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించినారు శ్రీ పి. వెంకటరమణగారు.

డా. వెంకటరమణగారు నాటకకర్తలు కూడా. వారి సృజనాత్మక చైతన్యమూ విమర్శనాత్మకమైన ప్రవృత్తీ ఈ పరిశోధనా వ్యాసరచనకు సమగ్రతను సంతరించి పెట్టినాయి. "కన్యాశుల్కం సాంఘిక నాటక గంగాప్రవాహానికి గంగోత్రివంటిది," "ఆచార్య ఆత్రేయగారి 'ఎన్‌జీవో' ఒక మైలురాయి. ఒక కొత్తదనానికి ఉషోదయం" అన్నారు వెంకటరమణగారు, తమ 'ముందుమాట'లో. తెలుగులో సాంఘిక నాటకాలు రెండువేలను దాటినాయి. ఒక్కొక్క నాటకాన్ని గూర్చి సమగ్రంగా సమీక్షించటం సాధ్యం కానిపని. అందుకే డా॥ వెంకటరమణగారు సమస్య నాధారంగా చేసుకొని, సాంఘికనాటక రచనా ప్రయోగాలను పరిశీలించినారు. ఎనిమిది అధ్యాయాలుగా సాగిన ఈ సిద్ధాంతవ్యాసంలో మొదట సాంఘిక రూపక స్వరూప స్వభావాలను వివరించినారు. ఈ సందర్భంలో పాశ్చాత్య విమర్శనా దృక్పథాన్ని గ్రహించి, దానిని తెలుగులోని ప్రయోగాలకు సమన్వయించిన వైఖరి ప్రశంసనీయం. రెండవ అధ్యాయంలో చారిత్రకంగా ప్రక్రియాపరంగా తెలుగు సాంఘిక నాటకం వికసించిన వైనాన్ని నిరూపించినారు. ప్రాచీన భారతీయ దశరూపకాలలో సాంఘికవస్తువును సమీక్షించినారు మూడవ అధ్యాయంలో. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగు సాంఘికనాటకం ఆవిర్భవించిన కారణంచేత పాశ్చాత్య సాహిత్యాల్లో సాంఘిక నాటక వికాస పరిణామాలను పరిశీలించినారు నాల్గవ అధ్యాయంలో. ప్రయోగంలో ప్రధాన పాత్రను నిర్వహించిన పాశ్చాత్య నాటకకర్తృ పరిచయం పంచమాధ్యాయం. తెలుగు సాంఘికనాటకంపై పాశ్చాత్య ప్రభావ పరిశీలనం ఆరో అధ్యాయం.

తెలుగు సాంఘిక నాటకరచనలోని తీరుతెన్నులను వివరించేది ఏడవది. రచనలను వివిధ సమస్యల కింద వర్గీకరించి ఒక్కొక్క సమస్యను చిత్రించిన నాటకాల పరిణామాన్ని ప్రకటించటంలో శ్రీ వెంకట రమణగారు చూపిన పరిశోధనాశక్తి హృద్యం. పాత్ర చిత్రణం, సన్నివేశ కల్పనం, నవీన ప్రయోగానురక్తి వంటి అంశాలు సాంఘిక రూపక పరిణామదశలో కన బరచిన ప్రాధాన్యాన్ని ఈ అధ్యాయంలో విషయ విపులంగా పరిశీలించినారు పరిశోధకులు. వ్యాపారదృష్టిని మాని నాటక కర్తలు శిల్పదృష్టితో కృషిచేసి సముజ్జ్వల ప్రగతిపథంలో సాంఘిక నాటకాన్ని నడిపించాలని తమ సదాశయాన్ని వ్యక్తీకరించినారు, ఈ గ్రంథం చివరి అధ్యాయం 'ముగింపుమాట'లో. ఈ సిద్ధాంత వ్యాసరచనలో డా. వెంకటరమణగారి రూపకసాహితీ పరిజ్ఞానం బహుముఖంగా భాసిస్తున్నది. తెలుగు సాంఘిక నాటక జగత్తును సమగ్రంగా సందర్శింప జేసే సిద్ధాంతవ్యాస మిది.

'చలం నవలలు-సామాజిక చైతన్యం' అన్న అంశం మీద 1979 లో కాకతీయ విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసిన శ్రీ వెన్నవరం ఈదారెడ్డిగారు తమ సిద్ధాంత గ్రంథంలో చలంగారి నాటికల, నాటికా సంపుటాల, నాటకాం పేర్లనూ రచనా కాలాలనూ మాత్రమే పేర్కొన్నారు.[1] చలం నవలల పరిశీలనమే పరిశోధనాంశం కాబట్టి చలం రూపక సాహిత్య విశేష పరిశీలనం ఇందులో లేకపోవడం సహజం. డా॥ పి. ఎస్.ఆర్. అప్పారావుగారు తమ 'తెలుగు నాటక వికాసము'లో చలంగారి చిత్రాంగి, శశాంక, జయ దేవ, విడాకులు, పురూరవ వంటి నాటకాలనూ, సత్యం శివం సుందరం, పద్మరాణి, కొండడు వంటి నాటికలనూ పరిశీలించినారు.

శ్రీ ఎన్. రామచంద్రన్‌గారు 'చలం సాహిత్యం — సామాజిక దృక్పథం' అనే విషయాన్ని గూర్చి వి.జి. కేంద్రం, అనంతపురంలో పరిశోధన చేసి 1981లో సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించినారు. ఈ పరిశోధనా వ్యాసంలో చలంగారి రూపక సాహిత్య విశేష పరిశీలనం జరిగియుండడం సహజం. ఈ వ్యాసాన్ని నేను చూడలేకపోయినాను.

1979 లో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి సమర్పించిన 'జాషువ కృతుల సమాలోచన' అనే పరిశోధనా వ్యాసంలో డా. బి. భాస్కరచౌదరి గారు జాషువ రచించిన దృశ్యకావ్యాలను గూర్చి చక్కని సమీక్ష చేసినారు. ఈ వ్యాసం 1982 లో ముద్రితమైనది. ఈ గ్రంథంలోని ఐదవ ప్రకరణంలో జాషువ నాటకాల పౌర్వాపర్యాన్నీ అవి ప్రకటితమైన కాలాన్నీ నిర్ధారించి చూపినారు. వస్తుభేదాన్ని బట్టి రుక్మిణీ కల్యాణము, చిదానంద ప్రభాతము, ధ్రువ విజయము అనే నాటికలను పౌరాణికాలుగాను, 'మీరా బాయి' నాటికను చారిత్రకంగానూ, 'తెరచాటు'ను సాంఘిక నాటకంగానూ వింగడించి, ఒక్కొక్క నాటకాన్ని గూర్చి క్రమంగా పరిశీలించినారు. నాటక వస్తువునూ, కథామూలాలనూ, నాటకరచనోద్దేశాలనూ కల్పనలనూ అనుకరణాలనూ ప్రాచ్యపాశ్చాత్యరూపక మర్యాదా సమన్వయాన్నీ పద్యరచనా విశేషాలనూ ఇంకా అనేకమైన అంశాలను గూర్చి చక్కని సమీక్షను నిర్వహించినారు డా॥ చౌదరిగారు. ఈ ప్రకరణం చివర 'దృశ్యకావ్యాల సమీక్ష'లో జాషువ నాటకాల సామాన్య లక్షణాలను సంగ్రహంగా సూచించినారు. జాషువ దృశ్యకళామూర్తికి డా॥ చౌదరిగారు ఈ సిద్ధాంతగ్రంథంలో సముచితస్థానాన్ని కల్పించి సహృదయులకు సంతృప్తిని కలిగించినారు.

1978 లోనే ''జాషువ కృతులు - సంప్రదాయం - నవ్యత'' అనే అంశాన్ని గూర్చి పరిశోధన చేసి శ్రీ గుదిమెళ్ళ భావనారాయణాచార్యులుగారు ఒక సిద్ధాంత వ్యాసాన్ని ఆంధ్ర విశ్వ విద్యాలయానికి

---

1. 'చలం నవలలు-సామాజిక చైతన్యం'-పుటలు 164 నుంచి 174 వరకు-ప్రథమ ముద్రణ - 1980.

సమర్పించినారు. ఈ వ్యాసంలో జాషువ నాటకాలను గూర్చిన పరిశీలన జరిగియుండి ఉంటుంది. కాని ఆ వ్యాసాన్ని చూసే అవకాశం నాకు కలుగలేదు.

విద్వత్కవులూ బహుశాస్త్రపారగులూ సవ్యమార్గప్రవర్తకులూ అయిన శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి నాటకాలను గూర్చి చక్కని పరిశీలన చేసినారు డా॥ జంధ్యాల శంకరయ్య గారు, 1979లో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సమర్పించిన "శ్రీ వేలూరి శివరామశాస్త్రి కృతులు - సమీక్ష" అనే సిద్ధాంత వ్యాసంలో. ఈ వ్యాసం 1981 లో ముద్రితం. ఈ గ్రంథంలోని ఏడవ భాగంలో డా॥ శంకరయ్య గారు శివరామశాస్త్రి గారు రచించిన మాధవవర్మ (ఇది అలభ్యమట), ప్రథమ సాంధికుడు, వేతసి, గురు దక్షిణ, అరణ్య శేషోన్నయం, సులతానీ అనే ముద్రితాముద్రిత నాటకాలను పేర్కొని, వాటి ఆనుపూర్విని నిర్ణయించి, ఒక్కొక్క నాటకాన్ని సమీక్షించినారు. రూపకకర్తగా శ్రీ శాస్త్రి గారి అభినవత్వాన్నీ, తాత్త్విక హృదయాన్నీ, ప్రజ్ఞాపాటవాన్నీ చాటినారు శ్రీ శంకరయ్య గారు.

శ్రీ అనుమాండ్ల భూమయ్య గారు 'నాయని సుబ్బారావు కృతులు-పరిశీలన' అనే అంశాన్ని గూర్చి పరిశోధన చేసి ఒక సిద్ధాంత వ్యాసాన్ని 1980 లో కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. ఇది 1981 లో ముద్రితం. ఈ గ్రంథంలోని ఆరవ అధ్యాయం 'పరిశిష్ట రచనలు'లో నాయని సుబ్బారావు గారు ఆకాశవాణి కోసం రచించిన ముప్పైరెండు నాటికల జాబితానూ వాని ప్రసారకాలాన్నీ ప్రకటించి నారు. వీటిలో పండుగ కట్నం, ఇంద్రధనుస్సు, మహిషాసురమర్దని, కణ్వాశ్రమం, ప్రజా పరిషత్తు, కుటుంబ గౌరవం (ఇది అసంపూర్ణమట) అనే నాటికలు తమకు శ్రీ నాయనివారి వద్ద లభించినట్లు తెలిపి డా॥ భూమయ్య గారు వాటిని సమీక్షించినారు. నాయని వారి నాటికలలోని సంభాషణ చాతురినీ, హాస్యరసపోషణననూ, సామాజికావగాహననూ, సన్నివేశకల్పననూ గూర్చి ఎన్నెన్నో నూత్న విషయాలను ఈ సమీక్షలో వెలువరించి, నాయని వారి నాటిక రచనా ప్రతిభను పరిచయం చేసినారు డా॥ భూమయ్య గారు.

ఆధునికాంధ్ర సాహిత్య సౌధ నిర్మాతలలో ఒకరైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారి కృతులను గూర్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి శ్రీమతి ముక్తేవి భారతి గారు 1980 లో 'చిలకమర్తి సాహిత్య సేవ' అనే సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించినారు. ఈ పరిశోధనా వ్యాసంలో డా॥ భారతి గారు చిలకమర్తి వారి రచనలన్నిటిని ప్రక్రియా దృష్టితో వర్గీకరించి పరిశీలించినారు. పది భాగాలుగా సాగిన ఈ వ్యాసంలోని రెండవ భాగంలో చిలకమర్తి వారి నాటకాల సమాలోచనం సమగ్రంగా జరిగింది. గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, ప్రసన్నయాదవము, చతుర చంద్రహాసము, కీచక వధ, నల నాటకము, శ్రీరామ జననము వంటి ముద్రితాముద్రిత నాటకాలను స్వతంత్ర నాటకాలుగానూ, స్వప్నవాసవదత్త, ప్రతిమానాటకము, మధ్యమవ్యాయోగము, దూతవాక్యము వంటి వాటిని అనువాద నాటకాలుగానూ విభజించి, ఒక్కొక్క నాటకాన్ని సమగ్రంగా సమీక్షించి వాని ప్రత్యేకతనూ వైలక్షణ్యాన్నీ చాటినారు శ్రీమతి భారతి గారు. గయోపాఖ్యానము నాటకమునకు పంచ సంధులను సమన్వయించి చూపడంలో డా॥ భారతి గారు ప్రదర్శించిన వైదుష్యం ప్రశంసనీయము. నాటక పద్య రచనా శిల్ప విశేషాలన్నెంటినో తెలిపినారు ఎనిమిదవ అధ్యాయంలో. సంఘ దురాచారాలను ఎత్తిచూపడం కోసం చిలకమర్తి వారు రచించిన బధిర చతుష్టయము, గయ్యాళి గంగమ్మ, జనాభా నాటకము, అద్భుత కవిత్వము వంటి వాటిని హాస్య ప్రహసనాలుగానూ, వరదక్షిణ, కొండూరి జానకిరామయ్య పెండ్లి, అపూర్వ స్వయంవరము వంటి వాటిని విమర్శనాత్మక ప్రహ

సనాలుగానూ వింగడించి, ప్రతి ప్రహసనంలోని తత్త్వాన్నీ ప్రయోజనాన్నీ విపరించినారు డా॥ భారతి గారు. సంఘ సంస్కరణ కోసం, నీతిబోధ కోసం రచనను సాగించిన చిలకమర్తి వారి రూపక సాహితీ మూర్తిని ఈ సిద్ధాంత వ్యాసంలో సహృదయ హృదయాకర్షకంగా చిత్రించినారు శ్రీమతి భారతి గారు.

ప్రత్యేక నాటక గ్రంథపరంగా సాగిన పరిశోధనలో మొదట పేర్కొనదగినది శ్రీ ప్రభాకర్ ఫణిరాజా గారి 'కన్యాశుల్కం - ఒక విమర్శ' అనే సిద్ధాంత వ్యాసం. దీనిని వారు 1980 లో బెంగుళూరు విశ్వ విద్యాలయానికి సమర్పించినారు. కాని, ఈ వ్యాసాన్ని చూసే భాగ్యం నాకు కలుగలేదు.

ఈ కోవకు చెందిన మరో సిద్ధాంతవ్యాసం- 'విశ్వనాథవారి త్రిశూలం- విమర్శనాత్మక పరిశీలన'. పి. జ్యోతిగారు కాకతీయ విశ్వవిద్యాలయంలో చేసిన పరిశోధనా ఫలితం ఈ వ్యాసం. చారిత్రకమైన 'త్రిశూలం' నాటకంలో వీరశైవ- ఆర్షమతాల సంఘర్షణం, ప్రతీకాత్మకమైన పాత్ర చిత్రణం నిర్వహింపబడిన తీరును జ్యోతిగారు ఈ వ్యాసంలో చక్కగా పరిశీలన చేసినారని పండితులు చెప్పగా విన్నాను. కాని, ఆ వ్యాసాన్ని చూసే అదృష్టం ప్రాప్తించలేదు నాకు.

మంగళగిరి ప్రమీలాదేవిగారు "డా॥ జి. వి. కృష్ణారావు నాటికా సాహిత్య సమాలోచన" అనే అంశంపై నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి ఒక సిద్ధాంత వ్యాసాన్ని 1981లో రచించినారు. ఈ వ్యాసాన్ని కూడా నేను చూడలేక పోయినాను.

ప్రత్యేక నాటకపరంగా సాగిన మరో పరిశోధనావ్యాసం 'విశ్వనాథవారి నర్తనశాల- ఒక పరిశీలన'. ఆర్. కమలగారు హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో కృషిచేసి 1982 లో సమర్పించిన సిద్ధాంతవ్యాసమిది. తిక్కన చేతిలో కావ్యంలా రూపు దిద్దుకున్న కీచక వృత్తాంతం కవి సమ్రాట్ విశ్వనాథ వారి చేతిలో రమ్యనాటకంగా పాశ్చాత్య విషాద రూపక మర్యాదాలంకృతంగా శిల్పకళా ఖండంగా ఎలా శోభలను వెలార్చిందో ఈ సిద్ధాంత వ్యాసంలో ఆర్. కమలగారు సోపపత్తికంగా నిరూపించినారు.

ఆరు అధ్యాయాలుగా అల్లుకుపోయిన ఈ పరిశోధనా వ్యాసంలోని ప్రథమాధ్యాయం- 'విరాట పర్వము- నర్తనశాల ప్రాముఖ్యము'. మహాభారతంలో విరాటపర్వానికున్న ప్రాశస్త్యాన్నీ, ఆ పర్వంలో నర్తనశాలకున్న ప్రాముఖ్యాన్నీ పరిశీలించినారు ఈ అధ్యాయంలో కమలగారు. నర్తనశాల కథా ఘట్టానికి గర్భసంధిని సాంగంగా సమన్వయించి చూపడంలో కమలగారి పరిశోధనా ప్రజ్ఞ నిగ్గులను వెలార్చింది.

'నాటకములలో నర్తనశాల' అనే అధ్యాయంలో ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు మొదలగు నాటకకర్తలు కీచకవధ వస్తువును నాటకంగా నిర్మించిన వైనాన్ని చూపుతూ విశ్వనాథవారి 'నర్తనశాల'లోని సంవిధాన శిల్పం పైవానిలో కానరాదనే సత్యాన్ని నిరూపించినారు. 'నర్తనశాల'లోని వస్తు సంవిధానాన్ని సమీక్షించేది తృతీయాధ్యాయం. నాటకానికి విషాద నాటక స్వభావాన్ని సంతరించడంలో విషాద నాటకానుకూలమైన సంఘర్షణంలో వాతావరణ చిత్రణంలో కెథార్సిస్‌లో ప్రతియోగకల్పనంలో సన్నివేశ సంవిధానంలో విశ్వనాథ వారు ప్రదర్శించిన ప్రతిభకు దర్పణం పట్టినారు కమలగారు ఈ అధ్యాయంలో. 'నర్తనశాల- పాత్ర పోషణము' చతుర్థాధ్యాయం. నాటకవస్తువునకు విషాదాంత స్వభావాన్ని కల్పించటానికై విశ్వనాథవారు నాటక పాత్రలలో విషాద పాత్ర స్వభావాన్ని చిత్రించి నూత్నతను ఎలా సాధించినారో సప్రమాణంగా నిరూపించి, పాత్రపోషణలో విశ్వనాథ వైలక్షణ్యాన్ని ఎత్తి చూపినారు. 'నర్తనశాల'లోని రచనా శిల్పాన్ని ప్రదర్శిస్తుంది పంచమాధ్యాయం. నర్తనశాల నామౌ

చిత్యం, నాందీ ప్రస్తావనలు, ఐక్యత్రయం, విషాద వాతావరణం, పద్యరచన, అలంకారాలు, జాతీయాలూ, లోకోక్తులూ, మన్మథావస్థలూ మున్నగు అంశాలను సోదాహరణంగా పరిశీలించినారు ఈ అధ్యాయంలో కమలగారు. విశ్వనాథవారి విషాదాంత నాటకాలైదింటిలో 'నర్తనశాల' నాయకమణిగా ఎలా భాసిస్తున్నదో నిరూపించేది ఆరవ అధ్యాయం. విశ్వనాథ నాటకరచనా ప్రతిభను ఈ పరిశోధనావ్యాసం చక్కగా నిరూపిస్తున్నది.

''కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి నాటకాలలో హేతువాద దృక్పథం'' అనే విషయాన్ని గూర్చి హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో పరిశోధనచేసి శ్రీ కొండపల్లి సుదర్శన్‌రాజు గారు 1983 లో ఒక సిద్ధాంతవ్యాసాన్ని రచించినారు.

మతమౌఢ్యాన్నీ సాంఘికాసమానత్వాన్నీ నిర్మూలించే ఉద్దేశంతో కలంపట్టినకవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి కురుక్షేత్ర సంగ్రామం, శంబుక వధ, ఖూనీ అనే నాటకాలను గూర్చి శ్రీ సుదర్శన్‌రాజుగారు చక్కని సమీక్ష చేసినారు. ఐదు భాగాలున్న ఈ సిద్ధాంత వ్యాసంలోని మొదటి అధ్యాయంలో హేతువాదానికీ లోకాయత చార్వాక నాస్తికాది వాదాలకూ గల సంబంధాన్ని గూర్చి చర్చించినారు. కవిరాజుకూ బెర్నార్డ్‌షాకూ గల పోలికలనూ, కవిరాజు నాటకాలలోని సుదీర్ఘ పీఠికలనూ పరిశీలించినారు ద్వితీయాధ్యాయంలో. కవిరాజు నాటకాలలోని భావవిప్లవాన్ని పరిశీలించేది మూడవ అధ్యాయం. కవిరాజు నాటక నిర్మాణ నవ్యతనూ చారిత్రక దృష్టినీ సంస్కరణ వాదాన్నీ తార్కిక వివేచననూ శాస్త్రీయ దృక్పథాన్నీ వివరించినారు శ్రీ సుదర్శన్‌రాజుగారు. 'పురాణేతివృత్త హేతువాద నాటకాలు-త్రిపురనేని ప్రభావం' నాల్గవ అధ్యాయం. ఇందులో త్రిపురనేనిచేత ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ప్రభావితులైనవారి రచనలు పేర్కొనబడినాయి. వీటిలో నార్లగారి జాబాలి, సీతజోస్యం, ముద్దుకృష్ణగారి అశోకం, చలంగారి 'సీత అగ్నిప్రవేశం', జి.వి. కృష్ణారావుగారి భిక్షాపాత్ర, బోయి భీమన్నగారి ఆదికవి వాల్మీకి, వేదవ్యాసుడు, ధర్మవ్యాధుడు పరిశీలించబడినాయి. 'త్రిపురనేని జీవితము-సాహిత్యము' అనే అధ్యాయంతో ఈ పరిశోధనా వ్యాసం పరిసమాప్తమైనది.

ఆదిభట్ల నారాయణదాసు, దాసు శ్రీరాములు, దువ్వూరి రామిరెడ్డి, వేటూరి ప్రభాకరశాస్త్రి, కాటూరి వేంకటేశ్వరరావు, తాపీ ధర్మారావు, రాయప్రోలు సుబ్బారావు, గోపీచంద్ జంధ్యాల పాపయ్యశాస్త్రి, డా॥ సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, బాపురెడ్డి మున్నగువారు విద్వత్కవులు. వీరు శ్రవ్యకావ్యాలతో పాటు దృశ్యకావ్యాలను కూడా రచించినారు. వీరి సాహిత్య జీవితాలను భిన్నభిన్న దృక్పథాలతో సమీక్షిస్తూ వారి తాత్త్వికతను సందర్శిస్తూ అనేక పరిశోధకులు 1978-'83 మధ్యకాలంలో ఉస్మానియా, హైదరాబాదు కేంద్ర-నాగార్జున, శ్రీ వేంకటేశ్వర, బెంగుళూరు, కాకతీయ, ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయాలలోనూ అనంతపురం పి.జి. కేంద్రంలోనూ పరిశోధనలు చేసి సిద్ధాంత వ్యాసాలను ఇదివరకే రచించినారు. ఈ సిద్ధాంత వ్యాసాలలో పైన పేర్కొన్న కవుల నాటక సాహిత్య విశేషాలను గూర్చి అనివార్యంగా పరిశీలించి యుంటారు పరిశోధకులు. ఆ వ్యాసాలన్నింటిని సందర్శించి సమీక్షించినప్పుడే రూపక ప్రక్రియను గూర్చి వ్రాసే ఈ పరిశోధన వ్యాసానికి సమగ్రత చేకూరుతుందనడంలో సందేహం లేదు. అన్ని విశ్వవిద్యాలయాలకు వెళ్ళి, విషయ సేకరణచేయడం బహుప్రయాసతో కూడుకున్న కార్యం. ప్రస్తుతం నా వంటివానికి అసాధ్యమైన అంశం కూడా. ఇప్పుడుకాకున్నా మరెప్పుడైనా ఆ సత్కార్యం నెరవేరుతుందని ఆశిస్తున్నాను.

తెలుగుభాషా సమితి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సంస్థలు అప్పుడప్పుడు అన్య సాహిత్య ప్రక్రియలతోపాటు నాటక కళా సమీక్షకు సంబంధిం

చిన గ్రంథాల పోటీలను నిర్వహించి ఉత్తమ గ్రంథాలకు బహుమతులను ప్రకటించినాయి. ఇలా బహుమతులను అందుకున్న నాటక సమీక్ష గ్రంథాలు కూడా పరిశోధనా దృక్పథంతో రచింపబడినవే కాబట్టి నాటక పరిశోధనగూర్చి వ్రాసే ఈ వ్యాస సమగ్రతకోసం వాటిలోని విశేషాలను ఇక్కడ పరిశీలిస్తున్నాను.

ఉత్తమనటులూ రచయితలూ అయిన శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి 'ఆంధ్రనాటకరంగ చరిత్ర' అనే వ్యాసం 1954-55 లో తెలుగు భాషా సమితివారి బహుమతిని అందుకున్నది. 1969లో ఈ వ్యాసం ముద్రణను పొందింది. ఇరవై ఆరు అధ్యాయాలున్నాయి ఈ గ్రంథంలో. తరతరాల ఆంధ్ర నాటక కళను ఈ గ్రంథం సరళంగా సుందరంగా పరిచయం చేస్తుంది. వివిధ జానపద కళారూపాలనూ వాని తీరుతెన్నులనూ సమీక్షించటంలో మిక్కిలినేనిగారు ప్రదర్శించిన పరిజ్ఞానం ప్రశంసాపాత్రం. జిల్లాలవారిగా ఆంధ్రప్రదేశ్ నాటకరంగ విశేషాలనూ కళావికాసంలో ప్రజానాట్యమండలి నిర్వహించిన సముజ్జ్వలపాత్రను ఆంధ్రదేశంలోని నాటక కళాపరిషత్తులు చేసిన కళాసేవనూ ప్రవాసాంధ్రనాటకరంగ విశేషాలనూ ఆంధ్రులు ప్రదర్శించిన హిందీ నాటక విశేషాలనూ పరిశీలించినారు శ్రీ రాధాకృష్ణమూర్తిగారు. ప్రసిద్ధ నాటక రచయితలనూ కళాకారుల జీవితాలనూ తెలుగు సినీమారంగ పరిణామాన్నీ పరిచయం చేసినారు. చతుర్విధాభినయ విశేషాలనూ నట దర్శకులకు ఉండవలసిన లక్షణాలనూ, నాటక సమాజాలూ నాటక మందిరాలూ నిర్వహించవలసిన విధులనూ వివరించినారు. అంతేకాదు, తెలుగు నాటకరంగంపై రష్యా నాటకాల ప్రభావాన్నీ వివిధ భారతీయ భాషలలో నాటక రంగ క్రమ పరిణామాన్నీ తెలిపినారు. ఈ గ్రంథంలోని శైలి పాఠకులను తన వైపు ఆకర్షిస్తుంది. ఉత్తమ నటులైన మిక్కిలినేనివారిని ఈ గ్రంథం ఉత్తమ పరిశోధకులని నిరూపిస్తున్నది. "ఆంధ్ర నాటకరంగం క్రమపరిణామ పరిమళాలను ఆఘ్రాణించే జిజ్ఞాసువులకు అమ్లానసుమకదంబం ఈ గ్రంథం" అని ఈ గ్రంథాన్ని గూర్చి పలికిన డా॥ సి. నారాయణరెడ్డిగారి మాటలు అక్షరాలా నిజం.

1959-60లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 'ఆంధ్ర సారస్వతమునందలి వీరరసము' అనే విషయం గూర్చ్ పోటీ వ్యాసాలను ఆహ్వానించినారు. డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు పరిశోధనా వ్యాసాన్ని రచించి బహుమతి నందుకున్నారు. ఆ వ్యాసమే 1961లో 'వీరరసము(ఆంధ్ర సారస్వతము)' అనే గ్రంథంగా రూపుదిద్దుకున్నది. ఆంధ్ర సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో వెలసిన గ్రంథాలలో చోటు చేసుకున్న వీరరసాన్ని సందర్శిస్తూ నాటక ప్రక్రియను కూడా పరామర్శించినారు శ్రీ సుబ్రహ్మణ్యంగారు. ఈ గ్రంథంలోని ఎనిమిదవ అధ్యాయం 'నవ్య సాహిత్యస్రవంతులు.' ఇందలి ఐదవ, ఆరవ భాగాలలో నాటకాలలోని, ఏకాంకికలలోని 'వీరరసోల్లాసము'ను సందర్శించి సహృదయులకు ఉల్లాసం కలిగించారు.

తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగము'లో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి 'బొబ్బిలి యుద్ధము'లో సంస్కృతానువాదమైన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'ప్రతిమానాటకము'లో వేదం వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయము'లో కాళ్లకూరి నారాయణరావుగారి 'వరవిక్రయము'లో ఆచార్య ఆత్రేయగారి "విశ్వశాంతి"లో వీరరసం ఎలా పోషింపబడిందో సోదాహరణంగా వివరించినారు. పై నాటకాలలో ఇతివృత్తాన్ని సూచిస్తూ, పంచసంధులను సమన్వయిస్తూ, పాత్రల మనస్తత్వాన్ని చిత్రిస్తూ నామౌచిత్యాన్ని పరిశీలిస్తూ తత్త్వాన్ని ప్రపంచిస్తూ అంగరసాలను వివరిస్తూ ఇవన్నీ వీరరసస్ఫూర్తికి దోహదం చేసిన తీరును సహృదయ రమ్యంగా వివేచించినారు డా॥ జి. సుబ్రహ్మణ్యంగారు.

తెలుగులోని ఏకాంకికల స్వరూప స్వభావాలను వివరిస్తూ ఈ ప్రక్రియారచనలో ప్రథముడైన భాసుని

ఏకాంకికలను తెలిపినారు. భాసుని సంస్కృతానికి అనువాదమైన వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'కర్ణభారము' ఏకాంకికలోని యుద్ధవీరాన్ని సోదాహరణంగా పరిశీలించినారు. ఆచార్య ఆత్రేయగారి 'ఎవరు దొంగ'లోని దయాధర్మవీరాలను పరామర్శిస్తూ అందుకు ఉదాహరణ నెత్తిచూపినారు. తాము స్వయంగా రచించిన 'మానవత్వం' అనే ఏకాంకికలోని ఇతివృత్తాన్నీ పాత్రల మనస్తత్వాలను పరిచయం చేసి అవి దయా ధర్మ వీరరసోన్ముఖంగా ప్రసరించిన వైఖరిని సోదాహరణంగా వివరించినారు శ్రీ సుబ్రహ్మణ్యంగారు. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు కావ్యకళామర్మజ్ఞులు. వారి పరిశోధనా ప్రతిభ బహుముఖమైనది. అందులోని ఒక అంశం నాటక ప్రకియపై ప్రసరించి సహృదయులకు సంతృప్తిని కలిగించింది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1972-73లో నిర్వహించిన పోటీలో బహుమతి నందుకున్న మరో పరిశోధనా వ్యాసం మంగళగిరి ప్రమీలాదేవిగారి 'తెలుగులో పద్యగేయ నాటికలు'. ఇది 1974 లో ముద్రితం. పద్యగేయనాటికాప్రక్రియా సమీక్షలో వెలువడిన ప్రథమగ్రంథం ఇదే. ఇరవై మూడు భాగాలుగా సాగిన ఈ గ్రంథంలో తెలుగులో వెలిసిన పద్యనాటికలను గేయనాటికలనూ వచనపద్య నాటికలనూ నేపథ్యగేయ నాటికలనూ దొరికినంత మేరకు సమీక్షించినారు. పద్యగేయనాటికా ప్రక్రియలో విశేషకృషి చేసిన శివశంకరస్వామి, నోరి నరసింహ శాస్త్రి, బాలాంత్రపు రజనీకాంతరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, వావిలాల సోమయాజులు, డా. సి. నారాయణరెడ్డి, డా. బోయి భీమన్న, డా. కె.వి.ఆర్. నరసింహం, డా. యస్వీ జోగారావు, జె. బాపురెడ్డి, డా. నండూరి రామ కృష్ణమాచార్య, సూరంపూడి భాస్కరరావు, వింజమూరి శివరామారావు, దర్భా భాస్కరమ్మ గారల పద్యగేయ నాటికలను సమీక్షించినారు. పద్యగేయ నాటికల సముజ్జ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తూ ఈ గ్రంథాన్ని ముగించినారు ప్రమీలాదేవిగారు. సంగీతంలో చక్కని పరిచయమున్నవారు ప్రమీలాదేవి గారు. వారి ఈ పరిచయం పద్యగేయనాటికా పరిశీలనలో ప్రస్ఫుటంగా భాసిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి బహుమతి పొందిన మరో పరిశోధనావ్యాసం (1977-78) 'సంస్కృతభాణసాహిత్యము'. రచయితలు డా. తిప్పాభట్ల రామకృష్ణమూర్తి, శ్రీ సూరం శ్రీనివాసులు గారలు. పదహారు భాగాలుగా విస్తరించిన ఈ గ్రంథంలో ముద్రితాముద్రితభాణాల తీరుతెన్నులను సమీక్షించినారు. నాటకోత్పత్తినీ భాణలక్షణాలను సమగ్రంగా పరిశీలించినారు. ప్రాచీనార్వాచీన - ఆంధ్రుల ఆంధ్రేతరుల భాణాలనూ వాటి రచనా కాలాలను గూర్చి వానిలోని వస్తు రసపాత్రపోషణాదులను గూర్చి వివరించినారు. భాణాలు మధ్యతరగతి ప్రజాజీవనాన్ని ఎలా ప్రతిఫలింపచేస్తున్నవో విశదీకరించినారు. పదిహేనవ ప్రకరణంలో తెలుగులో రచింపబడిన అనువాద-స్వతంత్ర భాణాలను సమీక్షించి పరిశోధనకు సమగ్రతను సమకూర్చినారు.

ఈ గ్రంథం రచయితల ఉభయ భాషా వైదుష్యాలనూ పరిశోధనాభినివేశాన్నీ చాటుతున్నది. "ఈ పరిశోధనాగ్రంథము భాణములకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వమువలె మన్నదనుటలో నతిశయోక్తి లేదు'' అన్న ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి మాటలు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని చాటుతున్నవి.

ఇలా నాటక కళారంగంలో ప్రక్రియాపరంగానూ నాటకకర్తృ సమష్టి సృష్టిపరంగానూ వ్యక్తి పరంగానూ ప్రత్యేక నాటకపరంగానూ వివిధ విశ్వవిద్యాలయాలలో రచింపబడిన పరిశోధనా వ్యాసాలనూ సాహిత్య సంస్థల బహూకృతులందుకున్న పరిశోధనా గ్రంథాలనూ ఇంతవరకు, నాకు దొరికినంతమేరకు, సమీక్షించినాను. ఈ వ్యాసం సమగ్రం కాదు. ఒక ప్రయత్నం మాత్రమే. నిజానికి నాటక పరిశోధనా గ్రంథాలను గూర్చి ఒక పరిశోధనాగ్రంథమే వ్రాయవచ్చునన్నా అతిశయోక్తి కాదు. అట్టి ప్రయత్నం జరుగుతుందని ఆశిస్తున్నాను.



# తెలుగులో అలంకారశాస్త్ర పరిశోధన

—పుల్లెల శ్రీరామచంద్రుడు

ప్రారంభం నుంచి మొన్న మొన్నటి వరకూ ఆంధ్ర సాహిత్యం సంస్కృత సాహిత్యం అడుగు జాడలలోనే నడుస్తూ వచ్చింది. ఈ నాడు కొన్ని విదేశీ భాషా సాహిత్యాల ప్రభావం ఆంధ్ర సాహిత్యం మీద కొంతవరకు కనిపించినా సంస్కృత ప్రభావం కూడా చాలా వరకు యథా పూర్వంగానే ఉన్నదని చెప్పాలి. అందుచేత సంస్కృత సాహిత్య శాస్త్రం (అలంకార శాస్త్రం) యొక్క ప్రభావం కూడా ఆంధ్ర సాహిత్య శాస్త్రం పైన పూర్తిగా ఉన్నదనడంలో సందేహం లేదు.

నిజానికి చాలా మంది అంటున్నట్లు అలంకార శాస్త్రాన్ని సంస్కృతాలంకార శాస్త్రం అనడం సముచితం కాదు. అది భారతీయాలంకార శాస్త్రం. మన ఆలంకారికు లెవ్వరూ తమ సిద్ధాంతాలు సంస్కృత కావ్యాలకు మాత్రమే పరిమితమయినట్లుగా ఎక్కడా చెప్పలేదు. భారతీయ భాషా సాహిత్యాలన్నింటికీ ఆ నియమాలు వర్తిస్తాయనే వారి అభిప్రాయం. అందుచేతనే దండి మొదలైన ప్రాచీనాలంకారికులు భారతీయ వాఙ్మయాన్ని స్థూలంగా వివిధ శాఖలలో విభజించే సందర్భంలో సంస్కృత-ప్రాకృత-అపభ్రంశాది రూపాలలో విభజించినారు.

"తదేతద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా
అపభ్రంశశ్చమిశ్రం చేత్యాహు రార్యా శ్చతుర్విధమ్."

(కావ్యాదర్శము. I. 32)

అంతకు చాలా కాలానికి పూర్వం భరతాదులు కూడా రూపకోపయుక్తాలైన అనేక ప్రాకృత భాషా భేదాలను గూర్చి నాట్య శాస్త్రాదులలో ముచ్చటించి ఉన్నారు. ఈ విధంగా ఆనాడు భారతదేశంలో సాహిత్య భాషలుగా ఉన్న భాషలన్నింటినీ గుర్తించి, ఆ భాషా సాహిత్యాలకి అన్నింటికీ అన్వయించే సాహిత్య శాస్త్రీయ నియమాలను రూపొందించినారు. అందుచేతనే, సంస్కృత కావ్యాలలోనుంచి మాత్రమే కాకుండా ఆనాటి ప్రాంతీయ భాషలైన వివిధ ప్రాకృతాలలో ఉన్న కావ్యాల నుంచి కూడా ఎన్నో పద్యాదులను గ్రహించి ధ్వన్యలంకార భేదాదులకు ఉదాహరణంగా చూపించి ఉన్నారు. ప్రసిద్ధాలంకారికులైన ఆనందవర్ధన.అభినవగుప్త, మమ్మటాదుల వరకు ఈ సంప్రదాయం అవిచ్ఛిన్నంగా నడచినది. తరువాత వచ్చిన ఆలంకారికులకు ఆ ప్రాకృత కావ్యాలతో అంతగా పరిచయం లేకపోవడం చేత కాబోలు వారిలో చాలా మంది అప్రసిద్ధ ప్రాకృత కావ్యాలనుంచి గాని, సమసామయిక వాఙ్మయాల నుంచి కాని కాకుండా ప్రాచీనాలంకారికులు చూపిన ఉదాహరణలనే పునఃపునః చూపడం ప్రారంభించినారు. ఏమైనా - వివిధ భారతీయ భాషలకు చెందిన వాఙ్మయాలలోని సాహిత్య స్వరూపం ఒక్కటే అన్న విషయంలో వీరెవరికీ విప్రతిపత్తి లేదని స్పష్టమవుతుంది. అందుచేత సంస్కృతంలోని అలంకార శాస్త్రం అనేది కేవలం సంస్కృతాలంకార శాస్త్రం కాదు, భారతీయాలంకార శాస్త్రము. ఈ దృష్టితో చూచినట్లైతే ఆంధ్ర భాషకు మాత్రమే సంబంధించిన అలంకార శాస్త్రం అనేది

ఒకటి లేకపోవడం సహజమే. ఆంధ్ర భాషలో అలంకార శాస్త్ర గ్రంథాలు వ్రాసిన ఆలంకారికులు పూర్వ శతాబ్దులకు చెందిన వారైనా, ఈ శతాబ్దికి చెందిన వారైనా, సంస్కృత భాషలో ఉన్న అలంకార శాస్త్ర గ్రంథాలను అనుసరించి మాత్రమే స్వతంత్ర గ్రంథాలుగానో, అనువాద-వ్యాఖ్యాది రూపాలలోనో కొన్ని గ్రంథాలు రచించి ఉన్నారు. ప్రాచీన సిద్ధాంతాలుకావని క్రొత్త సిద్ధాంతాలు ఏవీ, ఎవరూ స్థాపించలేదు. అందు చేత పరిశోధన అనేది ఏమైనా జరిగితే అది ప్రాచీన సిద్ధాంతాలను విమర్శ విషయాలను విమర్శ విషయాలైన ఆంధ్రభాషాకావ్యాదులకు సమన్వయించడంవరకే సీమితమై ఉన్నది. తిక్కన శ్రీనాథాది మహాకవుల కావ్యాలను పరిశీలిస్తూ పరిశోధన గ్రంథాలు వ్రాసిన ఆధునిక విద్వద్వరేణ్యులంచరూ అలంకార శాస్త్రీయ విషయాలనూ, —ప్రధానంగా, రసాలంకార రీతి వస్త్వాదులను గూర్చి చర్చించేటప్పుడు అలంకార శాస్త్ర పరిధిలోనే నడిచి ప్రామాణికములైన పరిశోధన గ్రంథాలను వెలయించకలిగినారు.

ఇక కొందరు పండితులు వ్యాసాలరూపంలో వ్రాసిన గ్రంథాలు ఉన్నవి. వీటిలో చాలావరకు రసాన్ని గూర్చి వ్రాసిన వ్యాసాలే. రసం అంటే ఏమిటి? రసాలు ఎన్ని? ఏవి ప్రధాన రసాలు? -ఇలాంటి చర్చలే ఈ వ్యాసాలలో కనబడతాయి. ఈ చర్చలు దాదాపు భరతుడి కాలంనుంచీ జరుగుతూనే వస్తున్నాయి. ఒక కాలంలో బయలుదేరిన సిద్ధాంతం కొంతకాలంపాటు మరుగుపడినా కాలాంతరంలో దానిని పునశ్చర్వణ చేయడం జరుగుతూనే ఉంటుంది.

అందరూ అనుకుంటున్నట్లుగా భరతుడు చెప్పినవి ఎనిమిది రసాలు మాత్రమే కాదు; శాంత రసం కూడా ఆయనకు అంగీకార్యమే; అందుచేత శృంగార - హాస్య - కరుణ - రౌద్ర-వీర-భయానక-బీభత్స - అద్భుత - శాంతా లనే తొమ్మిది రసాలు ఉన్నాయి. అంతకంటె ఎక్కువ లేవు, తక్కువ లేవు అని అభినవగుప్తుడు ప్రతిపాదించగా, ఆతని కంటె ప్రాచీనులైన లోల్లటరుద్రటులూ, తరువాతి వాడైన భోజుడూ ప్రతి భావమూ రసం కావచ్చునన్నట్లుగా నిరూపించి ఉన్నారు. చాలామంది ఆలంకారికులు ఈ మతాన్ని అంగీకరించకపోయినా రసాల నవసంఖ్యతో మాత్రం తృప్తి చెందలేదు. ప్రేయోరసము (స్థాయిభావము స్నేహము), వత్సలరసము (స్థా. భా. వత్సలత లేదా కరుణ లేదా మమకారము), భక్తి (స్థా. భా. ప్రేమ), శ్రద్ధారసము, స్నేహరసము (స్థా. భా. ఆర్ద్రిత), లౌల్యరసము (స్థా. భా. గర్ధ), మృగయారసము, అక్షరసము (దీనిని అనుసరించి 'క్రికెట్టు రసము' మొదలైనవాటిని ఎవరైనా క్రొత్తగా ప్రతిపాదించినా ప్రతిపాదించవచ్చును. బహుశా ''క్రీడారసం నిర్విశతీవ బాల్యే'' అనే కుమారసంభవ శ్లోకం కూడా ప్రమాణంగా చూపవచ్చును); ఉదాత్తరసము, ఉద్ధతరసము, మాయారసము, కార్పణ్యరసము, వ్రీడనకరసము — ఈ విధంగా అనేక రసాలు అంగీకరించి ఉన్నారు. దీనికంతకీ కారణం భట్టలోల్లటాదులు చూపిన మార్గమే అని చెప్పవచ్చును.

రస్యమానము లవడం చేతనే కదా శృంగారాదులు రసాలని చెప్పబడుచున్నవి? నిర్వేదాది భావాలుకూడా రస్యమానాలవడంలో ఏమి అభ్యంతరం ఉన్నది? అందుచేత అవి కూడా — అన్ని భావాలూ కూడా - రస్యమానావస్థ చేరినపుడు రసాలని చెప్పవచ్చును అని అంటాడు రుద్రటుడు :-

''రసనాద్రసత్వమేషాం మధురాదీనా
మివోక్తమాచార్యైః
నిర్వేదాదిష్వపి తన్నికామమస్తీతి తేఽపి
రసాః''

దీనిపై వ్యాఖ్య వ్రాస్తూ ప్రతీహారేందు రాజు-

''అయమాశయో గ్రంథకారస్య యదుత నాస్తి సాకాపి చిత్తవృత్తిః యా పరిపోషంగతా న రసీ భవతి. భరతేన సహృదయావర్జకత్వ ప్రాచుర్యాత్... ...అష్టౌ వా నవ వా రసా ఉక్తా ఇతి'' అని వ్రాసినాడు.

భోజుడు కూడా రుద్రటుని పై వాక్యాన్నే ఉదాహరిస్తూ- రత్యాదిభావాలు ఎనిమిది మాత్రమే రసాలని ఎందుకు చెప్పాలి? హర్షాదులు మాత్రం రసం ఎందుకు కాకూడదు? రత్యాదులు మాత్రమే స్థాయి భావాలు హర్షాదులు స్థాయి భావాలు కావు అని చెప్పడానికి ఆధారం ఏమిటి? ఈ రత్యాదులలో కూడా భయహాసశోకాలు స్థాయి భావాలని చెప్పడానికి ఆధారం ఏమిటి? నిజానికి స్థాయిత్వాస్థాయిత్వాలు భావాల స్వభావం మీద ఆధారపడి ఉండవు. బాగుగా పోషించిన పక్షాన అన్ని భావాలూ కూడా స్థాయి భావాలు కావచ్చును; రసత్వ సిద్ధిని పొందవచ్చును. ప్రతి భావానికీ విభావానుభావ వ్యభిచారి భావాలు ఉండవచ్చును అని అంటూ ఉదాత్తరసము, ఉద్ధత రసము, స్వాతంత్ర్యరసము, పారవశ్యరసము, ఆనందరసము, ప్రశమరసము, సాధ్వసరసము, విలాసరసము, అనురాగరసము, సంగమరసము మొదలైనవి కూడా రసాలే అని ప్రతిపాదించినాడు.

ఇది ఇలా ఉండగా- రసం అనేది వాస్తవంలో ఒక్కటే అని, ఇతర రసాలన్నీ ఆ ప్రకృతి రసానికే వికృతులనీ కొందరు ప్రతిపాదించి ఉన్నారు. ఆత్మాభిన్నమైన శాంతం ఒక్కటే ప్రధానమైనది, అదే ప్రకృతిరసం అని అభినవగుప్తుని మతం. అహంకారాభిమానాద్యపర పర్యాయమైన శృంగారమే(ఇది ప్రసిద్ధ శృంగార భిన్నము) ప్రకృతి రసమనీ భోజుడు ప్రతిపాదించి, అన్ని రస భావాదులకీ కూడా ప్రేమయే మూల కారణం అని అంటాడు. విశ్వనాథుని పూర్వ పురుషుడైన నారాయణ పండితుడు అన్ని రసాలకీ ఆనుప్రాణకమైనది చమత్కారం అవడంచేత అద్భుత రసమే సర్వ రస మూలమని అంటాడు. నిజంగా రసం అంటే భక్తిరసం ఒక్కటే అని మధుసూదన సరస్వతి ప్రతిపాదించినాడు. రూపగోస్వామి ప్రభృతులు కూడా భక్తిరసమే ప్రధానమైనదని ప్రతిపాదిస్తూ దీనిలో మధుర (దీనికే శృంగారమనీ ఉజ్జ్వలమనీ నామాంతరాలు)- సఖ్య-వాత్సల్య-దాస్యాలనే నాలుగు భేదాలు అంగీకరించినారు. మరి కొందరు వైష్ణవాలంకారికులు ఈ నాల్గు విధాల భక్తితో పాటు శాంత భక్తిని కూడా అంగీకరించి ఈ ఐదూ ముఖ్య భక్తి రసాలనీ హాస్య-అద్భుత-వీర-కరుణ-బీభత్స-భయానక - రౌద్ర రసాలు గౌణ రసాలనీ, వీటికి కూడా రసత్వం కృష్ణ రతి సంబంధం ఉన్నప్పుడే సంభవిస్తుందనీ ప్రతిపాదించి ఉన్నారు. ఈ విధంగా ఏదో ఒక రసం ప్రకృతి రసమనీ, దాని వికృతులే ఇతర రసాలనీ వాదాలు అభినవగుప్తుని కాలం నుంచీ వస్తూనే ఉన్నాయి.

వీరందరి కంటే పూర్వమే భవభూతి -''ఏకో రసః కరుణ ఏవ-'' అనే శ్లోకంలో కరుణ మొక్కటే ప్రకృతి రసమనీ, ఇతర రసాలన్నీ దాని వికృతులే అనీ ప్రతిపాదించినట్లుగా చాలా మంది (రాఘవభట్టాది వ్యాఖ్యాతలతో సహా) అభిప్రాయము. కరుణ రసం చిత్తద్రుతి హేతువు; ఆ చిత్త ద్రుతి రసాస్వాదానికి సర్వథా అనుగుణమైనది; అందుచేతనే ఈయన కరుణ రసం ప్రకృతి రసమని అన్నాడు-అని దీని సమర్థన. ఇది అంత యుక్తియుక్తంగా లేదని నా అభిప్రాయం. కరుణ - విప్రలంభాదులలో చిత్తద్రుతి ఉన్నా చిత్త వికాసం విస్తార హేతువులుగా అంగీకరింపబడిన వీర రౌద్రాదుల మాట ఏమిటి ? చైతన్య రూపమైన శాంతమూ, అహంకారాపరపర్యాయమైన (ఆసగా పరోక్షంగా చైతన్య రూపమే అని చెప్పదగిన) శృంగారమూ ప్రకృతి రసాలన్న వాదాన్ని ఏదో విధంగా సమర్థించవచ్చునేమో కాని శోకస్థాయి భావకమైన కరుణరసం సర్వరస ప్రకృతి అనడంలో ఔచిత్యం లేదు. ''సర్వం దుఃఖమ్'' అనే బౌద్ధాదులు కూడా

ప్రకృతి రసచింత వచ్చినప్పుడు శాంతం ప్రకృతి రసం అన్నారు కాని ఏ బీభత్సమో ప్రకృతిరసం అన లేదు. భవభూతి నిజంగా ఇది ప్రకృతి రసం అని అభిప్రాయపడినా మనం దానిని అంగీకరించవలసిన పనిలేదు. కావ్య రచనాదులచే ప్రసిద్ధి లభించి, పలుకు బడి సంపాదించుకున్న కొందరు కవులు ఈ మధ్య కూడా ఇలాంటి వాదాలు చేయడం చూస్తూ ఉంటాము. వారి రచనలు చదివి ఆనందించవచ్చునేమో కాని శాస్త్ర అనుభవాలకి సంబంధించిన విషయాలలో వారేదో సిద్ధాంత సూత్రం అన్నట్లు చెప్పేవి అన్నీ మనం పరి శీలించకుండా అంగీకరించజాలము.

భవభూతి విషయంలో మనం ఒక అంశం గుర్తుంచుకోవాలి. రసం సామాజిక నిష్ఠం అనే సిద్ధాం తాన్ని స్థాపించిన భట్టనాయక, అభినవ గుప్తాదులకంటె ఆయన చాలా ప్రాచీనుడు. బహుశా రసం నాయకా శ్రయం అనే సిద్ధాంతాన్ని అంగీకరించిన భట్టలోల్ల టాదులకి సమకాలికుడై ఉండాలి. ఈ దృష్టితో చూచి నప్పుడే—

''అనిర్భిన్నో గంభీరత్వా దన్తర్గూఢ ఘనవ్యథః
పుటపాక ప్రతీకాశో రామస్య కరుణో రసః.''

(రామునిలో ఉన్న కరుణరసం పుటపాకం వలె ఉన్న దట. ఒకమూల రసం అంటూ 'అంతర్గూఢ ఘన వ్యథః' అనడం గమనార్హం. అంతే అన్ని రసాలూ ఆనందమయాలే అన్న వాదంతో ఆయన అపరిచితు డన్న మాట) ఇత్యాది వాక్యాలు సంగతములౌతాయి. రసం సామాజిక నిష్ఠం అనే తరువాత వచ్చిన అభి నవగుప్తాదుల వాదాన్ని మనస్సులో ఉంచుకొని ఈ వాక్యాలు చదివితే అసంగతంగా ఉండడంతో ''కరుణో రసః'' అనే దానికి దుఃఖమనో శోకమనో లాక్షణి కార్థం చెప్పుకొని శ్రమపడవలసిన పనిలేదు.'' ''ఏకో రసః కరుణ ఏవ'' ఇత్యాది శ్లోకంలో కూడా ఒకే కరుణరసం రామ-సీతా-సఖీ-జనక-కౌసల్యా-అరుంధ త్యాదులలో వివిధ రూపాలతో కనబడుతున్నది అని అర్థం చెప్పుకోవాలి. ఇలా అర్థం చెప్పడానికి ఈ శ్లోకానికి ముందు ఉన్న ''అహో సంవిధానకమ్ !'' (ఎంత ఆశ్చర్యకరమైన రచనా విధానము!) అన్న వాక్యం ఉపోద్బలకం. ఇంత మందిని కరుణ రసా శ్రయులుగా చేసిన తన రచననే కవి తమసమాట లలో మెచ్చుకుంటున్నాడు. కరుణం ప్రకృతిరసం అని చెప్పడమే ఉద్దేశ్యమైతే సంవిధానకాన్ని మెచ్చుకోవల సిన పని ఏమి వచ్చినది ?

భవభూతి వ్రాసిన మరొక నాటకం ''మహా వీర చరితమ్''. అది వీరరస ప్రధానమైనది. ఆ వీరరసం అనేకులు ఉత్తమపాత్రలలో ఉన్నదని అంటాడు భవభూతి :-

''అప్రాకృతేషు యత్రవీరః స్థితో రసః
భేదైః సూక్ష్మై రభివక్తైః ప్రత్యాధారం విభజ్యతే.''

ఈ శ్లోకానికి ఏమి భావమో ''ఏకోరసః'' ఇత్యాది శ్లోకానికి కూడా అదే భావం. అందుచేత ఈ శ్లోకంలో కరుణరస ప్రకృతిత్వ వాదాన్ని అన్వేషించవలసిన పని లేదు.

కామాది అరిషడ్వర్గం ఉన్నది. క్రోధాదులన్నిం టికీ మూలకారణం కామం అని భగవద్గీతాదులలో చెప్పినా, వెనుకకు వెనుకకు వెళ్లి పరిశీలన చేయగా అది సత్యమే అని తేలినా, క్రోధాదులలో వాటి వాటి నిశ్చిత స్వరూపాలు ( Positive aspects ) స్పష్టంగా గోచరిస్తున్నంతవరకూ క్రోధాదులనేవి లేవు. అంతా కామమే అని చెప్పడానికి ఏవిధంగా వీలు లేదో రసాల విషయంలోకూడా అంతే. అంతా శాంతమే అని కాని, అహంకారమే అని కాని, అద్భుతమే కానిచెప్పడం అనుభవ సంవాది కాదు. ప్రతి రసానికీ దాని వైయక్తిక విశేషం ఉండనే ఉన్నది కదా? కేవలం వాద దృష్టితో మాత్రమే చెప్పడం మొదలిడితే ఒక రసాన్ని మరొక రసంతో కలిపివేసి దానిని హుళక్కి చేసి వేయవచ్చును. విప్రలంభ శృంగారాన్ని కరుణ రసంలోనూ, సంయోగ శృంగారాన్ని వీర

రసంలోనూ కలిపి వేయవచ్చును. వీరానికి స్థాయి ఉత్సాహం కదా? అది లేని సంయోగ శృంగారం ఏమి ఉంటుంది? అందుచేత ఆలింగనవీరం, చుంబన వీరం ఇత్యాది భేదాలతో ఈ శృంగారాన్ని వీరం చేసి వేయవచ్చును. అందుచేతనే ఒక ఘట్టంలో నాగేశ భట్టు (ప్రదీపవ్యాఖ్యలో)- "అన్యథా పలాయన వీరాది భేదేన ఆనన్త్యం స్యాత్'' అని అంటాడు. శాంత రసాదులకు ప్రకృతి రసత్వం అంగీకరించిన అభినవ గుప్తాదులు కూడా ఇతర రసాలని నిరాకరించలేదు.

ఇదంతా రసభేద ప్రకృతి రసాలను గూర్చిన చింత, రస స్వరూపాన్ని గూర్చి భట్టలోల్లటుడు మొదలు పండిత రాయలవరకు జరిగిన చర్చ ఉండనే ఉన్నది. తెలుగులో వెలువడిన అలంకార గ్రంథ వ్యాఖ్యలలో కాని, స్వతంత్ర రచనలలో కాని, వ్యాసాలలో కాని, ఈ విషయాల పునరనుసంధానమో, అనుసరణమో, అనుకరణమో కనబడుతూ ఉన్నది అని చెప్పడానికే ఇంత వ్రాయవలసి వచ్చింది.

పరిశోధన అనగానే ఈనాడు మూలగ్రంథ పరామర్శం లేకుండా వాటినుండి విషయం వ్రాసిన గ్రంథాలే అన్నట్లు ఒక భావం ఉన్నది. ఇలాంటి కథాకథిత స్వతంత్ర పరిశోధన గ్రంథాలలో కూడా చర్విత చర్వణమేకాని ఒక్క క్రొత్త విషయం కూడా లేక పోవచ్చును. వ్యాఖ్యారూపానువాద గ్రంథాలలోకూడా కొన్ని క్రొత్త విషయాలు ఉండవచ్చును, అందుచేత అలంకార శాస్త్రానికి సంబంధించిన ఈ రెండు విధాల గ్రంథాలూ ఉపాదేయాలే. వాటిలో కొన్ని ప్రధాన్యమైన గ్రంథాల పరిచయం ఇచట ఉద్దిష్టమైనది. అప్పుడప్పుడు కొన్ని పత్రికాదులలో ప్రచరింపబడిన రసాదులకు సంబంధించిన వ్యాసాలను ఇక్కడ పేర్కొనకపోవడానికి కారణం ముందుగానే సూచింప బడింది. ముందుగా వ్యాఖ్యారూపాత్మైన అనువాదాల పరిచయం.—

**ఆంధ్ర సాహిత్య దర్పణము (1935) :-** ప్రసిద్ధ పండితులైన శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి గారు దీనిని అనువాదించి యున్నారు. "శ్రీ.శే. వేదము వెంకటరాయ శాస్త్రిగారి యాంధ్రసాహిత్య దర్పణము కన్న సంస్కృత సాహిత్య దర్పణమే విద్యార్థులకు సుబోధకమని నా తలంపు'' అని శ్రీ సన్నిధానం సూర్య నారాయణశాస్త్రిగారు ఈ గ్రంథానికి తమ అభిప్రాయం వెలిబుచ్చియున్నారు. (కా.అ.సం. మలిపలుకు పే.11) సంస్కృత శాస్త్రీయ గ్రంథాలను ఆంధ్ర భాషలోనికి అనువాదించే ప్రక్రియ ఇంకా ఆరంభదశలో ఉన్న ఆ రోజులలో ఈ గ్రంథాలలో కొంత దుర్బోధత్వం ఉండడం సహజమే. ఈనాటి అనువాదాలను గూర్చి నూరు సంవత్సరాల తరువాత వారు ఇలాంటి అభిప్రాయమే వెలిబుచ్చవచ్చును.

శ్రీ వెంకటరాయశాస్త్రిగారు భానుదత్తుని రసమంజరికి కూడ తెలుగులో వ్యాఖ్య వ్రాసినారు (1909).

**ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము :-** ఇది విద్యానాథుని సంస్కృత గ్రంథానికి శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారు రచించిన ఆంధ్రానువాద వ్యాఖ్య. రూపకభేదాలతో సహా అలంకార శాస్త్రానికి సంబంధించిన సకల విషయాలను ప్రతిపాదించిన గ్రంథంగా ప్రతాపరుద్రీయం దక్షిణ దేశాలలో - ప్రధానంగా ఆంధ్రదేశంలో ప్రచుర ప్రచారం పొందినది. మల్లినాథుని కుమారుడైన కుమారసోమ పీఠి వ్రాసిన వ్యాఖ్య దీనికి వన్నె తెచ్చినది. దీనిని శ్రీ ఆచార్యులవారు అనువదించి, అవసరాన్ని బట్టి మూలగ్రంథంలోది అనేక విషయాలను వివరణ రూపంలో చేర్చి ఉన్నారు. విద్యానాథుని సంస్కృత శ్లోకరచన ఎంత ప్రసాదగుణవిశిష్టమో వీరి ఆంధ్ర పద్యానువాదం కూడా అంత చక్కగా నడచినది. 1944 లో తొలిసారిగా ప్రచురితమైన ఈ గ్రంథము మూడు నాలుగు పునర్ముద్రణలను పొందడం దీని వైశిష్ట్యాన్ని స్పష్టీకరిస్తున్నది. అనేక పరీక్షలలో పాఠ్యగ్రంథంగా ఉండడం చేత దీనిద్వారా ఎందరో

తెలుగువారు అలంకారశాస్త్రంతో నిర్దుష్టమైన పరిచయం సంపాదించుకుంటున్నారు. శ్రీ ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు విస్తృత భూమిక దీనికి ''హేమ్నః పరమామోదః'' అన్నట్లు చేసినది.

శ్రీ రంగాచార్యులవారు ''అలంకారవసంతము'' (1944), ''ఔచిత్య విచారచర్చ'' (అముద్రితము)లను కూడా రచించినారట.

**కావ్యాలంకార సంగ్రహము :-** ఇది రామరాజభూషణుడు రచించిన నరసభూపాలీయాపరనామధేయమైన కావ్యాలంకార సంగ్రహానికి శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన విపుల వ్యాఖ్యానము. మూల వ్యాఖ్యానమాత్రముతో సంతృప్తి చెందక ఎన్నో అలంకార శాస్త్రీయ విషయాలను చేర్చి—''నిర్దుష్టములైన లక్ష్య లక్షణములతో సాహిత్యదర్పణముకన్నను విషయసమృద్ధితో, సర్వ సాహిత్య విషయములను క్రోడీకరించి యాంగ్ల సిద్ధాంతములను గూడ జతపరచి విద్యార్థులు స్వతంత్రముగా తెలిసికొనదగినంత సులభముగా నొక సంగ్రహగ్రంథమును వ్రాసినచో భాషకు చాల మేలబ్బును'' (కావ్యాలంకార సంగ్రహము-మలిపలుకు) అను అభిప్రాయముతో వ్రాసిన గ్రంథ మిది. 1945 లో తొలిసారి ప్రచురించబడిన ఈ గ్రంథము నాటినుండి నేటివరకు ఒక సమగ్రాలంకార శాస్త్ర గ్రంథముగా ఆంధ్ర విద్యార్థి-పండితలోకంలో బహుళప్రచారమును పొంది ఉన్నది. శ్రీ సూర్యనారాయణశాస్త్రి గారు ఈ గ్రంథాన్ని ఏ అభిప్రాయంతో వ్రాసినారో అది సర్వథా సఫలమైనదని చెప్పడంలో సందేహం లేదు. నేటి తెలుగు పండితులలో చాలామంది కావ్యలక్షణ స్వరూపాదులను గూర్చి పరిశీలించినా, రసం విషయంలో భట్టలోల్లటాదుల మతాదులను గూర్చి ముచ్చటించినా ఈ గ్రంథం వారి కెంతో సహకరిస్తూన్నది. విషయవైపుల్యంలోను, నిరూపణ వైశిష్ట్యంలోను ఇది ఉత్తమమైన గ్రంథము.

**ఆంధ్ర ధ్వన్యాలోకము :-** 1943 - 44 ప్రాంతాలలో శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ధ్వన్యాలోకం ఆంధ్రీకరించి ఉన్నారు. లోచనాన్ని కూడా ఆంధ్రీకరించి ఆయా స్థలాలలో 'ప్రభామతి' అనే స్వీయ వివరణం కూడా చేర్చినారు. సంస్కృతంలోని కారికోదాహరణ శ్లోకాలను తెలుగులో పద్యాలలోనికి అనువదించినారు. ఈ అనువాదం ముఖ్యంగా లోచనానువాదం, మూలాన్ని దగ్గర ఉంచుకున్ననే కాని అవగాహ్యం కాదు. సంస్కృత మూలగ్రంథాన్ని అర్థం చేసుకోవాలనే వారికి ఇది ఎక్కువగా సహకరిస్తుంది.

**ఆంధ్ర ధ్వన్యాలోకము :-** ఇది శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు రచించిన ధ్వన్యాలోకానువాదము. ప్రధానమైన ఘట్టాలలో విపులమైన వివరణం కూడా చేర్చబడింది. అభినవగుప్తుని లోచనం లేని ధ్వన్యాలోకం లోచనంలేని ఆలోకమే. అందుచేత శ్రీ ఆచార్యులుగారు—— ''అభినవగుప్తుడు చేసినట్టి లోచనంబున నా మదిలోన దోచినంత యవసరమైనంత యచటనచట'' అని చెప్పిన పద్ధతిలో విశేషార్థ వివరణ విషయంలో, లోచనసాహాయ్యం తీసుకున్నారు. ఉదాహరణ స్థలాలలో ఆనందవర్ధను డుదాహరించిన శ్లోకాలను అనువదించక ప్రసిద్ధాంధ్ర కావ్యాలనుండి తగిన పద్యాలు గ్రహించి వాటిని ఉదాహరణములుగా చూపడం ఈ గ్రంథంలో ఉన్న వైశిష్ట్యము. దీనివల్ల ధ్వనికారుని సిద్ధాంతాలను తెలుసుకోవడానికే కాకుండా వాటిని తెలుగు కావ్యాలకు సమన్వయించడానికి కూడా చక్కని దారి చూపబడినది. 1950 ప్రాంతంలో వెలికి వచ్చిన ఈ గ్రంథం నాటినుంచి నేటిదాకా పండిత విద్యార్థుల మన్ననలు చూరకొంటూన్నది. సన్నిధానం వారి కావ్యాలంకార సంగ్రహం మొదట చదివి తరువాత వేదాలవారి ధ్వన్యాలోకం చదివిన తెలుగు విద్యార్థికి అలంకార శాస్త్రస్వరూపం చక్కగా, సమగ్రంగా ధీగోచరం అవుతుందని చెప్పడంలో సందేహం లేదు.

ఇవి కాక, శ్రీ ఆచార్యులవారు వామనుని కావ్యాలంకార సూత్రాలను, పండితరాయల రసగంగాధరాన్నీ కూడా తెలుగులోనికి అనువదించి ఉన్నారు. మొదటి గ్రంథంలో శబ్దసాధుత్వ విచారపరమైన ఐదవ అధికరణాన్ని అనువదించలేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురించిన ఆంధ్రరస గంగాధరం శ్రీ ఆచార్యులవారు చాలా వయస్సు మళ్లిన తరువాత రచించిన గ్రంథం అవడంచేత అనేక స్థలాలలో విపుల వివరణాపేక్షమై ఉన్నది. ఆంధ్ర ధ్వన్యాలోకం రచించిన కాలంలోనే ఏతద్గ్రంథ రచనకు పూనుకున్నట్లైతే శ్రీ ఆచార్యులవారు ఆంధ్రులకొక అత్యుత్తమ ప్రామాణికాలంకారగ్రంథాన్ని అందించి ఉండేవారు.

అలంకారశాస్త్రం అనగానే అందరికీ వెంటనే గుర్తుకు వచ్చేది శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ గారి పేరు. అలంకారశాస్త్ర సాగరాన్నంతసీ ఆపోశన పట్టిన అగస్త్యుడు ఈయన. ఈ శాస్త్రంలోని ప్రధానమైన ఉద్గ్రంథాలన్నింటినీ (చాలా గ్రంథాలు సంపూర్ణంగాను, కొన్నింటిని కతిపయ ప్రకరణాలు మాత్రము) సవివరణంగా అనువదించి ఆంధ్రులకు ప్రామాణికాలైన అలంకారశాస్త్ర గ్రంథాలు అందించినారు. నవరస గంగాధరము, ఆంధ్రప్రతాపరుద్రీయము, ధ్వనిసారము, కావ్యప్రకాశము (1-3 ఉల్లాసాలు), రసగంగాధరమణి, అలంకారసూత్రము లేదా అలంకార సర్వస్వము, ఔచిత్యవిచారచర్చ, రసభారతి, నాటకమీమాంస, లక్షణాలంకారము, నాట్యవేదము, వామనాలంకారము, భావప్రకాశము, నృత్తరత్నావళి, శృంగారప్రకాశము (కొన్ని ప్రకరణాలు), వక్రోక్తి జీవితము, నటసూత్రమ్, సహృదయాలోకలోచనమ్, అభినవదర్శనము, భక్తిరసామృతసింధువు, ఏకావళి, మహిమ దర్పణము, సాహిత్యరత్నాకరము- ఈ విధంగా వీరు ఆంధ్రభాషలో వెలయించిన ఉద్గ్రంథాలను చూస్తే వీరి పాండిత్యానికీ, కార్యదీక్షకూ ఎవ్వరైనా ఆశ్చర్యచకితు లవక మానరు.

వీరి రచన క్లిష్టంగా ఉంటుందని కొందరు అంటూ ఉంటారు. శాస్త్ర గ్రంథాలు కూడా నవలవలె చదివేటట్లుగా ఉండాలి అని అనుకొనే శ్రమాసహిష్ణువులు చెప్పే మాట లివి. ప్రతి రచయితకీ ఒక ప్రత్యేకమైన శైలి ఉంటుంది. నిజమైన విషయ గ్రహణాసక్తితో ఏ గ్రంథాన్నైనా పఠించడానికి ఉపక్రమిస్తే రచయిత శైలిలోని క్లిష్టత అంతగా అడ్డురాదు. నాలుగైదు పుటలు చదివేటప్పటికి ఆ శైలి పఠితకు కూడా అలవాటైపోతుంది. విషయ గ్రహణాభిలాష లేనివారికి ఏ శైలి అయినా క్లిష్టంగానే కనబడుతుంది. ఏమైనా ఇన్ని ప్రామాణిక గ్రంథ రత్నాలలో ఆంధ్ర భాషా యోషను అలంకరింపగలిగిన ఏకైక వ్యక్తి మాధవ రామశర్మగారు అనడంలో ఎవ్వరికీ విప్రతిపత్తి ఉండడానికి అవకాశం లేదు.

**నాట్య శాస్త్రము** :- డా. పోణంగి శ్రీ రామ అప్పారావు గారు (పి.యస్.ఆర్. అప్పారావు) భరతుని నాట్యశాస్త్రాన్ని చాలా చక్కగా అనువదించినారు. ఇది పండితాదరాన్ని పొందిన గ్రంథం. అభినవగుప్తుని అభినవ భారతీవాఖ్య సాహాయ్యంతో నాట్యశాస్త్రీయ రహస్యాల నన్నింటినీ స్పష్టీకరించడమే కాకుండా, అధ్యాయాంతాదులలో పాశ్చాత్య రూపకాదిగత విశేషాలు చర్చించడం కూడా జరిగినది. ఇది అప్పారావు గారు ఐదారు సంవత్సరాలపాటు చేసిన నిర్విరామ కృషికి ఫలితం. మొట్టమొదట 1959 లో ప్రచురింపబడిన (2000 కాపీలు) ఈ గ్రంథం శాస్త్రగ్రంథమైనా మళ్ళీ 1982 లో పునర్ముద్రణం (1500 కాపీలు) పొందడాన్ని బట్టి మనం దీని లోకప్రియత్వాన్ని ఊహించుకొనవచ్చును. తాము అనుసరించిన అనువాద పద్ధతిని గ్రంథకర్తయే ఈ విధంగా వివరించి ఉన్నారు. "ఈ నా అనువాదమును 4 భాగములుగా విభజింపవచ్చును. (1) భరతముని ప్రణీతమగు నాట్యశాస్త్రమునకు యథాతథ గద్యానువాదము ... అభినవ భారతి ననుసరించి క్లిష్ట పదములకు కుండలీ

కరణములందు అర్థముల నొసంగి యున్నాను. (2) అధః సూచికలు — ఇవి మరల రెండు విధములు - మొదటి విధము అభినవ భారతిలోని అంశములను యథాతథముగా ఉద్ధరించుట, ...... ఇంక రెండవ విధము - సమన్వయపూర్వకమైన నా స్వీయ వివరణము. (3) 28 అధ్యాయములకు అంతమందు విశేషాంశములను వ్రాసియున్నాను. ఇందు ఆయా అధ్యాయము లందలి క్లిష్ట సమస్యల సమన్వయములు, ఇతరాలంకార గ్రంథములతోడి పోలికలు, గ్రీకు పాశ్చాత్య రూపకములకు సంబంధించిన వివరములు కలవు. (4) అచ్చటచ్చట ప్రధానములైన మూల శ్లోకములను ఉద్ధరించి ఉన్నాను."(నా.శా. ఉపోద్ఘాతము పేజీ-18)

డా॥ అప్పారావు గారు ఈ మధ్య రచించిన అభినయదర్పణానువాదము ముద్రణాపేక్షమై ఉన్నది.

**నృత్త రత్నావళి :-** కాకతీయ చక్రవర్తియైన గణపతిదేవుని గజసేనాధ్యక్షుడు జాయ సేనాపతి సంస్కృతంలో రచించిన నృత్తరత్నావళిని శ్రీ రాళ్ళపల్లి అనం కృష్ణశర్మగారి చేత అనువదింపచేసి ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారు 1969లో ప్రచురించినారు. అనువాదంతోపాటు మూలం కూడా ఇవ్వడం చాలా ఉపయోగకరంగా ఉన్నది. సంస్కృత గ్రంథానువాదాలన్నీ ఈ విధంగానే ఉంటే మూలాన్ని బట్టి అనువాదాన్ని అర్థం చేసుకోవలసి వచ్చే పరిస్థితులలో పఠితలకు అసౌకర్యం ఉండదు. అనువాదగ్రంథాలతో ఇలాంటిఅవసరంవస్తూ ఉండడం విషయజిజ్ఞాసువులైన పఠితలందరికీ అనుభవ సిద్ధమే. మూలం శ్లోకాలలో ఉన్నది కదా అని అనువాదం కూడా ఏ ఆటవెలదిలోనో తేటగీతంలోనో నడపకుండా చక్కని గద్యంలో నడిపించిన శ్రీ శర్మగారు పఠితలకు ఎంతో ఉపకారం చేసినారు. పూర్వం వచ్చిన అలంకార శాస్త్రీయ గ్రంథాలన్నీ చాలావరకు పద్యానువాద రూపంలో ఉండడంచేతనే అనువాదం కంటే మూలమే మేలు అనిపించి సాధించవలసిన జ్ఞాన విశ్రాణన రూప ఫలాన్ని సాధించలేకపోయినవి. దీనికి డా. పి.యస్.ఆర్. అప్పారావుగారు 68 పేజీల సువిస్తృత భూమిక వ్రాసి నాట్యశాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు, ''నృత్య శాస్త్రానికి ఆంధ్రులు చేసిన కృషి'' వంటి అంశాలు చర్చించి ఉన్నారు. శ్రీ శర్మగారు అన్నట్లు ఈ సువిస్తృత పీఠిక వ్రాసి అప్పారావుగారు ''ఈ గ్రంథమునకు నిండుదనము గలిగించినారు.''

భామహుని కావ్యాలంకారము (సురభారతీ సమితి ప్రచురణము) దండి కావ్యాదర్శము (ఆం.ప్ర. సా. అకాడమీ) కుంతకుని వక్రోక్తి జీవితము (కేంద్ర సాహిత్య అకాడమీ) వామనుని కావ్యాలంకార సూత్రములు, రాజశేఖరుని కావ్యమీమాంస, క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చా- కవికంఠాభరణ సువృత్తతిలకాలూ (సురభారతీ సమితి) - ఇవి డా. పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అనే ఆంధ్రభాషా వ్యాఖ్యతో ప్రకటింపబడినవి, వీటి అన్నింటిలోను (వక్రోక్తి జీవితం తప్ప) సంస్కృత మూలాలు కూడా ముద్రితములైనవి.

**సరస్వతీ కంఠాభరణము :-** ధారాధీశుడైన భోజుడు సంస్కృతములో రచించిన ఈ గ్రంథం అతి విస్తృతమైనది. నిజానికి భోజుడు విస్తృతి ప్రియుడు. ఇతరాలంకార గ్రంథాలలో లేని ఎన్నో విషయాలు ఈ గ్రంథంలో నిబద్ధములై ఉన్నాయి. దీనికి ఒక సువిస్తృతమైన ఆంధ్ర భాషావ్యాఖ్య సంతరించినారు "స్ఫూర్తిశ్రీ" అపర నామధేయులైన శ్రీ టి. భాస్కరరావుగారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురిస్తూన్న ఈ గ్రంథం మొదటి భాగం వెలువడింది.

ఇవి కాకుండా ఇంకా ఎన్నో ఆంధ్ర భాషానువాద గ్రంథాలు, చాలా ప్రాచీనమైనవి ఉన్నాయి. వీటిలో చాలావరకు అలభ్యములు, కొన్ని ప్రాచీన గ్రంథాలయాలలో లభించ వచ్చును. అవి ఈ దిగువ నామమాత్ర నిర్దేశంతో చూపబడుచున్నవి. ఐతే ఈ పట్టిక పరిపూర్ణమైనదని చెప్పడానికి వీలులేదు.

1. అలంకార మంజరి : (1944) శ్రీ శే. రాఘవ అయ్యంగారు.
2. ఔచిత్య విచారచర్చ : (అనుసరణము. 1912) వేంకట రామకృష్ణ కవులు.
3. కవికల్పలత : (1930) శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు.
4. కవి కంఠాభరణము : (1914 - అనుసరణము) వేంకట రామకృష్ణ కవులు.
5. కావ్య ప్రకాశము : (1934. 1-5 ఉల్లాసములు) శ్రీ కొండూరి నరసింహాచార్యులు.
6. కావ్యమీమాంస : (1930) శ్రీ పంచాగ్నుల ఆంజనేయశాస్త్రి.
7. కావ్యాత్మ : (1934) శ్రీ శే. రాఘవయ్యంగారు.
8. కావ్యాదర్శము : (1929) అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి.
9. (హేమచంద్రుని) కావ్యానుశాసనము (అముద్రితము) : శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి.
10. కువలయానంద ప్రకాశిక : శ్రీ కటికనేని రామకవి.
11. కువలయానంద సారము : (1934) శ్రీ బులుసు వేంకటరమణయ్య.
12. కువలయానందము : (1934) శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్య శాస్త్రి.
13. గంధవహము: (1912. భానుదత్తుని రసమంజరికి అనువాదము) శ్రీ మంచెళ్ళ వాసుదేవకవి.
14. చంద్రాలోకము : (1946) శ్రీ అమరవాది నీలకంఠయ్య.
15. చంద్రాలోకము: (1914. అలంకార ప్రకరణము) శ్రీ అడిదము సూరకవి
16. ,, : (1903. అలంకార ప్రకరణము) శ్రీ తాండూరి లక్ష్మీనరసింహారావు
17. ,, : (1924. అలంకార ప్రకరణము) శ్రీ ఉమాకాంతము
18. ,, : శ్రీ నేలనూతల శివరామకవి.
19. ,, : శ్రీ గని శేషయ్యశాస్త్రి.
20. ,, : (1919) శ్రీ రాజా భుజంగ రాయలు.
21. దశరూపకము : (1915) శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
22. దశరూపక సంగ్రహము : ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణము.
23. అభినవాంధ్ర ధ్వన్యాలోకము: (1944. ఒకటవ ఉద్ద్యోతము) శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి.
24. నాట్య శాస్త్రము : డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి (విజయవాడ 'నవ భారతి' పత్రికలో భాగ రూపంలో ముద్రితము).
25. రసమంజరి : శ్రీ గణపవరపు వేంకటకవి.
26. ,, : (1913) శ్రీ గుడిపాటి కోదండకవి.
27. ,, : శ్రీ తాండూరి లక్ష్మీనరసింహారావు.
28. ,, : శ్రీ అమరవాది నీలకంఠ యజ్వ.
29. ,, : శ్రీ తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి.
30. వ్యక్తి వివేకము : శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ద్వారా కొంతభాగము ప్రకటితము).
31. శృంగార మంజరి: బడేసాహెబ్ అక్బర్ అనే ముసల్మాన్ పండితుడు మొదట తెలుగులో వ్రాసి దానినే సంస్కృతీకరించినాడు ఆం. ప్ర. పురావస్తుశాఖ ప్రచురణము. 1951.

ఈ విధంగా ఆంధ్ర భాషలో అనేకమైన ప్రామాణికాలంకార గ్రంథాలు వెలసినవి. వీటిలో కొన్ని కేవలము అనువాద గ్రంథాలే అయినా విస్తృత వివరణాద్యులతో కూడినవి కూడా అధిక సంఖ్యలో ఉన్నాయి. ఈ వివరణలు పరిశోధనాఫలితాలన డంలో సందేహంలేదు. అందుచేత, వెనుకనే సూచించి

నట్లు, ఇవి పరిశోధనా గ్రంథ కోటిలో చేరుతాయా అని సందేహింప పని లేదు. ఈ కావ్యంలో నాయకు డెవడు ? రసం ఏది ?- ఇత్యాది చర్చలు తత్తద్గ్రంథ విషయ పరిశోధన కావచ్చును కాని అలంకార శాస్త్ర పరిశోధన కాజాలదు. ఆ దృష్టితో చూస్తే అలంకార శాస్త్రంలో పరిశోధనా గ్రంథమే లేదని చెప్పవలసి వస్తుంది. అందుచేత కొంత విశాల దృక్పథంతో పరిశీలించినట్లైతే పరిశోధనా గ్రంథత్వం ఉభయ విధ గ్రంథాలకి సమానమే.

మరొక విషయం ఏమనగా, ప్రాచీన గ్రంథ కర్తలు ఏదైనా ఒక గ్రంథంలో తమకు తోచిన క్రొత్త విషయాలు కొన్ని చెప్పదలచుకున్నప్పుడు ఆ గ్రంథానికి ఒక వ్యాఖ్యానమే వ్రాసేవారు. దానిలో శ్రద్ధగా వెదకితే కాని ఆ నూత్న విషయాలు కన బడవు. ఇప్పుడు అలాకాకుండా అటువంటి క్రొత్త విషయాలేమైనా చెప్పవలసి వస్తే ఒక ''పేపర్'' వ్రాస్తున్నాము. అంతే భేదము.

ఇక కొన్ని స్వతంత్ర గ్రంథాలు :-

**సాహిత్య సౌందర్య దర్శనము :-** (1972) ఇది అతి విస్తృతమైన స్వతంత్ర గ్రంథము. శ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు రచించినది. అలంకార శాస్త్రానికి సంబంధించిన అన్ని విషయాలూ ఇందులో చర్చించ బడి ఉన్నాయి. నాటక ప్రకరణం కూడా చేర్చ బడింది. అందుచే దీని కిచ్చిన ''సమగ్రాలంకార శాస్త్రము'' అనే నామాంతరము యుక్తముగా ఉన్నది. లక్షణాది శాస్త్రీయ విషయాలను ప్రతిపాదించేటప్పుడు చాలావరకు రస గంగాధరం అనుసరింపబడినది. ఉదాహరణాలన్నీ ఆంధ్ర కావ్యాలనుంచి సేకరించి ఈ గ్రంథం కావ్య-వృత్తి- ధ్వని - రస - నాయక - నాటక-ఔచిత్య- సంఘటనా- గుణ- సంస్కృతి-శబ్దా లంకార-అర్థాలంకార ప్రకరణాలనే 11 ప్రకరణాలలో రచింపబడింది. శ్రీ వేదాల తిరువెంగళాచార్యుల వారి ధ్వన్యాలోకం పరె ఈ గ్రంథం కూడా అలంకార శాస్త్రీయ విషయాలని ఆంధ్ర కావ్యాలతో సమన్వయించడానికి చక్కని మార్గం చూపే సద్గ్రంథం అవడం చేత అలంకార శాస్త్ర జిజ్ఞాసువు లందరూ తప్పక చదవవలసిన గ్రంథము.

**వీర రసము :-** డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు రచించిన గ్రంథము. 1959-60 సంవత్సరంలో ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారి పారితోషికమును అందుకొన్నది. ఈ గ్రంథ ప్రారంభంలోని 129 పేజీ లలో రసభావాదాలకు సంబంధించిన విషయాలు సప్రమాణంగా ప్రతిపాదింపబడినది. ఇది తెలుగు కావ్యాలలోని వీర రసాన్ని పర్యాలోచించే గ్రంథం అవడంచేత వీర రసాన్ని గూర్చి సువిస్తృతమైన సైద్ధాంతిక నిరూపణం చేయబడింది. సాహిత్యసారం ఆనే గ్రంథంలో అఖ్యాతరాయలు.

''ఉత్సాహస్థాయి భావః స్యా ద్వీరో ద్వాదశ ధాతుకః
యుద్ధ దానదయాధర్మ సత్యవిద్యా తపోబలైః
త్యాగయోగక్షమాజ్ఞానై స్తదుపాధేర్విభేదతః.''

అని మొదట 12 వీర రస భేదాలును చెప్పి వీటిని సోదాహరణంగా వివరించిన తరువాత-

''ఏవమన్యేఽపి తద్భేదా బుద్ధై రూహ్యాః సతాం మతాః
నచైవమస్యా సంఖ్యత్వం దోషస్తస్యేప్సి తత్వతః
సంపద్రూపకలాగానాహింసైశ్వర్య కవిత్వతః
శ్రద్ధాభక్త్యాదిభిశ్చాస్య తద్వైవానుభవో యతః''

అని వ్రాస్తూ సంపద్వీరము మొదలైన మరి తొమ్మిది భేదాలు కూడా అంగీకరించి, దానితో తృప్తిపడక 'భక్త్యాది' అని 'ఆది' శబ్దాన్ని ప్రయోగించి ఇంకా భేదాలు ఉండవచ్చు నన్నట్లుగా చెప్పినాడు. నామ గ్రాహంగా ఇతడు అంగీకరించినవి 21 భేదాలు. సుబ్ర హ్మణ్యంగారు ఈ 21 భేదాలకీ తెలుగు కావ్యాల నుంచి ఉదాహరణములుచూపి తాముకూడా స్వాతంత్ర్యవీరము

యశోవీరము మానవీరము, అని మరి మూడు భేదాలు కల్పించి చేర్చినారు. ఇంక మిగిలిన గ్రంథం అంతా తెలుగు కావ్యాలలో వీరరసగవేషణాత్మకంగా నడిచినది. ఈ విధంగా ఈ గ్రంథంలోని మొదటి భాగంలో రస వివేచన చక్కగా చేయబడింది. ఏ రసాన్నైనా బాగా వివేచించి దాని స్థితిని ఆయా కావ్యాలలో ప్రతిపాదించడానికి సుబ్రహ్మణ్యంగారు చక్కని మార్గం చూపించినారు.

**రసోల్లాసము** :- డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు 'వీరరసం'లోని రెండవ భాగానికి రసోల్లాసము అనే పేరుపెట్టి ఆయా కావ్యాలలోని వీరరసాన్నిగూర్చి ప్రతిపాదించినారు. ఈ నామధేయం వీరికి అతిప్రియం కాబోలు- ''రసోల్లాసము'' అనే పేరుతోటే ఈ మధ్య మరొక గ్రంథం వెలయించిచారు. ఇది అక్కడక్కడ ప్రచురించిన 12 వ్యాసాల సంకలనము- ''వ్యాసోల్లాసము''. వీటిలోని నాలుగింటిలో రసానికి, తత్తత్కావ్యగత రస నిర్ణయానికి సంబంధించిన చర్చ ఉన్నది.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు మంచి ఉత్సాహవంతులు, నిరంతర కార్యాచరణ వ్యాపృతులు. నవయౌవనంలో ఉన్నప్పుడే మంచి నాటకాలు వ్రాసి, ఆయా స్పర్ధాస్థానాలలో ప్రయోగింపచేసి కళాశాలలకు బహూకృతులను సంపాదించిపెట్టినవారు. 'వీరరసము' అనే విషయంమీద ప్రామాణికమైన గ్రంథం వ్రాసి సాహిత్య అకాడమీ పారితోషికాన్ని గ్రహించినవారు. అందుచేత ఈ ఉత్సాహశీలికి వీరరసం విషయంలో ఎక్కువ మక్కువ ఏర్పడింది.

రామాయణంలో కరుణ రసం అంగిరస మని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో సోపపత్తికంగా ప్రతిపాదించి ఉన్నాడు. కాని సుబ్రహ్మణ్యంగారు ''రామాయణంలో అంగి రసము'' అనే వ్యాసంలో ధర్మవీరం అంగిరసమని ప్రతిపాదించినారు.

మహాభారతంలో అంగిరసం శాంతరస మని ఆనందవర్ధనుడు స్థాపించి ఉన్నాడు. అయితే ఇది తృష్ణాక్షయ స్థాయి భావకమూ, నవరసాన్యతమమూ అయిన శాంతరసం కాదనీ, అభినవగుప్తుడు చెప్పిన తత్త్వజ్ఞాన స్థాయికమూ ప్రకృతి రసమూ అయిన శాంతరసము కావచ్చుననీ, అదైనా సంస్కృత భారతంలోననీ ''భారతంలోని శాంతరస సాధన పరిశీలనలో మరొక వివేచన'' అనే వ్యాసంలో ప్రతిపాదిస్తూ శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఆంధ్ర మహాభారతంలో మాత్రం ధర్మవీరాన్నే అంగిరసంగా అంగీకరించాలని నిరూపించి ఉన్నారు.

''రస సమీకరణ వాదములు-విమర్శలో వినియోగము'' అనే వ్యాసంలో శాంతరస-శృంగారరస-కరుణరస-అద్భుతరసాల ప్రకృతిరసత్వాన్ని గూర్చిన వాదాలు సమీక్షింపబడినవి.

''రసానాంరసః'' అనే వ్యాసంలో శ్రీ సుబ్రహ్మణ్యంగారు వీరరసమే రసశ్రేష్ఠమనీ, అది రసాలకు మూలమైనదనీ, అది రసాలలో వ్యాప్తమైనదనీ, అది రససారమనీ నిరూపిస్తూ, ''ధర్మవీర ఏవ రసానాంరసః'' అని ముగించినారు.

ఈ నాలుగు వ్యాసాలూ ఆలోచనోత్తేజకాలుగానూ, పునఃపరిశీలన యోగ్యాలుగానూ, అనితర ప్రహతములైన నూతన మార్గాలలో ఆలోచించగల శ్రీ సుబ్రహ్మణ్యంగారి ప్రతిభకు సంసూచకాలుగానూ ఉన్నాయి.

**సాహిత్యమీమాంస** :- 1 వ భాగము కావ్యానందము (1972). ఈ గ్రంథంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కావ్యానందాన్ని గూర్చి చర్చించినారు. రససిద్ధాంతము భారతీయోపజ్ఞమైన సిద్ధాంతమనీ, ఇతర దేశీయులెవరూ ఈ స్థాయిపరకూ వెళ్ళలేకపోయినారనీ నిరూపించినారు. ఇందులో వీరు రసాన్ని గూర్చిన శాస్త్రీయ వివేచనానికి పూనుకోకుండా, రససిద్ధాంతాన్ని సిద్ధవత్కృత్యా గ్రహించి దాని వైశిష్ట్యాన్ని ఉపన్యాస శైలిలో, లౌకికోదాహరణములతో విశదీకరించినారు. అనుభూతి రహస్యము,

ఆనందచర్చ, రసస్పర్శ, భావస్పర్శ, ఆనంద స్వరూపము, బ్రహ్మానందము, రసానందము, భావ స్వరూపము, రససిద్ధి, రసములు-హృదయములు, రసోవైసః, హాస్యము, శాంతము, రసములెన్ని, కవి-రసదృష్టి ఆనే శీర్షికల క్రింద చెప్పిన విషయాలు రససిద్ధాంతంతో ప్రత్యక్షంగా సంబంధించినవి.

**రస సిద్ధాంతము - ఆంధ్రుల వరివస్య :-** (1981) ఇది డా. తిప్పాభట్ల రామకృష్ణమూర్తిగారు పిహెచ్.డి. కొరకై వ్రాసిన పరిశోధన నిబంధము. మొదటి ఎనిమిది ప్రకరణాలలో (280 పేజీలు) రస స్వరూప-రస సంఖ్యా-రసభేదాదులకు సంబంధించిన విషయాలన్నీ శాస్త్రానుసారంగా, చక్కగా ప్రతిపాదించ బడినవి. తొమ్మిదవ ప్రకరణంలో (77 పేజీలు) విద్యానాథ - విశ్వేశ్వర - సింగభూపాల-పెదకోమటి వేమభూపాల-జగన్నాథాదులైన ఆంధ్రులు సంస్కృత గ్రంథాలద్వారా రస సిద్ధాంతానికి చేసిన వరివస్య, పదవ ప్రకరణంలో (43 పేజీలు) విన్నకోట పెద్దన మొదలైన తెలుగువారు తెలుగు గ్రంథాల ద్వారా చేసిన వరివస్య విశదీకరింపబడినవి. ''తెలుగు కవుల రసదృష్టి'' అనే చివరి ప్రకరణంలో (34 పేజీలు) తెలుగు కవులు ఆయా రసాలను తమ కావ్యాలలో నిర్వహించిన పద్ధతి సోదాహరణంగా నిరూపించ బడినది. రస సిద్ధాంతానికి సంబంధించిన అన్ని విషయాలనీ సమగ్రంగానూ, సప్రమాణంగానూ ప్రతిపాదించిన ఆధునికోపాదేయ గ్రంథాలలో ఇది ఒకటి.

**భారత ధ్వని దర్శనము :-** పిహెచ్.డి. కొరకై ఉద్దిష్టమైన ఈ పరిశోధన నిబంధంలో డా. శలాక రఘునాథశర్మగారు, ప్రారంభంలోని దాదాపు 240 పేజీలలో ధ్వని సిద్ధాంతాన్ని విస్తృతంగా ప్రతిపాదించి ఉన్నారు. ఈ సందర్భంలో ఉదాహరణలన్నీ ఆంధ్రమహాభారతాదుల నుండి గ్రహింపబడినవి. ఇది ధ్వని సిద్ధాంతాన్ని తెలుగు కావ్యాలకి ఎలా సమన్వ యించాలో తెలుసుకోవడానికి బాగా ఉపకరించే భాగము. ఆంధ్రభారతంలోని ధ్వనిని గూర్చిన గ్రంథం అవడంచేత పూర్వభాగంలో కూడా తెలుగు కావ్యాలనుంచి ఉదాహరణ లివ్వడం సముచితంకూడా. ఇది సరియైన విషయపరిజ్ఞానం కల ఉత్తమ పండితుడు రచించిన ప్రామాణిక గ్రంథం.

**కవి సమయములు :-** ఇది డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు పిహెచ్.డి. కొరకై వ్రాసిన పరి శోధన నిబంధము. రాజశేఖరుని కావ్య మీమాంస మొదలైన గ్రంథాలలో కవిసమయాలను గూర్చిన విస్తృత విమర్శ ఉన్నది. శ్రీ కృష్ణమూర్తిగారు తమ గ్రంథంలో ఈ కవిసమయాల లక్షణ స్వరూపాదులను గూర్చి విపులంగా చర్చించి ఉన్నారు. అలంకార శేఖరాదులలో ప్రతిపాదించిన కవిసమయాలను గూర్చి పర్యాలోచించి, వాటిలో కొన్నింటినే కవిసమయాలుగా అంగీకరింపవచ్చునని, మిగిలినవి తల్లక్షణ బాహ్యము లనీ సోపపత్తికంగా నిరూపించినారు. అలంకారశాస్త్ర గ్రంథాలలో అక్కడక్కడ నిక్షిప్తంగా ఉన్న కవి సమయాల నన్నింటినీ ఒకచోట క్రోడీకరించి, వాటి స్వరూప స్వభావాదులను సయుక్తికంగా నిర్ణ యించడం చేత ప్రతిపాద్య విషయానికి సంబంధించి నంతవరకు సమగ్రమైన గ్రంథం ఇది. అచిరకాలంలో ఆవిష్కరణ భాగ్యాన్ని పొందనున్నది.

ఈ విధంగా ఏతచ్ఛతాబ్ది ప్రారంభం నుండి నేటిదాకా బయలుదేరిన అనేక అలంకార శాస్త్రీయ గ్రంథాలు, ఒక్క అంశాన్నైనా విడువకుండా, సమగ్రాలంకారశాస్త్రాన్ని ఆంధ్రులకు అందించేవిగా ఉన్నాయి.

# తెలుగులో వ్యాకరణాలు - పరిశోధన

—ఆర్. శ్రీహరి

శబ్దస్వరూపాన్ని విశ్లేషణచేసి చూపేది వ్యాకరణ ''వ్యాక్రియంతే శబ్దాః అనేన ఇతి వ్యాకరణమ్'' అని పతంజలి వ్యాకరణనిర్వచనం. దీన్నే శబ్దశాస్త్ర మనీ, శబ్దానుశాసనమనీ వ్యవహరిస్తారు. తెలుగుకున్న వ్యాకరణదీపం చిన్నదేఐనా దాని కాంతి మాత్రం దొడ్డదనే చెప్పాలి. తెలుగుసాహిత్యంపై సంస్కృత సాహిత్య ప్రభావం గాఢంగా పడినట్లే తెలుగు సంప్రదాయవ్యాకరణాలపై కూడా సంస్కృత వ్యాకరణ ప్రభావం పడింది. సూత్రాలు, కారికలు, భాష్యాలు- ఈ రీతిగా తెలుగులో ప్రాచీనసంప్రదాయ వ్యాకరణ రచన సంస్కృత వ్యాకరణ మర్యాదలోనే జరిగింది. సంస్కృత వ్యాకరణానికున్న శాస్త్రగౌరవాన్ని తెలుగు వ్యాకరణానికి కూడా సంతరించటానికి ప్రాచీన వ్యాకర్తలు ప్రయత్నించినారని భావించవచ్చు. చిన్నకోట పెద్దన, అనంతామాత్యుడు మొదలైన ప్రాచీనాంధ్ర లాక్షణికులందరూ తమ సాహిత్యశాస్త్ర గ్రంథాలలో తెలుగు వ్యాకరణాంశాలను ప్రత్యేకంగా చర్చించటం గమనార్హమైన విషయం. ప్రత్యేక విషయంగా అధ్యయనం చేయదగినంత విస్తృతిని నేడు తెలుగు వ్యాకరణం సంపాదించుకున్నది. వ్యాకరణం భాషకు సంబంధించిన శాస్త్రమే ఐనా దానికి భాషాశాస్త్రమనే వ్యవహారం లేదు. అదేవిధంగా భాషాశాస్త్రంలో వ్యాకరణాంశాలు అనేకం ఉన్నా దాన్ని వ్యాకరణమని వ్యవహరించటంలేదు. ఈ రెండింటి పరిధులను స్పష్టంగా గిరిగీసి చూపటం కష్టమేమో! ఈ వ్యాసంలో ఆధునిక భాషాశాస్త్రసంబంధం లేకుండా సంప్రదాయ వ్యాకరణాలపై, వ్యాకరణాంశాలపై జరిగిన పరిశోధనను మాత్రమే పరిశీలించటం జరిగింది.

ఆయా వ్యాకరణ గ్రంథాలకు పండితులు వ్రాసిన వ్యాఖ్యానాలు, పరిశోధన వ్యాసాలు, పీఠికలు, విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధనలు- మొదలైన వివిధరూపాలలో తెలుగు వ్యాకరణ పరిశోధన విస్తృతిని పొందింది. ఈ పరిశోధనను సమీక్షించటమే ఈ వ్యాసం లక్ష్యం.

ప్రాచీనాంధ్ర వ్యాకరణాల పరిశోధనలో తదేకదీక్షతో కృషిచేసిన పండితులలో వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారు కక్షికాధిక్షితులు. ''భాషా పరిశోధనము మీవలె అగాధముగను, సూక్ష్మముగను చేసినవారు అనేకులు లేరు. అనేకు లననేల? ఎవరును లేరన్న అత్యుక్తి కాదు'' అని కట్టమంచివారు శాస్త్రి గారిని గురించి చెప్పిన మాటలలో అత్యుక్తిలేదు. శాస్త్రి గారు సంతరించిన చింతామణి విషయపరిశోధనం, వైయాకరణపారిజాతం, ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వం, బాలవ్యాకరణోద్ద్యోతం మొదలైనవి వీరి వ్యాకరణ పరిశోధన పాటవాన్ని చాటే గ్రంథాలు. వీటిలో వైయాకరణపారిజాతం చింతామణిలో సంజ్ఞా పరిచ్ఛేదంలోని మొదటి పది శ్లోకాలకు వెలసిన బృహద్వ్యాఖ్యానం. గ్రంథాదిసందర్భ, తద్భవ, అక్షర, అనుస్వార, అరసున్న, దంత్యతాలవ్య ప్రకరణాలుగా విభజించబడిన ఈ వ్యాఖ్యానంలో ఆయా విషయాలు ఎంతో సూక్ష్మేక్షికతో చర్చించబడినవి. శాస్త్రిగారి ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వం సాంప్రదాయి

కాంధ్రవ్యాకరణా లన్నింటికి మహాభాష్యతుల్యమైన గ్రంథంగా పేర్కొనవచ్చు. ఇది దాదాపు 1800 పుటలుగల బృహద్గ్రంథం. గ్రాంథికాంధ్ర వ్యాకరణ నియమాలు, ప్రయోగ విశేషాలు, సూత్రకర్తల లోపాలు మొదలైన అనేక విషయాలు విపులంగా పరామర్శింపబడినవి. శాస్త్రిగారి చింతామణి విషయ పరిశోధనం చింతామణిని గూర్చి పండితలోకంలో ఉన్న అనేకసందేహాలను నివృత్తిచేయటానికి రచింప బడిన గ్రంథం. నన్నయయే చింతామణికర్త అని శాస్త్రిగారు ఇందులో సిద్ధాంతీకరించినారు. శాస్త్రిగారు వ్యాకరణ గ్రంథవ్యాఖ్యాతలే కాదు, వ్యాకరణకర్తలు కూడా. బాలవ్యాకరణోద్ద్యోతం బాల ప్రౌఢ వ్యాకర ణాలకు శేషగ్రంథంగా రచింపబడిన గ్రంథం. పాల్కురికి సోమనాథాదిశివకవుల ప్రయోగాలకు కూడా ఇందులో లక్షణం చెప్పటం విశేషం. శాస్త్రిగారి గ్రంథాలన్నింటిలోను వారి వ్యాకరణ పాండిత్యమూ, నిశితమైన పరిశీలన దృష్టీ స్పష్టంగా కానవచ్చే గుణాలు. తెలుగు వ్యాకరణ పరిశోధన భవనానికి శాస్త్రిగారు మూలస్తంభమన్నచో అత్యుక్తి కాదు.

సూత్రరూపంలో వెలసిన తెలుగు వ్యాకరణాల్లో చిన్నయసూరి బాలవ్యాకరణం పేర్కొదగ్గది. పఠన పాఠనాదుల్లో దీనికి కలిగినంత వ్యాప్తి మరే వ్యాకర ణానికి కలుగలేదనటం సత్యోక్తి. వివిధ పండితులు దీనికి విమర్శాత్మకవ్యాఖ్యలు వెలయించినారు. వీటిలో కల్లూరి వెంకటరామశాస్త్రి గారి గుప్తార్థప్రకాశిక, దూసి వారి బాలవ్యాకరణ సారస్యసర్వస్వ వేదిక (గ్రాంథి కాంధ్రకల్పకం)వజ్ఝలవారి సంజీవని,దువ్వూరి వేంకట రమణశాస్త్రి గారి రమణీయం మొదలైనవి కేవలం లక్ష్యలక్షణ సమన్వయపూర్వకాలైన సామాన్య టీకలు కాక మూలకారుని హృదయాన్ని సమీక్షించే చక్కని విమర్శాత్మక వ్యాఖ్యానాలు. వజ్ఝల వారి సంజీవని బాలవ్యాకరణ వ్యాఖ్యలన్నింటిలోనూ విస్తృతమైన వ్యాఖ్య. ఇది వ్యాకరణ సంహితాసర్వసంలో చేర్చ బడింది. సూత్ర వివరణ విషయంలో వజ్ఝల వారికీ, కల్లూరి వారికీ వాదవివాదాలు జరిగినవి. "వర్ణసమా మ్నాయ మందలి శకారము వర్ణాంతరము గాని యల ఘుశకారము కాదని యెఱుంగునది'' అన్న చిన్నయ సూరి వాక్యానికి కల్లూరి వారు ''అది వర్ణాంతరమైన యలఘులకారమే'' అని చేసిన వ్యాఖ్య, ''అమహన్న పుంసకముల కదంతములకు" అన్న చిన్నయసూరి సూత్రంల్లో అమహన్నపుంసకములనే పదాన్ని కర్మ ధారయ సమాసంగా వ్యాఖ్యానించటం మొదలైనవి వజ్ఝల వారి విమర్శకు లోనైన అంశాలు. వీరి ఈ వాదోపవాదాలకు సంబంధించిన విషయాలు గుప్తార్థ ప్రకాశికకూ, వ్యాకరణసంహితాసర్వస్వానికీ అనుబం ధంగా చేర్చబడినవి. బాలవ్యాకరణానికి చింతామణ్య ధర్వణ కారికలు మూలమనే వజ్ఝలవారి అభిప్రాయాన్ని దూసివారు తమ వ్యాఖ్యానంలో మూలకారికలను చూపుతూ సమర్థించినారు. 'నకారంబు ద్రుతంబు' మొదలైన సూత్ర వ్యాఖ్యానాలలో దూసివారి నిశిత విమర్శన పాటవం ద్యోతితమౌతుంది. దువ్వూరి వేంకటరమణశాస్త్రి గారి రమణీయం బాలవ్యాకరణా నికి వ్యాఖ్యాన గ్రంథం మాత్రమే కాదు. సమీక్షా గ్రంథం కూడా. ఈ విషయాన్ని శాస్త్రిగారు రమణీయ ముఖపత్రంలో పేర్కొన్నారు. ఇందులో ప్రక్రియాది విశేషాలు లేవు. చిన్నయసూరిపై పరమప్రామాణికతా భావం కలిగిన శాస్త్రిగారు ఈ సమీక్షా గ్రంథంలో అడుగడుగునా చిన్నయసూరి నిర్ణయాలను ఉపపత్తి సహితంగా చర్చించినారు. అంతేకాదు, వీరు తమ గ్రంథంలో పూర్వభాగంగా కూర్చిన తొమ్మిది సమీక్షా వ్యాసాలు చిన్నయసూరి వ్యాకరణ రచనా పటిమనే కాక శాస్త్రిగారి పరిశోధన పటిమను, సూక్ష్మేక్షికను వ్యక్తంచేసే పరిశోధన వ్యాసాలని చెప్పవచ్చు. నాలుగు దశాబ్దుల కాలం బాలవ్యాకరణాన్ని బోధించిన శాస్త్రి గారి అనుభవం ఈ వ్యాఖ్యానంలో ప్రత్యక్షమౌతుంది. గుప్తార్థ ప్రకాశికాకారులైన కల్లూరి వారు బాలవ్యాక రణం చిన్నయసూరి రచించిన స్వతంత్ర గ్రంథం

కాదనీ, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి గారి హరికారికలకు అనువాదమనీ లేవదీసిన వాదాన్ని అనువాద వివేచన మన్న సమీక్షా వ్యాసంలో చర్చించి, కల్లూరి వారి వాదాన్ని కల్ల అనిపించినారు. వివిధపత్రికలలో ప్రచురింపబడిన అహోబలపండితీయము - సూత్ర సమన్వయము, లక్షణవినోదము - క్త్వార్థకము మొదలైన దువ్వూరి వారి వ్యాసాలు వారి విమర్శనశక్తికి నిదర్శనాలు.

వంతరాం రామకృష్ణారావు గారు 'ఘంటాపథమ'నే తమ బాలవ్యాకరణ వ్యాఖ్యలో రూపసాధన ప్రక్రియను మాత్రమేకాక పదసార్థక్యం, సూత్రకారుని ఆంతర్యం, పాఠభేదాల పరిశీలనం మొదలైన విషయాలన్నింటినో పరామర్శించినారు.

బాల వ్యాకరణానికి బొడ్డుపల్లి పురుషోత్తం గారు రచించిన 'వికాస' వ్యాఖ్యలో ఆధునికభాషా శాస్త్రదృష్టితో విషయనిరూపణ చేయటం గమనించదగ్గది.

బాలవ్యాకరణమనగానే ప్రౌఢవ్యాకరణం కూడా స్ఫురణకు వస్తుంది. ఈ రెండు వ్యాకరణాలకు అవినాభావసంబంధం ఉన్నది. బాలవ్యాకరణం తరువాత అత్యంతప్రచారాన్ని పొందిన వ్యాకరణ గ్రంథం ప్రౌఢవ్యాకరణమే. దీనికి కూడా విమర్శాత్మకాలైన వ్యాఖ్యానగ్రంథాలు చాలా వెలసినవి. వాటిలో తాళ్లూరు ఆర్మగంపిళ్ళ గారి 'కుమారదేవ పండితీయం', బులుసు వెంకటరమణయ్యగారి 'సుబోధిని'; శ్రీభాష్యం వేంకటనరసింహభాష్యకారాచార్యులు గారి 'తత్త్వబోధిని', వంతరాం రామకృష్ణారావు గారి 'ఘంటాపథం' పేర్కొనదగినవి. బాల ప్రౌఢ వ్యాకరణ సర్వస్వం బాల ప్రౌఢవ్యాకరణాలను జోడించి వాటికి సంతరించిన వ్యాఖ్య. టి. భాస్కరరావు గారు (స్ఫూర్తిశ్రీ) వ్యాఖ్యాతలు. వీటిలో సూత్రార్థవివరణ, లక్ష్యసమన్వయం మొదలైనవేకాక ఆయా సందర్భాలలో విమర్శాత్మకమైన విషయవివేచన కూడా కానవస్తుంది.

బాల వ్యాకరణానికి ప్రౌఢ వ్యాకరణం శేష గ్రంథం. ప్రౌఢ వ్యాకరణానికి శేష గ్రంథంగా వంతరాం రామకృష్ణరావుగారు 'ముక్తలక్షణ కౌముది' అనే వ్యాకరణాన్ని రచించినారు. ఇది స్వతంత్ర వ్యాకరణ గ్రంథం. ప్రౌఢ వ్యాకరణంలో సాధింపబడని అనేక కావ్య ప్రయోగాలు ఇందులో సాధింపబడినవి. ఇది రామకృష్ణారావుగారి ప్రయోగ పరిశీలన శక్తిని చాటుతున్నది.

ఆయా వ్యాకరణ గ్రంథాలకు వివిధపండితులు సంతరించిన పీఠికలు తెలుగు వ్యాకరణపరిశోధనను ఉచ్చపీఠంలో నిల్పినవని చెప్పటం అతిశయోక్తి కాదు. బాలసరస్వతీయాథర్వణకారికావళులకు వజ్ఝలవారు, కవిశిరోభూషణానికి వెంపరాలవారు, రమణీయానికి దువ్వూరివారు, ఆంధ్రభాషా భూషణ వైకృతి చంద్రికలకు వడ్లమూడివారు వెలయించిన పీఠికలు ప్రత్యేక విమర్శ గ్రంథాలుగా పేర్కొదగినవేకాని పీఠికా మాత్రాలు కావని నిస్సంశయంగా చెప్పవచ్చు.

భారతి, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఆంధ్రపత్రిక (ఉగాది సంచికలు) మొదలైన సాహిత్య పత్రికలు సాహిత్య పరిశోధనతోపాటు వ్యాకరణ పరిశోధనను కూడా ప్రోత్సహించినవి. వ్యాకరణ గ్రంథాలు, వ్యాఖ్యానాలు, సూత్రార్థ చర్చలు, శబ్ద సాధుత్వాసాధుత్వాలు మొదలైన అనేక వ్యాకరణ విశేషాలపై పరిశోధన వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడినవి. వీటిలో వజ్ఝల చినసీతారామశాస్త్రి, కోరాడ రామకృష్ణయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి పాపయ్యశాస్త్రి, దువ్వూరి వెంకటరమణశాస్త్రి, బులుసు వెంకరమణయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి, నిడుదవోలు వెంకట్రావు, చర్ల గణపతిశాస్త్రి, తూమాటి దోణప్ప, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, బొడ్డుపల్లి పురుషోత్తం, అమరేశం రాజేశ్వరశర్మ, మొదలైన వ్యాకరణ విద్వాంసుల పరిశోధన వ్యాసాలు ఎన్నదగినవి.

ఈ పాతిక సంవత్సరాల కాలంలో విశ్వవిద్యాలయాల్లోని తెలుగు శాఖలలో వ్యాకరణ విషయంలో గణనీయమైన పరిశోధన జరిగిందని చెప్పవచ్చు. తెలుగు వ్యాకరణ విషయాలను పరిశోధనాంశాలుగా తీసుకొని ఎందరో పరిశోధన గ్రంథాలను రచించినారు. ఆయా విశ్వవిద్యాలయాల్లో జరిగిన వ్యాకరణ పరిశోధనను పరిశీలిద్దాం.

భాషాపరంగానూ, వ్యాకరణపరంగానూ జరిగిన పరిశోధనలో ఆంధ్ర విశ్వవిద్యాలయం అగ్రగామి అనటంలో సందేహం లేదు. వజ్ఝల, మల్లాది, దువ్వూరి, గంటిజోగి, తూమాటి మొదలైన పండితులు ఆ విశ్వవిద్యాలయంలో వ్యాకరణానికి ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించినారు. గంటిజోగివారి ఆంధ్రభాషా వికాసం, తూమాటివారి వైకృత పదస్వరూప నిరూపణం మొదలైనవి భాషాపరంగా వచ్చిన పరిశోధన గ్రంథాలైతే బొడ్డుపల్లి పురుషోత్తంగారి తెలుగు వ్యాకరణ వికాసం తెలుగు వ్యాకరణాలపై వచ్చిన ప్రథమ పరిశోధన గ్రంథం. అమరేశం రాజేశ్వర శర్మగారి పరిశోధన శీర్షిక కూడా ఇదే. పురుషోత్తం గారిది తెలుగు వ్యాకరణ వికాసమైతే శర్మగారిది ఆంధ్ర వ్యాకరణ వికాసం. శీర్షికా సామ్యాన్నిబట్టి ఈ రెండు పరిశోధన గ్రంథాలు ఒకే విషయానికి సంబంధించినవే అనిపిస్తుంది. కాని వీరనుసరించిన పద్ధతి పూర్తిగా భిన్నమైనదని చెప్పవచ్చు. సంప్రదాయ వ్యాకరణాలలో చర్చింపబడిన వివిధ విషయాలను పురుషోత్తంగారు తమ సిద్ధాంత గ్రంథంలోని వర్ణం, పదజాతం,సంధి,పదవిభాగం, వ్యాకవిభాగం అనే ఐదు ప్రధాన విభాగాలలో కూలంకషంగా చర్చించినారు. ఈ గ్రంథం ప్రధానంగా సంప్రదాయ వ్యాకరణ విషయ పరామర్శనపరమే ఐనా ఆయా సందర్భాలలో చారిత్రక, తులనాత్మక వ్యాకరణాలు కూడా పరామర్శింపబడినవి. పురుషోత్తంగారు తన సిద్ధాంత గ్రంథంలో ఉదాహరించని వ్యాకరణ గ్రంథమే లేదనవచ్చు. రెండు భాగాలలో దాదాపు 1070 పుటలలో ఉన్న ఈ సిద్ధాంత గ్రంథం పురుషోత్తం గారి పరిశోధన నైపుణ్యాన్ని, సమగ్ర విషయ నిరూపణ ప్రవణతను చాటి చెప్పుతుంది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వ్యాకరణాలపై వచ్చిన రెండోపరిశోధన గ్రంథం ఆకురాతి పున్నారావు గారి "సంస్కృతంలోని ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు." శీర్షిక కొంత విస్తృత పరిధిని సూచిస్తున్నా ఇందులో ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకం-ఈ రెండింటిని గురించిన చర్చ ప్రధానం. సిద్ధాంత గ్రంథం నాలుగు ప్రధాన భాగాలుగా విభక్తమైనది. వీటిలో క్రమంగా ప్రాచీనుల, నవీనుల దృష్టిలో చింతామణి, చింతామణి-స్వరూప స్వభావాలు-కాలకర్తృత్వ నిర్ణయం, చింతామణి వ్యాఖ్యలు-వికృత వివేక కర్తృత్వ నిర్ణయం, అనంతర వ్యాకరణాలపై చింతామణి ప్రభావం అనే నాలుగు ప్రధాన విషయాలు చర్చించబడినాయి. చింతామణి కర్త నన్నయ అనే విషయం వివాదాస్పదం కావటం కందుకూరివారి కవుల చరిత్రతో ప్రారంభమైనది. అంతకు ముందున్న పండితులంతా చింతామణి నన్నయ కృతమే అని విశ్వసించినారు. చిలుకూరి నారాయణరావు గారు ఆంధ్ర భాషా చరిత్రకు అనుబంధంగా వ్రాసిన చింతామణి హృదయం అనే ప్రత్యేక విభాగంలోను, చాగంటి శేషయ్యగారు కవి తరంగిణిలోనూ చింతామణి నన్నయ కృతమనే విషయాన్ని శంకించటమే కాక ఆ శంకకు బలమైన కారణాలు కూడా చూపినారు. కాని ఆ తరువాత ఆంధ్ర శబ్ద చింతామణిపై విశేష పరిశ్రమ చేసిన వజ్ఝలవారు చింతామణి నన్నయ కృతమే అని నిర్ణయించుకొని దాన్ని తమ గ్రంథాలలో వ్యక్తం చేసినారు. పున్నారావు విశేషమైన పరిశ్రమ చేసి చక్కని ఉపపత్తులతో చింతామణి నన్నయ కృతం కాదని నిర్ణయించినారు. ఈ సందర్భంలో వజ్ఝలవారి అభిప్రాయాలు చాలాచోట్ల పున్నారావుగారి విమర్శకు గురి అయినాయి.

చింతామణి వ్యాఖ్యలు - వికృతి వివేక కర్తృత్వ నిర్ణయం అన్న భాగంలో వికృతి వివేకం అధర్వణ కృతం కాదని సప్రమాణంగా నిరూపించినారు. శాస్త్రీయ దృష్టితో కూడిన నిశిత విమర్శన పాటవం ఈ సిద్ధాంత గ్రంథంలో అడుగడుగునా కానవస్తుంది.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వ్యాకరణాలపై వచ్చిన పరిశోధన గ్రంథాలలో అమరేశం రాజేశ్వర శర్మగారి ఆంధ్ర వ్యాకరణ వికాసం ఏకైకమని చెప్పవచ్చు. ఆరు అధ్యాయాలుగా విభజింపబడిన ఈ గ్రంథంలో ఆంధ్ర శబ్ద చింతామణి మొదలుకొని ఆంగ్లంలో వ్రాయబడిన ఆంధ్ర వ్యాకరణాల వరకు దాదాపు నలభై ప్రధాన వ్యాకరణాలు పరామర్శింపబడినవి. ఆయా వ్యాకరణాలను కేవలం పరిచయం చేయటం కాకుండా వాటిలో ప్రతిపాదింపబడిన విషయాలన్నింటినీ కూలంకషంగా చర్చించటం జరిగింది. ఆంధ్ర భాషా భూషణాన్ని గురించి, ఛందోదర్పణాన్ని గురించి చేసిన చర్చలో ఈ విషయం స్పష్టమౌతుంది. ఆంధ్ర శబ్ద చింతామణి కాలము-కర్తృత్యము అన్న ప్రకరణంలో సుదీర్ఘమైన చర్చ చేసి, ఆంధ్ర శబ్ద చింతామణి కర్త నన్నయ కాడని, చింతామణి 14 వ శతాబ్దిలో రచింపబడిన వ్యాకరణ గ్రంథమని సప్రమాణంగా నిరూపించినారు. ప్రథమాంధ్ర వ్యాకరణ కర్త ఎవ్వరు అన్న ప్రకరణంలో కణ్వుడు, బృహస్పతి మొదలైన వివిధ వ్యాకర్తలను పేర్కొని కణ్వుడనే ప్రాచీన విద్వాంసుడు ప్రథమాంధ్ర వ్యాకర్త యని తేల్చినారు. ఈ రెండు ప్రకరణాలలో చేసిన చర్చలు శర్మగారి వ్యాకరణ వైదుష్యాన్ని, నిశిత పరిశీలనా దృష్టిని వ్యక్తం చేస్తున్నాయి. ఆరధ్యాయాలుగా విభజింపబడిన ఈ సిద్ధాంత గ్రంథంలో 41 అవాంతర విషయ విభాగాలు చోటు చేసుకున్నాయి. దీనిని ప్రాచీనాంధ్ర వ్యాకరణ గ్రంథ సర్వస్వమని పేర్కొనవచ్చు.

కె. రామకృష్ణ శర్మగారు వ్యాకరణాంశాలలో ఏకదేశమైన ధాతువులపై పరిశోధన చేసి 'తెలుగు భాషలో ధాతువులు' అన్న సిద్ధాంత గ్రంథాన్ని వ్రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి. పొందినారు.

కొద్ది సంవత్సరాలుగా విశ్వవిద్యాలయాలలో ఎమ్.ఫిల్. డిగ్రీ కోసం పరిశోధన చేసే అవకాశం కూడా కల్పించబడింది. ఏదైనా ఒక చిన్న విషయాన్ని గ్రహించి పరిశోధన చేయటం దీని లక్ష్యం. ఉస్మానియావిశ్వవిద్యాలయంలో ఎమ్.ఫిల్.డిగ్రీకోసం సమర్పింపబడ్డ వ్యాకరణ పరిశోధన గ్రంథం ఒక్కటే అని చెప్పవచ్చు. అది నల్దీగ శ్రీనివాసాచార్యులు గారు రచించిన "ఆంధ్ర భాషాభూషణ-సంస్కృత వ్యాకరణ ప్రభావం." ఇందులో మొత్తం తొమ్మిది ప్రకరణాలు ఉన్నాయి. ఒకటో ప్రకరణం ప్రస్తావన, తొమ్మిదో ప్రకరణం పరిశీలితాంశాల సమీక్ష. తక్కిన ఏడు ప్రకరణాలలో కేతన కాలం, ఆంధ్ర భాషా భూషణ ప్రతులు, పాఠభేద నిరూపణం, కేతనకు పూర్వపు వ్యాకరణ సంప్రదాయాలు, ఆంధ్ర భాషా భూషణ ప్రాచీనత, భాషాభూషణంలోని సంస్కృత వ్యాకరణ సంప్రదాయాలు, పద్యాంధ్ర వ్యాకరణాలపై భాషాభూషణ ప్రభావం అనే విషయాలు చర్చింపబడినవి. పరిశోధనాంశంతో సాక్షాత్సంబంధమున్న ప్రకరణాలు రెండు, మూడు మాత్రమే. తక్కినవి భాషాభూషణానికి సంబంధించిన వివిధాంశాలను పరిశీలించేవి. భాషాభూషణంపై పాణినీయ ప్రభావంకన్నా కాతంత్ర వ్యాకరణ ప్రభావమే అధికంగా ఉన్నట్లు పరిశోధన గ్రంథంలో నిరూపింపబడింది. సూత్రరచనా విధానం, అవ్యయనిర్దేశం మొదలైన విషయాలలోని కర్ణాటక భాషాభూషణానుసరణం కూడా ప్రదర్శింపబడింది.

హరిశివకుమార్‌గారు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన 'కేతన' అన్న సిద్ధాంత గ్రంథంలో కూడా ఆంధ్ర భాషా భూషణానికి సంబంధించిన వివిధ విషయాలను విమర్శాత్మకంగా పరిశీలించినారు. అనుబంధంలో ఆంధ్ర భాషాభూషణానికి సంబంధించిన పాఠభేదాలను కూడా చూపినారు.

భాషా వ్యాకరణాలకు సంబంధించిన పరిశోధనలో నాగార్జున విశ్వవిద్యాలయానికి ఒక ప్రత్యేకత ఉన్నది. భాషా వ్యాకరణాల్లో నిష్ణాతులైన ఆచార్యులు ఈ విశ్వవిద్యాలయంలో ఎక్కువ సంఖ్యలో ఉండటం, వారి మార్గదర్శనంలో వ్యాకరణ పరిశోధనకు మంచి ప్రోత్సాహం లభించటం గమనించదగ్గ విషయం. ఈ విశ్వవిద్యాలయంలో వెలువడిన మొట్టమొదటి వ్యాకరణ పరిశోధన గ్రంథం "తెలుగు వ్యాకరణాలపైని సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం" అనేది. పరిశోధకులు రామబ్రహ్మంగారు. తెలుగు భాషపై సంస్కృత ప్రాకృతాల ప్రభావం ఉన్నట్లుగానే తెలుగు వ్యాకరణాలపై కూడా సంస్కృత ప్రాకృతవ్యాకరణాల ప్రభావం తప్పలేదు. దీనికి కారణం తెలుగులో వ్యాకరణరచన ప్రారంభం కావటానికి చాలా పూర్వమే సంస్కృత ప్రాకృతాలకు వ్యాకరణాలు వెలసి వ్యాకరణ రచనా పద్ధతికి ఒక సలక్షణమైన మార్గం ఏర్పడి ఉండటమే. తెలుగు వ్యాకరణాలపై సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావాన్ని గురించి పండితులు వివిధ వ్యాసాల రూపంలో చర్చించినా తదేకలక్ష్యంగా పరిశోధన జరుగలేదని చెప్పవచ్చు. బి. రామబ్రహ్మం గారి "తెలుగు వ్యాకరణాలపైని సంస్కృతవ్యాకరణాల ప్రభావం" - అన్న పిహెచ్. డి. సిద్ధాంత గ్రంథం ఈ లోటును తీర్చింది. ఎనిమిది అధ్యాయాలుగా విభక్తమైన ఈ సిద్ధాంత గ్రంథంలో వర్ణమాల. పరుషసరళాలు, ప్రత్యాహారపద్ధతి, ద్రుతమూ -ద్రుత ప్రకృతికమూ, సంధి, రూపసాధన సరణి, ఉత్వాదుజ్ఞులు, ప్రకీర్ణవిషయాలు క్రమంగా చర్చింపబడి ఆయా విషయాలపై సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం నిరూపించబడింది.

వ్యాకరణంలో ప్రతిపాదింపబడే సంధి, శబ్ద ప్రక్రియ, కారకం, సమాసం మొదలైన విషయాలన్నింటినీ సాకల్యంగా పరిశోధించటంతోపాటు వీటిలో ఏకదేశ విషయాన్ని గ్రహించి పరిశోధన చేయటం కూడా జరిగింది. నాగార్జున విశ్వవిద్యాలయంలో ఎమ్. ఫిల్. పట్టంకోసం సమర్పించిన పరిశోధన గ్రంథమే జి. అభినేత్రిగారి "తెలుగు సమాస సమాలోచనం." సమాస నిర్వచనం, తెలుగు సమాస విభాగం, సమాసతత్త్వ పరిశీలనం ఇందులో చర్చింపబడిన అంశాలు.

ఆంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్యల్లో ప్రామాణికమైనది బాలసరస్వతీయం. దీన్ని ఊతగా చేసుకొని అవతరించినదే కవిజనాంజనం. నూతనమైన లక్ష్య లక్షణాలతో విపులమైన అనుశాసనంగా పాలూరి జమీందారి కుటుంబానికి చెందిన కిమ్మూరి నరసరాజు దీనిని సంతరించినారు. ఈ వ్యాఖ్యాన వైశిష్ట్యాన్ని నిరూపించే సిద్ధాంతవ్యాసమే డి. కృష్ణకుమారి గారి కవిజనాంజన పరిశీలనం. ఇది నాగార్జున విశ్వవిద్యాలయంలో ఎమ్. ఫిల్. డిగ్రీకోసం సమర్పింపబడిన పరిశోధన గ్రంథం. ఇందులో నాలుగధ్యాయాలు ఉన్నాయి. మొదటి అధ్యాయంలో వ్యాఖ్యాత జీవిత విశేషాలు, రెండో అధ్యాయంలో వ్యాఖ్యాన స్వరూప-స్వభావాలు, మూడో అధ్యాయంలో వ్యాఖ్యాన వైశిష్ట్యం నాల్గో అధ్యాయంలో చింతామణి వ్యాఖ్యల్లో కవిజనాంజనానికి గల స్థానం చర్చించబడివి. కవిజనాంజనానికి సంబంధించిన తాటాకు ప్రతులను, అచ్చుప్రతిని పరిశీలించి పరిశోధకురాలు సిద్ధపరచిన కవిజనాంజన పరిష్కృతప్రతి పరిశోధన వ్యాసానికి అనుబంధంగా చేర్చబడి పరిశోధన వ్యాసానికి అదనపు మెరుగును సంతరించినది.

ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకం, అహోబల పండితీయం మొదలైనవి సంస్కృతంలో రచింపబడిన తెలుగు వ్యాకరణాలు. ఆంధ్రభాషా భూషణం, కావ్యాలంకార చూడామణి, కవిజనసంజీవని మొదలైనవి తెలుగులోనే సంతరింపబడిన తెలుగు వ్యాకరణాలు. ఈ రెండు మార్గాలకు చెందిన వ్యాకరణగ్రంథాల రచనాపద్ధతిలో భేదం కానవస్తున్నా, విషయనిరూపణంలో మాత్రం సన్నిహిత సంబంధం లేకపోలేదు. వివిధ వ్యాకరణాల్లో ప్రతిపాదింపబడిన

ఆయా విషయాల క్రమవికాసాన్ని అవగాహన చేసుకోవటానికి ఈ రెండు మార్గాలకు చెందిన వ్యాకరణాల పరిశీలన అవసరం. ఈ దృష్టితో బి.ఏ. పద్మనాభ శాస్త్రిగారు పై రెండు మార్గాలకు చెందిన ప్రధాన వ్యాకరణగ్రంథాలను తీసుకొని వివిధ వ్యాకరణ విషయాలను, వాటి వికాసాన్ని తమ "తెలుగు సంప్రదాయ వ్యాకరణముల అధ్యయనము" అన్న పరిశోధన గ్రంథంలో చర్చించినారు. ఈ పరిశోధన కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో జరిగింది. ఈ పరిశోధన గ్రంథం మూడు అధ్యాయాలుగా విభజింపబడింది. మొదటి అధ్యాయంలో వ్యాకరణ ప్రయోజనాలు, సంస్కృత ప్రాకృత వ్యాకరణాలు సమీక్షింపబడ్డవి. రెండో అధ్యాయంలో తెలుగు వ్యాకరణాల్లోని విషయ వికాసమూ, మూడో అధ్యాయంలో సంస్కృత వ్యాకరణాల్లోని విషయ వికాసమూ చర్చితాంశాలు. ఆయా వ్యాకరణగ్రంథాల్లో చర్చింపబడిన విషయాలను పరిశీలించి వాటి పౌర్వాపర్యాన్నీ, వికాసాన్నీ నిరూపించటం ఈ పరిశోధన గ్రంథంలోని ప్రధానాంశం.

ఆంధ్రేతర రాష్ట్రాలలోని విశ్వవిద్యాలయాలలోనూ తెలుగుశాఖలు ఏర్పడటం, వాటిలో పరిశోధనకు సౌకర్యాలు కల్పించటం హర్షింపదగ్గ విషయం. మైసూరు, బెంగుళూరు, మదరాసు, మదురై, బనారస్ విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన సాగుతుంది. వీటిలో ఒక్క మైసూరు విశ్వవిద్యాలయంలో మాత్రమే వ్యాకరణ పరిశోధన జరిగినట్లుగా తెలుస్తుంది. జి. లలితగారు "తెలుగులో వ్యాకరణ సంప్రదాయములు" అన్న పరిశోధన గ్రంథాన్ని రచించి, మైసూరు విశ్వవిద్యాలయంవారి పిహెచ్.డి. పట్టాన్ని పొందినారు. మహిళలలో వ్యాకరణాలపై బృహత్పరిశోధన చేసిన గౌరవం లలితగారికే దక్కింది. వీరి పరిశోధన గ్రంథం పూర్వోత్తరభాగాలుగా విభజింపబడింది. పూర్వభాగంలో పది ప్రకరణాలు, ఉత్తరభాగంలో పదకొండు ప్రకరణాలు ఉన్నాయి. పూర్వభాగం మొదటి తొమ్మిది ప్రకరణాల్లో తెలుగు వ్యాకరణాల స్వరూపచరిత్రావలోకనం, పదో ప్రకరణంలో కర్ణాట భాషావ్యాకరణాల చరిత్ర పొందుపరచబడినవి. తొలినుండి నేటిదాక వివిధభాషలలో తెలుగుభాషకు వెలసిన దాదాపు 270 వ్యాకరణగ్రంథాల పరిశీలనం ఇందులో జరిగింది. ఇంతకుముందు పరామర్శింపబడని ఎన్నో వ్యాకరణాల పరామర్శ ఇందులో కానవస్తుంది. పూర్వభాగమంతా ఉత్తరభాగానికి అవతారికా రూపం మాత్రమే. సిద్ధాంతగ్రంథంలో ప్రధానంగా ప్రతిపాదనీయమైన తెలుగువ్యాకరణ సంప్రదాయాల సమాలోచనం ఉత్తరభాగంలో చోటుచేసుకొన్నది. వర్ణసమామ్నాయం, పదవిభాగం, సంధి, నామప్రక్రియ, సమాసాలు మొదలైన వ్యాకరణాంశాలపై వివిధ వ్యాకర్తల అభిప్రాయాలను పరిశీలించి వారి సిద్ధాంత ప్రతిపాదనంలోని భేదసాదృశ్యాలను గుర్తించటం జరిగింది. వ్రాతప్రతులరూపంలో ఉన్న అనేక—అముద్రితవ్యాకరణాల పరిశీలన ఈ సిద్ధాంతగ్రంథంలోని మరో విశేషం. వ్రాతలో దాదాపు 1400 పుటలలో రచితమైన ఈ పరిశోధనగ్రంథం ఇందులోని విషయవైపుల్యాన్ని, పరిశోధనకర్త పరిశోధనా పాటవాన్ని వ్యక్తం చేస్తున్నది.

ఏదైనా ఒక కావ్యాన్ని గ్రహించి దానికి వర్ణనాత్మక వ్యాకరణాన్ని సంతరించటం నేటి పరిశోధనాంశాల్లో ఒకటి. భాషకు సమగ్రమైన వ్యాకరణం వ్రాయటానికి, భాషాపరిణామాన్ని సరిగా అధ్యయనం చేయటానికి వర్ణనాత్మకవ్యాకరణాలు ఎంతగానో ఉపకరిస్తాయి. ఈ దిశలో కూడా విశ్వవిద్యాలయాలలో కృషి జరిగింది. ఎల్.బి. శంకరరావుగారు కుమారసంభవానికి, కె. పాదభూషణరావుగారు నన్నయ భారతానికి, పి. నరసింహారెడ్డిగారు ఆముక్తమాల్యదకు, ఆర్. వెంకటసుబ్బయ్యగారు పాల్కురికి సోమనాథుని రచనలకు వర్ణనాత్మక వ్యాకరణాలు వ్రాసి, వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి.

డిగ్రీలను పొందినారు. పి.ఎల్. శ్రీనివాస్‌రెడ్డిగారు శ్రీనాథునిభాష-వర్ణనాత్మక విశ్లేషణ అన్న విషయంపై, ఎస్. కుమారదేవిగారు ఘటికాచల మాహాత్మ్యం-భాషా ప్రయోగాలు అన్న విషయంపై కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయంలో పరిశోధనగ్రంథాలను రచించినారు. నేతి అనంతరామశాస్త్రిగారు శ్రీనాథుని భాషపైనే నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసినారు.

కే.వి. సుందరాచార్యులుగారి అచ్చ తెలుగు రామాయణంలో భాషావిశేషాలు, జే. హేమలతగారి దక్షిణాంధ్రవాఙ్మయంలో భాషావిశేషాలు, రావి భారతి గారి కృష్ణదేవరాయల ప్రబంధాల్లోని భాష అనే సిద్ధాంతగ్రంథాలు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని పరిశోధన ఫలితాలు. వీటిలో చివరి రెండు ఒక యుగంలో విలసిల్లిన భాషను వర్ణించేవి.

లక్షణంకన్న కవిప్రయోగం బలవత్తరమైనది. కవులు ప్రయోగించిన రూపాలను వ్యాకరణంలో చెప్పకపోతే ఆ వ్యాకరణం అసమగ్రమే అవుతుంది. ఈ దృష్టితో గిడుగువారు వ్యాకర్తలు సాధించని ఎన్నో కావ్యప్రయోగాలను చూపుతూ బాలకవి శర ణ్యాన్ని రచించినారు. సూత్రరూపంలో లేకున్నా దీన్ని ఒక విమర్శాత్మక వ్యాకరణగ్రంథంగా భావించ వచ్చు. మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారి ఆంధ్ర భాషానుశాసనం కూడా ఎన్నో ప్రాచీన ప్రయోగాలకు గతి కల్పించింది. సూత్రరూపంలో సంతరింపబడిన ఈ వ్యాకరణంలో మల్లాదివారి విశాలదృష్టితోపాటు ప్రయోగపరిశీలన దృష్టి గోచరిస్తుంది.

భాష కాలానుగుణమైన మార్పులకు లోనౌతూ వికసిస్తుంటుందనే యాథార్థ్యాన్ని గుర్తిస్తూ, వర్తమా నాంధ్రదేశంలోని శిష్టులప్రయోగాలను దృష్టిలో ఉంచు కొని వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్యావహారిక భాషావ్యాకరణాన్ని, వజ్ఝల వెంకటేశ్వర్లుగారు ఆధు నిక ప్రామాణికాంధ్ర వ్యాకరణాన్ని రచించి పరిశోధన దృక్పథానికీ, "ప్రయోగశరణం వ్యాకరణమ్" అనే అభియుక్తికీ సరికొత్త ప్రమాణాలను సృష్టించినారు.

ఈ విధంగా వ్యాకరణ గ్రంథాల వ్యాఖ్యానాలు, పీఠికలు, విశ్వవిద్యాలయాలలో వెలయించిన పరిశోధన గ్రంథాలు, వివిధ పత్రికలలో వెలువడిన వ్యాసాలు, స్వతంత్రవ్యాకరణగ్రంథాలు మొదలైన వివిధ రూపా లలో తెలుగువ్యాకరణపరిశోధన విస్తృతిని పొందింది.



# నవ్యాంధ్ర సాహిత్యంలో భావకవిత్వ విన్యాసం

— అమరేంద్ర

ఈ శతాబ్దంలో ఆంధ్ర సాహిత్యంలో నవ వసంత వైభవాన్ని వెదజల్లిన ఉద్యమాలలో భావ కవిత్వోద్యమం ప్రముఖమైనది. పాశ్చాత్యసాహిత్యంలో కిందటి శతాబ్దంలో విజృంభించిన కాల్పనికోద్యమం క్రమంగా భారత దేశానికి రావటానికి కారణభూతులు రవీంద్ర గురుదేవులు. తమ సంధ్యా సంగీత్, ప్రభాత్ సంగీత్ కావ్యాల ద్వారా సుకుమార సుందర భావాలతో హృదయాలను అలరించే రచనా విధానానికి శ్రీకారం చుట్టి భావకవితా ప్రవక్తలైనారు. కథావస్తు ప్రధానమైన సుదీర్ఘ కావ్యాలకు భిన్నమైన రచనా శిల్పానికి అంకురార్పణ చేశారు.

"కొయ్యబొమ్మలు మెచ్చు కళ్ళకు కోమలుల సౌరెక్కునా?" అని సంప్రదాయపు మూసలో పోసిన కవిత్వాన్ని నిరసిస్తూ ముత్యాల సరాలు కూర్చిన గురజాడ కొంతవరకూ భావకవితకు దారులు వేశారు. బుద్ధి సూక్ష్మత కంటే గొప్పదైన భావనా శక్తిని ఆశ్రయించే హృదయవాది కవిత్వానికి నాంది పలికారు అప్పారావుగారు. సామాన్యులు నాయికలైనారు పూర్ణమ్మ, కన్యక, హరిజన బాలికలు కావ్యాలకు ప్రేరణ లిచ్చారు.

అప్పటిదాకా రాజ్యం చేసిన అపధానకవిత్వంతో విసిగిపోయి-

"జననీ! యేమిటి కింక ఆశుకవితా సన్యాస
మిప్పింపవే!"

"...... సకలార్థ శూన్యమగు నీవేగాతి
వేగోక్తి, దు
ర్వ్యసనంబేటికి త్రిప్పు మింక జననీ! రమ్యా
క్షరక్షోణికిన్"

అంటూ కొత్తదారి తొక్కిన రాయప్రోలు సుబ్బారావు గారు భావ కవిత్వోద్యమానికి చక్కటి పునాదులు వేశారు. రమ్యాక్షరక్షోణిలో వెలసిన బంగరుపంట భావకవిత్వం.

ఈ మహనీయులిద్దరూ చేసిన కృషి ఫలితంగానే ఆంధ్ర సాహిత్యంలో నవ వసంతోదయమై "వల్లరుల కొక క్రొత్త సౌకుమార్యము, చివురుల కొక క్రొత్త మెత్తందనము, ప్రసవముల కొక క్రొత్త కమ్మందనము, మకరందమున క్రొత్త మాధుర్యము, కలకంఠమున కొక క్రొత్త కంఠస్వరము," సమకూరి, ఆంధ్ర కవిత్వ చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది.

ఆంగ్ల కవిశేఖరులైన బ్లేక్, వర్డ్సువర్తు, కోల్ రిజ్, షెలీ, కీట్సుల రచనలవల్ల ప్రభావితులైన ఆంధ్రకవులు రొమాంటిక్ ధోరణిలో నవ్య కవితలు వెలయించారు. ఇంగ్లండులో పద్దెనిమిదో శతాబ్దంలో మేధాశక్తి కవిత్వాన్ని ఆక్రమించుకుని సహజత్వానికి దూరమైన రచనా విన్యాసాలకు ప్రాచుర్యం వచ్చింది. దానికి తిరుగుబాటుగా బయలుదేరిన ఉద్యమమే రొమాంటిక్ కవిత్వం. అందరూ వాడుకునే మాటల్లో,

పాడుకునే పరసల్లో సామాన్య మానవుల సుఖదుఃఖాలను ప్రకటించాలనే ఆశయం ప్రధానంగా వర్డ్స్‌వర్త్ రచనలు చేశాడు. అతి సామాన్యులను కథానాయకులుగా నాయికలుగా తీసుకుని తన భావనా శక్తితో మామూలుగా కనిపించే చిన్న వస్తువులకు వింత రంగులు దిద్ది మేలి ముసుగులు సవరించి ఎంతో ఆకర్షణీయంగా రచనలు వెలయించాడు. నాగరిక జీవితపు సంఘర్షణల నుంచీ, సమ్మర్దం నుంచీ కవిత్వాన్ని దూరంగా తీసుకు వెళ్ళాడు. గ్రామసీమలలో విలసిల్లే ప్రకృతి రామణీయకతనూ, సంతృప్తితో జీవించే జానపదుల జీవితాలలో కనిపించే అమాయకత్వమునూ, సరళ నిరాడంబర విధానమునూ, సామాన్య జనుల సుఖదుఃఖాలనూ, ఆశానిరాశలనూ తన కవితా వస్తువులుగా స్వీకరించాడు. సంప్రదాయపు కళ్ళజోడు తీసేసి తన సొంత కళ్ళతో ప్రకృతి సౌందర్యాన్ని తిలకించి, నిలువెల్లా పులకించి సొంత బాణీలో పరికించాడు. నిర్మలమైన అమాయకమైన ప్రవృత్తితో నవ్వుతూ జీవిత సాగరతీరంలో ఇసుకతో పిచ్చుక గూళ్లు కట్టుకునే శిశువులలో పాపసత్వం, దివ్యత్వం ఆయన దర్శించాడు. శైశవంలో స్వర్గం మన చుట్టూ పరచుకుని వుంటుంది. పెరుగుతున్న కొద్దీ మనలో దివ్యాంశ తరిగిపోతుంది. జీవిత కారాగారపు తలుపులు మూసుకుపోతాయి. శైశవంలో విరిసిన అమూల్య దివ్యత్వం క్రమంగా అంతర్ధానమై పోతుంది. ''ఎవ్వరనుకున్నారో ఎరుగరా మీరు? పాపాయి సాక్షుత్తు పరమాత్ముడండీ!'' అని బసవరాజు అప్పారావుగారు అనటానికి ప్రాతిపదికలు వర్డ్స్‌వర్త్ అందించిన కవితలో వున్నాయి.

ప్రాచీన కవిత్వం ఆశయసాధన వల్ల కలిగిన సంతృప్తిని వెల్లడిస్తుంది. కాల్పనిక కవిత్వం అందని ఆదర్శాలకోసం, అందాలకోసం మానవ హృదయాన్ని కలవరపెట్టే అన్వేషణను ప్రకటిస్తుంది. ''అప్రాప్తమైన ఆశయాలకోసం మానవుడి నిరంతరాన్వేషణకు అక్షరరూపం భావకవిత్వం'' అంటాడొక పాశ్చాత్య సాహితీవేత్త.

భావ కవులకు స్వేచ్ఛ ప్రాణవాయువు. సంకెళ్ళలో సంగీతమా? కోకిలనుపట్టి పంజరంలో బంధిస్తే విశ్వమంతా ఆగ్రహంతో ఉడికిపోతుంది అంటాడు కోల్‌రిజ్. అందుకే ప్రపంచమంతటా భావకవులు జానిసత్వానికి, కృత్రిమమైన నిబంధనలకూ, అర్థంలేని కట్టుబాట్లకూ బద్ధశత్రువులు. గ్రీసు స్వాతంత్ర్య సమరంలో బైరన్ ప్రాణాలు అర్పించాడు. ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్నాడు వర్డ్స్‌వర్త్.

భావ కవుల దృష్టిలో బుద్ధి వైభవం కంటే మానవ హృదయ వైశాల్యమే విలువైనది. బుద్ధికి పదును పెట్టటం కంటే హృదయాలను కదిలించి కరిగించి మెత్తపడేయటమే కవితకు లక్ష్యంగా భావిస్తారు. ఒక హృదయంలోంచి ఎగసివచ్చి ఇంకో హృదయంలోకి సూటిగా దూసుకుపోగల రచనా విన్యాసం వారికి ఆదరపాత్రం. అందుకే గానాన్ని ప్రాణంగా భావించి పాటలలో పూలబాటలు వేసి పరమ సత్యాలను ఆవేశబంధురంగా సుకుమార సుందరంగా పలికిస్తారు. పండితులు చేసిన ఈసడింపులకు గురియైన జానపద గేయ ఫణితులను కళ్ళకు అద్దుకుంటారు. పనికట్టుకుని ధర్మోపదేశాలు చేయకుండా ఆకులందున దాగి తీయగా పాడుతూ మానవులను సత్క్రమపథంతో నడిపే భావ కవికోకిలలు జాతికి వైతాళికులు.

పాండిత్య ప్రధానమైన మేధాశక్తికంటే భావనాశక్తియే కవితకు ప్రాణమని భావకవుల విశ్వాసం. పరమాణువులో బ్రహ్మాండమునూ, గడ్డి పూవులో సౌందర్య స్వర్గమునూ, క్షణకాలములో అనంతత్వమునూ గుర్తించగల భావనాశక్తియే కవితకు ప్రాణం. ''To see a world in a grain of sand A heaven in a wild flower/To hold infinity in the palm of your hand/And eternity in an hour.'' అని విలియం బ్లేక్ భావనాశక్తిలో వున్న విభవాన్ని ప్రశంసించాడు. ఈ భావనాశక్తివల్లనే విభిన్నంగా

కనబడే విశ్వంలో ఏకతా సూత్రం మనకు లభిస్తుం దన్నాడు కోల్‌రిజ్. ఈ భావనాశక్తి ప్రసరించే కాంతి మూలంగా దివికి భువికి వినూత్నశోభలు సమకూర గలవని ఆయన ప్రతిపాదన. "Creative imagination gives a new Earth and a new Heaven !" అంటాడు దార్శనిక కవి కోల్‌రిజ్. అభూతాలైన కల్పనలను వాస్తవాలని భ్రమపడేట్లు చేయటమే కవిత్వమని ఆయన సిద్ధాంతం.

భావ కవిత్వం ముఖ్యంగా ప్రణయ కవిత్వమే. సృష్టికి అంతటికీ మూలాధారం ప్రణయం. విశ్వంలో వున్న జీవరాసులన్నిటినీ ఆప్యాయంగా లాలించి పాలించే శక్తి ప్రణయమే. విభిన్నంగా తోచే విశాల విశ్వాన్ని అనుసంధించే అదృశ్య సూత్రమే ప్రణయం. విచిత్ర ప్రపంచ మణిహారంలో అది కనబడని దారం. ఈ విశ్వాసపు పునాదిమీదనే భావకవులు ఎన్నో రమ్య హర్మ్యాలు నిర్మించారు. శరీరాల స్పర్శకూ, కామ వికారాలకూ అతీతమైన, ఉదాత్తమైన పవిత్ర శక్తిగా ప్రణయాన్ని భావకవులు ఉపాసించారు. షెలీ కవిత్వ మంతా ఈ మహనీయ ప్రణయశక్తికి ఆవాహనగా, ఆరాధనగా, నివేదనగా అక్షరరమ్యతతో అలరిస్తుంది.

ఈ భూమికను మనసులో నిలుపుకుని మన భావకవులను వారి రచనా విన్యాసాలనూ పరిశీలించాలి. దానికి ముందు భావకవిత్వపు ప్రముఖ లక్షణం ఆత్మాశ్రయ తత్త్వమని గుర్తు పెట్టుకోవాలి. కవి వ్యక్తిత్వమనే మూసలోకి ఈ ప్రపంచం కరిగించిన మైనంలాగా ప్రవహించి ఆకారం దిద్దుకుంటుంది. కవి హృదయంలో ఉప్పొంగిన భావావేశంలో కరిగిన అనుభూతులు వేడిగా వాడిగా అక్షరరూపం ధరిస్తాయి. నైటింగేలు అనే పక్షిని గురించి కీట్సు రచించిన అద్భుతమైన ఖండకావ్యంలో ఆ పక్షి తాలూకు వర్ణన కంటే కవి వ్యక్తిగతమైన అనుభూతులే ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. కవి వ్యక్తిత్వమే ప్రధాన పాత్ర వహి స్తుంది భావకవిత్వ విన్యాసంలో.

కలమంత్ర పరాయణుడై కోకిలస్వామిగా గొంతువిప్పిన రాయప్రోలు సుబ్బారావుగారు భావ కవిత్వానికి తెలుగులో భద్రమైన స్థానం కల్పించారు. లలిత, స్నేహలత, కష్టకమల వంటి సుకుమార భావ విలసితాలైన కథా కావ్యాలద్వారా నవ్యమార్గాన పయ నించారు. సరికొత్త ఉపమానాలతో సరళమైన శైలీ విలాసంతో కవితలో రమ్యాలోకం ప్రసరించారు. అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ప్రకృతిలో వాత్సల్యరస చిత్రణమునూ మానవ ప్రకృతిలో శరీరస్పర్శకు అతీతమైన ఆదర్శప్రాయమైన మైత్రీ మాధురినీ తమ రచనల్లో ప్రకటించి ఆంగ్ల భావుకులు నిరూపించిన ఉదాత్త ప్రణయరస పోషణను సుబ్బారావుగారు ఆంధ్రకవిత్వంలో ప్రస్ఫుటం చేశారు.

"కులశుభాంగి వయోధీర కుసుమమందు
మోహమధువు గవేషించె మున్ను సుకవి
సాత్త్విక ప్రేమకోశ పేశలము లైన
వత్సలామృత రుచులను వలచె నేడు" అంటూ

ఆధునిక కవుల ప్రణయ తత్వాన్ని సూత్రప్రాయంగా నిర్దేశించారు.

"సచ్చిదానంద కళ్యాణ సదనమైన
ఈ మనోహర జగతికి నేగుదెంచి
ప్రేమలక్ష్మి నారాధింపవేమి, చెపుమ?" అని

నవ్య భావకవులకు ప్రణయ మంత్రం ఉపదేశించారు. సంస్కారభావాలూ, సౌందర్యారాధనా, ఉజ్జ్వల దేశ భక్తి ప్రబోధమూ, ఉదాత్త ప్రణయ చిత్రణమూ ఈ భావకవికులగురువు కవిత్వంలో మనల్ని అలరించే ముఖ్య లక్షణాలు.

సంయోగ సుఖం కంటే వియోగం వల్ల కలిగే వేదనలో, కన్నీళ్లలో దాగివున్న అమృతాన్నే భావ కవులు ఎక్కువగా ఆస్వాదించారు. భావ కవిత్వాన్ని ఒక ఉద్యమంగా కొనసాగించిన శివశంకరశాస్త్రి గారి హృదయేశ్వరి కావ్యం అప్రాప్త మనోహరికి అక్షర నీరాజనం. సాధారణంగా భావ కవిత్వంలో కోపించే

స్పష్టతను శాస్త్రిగారు తమ కావ్యాలలో సాధించ కలిగారు. Art lies in concealing art అనే సూక్తికి శాస్త్రిగారి కావ్యరచనలు నిదర్శనాలు. పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, దీక్షిత దుహిత మొదలైన గేయ నాటికల ద్వారా సన్నివేశ కల్పనలో పాత్రపోషణలో వైచిత్రిని నిరూపించారు. ఆయన ఆశీర్వాదం అందుకుని ఎందరో భావకవితా రంగంలో ప్రఖ్యాతులైనారు. సాహితీ సమితి సభాపతిగా శాస్త్రిగారు భావకవిత్వానికి చేయూత నిచ్చి నవ్యసాహిత్యానికి ఎనలేని సేవ చేశారు.

భావకవిత్వ ప్రభావం ఆనాటి ప్రముఖ కవులందరి మీద ప్రసరించింది. తరవాత కాలంలో ప్రౌఢ కవిగా పరిణమించిన విశ్వనాథ సత్యనారాయణగారు గిరికుమారుని ప్రేమగీతాలు, కిన్నెరసాని వంటి రస భరితమైన రచనలు చేసి హృదయాలను కదిలించారు. హృదయాన్ని హృదయం ఆప్యాయంగా పలకరించినట్లుండే స్వచ్ఛంద కవితాధోరణి ఈ రచనల్లో మనల్ని పులకింపజేస్తుంది.

భావకవిత్వానికి విజయకేతనం దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. భావ గీతాల రచనలో ఆయన ఎవరెస్టు శిఖరం. రాశిలో తక్కువైనా వాసిలో మిన్నగా ఆయన రచనలు భావకవిత్వానికి అపూర్వ విజయాన్ని సాధించాయి. కృష్ణపక్షం ఆంధ్రకవిత్వంలో అపూర్వం అత్యంత విశిష్టం. ''జగము నిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు'' అంటూ తన స్వేచ్ఛాప్రియత్వాన్ని చాటుకున్నారు. కవి గగనపథ విహార విహంగమ పతిగా, ప్రళయ ఝుంఝూప్రభంజన స్వామిగా కృష్ణపక్షంలో స్వాతంత్ర్య ప్రియత్వాన్ని చాటుకున్నారు. ఈ స్వేచ్ఛా ప్రియత్వం వల్ల లోకంతో సంఘర్షణ తప్పనిసరియైనప్పుడు దానికి ఫలితంగా దుఃఖమూ వేదనా అనుభవించవలసి వస్తుంది. దుఃఖమును వర్ణించుటలో ఆయన అద్వితీయ శక్తి ప్రదర్శించారు.

''హృదయశోణితధార నెదుగు జీవితవల్లి
మొదలంట దూల్చినారే, భయదాగ్ని కీలలను
వ్రేల్చినారే...'' అంటూ దుఃఖపు లోతులను గ్రహించి "నాకు నిశ్శ్వాస తాళవృంతాలు కలవు, నాకు కన్నీటి సరుల దొంతరలు కలవు, నా కమూల్య మపూర్వమానంద మొసగు నిరుపమనితాంత దుఃఖంపు నిధులు కలవు.'' అని శోకాన్ని ధనంగా భావించారు. అంతరంగాన్ని ప్రక్షాళన చేయగల అశ్రువులు అమూల్యమని ఏసుప్రభువు ప్రవచించాడు. కన్నీటితో కడిగిన హృదయం ప్రవిమల పారిజాతమై ప్రభుని పాద సన్నిధిని చేరుకుంటుంది. అశ్రువులలోనే ప్రేమ వికసించి భక్తి అంకురిస్తుంది. భక్తి గేయ సంపుటి ''మహతి''తో కృష్ణశాస్త్రి గారు పాటలను పూల బాటలుగా పరచి అన్ని మతాల వారికీ వర్తించే ప్రేమ మయునికి విశ్వవిభునికి నివాళు లందించారు. కృష్ణ పక్షంలో దట్టంగా కమ్ముకున్న విషాద మేఘాలు కనిపిస్తాయి. మహతిలో పండు వెన్నెలల చల్లదనం పరవశింపజేస్తుంది. వాడిన పూవుకే గడియ గడియకొక వసంతాగమనం, మంటలు ఎగసే ఎండకారు నేలకే తొలకరి పన్నీటి జల్లు. లోకాల నేలు స్వామి లోలోన గట్టిన ప్రణయ మందిరంగా కవి హృదయం దీపించింది. ''సాటేది లేని సంసారము స్వర్గము, జగమంత శాంత బృందావనము!" అనే ఆశాసందేశం మహతి ఆలపించే మధురగానం. రెండు మూడు అక్షరాల తేలిక మాటలలో తేనెలొలికే పాటలు అసంఖ్యాకంగా రచించిన భావగేయ కవి చక్రవర్తి దేవులపల్లి. గతంకోసం బెంగ పెట్టుకుని వెనక్కి వెనక్కి చూడకుండా కాలముతోపాటు ముందుకు కదులుతూ ఉజ్జ్వల భవితవ్యం కోసం ఆశతో నిరీక్షిస్తూ సాగిపోయే నిత్యపథికుడు కృష్ణశాస్త్రిగారు. అణువణువునా గుడి, అందరిలో గుడి. అందులో పెరిగే దీపం దైవం. ప్రతి మనిషీ నడిచే దైవం, ప్రతి పక్షీ ఎగిరే దైవం. ఇల్లూ వాకిలి ఒళ్లూ మనసూ ఎల్లవేళలా మంచు కడిగిన మల్లెపూవులా మెరుస్తూ ప్రాణేశుని కొలువై

వెలుగొందాలి అని ఆయన మధుర ప్రబోధం. పశ్చాత్తాపంతో పరమపాపి కన్నులవెంట రాల్చే పరితాపాశ్రువులను పరమాత్ముడు ముత్యాలసరంగా ధరిస్తాడని కన్నీరు పన్నీరుగా మారే దివ్య రహస్యాన్ని శాస్త్రిగారు కవితలో ప్రకటించారు. "Give me the bread of affliction and the wine of tears" అన్న ఏసునాధుని వాక్యపరమార్థాన్ని ఎన్నో గేయాలలో స్ఫురింపజేశారు. భావకవిత్వానికి సముజ్జ్వల మూర్తీభావంగా దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఆంధ్ర దేశంలో సంచరించారు. షెలీ భావావేశం, కీట్సు శబ్దశిల్పం, రవీంద్రుని భావ వైశాల్యం ఆయనలో సమన్వయం పొందాయి.

ఒక్క దీపావళి కావ్యరచనతోనే వేదుల సత్యనారాయణశాస్త్రిగారు భావ కవులలో ఉన్నత స్థానం సంపాదించుకున్నారు. మనోహరములైన సరళ సంస్కృత శబ్ద విలసిత వృత్తాలలో తన స్వేచ్ఛాప్రవృత్తినీ, సౌందర్యానురక్తినీ, ప్రణయ తత్త్వ ఆరాధననూ మధురంగా ప్రకటించుకున్నారు. అందరికీ ఆనంద దీప్తులొసగే దీపావళి ఆయన హృదయంలో అమవసనిశిగా నిలిచింది. మ్రొక్కిన కొలంది కాలితో త్రొక్కివేసే క్రూరలోకాన్ని బహిష్కరించి గుండెలలో రగిలే నిర్వేదంతో తన దుఃఖావేశాన్ని ఎన్నో రచనల్లో అద్భుతంగా చిత్రించారు. బరువెక్కిన గుండెలతో గోదావరి నదీ తీరంలో నిలబడి ఆకాశం వంక చూస్తున్నప్పుడు "'గౌతమీ నది నా మనోగత విషాదతమము నంతయు తనలోన దాచుకొనియె" "'తారలె మదశ్రుకణముల నేరుకొనియె" అని తోచి "'నేనె మిగిలితి ... నదీ పవిత్ర గర్భాంతమున ప్రోతవెట్టుచున్న యుగయుగాంతర విశ్వ మహోగ్ర దుఃఖ జీవగీతాలకావృత్తి సెప్పుకొనగ" అని ఆ నదితో తాదాత్మ్యం పొంది గౌతమీ కోకిల అనే బిరుదం సార్థకం చేసుకున్నారు. Art is life seen through a temperament అనే సూక్తికి వేదుల కన్నీటి తార్కాణాలు శ్రావణమాస రాత్రి మేదురవి నీలమేఘాల మేలిముసుగుతో వచ్చినా, ఉదయాద్రి నుంచి గాఢలజ్జాయతయౌ నవోఢవలె తొంగిచూసే చందమామ హృదయ సాగరాన్ని వరపడె తొక్కించినా కవి వ్యక్తిగతమైన అనుభూతి ద్వారా ప్రకృతి సౌందర్యానికి రంగులుదిద్ది వన్నెచిన్నెలతో ప్రదర్శించే శిల్పవిన్యాసం గోచరిస్తుంది.

సంప్రదాయ సిద్ధమైన ఛందస్సులను పండితులకు విడిచిపెట్టి భావకవులు జానపద కవుల గేయ ఫణితులలో తమ హృదయ స్పందనాలు అందించారు. ఈ మార్గంలో బసవరాజు, బాపిరాజు, నండూరి సుబ్బారావు అపూర్వ విజయం సాధించి గేయ కవిత్రయంగా ప్రసిద్ధి పొందారు. గురజాడ అడుగుజాడల్లో తేలిక మాటల్లో భావగీతాలు రచించి బసవరాజు అప్పారావు భావగీతాల కవిరాజు అనిపించుకున్నారు. గుండెని చీల్చుకుని వచ్చే భావావేశం ప్రతి రచనలోనూ కనిపిస్తుంది. తన జీవితంలో తారసిల్లిన కష్టసుఖాలనూ అనుభవాలనూ గీతాలుగా రూపొందించారు. నిరాడంబరంగా నగ్నంగా వుంటుంది రచన. Poetry is a spontaneous overflow of powerful feelings అనే నిర్వచనం ఈ రచనకు అక్షరాలా వర్తిస్తుంది. గాంధీమహాత్ముని దండీ సత్యాగ్రహ యాత్రకు స్మరణీయమైన గేయరూపం సమకూర్చారు. "ప్రళయాంతాభీల నభోదళన ఫెళఫెళారవముల చలిపిడుగా గర్జించకు" అనే గేయంలో రుద్రభూమిలో ఒంటరిగా నిద్రిస్తున్న తన చిన్నారి మంగళప్రద పిడుగు చప్పుడు విని భయపడి కక్కటిల్లి ఏడుస్తుందని మనవి చేసుకుంటూ అక్కడ నీ ప్రతాపం చూపకు అని చలిపిడుగును వేడుకోనటంలో బసవరాజు కవి హృదయపు లోతులు చూపించారు.

"తెపొత్తి బసవయ్య లేచి రావయ్యా." వంటి గీతాలతో బాపిరాజు తన కళాతృష్ణను వెలువరించారు. "మెట్టు మెట్టు కాదనట్టాలి మెట్టు" అనే గేయంలో తిరుపతి కొండకు ఎక్కే వెళ్ళే రకరకాల మనుషులను

భావనా నేత్రంతో దర్శించి ఒక అద్భుతమైన అనుభూతిని చిత్రించారు. ''హిమాలయోత్తుంగ శృంగం నీ బ్రతుకు ఉమాపతీ నృత్యరంగం'' అని బాపూజీని స్తుతించే గేయంలో గాఢమైన దేశభక్తిని వెల్లడించారు. సులువైన జానపద గీతాల ఫణితిలో ఎన్నో విలువైన భావాలు అందించిన గేయ రచయిత బాపిరాజు ''శశికళ''లో ఒక అప్రాప్తమనోహరిని అతిలోక సుందరిని అభివర్ణించి రసపారవశ్యంలో తన్మయులై పోయారు.

''గుండె గొంతుకలోన కొట్లాడుతాది కూకుండ నీదురా కూసింత సేపు" అనే చరణంతో ప్రారంభించిన నండూరి సుబ్బారావు ఎంకి పాటలు రచించి ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు. మామూలు మాటల్లో మహోన్నతమైన గంభీరమైన భావాలు పలికించారు. తెలుగు వారి ముద్దుల పడుచుగా ఎంకిని తీర్చిదిద్దారు. జానపద గీతాల వరసలు అందుకొని తన సుకుమార ప్రణయ తత్త్వాలనూ, కమనీయమైన ప్రకృతి దృశ్యాలనూ ఎంకిపాటల రూపంలో అందించారు నండూరి. ఎలుతురు పిల్లా ఏడ నీదు కాపురమే అని నాయుడుబావ అడిగితే నీ నీడలోనె మేడ కడతానని చల్లగా బదులు చెబుతుంది ఎంకి. ఏటి గుండెల్లో నిదురపోయే తోట, వెన్నెలను మేసి నెమరువేసే యేరు, మన కళ్ళముందు మెదులుతాయి. ప్రతి పదంలోనూ భావ గాంభీర్యం, శ్రవణ సుభగ మాధుర్యం ముగ్ధులను చేసే రచనవల్ల ఎంకి చిరంజీవియై పోయింది. ''ఎంకి పేరేగాని నాకూరా పేరా?" అంటారు కవి ఎంతో వినయంగా. చూపుతో మాటాడి ఊపిరితో తెలిగించే నైపుణితో ఎంకెవ్వరని లోకమెపుడైనా అడిగితే ''యెలుగు నీడల కేసి యేలు సూపింతు" అని చిత్రంగా సమాధానం చెప్పారు కవి. ఎంకి పాటలు ఆంధ్ర భావ కవిత్వం సాధించిన ఘన విజయాల్లో పేర్కొనదగిన రచన.

భక్తి రసావేశంలో పరమాత్మునికి ఆత్మ నివేదన చేసుకునే విధానాన్ని వెంకటపార్వతీశ్వర కవులు ఏకాంతసేవ కావ్యంలో అత్యంతరమణీయంగా చిత్రించారు. విగ్రహాలకు అతీతుడైన విశ్వవిభునికి ప్రాణనాయకునికి కోకిలతో, తుమ్మెదతో సందేశాలు పంపే ఉత్తమ ప్రణయ ప్రబంధం దేశిసాహిత్యానికి చెందిన మంజరీ ద్విపదలో తీర్చిదిద్దారు. ఆధ్యాత్మికపారవశ్యాన్ని అక్షర రమ్యంగా మనోహరమైన కల్పనాసౌకుమార్యంతో అందించారు. వీరి బాణీ విలక్షణం. ప్రత్యేకం. ''నూతనాంధ్ర సారస్వతములో నిట్టి కావ్యము వేరొకటి లేదని నా నమ్మకము" అన్నారు కృష్ణశాస్త్రి గారు. ప్రేమమయుని ప్రణయ విలాసము "మధురముగ మార్దవంబుగ మంజులముగ మానసానందకరముగ మంగళముగ" అభివర్ణించే ఈ కావ్యం భావకవిత్వంలో ఉన్నతస్థానం అలంకరిస్తున్నది.

కాల్పనికోద్యమ కాలంలో నాయని సుబ్బారావు గారు సౌభద్రుని ప్రణయ యాత్రలో తన ప్రేయసి కోసం పొందిన వియోగవేదనను ఎంతో మధురంగా చిత్రించారు. తన జీవిత వాస్తవానుభవసారాన్ని భావనాబలంతో మేళవించి చక్కటి కావ్యం రచించారు.

వర్డ్సువర్తు ప్రకృతి గీతాల ప్రభావంతో కవికొండల వెంకటరావు గారు ప్రకృతి చందనం వంటి కృతులలో సామాన్య దృశ్యాలలో అసామాన్య సౌందర్యం దర్శించి ప్రదర్శించారు. గుక్కెడు వాన నీళ్లు తాగి దారిపక్కన దాక్కుని వుండే గడ్డి పువ్వుల అందాన్ని ఒక ఖండికలో అద్భుతంగా ఆవిష్కరించారు. నిత్యమూ చూస్తూ వుండటంవల్ల ఉపేక్షించే అందాలను ఎత్తిచూపటం భావ కవిత్వ లక్ష్యాలలో ఒకటి. భావ కవులు మాకు కొత్తకళ్లు ఇచ్చారు అని ప్రస్తుతించారు సహృదయులు.

సామాన్య మానవులపట్ల సానుభూతి భావకవిత్వ లక్షణాలలో ప్రధానమైనది. సాధారణ జీవితాలలోని ఆశానిరాశలనూ సుఖదుఃఖాలనూ వస్తువులుగా గ్రహించి వర్డ్సువర్తు కొన్ని రచనలు చేసి మార్గదర్శకుడైనాడు. కర్షకుని జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకుని జాతికి వెన్నెముక అనదగిన రైతుల కష్ట

సుఖాలనూ, ఔన్నత్యాన్నీ, ఔదార్యాన్నీ ప్రశంస నీయంగా అభివర్ణించారు దువ్వూరి రామిరెడ్డిగారు తమ కృషీవల కావ్యంలో. వాస్తవ చిత్రణతోపాటు ఆదర్శ వాదం మేళవించి నిశిత పరిశీలనతో ఉజ్జ్వల భావనా శక్తిని జతచేసి గొప్ప కావ్యం రచించటానికి సామాన్య జీవితంలో కావలిసినంత సామగ్రి వున్నదని నిరూ పించారు.

భావకవిత్వ ప్రవాహంలో పడి కొట్టుకుపోకుండా దూరంగా నిలబడినప్పటికీ భావకవిత్వపు ఉత్తమాంశ లను తమ కవితలో ప్రతిఫలించారు తుమ్మల సీతారామ మూర్తిగారు, నవయుగ కవి చక్రవర్తి జాషువాగారు. తుమ్మల రచించిన ఆత్మార్పణంలో భావ కవిత్వానికి ప్రాణప్రదమైన ప్రణయతత్వాన్ని గొప్పగా ప్రకటిం చారు.

''రమ్యకుసుమంబ వీవు సౌరభము నేను,
నిండునెల వీవు పండువెన్నెలను నేను
పదమ వీవు తదర్థసంపదను నేను
కలదె యన్యోన్య విప్రయోగంబు మనకు?''

అన్న పంక్తులలో ఆయన ఉత్తమ భావకవిగా కని పిస్తారు. సంక్రాంతి సంబరాలను చిత్రించిన కవితలలో తెలుగుసీమ అందచందాలను కళ్లకు కట్టించారు.

జాషువా ఖండకావ్యాలలో సాధారణ వస్తువు లలో అసాధారణ సౌందర్యం అన్వేషించే భావకవి ప్రవృత్తి గోచరిస్తుంది. గిజిగాడు, సాలీడు, శిశువు, జాకీ వంటి ఖండికలలో మహత్తర భావనాశక్తి మనకి విస్మయం కలిగిస్తుంది. కథాకావ్యాలలో సన్ని వేశాన్ని బట్టి భావాలు వెల్లువలై పొంగి కథనం వెనక బడుతుంది. ఫిరదౌసీ కావ్యంలో ద్వితీయాశ్వాసంతో చిరస్మరణీయమైన ప్రకృతి చిత్రణ కనబడుతుంది. ప్రకృతి సౌందర్యంలో పరమాత్మని లీలావిలాసాలు దర్శించే నిశితదృష్టి ఆయనది. ''సంజకెంజాయలో

జలకంబు సవరించి పరతెంచు సూర్య
బింబంబులోన
పదహారు వన్నెల పరువు వచ్చిన నాటి
చంద్రుని ధవళహాసమ్ములోన''

పోలుగా పవ్వళించె బ్రహ్మాండమంతట వ్యక్తమౌచు చున్న దివ్య స్వరూపుని గుర్తించి ఆత్మ సమర్పణ చేస్తున్న ఋషి దృష్టి ఆయనది. ప్రణయ మొక్కటే సృష్టిలో శాశ్వతమనే సత్యాన్ని ముంతాజ్ మహల్ కావ్యంలో ప్రతిపాదించారు. శాశ్వత ప్రణయానికి చిహ్నంగా నిలిచిన తాజ్‌మహల్ సృష్టి శిల్పిరమకు సిగమీది నగలాగా అవతరించింది. మొగలు దంప తుల ప్రణయ వైభవాన్ని ప్రస్తుతిస్తూ-

''రాణి వీడిపోయె రాజు నొంటరిజేసి
రాజు వీడిపోయె రాజ్యరమను
రాజ్యరమయు వీడె రాజుల పెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు''

అని కావ్యం ముగించారు. ''సమస్తలోక మంగళకరమైన సత్య మును కమ్మని వాక్కుల నిర్భయంగా పలుకునదే కవిత్వము'' అని ఆయన విశ్వాసం. భావకవులు స్వప్నాలలో దర్శించే విశాల మానవత విశ్వజనీన భావన ఈయన కృతులలో సాక్షాత్కరిస్తాయి.

''నిఖిలలోకమెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను!''

అని చాటు కున్న మానవతావాది జాషువా.

భావకవిత్వం రానురాను సంకుచితమై నీరసిం చింది. ప్రకృతీ, ప్రణయమూ తప్ప ఇతర వస్తువుల జోలికి పోకుండా సమాజంలో పేరుకుపోతున్న దారిద్ర్యం దుఃఖం గమనించకుండా పలాయన వాదా నికి దారి తీసింది. ''దిగిరాను దిగిరాను దివినుండి భువికి'' ''లోకముతో పనియేమిటి? లోలాక్షీ! రా పోదము'' అనే వైఖరులు తీవ్ర విమర్శలకు గురియై నాయి. ప్రేమ విశ్వప్రేమగా, కారుణ్యంగా పరిణ మించవలసిన అవసరాన్ని పింగళి-కాటూరి కవులు హృదయంగమంగా సౌందరనంద కావ్యంలో ప్రతిపా దించారు. హృదయ తటముల పొంగి పారే ప్రణయ సురధుని సమస్త విశ్వాన్నీ ప్లావితం చేసి పునీతం కావించకుండా ''అంగనామాత్ర సముపేక్షకార్థ మగునె?'' అని ప్రశ్నించారు. రాతి గుండెలు కూడా ద్రవించిపోయే విశ్వచైతన్యాన్ని కళ్ల ఎదుట నిల్పి సకల జీవ కారుణ్యంగా ప్రణయం పరిణామం పొంది దుఃఖాన్నీ నిర్వేదాన్నీ ఉపశమింపజేయటమే మానవుల పరమ లక్ష్యమనే ఉపదేశాన్ని ఈ కావ్యం అద్భుతంగా అందించింది. ఖండ కావ్యాల కాలంలో వెలిసిన సమగ్ర కథా కావ్యం సౌందరనందం. ఇది కారుణ్యోపనిషత్ అని ఉన్నవ లక్ష్మీనారాయణగారు

ప్రశంసించారు. షెలీ కవి ''ఎలాస్టరు'' కావ్యంలోనూ, కీట్సుకవి హైపరియాన్ కావ్యంలోనూ సూచించిన ప్రణయతత్వ మహా పరిణామం సౌందరనందంలో కూడా స్ఫురిస్తుంది. ''నా కీ లోకముతో పనేమి...'' అంటూ సుందరిలావణ్యంలో మునిగి తేలుతూ ప్రపంచాన్ని విస్మరించాడు నందుడు. అతని రాజప్రాసాదానికి భిక్షుకుడుగా వచ్చి నందునికి మేలుకొలుపు కలిగించాడు బుద్ధుడు. ఆ మేలుకొలుపు ప్రేయసిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్న భావ కవిత్వానికి కూడా వర్తిస్తుంది.

పాతికేళ్ల పాటు ముమ్మరంగా సాగిన భావ కవిత్వ ఉద్యమం 1945 నాటికి బలహీనమై నీరస పడింది. సాంఘిక ప్రయోజనం వుంటే కాని కవిత్వానికి సార్థకత్వం లేదనే సిద్ధాంతంతో అభ్యుదయ సాహిత్యోద్యమం బయలుదేరింది. భావ కవిత్వచ్ఛాయల్లో ఎదిగిన శ్రీశ్రీ ప్రభవ అనే తొలి రచనలో భావ కవితా గంధబంధురములైన కవితలు వెలయించినప్పటికీ ఆ పరిరంభం నుంచి బయటికి వచ్చి విప్లవ శంఖం పూరించాడు. ఉద్యమంగా భావ కవిత్వం బలహీన పడినప్పటికీ భావ కవితా స్పర్శ సోకని కవులు లేరు. ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారి దక్షారామంలో, పిలకా గణపతిశాస్త్రిగారి ప్రమద్వరలో, దేవులపల్లి రామానుజరావుగారి పచ్చతోరణంలో, రజనీకాంతరావుగారి శతపత్రసుందరిలో, విశ్వవీణలో భావ కవితా పరిమళాలు గుబాళిస్తున్నాయి. తరువాతి తరంలో వచ్చిన కరుణశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి, తిలక్, శేషేంద్ర శర్మ ప్రభృతుల రచనల్లో భావ కవితా విన్యాసం మురిపిస్తూనే వుంది. హృదయ స్పందన కలిగించే ప్రతి కవితలోనూ భావ కవిత్వపు సోయగం వుండి తీరుతుంది. సృష్టిలో స్నేహమూ, ప్రేమా, సౌందర్యమూ భాసించినంత కాలమూ భావ కవిత్వం విలసిల్లుతునే వుంటుంది. సుదూర తీరాలకోసం, సమున్నత శిఖరాల కోసం మానవ హృదయం ఆరాటపడుతున్నంత కాలమూ భావ కవిత్వం నిలబడుతుంది.

''ఉపశమింపని తపనయే నా
కున్న భాగ్యము కన్నతల్లీ!'' అని భావ

కవి భారతీదేవి సన్నిధిలో నిలబడతాడు. 'తలపు తలపూ జ్యోతి, పలుకు పలుకూ గీతి'' కాగా ప్రతి యింట నిల్చి, ప్రతి గుండె పిలిచి తన మధుర వేదనను పలువురితో పంచుకోవాలని భావకవి ఆశయం. గాఢమైన గూఢమైన తత్వసిద్ధాంతాలను తన అనుభూతితో ఆవేశంతో రంగరించి పాఠకులకు అందించే భావకవి మేధావి కాడు. హృదయవీణా తంత్రులను మీట గలిగిన సౌందర్య రసాన్వేషి. కలలను బహిష్కరించటం సాధ్యమైతేనే పాఠకులు భావ కవిత్వాన్ని బహిష్కరించగలుగుతారు. ఈనాటి స్వప్నాలన్నీ రేపటి సత్యాలనే అకుంఠిత విశ్వాసంతో జీవించే భావకవి ఆశావాది.

''Hope till hope creates
of its own wreck the thing it
contemplates'' అంటాడు భావ కవి చక్రవర్తి షెలీ.

ఉద్యమంగా భావ కవిత్వం బలహీనమయిన మాట నిజం. కాని భావ కవిత్వం మాత్రం ఎన్నటికీ అంతరించదు. అర్థం కాదు. అస్పష్టంగా వుంటుంది. పులుముడు-అంటే ఒకే సన్నటి భావాన్ని తెగలాగే పునరుక్తి - వుంటుంది. వ్యధార్త జీవిత యథార్థ దృశ్యం ప్రతిబింబించదు. ఈ విధమైన ఆక్షేపణలు భావ కవిత్వం మీదికి ఎందరో విసిరారు.

కాని ఒక అస్పష్టమాధుర్యమే Vague Sweetnees భావకవితకు విలక్షణమైన ఆకర్షణ. ''ఏదియో అపూర్వ మధురరక్తి స్ఫురియించుగాని అర్థమ్ముకాని భావగీతమ్ము లవి!'' అని ప్రణయిని నేత్రాలను వర్ణించే సందర్భంలో పూర్తిగా అర్థంకాక పోయినప్పటికీ ఏదో తీయని స్ఫురణ కలిగించగల శక్తి భావ కవితలో వున్నదని కృష్ణశాస్త్రిగారు సూచించారు. ''Poetry communicates even before it is comprehended'' అన్నాడొక విమర్శక శిరోమణి.

అందుకే భావ కవిత్వం మానవ హృదయం స్పందించినంత కాలమూ వెచ్చగా పచ్చగా ముచ్చటగా అలరారుతూ వుంటుందని నా నమ్మకం.



# భావకవిత్వము - పరిశోధన

—ఇరివెంటి కృష్ణమూర్తి

తెలుగులో నవ్యకవితా ధోరణులకు భావ కవిత్వోద్యమానికి అవినాభావసంబంధ మున్నది. వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు తెలుగు భాషా సాహిత్యాలకు కొత్త రూపు రేకలను దిద్దిన యుగపురుషులు. ప్రక్రియా వైవిధ్యానికీ, నూత్న భావప్రకటన విధానానికీ, యుగోచిత భావస్ఫూర్తికీ మార్గదర్శకులైనారు. పౌరాణిక ఇతిహాసికేతివృత్తాలను ప్రతిపాదించటంలోనూ, ఛందశ్చమత్కార ప్రదర్శనంలోనూ గతానుగతిక శబ్దార్థాలంకారాలతోనూ, కవిసమయబంధాలతోనూ, అందరికీ అందుబాటులో లేని భాషావిన్యాసంతోనూ సాహిత్యం కేవలం సమాజంలోని ఒక పరిమితవర్గానికి విలాస వస్తువుగా మారిపోయిన దినాలలో భావానికీ-వినూత్న భావానికీ, కల్పనామహితమైన భావానికీ, భాషా సారళ్యానికీ ప్రాముఖ్యాన్ని సమకూర్చవలసిన అగత్యాన్ని నాటి మనీషులు గుర్తించి కొత్తపుంతలను అన్వేషించి సాహిత్యానికి అనాదికాలం నుంచి ఉన్న ప్రయోజనాన్ని సాధించటానికి ఉద్యుక్తులైనారు.

కందుకూరి వీరేశలింగం పంతులు గారి 'సరస్వతీ నారద సంవాదము' అనే రచన తెలుగు సాహిత్యాన్ని నవ్యపథంలో నడిపించాలనే మహాత్వాకాంక్షను భంగ్యంతరంగా వెల్లడి చేసింది. శ్లేషాలంకారాన్ని ఆధారం చేసుకొని పంతులుగారు గర్భబంధ చిత్రకవిత్వాలు, అనావశ్యకపదాడంబరం, రసవిహీన పదప్రయోగం కవితకు శోభను చేకూర్చలేవని నిరూపించిరి. ఛందోబంధాలతో పదాలను ఇమిడ్చినంత మాత్రాన కవిత్వ మనిపించుకోదు. రసాత్మకమైన వాక్యవిశేషమే కవిత్వమనీ, రసం లేకుంటే ఛందోఽలంకారాది కావ్యశోభా హేతువులన్నీ సాహిత్యానికి సంకెళ్ళే కాని అలంకృతులు కావని పంతులుగారు తమ ప్రత్యయాన్ని ప్రకటించిరి. వీరేశలింగంగారి ఈ అభిప్రాయంవల్ల వస్తువు ఛందస్సు భాష గౌణములై భావానికే ప్రాముఖ్యం రావాలనే ఆదర్శం నవ్యకవితావిర్భావానికి దారితీసింది. కనుకనే స్థూలంగా నవ్యకవితకు 1920 తర్వాత భావ కవిత్వమనే పేరు సార్థకమైనది. భావ కవిత్వం ఆవిర్భవిస్తున్న రోజులలోనే అది అచ్చమైన కవితకు పర్యాయవాచిగా ప్రాశస్త్యాన్ని అందుకున్నది. భావ కవిత్వాన్ని గూర్చి శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు నిశితంగా పర్యాలోచన చేసినారు. భావకవిత్వ మంటే ఆయన దృష్టిలో ఉత్తమ కవిత. శ్రీ శాస్త్రిగారు ఒక వ్యాసంలో

''భావ కవిత్వము (లిరిక్సు) వేదాంతము వలె కవిత్వాంతము. గ్రంథము కొలది ఆనందము హెచ్చు. పిట్ట కొంచెము, కూత ఘనము. కవిత్వమునకిది శిరస్సు. తెలుగు భాషలో లోగడ నున్న లిరిక్కులను ఉద్ధరించుట ఆవశ్యకము. తెలుగు కవులును దీని ప్రాశస్త్యమును గుర్తించిరి.'' 1 అని భావ కవిత్వానికి ఎనలేని ప్రాముఖ్యాన్ని సంతరించి పెట్టడమే కాక అచ్చమైన కవితకూ భావకవిత్వానికీ భేదం లేదని భంగ్యంతరంగా నిర్దేశించిరి. సాహిత్య పరిశోధకులకు శాస్త్రిగారి అభిప్రాయం కరదీపిక.

---

1. కావ్యసభారతి — పుట 65.

శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు 'భావ కవిత్వం' అనకుండ 'నవ కవిత్వం' అన్నారు. ఒక వ్యాసంలో ఆయన తొమ్మండుగురు కవులను గూర్చి వివరిస్తూ ఇలా అన్నారు- ''స్త్రీలలో లావణ్యము వలె, యోగులలో శాంతివలె, కావ్యములలో రసము వలె ఇతమిత్థము నవకవిత్వమురీతి యని స్పష్టముగా వర్ణించడానికి సాధ్యము కాక ఇటువంటిదని కొంత సూచించటానికి సాధ్యమై అనుభవైక వేద్యమైన ఒకానొక విశిష్ట ధర్మమున్నది నవకవిత్వములో.''[2] సూత్రప్రాయంగా ఆలోచనాత్మకంగా సాగిన శాస్త్రి గారి భావ కవిత్వ వివేచనం పరిశోధకులకు సూచనగా ఉన్నది. నవ్య కవితలోని విశిష్టతను సహృదయతతో పరిశీలించే ప్రయత్నం చేయాలని శాస్త్రిగారు సాహిత్య పరిశోధకులకు సందేశమిచ్చినట్లుగా ఉన్నది.

భావ కవితా ధోరణి తెలుగు దేశంలో ప్రహ తంగా వస్తున్న పడికట్టు రాళ్ల కవితా పద్ధతికి భిన్నంగానూ ఆకర్షణీయంగానూ ఉండటం వల్ల కొత్తదనాన్ని ఉద్రాత లూగించగలిగింది. కొత్తను కోరేవాళ్లకు చక్కని వాహిక అయినది. అయితే ఈ సరికొత్త ధోరణిని పాత వాసనలు నిరసించినవి. ఉమాకాంత విద్యాశేఖరుల 'నేటి కాలపు కవిత్వము' అనే పుస్తకం నవ్యకవితా ధోరణుల పట్ల నిరసన భావమున్న వారి విమర్శలకు ప్రాతినిధ్యం వహించింది, ప్రతీకగా నిలిచింది. భావ కవిత్వ సంబంధమైన పరిశోధనలకు ఆ పుస్తకంలోని విసురులూ రంగాన్ని సిద్ధం చేసినవి. విశ్వవిద్యాలయాలలో నిర్బంధ పఠనీయ భాషగా ఇంగ్లీషు ప్రవేశించడంతో, ఆ భాష ద్వారా ప్రపంచంలోని భాషా సాహిత్యాల తీరు తెన్నులతోనూ, వైజ్ఞానిక సాంకేతి శాస్త్రాభివృద్ధి వలన పాశ్చాత్య దేశాలలో వేళ్లు తన్నుకుంటున్న అతి నవ్యభావాలతోనూ తెలుగువాళ్లకు పరిచయంఏర్పడింది. 17, 18 శతాబ్దాలలో ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశాలలో రెక్క లిప్పిన కాల్పనిక కవితా వైఖరులపట్ల అభిమానం ఎక్కువైంది. దీనికి తోడుగా భారత దేశంలోనూ స్వాతంత్ర్యోద్యమం నానాటికీ బలపడుతున్నది. ఈ పరిస్థితుల ప్రభావం సంఘంపైన, అది అభిమానిస్తున్న సాహిత్యంపైన పడకుండా ఎలా ఉంటుంది ? కనుక 1914 నుంచి తెలుగునాట విస్తరిల్లిన తెలుగు కవిత భావకవితాప్రభావం నుంచి తప్పించుకోలేకపోయింది. అప్పటినుంచి తెలుగుకవుల్లో చెప్పుకోదగిన పేరున్న వారందరూ భావకవితాపథంలో పయనించినవారే. వేంకట పార్వతీశ్వర కవులు భావకవితా భానూద యానికి ముందు పూచిన ఉషఃకాంతులు. రాయప్రోలు, రోణంకి, కృష్ణశాస్త్రి, దువ్వూరి, అబ్బూరి, వేదుల, నాయని,కాటూరి-పింగళి,శివశంకరశాస్త్రి, మల్లవరపు, పిలకా, చామర్తి, కవికొండల, కొడాలి, ఇంద్రగంటి, విశ్వనాథ, కరుణశ్రీ, జాషువా మున్నగు కవులందరూ తమ విలక్షణ ప్రతిభతో భావకవితా కేదారాలలో పసిడి పంటలు పండించినవారే. అభ్యుదయ కవితా పథానికి మార్గదర్శకుడైన శ్రీరంగం శ్రీనివాసరావు తొలిదశలో వీరందరితోపాటు భావకవిత లల్లినవాడే.

భావకవిత్వాన్ని వివిధ దృక్కోణాలతో పరిశీలించి, విశ్లేషించి పరిశోధనలు చేసిన సందర్భాలు అరుదనే చెప్పవలసి వస్తుంది.

ఆచార్య కురుగంటి సీతారామభట్టాచార్యులూ, పిల్లలమర్రి వేంకట హనుమంతరావూ తమ ''నవ్యాంధ్ర సాహిత్య వీధులు'' అనే గ్రంథంలో కొందరు భావ కవుల ప్రతిభా సామర్థ్యాలను వివరించినారు. భావ కవితా లక్షణాలను రేఖామాత్రంగా పరిచయం చేసినారు.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు 'లక్ష్మీరంజన వ్యాసావళి'లో భావ కవిత్వాన్ని గూర్చి వివేచ నాత్మక పరిశీలనం జరిపినారు.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తమ 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము'లో భావకవిత్వాన్ని

2. సారస్వత వ్యాసములు-ఐదవ సంపుటి-పుట 38. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి.

కాల్పనిక కవిత్వమని సంకేతించి నవ్యకవితా ధోరణు లలో అంతర్భాగంగా గుర్తించి కొందరు భావకవుల కవితా పారమ్యాన్ని ఉగ్గడించినారు.

భావ కవితా వైజయంతికలను ఎగురవేసిన మహాకవుల సాహిత్య వ్యవసాయాన్ని గూర్చిన పరి శోధనలు తెలుగుదేశంలో విశ్వవిద్యాలయాలలో కడచిన ఇరువై ఏళ్ళ కాలంలో జరుగుతూనే ఉన్నది. రాయప్రోలు, విశ్వనాథ, దేవులపల్లి, కరుణశ్రీ, నాయని, జాషువా, అబ్బూరిగారల గూర్చి విశ్వవిద్యా లయాలలో ఎం.ఫిల్., పిహెచ్.డి. పట్టాలకోసం పరి శోధనలు జరిగినవి, జరుగుతున్నవి. డిగ్రీలకోసం కాకుండా జిజ్ఞాసాపరులైన విమర్శకులూ, విద్వాంసులూ పుస్తకాలనూ, పత్రికలలో వ్యాసాలనూ ప్రచురించి నారు. రేడియోపై ప్రసంగాలు చేసినారు. ఈ రచనలు భావకవిత్వాన్ని గూర్చిన పరిశోధనకు యథో చితములైన సాధనాలుగా తోడ్పడగలిగిన వనడంలో సందేహం ఉండకూడదు.

ప్రక్రియాపరంగా భావ కవిత్వాన్ని గూర్చి ప్రప్రథమంగా పరిశోధన చేసినవారు డా. పాటిబండ మాధవశర్మగారు. డా. శర్మగారు 1936 లో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఎం. ఏ. ఆనర్సు పట్టాకోసం సమర్పించిన సిద్ధాంతవ్యాసం "ఆధునికాంధ్ర భావ కవిత్వము." శర్మగారి వ్యాసాన్ని చదివే అవకాశం నాకు లభించలేదు.

1962 లో ఆచార్య సి. నారాయణరెడ్డిగారు "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు" అన్న అంశం మీద సిద్ధాంత వ్యాసాన్ని రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించి పిహెచ్.డి. పట్టాన్ని సంపాదించినారు. ప్రక్రియాపరంగా భావకవిత్వాన్ని గూర్చి శ్రీ రెడ్డిగారు ప్రధానంగా పరిశీలించే ఉద్దేశంతో కాకపోయినా నవ్య కవిత్వపు పోకడలను విశ్లేషించే సందర్భంలో భావ కవితావిర్భావ వికాస దశలను విపులంగా చర్చించి నారు. 1967 లో ఈ సిద్ధాంత వ్యాసం ముద్రణ పొందింది. ఇటీవల రెండవ ముద్రణను కూడా అందుకున్నది.

ఈ గ్రంథంలో భావ కవిత్వాన్ని శ్రీ నారాయణ రెడ్డిగారు నిర్వచించి స్వరూప స్వభావాలను పేర్కొ న్నారు. భావ కవులు సృజించిన కవితా సాగరాన్ని మధించి 'ప్రణయ కవిత్వము, దేశభక్తి కవిత్వము, ప్రకృతి కవిత్వము, సంఘ సంస్కరణ కవిత్వము, భక్తి కవిత్వము, స్మృతికావ్యములు' అని ఆరు శాఖ లుగా వింగడించి, వాటిని సోదాహరణంగా వివరించి భావ కవితా తత్త్వాన్ని సిద్ధాంతీకరించినారు. భావ కవిత్వమంటే ఊహాప్రపంచంలో తేలిపోతుండడ మని, పరిసరాల బాదరాబందీతో సంబంధం లేని ప్రణయనౌకావిహార మని సామాన్య జనంలో అప ప్రచారాన్ని అందుకుంటున్న భావ కవిత్వ స్వరూపాన్ని పలుదృక్కోణాలతో సందర్శించి ఆధు నిక కాలంలో వెలిసిన దేశాభిమాన-సంఘ సంస్కరణాది మహోన్నత భావ ప్రసరణానికి భావ కవిత్వం దోహదం చేసిందని ఈ సిద్ధాంత వ్యాసంలో శ్రీ రెడ్డి గారు నిరూపించగలిగినారు. ప్రాయికంగా ఈ గ్రంథంలో భావ కవితాన్ని గూర్చి పరిశోధన సాగినా కవితా తత్త్వాన్ని గూర్చి అభ్యుదయ కవితా తత్త్వాన్ని గూర్చి సంప్రదాయానికీ ప్రయోగానికీ తెలుగు సాహి త్యంలో జరిగిన సంఘర్షణ సమన్వయాలను గూర్చి చక్కని విశ్లేషణ లున్నవి. శ్రీ రెడ్డిగారు ఉత్తమ కవులు, శబ్దార్థ రహస్య వేత్తలు కావడం వల్ల ఈ గ్రంథం చక్కని వచన ప్రబంధంగా అందమైన పదబంధాలకు కాణాచిగా సుందర వాక్య విన్యాసానికి ఆలవాలంగా సాక్షాత్కరిస్తుంది. భావ కవిత్వాన్ని గూర్చి ప్రచారంలో ఉన్న తెక్కలేని అపప్రథలను ఆయన తుడిచివేసి, సహృదయ దృష్టితో ఆధునిక కవిత్వాభ్యుదయానికి చక్కని భూమికను ఈ సిద్ధాంత వ్యాస రూపంలో నిర్మించి సహృదయ విమర్శకులకు కృతజ్ఞతాపాత్రులైనారు. విశ్వ విద్యాలయాలలో

ఇప్పుడిది పాఠ్య గ్రంథంగా అధ్యేతల అభిమానాన్నీ ఆసక్తినీ చూరగొన గలుగుతున్నది. సామాన్య పాఠకులకు కవిత్వం పట్ల చక్కని అవగాహననూ తెలుగు సాహిత్యంలోని కొత్త పోకడల పట్ల పరిచయాన్నీ ఈ సిద్ధాంత వ్యాసం కలిగిస్తుంది. భాషాభినివేశ మున్నవారికీ భాషాభిమాన మున్నవారికీ సమానంగా విజ్ఞానాన్నీ ఆనందాన్నీ అందించగల సిద్ధాంత వ్యాసాలు ఒకటో రెండో. అందులో ఇది ఒకటి.

భావకవితా రచనలో సిద్ధహస్తు లనిపించుకున్న మహాకవుల కృషిని గూర్చి కొన్ని పరిశోధనలు జరిగినవి. అయితే వాటిలో చాలా మట్టుకు అచ్చు కాలేదు. ఆయా విశ్వవిద్యాలయాలకు వెళ్లి ఆ సిద్ధాంత వ్యాసాల లిఖిత ప్రతులను అధ్యయనం చేసే అవకాశం ఇప్పట్లో లేని కారణాన యథా లభ్యమైన సిద్ధాంత వ్యాసాలను గూర్చి దిఙ్మాత్రంగా వివరిస్తాను.

భావ కవితా సృజనంలో సమున్నత శిఖరాలను అందుకొని, భావకవి అంటే కృష్ణశాస్త్రి అన్న సంకేతాన్ని సంపాదించుకున్న శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారిని గూర్చి పరిశోధన చేసినవారు డా॥ శ్రీమతి నిడమర్తి నిర్మలాదేవిగారు. వీరు 'కృష్ణశాస్త్రి కృతులు- పరిశీలన' అన్న సిద్ధాంత వ్యాసాన్ని 1978 లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించి పి హెచ్. డి. పట్టాన్ని అందుకున్నారు. డా॥ నిర్మలాదేవిగారు తమ గ్రంథంలో కృష్ణశాస్త్రిగారి జీవిత విశేషాలనూ సమకాలిక పరిస్థితులనూ శ్రీ శాస్త్రి గార్పై ఆనాటి సాంఘిక రాజకీయ ఉద్యమాల ప్రభావాలనూ వివరించినారు. కాళిదాసాది సంస్కృత కవులూ, నన్నయ శ్రీనాథాది ప్రాచీనాంధ్ర కవులూ విశ్వకవి రవీంద్రుడూ ఇంగ్లీషు కాల్పనిక కవితా స్రష్టలూ కీట్సు షెల్లీ మున్నగువారూ కృష్ణశాస్త్రి కవితా వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన వైనాన్ని నిర్మలాదేవిగారు సముచితంగా ఉల్లేఖించినారు. ఈ సిద్ధాంత వ్యాసంలో ఒకవిశేష మున్నది. ఆధునిక హిందీ సాహిత్య స్రష్టలూ ఉత్తమ కవులూ జ్ఞానపీఠ అవార్డు గ్రహీతలూ ''ఛాయా వాద'' కవితా ప్రవక్తలూ శ్రీ సుమిత్రానందన్ పంత్ రచనలతో కృష్ణశాస్త్రి రచనలను పోల్చి ఆ ఇరువురు మహాకవులలో కనిపిస్తున్న పోలికలను ఎత్తి చూపడం, పంత్, కృష్ణశాస్త్రి గారలు పరస్పర ప్రభావానికి లోను గాకపోయినా ఇద్దరి భావశబలతలో ఏకీభావాన్ని దర్శించి ప్రదర్శించడం ఈ సిద్ధాంత వ్యాసంలోని విశేషం. కృష్ణశాస్త్రి కవితా సంకలనాలలోని ప్రతి ఖండికనూ వీరు విశ్లేషించి అందులోని కవితా పారమ్యాన్ని వివరించినారు. కృష్ణశాస్త్రి శ్రవ్య, గేయ నాటికలు, సినీ గీతాలు, వచన రచనలు, యక్షగానం, సాహిత్య విమర్శాత్మక వ్యాసాలు, రేడియో ప్రసంగాలు, పత్రికలలో వచ్చిన వ్యాసాలు, సభలలో చేసిన ఉపన్యాసాలు నిర్మలాదేవిగారి పరిశీలనా పరిధిలోకి వచ్చినవి. కృష్ణశాస్త్రి జీవిత సాహిత్య వ్యక్తిత్వాలను గూర్చిన చక్కని అనుశీలనం ఈ సిద్ధాంత వ్యాసంలో జరిగిందని చెప్పడం అత్యుక్తి కాదు. కృష్ణశాస్త్రిని భావ కవితా ద్రష్టగానూ స్రష్టగానూ నిరూపించడానికి ఈ సిద్ధాంత వ్యాసంలో నిర్మలాదేవిగారు చేసిన ప్రయత్నం శ్లాఘాపాత్రం.

శ్రీ బొట్టు భాస్కర చౌదరిగారు 'జాషువ కృతులు-సమాలోచన' అన్న అంశంపై పరిశోధన చేసి 1979 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి పి హెచ్. డి. పట్టాను సంపాదించినారు. ఈ సిద్ధాంత వ్యాసం 1982 లో గ్రంథంగా అవతరించింది. ఏడు ప్రకరణాలుగా పరుచుకున్న ఈ సిద్ధాంత వ్యాసంలో జాషువా పద్య కృతులు, కావ్య ఖండికలు, ఖండ కావ్యాలు, లఘు కావ్యాలు అనే అధ్యాయాలలో శ్రీ చౌదరిగారు జాషువ మహిత వ్యక్తిత్వాన్ని చక్కగా విశ్లేషించి వివరించడానికి సఫల ప్రయత్నం చేసినారు. అన్ని ప్రకరణాలలోనూ శ్రీ చౌదరిగారు తత్త్వాన్వేషణ తత్పరులుగా సాహిత్య వివేచనాదక్షులుగా సత్యగవేషణాభిలాషులుగా దర్శనమిస్తారు. జాషువ కవి జీవిత

విశేషాలను కూడా పొందుపరచి ఆ మహాకవి మహనీయ వ్యక్తిత్వాన్ని చిత్రించి, జాషువా కవిత్వ తత్త్వావబోధకు చక్కని అవతారికను నిర్మించినారు. ఈ సిద్ధాంత వ్యాసంలో శ్రీ చౌదరిగారు అవలంబించిన శైలి సరళం. పండితులకే కాకుండా భాషాభిమానులకందరికీ జాషువ కవితా తపస్సు పట్ల ఆసక్తినీ అభిరుచినీ కలిగించగలుగుతుంది ఈ సిద్ధాంత గ్రంథం. సమకాలిక సాహితీ ప్రపంచాన్ని ఉర్రూత లూగించిన ఒక మహాకవి సాహిత్య వ్యక్తిత్వాలను ఆర్ద్ర మనస్కతతో పరిశోధనా ప్రమాణాలకు క్షతి కలుగకుండా నిర్వహించి చరితార్థులైనారు శ్రీ చౌదరిగారు.

శ్రీ అనుమాండ్ల భూమయ్యగారు 1980 లో కాకతీయ విశ్వవిద్యాలయంలో 'నాయని సుబ్బారావు కృతులు-పరిశీలన' అనే విషయాన్ని గూర్చి పరిశోధన చేసి సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించి పిహెచ్.డి. పట్టాను అందుకున్నారు. 1981 లో ముద్రణ పొందింది ఈ వ్యాసం. డా. భూమయ్యగారు నాయని సుబ్బారావు గారిని ఉత్తమ భావకవిగానే దర్శించినారు. కనుకనే ఆ గ్రంథారంభంలో నాయనివారి జీవిత విశేషాలను వివరించిన తరువాత 'ప్రణయవాహిని' అన్న శీర్షిక కింద భావకవితోద్యమ ప్రాదుర్భావ స్వరూప స్వభావ వికాసాలను గూర్చి రేఖామాత్రంగా వివరించినారు. ఏడు అధ్యాయాలుగా విస్తరిల్లిన ఈ సిద్ధాంత వ్యాసంలో నాయనివారి రచనలన్నిటిని పేర్కొని, వాటిలోని వైశిష్ట్యాన్ని కవితా తత్త్వాన్ని విశదీకరించినారు. డా. భూమయ్యగారు నాయని సుబ్బారావు గారితో ప్రత్యక్షంగా సంభాషించి, అనేక విషయాలను సేకరించి వాటిని అనుబంధంలో చేర్చిచూపడం ఒక విశేషం. సుబ్బారావు గారి కవితాత్మను మరింత సన్నిహితంగా సందర్శించాలనే ఆకాంక్షతో డా. భూమయ్య గారు నాయనివారి సన్నిహితులను ఎందరినో కలిసి కొని వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను కూడా ఈ సిద్ధాంత వ్యాసంలో అనుబంధాలుగా చేర్చడంవల్ల ఎంతో ప్రయోజనం సమకూరిందని చెప్పవచ్చు. ప్రణయ కవితాతత్త్వాన్ని అందులోనూ కులపాలికా ప్రణయతత్త్వాన్ని కవితాత్మకంగా ప్రదర్శించిన నాయని సుబ్బారావు సాహిత్యసందర్శనం చాలా ఆర్ద్రంగా డా. భూమయ్యగారు నిర్వహించినా రన డంలో సందేహం ఉండవలసిన పనిలేదు. సిద్ధాంత వ్యాసం పండితులకే కాదు అందరికీ పఠనీయమే అన్న అభిప్రాయం కలుగుతుంది ఈ గ్రంథం చదివిన తర్వాత. దీనికి కారణం ఇందులోని భాష, విషయ విన్యాసం.

భావకవితావిహాయసంలో ధృవతారలుగా వెలిగిన కవుల కృతులను గూర్చి పరిశోధన జరిగింది. అయితే ప్రక్రియాపరంగా కాకుండా ఆయా కవుల ఆయా కావ్యాల అధ్యయనం వరకే పరిమితమయి పోవడంచేత ఈ పరిశోధనా ఫలితాంశాలు కూడా పరిమితంగానే ఉన్నవి. 1979 నుంచి 1983 సంవత్సరాలలో భావకవులను గూర్చి వారి గ్రంథాలను గూర్చి విశ్వవిద్యాలయాలలో పిహెచ్.డి, ఎం.ఫిల్. డిగ్రీల కోసం పరిశోధకులు చక్కని కృషి చేసినారు. నాకు వాటిని చూసే అవకాశం ఇప్పట్లో లేదు. కనుక దిఙ్మాత్రంగా సూచన చేస్తాను.

1978 లో శ్రీ గుడిమెళ్ల భావనారాయణాచార్యులు గారు 'జాషువ కృతులు - సంప్రదాయం - నవ్యత' అనే అంశంమీద ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించగా, 1980 లో శ్రీ మైనేని శేషగిరిరావు గారు 'జాషువ ఫిరదౌసి- సమగ్ర పరిశీలన' అనే విషయంపైన పరిశోధనచేసి నాగార్జున విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించినారు.

1978 లో శ్రీ చిత్రా రఘుపతిరెడ్డి గారు 'తెలుగులో స్మృతికావ్యాలు' అన్న అంశాన్ని తీసికొని సిద్ధాంతవ్యాసాన్ని రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించినారు.

1979 లో మిట్టపల్లి ప్రమీలగారు 'సందేశ వాక్యాలు - విశ్వనాథ నవ్యత' అనే అంశాన్ని, శ్రీభాగవతుల శ్రీనివాస సుబ్రహ్మణ్యసాయి 'విశ్వనాథ దేశభక్తి కవిత్వం' అన్న అంశాన్ని పరిశోధించి సిద్ధాంత వ్యాసాలను రచించి అనంతపురం పి.జి. సెంటరుకు సమర్పించినారు. 1980 లో సి. హెచ్. సుశీలమ్మగారు 'కిన్నెరసాని పాటలు - సమీక్ష' అనే అంశాన్ని ఉద్దేశించి నాగార్జున విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసాన్ని అందజేసినారు.

1979 లో శ్రీ జి. చెన్నకేశవులు నాయుడు గారు 'సౌందరనందము - ఒక పరిశీలన' అనే విషయంపై పరిశోధనచేసి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించినారు. వి. ప్రభావతిగారు 'కాటూరివారి కవితాత్మ'ను గూర్చి పరిశోధించి సిద్ధాంత వ్యాసాన్ని నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధనకు టి. వరలక్ష్మిగారు 1980 లో 'సౌందరనందము - పింగళి - కాటూరి' అన్న అంశాన్ని ఎన్నుకున్నారు.

'జంధ్యాల పాపయ్యశాస్త్రి రచనలు - సమగ్ర పరిశీలన, అనే అంశంపై పరిశోధన చేసి 1980 లో శ్రీ దీక్షితుల సత్య వేంకట సుబ్రహ్మణ్యం బనారసు హిందూ విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసాన్ని అందించినారు.

నండూరి వారి 'ఎంకి పాటలు' గూర్చి శ్రీ ఎస్. రాంబాబు నాగార్జున విశ్వవిద్యాలయంలో 1981 లో పరిశోధన చేసినారు.

'రాయప్రోలు జీవితం - సాహిత్యం' అన్న అంశంపై 1981 లో సీతాల రంగమణిగారు కృషి చేసి ఒక పరిశోధనా వ్యాసాన్ని కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించగా, శ్రీమతి ఎం. లావణ్యా సరస్వతిగారు 1983 లో 'రాయప్రోలువారి రచనల పరిశీలన-తత్త్వ వివేచన, అన్న విషయంపై సిద్ధాంత వ్యాసాన్ని రచించి హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయానికి సమర్పించినారు.

1982 లో 'వేదులవారి దీపావళి - ఒక పరిశీలన' అనే అంశంపైన పి. వసుంధరాదేవిగారు హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసాన్ని రచించినారు.

యధా లభ్యమైన సామగ్రిని ఆధారంగా చేసుకుని భావ కవిత్వంపై జరిగిన పరిశోధనల తీరు తెన్నులనూ భావ కవుల రచనలపై జరిగిన పరిశీలనాత్మక కృషినీ రేఖామాత్రంగా వివరించడానికి ఈ వ్యాసంలో నేను ప్రయత్నం చేసినాను.



# అభ్యుదయ కవిత్వంనుండి నేటివరకు కవితాధోరణులు - పరిశోధన

—ఏటుకూరి ప్రసాద్

కవులనూ-కవిత్వాన్నీ అంచనా వెయ్యటం అంత తేలికైందేం కాదు. పడికట్టు రాళ్ళు కష్టం. నాలుగు దశకాల్లో తెలుగుకవిత్వం పోయిన పోకళ్ళను ధోరణులను దృష్టిలో పెట్టుకునే వివరించటానికి ప్రయత్నించాను. కవులపరంగా వారి కవితలను ఉదాహరిస్తూ పోతే నే నెక్కడ తేలగలనో చెప్పలేను. అందుకని కొందరు ప్రసిద్ధులు ఇందులో కనిపించకపోవచ్చు. అలా అని వారిని ఉపేక్షించానని కాదు. ఆయా ఉద్యమాలు వాటి వెనుక ఉన్న తాత్త్విక, రాజకీయ ధోరణులను వివరిస్తూ అవి ఎలా కవిత్వంలో ఏ స్థానంలో ఉన్నాయో స్థూలంగా చెప్పడానికి ప్రయత్నించాను.

## 1

"కోయ్య బొమ్మలు మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా ?!"

అంటూ తను కవిత్వంతో గీస్తూన్న సాధారణ మానవ చిత్రాలను చూసి ఈసడించే జనాన్ని వ్యంగ్యంగా ఓ దెబ్బ కొట్టాడు గురజాడ. తాను తొక్కుతున్న కొత్త పుంతను గూర్చి ఓ చోట "నా నేర్పు కొలది నేనొక కొత్త తోవ తొక్కితిని. తప్పేమి? నలుగురూ ఆమోదించిరా నేను కల్పించిన వృత్తములను అవలంబింతురు. ఆమోదింపరా పరిత్యజింతురు" అంటారు గురజాడ. తన సాహితీ కృషిలో గత కాలపు సాహిత్య సంప్రదాయాల మీద దెబ్బకొట్టడం ఓ ధ్యేయంగా భావించారు. అలా నా డెగరేసిన తిరుగుబాటు జండా నేటిదాకా అనేకులు అందుకొని ముందుకు సాగిపోతున్నారు. 1910 కాలానికున్న సామాజిక పరిస్థితుల్లో గురజాడ సాహితీ పెత్తందారీతనం మీద దుమారం లేవదీశాడు. దీన్నే మనం "లిటరరీ ఫ్యూడలిజం" అనొచ్చు. ఒక సవిమర్శక వాస్తవికతావాదిగా తన చుట్టూ ఉన్న సమాజంలోని చేడుగుని చూసి దాన్ని నలుగురి దృష్టికి తేగల్గటం వరకే ఆయన చేయగల్గాడు.

రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభానికి ముందు ప్రపంచంలోని ఆర్థికమాంద్యం మానవ జీవితాలనూ, విలువలనూ, సంప్రదాయాలనూ కుళ్ళబొడిచి వదిలింది. కళాకారులూ, సాహితీవేత్తలూ అంతులేని నిరాశా నిస్పృహలకు గురయ్యారు. కళాత్మక విలువలపై నమ్మకాలు సడలటం, అనుమానాలు రేకెత్తటం ఆరంభమయ్యాయి. డాడాయిజం (1918), ఇమేజిజం (1917), సర్రియలిజం (1924), సింబాలిజం, క్యూబిజం వంటి ధోరణులు చిత్ర శిల్పకళల ద్వారా ఆరంభమై సాహిత్యంలో కూడా చోటు చేసికొన్నాయి. సమాజాన్ని ఓ స్పష్టమైన శాస్త్రీయమైన రాజకీయ అవగాహనతో అంచనా వెయ్యటం చేతకాకపోవటం వల్లే పైలాటి అసందర్భ ధోరణులు తలెత్తటానికి ఆస్కారం కల్గింది. సరిగ్గా ఇదే కాలంలో ఆడెన్ నాయకత్వాన వామపక్షీయులు, అంటూ ఓ వర్గం పొడసూపింది. పెట్టుబడిదారీ శక్తుల పెత్తనంతో మెడలు కుంగిపోతున్న సమకాలీన మానవుని విముక్తికి

మార్క్సిజమే చక్కనిమందని ఆడెన్ వర్గం స్పష్టంగా చెప్పింది. వీళ్ళు 'న్యూ సిగ్నేచర్స్' అన్న కావ్య సంపుటిని 1932 లో ప్రకటించి సాహితీ లోకంలో పేరుకొన్న స్తబ్ధతకు షాక్ ట్రీట్ మెంటిచ్చారు. ప్రపంచ రాజకీయాలలో ఫాసిజం, నాజీజంలు చెట్టాపట్టా లేసుకొని ప్రపంచాన్ని కబళించటానికి వస్తున్నాయి. అప్పుడప్పుడే జిలిబిలి నడకలు నేరుస్తున్న సోషలిస్టు ప్రపంచం అంటే కళ్ళు కుత్తున్నాయి. పెట్టుబడిదారీ దేశాలు కూడా సోషలిస్టు వ్యవస్థను పెరగకుండా మొగ్గలోనే తుంచడానికి తన వంతు కోసం ఎదురు చూస్తున్నాయి. వలసదేశాలు విముక్తిపోరాటాల్లో మునగానాం తేలానాంగా ఉన్నాయి. అయినా సోషలిస్టు గాలులు మలయానిలాల్లా వీళ్ళ గుండెలకు తాకుతూనే ఉన్నాయి. తామెటు స్పందించాలో ఖచ్చితంగా తేల్చుకోలేకపోయినా దేన్ని ద్వేషించాలో తేల్చుకోగల్గాయి.

సరిగ్గా అలాంటి దశలో 1935 నుండి అభ్యుదయ రచయితల ఉద్యమా విర్భావానికి సన్నాహాలు మొదలయ్యాయి. అభ్యుదయ సాహిత్య కేంద్రం పారిస్‌లో మొదలైంది. లండన్‌లో ఉండే భారతీయ రచయితలూ మేధావులూ మార్క్సిజాన్ని అధ్యయనం చేస్తూ 'ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్' ఏర్పాటు చేశారు. 1936 ఏప్రిల్ 10న లక్నోలో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం మొదటి మహాసభ ప్రేంచంద్ అధ్యక్షతన జరిగినది. పెట్టుబడిదారీ విధాన నిరసనం, సామ్రాజ్యవాద వ్యతిరేక విధానం ఈ సంఘానికి ఆయువు పట్టని ప్రేంచంద్ ఉద్ఘాటించాడు. భారత దేశంలోని అన్ని రాష్ట్రాల్లోనూ ఈ అభ్యుదయ రచయితల ఉద్యమం ఉవ్వెత్తున సాగింది. తెలుగునాట 1943 నాటికిగానీ ఇది ఒక నిర్మాణ రూపాన్ని సంతరించుకోలేక పోయినది. మొదటి మహాసభ శ్రీ తాపీ ధర్మారావు అధ్యక్షతన తెనాలిలో జరిగింది.

అయితే అంతకు ముందునుండే గురజాడ వారసులుగా శ్రీశ్రీ తదితరులు తమ రచనల్లో అభ్యుదయ భావబీజాలు మొలకెత్తించడం ఆరంభించారు. భావకవిత్వపు బంధనాలు తెంచుకోటం ఆరంభించిన అనేకులు తమ కవిత్వాన్ని నిర్వచించడం మొదలెట్టారు. శిష్టా తన 'నవమి చిలుక' లో ఇది పూర్వ కవిత్వం గాదు. ఇది నవ్య కవిత్వం గాదు. ఇది భావ కవిత్వం గాదు. ఇది నూతనములో బహు నూతన కవిత్వం' అంటూ తనది ''ప్రాహ్లాద కవిత్వం'' అని నామకరణం చేసుకున్నాడు (1938). అలాగే పఠాభి తన 'ఫిడేలు రాగాలడజన్' లో అనుసరిస్తాను నవీన పంథా, కానీ భావకవిని మాత్రము కాన్నే 'నేనహంభావ కవిని' అన్నాడు. పరువులు భావకవులు కూడా ఈ కొత్త తరంలో తమ జాగా కోల్పోతామేమోనన్న భయంతో ఈ ఉద్యమ భావాలను ఆహ్వానించి కవితల్లారు. జాషువా, తుమ్మల, కృష్ణశాస్త్రి వాళ్ళకోవలో వాళ్ళు.

మనస్ఫూర్తిగా ఉద్యమంతో మమేకమైన పలువురు తమ భావకవిత్వం బంధాలనెలా తెంపుకొని అభ్యుదయ ఉద్యమంలో చేరారో శ్రీరంగం నారాయణబాబు మాటల్లో చూడవచ్చు. వీరందరూ ఈ ఉద్యమంలోకి వచ్చేనాటికి భావకవిత్వంలో ప్రయోగాలు చేస్తున్నవాళ్ళే.

''భావ కవిత్వపు పోకడలు జీర్ణం చేసుకుని కొంతవరకు మేము రచనలు సాగించాము. ఆ ఫణితిని రచన సాగించిన దినాలలో కూడా ససిలేకుండా, నీరసంగా, చేయవలసిన రచన ఇది కాదూ అని తెలిసి కూడా- గత్యంతరం లేక, కనులకు పొరలు కమ్మితే కావ్యరచన సాగింది'' అన్నారు నారాయణబాబు. ఆ పొరలు విడటానికి సామాజిక పరిస్థితులు తోడ్పడ్డాయి. ప్రపంచ రాజకీయ పొందికలు మారిపడ్డాయి. జనం తమ ఆశలను కళ్ళముందు నిల్పుకోటానికి చేస్తున్న పోరాటాలూ, వాటి వెనుక ఉన్న మార్క్సిజం తాత్వికతా నాటి కవులను కొత్త పుంత తొక్కేలా చేశాయి.

క్రమంగా తెలుగు నాట రాజకీయ పెత్తందారీతనం అధికారం చెలాయించటం ఆరంభమైంది. ఆశించిన ఫలితాలు పాలకులు ప్రజల కందించలేకపోతున్నారు. ప్రధానంగా దేశంలో జమీందారీల రద్దును ఆశించిన జనానికి నైజాం ఓ నాజీముష్కరుడుగా ఎదురయ్యాడు. తెలుగులందరూ ఒక నీడ నుండటానికి అడ్డంకిగా మారాడు. పోరాటం తప్ప మరో దారి కన్పించని ప్రజలు భూమి కోసం, భుక్తి కోసం సాయుధులై తిరగబడ్డారు. రచయితలూ కలం- కత్తీపట్టి పోరాట శ్రేణుల్లో నిలిచారు. అభ్యుదయ రచయితల ఉద్యమం పోరాటం ఊపిరిగా నిలబడింది. సామాన్యు లెందరో ఆ పోరాటం ఇచ్చిన ఉత్తేజంలో రచయితలయ్యారు.

ఇలా 1955 వరకు సాగిన అభ్యుదయ రచయితల ఉద్యమం గతంలో ఉన్న ఊపును నిలబెట్టుకోలేకపోతూ 1960 దాకా నత్త నడక నడిచింది.

కుందుర్తి నాయకత్వాన వచన కవిత్వం మధ్యతరగతి కవుల ఉద్యమంగా 1956 తర్వాత మొదలైంది. ఫ్రీవర్స్ ఫ్రంటులో పలువురు అభ్యుదయాంశతో వచన కవిత్వం అల్లడం ఆరంభించారు. ఇది ఉద్యమం కాగలదా? అంటూ చర్చోపచర్చలు నాటినుండీ నేటివరకూ కొనసాగుతూనే ఉన్నాయి. ఇందులో మార్క్సిజంభావా లున్నవాళ్ళు ఉన్నారు. లేనివాళ్ళు ఉన్నారు. వచన గేయం, వచన పద్యం, వచన కవిత అంటూ రకరకాల పేర్లూ వ్యాప్తిలో కొచ్చాయి. పారిశ్రామిక యుగ ధర్మానుగుణంగా ఈ వచన కవిత్వం వచ్చిందని శ్రీశ్రీ దాన్ని సూత్రీకరణతో మరింత బలపర్చాడు. దీనికుండే లక్షణాలమీద శేరా, సంపత్కుమార, అతిపిరాలవంటి వారనేకులు చర్చించారు. అయితే అభ్యుదయ రచయితలు పాటలూ వచన కవితలూ రెంటినీ సమాదరించారు. వారి దృష్టిలో రీతి ఎప్పుడూ ఉద్యమంగా తలెత్తదు.

వామపక్ష భావాలున్న రచయితల్లో 1962 తర్వాత కొంత సంచలనం కలిగింది. రాజకీయాల ప్రభావంతో రచయితల్లో పొందిక ఏర్పడటం ఆరంభమైంది. అభ్యుదయ రచయితల సంఘంకూడా నేడున్న సామాజిక పరిస్థితుల్లో ఆటుపోట్లకు గురైంది. నిర్మాణ రీత్యా పటుత్వం సన్నగిల్లింది. దీంతో రచయితల్లో వివిధ ధోరణులు తలెత్తాయి. ఉద్యమాలు ఉధృతంగా ఉన్నంతకాలం, పోరాటాలు చేస్తున్న జనాలమధ్య రచయితలున్నంతకాలం పొడసూపని కొన్ని ధోరణులు కనపడసాగాయి.

1965లో ఆరంభమై, 1968 వరకు దిగంబర కవితోద్యమం సాగింది. నగ్నముని, నిఖిలేశ్వర్, చెరబండరాజు, జ్వాలాముఖి, భైరవయ్య, మహాస్వప్న వీరారుగురూ ఈ ఉద్యమం. పాత విలువల్ని ప్రశ్నించడం, వాటి డొల్లతనాన్ని బయటపెట్టడం, పూర్వపు కవిత్వపు పద్ధతుల్ని నాశనం చేయడం వీరి లక్షణంగా కన్పిస్తుంది. కవితలకుంచిన పేర్ల నుండీ వారి పేర్ల వరకూ కొత్తదనంతో జనం ముందుకొచ్చారు. తమకు అంగీకారం కాని వాటిని బండబూతులు తిట్టారు. వీరి తాత్వికతకు ప్రేరణ పాశ్చాత్య దేశాల్లోని అనేక సాహిత్యోద్యమాలూ, బ్రిటన్‌లో వచ్చిన యాంగ్రీ యంగ్‌మన్ ఉద్యమాలవంటివీ కన్పిస్తుంది. నేటి సమాజాన్ని వీరు కుష్ఠువ్యవస్థ అన్నారు. రష్యాలో 19వ శతాబ్దంలో వచ్చిన నిహిలిస్టు భావాల్లో ఉన్న వాటినే వీరూ ఆశించారు. అయితే దిగంబర కవులు వ్యక్తిస్వేచ్ఛవల్ల సమాజం బాగుపడుతుందనీ దానికి ఆర్థిక వ్యత్యాసాలు పోవాలనీ అన్న భావాలనూ జోడించారు. ఈ ఉద్యమాన్ని పలువురు పలుకారణాలుగా విమర్శించారు. కొడవటిగంటి "వాంతి చేసుకునే వాణ్ణి చూసి ఎవరూ వాంతి చేసుకోరని" సున్నితంగా అన్నారు. తొలి దశలో దిగంబర కవుల్లో స్పష్టమైన రాజకీయ అవగాహన లేదు. మార్క్సిజాన్ని ఓ చోట అంగీకరిస్తూ మరోచోట నియంతృత్వానికి మార్గమైన మార్క్సిజం తమ మార్గం కాదన్నారు. ఏదేమైనా దొడ్డైన ప్రధానమైన విపర్య అశ్లీల శబ్దాలను సంకేతాలుగా

వాడారని. వీరి కవిత్వం అంగీకరిద్దామనుకొన్న వాళ్ళలో కూడా అశ్లీలాలు పంటికింద రాళ్ళయ్యాయి. రాజకీయ భావాల పరిపక్వత లేకపోవడంతో కొంచ రికీ, అశ్లీల భావాలున్నాయంటూ కొందరికీ, సౌందర్యం లేదని మరి కొందరికీ దిగంబర కవులు కొరకరాని కొయ్యలుగా మిగలారు. అయితే వీరిలో సమాజం మారాలన్న ఆకాంక్ష మీదున్న నిజాయితీని చాలా కొద్దిమందే శంకించారు. యువకులు అనేకులు సాహిత్యానికి వీరు షాక్ ట్రీట్‌మెంటిచ్చారన్నారు. అయితే కొందరు విమర్శకులు ఆ ట్రీట్‌మెంటుకు దక్కింది పేషెంటేనని పెదవి వివరించారు. అయితే ఎంత ఉద్వేగంతో వచ్చిందో అంత ఉద్వేగంతోనే అతిత్వరలో మూడు సంపుటాలతో చల్లారింది. ఈ ఉద్యమం రాక ముందే ఈ కవుల్లో కొందరు కవులుగా కొన్ని వచన కవితా సంపుటాలు వెలువర్చారు. కొందరికి రాజకీయ వాసనలున్నాయి. వాళ్ళే ఈ ఉద్యమం చల్లారినా మరో ఉద్యమంలో నిలబడగల్గారు.

ఈ కాలంలోనే వీరిచ్చిన ఉత్సాహంతో సుగం బాబు, కిరణ్‌బాబు, దేవీప్రియ, కమలాకాంత్, ఓల్గాలు కల్సి పైగంబర కవులుగా రెండు కవితా సంకలనాలు తెచ్చారు. సమాజం రోగపూరితమైపోయిందనీ, దీన్ని బాగుచెయ్యటం తమ కవిత ఆశయమన్నారు. కొత్తలో యువకులు కొందరు వీరికి ఆహ్వానం పల్కటం జరిగింది. కేవలం మానవత్వం ఆధారంగా వచ్చిన ఈ ఉద్యమం చాలా త్వరగా అంతరించింది. వీరికీ రాజకీయ అవగాహన కొరవడ్డ సంగతిని కవితా సంపుటులు వివరిస్తాయి. పెద్ద అలజడి కలిగించకుండానే ఈ కవులు విడిపోయారు. ఇందులో దేవీప్రియ లాంటివా రే ఇద్దరో కవులుగా ఇప్పుడూ కన్పిస్తారు.

కాస్త సంయమనంతో, ఆవేశంతో, అశ్లీలాల జోలికి పోకుండా రాసింది తిరగబడు కవులు. వరవరరావు, లోచన్, ఎక్స్‌రే, కిషన్, సంజీవరావు, సుధాకర్, సువర్ణ్, యాదగిరిరావు, అశోక్‌లు. వీరికి కొంతవరకూ రాజకీయ స్పష్టత ఉన్నట్టు కన్పిస్తుంది. సమాజంలో జరుగుతున్న దోపిడీని ఎదిరించాలనీ, దీనికి గురౌతున్న జనమే సాయుధంగా తిరగబడాలనీ అన్నారు. సామ్యవాద సమాజ నిర్మాణం వీరి ధ్యేయమన్నారు. అందుకు శస్త్రచికిత్సలూ కావాలి, త్యాగాలూ అవసరం అన్న భావం వీరిది. జనాన్ని పోరాటాల జోలికి పోనీయకుండా మతాన్నీ, మూఢ విశ్వాసాలనూ పాలకవర్గం ఉపయోగిస్తున్నదని ఈ తిరగబడు కవులు వెల్లడించారు. అందుకే జనాన్ని దోపిడీగాళ్ళ శాసనాల మీద తిరగబడమని పిలుపిచ్చారు. వీరి ఆవేశంలో నిజాయితీ ఉంది. అయితే కవితలు చాలా రాజకీయోపన్యాసాలలా ఉండటంతో అంతగా నిలబడలేకపోయాయి. తానీ చెప్పిన అంశాలు జనానికందేవి కావటంతో తమకోస్థానాన్ని కల్పించుకోగల్గారు వీరు.

ఈ విధంగా ఒక కోవ రాజకీయాలతో రంగరించి కవితా వ్యవసాయం సాగిస్తూంటే మరో పాయ వేరే ధోరణితో సాగింది. అదే చేతనావర్తం కవుల ధోరణి. సుప్రసన్న, పేర్వారం జగన్నాధం, సంపత్కుమార, నరసింహారెడ్డి తమ కవితా సంకలనం 'చేతనావర్తం' 1967లో వెలువర్చారు. వచన కవిత్వంలో అభ్యుదయ భావాలూ, భక్తి, తాత్త్వికచింతన లాంటి అనేకమైన వాటిని కలగలపి అందించారు. మానవుడు తనలోకి తాను చూసుకుని క్రమంగా సమాజ చైతన్యంలోకి గమనం సాగిస్తాడనీ, కనుక తమది ఆ చేతనావర్తనమనీ అన్నారీ కవులు. మానవత్వం ప్రధానంగా వీరి సామూహిక కవితల్లో కనిపిస్తుంది. ప్రగతివాద కవి మార్క్సిస్టు అయివుండాలన్న నియమమేం లేదన్నారు. అయితే వీరి సింబల్స్, భావాలూ అందుకోటం సామాన్య పాఠకులకు తేలిక కాదు. వీరిలో ఒకే రకమైన తాత్త్విక అవగాహన కనిపించదు. ప్రజాస్వామ్యవాదులుగా కనిపిస్తారు 'చేతనావర్తం' ముందూ, ఆ తర్వాతా ఈ కవులు వేర్వేరుగా తమ కవితా సంపుటాలు వేసుకున్నారు.

కొందరు వ్యక్తులుగా మిగిలారు. మరికొందరు నేలను వదిలి గాలిలో సాము సాగిస్తున్నారు. ఇదీ త్వరలోనే అంతరించింది. కలిసికట్టుగా మరో సంకలనం వెలుగు చూడనేలేదు.

ఏ సాహితీ మార్గానికీ చెందకుండా ఉన్న వారిలో కొందరు అనుభూతివాద కవులుగా కనిపిస్తారు. భావ కవిత్వం అనుభూతి ఆధారమైంది. దీనికి మరికొంత సమాజంలోని సమస్యలను కలిపి కవి అనుభవంలోకి వచ్చిన వాటిని కవిత్వ పరంగా అందించటం వీరి లక్ష్యం. రాజకీయ వాసన ఉండక్కర్లేదనీ, కవిత్వం కోసమే కలం పట్టాలనీ, సిద్ధాంతాల పునాది అనవసరమనీ ఈ రకం కవుల అభిప్రాయం. ఇంద్రగంటి లక్ష్మీకాంత శర్మగారు దీన్ని ఓ విధంగా వెలామణిలోకి తెస్తున్నారు. కొత్త భావ చిత్రాలను వీరి కవితల్లో చూడవచ్చు.

అభ్యుదయ రచయితల ఉద్యమం తన నిర్మాణాన్ని పటిష్ఠం చేసుకొని 1955-1972 ల మధ్య ఇలా అనేక ధోరణులు ముందుకొచ్చాయి. ఒక ధోరణికి చెందకుండా కూడా అనేకులు కవిత్వం రాస్తున్నారు. అయితే దేశంలో వచ్చిన సామాజిక పరిణామాలను రాజకీయ పరిణామాలనూ ఆసరాగా చేసుకొని 1970 లో వచ్చిన విప్లవ రచయితల ఉద్యమాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి.

కమ్యూనిస్టు పార్టీ చీలిక అరవై దశకంలో ఏర్పడింది. అంతర్జాతీయంగా విప్లవకేంద్రా లేవి ? యుద్ధం అనివార్యమా? కాదా? అన్న అంశాలతోబాటు అనేకానేక సమస్యలు ఇందులో ఇమిడి ఉన్నాయి. దేశంలోని పాలక వర్గాన్ని అంచనా వేయటంలోనూ, విప్లవ శక్తులు ఏవి ? అన్న సమస్యలోనూ, ప్రస్తుత దశలో విప్లవంలో ప్రజలు నిర్వహించాల్సిన రాజకీయ పోరాట ఎత్తుగడల సమస్యల్లోనూ ఈ భేదాభిప్రాయాలు స్పష్టమయ్యాయి. రాజకీయంగా నక్సల్‌బరీ ఊపుతో ఆరంభమైన తాత్త్విక భావనతో 1970 లో విప్లవ రచయితల సంఘం ఏర్పడింది.

అభ్యుదయ రచయితల ఉద్యమాన్ని మరింత శక్తిమంతంగా నడపటాని కుద్దేశించిన సదస్సులో పాల్గొనాలని వచ్చిన శ్రీశ్రీ దీనిలో చేరాడు. దిగంబర కవుల్లో కొందరు, అరసంలో అప్పటివరకూ నాయకత్వ పాత్ర నిర్వహిస్తున్న కొందరూ, తిరగబడు కవుల్లో కొందరూ, నక్సల్‌బరీ రాజకీయాలను బల పరుస్తున్న కొందరూ ఇందులో చేరారు. సాయుధ పోరాటం లక్ష్యం అన్నారు. వర్గ శత్రు నిర్మూలనం కావాలన్నారు. ఇది దీర్ఘకాల పోరాటం అన్నారు. పల్లెలనుండి పట్టణాల కన్నారు.

యువకుల్లో సహజంగా ఉండే అడ్వెంచరిజం, సమకాలీన సమాజం వమకు నిరుద్యోగం, నిరాశా, నిస్పృహలు తప్ప మరేవీ అందించలేక పోవడం గమనించిన యువ కవులు పలువురు దీని ప్రభావం లోకి వచ్చారు. ఎక్కువ మంది వచన కవిత్వం రాసేవారే ఇందులో ఉండేవారు. ఆదిలో వచన కవిత్వాన్నే ఆరాధించిన వీరు క్రమంగా పాటలు-గీతాలు రాయటం ఆవశ్యకమన్న భావంలోకి వచ్చారు.

అప్పటికే 1970 నుండి అరసంలోని కవులూ రచయితలూ వ్యక్తులుగా పాటలు, కవితలూ జన చైతన్యానికి ఉపయోగిస్తున్నారు. దీని పునరుజ్జీవనంలో గజ్జెల మల్లారెడ్డి, రాంభట్ల, అనిసెట్టి, సోమసుందర్ తదితరులు కృషి చేస్తున్నారు. ఖచ్చితమైన కమ్యూనిస్టు తాత్త్విక పునాది ఉన్న రచయిత ఏదోఒక రీతిని పట్టుకొని పాకులాడాడనీ, జన చైతన్యం లక్ష్యం కనుక అన్ని రీతులనూ చేపడ్తాడనీ వీరు ప్రచారం సాగించారు. రీతివాదం అప కవిత్వంలో వచ్చినా రాజకీయంలో కనిపించినా మార్క్సిస్టు వ్యతిరేకతా ధోరణిగా వీరు ఈసడించారు.

విరసం క్రమంగా ఒక్కో మహాసభ జరుపుకుంటూ వస్తూ తమలో రాజకీయ విభేదాల ఆధారంగా చాలా గ్రూపులుగా వ్యవహరించటం ఆరంభించింది. విరసంలో చేరిన ప్రముఖులు కూడా అది చేసిన

తీర్మానాలకే కట్టుబడని స్థితి ఏర్పడింది. నక్సలైట్ రాజకీయాల్లో వచ్చిన గ్రూపులన్నీ విరసంలో నిర్వహిస్తున్న తమ తమ గ్రూపులను మెల్లిగా తప్పించుకుంటూ వేర్వేరు రచయితల సంఘాలుగా ఏర్పడ్డాయి. అందులో నిఖిల్, జ్వాలాముఖులతో ఏర్పడ్డ జన సాహితీ సాంస్కృతిక సంఘం ప్రధానమైంది. ఇది కూడా చివరకు రెండుగా చీలింది.

వీరందరూ వర్గశత్రు నిర్మూలనం మీదా, విప్లవ కార్యాచరణను సూత్రీకరించే అంశం మీదా, పాలకవర్గాన్ని అంచనా వేయటం దగ్గిరా, కార్మిక వర్గాన్ని అంచనా వేయటం దగ్గిరా విభేదించారు. వీరి కనుబంధంగా ఉన్న సాంస్కృతిక దళాలు కూడా ఇన్ని చీలికలకూ గురయ్యాయి. ఇదికాక యువ రచయిత లనేకులు పాలకవర్గంమీద కసినీ, సమాజం మారాలన్న కాంక్షనూ, దోపిడీ ఏ రంగంలోనైనాసరే ఉంటే దాన్ని ఎదిరించాలన్న ఆశనూ వ్యక్తపరుస్తూ విరసంలో ఉన్నా అరసంలో ఉన్నా లేకుండానూ తమ రచనల్లో ప్రతిబింబిస్తున్నారు.

విరసం 'ఝంఝ', 'మార్చ్', 'లే' వంటి అనేక కవితా సంకలనాలను తెచ్చింది. వీటన్నిటిలోనూ ప్రధాన సూత్రం సాయుధ పోరాటం. చెరబండరాజు లాంటి కవులూ, శివుడులాంటి వాళ్ళు వచన కవితా మార్గం నుండి దీన్ని గేయం మార్గానికి తిప్పారు. అప్పటికే అరసం కవులు పాటలతో జనం మధ్య ప్రజానాట్యమండలి ద్వారా పోరాటాన్ని నిర్వహిస్తున్నారు. శ్రీకాకుళం పోరాటం సన్నగిల్లటంతో, చైనాలో గందరగోళం ఏర్పడడంతో తెలుగు నాట వామపక్ష రాజకీయాలు చీలికలు కావటంతో విరసం తగ్గుముఖం పట్టింది. ఎటూచేరని కొందరు రచయితలు వీరి నిజాయితీకి జోహార్లన్నవాళ్ళు ఈ చీలికలతో విసుగుపుట్టి దాని ప్రభావం నుండి తప్పుకున్నారు. ఈనాడు మార్క్సిజం ఓ డ్రాయింగ్ రూంలో అలంకరించవలగిన బొమ్మగా భావిస్తున్నవారున్నారు. ఆలాటి వాళ్ళూ కొన్ని మేనిఫెస్టోలతో జనం ముందుకొచ్చారు. అదే కవిసేన.

గుంటూరు శేషేంద్ర శర్మ భావ కవిత్వపు పరదాలోంచి చూస్తూ మార్క్సిస్టునని భ్రమిస్తున్న వ్యక్తి. 1977 లో కవిసేనను ఏర్పాటు చేశాడు. రచయితల సంఘాల్లో రాజకీయ నాయకులు అగ్రాసనాధిపత్యం వహిస్తున్నారనీ కవికే నాయకత్వం కావాలని తమ కోరికనీ అన్నారు. ఆర్థిక, రాజకీయ సమస్యలకు మార్క్సిజం అంతిమ పరిష్కారంగా తమ ఉద్యమం అంగీకరిస్తుందన్నారు. నేటి కవిత్వం "శిల్ప రహిత అకవిత్వ"మన్నారు. వీరు కొన్ని పోస్టర్ కవితలను కూడా ప్రచురించారు. యువతరంలో కొందరు వచన కవులు దీన్ని ఆదరించినా ప్రసిద్ధుల ఆదరణ దీనికి లభించలేదు. ఇది ఓ ఉద్యమంగా నిలబడ్తుందన్న ఆశ ఏ కోణానా కనిపించదు. మధ్యతరగతి కొందరు యువకవులకు పరిమితమైందీ కవిసేన.

ఈ మధ్య 'మినీ కవిత'ను ఓ ఉద్యమం అంటూ కొందరు ముందుకు తెస్తున్నారు. పెట్టుబడిదారీ నాగరికత అనేకానేక రూపవైవిధ్యాలను తన కనుకూలంగా ఉండటంకోసం ఆహ్వానిస్తుంది. వేగం పెరిగిన నాగరికతలో దీర్ఘ కవితలకు స్థానంపోయి మినీ కవిత లందలాలెక్కాయి. దీని పుట్టుపూర్వోత్తరాల గూర్చి చర్చలు జరిగాయి. వచన కవిత ఎలా ఉద్యమంకాదో ఇదీ అలా ఒక ఉద్యమంకాదని పలువు రన్నారు. దీని ప్రచారం ఎక్కువగా డెబ్బైభ దశకంలో వచ్చింది. అందరూ వచన కవితలనే అల్లారు. 'మినీ కవితా విప్లవం' అంటూ మినీ కవితల సంకలనం వచ్చింది. సుమారు 200 మంది ప్రఖ్యాతులైన రచయితల నుండి యువ కవులదాకా ఇందులో చోటు చేసుకున్నారు. కుందుర్తి తొలిదశలో దాన్ని వ్యతిరేకించినా చివరలో ఆహ్వానించాడు. వచన కవిత్వానికి ఖచ్చితంగా ఎలా లక్షణాలు చెప్పలేకపోయారో మినీ కవితకూ అలాగే చెప్పలేకపోతున్నారు. 'అల్పాక్షరంబుల అనల్పార్థ రచన' అన్నది దీనికి ప్రామాణం.

కొల్లూరి ఇది ఒక విప్లవం అన్నారు. వ్యంగ్యాన్నీ, వాని వైభవాన్నీ వచన కవిత కందించిన ఖ్యాతి మినీ కవితదన్న భావం అద్దేపల్లి రామ్మోహనరావుగారిది. ధ్వని, వ్యంగ్యం, క్లుప్తతతో ఇది ఈనాడు గజ్జె కడ్తోంది. అన్ని భావ ధోరణుల కవులూ ఈ రంగంలో ఉన్నారు. అనేక మంది యువ కవులను ఈ మినీ కవిత ఆకర్షించింది. కొత్త ఆశవైపు చూపూ, సమాజంలోని అసమానతలను అంతమొందించాలన్న ఆకాంక్షా ఈ రచనల్లో ఎక్కువగా కనిపిస్తుంది.

ఇన్ని రకాల భావ ధోరణులలోనూ సంప్రదాయ కవులు తమ తమ రచనలు సాగిస్తూనే ఉన్నారు. గతకాలపు వైభవం, పెట్టుబడిదారీ నాగరికతను ఈసడించుకోవటం, మన ప్రాచీన సంస్కృతిని పునరుద్ధరించాలన్న తపన, మత విశ్వాసాలను తిరిగి నెలకొల్పాలన్న ధోరణి ఈ రకం రచయితలకుంది. ముదిగొండ శివప్రసాద్ వంటి రచయితల నేతృత్వంలో జాతీయ రచయితలుగా వీరు సమీకృతులయ్యారు. ఎక్కువగా గతకాలపు జనసంఘం భావాలను ఈ రచయితలు ప్రతిబింబిస్తారు. నిర్మాణ రూపంగా బలంగా లేకున్నా ఈ ధోరణి జనంలో బాగా ఉందనే అనవచ్చు. ఇందులో అనుభూతి వాదులూ, కళకళకొరకే అన్నవాళ్ళూ, సామాజిక పరివర్తనకు సాహిత్యం దోహదం చేస్తుందన్నవాళ్ళూ, వివిధ ప్రక్రియలను చేపట్టినవాళ్ళూ ఉన్నారు. వీళ్ళ బలం తక్కువగా అంచనా వెయ్యటానికి వీల్లేదు. అయితే యువకుల్లో అంతగా దీని ప్రభావం కనిపించదు.

ఇన్ని రకాల ధోరణుల మధ్యా 1972 నుండీ అరసం కాలానుగుణంగా తన ప్రణాళికను మార్చుకొని ఉద్యమ నిర్మాణానికి పూనుకొంది. శ్రామికజన పక్షపాతం అంగీకరిస్తూ, సవిమర్శక వాస్తవికత నుండి సోషలిస్టు వాస్తవికత వరకూ అంగీకరించినవాళ్ళనూ, దోపిడి లేని ఉన్నత సమాజం కొరకు కృషి చెయ్యాలనుకున్న ప్రజాస్వామ్యవాదు లందరినీ కలిపే వేదికగా ముందుకొచ్చింది. అప్పటికే కొందరు వామపక్ష రచయితలు 'నిబద్ధత-నిమగ్నత'లన్న బూర్జువా ధోరణుల మధ్య ఊగిసలాడుతుంటే లెనిన్ అన్నట్టు 'పార్టిజాన్ షిప్'లో ఈ రెండూ అవిభాజ్యముగా ఉంటాయని అరసం కవులు స్పష్టం చేశారు. అనేక కవితా సంకలనాల నందించారు. రూపవాద, భావవాద ధోరణులను తిరస్కరించారు. అదృష్టదీపక్, చందు సుబ్బారావు, చిరంజీవినీ కుమారి, కె. రాజేశ్వర్రావ్, యస్వీ, పెనుగొండ లక్ష్మీనారాయణ,డా॥ పరుచూరి రాజారాం, శ్రీకాంత్ వంటి యువకులనే కాకుండా పురిపండ,చాసో, ఉప్పల లక్ష్మణరావు, సోమసుందర్, కుందుర్తి, దాశరథి రంగాచార్య, సి. నారాయణరెడ్డి, కేతు విశ్వనాథ రెడ్డి, రా. రా. వంటి ప్రముఖులనూ ఈ ఉద్యమం ఆకట్టుకొంది. ప్రజానాట్యమండలీ, అరసం చేయీ చేయీ కల్పి ముందుకెళ్తున్నాయి.

విరసం, అరసంలు ప్రధానంగా రంగం మీద ఉండటం వలన జానపద కళారూపాలు, సాహిత్య రూపాలూ ప్రసిద్ధాలయ్యాయి. రచయిత లనేకులు ఆ బాణీలో రచనలు సాగిస్తున్నారు. వంగపండు ప్రసాదరావు, గద్దర్, యస్వీ, జాకబ్, స్వామి, ఏటుకూరి ప్రసాద్‌లు ఇందులో కృషి చేస్తున్నారు. జనం నుండి జనంలోకి సాహిత్యం అన్న నినాదంతో రచయితలు ముందుకెళ్తున్నారు.

ఒక్క విషయం ఇక్కడ గమనంలోకి తీసుకోవాలి. ఆయా సంఘాల్లో సభ్యులుగా లేకుండా కూడా అనేకులు ప్రసిద్ధులు తమ కవితా వ్యవసాయం సాగిస్తున్నారు. ఆయా సంఘాల్లో ఉన్నవాళ్ళే సామాజిక స్పృహతో రచనలు చేస్తున్నారనుకోవడం పొరపాటు.

ఈ పెట్టుబడిదారీ సమాజంలో రచయిత కనీసం సమాజంలోని వైరుధ్యాలనూ, అంతరాలవల్ల కల్గుతున్న అనర్థాలనూ ఎత్తిచూపే స్థితిలో ఉంటాడు. ఇలాంటివారిని సవిమర్శక వాస్తవికతావాదు లంటారు.

మరికొందరు మరింత సాంఘిక చైతన్యంతో సామాజిక రుగ్మతలను రూపుమాపడానికి ప్రజాసంఘాల ద్వారా ఉద్యమాలు నిర్మిస్తూ అందులో భాగస్వాములౌతూంటారు. ప్రజా పోరాటాలు, శ్రామికజన పక్షపాతం, చారిత్రక అవగాహన కల్గి ఉంటూ సోషలిస్టు వాస్తవికతావాదులుగా నిలుస్తూంటారు. ఈ రెండూ కాక కళ కళకోసం అన్న ధోరణి చాలా తక్కువస్థాయిలో కనిపిస్తుంది. వ్యక్తివాదంతో, అనుభూతివాదంతో కొందరే కవులు మిగిలున్నారు. నినాదాలు కొన్ని సందర్భాల్లో కవిత్వంగా మారినా, కవిత్వం నినాదంగా మారి పోరాట శ్రేణుల్లోని జనం చేతికి ఆయుధంగా అందాలి. అందుకు పరిణామ క్రమంలో ఉన్న ఈనాటి కవిత్వం ఎంతో ఆశను రగిలిస్తోంది.

అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించిన దరిమిలా ఈ నాలుగు దశకాల్లోనూ తెలుగు కవిత్వం అనేక ఆటుపోట్లకు గురైంది. నిర్బంధాలను చవిచూసింది. వివిధాలైన పెడధోరణులకు తట్టుకొంది. పాలకవర్గ స్వభావం, సమాజ పరిణామాలలో వస్తున్న, కనిపిస్తున్న బహురూప అంశాలనుబట్టి కవిత్వ ఉద్యమాల్లోనూ, కవుల్లోనూ, కవితల్లోనూ ద్వైధీ భావాలు అగుపిస్తున్నాయి. ఏది ఏమైనా ఈనాడు కవిత్వం మూడు పూలూ, ఆరు కాయలుగా మాత్రం క్షణక్షణ ప్రవర్ధమానం అవుతోంది.

## 2

విశ్వవిద్యాలయాలు ఏర్పాటు కావడంతో తెలుగులో పరిశోధన ఒక శాస్త్రీయ పంథాలో నడవటానికి ఆస్కారం కలిగింది. వీటి ప్రమేయం లేకుండా కూడా తెలుగు సాహిత్యాన్ని మధించి వివిధాంశాల మీద పరిశోధన చేసిన ప్రముఖులెందరో ఉన్నారు. అయితే ఆంగ్ల విద్యా విధానం మనకందించిన వాటిల్లో పరిశోధనలో ఓ సమగ్రమైన దృక్పథం ఉండాలన్న ఆలోచన ఒకటి. ఏ అంశాన్ని పరిశోధన కోసం తీసుకున్నా దాన్ని ఆనాడు వెలువడ్డ సాహిత్యాంశాలతో సరిచూస్తూనూ; సామాజిక, సాంస్కృతిక పరిస్థితులతో అంచనా వేస్తూనూ నిశితంగా పరిశీలించాలన్న అవగాహన పరిశోధకులకు ఓ కొత్త చూపు అందించింది. దీనికి తోడు సామాజిక రంగంలో మార్క్సిజం ప్రభావం క్షణ క్షణ ప్రవర్ధమానమవుతున్నకొద్దీ పరిశోధకుల్లో మరింత లోచూపు పెరిగింది. ఆర్థిక సంబంధాలూ, సమాజ ప్రగతులతో తమ పరిశోధనాంశాన్ని జోడించి కృషి చెయ్యడం ఆరంభించారు. ఇవేవీ కాకుండా సాంప్రదాయ పద్ధతుల్లో నేటికీ కృషి చేస్తున్న సాహిత్య పరిశోధకులూ ఉన్నారు. విజ్ఞాన శాస్త్రంలోలాగ సాహిత్యంలో కొత్త అంశాలను శోధించడమే ఉండదు. కొత్త వ్యాఖ్యానాలూ, సమన్వయాలూ, నిర్ధారణలూ ఉండటం ఎక్కువ. పరిశోధనా పీఠాల దృక్కోణం మారినప్పుడల్లా అక్కడ నుండి చేసే పరిశోధకుల చూపులో మార్పు వస్తూండడం గమనించదగింది. అయితే ఈ పీఠాల చూపులో మార్పు, విశ్వవిద్యాలయాల పరిశోధనా పథకాలలో మార్పుగా కాకుండా, పీఠాధిపతుల మార్పుతో ముడిపడి ఉంటోంది. ఇది అంత ఆరోగ్యకరం గాదు.

తెలుగునాడులో ఉన్న ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర, కాకతీయ, నాగార్జున, శ్రీ కృష్ణదేవరాయ, హైదరాబాద్ విశ్వవిద్యాలయాలతో పాటు ఈ ప్రాంతాలలోకొన్ని స్నాతకోత్తరవిద్యాలయాల్లో కూడా తెలుగులో పరిశోధన సాగుతోంది. ఇతర రాష్ట్రాలలో ఉన్న మద్రాసు, మధుర, అన్నామలై, మైసూరు, బెంగుళూరు, కర్ణాటక, బెనారస్ విశ్వవిద్యాలయాల్లో కూడా తెలుగు శాఖల్లో పరిశోధన సాగుతోంది. ఎప్పటినుండి విశ్వవిద్యాలయ గ్రాంట్లసంఘం కళాశాల అధ్యాపకులకు ఎం.ఫిల్, పిహెచ్.డి. లను కనీస అర్హతలుగా నిర్దేశించిందో - యు.జి.సి. స్కేలు కోసం - అప్పటినుండి ఈ పరిశోధన చాలాచురుగ్గా సాగుతోంది. ప్రభుత్వం జూనియర్ కళాశాలల్లో అధ్యాపకులకు అదనపు ఇంక్రిమెంట్లను మంజూరు చేయడంతో పి.హెచ్.డి. కోసం, ప్రధానంగా యం.ఫిల్.కోసం పరిశోధకులు ఇబ్బడిముబ్బడిగా ముందుకు రావటం గమనించవచ్చు.

తెలుగులో తొలిడాక్టరేటు చిలుకూరి నారాయణ రావుగారికి(1927-1929?) మద్రాసు విశ్వవిద్యాలయం ప్రదానం చేసినప్పటి నుండి నేటిదాకా డి.లిట్, పిహెచ్.డి, యం.ఫిల్ (యం.లిట్) డిగ్రీలను సుమారు 450 వరకూ ఆయా విశ్వవిద్యాలయాలు ప్రదానం చేసినట్టు అసమగ్ర సమాచారం తెలియ చేస్తోంది. ఆంధ్రప్రదేశ్ఏర్పడికొత్తవిశ్వవిద్యాలయాల స్థాపనతో తెలుగులో వివిధాంశాల మీద పరిశోధన చాలా చురుగ్గా జరుగుతోంది. ముఖ్యంగా ఈ పది పదిహేనేళ్ళ మధ్యలో పరిశోధకులు అనేకులు తెలుగులో కృషి చేస్తూండటం సంతోషాన్ని కల్గిస్తుంది. అయితే తమ పరిశోధనా గ్రంథాలను అచ్చులోకి 40% కూడా తెచ్చిన దాఖలాలు లేవు. వీటికి కారణాలు వెతకటం చాలా అవసరం. పరిశోధకుల్లో కనీసం 45% అన్నా ఏదో రకంగా ప్రభుత్వ గ్రాంటును స్కాలర్‌షిప్, ట్రావెలింగ్ ఎలవెన్స్, లైబ్రరీ ఎక్విప్‌మెంటు, మెటీరియల్ పర్చేజింగ్‌ల సందర్భంగా తీసుకోనుంటారు. కనీసం అయిదు నుండి 7 సంవత్సరాల కాలం - కొన్ని సందర్భాల్లో 10 సం॥లు కూడా- పరిశోధనకు వెచ్చించి ఉంటారు. ఇంత మానవ శ్రమా, ఆర్థిక వ్యయం చేసి సాధించిన పరిశోధనాంశాలను తెలుగు రి కీ తెలియచేయాల్సిన బాధ్యత అటు ప్రభుత్వం మీదా, ఇటు ముఖ్యంగా పరిశోధకుడి మీదా ఉంది. తన పరిశోధన కోసం జనం పన్నుల రూపంలో చెల్లించిన ధనాన్ని .007 శాతమన్నా ఉపయోగించుకున్న వ్యక్తిని ఆ అంశాలను బయటపెట్టమని అడిగే అధికారం ప్రజలకూ ఉంది. కానీ వెలువడటం లేదు. కారణాల్లోకి పోతే చాలా కనిపిస్తాయి. ఆర్థికం ఒకటి. పరిశోధనాంశం ప్రజలకు పట్టని అంశం కావటం రెండు. పరిశోధనలో తగిన స్థాయిలేకుండటం మూడోది. ఇవేకాకుండా అనేకానేక కారణాలూ ఉండచ్చు. వీటి మూలాల్లోకి పోవటం ఇప్పుడీ వ్యాసం ఉద్దేశం కాదు. అయినా ఇంతవరకూ ఈ రంగంలో జరుగుతున్న కృషిని స్థూలంగా అంచనా వేసుకుంటూ, బేరీజువేస్తే కొంతకు కొంత కారణాల జాడ పసిగట్టవచ్చు.

తెలుగులో పరిశోధన సాహిత్యాంశానికే ఈ వ్యాసం పరిమితం చేసుకుంటూ, అదీ 1948 తరువాత వచ్చిన సాహిత్య ఉద్యమాలమీదా, వ్యక్తులమీదా పరిశోధనను పరిశీలిద్దాం.

ఈ రంగంలో ఉన్న ఉన్నతశ్రేణి డిగ్రీ డి.లిట్. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి శ్రీనాథుడి సాహిత్యాంతరంగ తాత్త్వికతను ''ఈశ్వరార్చన కళాశీలుఁ''న్న గ్రంథంలో వివరించినందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి 1976 లో ఈ పట్టా పొందారు. గతంలో గిడుగు సీతాపతిగారికీ మద్రాసు విశ్వవిద్యాలయం ఈ డిగ్రీ ఇచ్చింది. శ్రీ బాడాల రామయ్యగారు బసవేశ్వరుడి వచనాలనూ, వేదాంత ప్రబోధ లక్షణాలనూ, జీవితాన్నీ విశదీకరిస్తూ రాసిన "బసవేశ్వర వచనాలు-సమగ్ర సమీక్ష" అన్నదానికి మైసూరు విశ్వవిద్యాలయంనుండి 1976లో ఈ డిగ్రీని సంపాదించారు. శ్రీ తూమాటి దొణప్పగారు తాము సునిశితంగా పరిశోధించిన సమర్పించిన హరికథా వాఙ్మయానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం 1983 లో డి.లిట్. ప్రదానం చేసింది. శ్రీ కోరాడ మహదేవశాస్త్రి గారికి భాష-వ్యాకరణం మీద కలకత్తా విశ్వవిద్యాలయం 1961 లో డి.లిట్. ఇచ్చారు.

పిహెచ్.డి. పట్టాకోసం కృషి చేసినవారి విషయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే 60 శాతం వరకూ ప్రాచీన రచయితలు, గ్రంథాలు, భారత, భాగవత, రామాయణాల్లోని రసాలూ, పాత్రలూ వగైరాలే ఎక్కువ కనిపిస్తుంటాయి. తులనాత్మక పరిశీలనలూ ఉన్నాయి. రచనలన్నీ గ్రాంథికంలోనే, అందులోనూ గొడ్డు గ్రాంథికంలో కనిపిస్తాయి. ఇక వ్యాకరణాల మీద అమరేశం రాజేశ్వరశర్మగారు (ఉస్మానియా), బొడ్డుపల్లి పురుషోత్తంగారు (ఆంధ్ర) ఓ పట్టు పట్టారు. ఇదికాక వివిధ వ్యాకరణాలమీదా, వ్యాకర్తల

మీదా యం.ఫిల్., పిహెచ్.డి.ల కోసం అన్ని విశ్వ విద్యాలయాల్లో కృషి జరిగింది.

జానపద గేయవాఙ్మయం మీద పరిశోధనలకు ఉస్మానియా పెట్టింది పేరు. డా॥ రామరాజుగారు 1956 లో ఉస్మానియానుండి 'తెలుగు జానపద గేయ సాహిత్యం' మీద పరిశోధనకు మునుం కట్టారు. అప్పటినుండి నాయని కృష్ణకుమారి, యెల్దండ రఘుమారెడ్డి, జి. లింగారెడ్డి, సుమతి, సరస్వతి, రావి ప్రేమలత తదితరులు జానపద గేయ సాహిత్యంలోని వివిధాంశాల్లో కృషి చేశారు. జిల్లాలవారీ జానపద గేయాలను సేకరించడం, వాటిల్లో ప్రజా జీవనం, సామెతలు వంటి వాటిమీద యం.ఫిల్. కోసం పలువురు పరిశీలన చేశారు. జానపద సాహిత్యానికి ఒక ఆచార్య పదవితో ప్రత్యేకపీఠాన్ని నెలకొల్పాలన్న ఆలోచనకూడా ఉంది. ఇదే విధంగా బెంగుళూరు విశ్వవిద్యాలయం కూడా ఈ రంగంలో కృషికి పరిశోధకులను బాగా ప్రోత్సహిస్తోంది. 'అనంతపురం జిల్లా స్త్రీల తెలుగు పాటల' మీద జి.ఎస్. మోహన్ గారు పరిశోధన చేసి 1979 లో డిగ్రీ సంపాదించారు, ఉస్మానియా అంతకాకున్నా హైదరాబాద్, ఆంధ్ర, నాగార్జున, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల్లో కూడా ఈ రంగంలో కృషి జరుగుతూండటం చూడవచ్చు.

ప్రక్రియాపరంగా చూస్తే వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన సాగుతోంది. 1963 లో 'ఆంధ్ర నవలా పరిణామం' మీద బి.వి. కుటుంబరావుగారి పరిశోధన దరిమిలా, నవలల్లో వివిధ అంశాలమీద పరిశోధనను పలువురు సాగించారు. 'తెలుగు నవలల్లో కుటుంబ జీవనం' అంటూ 1976 లో సి. ఆనందారామంగారు ఉస్మానియా నుండి డాక్టరేటు పొందారు. సమకాలిక నవలల వరకూ అన్నిటినీ తన పరిశోధనా పరిధిలోకి తీసుకున్నారు. నవలా రచయితలు, గోపీచంద్, చలం తదితరు లందర్నీ విపులంగా పరిశోధిస్తూ, 'ఆధునిక తెలుగు నవలారీతులు' అని ఉప్పలపాటి శ్రీరామమూర్తిగారు 1977 లో అనంతపురం పి.జి. సెంటరునుండి కృషి చేశారు. చిలకమర్తి వారి నవలలమీద బెనారస్ నుండి భమిడిపాటి సచ్చిదానందమూర్తి (1980) పరిశోధించారు. చలం గారి నవలల్లో వివిధాంశాల మీద యం.ఫిల్. కోసం అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ కృషి జరుగుతోంది. కొడవటిగంటి, రంగనాయకమ్మల నవలల్లోని వివిధాంశాలమీద టి. గురురామప్రసాద్ 1980 లో శ్రీ వేంకటేశ్వర నుండీ, బి. విజయలక్ష్మి 1978 లో ఉస్మానియా నుండీ యం.ఫిల్. పట్టా పొందారు.

కథల మీద 1977 లో పోరంకి దక్షిణామూర్తి తెలుగు కథానిక స్వరూప స్వభావాలంటూ ఓ చక్కని వ్యాసం రాసి ఉస్మానియా నుండి డాక్టరేటు పొందారు. శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారు కథలకు పెట్టింది పేరు. వారి కథల మీద సమగ్రమైన పరిశోధన చామర్తి కనకయ్యగారు 1979 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేసి ఔననిపించుకున్నారు. రచయితల పరంగా గురజాడ కథల మీద 1978లో శ్రీ వెంకటేశ్వర నుంచి భాస్కర స్వర్ణాంబగారు యం. ఫిల్ పట్టా పొందారు. కథకుల్లో వివిధాంశాలను కొందరు పరిశోధించారు. వారిలో కుటుంబరావు కథల్లో స్త్రీ పాత్ర చిత్రణ మీద పరిశోధించి 1979 లో ఉస్మానియా నుంచి జి. హరిశ్చంద్ర ప్రసాద్‌గారు యం. ఫిల్. డిగ్రీ సంపాదించారు. గోపీచంద్ రచనల్లో మానవతా వాదం అన్న అంశం మీద ఆవుల మంజులతగారు 1979 లో ఉస్మానియా నుండి యం.ఫిల్. పట్టా సంపాదించారు.

అతి తక్కువగా పరిశోధన సాగింది విమర్శ మీద. విమర్శ అంటే ఇట్టుగా పరిణామం చెందిన ఈ రోజుల్లో దాని మీద పరిశోధన చాలా అవసరం. యస్. వి. రామారావుగారు తెలుగులో సాహిత్య విమర్శ : అవతరణ వికాసాలన్న అంశం మీద క్షుణ్ణంగా పరిశోధించి ఓ చక్కని గ్రంథాన్నందించారు. ఉస్మానియా నుండి 1973 లో వారికి డాక్ట

రేటు అందింది. అలాగే కోవెల సంపత్కుమారాచార్యగారు, ఆధునికాంధ్ర సాహిత్యంలో విమర్శ అంటూ పరిశోధనచేసి సాధికారికంగా ఓ గ్రంథాన్ని అచ్చేశారు. దానికి కాకతీయ విశ్వవిద్యాలయం 1978 లో పిహెచ్.డి. పట్టా ప్రదానం చేసింది. ఈ రెండూ వివిధ స్థాయిల్లో ఉన్న పరిశోధకులకు విమర్శన లేని లోటును కొంత వరకూ పూరిస్తున్నాయి. అయినా సంపత్కుమారాచార్యగారి గ్రంథం మరింత వ్యావహారికంలో ఉంటే ఉపయోగకరంగా ఉండేది. మార్క్సిస్టు దృష్టితో ఎలా విమర్శ సాగాలన్న అంశం మీద ఇంతవరకు ఏ విశ్వవిద్యాలయంలోనూ కృషి చేస్తున్నట్టు లేదు. ఇప్పటికొచ్చినవన్నీ సాంప్రదాయక విమర్శనా ధోరణులే!

తర్వాత నాటకం ప్రక్రియను చూస్తే ఆధునిక నాటకం మీద పి. వెంకటరమణగారు పరిశోధించారు. తెలుగు సాంఘిక నాటకం అన్నది వారి అంశం. దీనికి 1979 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం డాక్టరేటు ఇచ్చింది. మొత్తం నాటకాల వికాసం అంటూ అటు సాంఘిక,చారిత్రక.పౌరాణిక తెలుగు నాటకాలను తీసికొని పోణంగి శ్రీరామ అప్పారావుగారు 1961 లో ఉస్మానియా నుండి పి. హెచ్.డి. పొందారు. ఆధునికంగా అనేక నాటకాలు వస్తున్నాయి. వస్తువు, రీతుల్లో నేడు ప్రధానంగా రీతికి ప్రాధాన్యం ఎక్కువిస్తున్నారు. వీటి మీద, ఈ రచయితల మీద ఏ విశ్వవిద్యాలయం పరిశోధనకు అవకాశం కల్పిస్తున్నట్లు లేదు.

జీవిత చరిత్రలు వారి సాహిత్య పరిశీలనలను చూస్తే పలువురి రచయితల మీద కృషి జరిగినట్టు తెలుస్తోంది. కందుకూరి జీవితం, సమగ్ర సాహిత్యాలను పరిశోధించి అక్కిరాజు రమాపతిరావు 1965 లో ఉస్మానియా నుండి డాక్టరేటు డిగ్రీ పొందారు. చక్కని శైలి. కందుకూరి సాహిత్యంలో సంఘ సంస్కరణ అన్న అంశం మీద వి. కోటేశ్వరమ్మగారు పరిశోధన చేసి 1981 లో నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి. పొందారు. ఇక 'గురజాడ'పై అరిపిరాల నారాయణరావు బెనారస్ విశ్వవిద్యాలయం నుండి 1980 లో చక్కని పరిశోధన చేసి డాక్టరేటు పొందారు. గురజాడ కథల మీద, భాస్కర స్వర్ణాంబ 1978 లో శ్రీ వెంకటేశ్వర నుండి పరిశోధన చేసి యం.ఫిల్. డిగ్రీ సంపాదించారు. అలాగే బెంగుళూరు విశ్వవిద్యాలయం నుండి 1980 లో గుళ్ళపల్లి ప్రభాకర్ ఫణిరాజా కన్యాశుల్కం: ఒక విమర్శ అన్న పరిశోధన వ్యాసం రాసినందుకు యం.ఫిల్. డిగ్రీ సంపాదించారు. కొన్ని విశ్వవిద్యాలయాల్లో గురజాడ మీద తులనాత్మక పరిశీలన కూడా జరుగుతున్నట్టు ఆధారాలున్నాయి.

అలాగే పానుగంటి, చిలకమర్తి, కోలాచలం శ్రీనివాసరావుగార్ల రచనలూ జీవితంపైపరిశోధన జరిగింది. యస్. గంగప్పగారు కోలాచలం వారి మీద పరిశోధన చేసి 1972 లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పొందారు. అలాగే తాపీ ధర్మారావు గారి జీవితం - రచనల మీద ఏటుకూరి ప్రసాద్‌గారు పరిశోధన చేసి 1982 లో ఉస్మానియా నుండి పిహెచ్. డి. పొందారు. ఇంకా త్రిపురనేని రామస్వామి చౌదరి, ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి వారి జీవితం, సాహిత్యాల మీద కృషి జరగటం చాలా అవసరం.

ఆధునిక కవిత్వం, కవులమీద విశేషంగా కృషి జరుగుతున్నట్టు అన్ని విశ్వవిద్యాలయాల వివరాలు తెల్పుతున్నాయి. అయితే వీటి మధ్య సమన్వయం లేనందువల్లో ఏమో ఒకే అంశంమీద కొద్దిపాటి తేడాతో రెండు మూడు విశ్వవిద్యాలయాల్లో కృషి చేస్తూండే ప్రమాదం కనిపిస్తోంది. ఇటీవల జరిగిన పరిశోధనల్లో విశ్వనాథ సత్యనారాయణగారి జీవితం, రచనలమీదా, అందులో ఉండే విభిన్నాంశాల మీదా అనేకులు ఆయా విశ్వవిద్యాలయాల్లో కృషి చేశారు. 'విశ్వనాథ సత్య

నారాయణగారి పురాణవైర గ్రంథమాల' అంటూ 1978 లో ఎం. లావణ్య సరస్వతి ఉస్మానియాలో యం.ఫిల్. చేశారు. 'విశ్వనాథ వారి పురాణ వైర గ్రంధమాల-ఒక సమీక్ష' అంటూ 1979 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆర్. శ్రీనివాసాచార్యులుగారు పరిశోధన చేసి డాక్టరేటు పొందారు. ఇది సమన్వయం లేకపోవడంవల్లే జరిగుంటుంది. అలాగే రాయప్రోలు సుబ్బారావుగారి జీవితం-సాహిత్యం అన్న అంశంమీద కాకతీయలో 1981 సం॥లో శీతాల రంగామణి గారు యం. ఫిల్. డిగ్రీ తీసుకున్నారు. 1983లో హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం నుంచి ఎం. లావణ్య సరస్వతిగారు 'రాయప్రోలు వారి రచనల పరిశీలన-తత్త్వవివేచన' అన్న అంశంమీద పరిశోధించి పిహెచ్.డి. తీసుకున్నారు. ఇక కాటూరి, పింగళిగార్ల ''సౌందరనందం'' మీద యం.ఫిల్. కోసం ఉస్మానియాలో టి. వరలక్ష్మి (1980), మద్రాసులో 1978 లో రాయదుర్గం విజయలక్ష్మిగారలు పరిశోధన చేశారు. అలాగే శ్రీ వేంకటేశ్వరలో జి. చిన్న కేశవులు నాయుడుగారు కూడా 1979 లో కృషి చేశారు.

భావకవుల్లో కృష్ణశాస్త్రి, నాయని, వేదుల, పింగళి, కాటూరి, నాళం కృష్ణారావు వంటి పలువురి కవిత్వ తాత్వికతలమీద పరిశోధనలు అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ జరిగాయి. వీటిలో ఎన్. నిర్మల గారి 'కృష్ణశాస్త్రి కృతులు - పరిశీలన' ఉస్మానియాలో పిహెచ్.డి. కోసం సమర్పించారు (1978). అలాగే నాయని రచనలమీద భూమయ్యగారు చేసిన పరిశోధనకు కాకతీయ విశ్వవిద్యాలయం డాక్టరు పట్టా ప్రదానం చేసింది. ఎంకి పాటలమీదా, జాషువా కృతుల్లో వివిధాంశాలమీదా పలువురు యం.ఫిల్.కోసం పరిశోధించారు. జాషువా కృతుల్లో కొద్దిభేదం పాటిస్తూ ఆంధ్రనుండి గుదిమెళ్ళ భావనారాయణాచార్యులుగారూ (1978), శ్రీ వేంకటేశ్వర నుండి బొట్టు భాస్కర చౌదరిగారూ(1979) పిహెచ్.డి. పట్టాలను పొందారు.

ఈ యుగంలో పలువురి కవిత్వాల మీద పరిశోధన ఇంకా కొనసాగవలసివుంది.

ఇక అభ్యుదయ కవిత్వయుగంలోని రచయితలను 1960 తర్వాతగానీ పరిశోధనాంశాల కింద తీసుకోనివ్వనట్టు కనిపిస్తుంది. తిలక్ కవితా శిల్పం మీద ఎస్. జి. డి. చంద్రశేఖర్ 1978 లో పరిశోధించి యం.ఫిల్. శ్రీ వేంకటేశ్వరలో తీసుకుంటే, అత్తలూరి నరసింహారావుగారు ఆంధ్రనుండి 1979లో తిలక్ కవితా తత్వంమీద పిహెచ్.డి. డిగ్రీ తీసుకున్నారు.

అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ రచనలు అంశాలుగా పలు విశ్వవిద్యాలయాల్లో యం.ఫిల్, పిహెచ్.డి.లు గ్రహించారు. మిరియాల రామకృష్ణగారు ''శ్రీశ్రీ కవిత్వం- వస్తువు- సంవిధానం'' అంశంగా గ్రహించి ఆంధ్ర నుండి 1978 లో డాక్టరేటు పొందారు. 1977 లో ఉస్మానియా నుండి శ్రీశ్రీ కవిత్వంలో సామాన్య మానవుడన్న పరిశోధనకు యం. నరహరి గారు యం.ఫిల్ సంపాదించారు. సాహిత్య వ్యాసాలను ఆధారంగా చేసుకొని చేసిన పరిశోధనకు ఎన్. సత్యనారాయణశాస్త్రి గారికి 1977 లో ఉస్మానియా యం.ఫిల్. ప్రదానం చేసింది. శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశోధన చేసి మిక్కిలినేని సుశీల నాగార్జున విశ్వవిద్యాలయం నుండి 1980 లో యం.ఫిల్. డిగ్రీ చేపట్టారు. ఖచ్చితంగా 'మార్క్సిస్టు దృష్టితో' అని శీర్షిక పెట్టి చేసిన తెలుగు తొలి పరిశోధన ఇదే కావచ్చు. శ్రీశ్రీ కవిత్వంలో మనో విశ్లేషణాత్మక పరిశీలన అన్న అంశం ఆధారంగా కృషిచేసి దేవరాజు కృష్ణంరాజు గారు ఉస్మానియా నుండి 1981 లో డాక్టరేటు పట్టా పొందారు.

ఆరుద్ర కవిత్వం మీద యం.ఫిల్. కోసం శ్రీ వేంకటేశ్వరలో (1980) చంద్రారెడ్డి గారూ, తాపీవారి కవిత్వంమీద యం.ఫిల్. కోసం మద్రాసులో కె. రాగిణిగారూ (1980), కుందుర్తి కథాకావ్యాల

మీద శ్రీ వెంకటేశ్వరలో (1981) పి. సుహాసిని గారూ, దాశరథి కవిత్వంలో కొన్ని గ్రంథాల మీద (1981) బెంగుళూరు నుండి వరకాల రామనరసింహా రెడ్డి గారూ, గజ్జెల మల్లారెడ్డి కవిత్వం అంశంగా (1982) హైదరాబాద్ విశ్వవిద్యాలయం నుండి పి. యెల్లారెడ్డి గారూ; జె. బాపురెడ్డి రచనల మీద హైదరాబాదు విశ్వవిద్యాలయంలో (1982) సి. సుశీల గారూ పరిశోధనలు జరిపారు. ఒక కవిలో ఒక అంశాన్నో, కొన్ని రచనల్నో ఎన్నుకొని యం.ఫిల్. కోసం చేసినదే ఈ కృషి అంతా.

ఇక ఉద్యమాల చూపుతో పరిశోధనలు ఏ రెండు మూడో తప్ప సరిగా జరగలేదనే అనచ్చు. సి. నారాయణరెడ్డి గారు ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు- ప్రయోగములు అన్న అంశం మీద పరిశోధనచేసి ఉద్యమాలను సమీక్షించారు. దీనికి 1962 లో ఉస్మానియా డాక్టరేటు ప్రదానం చేసింది. 'ఆధునికాంధ్ర కవిత్వంపై ఉద్యమాల ప్రభావం' అటూ ఆయా ఉద్యమాలు ఎలా కవిత్వాన్ని ప్రభావితం చేసిందీ ముదిగొండ శివప్రసాద్ గారు పరిశోధించి 1971లో ఉస్మానియా నుండి పిహెచ్.డి. పొందారు. వెల్చేరు నారాయణరావు గారు 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' అంటూ వాటి తాత్త్వికతను చెప్పటానికి ప్రయత్నించారు. దీనికి 1974 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం డాక్టరేటు పట్టా నిచ్చింది.

వీటిని మించి భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం అన్న అంశాలమీద క్షుణ్ణంగా వాటి తాత్త్వికత- ఆలోచన- ప్రచారం- ప్రభావాలమీద పరిశోధనలు జరుగలేదు. ఈ ఉద్యమాలలో ఉన్న వ్యక్తుల రచనల మీదనే పరిశోధనలు సాగటం గమనించవచ్చు. అందులోనూ దిగంబర, విప్లవ భావాల రచయితల్లో చెరబండరాజు కవిత్వం మీద బెంగుళూరు విశ్వవిద్యాలయంలో చిన్ని కోట్ల పెద్దిరెడ్డి గారు యం.ఫిల్. డిగ్రీ (1981) సంపాదనకు చేసింది తప్ప మరన్నిచోట్లా చిన్నచూపే కనిపిస్తోంది. ఆ ఉద్యమాల పట్ల ఎలాటి అభిప్రాయాలున్నా కవిత్వం- రచనల మీద పరిశోధనల కంగీకరించకపోవడానికి హేతువులేం కనిపించవు.

ఇక ప్రజాఉద్యమాలు సామాజిక చైతన్యవంతమైన సాహిత్యంలో ప్రతిఫలించక మానవు. తెలుగు నాట గత నలభై సంవత్సరాలలో అనేక ఉద్యమాలు తలెత్తాయి. అన్ని ఉద్యమాల్లోనూ అభ్యుదయాంశ ఉండకపోవచ్చు. అన్నంతమాత్రాన వాటి ప్రభావం పుణికిపుచ్చుకున్న సాహిత్యం మీద పరిశోధకులకు చిన్న చూపు ఉండాల్సిన అవసరం లేదు. తెలుగు సాహిత్యం- తెలంగాణా సాయుధ పోరాట ప్రభావం అన్న అంశం మీద ఆంధ్ర నుండి 1979 లో ఎల్. ప్రేమసాగర్ గారు డాక్టరేటుకు చేసిన పరిశోధనా, 'తెలంగాణా విమోచనోద్యమం - తెలుగు నవల' అంటూ ఓ నాలుగైదు నవలల ఆధారంగా 1981 లో కాకతీయ నుండి డాక్టరేటు తీసుకున్న పి. వరవరరావు గారి పరిశోధనలు మినహా అంతటి ఉద్యమాన్ని పరిశోధకులు ఉపయోగించుకోవలసినంతగా ఉపయోగించుకున్నట్టు అనిపించదు. ఆయితే తెలంగాణాపోరాట ప్రభావం, గేయాల మీద పరిశోధన జరుగుతున్నట్టు తెలుస్తోంది.

ఇక ఆధునిక కవిత్వంలో భావ చిత్రణ, సామాజిక స్పృహ, సూర్యుడు, సామాన్యుడు వంటి అనేక అంశాల మీద యువకు లనేకులు యం. ఫిల్. కోసం వివిధ విశ్వ విద్యాలయాల్లో కృషి చేయటం సంతోషించదగ్గది.

చివరకు అతి తక్కువ పరిశోధన తెలుగు వ్యాసం మీద జరిగింది. శ్రీ వెంకటేశ్వర నుండి కొలకలూరి ఇనాక్ గారు 'తెలుగు వ్యాస పరిణామం' అన్న అంశం మీద మంచి పరిశోధన చేసి 1974 లో పిహెచ్.డి. ని పొందారు. ఇదితప్ప వ్యాసాల్లోని వివిధ కేటగిరీస్ మీద కనీసం యం.ఫిల్. కోసమైనా

కృషి చేసిన దాఖలాలు కనిపించవు. ఆయా రచయితల వ్యాసాల మీద జరిగింది. వచన రచన మీద కులశేఖరరావు గారు ఉస్మానియా నుండి పిహెచ్.డి. చేశారు (1964). కానీ వ్యాసాం మీద పరిశోధన ఇంకా జరగటం అవసరమనిపిస్తుంది.

విశ్వవిద్యాలయాలకు సంబంధించకుండా పలువురు సాహిత్యంలో పరిశోధనచేసి చక్కటి గ్రంథాలు తెస్తున్నారు. ఆధునాతన విమర్శకు జీవంపోస్తున్నారు. అలాటి వ్యక్తుల్లో ఆరుద్ర, కె. వి. రమణారెడ్డి, పురాణం సుబ్రమణ్యశర్మ, రంగనాయకమ్మ తదితరు లెందరో ఉన్నారు. అతిశాస్త్రీయ పద్ధతిలో సమాచారాన్ని సేకరించి వ్యాఖ్యానిస్తున్నవాళ్ళెందరో ఉన్నారు. విశ్వవిద్యాలయ పరిశోధనల నిబంధనల కిందకు రాకపోవచ్చు గానీ పరిశోధనలు చాలా మేలైనవి. వీరి కృషినీ గుర్తించటం చాలా అవసరం. అలాగే కొన్ని సంస్థల్లో పనిచేస్తున్న వ్యక్తులకు పరిశోధనల మీద ఉత్సాహం ఉంది. కానీ నిబంధనల రూళ్ళకర్రలు అడ్డుకుంటున్నాయి. వీరికి అవకాశం కల్పించాలి.

ఇంతటి పరిశోధనా కృషికి తొలితరం మార్గదర్శకులు పింగళి, ఖండవల్లి, నిడుదవోలు, గంటి జోగి సోమయాజి, దివాకర్ల, శిష్టా రామకృష్ణశాస్త్రి వంటివారిని స్మరించటం చాలా అవసరం.

పర్యవేక్షకుల్లో కొత్త తరం ఉన్నందువల్ల అత్యంత ఆధునిక పరిశోధనా పద్ధతులను ఉపయోగించుకోటానికి అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. గతంలోకన్నా స్త్రీ పర్యవేక్షకులు ఎక్కువ మంది కావటం కారణాన ఇంతవరకూ స్త్రీ రచనల, రచయితల పట్ల జరిగిన అలసత్వం తొలగిపోగలదన్న ఆశా ఉంది. అయినా ఇప్పటివరకూ ఉన్న పరిశోధనల్లో ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో రచయిత్రు లన్న మద్రాసుతో (1964) పరిశోధించి యం.ఫిల్. తీసుకున్న వై. సరోజినీదేవిగారి కృషి తప్ప మరో దాని వైనం తెలియరాలేదు. నేటి నవలా సాహిత్యంలో రచయిత్రులు అనేకులు లబ్ధప్రతిష్ఠులున్నారు. కనుక పరిశోధకుల చూపు ఇటు ప్రసరించాలి. పర్యవేక్షకులూ ఇటు తిప్పించాలి.

ఇక ముగించేముందు ఓ మాట. ఈ పరిశోధనల్లోనూ గిడుగు జీవితం, సాహిత్యం గూర్చి పరిశోధన చేసినట్లు కనిపించడంలేదు. భాషను జనంలో నుండి తీసుకున్న వ్యావహారిక భాషోద్యమకారుణ్ణి గ్రాంథికవాదులు విశ్వవిద్యాలయాల్లోకి రానియ్యలేదా! అలా అంటానికే వీల్లేదు. నేడొస్తున్న పరిశోధనా వ్యాసాలు వ్యావహారికంలోనే వస్తున్నాయి. ఆ దిశలో మరింత కృషి సాగించాలి.

కందుకూరినీ-ఆయనసంస్కరణలనూ గురించి అమెరికావారు జాన్ లియొనార్డ్ విస్కాన్సిన్ యూనివర్సిటీకి ఓ చక్కని పరిశోధనా వ్యాసాన్ని రాసి 1969 లో డాక్టరేటు సంపాదించిన దశలో; మన భాషకు జవం, జీవం పోసిన గిడుగును గూర్చి సమగ్ర పరిశీలన ఇంతవరకూ జరగకపోవడం- అందిన సమాచారం మేరకు-విచారకరం.

ఏది ఏమైనా తెలుగులో పరిశోధన అంతర్జాతీయ పరిశోధనాస్థాయి కీనాడు చేరుకుంటోంది. అందుకు కృషి చేసిన పరిశోధకులనూ, పర్యవేక్షకులనూ, ఆయా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతులనూ అభినందించకతప్పదు. ఏ విశ్వవిద్యాలయమైనా ఇప్పటివరకూ వచ్చిన పరిశోధనా వ్యాసాల మీద, తీరుతెన్నుల మీద ఓ చక్కని పరిశోధన చేయిస్తే ముందు తరాలకు మార్గదర్శకం కావచ్చు.



# తులనాత్మక పరిశోధనలు

—భీమసేన్ 'నిర్మల్'

ఒక వస్తువును మరోదానితోనూ, ఒక వ్యక్తిని మరో వ్యక్తితో పోల్చి చూడడం నిత్య జీవితంలో మనకు పరిపాటి. ఒక వస్తువు మంచి, చెడ్డలను, ఒక విషయం బాగోగులను పరిశీలించి, వాటి విలువ కట్టడానికి, వాటిని ఇతర వస్తువులతోకానీ, విషయాలతో కానీ పోల్చి చూడవలసి వస్తుంది. Sir James పండితుడు Comparision bestows perfection[1] అని అన్నాడు. అంటే పోల్చి చూడడం వల్ల ఒక విషయాన్ని నిర్దుష్టతమంగా వ్యక్తం చేయవచ్చు.

సాహిత్యంలోను, వైజ్ఞానిక రంగంలోను మహోత్కృష్టమయిన విద్యలు, విజ్ఞాన రంగంలో ప్రగతి తులనాత్మక పరిశీలన వల్లనే సాధ్యపడ్డాయి. అందుచేతనే మాక్సుముల్లరు పండితుడు All higher knowledge is gained by comparision and rests on comparision[2] అన్నాడు. సమస్త మానవ సంస్కృతిలో నిగూఢంగా నిక్షిప్తమయి ఉన్న మానవ సంవేదనలో గల సమైక్యతను నిరూపించగల సాధనం తులనాత్మక పరిశీలనయే.

భాషా శాస్త్ర రంగంలోను, వాఙ్మయ రంగంలోను తులనాత్మక ప్రధానమయిన చర్చా వ్యాసంగం జరిగిన తరవాతనే, ప్రాచ్య- పాశ్చాత్య దేశాలు మరింత దగ్గరయ్యాయి, Oneness of the human race (William C. Friday)[3] తెలియవచ్చింది.

వెబ్బర్ నిఘంటుకారుడు Comparisionను ఇలా నిర్వచించాడు: 'The placing together or juxtaposing of two or more items to ascertain, bring into relief or establish their similarities and dissimilarities. Identify (as one feature or set of features with another) between two or more things or persons used chiefly with a negation of somthing or some decidedly inferior to another. Comparision is the most general term. In its broadest use may imply no more than an impartial search for resemblances as well as differences.

సమాన తత్త్వాలను, భిన్న దృక్పథాలను పరిశీలిస్తూనే 'తులనాత్మక పరిశీలన', మానవజాతిలో గల సమైక్యతను నిరూపిస్తుంది. భాషాగతం కాక, భావ గతమయిన ఏకరూపతను ప్రతిపాదిస్తూ, సమస్త మానవ జాతిలో నైకట్య భావాన్ని పెంపొం

---

1. Research and Search P-I
2. Lectures on Sciense of Religion. P-12
3. Comparative Literature-vol-I-Proceedings of the second congress of the I.C.L.A.

పిస్తుంది. Comparativre Literatue ను వివరిస్తూ William C. Friday అనే పండితుడు తన అధ్యక్షోపన్యాసంలో ఇలా అన్నాడు. 'Comparative Literature, in studying the impact of one literature, actually of a whole culture on others, is really concerned with the appreciation of cultures other than that of the individual scholor. In this way it tends to bring people together in this divisive world and to stress the oneness of the human race rather than its differences.'[4]

ఈ విధంగా తులనాత్మక పరిశీలన సామ్య, వైషమ్యాలను, పరస్పర ప్రభావాలను ఆకళింపు చేసుకుంటూ, వేర్వేరు భాషలు మాట్లాడే వారిలో పరస్పరావగాహనను, సౌహార్దతను పెంపొందించి, విశ్వమానవ సౌభ్రాతృత్వ సంస్థాపనకు కృషి చేస్తుంది.

అనేక భాషలతో, ఆయా భాషలలోని సమృద్ధమయిన సాహిత్య సౌరభాలతో సుసంపన్నమయిన నందనోద్యానం మన దేశం. ఆయా భాషలను, వాని లోని సాహిత్యాలను ఏకసూత్రబద్ధం చేసేది సంస్కృత భాషా సాహిత్యమూ, భారతీయ సంస్కృతి. విభిన్న రూపాలతో, వర్ణాలతో కనిపించే భారతీయ సాహిత్యం లోని అంతర్వాహిని ఒకటే. బాహిరంగా కనిపించే విభిన్న లక్షణాల వెనక ఆంతరంగికంగా నిక్షిప్తమై ఉన్న ఏకత్వం, అభిన్నత ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఈ విషయాన్ని ఉటంకిస్తూ పండిత జవాహర్‌లాల్ నెహ్రూ గారు ఇలా అన్నారు:

'And yet underneath all this there is an Indianness which distinguishes every part of India and is something unique and deeper than the external differences that may strike the casual observer. India is a curious mixture of amazing diversity and abiding unity.'[5]

అయితే ఆశ్చర్యకరమయిన ఈ ఏకత్వాన్ని, అభిన్నతను గుర్తించడానికి ఈ శతాబ్ద ప్రారంభం వరకు ఎటువంటి ప్రయత్నమూ జరుగలేదు. భారతీయ భాషలన్నీ ఒకే మూసలోనుండి వెలువడ్డవనీ, సాహిత్యా లన్నీ ఒకే భావాన్ని వేరువేరు భాషలలో వెలువరించే వనే విషయం తులనాత్మక పరిశీలన, ఆదాన ప్రదాన కార్యక్రమం ద్వారానే తెలియవస్తుంది. గాంధీగారు దక్షిణ భారత హిందీ ప్రచారసభను క్రీ.శ. 1918లో మద్రాసులో ప్రారంభిస్తూ, వారి కిచ్చిన ఆప్తవాక్యమే (ఏక్ హృదయ్ హో భారత్, ఏక్ రాష్ట్రభాష హో హిందీ) ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. హిందీ ప్రచార కార్యక్రమం ప్రారంభమయిన తరవాత, ఆయా ప్రాంతాలలోని విద్వాంసులు హిందీ భాష నేర్చుకుని, హిందీ భాషా సాహిత్యాలతో తమ భాషా సాహిత్యాలను పోల్చి చూసి పరిశీలించసాగారు. తమ తమ భాషలలోని ఉత్కృష్ట రచనలను హిందీలోకి, హిందీలోని ఉత్కృష్ట రచనలను తమ భాషలలోనికి అనువదించుకోసాగారు. ఇలా హిందీని ప్రధానంగా పెట్టుకొని, ఇతర భాషలతో దాన్ని పోల్చి చూడడంతో తులనాత్మక పరిశీలన ప్రారంభమయింది. ఈనాటి వరకు అలాగే సాగుతూ వస్తున్నది.

స్వాతంత్ర్యం వచ్చేవరకు ఈ తులనాత్మక అనుశీలనం కేవలం వ్యాసరచన వరకే పరిమితమయి

---

4. అదే.
5. As quoted by Dr. P. Saran in his essay 'Emotional Integration.'

ఉండేది. స్వాతంత్ర్యం తరవాత అనేక విశ్వవిద్యాలయాలలో హిందీ శాఖలు తెరవబడడంలో, తులనాత్మక పరిశీలన ఆధారంగా పరిశోధనా వ్యాసాలు వ్రాయబడడం ప్రారంభమయింది. ఇలాంటి పరిశోధనా వ్యాసాలు ముఖ్యంగా హిందీయేతర ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలలోనే వ్రాయబడుతున్నాయి. అది సమంజసం కూడా. అయితే బెనారసు, సాగర్, అలీఘర్ విశ్వవిద్యాలయాలు తులనాత్మక పరిశోధనా వ్యాసరచనను ప్రోత్సాహించాయి.

తులనాత్మక పరిశీలన, ప్రధానంగా పిహెచ్.డి. పట్టాకొరకే కాకుండా, స్వాంతఃసుఖాయగా కూడా జరుగుతోంది.

తులనాత్మక పరిశీలన ముఖ్యంగా ఈ క్రింది దృక్పథాలతో జరుగుతోంది:

1. సాహిత్యంలో పోకడలను (trends) పోల్చడం.
2. భాష-వ్యాకరణాంశాలను పోల్చి చూడడం.
3. సాంస్కృతిక విషయాలను పోల్చడం.

సాహిత్యంలోని వివిధ అంశాలను తులనాత్మకంగా పరిశీలించే వ్యాసంగాన్ని ఈ క్రింది విధంగా వింగడించవచ్చు:

1. సాహిత్య ధోరణుల తులన
2. ఒక్కో కాలఖండం తులన
3. గ్రంథాల తులన
4. రచయితల తులన
5. పరస్పర ప్రభావాల పరిశీలన

హిందీ-తెలుగు సాహిత్యాలలోని వివిధ విషయాలను గురించి ఇప్పటివరకు దాదాపు 70 పరిశోధనా వ్యాసాలు వ్రాయబడ్డాయి.(చూ. అనుబంధం)

కొంతమంది విద్వాంసులు 'తులనాత్మక పరిశీలన'కు పరిశోధనా (research) రంగంలో ప్రాధాన్యమివ్వక, చిన్నచూపు చూడడం తున్నది. అయితే వైజ్ఞానిక రంగంలో invention కు ఉన్న వైశిష్ట్యమే, పరిశోధనా రంగంలో discovery కి ఉన్నది. discovery of facts కూడా పరిశోధనా రంగంలో ప్రధాన తత్త్వం. మానవ భావాలలోగల సమైక్యతను తులనాత్మక పరిశీలన ద్వారా అభివ్యక్తీకరించి, సోదాహరణంగా, తర్కయుక్త ప్రణాళికతో emotional integration ను పెంపొందించే ప్రక్రియ తులనాత్మక పరిశీలనయే.

శ్రీమతి మహాదేవివర్మ తులనాత్మక పరిశీలన ప్రాశస్త్యాన్ని వివరిస్తూ అలా అన్నారు: 'అపరిచయ జనితాలయిన సందేహాలూ, అవిశ్వాసాలూ, అర్ధ పరిచయ జనితాలయిన భ్రమలూ మన సాంస్కృతిక గగనాన్ని ఆవరించుకుంటున్నాయి. రాజకీయ పార్టీల తలపోటీలు మన జీవితాలలోని సహజ సహానుభూతిని ఎండగొట్టి, వాటిని తరళజల రహితమయి ఎండిపోయి, మట్టిగొట్టుకొనిపోతున్న నదీగర్భంవలె, రస రహితంగా చేస్తున్నాయి. ...... తలపుల్లో ఔదార్యాన్ని నింపి, హృదయాలను హృదయాలతో జోడించి, జీవితంలో సామంజస్యాన్ని, సంవేదనశీలాన్ని కలిగించడానికి, అనేకత్వంలో నిక్షిప్తమయిన ఏకత్వాన్ని నిరూపించడానికి మళ్ళీ ఆచార్య పుంగవులు, సాధుమహా పురుషులు కావాలి.' అలనాడు వారు చేసిన కృషి ఈ రోజున మనం తులనాత్మక పరిశీలన, ఆదాన ప్రదానం ద్వారా సాధించాలి అని శ్రీమతి వర్మగారు వక్కాణించారు.[6]

ప్రస్తుతం తులనాత్మక పరిశోధనా కార్యక్రమం తరచుగా మన జాతీయ భాష అయిన హిందీలోనే జరుగుతున్నది. కాని ఇతర భాషల్లో కూడా తులనాత్మక పరిశీలన జరగడం ఎంతో అవసరం, ఔచిత్యపూర్ణం కూడా. విశ్వవిద్యాలయాలలోని హిందీ

6. శ్రీరామమూర్తి రేణుగారి 'ఆదాన్, ప్రదాన్' అనే పుస్తకానికి శ్రీమతి వర్మగారు రచించిన భూమిక నుండి.

శాఖలోనే కాక, ఇతర భాషా విభాగాలలో కూడా తులనాత్మక పరిశోధనకు ప్రోత్సాహం లభించాలి.

మామూలు పరిశోధకుడి కంటే తులనాత్మక రంగంలో పరిశోధన చేసే వ్యక్తికి రెండు భాషల సాహిత్య, సాంస్కృతిక సంప్రదాయాలు క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. సమసామయిక ప్రవృత్తులు, ఆయా సమాజాలలోని సామాజిక స్పృహ, సాహిత్యంపై వాని ప్రభావం గురించి అకళింపు ఉండాలి. ప్రక్రియ-ప్రవిధులే అనుసంధాన పరమావధి అని అనుకోకుండా, రెండు భాషలలోని రచనలలో నిక్షిప్తమయి ఉన్న సత్యాన్ని పరిశీలించి, ఆయా కృతులు ఏ విధంగా భావనాత్మక సమైక్యతకు తోడ్పడతాయో నిరూపించ గలిగి ఉండాలి. ప్రసంగానుకూలమయిన వ్యాఖ్యానం, సమానత - అసమానతల నిరూపణం, ఏకరూపత నిర్దేశనం- ఈ మూడు విషయాలు తులనాత్మక పరిశోధకుడి పరిశోధనలో సుస్పష్టంగా కనిపించాలి. తులనాత్మక దృక్పథంతో వ్యాఖ్యానిస్తున్నప్పుడు పరిశోధకుని మౌలికమయిన విమర్శాదృక్పథం వ్యక్తం కావాలి. ఇలా తులనాత్మకమయిన పరిశోధన జరిగి నపుడు భారతీయ సాహిత్యంలోని సమైక్యత నిరూపించబడగలదు. భాషలు వేరయినా, భావం ఒకటే నన్న విషయం తేలిపోగలదు.

తులనాత్మక పరిశీలనలో ప్రధాన మయిన విషయం 1. పరిశోధనకు విషయం ఎన్నుకోవడం. మూల భూతమయిన సమైక్యతను నిరూపించగలిగేదిగా ఉండాలి. ఇంతమటుకు ఆ విషయం గురించి ఎవరూ పరిశోధన చేసి ఉండకూడదు. తత్సంబంధమయిన పుస్తకాలు, ఇతర సాధనాలు ఉపలబ్ధమయ్యేట్టుగా ఉండాలి.

రెండో విషయం పరిశోధకుడి అభిరుచి, మానసిక ప్రవృత్తి, భాషాజ్ఞానం మొదలయినవి. ముఖ్యంగా ఈ రంగంలో పనిచేసే పరిశోధకుడికి రెండు భాషల, సాహిత్య ప్రవృతుల సమ్యక్పరిచయం ఎంతో అవసరం. అనువాదాలు, సమీక్షా ప్రధానాలయిన గ్రంథాలు secondary source of material క్రిందకు వస్తాయి. కాని మూల గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అర్థం చేసుకోవడం పరిశోధకుని కర్తవ్యం.

మూడో విషయం నిర్దేశకుడికి (Super-visor)కు సంబంధించినది. పరిశోధకుడిలో ఏయే గుణాలు అవసరమో, Supervisorలో కూడా ఆయా గుణాలు ఉండాలి. ఒక భాష వచ్చి రెండో భాష రాకుండా తులనాత్మక పరిశీలనా ప్రధానమైన పరిశోధనా వ్యాసాలను Supervise చేయగలుగుతానవడం అనధికార ప్రయత్నమే అవుతుంది. Supervisor దగ్గర తగినంత అవకాశం ఉండి ఉండాలి.

ఇలాంటి పరిశోధకుడు, Supervisor దొరికినపుడు పరిశోధనా వ్యాసాన్ని ఎలా వ్రాయాలనే విషయం కూడా చర్చనీయాంశమే. కొంతమంది విద్వాంసులు ఆయా భాషలలో కల ప్రవృత్తులు లేదా ధోరణులను (Trends) భూమికాప్రాయంగా వ్రాసి, ఆ తరవాత ఆయా ప్రవృత్తులను. ధోరణులను తులనాత్మకంగా పరిశీలించాలని అంటారు. మరికొంత మంది ప్రారంభం నుండే తులనాత్మకంగా పరిశీలించాలని అంటారు. అయితే ఆ ప్రవృత్తి ఉద్భవ-వికాస క్రమంగురించి తెలియందే, తులనాత్మక పరిశీలనకు సరియైన back-ground ఏర్పడదు. కనుక తగిన విధంగా ఆ భూమికకు పరిశోధనావ్యాసంలో చోటు కల్పించాలి.

ఇతర భాషలలోని అంశాలను ఉదాహరిస్తున్నప్పుడు వాటిని యథాతథంగా మన లిపిలో వ్రాసి, మూల నిష్ఠమయిన అనువాదమే ఇవ్వాలి కాని స్వతంత్రానువాదం లేదా కావ్యానువాదం పనికిరాదు.

ఇలాంటి తులనాత్మక పరిశీలన రెండు భాషలను ఆయా భాషలు మాట్లాడేవారిని దగ్గర తీసుకొని రావడానికి ఎంతగానో ఉపకరించగలదు. మనం అంతా ఒకటే అన్న భావాన్ని సాహిత్యపరంగా నిరూపించ గలిగే సాధనం తులనాత్మక పరిశీలన మాత్రమే. వైవిధ్యంలోని ఏకీభావాన్ని ఎత్తిచూపించి, సమస్త మానవ సౌహార్దభావానికి పునాదులు వేస్తుంది తులనాత్మక పరిశీలన. ఈ నాటి పరిస్థితులలో మన విశ్వవిద్యాలయాలలో తులనాత్మక పరిశీలనకు తగినంతగా ప్రోత్సాహం లభించడం ఎంతో అవసరం.

---

## మధ్యయుగం (Medieval Period)

### భక్తికాలం

A. సాహిత్య ప్రవృత్తులు :

1. రామభక్తి సాహిత్యము
—డా. చావలి సూర్యనారాయణమూర్తి
2. వైష్ణవ భక్తి సాహిత్యము —డా. కె. రామనాథన్
3. నీతి కావ్య సంప్రదాయము
—డా. కె. శివసత్యనారాయణ
4. శతక సాహిత్యము
—డా. యం.బి.వి.ఐ.ఆర్. శర్మ
5. నీతి శతక సాహిత్యము —డా. అన్నపూర్ణ
6. నిర్గుణ భక్తి సంప్రదాయము
—డా. రామలింగయ్య
7. కృష్ణ భక్తి సాహిత్యము
—డా. యన్.యస్. దక్షిణామూర్తి
8. శైవ సాహిత్యము —డా. జె.కె. విశ్వేశ్వరరావు
9. రామాయణాల్లో సామాజిక స్పృహ
—డా. సీతాలక్ష్మి

B. రచయితలు

1. సూరదాసు పోతన్నలు చేసిన వాత్సల్యచిత్రణ
—డా. లీలాజ్యోతి
2. అన్నమాచార్య - సూరదాసులు
—డా. పుట్టపర్తి సంగమేశము
3. క్షేత్రయ్య - విద్యాపతి
—డా. పి. సూర్యనారాయణ 'భాను'
4. కేశవ్ - శ్రీనాథుడు —డా. పుల్లయ్యారావు
5. సూరదాసు - పోతన్నల భక్తిభావము
—డా. కమలాదేవి
6. సూరదాసు-పోతన్నల భక్తిభావము
—డా. సి.హెచ్. రాములు
7. త్యాగరాజు-తులసీదాసుల భక్తిభావము
—డా. సుభద్ర

C. రచనలు

1. రామచరిత మానస్-రంగనాథ రామాయణము
—డా. రాఘవాచార్యులు
2. రామచరిత మానస్-రామాయణ కల్పవృక్షము
—డా. పి.వి. ఆచార్య
3. శివరాజభూషణ్-శివభారతము —డా. సావిత్రి
4. ,, ,, —డా. వసంతకుమారి

### ఆధునిక కాలము-కావ్యము

A. సాహిత్య ప్రవృత్తులు

1. స్వచ్ఛందతావాద కావ్యము
—డా. పి. ఆదేశ్వరరావు
2. ఛాయావాద కావ్యము —డా. నాగేశ్వరరావు
3. ఛాయావాద, భావవాదములలో వైచారికతత్త్వము
4. ఛాయావాద-భావ కవిత్వములలో ప్రకృతిచిత్రణ
—వర్మ
5. గీతి కావ్యము
—డా. కె. వి. సత్యనారాయణాచార్యులు
6. గద్యకావ్యము —డా. రామలింగేశ్వరరావు
7. ప్రగీతకావ్యము —డా. కామేశ్వరరావు
8. ప్రకృతిచిత్రణ —డా. ఏ.వి.యల్. కామేశ్వరి
9. నారీపరికల్పన —డా. కె. మల్లికార్జునరావు
10. స్వాతంత్ర్యోత్తర కావ్యము —డా. రుక్మిణి
11. స్వాతంత్ర్యోత్తర కవిత్వ పోకడలు
—డా. వెంకటరత్నము
12. బింబ విధానము —డా. మాచిరెడ్డి
13. ప్రగతి(అభ్యుదయ)వాదం—డా. రామానాయుడు
14. ,, —డా. పి. విశ్వనాథ్
15. ,, —డా. యం. రంగయ్య
16. ,, —డా. హెచ్. యస్. యం. కామేశ్వరరావు
17. గాంధీవాదం —డా. శివప్రసాద్
18. నయీ కవిత —డా. వి. విజయభారతి
19. మానవతావాదము —డా. సరగు కృష్ణమూర్తి

B. రచయితలు

1. కవయిత్రుల తులనాత్మక పరిశీలన -డా. శేషారత్నం
2. సుమిత్రానందన్‌పంత్ -దేవులపల్లి కృష్ణశాస్త్రి -డా. పి.ఎ. రాజు

C. రచనలు

1. సాకేత్-కల్పవృక్షము -డా. బి. సాయిలు
2. హల్దీఘాట్-రాణా ప్రతాపసింహ చరిత్ర -డా. ఓ. సత్యనారాయణ

## ఆధునిక కాలము - నాటకము

A. సాహిత్య ప్రవృత్తులు

1. హిందీ తెలుగు రూపక సాహిత్యము - డా. జి. పాండురంగారావు
2. ఏకాంకికలు - డా. విజయలక్ష్మీకుమారి
3. ఏకాంకికలు - డా. కొండారెడ్డి
4. చారిత్రక నాటకములు (మొగలాయి చరిత్రకు సంబంధించినవి) - డా. పి. విశ్వనాథము.

B. రచయితలు

1. ప్రసాద్ - పానుగంటి నాటకములు - డా. ఏ. గోపాలరావు
2. ప్రసాద్ - విశ్వనాథ సత్యనారాయణ - డా.జి. సుబ్బారావు
3. భారతేందు-వీరేశలింగం పంతులు- డా. ఖ్వాజా మియాం.
4. భారతేందు - వీరేశలింగం నాటకములలో సంఘ సంస్కరణ వాదము- డా. రామస్వారథ్ మిశ్రా

## ఆధునిక కాలము - కథా సాహిత్యము

### నవలలు

A. సాహిత్య ప్రవృత్తులు

1. నవలా సాహిత్యము:-డా.జి.వి. సుబ్రహ్మణ్యము
2. చారిత్రక నవలలు:-డా. చలసాని సుబ్బారావు
3. స్వాతంత్ర్యానికి ముందు వచ్చిన నవలల్లో జాతీయ భావం-డా. అల్లాఉద్దీన్
4. స్వాతంత్ర్యానికి ముందు వచ్చిన నవలల్లో వర్గ చైతన్యము - డా. శివరామరెడ్డి
5. స్వాతంత్ర్యానికి ముందు వచ్చిన నవలల్లో నగర జీవనము - డా. జయరాములు
6. నవలల్లో మార్క్సిస్టువాద ప్రభావము - డా. కె. సుబ్రహ్మణ్యము
7. నవలల్లో పాత్ర చిత్రణలో మనశ్శాస్త్రీయ సిద్ధాంతములు - డా. ఆర్. శ్రీధరరావు
8. నవలా రచయిత్రులు - డా. లీలావతి

B. రచయితలు

1. ప్రేమచంద - గోపీచంద - సత్యనారాయణ
2. ప్రేమచంద - తెలుగు నవలా రచయితలు - డా॥ శ్రీనివాసాచార్యులు
3. చతురసేన్ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ గారి నవలల్లో సామాజిక స్పృహ - డా॥ కె. మోహనరావు

## కథా సాహిత్యము

A. 1. కథా సాహిత్యము (47 వరకు)- డా॥ ఎస్. ఎం. ఇక్బాల్

2. కథా సాహిత్యములో సామాజిక స్పృహ - డా॥ బి. కె. సుమన్‌కుమార్

B. ప్రేమచంద-రవీంద్రుని కథలు - డా॥ వెంకటాచలము.

## ఆధునిక కాలము

*విమర్శ*

1. విమర్శాసాహిత్యము - డా. కృష్ణబాబు.

*గద్యము*

1. 19 వ శతాబ్దములో గద్యము - పోకడలు - డా॥ బి.వి. సూర్యనారాయణ.

## భాషాశాస్త్రము

1. క్రియా సంరచన - డా॥ కృష్ణాజీరావు.
2. పదముల అర్థగత అధ్యయము - డా॥ ఈ. కామేశ్వరి.
3. పదబంధముల తులనాత్మక అధ్యయనము - డా॥ సుబ్బారావు.

## జానపద సాహిత్యము

1. జానపద గేయ సాహిత్యము-డా॥ పశుపతిరావు.
2. జానపద కథంలో వీర రసము - డా॥ యం. సరస్వతి.
3. లోకోక్తులు - డా॥ వై. వెంకటరమణరావు.
4. సామెతలు - డా॥ యన్.యస్. దక్షిణామూర్తి.

## Ph.D. పట్టాకై కాకుండా స్వతంత్రంగా రచింపబడిన పరిశోధనా గ్రంథాలు

1. అధ్యాత్మయోగ్ ఔర్ చిత్తవికలన్ - ఓరుగంటి వేంకటేశ్వర శర్మ.
2. ఛాయావాదము, భావవాదము - డా॥ పి. ఎ. రాజు.
3. హిందీ ఔర్ తెలుగుకే ప్రతినిధి కవియోం కా తులనాత్మక్ అధ్యయన్- డా॥ కో. శివసత్యనారాయణ.
4. సాహిత్యిక్ ఆదాన్-ప్రదాన్ - డా॥ వారణాసి రామమూర్తి రేణు.
5. హిందీ ఔర్ తెలుగు : తులనాత్మక్ అధ్యయన్- ప్రొ. జి. సుందరరెడ్డి.
6. తులనాత్మక్ వ్యాకరణ్ - కీ॥శే॥ ఎ.సి. కామాక్షిరావు.
7. హిందీ తెలుగు వ్యాకరణోంకా తులనాత్మక్ అధ్యయన్ - శ్రీ యస్.వి. శివరామశర్మ.
8. తెలుగు ఔర్ హిందీ ధ్వనియోం కా తులనాత్మక్ అధ్యయన్ - శ్రీ జె. విశ్వమిత్ర.

తులనాత్మక అధ్యయనం అనేది కేవలం తెలుగు-హిందీలకు సంబంధించినది కాదు. భారతీయ భాషలలో పరస్పరం తులనాత్మక అధ్యయనం ప్రధాన లక్ష్యంగా ఎన్నో పరిశోధనాత్మక గ్రంథాలు రచించబడ్డాయి. వీటిలో హిందీభాషా - సాహిత్యాలతో ఆయా భాషా సాహిత్యాలను పోలుస్తూ వ్రాయబడ్డ గ్రంథాల సంఖ్యే ఎక్కువ. అంటే హిందీని మూలంగా చేసుకొని, పరిశోధకులు తులనాత్మక అధ్యయనం సాగించారు. విశ్వవిద్యాలయాల్లో, హిందీ శాఖల్లో జరిగినంతగా, మరే భాషా శాఖలో తులనాత్మక పరిశీలన జరగలేదంటే అతిశయోక్తి కాదు. మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల్లో ఒక్క ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖలో తులనాత్మక అధ్యయనం ప్రధానంగా ఒకేఒక్క పరిశోధన (మాలపల్లి-గోదాన్) జరిగింది. ఇతర భాషా శాఖలు కూడా తులనాత్మక అధ్యయనాన్ని తగినంతగా ప్రోత్సహిస్తే, అది జాతీయ సమైక్యతకు దారితీయగలదు.

తెలుగులో పరస్పర తులనాత్మక పరిశీలన ప్రధానంగా కొన్ని వ్యాసాలు కూడా ప్రచురించబడ్డాయి. వాటిలో మొదటిది డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు రచించిన 'తెలుగుతో హిందీ పొందిక' అన్నది. ఈ వ్యాసం ఫిబ్రవరి 1960 'భారతి'లో ప్రచురితమైంది. ఈ క్రింద పేర్కొన్న వ్యాసాలు కూడా పేర్కొనదగినవి:

1. హిందీ, తెలుగు — శ్రీ చక్రధరరావు — భారతి, సెప్టెంబరు, 1969.

2. వంగ సాహిత్యం తెలుగులోకి వస్తున్న తీరుతెన్నులు — శ్రీ స్ఫూర్తిశ్రీ — అఖిల భారత తెలుగు రచయితల ద్వితీయ సమ్మేళనం-1963.

3. తమిళ, కన్నడముల యందలి జైన వాఙ్మయం — డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య— శారదామంజీరాలు, 1977

4. కన్నడ-తెలుగుచుట్టరికము-సుజాత,1953

5. ఉరుదుతో పరిచయం పెరిగిన తెలుగు — కీ. శే. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి — ఆంధ్రప్రదేశ్ ఉర్దూ రచయితల సంచిక 1959-60.

6. తెలుగుపై ఉర్దూ సాహిత్య ప్రభావం — శ్రీ సదాశివ — భారతి, సెప్టెంబరు 1963.

ఈ వ్యాసంలో హిందీ-తెలుగు భాషా సాహిత్యాలలో జరిగిన తులనాత్మక వ్యాసంగాన్ని మాత్రమే ప్రధానంగా పేర్కొనడం జరిగింది. ఈ రంగంలో జరిగిన తులనాత్మక-అధ్యయనాన్ని స్థాలీపులాకంగా స్పృశించడానికి చేసిన ప్రాథమిక ప్రయత్నం. కనుక సమగ్రంగా ఉండగలదని అనడానికి వీలులేదు.



# తెలుగులో విజ్ఞాన సర్వస్వములు

—పీమకుర్తి శేషగిరిరావు

'విజ్ఞాన సర్వస్వము' అను ఒక ప్రత్యేక రచనా ప్రక్రియకు తెలుగు భాషలో శ్రీకారమును చుట్టిన పండితుడు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు. యూరోపీయ భాషలలో 17 వ శతాబ్ది మధ్య కాలము నుండియు వాడుకలోనికి వచ్చిన 'ఎన్‌సైక్లోపేడియా' అను పదమునే 'విజ్ఞాన సర్వస్వము' అని ఆ పండితుడు ఆంధ్రీకరించి, వ్యాప్తిలోనికి తెచ్చెను. కావున అట్టి 'ఎన్‌సైక్లోపేడియా' రచనకు దారి తీసిన వివిధ చారిత్రక విశేషములను ఇట సంక్షిప్తముగ పేర్కొనుట అవశ్యకము.

## ప్రాచీన యుగము

ఆదిమ మానవ స్థితి నుండి క్రమదశలో ముందంజ వేయుచు, మానవుడు, ప్రగతిపథాన పయనించసాగిన నాటి నుండియు, ఆయా కాలము లందలి తన అర్థికాద్యవసరముల పరిపూర్తికై వివిధ విజ్ఞాన శాఖలందు కొంగ్రొత్త విషయాలను కను గొనుచు కృషిని సాగించెను. సంఘపు మనుగడకై శ్రమ విభజనకు ఆవశ్యకత ఎక్కువైనకొలది, కొన్ని ప్రత్యేక వర్గముల మానవులు కొన్ని నిర్దిష్ట విజ్ఞాన శాఖలలో మాత్రమే విరివిగ కృషిచేసి, అందు పరి ణతిని సాధించుట పరిపాటియైనది. కాని, విజ్ఞానము అవిభాజ్యము, ఏ విజ్ఞాన శాఖయు, తక్కినవాని నుండి సమూలముగ విడివడి వర్ధిల్లనేరదు. కావున ఆయా విజ్ఞానశాఖలలోని వివిధవిషయాలను ఒక చోట గుదిగ్రుచ్చి, తెలియజేయు ఆవశ్యకతయు క్రమ ముగ ఏర్పడినది. ఇట్టి అవసరపు పరిపూర్తికై సమర్థు లగు పండితులచే రూపొందింపబడిన గ్రంథముల వలన, ప్రతి విజ్ఞాన శాఖవారును తక్కిన వాని యందలి విషయములను స్థూలముగా అర్థము చేసికొని తమ విజ్ఞానపు ప్రగతికి దగినంతవరకు ఆ సమా చారమును వాడుకొనుటకు వీలు ఏర్పడినది. ఇట్టి గ్రంథములను మనము 'సర్వంకష' గ్రంథములు అని వ్యవహరింపవచ్చును.

ఇట్టి సర్వంకష రచనలు ప్రాచీన సాహిత్య ములందు అన్నింట వెలువడినవి. సంస్కృత భాషకు సంబంధించినంత వరకు అట్టి వానిలో తొలుత పేర్కొనదగినది 'బృహత్సంహిత' తన కాలము వరకు గల విద్యాది వివిధ కళలను, ప్రకృతి, భూగోళ, జ్యోతిశ్శాస్త్రాదులందును తెలియనైన సమాచారమును అంతటిని సంక్షిప్తముగను సువిజ్ఞేయమగు రీతిలో, పాఠకులకు అందజేయుటకు వరాహమిహిరుడు (క్రీ.శ. ఆరవ శతాబ్ది) సాగించిన కృషికి ప్రతిఫలమే ఈ గ్రంథము. ఆ పండితుడు రచించిన పంచసిద్ధాంతి కయు ఒక విధముగ 'సర్వంకష' రచనయే. జ్యోతి స్సిద్ధాంతమును, అప్పటికి ప్రచలితములై ఉండిన అయిదు విధముల సంప్రదాయములను ఆయన అందు వివరించెను.

వరాహమిహిరుని పైగ్రంథములు మాత్రమే కాదు; కొన్ని పురాణములును దాదాపుగా ఈ కోవకు చెందినవియే యగునని పండితులలో పలువురి అభి ప్రాయము. పురాణముల విషయమున నిశిత పరి శోధనను నిర్వహించిన మహామహోపాధ్యాయ హర

ప్రసాదశాస్త్రి, అగ్ని, నారద, గరుడ పురాణములు ఒక విధపు సర్వంకష రచనలుగ పేర్కొనదగినవని భావించెను. సంస్కృత వాఙ్మయమునందలి కళలకు, విజ్ఞాన శాస్త్రములకు సంబంధించిన సమాచారము అంతయు ఆ పురాణములలో కననగుచున్నది. వైద్యము, వ్యాకరణము, నాట్యము, సంగీతము, జ్యోతిషము, సంగీత,చిత్రలేఖన, శిల్పాది లలితకళలు, ఇందు సంక్షేపముగ తెలియజేయబడినవి. పద్మ, స్కాంద, భవిష్య పురాణములందు తీర్థముల ప్రశంస విరివిగ కన్పట్టును. మత్స్య, బ్రహ్మాండ, వాయు పురాణము లందు దేశచరిత్రకు సంబంధించిన విషయములును, భవిష్య, మత్స్య పురాణములందు దేవ ప్రాసాదాదుల నిర్మాణ రీతులును ప్రసక్తితములు. ఇటుల పై పురాణములందు కన్పట్టు ప్రత్యేక లక్షణములను అటుంచినను, పురాణములకు అన్నింటికి సామాన్య లక్షణములుగ పేర్కొనబడు సర్గ, ప్రతి సర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములు వివరణమునను భూగోళ ఖగోళాద్యనేక విషయములు చర్చితములు.

పై పురాణములందు ఆయా విషయములను ఇటుల చేర్చుటకు సహకరించిన సర్వంకష రచనలు కొన్ని ఆ కాలమున విస్తృత రూపములతో ఉండియుండును. కాని పదునొకొండవ శతాబ్ది తరువాత భారత దేశమును లోగొనిన రాజకీయ విప్లవమున అట్టివి లుప్తములైనవి.

పదునొకండవ శతాబ్ది అనంతరమున సైతము ఇట్టి సర్వంకష రచనలను వెలయించు యత్నములు అటనట సాగినవి. కల్యాణి చాళుక్యనృపుడగు సోమేశ్వరుని (క్రీ.శ 12 వ శతాబ్ది) అభిలషితార్థ చింతామణి (మానసోల్లాసము) ఆ కాలమున వెలువడినదే. అప్పటికి దక్షిణ భారతము మహమ్మదీయాక్రాంతము కాలేదు; ప్రాచీన సంస్కృత సారస్వతమునకు అచట ఆనాడు ఆదరణమును ప్రోత్సాహమును ఉండినవి. తన కాలము నాటికి తెలిసియుండిన విద్యలనన్నింటిని, సంక్షిప్త రూపమున, ఈ సంస్కృత గ్రంథమున శ్లోకములతో రచయిత రూపించెను.

భారత దేశము మహమ్మదీయాక్రాంతమై, ప్రాచీన సంస్కృతికి ఆదరణ సన్నగిలుచుండిన కాలమున సైతము ఇట్టి సర్వంకష రచనలను సంస్కృతమున రూపొందించు కృషి కొంత అటనట సాగియుండెనని భావించుటకు అవకాశములు కలవు. ఈ భావనను బలపరచు రెండు సంఘటనలు భారత దేశ చరిత్రలో కన్పట్టుచున్నవి. వానిని పేర్కొనుట సముచితము.

అందు తొలుతటిది 14 వ శతాబ్ది అంతమునకు చెందినది. అప్పటికి భారతదేశము అంతయు మహమ్మదీయ పరిపాలనకు లోనైనది. దేశీయ భాషా సంస్కృతులు ఆదరణను కోల్పోయి లుప్తప్రాయము లయినవి. అట్టి పరిస్థితిలో జాతీయ సంప్రదాయముల పునరుద్ధరణకై తుంగభద్రా నదీ తీరమున విద్యానగరము రాజధానిగా విద్యారణ్యుని ఆశీర్బలముతో ఒక నూత్న రాజ్యము రూపుగొన్నది. అంతట ఆ విద్యారణ్యుని ప్రోత్సాహమున ప్రాచీన సారస్వతపు పునరుద్ధరణ కొంత జరిగినది. కొంత క్రొత్త సారస్వతమును వెలువడినది. అందు, ఈ ప్రసక్తిత విషయమునకు సంబంధించినది 'సర్వదర్శన సంగ్రహము.' భారతదేశమున రూపుగొనిన వివిధ దర్శనముల రూపరేఖలను అందు, తద్రచయితయగు మాధవాచార్యుడు స్పష్టీకరించెను.

ఇక రెండవ సంఘటన 15 వ శతాబ్ది అంతము నాటిది; ఉత్తర హిందూస్థానమున అది సంఘటిల్లినది. భారతదేశమున సంగీత శాస్త్ర విషయములలో పెక్కింటిని గురించి ఏకాభిప్రాయత అప్పుడు లేకుండెను; అందువలన ఆ శాస్త్రపు అభివృద్ధికి భంగము వాటిల్లెను. ఇట్టి దురవస్థనుండి సంగీత శాస్త్రమును రక్షించుటకు, వివిధ ప్రాంతముల పండితులను ఒక

చోటుచేర్చి, ఆయా సంప్రదాయముల ప్రామాణిక గ్రంథముల తులనాత్మక పరిశీలనను సాగించుట అవశ్యకమయ్యెను. ఈ కార్యమును నిర్వహించుటకు 'కడా' మాండలిక ప్రభువు పూనుకొనెను. ఈ 'కడా' మండలము, నేటి అలహాబాదునకు దరిదాపుల్లో ఆనాడు ఉండెడిది. ఈ మాండలికుడు, హిందువుగ జన్మించియు, పరిస్థితుల ప్రాబల్యమువలన, ఇస్లాము మతమును అవలంబించి సుల్తాన్ శాహీ అను పేర ప్రసిద్ధుడయ్యెను. ఏ మతమునకు చెందినను, తాను భారతీయుడగుట విస్మరింపక, భారతీయ సంస్కృతి పరిపోషణకు నడుముకట్టిన విజ్ఞుడతడు. స్వయముగ అతడు సంస్కృత పండితుడు. తాను నిర్వహింప దలచిన శాస్త్రచర్చాసదస్సునకు దేశపు నలుమూలల నుండి పండితులను ఆయన ఆహ్వానించెను. సంగీత శాస్త్ర గ్రంథములను అన్నిటిని వారికి సమకూర్చెను. ఉత్తర హిందూస్థానమున అప్పటికే లుప్తములైన కొన్ని గ్రంథాలను దక్షిణ భారతము నుండి తెప్పించెను. ఇటుల అతడు తన ఆధ్వర్యవమును నిర్వహించిన ఈ సదస్సే 'పండితమండలి' అని చరిత్రలో ప్రసిద్ధిని ఆర్జించినది. నెలల తరబడిగ, ఆ మండలిలో చర్చలు సాగినవి. తత్ఫలితముగ రూపొందిన నిర్ణయములను, ఆయా విషయముల వరుసలో ఒక గ్రంథ రూపమున వెలువరించవలసినదిగా, ఆ ప్రభువు ఆదేశించెను. తత్ఫలితముగ వెలువడినదియే 'సంగీత శిరోమణి' అను గ్రంథము. సంగీత శాస్త్రమునకు సంబంధించినంతవరకు ఇది ఒక సర్వంకష రచనయే. అందలి అధ్యాయములు 'ప్రకాశములు' అని వ్యవహృతములు కాని ఆ గ్రంథము నేడు సమగ్రముగ లభించుటలేదు. అందలి గీత, రాగ, ప్రబంధ ప్రకాశములు మాత్రమే ఇప్పటికి ఉపలబ్ధములు.

పైన పేర్కొనబడిన రెండు సంఘటనలును ప్రాచీన భారతీయ సారస్వత వైభవపు తుది వెలుగుగ మాత్రమే పరిగణనీయములు.

ఒక ప్రాచీన భారతీయ సారస్వతమున మాత్రమే కాదు; దాని రీతిగనే, ప్రాచీనములగు తక్కిన చీనీయ, గ్రీకు, లాటిన్ సారస్వతములందు సయితము ఇట్టి సర్వంకష రచనలు రూపొందినటుల తెలియవచ్చుచున్నది. 15వ శతాబ్ది ఆరంభమున చీనాను పాలించిన మింగ్ వంశపు పాలకుడొకడు 2,000 మంది పండితులను ప్రోత్సహించి, సమకాలీనములగు అన్ని కళా, విజ్ఞాన శాస్త్రములను సంక్షేపముగ తెలియజేయు ఒక ఉద్గ్రంథమును రచింపజేసెననియు, ఇట్టిదానికి మార్గదర్శకముగ తత్పూర్వము ననే అట్టి గ్రంథములు కొన్ని ఉండి యుండెననియు చీనీయ చరిత్రవలన విదితము. గ్రీకు భాషయందును క్రీ.పూ. నాలుగవ శతాబ్ది యందే ఇట్టి సర్వంకష రచన రూపొందెనని ఆ సాహిత్యపు చరిత్ర యందు కననగుచున్నది. లాటిన్ భాషలో ప్లినీ (క్రీ. శ. 23-79) అను నతడు 'హిస్తోరియే నాచురాలిస్' [ప్రకృతి పరిశీన] అను ఒక సర్వంకష రచనను వెలయించెను; అందు 37 అధ్యాయములు కలవు; ఒక్కొక అధ్యాయము ఒక్కొక శాస్త్ర శాఖకు వినియుక్తము.

పై ప్రాచీన సంస్కృతులన్నియు క్రీ.శ. 11వ శతాబ్ది నాటికి క్రమమున తమ పటిమను గోల్పోయినవి. ఆయా సంస్కృతులకు నెలవులైన దేశములందలి పండితులలో రాజకీయ, సాంఘిక కారణముల వలన, జిజ్ఞాస సన్నగిలినది; మౌలిక విషయ గవేషణ మరుగువడినది. ఏవియైన ఉత్కృష్ట రచనలు ఆ దేశములందు ఎటనైన ఆ తరువాతి కాలమున రూపొందినను, అవి ఆనాటి దుస్థితికి కేవలాపవాదములుగ మాత్రమే మిగిలినవి. విజ్ఞాన పథమున మానవుని ప్రగతి కుంటువడి, ఆగిపోయి, వెనుకంజ వేయుచున్నాడా అను ఆశంకకు తావొసంగిన దుష్కాలమది. అట్టి పరిస్థితులలో ప్రాచీన యుగము కనుమరుగై, మధ్యయుగమునకు తావొసగినది.

## మధ్యయుగము

విశ్వేతిహాసగతిని సునిశిత దృష్టితో పరికించు వారికి, అందొక చమత్కృతి ద్యోతకమగును. ఒక సంస్కృతి పరిణతిని ఆర్జించి, విజ్ఞాన పథమున కడు దూరము పయనించియు, బాహ్యములును అంతర్గతములునగు పలు కారణములవలన శక్తిని కోల్పోయి లుప్తప్రాయమైనపుడు మానవచరిత్ర అంతటితో ఆగిపోవదు. ఆ పూర్వ సంస్కృతి యందలి వివిధ విజ్ఞాన శాఖల బీజములు- జ్ఞాతాజ్ఞాత రూపములలో పయనించి, వేరొకచోట నెలవు కల్పించుకొని, క్రొత్త నేలలో అప్పటి దేశకాలాదులకు అనుగుణపు రీతిలో, పూర్వముకన్న త్వరితగతిలో, పూర్వముకన్న మిన్నగ వికసనము పొందుట చరిత్రయందు కననగును. కాలగర్భమున వివిధ సంస్కృతులు లీనమగుచు, క్రొంగ్రొత్త సంస్కృతులు రూపొందుచుండుటకు నడచిన మానవేతిహాసములోనంతటను- మణిగణమందు సూత్రము వలె- ఒక సంధాయక శక్తి వర్తించుచున్నదని కొందరు ప్రసిద్ధ ఐతిహాసికులు, ఇటువలెనే సంభావించిరి. అట్టి సంధాయక శక్తియే ఈ మధ్యయుగమున తన కార్యనిర్వహణకు అరబ్బీ సంస్కృతిని ఒక సాధనముగ వినియోగించుకొనినది. గ్రీసు, చీనీయ, భారతీయ సంస్కృతులందలి విజ్ఞాన బీజములను-గణిత, ఖగోళ, వైద్య, యాంత్రిక శాస్త్రముల సారములనేగాక వివిధ సాహిత్యప్రక్రియలను కూడ- సేకరించి, పశ్చిమ యూరపునకు అందించుటలో అరబ్బులు విశ్వమానవ విజ్ఞానమునకు గణనీయ సేవ చేసిరి. ఇందులకు తోడుగ కాన్‌స్టాంటినోపిల్ పతనము (1453) వలన నిరాశ్రయులైన గ్రీకు పండితులు అనేకులు పశ్చిమ యూరపునకు పయనించి, అట ప్రాచీన విజ్ఞాన ప్రచారమునకు తోడ్పడిరి. అప్పటికే పవిత్ర రోమక సామ్రాజ్యపు అండన, తమ ప్రాంతములందు వర్ధిల్లిన లాటిన్ భాషను, మాధ్యమముగా గ్రహించి, ఈ ప్రాచీన విజ్ఞానమును స్వీయము చేసికొని పశ్చిమ యూరోపీయ రాజ్యములు ముందంజ వేసినవి. అట్టి ప్రగతిలో సర్వంకష గ్రంథరచనయు ఆదరింపబడినది.

'ఎన్‌సైక్లోపేడియా' అను పేరును ఒక విధపు సర్వంకష రచనకు వాడుట తొట్టతొలుతగ జర్మనీలో జరిగినది (1630). లాటిన్ భాషలోనికి చొరబడిన గ్రీకు భాషాపద మిది. వ్యుత్పత్తిని అనుసరించి దీనిని 'సంవలిత విజ్ఞానము' అని అనువదించవచ్చును; భావార్థమునుబట్టి 'సమాకలిత విజ్ఞానము' అనుట సరి కుదురును. ఇటుల జర్మనీలో తొలుత నిర్ధారితమయిన ఈ పేరు క్రమముగ తక్కిన యూరపీయ దేశముల కును ప్రాకినది. అప్పటికే పశ్చిమ యూరపున వివిధ దేశభాషలు, గ్రీకు, లాటిన్ భాషలనుండి పలుపదము లను గ్రహించి, సారస్వత సృష్టికి అనువయినవిగ, కాలు నిలువద్రొక్కుకొనగలిగినవి. ఆ భాషలును ఈ 'ఎన్‌సైక్లోపేడియా' అను పదమును గ్రహించి, ఆ శీర్షికతో సర్వంకష గ్రంథముల రచనకు పూనుకొనినవి. అట్టి కృషిలో మొదటి అడుగువేసినది ఆంగ్ల భాష. అప్పటివరకు లాటిన్‌లో వెలువడిన 'ఎన్‌సైక్లోపేడియా'లలో అకారాదిక్రమము పాటింపబడలేదు. ప్లినీయొక్క రచనవలెనే రచయితను నచ్చిన ఏదియో ఒక క్రమమును అనుసరించి మాత్రమే విషయములు అందు సంగ్రథితములు. ఈ పద్ధతికి స్వస్తి చెప్పి, తొలుతగ అకారాదిక్రమమును పాటించుచు ఆంగ్ల భాషలో 'చాంబర్స్ ఎన్‌సైక్లోపేడియా' 1728 లో వెలువడినది. దాని ప్రచురణ కర్తలు ఆ గ్రంథమునకు 'యాన్ యూనివర్సల్ డిక్షనరీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సయిన్సెస్' (కళా విజ్ఞానముల విశ్వకోశము) అని ఒక పర్యాయనామము కూడ వాడిరి. మూడు సంపుటములలో వెలువడిన ఆ గ్రంథము, నేటి విజ్ఞాన సర్వస్వపు రూపమున ఉండెడిది కాదు దాదాపుగ అది ఒక నిఘంటువు. పదములకు, వ్యుత్పత్త్యర్థ, భావార్థ, రూఢ్యర్థ, ప్రయోగవిశేషములతో పాటుగ ఆ పదముచే రూపితమగుచాని రూప, నిర్మాణ, ప్రయోజన విశేషములును అందు సంగ్రహముగ

తెలుపబడెడినవి. ఆ తరువాతి కాలమున ఈ నిఘంటువును ఫ్రెంచి భాషలోనికి అనువదింపబడెనని కొందరు ఫ్రెంచి పండితులు పూనుకొనిరి. కాని, అనతికాలముననే ఆ గ్రంథపు ప్రయోజనము అంతగ ఉండదని ఆ పండితులు గ్రహించి, స్వయంకృషితో, ఫ్రెంచి భాషలో ఒక 'ఎన్‌సైక్లోపేడియా'ను, అకారాద్యను క్రమణికారీతిలో వివిధ వైజ్ఞానిక విషయాలను వివరించి ఒక నిఘంటువును రూపొందించవలెనని కృషి ప్రారంభించిరి (1748). ఈ కృషికి అధ్వర్యవము వహించినవాడు విజ్ఞానిగను, తాత్త్వికుడగను ప్రసిద్ధి వహించిన డిడెరో. అతనికి చేదోడుగ నిలిచిన వారు డి ఆలంబెర్ట్, వాల్‌ఉయిర్. ఇందు తొలుతటి యాతడు గణితశాస్త్రమున ప్రామాణికుడుగ ఆ కాలమున ప్రసిద్ధిని ఆర్జించెను; ఇక రెండవవాడు తన రచనలచేత, ఒక ఫ్రాన్సుదేశమునే కాదు, యావత్ యూరప్ ఖండమును ప్రభావితము చేసిన మహా రచయిత. వీరు ముప్వురును ఆనాటి మత భావనలను విమర్శించుటలో అగ్రేసరులు; అందువలన ఆ 'ఎన్‌సైక్లోపేడియా' ప్రభుత్వపు ప్రతిఘటనను ఎదురొడ్డి ఎదుర్కొనక తప్పినది కాదు; అందుకు తోడుగ ఆర్థికముగ సైతము ఎన్నో ఇబ్బందులను అది ఎదుర్కొనవలసివచ్చినది. ఆ 'ఎన్‌సైక్లోపేడియా' ప్రథమ సంపుటము 1751 లో వెలువడినది; 17 వది యగు కడపటి సంపుటము 1765 లో వెలుగుచూచినది.

ఈ ఫ్రెంచి 'ఎన్‌సైక్లోపేడియా' ప్రచురణ మానవేతిహాసమున ఒక ప్రముఖ ఘట్టముగ పరిగణింపబడినది. డిడెరోకు సమకాలికుడై, ఆతనితో తాత్త్విక భావనలలో ఏ విధముగను ఏకీభవించని ఒక మతాచార్యుడు, బ్రూనెటీరీ అనువాడు "ఈ కాలపు ఒక సంచలనాత్మక సంఘటన ఇది; ఇదివరకటి ప్రగతికి అంతటికి గమ్యస్థానమిది; ఇక ముందటి ప్రగతికి అంతటికి ఇది మూలస్థానము. అందువలన 18 వ శతాబ్దిని వివరించు ఎట్టి చరిత్రకైనను ఇది ఒక కేంద్రము" అని దానిని ప్రశంసించెను. ఈ కృషికి అధ్వర్యవము వహించిన డిడెరో సైతము దీనిని ఒక మహోద్యమముగా తొలుతటి నుండియు సంభావించెను. ఆ గ్రంథపు ప్రచురణను మొదలిడుటకు ముందుగ అతడొక ప్రాస్పెక్టస్ (పరిచయ పత్రము)ను ప్రకటించెను. అందు అతడు 'వివిధ విజ్ఞాన శాస్త్రముల అన్యోన్యాశ్రయతను 'ఎన్‌సైక్లోపేడియా' అను పదము పరిస్ఫుటము చేయును' అని పేర్కొనెను. అంతేకాదు; 'ఎన్‌సైక్లోపేడియా' యొక్క లక్ష్యమును నిర్వచించుచు ఇట్లు నుడివెను :

'నేల నాలుగు చెరగులందు చెదరిపడియున్న విజ్ఞానమును ఒక చోటికి చేర్చి, దానిని సమకాలికులకు వివరించుటయు, దానిని ముందు తరములవారికి అందజేయుటయు ఎన్‌సైక్లోపేడియా యొక్క లక్ష్యము. ఇందుకు మనము పూనుకొనుటవలన సిద్ధించు ఒక ప్రయోజనము కలదు. గత శతాబ్దముల మానవులు శ్రమించి ఆర్జించిన విజ్ఞానము, వారితోనే అంతరించకుండ కాపాడి, రాబోవు తరముల వారికి అందించి, వారు ఎక్కువగ విద్యాసంపన్నులై, మరింత మిక్కిలిగ శీలవంతులైన సుఖజీవనము సాగించుటకు నెరవేర్చినవార మగుటయే గాక, మానవ జాత్యభివృద్ధిని ఆకాంక్షించని రీతిగ మనము అంతరించి రాని అపఖ్యాతి మనకు చేకూరకుండ వర్తించిన వారము అగుదుము."

డిడరో యొక్క సహచరులగు డి అలంబెర్ట్, వాల్‌టెయిరులును గూడ ఇట్టి ఉత్కృష్ట భావములచే ప్రేరేపించినవి. అందువలననే వారి కృషి ఫలితము లగు కొన్ని రచనలు, ఎన్‌సైక్లోపేడియా ద్వారా యూరపున వ్యాపించి ఒక నూతన శకమునకు దారి తీసినవి. అటులని ఫ్రెంచి ఎన్‌సైక్లోపేడియా యంతయు తొలుతటి ముద్రణముననే దోషరహితముగ రూపొందెనని చెప్పుట యథార్థమునకు విరుద్ధము. అందనేకములగు అవకతవకలును చోటు కల్పించుకొనినవి. కొన్ని రచనలలో మతభావము హేతువాదానికి స్వస్తి చెప్పినది; కొన్నియెడల విషయ కథ

నము వాస్తవమునకు దూరమైనది. పునఃపరిశీలనలో ఇట్టివానిని కొన్నిటిని డిడెరో పండితుడే కనుగొనెను. అందువలననే ఈ విషయమై ప్రసక్తించుచు ఆ పండితుడు 'ఒక ఎన్‌సైక్లోపేడియా యొక్క ప్రథమ ముద్రణ, అసమగ్రము, అవ్యవస్థితమునయి యుండుటను అరికట్టు మార్గమేదియు లేదు' అని వ్రాసెను (1755). తరువాత వరుసబడిగ జరుగు పునస్సంశోధిత ముద్రణలలో లోపములు క్రమముగ తొలగింపబడి గ్రంథమున పరిపుష్టతయు, ప్రామాణికతయు పెంపొందగలవని ఆతని అభిప్రాయము.

ఇటుల కొన్ని లోపములున్నను, మొత్తము మీద ఫ్రెంచి ఎన్‌సైక్లోపేడియా, చరిత్రలో ఒక మలుపునకు దారితీసినది. కొందరి అభిప్రాయమున ఆధునిక యుగము అంతటితో మొదలైనది.

## ఆధునిక యుగము

### ఆంగ్లాది యూరపీయ భాషలు

ఫ్రెంచి ఎన్‌సైక్లోపేడియా పెట్టిన వరవడిని అనుసరించి, ఆంగ్లమున తొలుతగ 1768 లో 'ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా' ఆరంభితమై 1771 నాటికి మూడు సంపుటములుగ రూపొందినది. కాని, అంతటంతట వరుసబడిగ పునస్సంశోధిత ముద్రణలు వెలువడి, సంపుటముల సంఖ్య 1966 నాటికి 24 సంపుటములుగ పరిణమించినవి; అంతటంతట రాజా సమాచారమును పాఠకులకు అందజేయుటకై వార్షికానుబంధములను ప్రచురించుటకును దీని ప్రచురణకర్తలు ఏర్పాటులను చేసిరి. ఆయా అనుబంధముల సమాచారమంతయు ఆ తరువాత వచ్చు నూతన ముద్రణమున చేర్చబడును. 1968 లో ఈ ఎన్‌సైక్లోపేడియా ద్విశతి (బైసెంటినరీ) ఉత్సవములను నిర్వహించుకొనుటయే గాక, ఆ సందర్భమున 'బ్రిటానికా పెర్‌స్పెక్టివ్స్' అను పేర మూడు సంపుటములలో ఒక ఉద్గ్రంథమును ప్రచురించినది. వివిధ కళా, శాస్త్ర శాఖలు ఆ కాలమునాటికి సాధించిన ప్రగతిని సింహావలోకనము చేయు రచనలు అందు సంపుటీకరింపబడినవి. ప్రపంచ ప్రసిద్ధులగు టాయిన్‌బీ వంటివారు అందులకు తమ రచనలను పంపి సహకరించిరి.

19 వ శతాబ్ది మొదలుగ యూరపునను, అమెరికా యందును వివిధ భాషలలో ఇట్టి సర్వంకష గ్రంథములు వెలువడినవి. విజ్ఞాన శాఖ లన్నింటిని పరామర్శించునవియేగాక ఒక్కొక్క ప్రత్యేక విజ్ఞాన శాఖకు-ఆర్థిక శాస్త్రము, చరిత్ర, సాహిత్యముల వంటి వానిలో ఒక్కొక్కదానికి-వర్తించు ఎన్‌సైక్లోపేడియాలును అనేకములు ప్రచురితములైనవి, ప్రచురితములగుచున్నవి.

19 వ శతాబ్ది తొలి పాదమున బ్రిటిష్ పాలనము భారతదేశమున సుప్రతిష్ఠితమైనంతట ఆంగ్లము బోధన భాషగ స్థానమును ఆర్జించి, భారతీయులలో ఉన్నత విద్యావంతులగు పలువురకు 'ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా'తో పరిచయము ఏర్పడినది. అట్టి గ్రంథము భారతీయ భాషలందును రూపుగొనుట సముచితమను అభిప్రాయమువేర్పడినది. అట్టిగ్రంథపు రూపకల్పనయు, ప్రచురణయు కష్టసాధ్యమగుటను గుర్తించిన పలువురు నిరుత్సాహపడి యూరకుండిరి. కాని, తెలుగు దేశము మాత్రము ఆ కృషి యందు ముందంజవైచినది. పందొమ్మిదవ శతాబ్ది అంతమగు నాటికి ఈ తెలుగు భూమియందు సంస్కృతమున అకారాదిక్రమమున విషయచర్చ సాగిన ఒక సర్వంకష గ్రంథము - లఘు శబ్దార్థ సర్వస్వము - వ్రాత ప్రతిలో సమగ్ర రూపమును సాధించినది; ఇరువదవ శతాబ్దిలో రెండవ దశకమున తెలుగున ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము-అకారపు అంతము వరకు-ప్రచురితమైనది.

### లఘు శబ్దార్థ సర్వస్వము :

పరవస్తు వెంకటరంగాచార్యస్వామి అను ఒక ప్రముఖ సంస్కృత పండితుని నిరంతర పరిశ్రమ వలన రూపొందినది లఘు శబ్దార్థ సర్వస్వము.

సంస్కృత వాఙ్మయమున మత, శాస్త్ర, భాషా, సాహిత్యములకు సంబంధించి లభ్యమగు సమాచారము సంతటిని అకారాది క్రమమున ఇట ఆ పండితుడు పర్చెంచెను. దీని ముద్రణకై ఆయనయే స్వయముగ పూనుకొని ఒక ముద్రణాలయమును స్థాపించి, అందు 'అ' సంపుటమును 1877 న, 'ఆ' సంపుటమును 1898 లో వెలువరించెను. కాని, ఆ తరువాత అనతి కాలముననే ఆయన మరణించుటవలన తక్కిన సంపుటముల ముద్రణ సాగినది కాదు. వ్రాతప్రతి మాత్రము ప్రభుత్వపు వ్రాతప్రతుల భాండారమున సురక్షితముగ ఉన్నది ముద్రితములైన సంపుటముల ప్రతులును లభ్యములు కాకున్నవి.

**ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము :**

దీని అధ్వర్యుడు కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు (1876-1923) అను విషయము ఇదివరకే ప్రసక్తితము. ఆయన బహుభాషా పండితుడు; మాతృభాషయగు తెలుగుననేగాక, సంస్కృత, ఆంగ్ల, మహారాష్ట్ర భాషలలో నిష్ణాతుడుగ ఆయన ప్రసిద్ధిని గడించెను. తత్త్వ శాస్త్రమును, సంస్కృతమును ప్రధాన విషయాలుగా గ్రహించి బి.ఎ. ఆనర్సులో ఆయన ఉత్తీర్ణుడయ్యెను (1900). మానవేతిహాసాన్ని శ్రద్ధతో పఠించినవాడు ఆ పండితుడు. తెలుగు దేశమున చారిత్రక విషయ పరిశోధనకు మార్గ దర్శులుగా పేరొందిన ప్రముఖులలో ఆయన అగ్ర శ్రేణికి చెందినవాడు. శాసన పరిశోధన విషయమున ఆయన అందెవేసిన చేయి. ఆయనవద్ద అంతేవాసిగ వర్తించిన మల్లంపల్లి సోమశేఖరశర్మ, తరువాతి కాలమున శాసన పరిశోధక పండితులలో అగ్రస్థాన మును ఆర్జించెను. లక్ష్మణరావును సాటికాలంపువారే ఒక సంచరత్ విజ్ఞాన సర్వస్వముగ భావించిరి. ఎన్‌సైక్లోపేడియా ఉద్యమమునకు పితామహుడనదగు డిడెరో పండితునితో విద్యా సంపత్తిలో, పట్టుదలలో, హేతువాద నిరతిలో, తాత్త్విక భావనలలో పెక్కు సామ్యములు లక్ష్మణరావునకు గలవు. లక్ష్మణరావు నకు, ఆనాటి పరిస్థితులను అనుసరించి, తక్కినవారికి వలెనే, ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికాయే స్ఫూర్తికారణమై యుండవచ్చును; కాని, యూరోపియ చరిత్రలో సువిదిత పరిచయము గల ఆ పండితునకు, ఈ విషయమున డిడెరోయే మార్గదర్శకుడై యుండెనని సంభావించుటకు ఉపపత్తులు కలవు. తన పరిచయపత్రమున డిడెరో "విజ్ఞానముల అన్యోన్యాశ్రయతను ప్రస్ఫుటము చేయునది అనియే ఎన్‌సైక్లోపేడియా పదమునకు అర్థము" అని పేర్కొనుట ఇదివరలో చెప్పబడినది. బహుశః ఆ నిర్వచనముచే ప్రభావితుడగుట వలననే తాను సంగ్రథితము చేయనున్న గ్రంథానికి 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' అను పేరును లక్ష్మణరావు పెట్టి యుండును. ఆ తరువాత తక్కిన భారత భాషలందు ఇట్టి గ్రంథమును వెలువరింప సంకల్పించిన వారలు 'కోశమ్' అను పదమునే ఎక్కువగ అభిమానించి రనుట ఇట గుర్తింపదగు విషయము. మహారాష్ట్రుల జ్ఞానకోశ్, బెంగాలీల విశ్వకోశ్, హిందీవారి హిందీ విజ్ఞానకోశ్ ఇట్టివియే. 'కోశము' అనుట పరిమితార్థ సూచకముగ పరిణమించగలదని లక్ష్మణరావు భావించి యుండును. డిడెరో చెప్పినటుల, నేల నాలుగు చెరగుల చెదరియున్న విజ్ఞానమును అంతటిని ఒకచోట రాసిగ చేర్చుటయే లక్ష్మణరావు ఈ గ్రంథ సంకలన మున తన ప్రధానాశయముగ పెట్టుకొనెననుట సుస్పష్టము. అందువలననే ఆయన దానిని 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' అని వ్యవహరించెను.

నిర్మాణము కాబోవు సౌధపు విస్తృతిని, ఉన్నతిని దాని పునాదులనుబట్టి మనము చాలవరకు ఊహింపవచ్చును. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున 'అ'కారపు సంపుటము డెమ్మీ క్వార్టోన దాదాపు 1400 పుటలను ఆక్రమించినది. అందు కొన్ని వ్యాసములు, సామాన్యగ్రంథముల పరిమాణమును మించియున్నవి. అద్వైతము, అష్టాదశపురాణముల వంటి కొన్ని రచనలను వేరుగ ముద్రించినపుడు అవి

ఆయా విషయములకు సంబంధించిన సమగ్ర ప్రామాణిక గ్రంథములుగ ఈనాడైనను రాణింపగలవు. ప్రతి విషయాన్ని సమగ్రంగా పాఠకులకు అందించవలెనను కుతూహలమే ఆ పండితుని ఇట్టి చర్యకు ప్రేరేపించినది. ఈ 'అ'కార సంపుటమును మనము పునాదిగ గ్రహించి లెక్కించినచో ఆ విజ్ఞాన సర్వస్వము సమగ్ర రూపమున ఇరువదివేల పుటలను దాటియుండెడివని నిస్సంశయముగ చెప్పవచ్చును. కాని, ఆ సంకల్పము నెరవేరలేదు. 1915, 1916, 1917 లలో క్రమముగ ఆ విజ్ఞాన సర్వస్వపు మూడు సంపుటములు వెలువడినవి. 'అ'కారపు విషయచర్చ పూర్తియైనది. 'ఆంధ్ర'అను విషయమునకై సామగ్రిని సేకరించుచునే, లక్ష్మణరావు అకాల మరణము నొందెను.

ఆ తరువాత 1926-27 లో ఈ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రచురణ భారమును వహించుటకు ఆంధ్ర పత్రికా సంపాదకుడు కాశీనాథుని నాగేశ్వరరావు ముందుకు వచ్చెను. పూర్వమున వెలువడిన సంపుటములలోని విషయములకు అదనపు సమాచారమును, కొన్ని ఫలకములను, దేశపటములను చేర్చి క్రొత్తసైజున పునర్ముద్రించుటకు ఆయన ఏర్పాటులను చేసి, 1932 లో ప్రథమ సంపుటమును, 1934 లో రెండవ సంపుటమును వెలువరించెను. అప్పటికి 'అ' కారమున 'అశ్వినీ కుమారులు' అను పదమువరకే పూర్తియైనది. తక్కిన 'అ'కార భాగమును ముద్రించుటకు యత్నములు జరుగుచుండగనే 1938 లో నాగేశ్వరరావు మరణించెను. తరువాత దానిపై శ్రద్ధ వహించిన వారెవరును లేరు. అంతటితో ఆ సర్వస్వ సంకలనము ఆగిపోయినది. తొలుత లక్ష్మణరావు వెలువరింపజేసిన మూడుసంపుటముల ప్రతులు నేడు దాదాపుగ అలభ్యములనియే చెప్పవచ్చును. నాగేశ్వరరావు వెలువరించిన ద్వితీయ ముద్రణపు రెండు సంపుటములు మాత్రము అటనట కొన్ని గ్రంథాలయములందు కనబడుచున్నవి. లక్ష్మణరావు సాగించిన విజ్ఞాన సర్వస్వకృషిని మదింపు కట్టుటకు, 'అ' కారమునకు సంబంధించిన పై మూడు సంపుటములు మనకు కొంతగ సహకరించుచున్నవి. ఆ పండితుడు, ఈ సర్వస్వమున ప్రాచీన భారతీయ సాహిత్య సంస్కృతులకు, ఆధునిక విజ్ఞాన శాఖలకు, దేశముల చారిత్రక భౌగోళిక వివరములకు, భారతదేశపు ప్రముఖ స్థలములకు, చారిత్రక సంఘటనలకు, వివిధములగు సాంకేతిక విషయములకు, పనితనములకు సంబంధించిన ఆరోపములకు అన్నింటికి స్థానము కల్పించుటకు ఉద్దేశించెననుట సుస్పష్టము. ఇక ఆంధ్రదేశమునకు సంబంధించినంతవరకు గ్రామనామములను కూడ ఆరోపములుగ చేర్చి చర్చింప సంకల్పించెను. ఈ విధముగ సర్వసమగ్రతను దానికి సిద్ధింపజేయుట ఆతని ఆశయము.

భారత భాషలలో విజ్ఞాన సర్వస్వము వంటి దానిని సంగ్రథితము చేయుటలో తొలుతగా ఎదుర్కొనవలసిన సమస్యలలో ప్రధానమైనది ఆధునిక విజ్ఞానశాఖలందలి పారిభాషికపద నిర్ధారణ. యూరోపీయ భాషలందు ఆ సమస్య కన్పట్టదు. విజ్ఞాన శాఖలలో పలు గ్రంథములు ప్రచురితాలై, పారిభాషిక పదములు ప్రజానీకమున విస్తృతవ్యాప్తిని పొందిన తరువాత అచట ఎన్సైక్లోపేడియాలు రూపొందినవి. కాని, భారతదేశపు పరిస్థితి అందులకు విరుద్ధము. పారిభాషిక పదములు ఏర్పడువరకు ఆగియుండుట కన్న, పారిభాషిక పదములను తానే రూపొందించి, చొరవజేసికొని ముందునకు పోవుట తప్ప వేరొక మార్గము లేదని లక్ష్మణరావు భావించెను. కాని, ఇందువలన కొన్ని ఇబ్బందులు కలుగుట సువిదితము. ఉదాహరణకు 'కార్బన్' అను పదమును తీసికొందము. 'అంగారము' అను అనువాద రూపమున దానికి 'అ' కార సంపుటమున, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున స్థానము కల్పితము. కాని, తరువాతి కాలమున ఈ పదము వ్యాప్తిలోనికే రాలేదు. దానికి బదులు కార్బన్,

దర్శనము అను పదములు వాడుకలోనికి వచ్చినవి. 'అంగారము' అనునది అనాదృతమైనది.

ఇట్టి ఇబ్బంది పారిభాషిక పదముల విషయమున కలిగితీరగలదని లక్ష్మణరావు ఊహించియే యుండును. కాని, పదింబడిగ పునస్సంశోధిత ముద్రణలు తన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము'నకు రూపొందినపుడు, ఇట్టివి సవరింపబడి, వ్యాప్తిని ఆర్జించిన పారిభాషిక పదములే అందు తావు కల్పించుకొనగలవని ఆ పండితుడు ఆశించియుండును. కాని, ఆ అదృష్టమునకు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వముగాని, ఆంధ్రులుగాని నోచుకొనలేదు.

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలనమున పలువురు ప్రసిద్ధ పండితుల సహకారము లక్ష్మణరావునకు లభించినది. వేమూరి విశ్వనాథశర్మ, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఆచంట లక్ష్మీపతి, మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు అందు కలరు. ఆచిరాజు వీరభద్రరావు కూడ ఆ సర్వస్వ కార్యాలయమున కొంతకాలము పనిచేసెను. వీరిలో పలువురు తరువాతి విజ్ఞాన సర్వస్వ రచనోద్యమములందు గణనీయ పాత్రల నిర్వహించిరి. ఈ విధముగా విజ్ఞాన సర్వస్వ సంకలనమున తగు శిక్షణను ఒసగి, భావి విజ్ఞాన సర్వస్వ సంకలనములకు మార్గమును ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము సుగమము చేసినది.

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమున కనబడు తెలుగు భాషారీతిని గురించియు ఇట కొంత చెప్పవలసియున్నది. వ్యావహారిక భాషా వాదము అప్పటికే బాగుగ ప్రచలితమగుచుండినది. గ్రాంథిక, వ్యావహారిక భాషా వివాదములు చెలరేగుచుండిన కాలమది. లక్ష్మణరావు గ్రాంథికభాషనే సమర్థించెను. ప్రాతదియంతయు ప్రశస్తమని భావించు ఛాందసు డతడు కాడు. ఆధునిక విజ్ఞానముతో మంచి పరిచితి కలవాడు. హేతువాదావలంబి; సంఘ సంస్కరణాభిలాషి; దేశ శ్రేయస్సునకు ఆవశ్యకములగు సంస్కరణలను అన్నింటిని ఆయన సమర్థించెను. అట్టివాడు సరళ గ్రాంథిక భాషయే గ్రంథ రచనకు తెలుగులో అవలంబనీయమని భావించుట, సంస్కరణ విముఖత వలన జరిగినది కాదు. ఆయన బహుభాషావిదుడు, ఆ భాషలలోని సాహిత్యములను చక్కగ పఠించినవాడు. ఆ అనుభవము అతనిని ఒక దృఢాభిప్రాయమునకు వచ్చునటులజేసినది. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంకలనమునకు చాల పూర్వముననే కన్యాశుల్క నాటకము ప్రచురితము. కాని, దాని భాషను ప్రామాణిక భాషగ లక్ష్మణరావు అంగీకరింపలేకపోయెను. ఏ భాషయందైనను మాండలిక వ్యావహారిక భాషారీతులెన్నను, ప్రామాణిక భాషారీతి వేరుగనుండుట అతనికి వేద్యమైనది. తెలుగునను అట్టులనే ఉండుట ఆయనకు విడ్డూరముగ కన్పట్టలేదు. గ్రాంథికమును సరళమొనర్చి, సామాన్య పాఠకునికిని సుజ్ఞాతమగు నటుల చేసిన జాలునని ఆయన భావించెను. ధ్వని స్పష్టతలేని వర్ణములుగల పదములతో, ఆంగ్లభాషయు ఉచ్చారణయందు వర్ణలోపము విరివిగ కలిగి ఫ్రెంచి భాషయు, తమ సాంప్రదాయిక రీతిలోనే వర్తించుచు, ప్రపంచ విశ్రుత సాహిత్యములను వెలయించినవి. అటులయినపుడు అరసున్నలతోడను, ఉత్వసంధి తోడను, యడాగమములతోడను, ద్రుతమువలన సిద్ధించు సరళాగమములతోడను తెలుగు భాషయు కాలానుగుణముగ కొలది మార్పులతో ముందునకు పయనించి, మంచి వాఙ్మయమును రూపొందింప గలుగునని ఆతని దృఢాభిప్రాయము. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము'న భాషారీతియంతయు తదనుగుణముగనే నడచినది. అందులకు ఒక మచ్చుతునకగ లక్ష్మణరావే రచించిన 'అథర్వ వేదము' అను వ్యాసమునందలి ఈ దిగువ పంక్తులను గ్రహింపవచ్చును.

''అథర్వ వేదమునకు రెండు అనుక్రమణులు కనఁబడుచున్నవి. ఒకటి పంచ పటలిక, రెండవది సర్వానుక్రమణి. ఈ రెండవదానికే బృహదనుక్రమణి

యన్న పేరు కూడ నున్నట్టు కానవచ్చుచున్నది. ఇవి అథర్వవేదము యొక్క యొక విధమైన జమాబంది గోష్వారాలు. ఈ కాండమునందు సూక్తములిన్ని, ఈ యీ సూక్తములందు ఋక్కులిన్ని, ఈ సూక్తములే యీ విషయములకు సంబంధించినవి అను మొదలైన కట్టుబాట్లన్నియు వీనియందుఁజేయఁబడి యుండును."

సామాన్య పాఠకునకు సుబోధముగ ఉండుటయే ఒక భాషా రీతియొక్క లక్ష్యమగునెడల, లక్ష్మణ రావు అవలంబించిన భాషారీతి విజయమును ఆర్జించిన దనియే చెప్పవచ్చును. ఆంధ్ర పాఠక లోకము, అది ఏ ప్రాంతమునకు చెందినదయినను, ఆ భాషను చక్కగ అర్థము చేసికొనగలిగినది.

**ఆంధ్ర విజ్ఞానము :**

కాశీనాథుని నాగేశ్వరరావు పరమపదించుటకు కొలది కాలము ముందుగనే, ఉత్తరాంధ్రమున వేరొక విధపు విజ్ఞాన సర్వస్వ సంకలనమునకు అంకు రార్పణ జరిగినది. ఆ కార్యక్రమమున ఆధ్వర్య మును వహించినవాడు దేవిడీ జమీందారగు కంచుకూరి బాల సూర్యప్రసాదరావు. ఆ గ్రంథమునకు 'ఆంధ్ర విజ్ఞానము' అని ఆయన పేరిడి 7 సంపుటములలో దానిని, అకారాది వర్ణ క్రమమును అనుసరించి ప్రచు రించెను. ఇందు మొదటి సంపుటము 1938 లోను, కడపటిది 1941 లోను ప్రచురితములు. ఈ సంపుట ములకు బాల సూర్యప్రసాదరావు సంపాదకుడు మాత్రమే గాదు, రచయితయు ఆయనయే. పండితుల నుండి వివిధ విషయములను సేకరించి, వానిని స్వీయ భాషలో ఆయన వివరించెను. ఇందలి ప్రథమ సంపుటమునకు కట్టమంచి రామలింగారెడ్డి ఉపో ద్ఘాతము వ్రాయుచు ఒక్కచేతిమీద ఇంత బృహ ద్రచన జరుగుట ఆశ్చర్య సంజనకమని ప్రశం సించెను. ఒక్క చేతిమీద జరిగినపని అగుటవలన, అచటచట ఈ ఉద్గ్రంథమున పొరపాట్లును దొంలి నవి. యూక్లిడ్ తన గ్రంథమును ఈజిప్షన్ భాషలో రచించగా, తరువాత అది గ్రీకు భాషలోనికి తర్జుమా చేయబడినపనుట ఇట్టి పొరపాటే. ఇవన్నియు 'ప్రమా దో ధీమతా మపి' అని సరిపెట్టుకొనదగినవియే. ఇది ఎటులున్నను బాలసూర్యప్రసాదరావు చేసిన కృషియు, ఆతని పట్టుదలయు ప్రశంసాపాత్రములు.

ఈ ఆంధ్ర విజ్ఞానమున భారతదేశము నందలి వివిధ మత సంప్రదాయములకు, తంత్ర వాదములకు, క్షేత్రములకు, రాజ కుటుంబములకు, గోత్రప్రవరలకు సంబంధించిన ఆరోపములు ఎక్కువగ కననగును. వీనికి తోడుగ తెలుగు సామెతలును, సంస్కృత న్యాయములును వివరింపబడినవి. ఆధునిక విజ్ఞానము నకు చెందిన ఆరోపములును స్థానములను ఆర్జించినవి.

ఈ గ్రంథపు సంపాదకుని సైతము పారి భాషిక పద సమస్య ఎదుర్కొనినది, కాని, దానిని ఒక వింతరీతిలో ఆయన పరిష్కరించెను. ఆతని దృష్టిలో ఆధునిక విజ్ఞాన శాస్త్రములు ఐరోపా దేశ శాస్త్రములు. కావున వానిని ఆంగ్ల పారిభాషిక పదము లతో తప్ప, వేరు విధముగ తెలిసికొనుట చాల కష్టము. కావున ఆంగ్ల పారిభాషిక పదములను వాడుట సముచితమని ఆయన భావించెను. ఈ పారి భాషిక పదములు సాధారణముగ రోమన్ లిపిలోనే వ్రాయబడినవి. ఆరోపములుగ ఆ ఆంగ్ల పదములు ఉండవలసినప్పుడు మాత్రము అవి తెలుగు లిపిలో వ్రాయబడినవి. ఒక్కొక్కప్పుడు ఒక మొత్తపు పద సమూహమే అనువాదమునకు లొంగదని ఆయన భావించినపుడు, ఆ పద సమూహమునే యథాతథ ముగ ఉంచుట జరిగినది. ఈ క్రింది ఉద్ధృత భాగము ఈ విషయమును విశదము చేయగలదు:

"స్పెక్ట్రమ్ అనాలిసిస్ :- ...... ఇట్లు చూచువారి నేత్రము కదకూ జేసె యగుపడుటను 'exciting the sensation of light' అని శాస్త్ర గ్రంథములందు వాడి యున్నారు. మరియు నిదియే Photo film లో చేరినచో 'Rendering sensible by photography' అని యనుచున్నారు."

ఇట్టి సమ్మిశ్ర భాషయేగాదు, ఒక్కొక్కచోట అనువాదమునకు లొంగనివిగ సంపాదకునికి కన్పట్టిన వ్యాసములు యథాతథముగ, ఆంగ్లభాషలోనే ముద్రితములు. ఉదాహరణకు ఈ ఉద్ధృత భాగము సరిపోవును:

"ట్రిగ్నోమెట్రి (Trignometry) :- ఇది యొక ఐరోపా దేశ శాస్త్రము. త్రికోణాకారములుగ భూభాగములను విభజించుకొని కొలచి లెక్కించుట (Survey) యందు ప్రభుత్వోద్యోగు లుపయోగించుచున్నారు.

(ఈ వ్యాసమును ఆంధ్ర విజ్ఞానమున కొసంగినవారు శ్రీ వేపా పూర్ణయ్య పండితులవారు ... వీరీ వ్యాసమును ఆంగ్లముననె రచించిరి ... ఈ వ్యాసము నాంధ్రములోనికి దెచ్చుట చాల క్లిష్ట స్థితిం గూర్చుటయగునని దీనినిట్లే యుంచవలసిన పరిస్థితులకు పాల్పడవలసి వచ్చినదని మా చదువరులకు విశదపరచుకొనుచున్నాము." పైదాని తరువాత దాదాపు 4 పుటల ఆంగ్ల వ్యాసము ట్రిగ్నామెట్రిపై కలదు.

బహుశః ఆధునిక విజ్ఞానము దేశమున, పరివ్యాప్తమగు ప్రథమ దశలో ఇట్టి 'మణిప్రవాళ' పద్ధతి ఆవశ్యకమని అ సంపాదకుడు దృఢముగ విశ్వసించి యుండును. ఈ గ్రంథమున సరళ గ్రాంథికమే వాడబడినది.

ఇది ఎటులున్నను, ఆ సంపుటములును ద్వితీయ ముద్రణను పొందినవికావు. ఇపుడవి, అంతగ లభ్యము లగుటలేదు.

**తెలుగు విజ్ఞాన సర్వస్వము :**

స్వాతంత్ర్యసిద్ధి అనంతరమున, దేశభాషలకు లభించిన ప్రోత్సాహము ఫలితముగ 'తెలుగు భాషా సమితి' 1947 లో మద్రాసున ఏర్పడి, తెలుగున 'తెలుగు విజ్ఞాన సర్వస్వము'ను రూపొందింపవలెనని సంకల్పించినది. 1957 నుండియు ఈ సమితి ముఖ్య కార్యాలయము హైదరాబాద్‌న పనిచేయుచున్నది.

'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ఎదుర్కొనిన పారిభాషిక పద సమస్యను పరిష్కరించుటకై తమ విజ్ఞాన సర్వస్వమును ఒక క్రొత్త రీతిలో వెలువరించుటకు ఆ సమితి పూనుకొనినది. ఆంగ్లమున అదివరకే రూపొంది యుండిన 'బుక్ ఆఫ్ నాలెడ్జి' విధానమును, ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా విధానముతో సమ్మిశ్రము చేయుట వలన పారిభాషిక పద సమస్య చాల వరకు పరిష్కృతము కాగలదని సమితి ఆశించినది. తదనుగుణముగ ఒక ప్రణాళికయు తయారు చేయబడినది, దీనిని అనుసరించి ప్రతి సంపుటము ఒక ప్రత్యేక విషయమునకు లేదా సన్నిహిత విషయములకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వముగ ఉండగలదు. ఆ సంపుటమున పూర్వ భాగమున ఆ విషయమును గురించి కథనము ఉండగలదు. ఇది సమీక్ష అని వ్యవహృతము. ఒకవేళ ఆ సంపుటము రెండు, లేదా మూడు సన్నిహిత విషయములకు చెందినదయినపుడు అట్టి సమీక్షలు వరుసగ అమర్చబడును. తరువాత ఉత్తర భాగమున ఈ సమీక్షయందు పేర్కొనబడిన ప్రముఖాంశములు, ఆరోపములుగ అకారాది క్రమమున అమర్చబడి అవి సవివరముగ చర్చితములగును. ఆది అకారాది విభాగమనబడును. సమీక్షయందు పారిభాషిక పదములను వాడుచు, తొట్టతొలుత వాడినపుడు బ్రాకెట్లలో వానికి మూలములగు ఆంగ్లపదములను ఇచ్చుటవలన, తెలుగు పారిభాషిక పదము పాఠకునికి సువేద్యమై దానిని గురించి విశేషములను అకారాది విభాగమందు కనగలడు. ఈ ఏర్పాటునను కొన్ని ఇబ్బందులు ఉన్నవి. అరిస్టాటిల్ పండితునివంటివాని కృషి విశేషములకై చరిత్ర, సాహిత్య, తత్త్వశాస్త్రముల సంపుటములను మూడింటిని సంప్రదింపవలసి వచ్చును. అట్టులే కొన్ని వైజ్ఞానిక విషయములకై ఒకటికన్న ఎక్కువ సంపుటములను సంప్రదింపక తప్పదు. ఇట్టివి కొన్ని అల్పములగు ఇబ్బందులున్నను, పారిభాషిక పద జాలము రూపొంది, రూఢతను ఆర్జించని తెలుగువంటి భాషలకు ఈ పద్ధతియే తగినదని, సమితి నిర్ణయము

నకు వచ్చినది. తదనుగుణముగ మొత్తపు విజ్ఞాన సర్వస్వము 12 సంపుటములలో వెలువడదగునని నిశ్చితమైనను, తరువాత ఆ సంఖ్య 16 నకు పెంచబడినది. అవి: 1. చరిత్ర-రాజనీతి, 2. భౌతిక రసాయన శాస్త్రములు, 3. తెలుగు సంస్కృతి-౧, 4. తెలుగు సంస్కృతి-౨, 5. అర్థ, వాణిజ్య, భూగోళ శాస్త్రములు, 6. విశ్వసాహితి, 7. దర్శనములు-మతములు, 8. వ్యవసాయ, పశుపాలన, అటవీ శాస్త్రములు, 9. గణిత ఖగోళ శాస్త్రములు, 10. సాంఘిక శాస్త్రములు, 11. న్యాయ, పరిపాలన శాస్త్రములు, 12. ఇంజనీరింగ్-టెక్నాలజీ, 13. జీవ శాస్త్రములు, 14. లలితకళలు, 15. వైద్యశాస్త్రములు 16. సూచి, అట్లాసు.

పై వానిలో కడపటి రెండుగాక, తక్కిన సంపుటములు ప్రచురితములు. తొలుతటి సంపుటము 1954 లో వెలువడినది. 14 సంపుటము 1979 లో వెలుగుచూచినది. ప్రచురిత సంపుటముల మొత్తపు పుట సంఖ్య క్రౌను క్వార్టో 12 వేలకు పైబడినది. ఈ సంపుటాలలో ప్రథమ, ద్వితీయ సంపుటములు పునస్సంశోధితాలై ద్వితీయ ముద్రణలను పొందినవి. 3 వ 4 వ సంపుటాలు యధాతథములుగ పునర్ముద్రితములు. అట్టి పునర్ముద్రిత ప్రతులును చెల్లిపోయినవి. ఇపుడు తొలుతటి ఎనిమిది సంపుటములు పునస్సంశోధనను ఆకాంక్షించుచున్నవి. ఈ నడుమనే తెలుగు సంస్కృతి సంపుటములను రెండింటిని పునస్సంశోధించి, విస్తృతీకరించి, క్రొత్త సమాచారముతో మూడు సంపుటములలో వెలుపరించుటకు కృషి మొదలైనది. అందు మొదటి సంపుటము 1983 మే నెలలో ఆవిష్కృతము.

ఏ విజ్ఞాన సర్వస్వమును తొలి ముద్రణలోనే విమర్శనాతీతముగ వెలువడనేరదు. తెలుగు విజ్ఞాన సర్వస్వమునను, కొన్ని సంపుటములందు కొన్ని ప్రముఖములగు ఆరోపణలు కానవచ్చుట లేదనియు, కొన్ని విషయములు చర్చితములే కాలేదనియు కొన్ని విమర్శనలు వచ్చినవి. వీనిలో కొన్ని సోపపత్తికములే. ఇట్టివి మలి ముద్రణములలో సవరించుకొనదగినవి. కాని మొత్తము మీద తెలుగు విజ్ఞాన సర్వస్వము తెలుగు పాఠక లోకపు ఆదరాభిమానములను ఆర్జించిన దనుట యథార్థము; ప్రామాణికముగ అది పరిగణనను పొందినది. తరువాత వైజ్ఞానిక విషయరచనలకు ఆది మార్గదర్శినియైనది. కాని ఒక విజ్ఞాన సర్వస్వము, మరల మరల సంశోధితమగుచు పునర్ముద్రణములను పొందగలిగినపుడు మాత్రమే అది వాఙ్మయమునకు ప్రయోజనకారిగ నిలబడియుండగలదు. అట్టి పునర్ముద్రణలు సాగుటకు తగిన యంత్రాంగమును తెలుగు భాషా సమితి సృష్టించుకొనలేకపోయినది.

ఇది యెట్లున్నను తెలుగు భాషా సమితి ఒక గణనీయ కార్యమును సాధించినదనుట యథార్థము. ఆ సమితికి నేతృత్వము వహించిన వారితోపాటుగ, విజ్ఞాన సర్వస్వపు సంగ్రథనములో పాల్గొనిన సంపాదక పండితులును ఇందులకు ప్రశంసనీయులు. సమితి అధ్యక్షుడగు డా॥ బెజవాడ గోపాలరెడ్డియు, కార్యదర్శియగు డా॥ మోటూరి సత్యనారాయణయు. సమితికి తగు ఆర్థిక ప్రతిపత్తిని కల్పించుటలో శక్తి వంచనలేక కృషిచేసిరి. ఇక విజ్ఞాన సర్వస్వపు వివిధ సంపాదక వర్గములందు నేలటూరి వెంకట రమణయ్య, వసంతరావు వెంకటరావు, వేమూరి విశ్వనాథ శర్మ, మేడేపల్లి వరాహ నరసింహస్వామి, ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి, గిడుగు వెంకట సీతాపతి, పి.రాజమన్నారు, మల్లంపల్లి సోమశేఖరశర్మ మొదలగువారు సభ్యత్వము వహించి పనిచేసిరి. సంపాదకులుగనే గాక, సంగ్రాహకులుగను పనిచేసిన గిడుగు వెంకటసీతాపతి, మేడేపల్లి వరాహ నరసింహస్వామి, మల్లంపల్లి సోమశేఖరశర్మలు విజ్ఞాన సర్వస్వ సంపుటముల రూపకల్పన యందు తగు వరవడులను ఏర్పరచిరి. వారిని అనుసరించి తరువాతి సంగ్రాహకులు పనిచేసి, కార్యసాధనలో పాలుపంచుకొనిరి.

తెలుగు విజ్ఞాన సర్వస్వమున తొలుతటి నుండియు సరళ గ్రాంథిక భాషయే ఆదరింపబడినది. అరసున్నలు త్యజింపబడినవి. సరి కుదుప చోట విసంధి పాటింపబడినది. ఇట్టి నియమము 14వ సంపుటము వరకు ఆచరణ పొందినది. అప్పటిలో వ్యావహారిక భాషలో విజ్ఞాన సర్వస్వమునకై పంపిన రచనలు కొన్ని యుండినను వానిని సరళ గ్రాంధికమున తిరిగి వ్రాయుట జరుగుచుండినది. కాని, 1983లో పునస్సంశోధితమగు తెలుగు సంస్కృతి-1 ని ప్రచురించినపుడు మాత్రము ఈ నియమము సడలింపబడినది. అప్పటికే తెలుగు అకాడమీ ఆధ్వర్యవమున ఒక విధపు వ్యవహారిక భాషా శైలి, పాఠ్య గ్రంథము లందు వాడుకలోనికి వచ్చినది. ఆ శైలికి అలవాటు పడిన పండితుల రచనలు మార్పు చేయబడకుండ ఆ రీతిగనే తెలుగు సంస్కృతి-1 (పునస్సంశోధితము)న ప్రచురితములు. తక్కిన రచనలు మాత్రము సరళ గ్రాంథికముననే ఉన్నవి. తెలుగున సర్వ జనాంగీకృతమగు ఒక ప్రామాణిక భాషా రీతి రూపొంద నంతవరకు ఇట్టి పరిస్థితి అనివార్యమనియే తోచుచున్నది.

## సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము

హైదరాబాదు సంస్థానమున ప్రజాప్రభుత్వము నెలకొనినది మొదలుగ, తెలంగాణముననూ తెలుగుభాషా వాఙ్మయ పునరుజ్జీవనమునకు జరుగు కృషికి ఎంతయో ప్రోత్సాహము లభించినది. మద్రాసురాష్ట్రమున నుండిన తక్కిన తెలుగు ప్రాంతపు వారివలెనే, తామును భాషకును, సాహిత్యమునకును ప్రోది చేయవలయునను ఆకాంక్ష గాఢతరమైనది. ఆ ఆకాంక్ష ఫలితములలో ఒకటియే సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము. ఈ గ్రంథపు సంకలనమును నిర్వహించినది సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశసమితి. ఈ సమితి 1953 లో హైదరాబాదున సంస్థాపితము. ఈ సంస్థాపనలో ఎక్కువగ భాగ స్వామ్యము వహించినది ఉస్మానియా యూనివర్సిటీ ఆచార్యవర్గము. సమితికి తొలుత నుండియు కార్యదర్శిగ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం వ్యవహరించెను. ఆయన కర్ణధారిత్వమే ఆ కోశ సంకలనము విజయవంతముగ ముగియుటకు మూలమైనది.

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి, తమ సంకలనమును సాంప్రదాయకపు అకారాద్యనుక్రమణికా రీతిలోనే సాగించినది. తెలుగు భాషా సమితి, పారిభాషిక పదసమస్యా పరిష్కారమునకై అవలంబించిన నూత్న పద్ధతి వారికి తెలిసియే యుండెను. కాని 'ఎప్పటికైనను మనము దీనిని ఎదుర్కొన వలసియే యుండును' కనుక పారిభాషిక పదములను సృష్టించుకొని వానినే అకారాదిక్రమమున కూర్చి, ఈ సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశమును రూపొందించుట జరిగినది. భాషారీతిలో సరళగ్రాంథికమునే ఈ కోశము సైతము ఆదరించినది.

ఈ కోశపున మొదటి సంపుటము 1958 లో వెలువడినది. కడపటిదగు ఎనిమిదవ సంపుటము 1971లో ప్రచురితము. సంపుటము లందలి మొత్తపు పుటలు దాదాపు 5600 (డెమ్మీ క్వార్టో సైజున). సంపుటములకు అన్నింటికిని ముఖ్య సంపాదకుడు ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య. వివిధ విషయములకు సంబంధించిన సంపాదకీయ వర్గములలో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, రావాడ సత్యనారాయణ, కురుగంటి సీతారామయ్య, పుట్టపర్తి శ్రీనివాసాచారి, రాఘవేంద్రరావు, ఆదిరాజు వీరభద్రరావు, నండూరి వెంకట సుబ్బారావు, దేవులపల్లి రామానుజరావు మొదలగు ప్రముఖులు సభ్యత్వము వహించి కృషి చేసిరి.

కోశమును సంగ్రహముగ రూపొందించవలెనను సంకల్పమువలన కొన్ని ప్రముఖ విషయములకు తగినంతగ చోటును కల్పించుటకు అవకాశము తక్కువగుట ఇందు అటనట కన్పట్టుచున్నను, మొత్తము మీద తెలుగుదేశమున ఈ కోశమును విరివిగ ఆదర

బను, ప్రామాణికతను ఆర్జించినది. కాని, ఇప్పటికి తొలుతటి సంపుటము ముద్రితమై 25 ఏండ్లు ముగిసి నవి; కడపటిది ముద్రితమై 12 ఏండ్లు గడచినది. అందు ఆనాటి పరిస్థితులను బట్టి నవీకరింపవలసిన విషయము ఎంతయో ఉన్నది; అయినను సంశోధిత పునర్ముద్రణకు అవకాశములు కన్పట్టుటలేదు.

పై నాలుగు సర్వస్వరచనలును-లోపములు కొన్ని యున్నను - తెలుగు వాఙ్మయ చరిత్రలో గణ నీయ పాత్రలను నిర్వహించినవి. ప్రాచీన సాంస్కృ తిక విశేషములను ఒకచోట సేకరించి పాఠకులకు అందించినవి; అధునాతన విజ్ఞానముతో పరిచయమును మాతృభాష ద్వారా తెలుగువారికి కల్పించినవి. అంతే కాదు; తెలుగును బోధన భాషగా చేయుటకు తరువాతి కాలమున జరిగిన కృషికి అవి ఎంతయో సాయ పడినవి. ఆ గ్రంథములు రూపొందించిన పారిభాషిక పద పట్టికలు తెలుగు అకాడమీ వంటి సంస్థల పనిని సులభతరము చేసినవి.

## ఏకవిషయిక సర్వస్వ రచనలు

పై విజ్ఞాన సర్వస్వములు సర్వ విజ్ఞాన శాఖ లను తోగొని చూపించుటకై ఉద్దేశితములు. అటుల గాకుండ, ఆంగ్లాది యూరపీయ భాషలలో వలెనే, ఏదో ఒక విజ్ఞాన శాఖను గురించిన సమాచారమును 'సర్వస్వ' రీతిలో వివరించు గ్రంథములును తెలుగున 1940 ప్రాంతము నుండి అంతటంతట ప్రచురితము లైనవి. వాని సమగ్ర పట్టికను ఇచ్చుటకు ఇట అవకాశము లేదు కాని, అందు ముఖ్యములగు కొన్ని మాత్రము పేర్కొనబడినవి :

1. పూర్వగాథాలహరి (1940 ప్రాంతము)- రచయిత వేమూరి శ్రీనివాసరావు. వివిధ పురాణేతి హాసములందలి గాథలను, వ్యక్తుల జీవిత విశేషము లను తెలియజేయుటకు సమగ్ర కృషి ఇందు జరిగినది.

2. ఆంధ్ర సర్వస్వము (1943) - సంకలన కర్త: మాగంటి బాపినీడు. ఆంధ్ర దేశీయ చారిత్రక, సాంస్కృతిక విశేషములను అన్నింటిని సంగ్రహ ముగనైన ఒకచోట చేర్చుటకు జరిగిన తొలుతటి కృషి ఇది.

3. ఆంధ్రదేశ చరిత్ర-భూగోళ సర్వస్వము (మూడు సంపుటాలు)- ఆంధ్ర రచయితల సంఘము ప్రచురించినది (1971). ఆంధ్ర దేశీయ చరిత్ర- భూగోళములకు-అందు గ్రామములకు-సైతము ఇందు స్థానము కల్పితము.

4. సాహిత్యకోశము (1980) - తెలుగు అకాడమీ ప్రచురణ. తెలుగు సాహిత్య రచయితల రచనల సంక్షిప్త వివరములు ఇందు కలవు.

5. ప్రపంచరాజ్య సర్వస్వము(1976)-ఆంధ్ర సారస్వత పరిషత్తుచే ప్రచురితము. అత్యల్ప రాజ్య ములను సయితము విస్మరించక, ప్రపంచమందలి అన్ని రాజ్యముల భౌగోళిక, చారిత్రక, రాజకీయ వ్యవస్థావిశేషములు ఇందు ఈయబడినవి.

ఇంకను ఆర్ష విజ్ఞాన సర్వస్వము (2 సం.); ఖాసింఖాను గారి బాల విజ్ఞాన సర్వస్వము, రంగ శాయి కవి వాణీవిలాస వనమాలిక, వైద్యశాస్త్రము నకు చెందిన వస్తుగుణదీపిక మొదలగునవియు ఈ కోవకు చెందినవియే.

## సర్వస్వ రచనలకు సన్నిహితములగు వేరు తీరుల రచనలు

నిఘంటువులు సర్వస్వ రచనలుగా లెక్కింప బడ వీలు లేకున్నను యూరపున తొలుతటి దశలో కొన్ని నిఘంటువులు, సర్వస్వ లక్షణములతో కూడ ప్రచారమునను వచ్చిన విషయము తొలుత ప్రస్తా వితము. తెలుగున వానిని పోలినవి వెలువడలేదు; కాని ఉన్న వానిలో కొట్ర వ్యాముల కామశాస్త్రి సంకలిత ఆంధ్ర వాచస్పత్యము కొంతవరకు అట్టి లక్షణము లను కలిగియున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించ బూనుకొనిన విజ్ఞాన దీపిక, ఆంగ్లమందలి 'బుక్ ఆఫ్ నాలెడ్జి' వలె, ఆకారాదిని పాటించక విషయ కథన రీతిలో వెలువడిన ఒక విధపు సర్వస్వరచన. దీనిని రెండు సంపుటములుగ ప్రకటించుటకు అకాడమీ సంకల్పించినది. అందు మానవిక శాస్త్రములను వివరించు ప్రథమ సంపుటము 1976 లో వెలువడినది. విజ్ఞాన శాస్త్రములను వివరించు రెండవ సంపుటము ముద్రణలో ఉన్నటుల తెలియుచున్నది.

ఇటుల విజ్ఞాన సర్వస్వ రచనా ప్రక్రియ కొంతవరకు ఆంధ్ర వాఙ్మయమున తావు కల్పించు కొనినది; అయినను కాలు నిలువద్రొక్కి కొనగలిగిన దని అనలేము. ప్రముఖ విజ్ఞాన సర్వస్వములలో కాలదోషము పట్టినవియు, సంశోధిత పునర్ముద్రణలను వెలువరింపజాలకున్నవి. ఇది ఒక శోచనీయ పరిస్థితి.

అయినను మున్ముందు మంచిరోజులు రానున్న వనియే తోచుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో బోధన భాషగ తెలుగునకు అగ్రస్థానము కల్పింపబడినది. అందువలన క్రమేణ విజ్ఞాన శాస్త్రములు మొదలగు నవి యన్నియు తెలుగుననే దేశమున వ్యాప్తినంద గలవు. ఆ విషయాలలో పఠన పాఠనములకు ఆవశ్య కములగు తెలుగు పుస్తకములు విరివిగ రూపొంద వలసిన పరిస్థితి ఏర్పడగలదు. అటుల పాఠకులవలన పోషణయు, ప్రభుత్వమువలన ప్రోత్సాహమును లభించినపుడు ఈ విజ్ఞాన సర్వస్వ ప్రచురణ సంస్థలను 'ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా' వలె సాతత్యము ను పొంది, పదింబదిగ సంశోధిత పునర్ముద్రణ లను వెలయించి, ఆంధ్ర వాఙ్మయమునకు పరిపుష్ట తను చేకూర్చగలవు. ఆ సుదినము త్వరలోనే రాగల దని ఆశించుదము.

## ఆధార గ్రంథాలు


1. Encyclopaedia Britannica (1966) Vol. VI. University of Chicago, Toronto.
2. The Story of Civilization. Part IX. The Age of Voltaire By will & Ariel Durant; Simon & Schuster, New York. 1965.
3. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము
4. ఆంధ్ర విజ్ఞానము
5. తెలుగు విజ్ఞాన సర్వస్వము
6. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము

(3–6: ప్రచురితాలైన అన్ని సంపుటాలు.)




"భాష ఎప్పుడూ ఒక్క తీరుగా ఉండదు. ఆయా కాలముల రాజకీయ మత సాంఘిక పరిస్థితులనుబట్టి ఉంటుంది. భారత దేశములో ప్రజాయత్త పరిపాలనాంకురములు మొలకెత్తినప్పుడే, భాష కూడా పండిత భుజస్కంధములను వీడి పామర జనాధారమై పోయింది. ఆ ప్రజలు మాటలాడేభాషయే జీవభాషగా ఉండి, ఆచంద్ర తారార్కము ఉంటుంది. ప్రజలలో నూతనోజ్జీవము కలిగి, రాజకీయముగా స్వరాజ్యోద్ధరణమునకు పూనుకొన్నప్పుడు, ప్రజల మనోభీష్టములు నెరవేర్చుటకు నాయకులు పూనుకొన్నప్పుడు, వారి మనస్సు ఉద్రేకపూరితము చేసే భాష గ్రామ్యభాష గాని మరొకటి కాదు. జిల్లా అధికారిగా పనిచేస్తూ ఉన్న గాలెట్టీ (R. Galletti) వారగారు ప్రచురింపనున్న తెలుగు నిఘంటువునకు పీఠికలో ఈ క్రింది విధముగ నున్నది: ఈ గ్రంథము Oxford University Press వారిచే ప్రకటితమవుతుంది.

"Perhaps inspiration will be lacking while the nation is in tutelage; but when the noble and puissant nation views its mighty youth, when the full tide of its inspiration begins to flood the land; it is surely the Common *People*, who would hear and applaud. *It is their language that must be used; therefore for its study this work is dev ted.*"

రాబోవు గ్రామ్యభాష క్రొత్త వైభవములో రాజకీయ భాషయై, ప్రజానాయకుల యొక్కయు, ప్రభుత్వమువారి యొక్కయు నాదరణమును సంపాదించుకొని, వెలుగొందెడు దినములు రానున్నవి."

—కుందూరి ఈశ్వర దత్తు.

(ముద్రాక్షరశాల : గ్రామ్య భాషాభివృద్ధి (వ్యా.)

[వ్యాస సంగ్రహము -శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులు గారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణ. సంపా. తెలికిచెర్ల వెంకటరత్నం (1933) పుట-343.]

# తెలుగులో భాషాపరిశోధన : నాడు - నేడు

—బూదరాజు రాధాకృష్ణ

1.1. 'పరిశోధన' అనే మాటకు ఇప్పుడున్న 'Research' అనే అర్థం ఇటీవలి కాలంలో సంక్రమించిందనవచ్చు. పూర్వం పరిశోధనలు లేవని కాదుగాని, వాటికి ఈ పేరున్నట్లు ఆధారాలు దొరకటం లేదు. ''శోధన, పరిశోధన' అనే రెండు శబ్దాలూ పూర్వం ఆయుర్వేద పారిభాషికాలుగానే సుప్రసిద్ధాలు. ఇతరార్థాలు కూడా ఆ మాటలకున్నా ప్రస్తుతార్థం రూఢిలో లేదు. శబ్దార్థ కల్పతరువులో 'పరిశోధనమ్' అంటే 'సర్వతో భావేన శోధనే: పరిశుద్ధి' అనే అర్థాలతోబాటు 'ఋణాదే శోధనే: అప్పుతీర్చుట' అనే అర్థం కూడా కనిపిస్తుంది. మోనియర్ విలియమ్స్ నిఘంటువులో 'శోధ, శోధన' శబ్దాలకు 'Cleaning, purification, discharging, paying off, retaliation, correction, setting right' మొదలైన అర్థాలున్నాయి. శబ్ద రత్నాకరం 'శోధన' శబ్దానికి '1. శుద్ధి చేయుట, 2. పరిష్కరించుట, 3. వెదకుట, 4. విష్ఠ' అనే అర్థాలిచ్చి 'పరిశోధన' శబ్దానికి కప్పదాటుగా 'మిక్కిలి శోధించుట' అనే అర్థమిస్తున్నది. సూర్యరాయాంధ్ర నిఘంటువు 'పరిశోధనము = పరిశోధము = 1. మిక్కిలి శోధించుట, 2. రో (దో ?) షము పోగొట్టుట, తప్పులు దిద్దుట, 3. (ఋణాదులు) చెల్లించి పుచ్చుట' అని వివరిస్తున్నది. అయితే 'పరిశోధించు' అనే క్రియా పదానికి 'వెదకు' అని అర్థమిచ్చి 'పశ్చిమ దిగ్భాగంబు పరిశోధించి' అన్న ప్రయోగమిస్తున్నది. ఆంధ్ర శబ్ద రత్నాకరం 'తప్పులు దిద్దు' అనే అర్థాన్ని కూడా ఇచ్చింది. వీటితో బ్రౌణ్యంలోని 'పరిశోధన = Enquiry, పరిశోధించుట = To examine, investigate, to try, search' అనే అర్థ విశేషాలను పోల్చినప్పుడు ఆ నిఘంటు కర్తకు కనీసం కొంతకాలం ముందుగా ఇప్పటి అర్థం వాడుకలోకి వచ్చిందని, అందుకు చాలా వరకు ఆంగ్ల భాషా ప్రభావం, ఆంగ్ల విద్యా ప్రభావం కారణాలయి ఉంటాయని గుర్తించవచ్చు. ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన శిలా తామ్ర శాసనాలనూ, తాటాకు పుస్తకాలనూ 'వెదికి' సేకరించి, పాఠ పరిష్కరణార్థం 'పునః పరిశీలించటానికి' 'పరిశోధన' శబ్దాన్ని మొట్టమొదట ఎవరు వాడేరో చెప్పలేం గాని తెలుగులో 'వెదకు, తప్పులు దిద్దు, సవరించు, పరిశీలించు' మొదలైన అర్థాల్లో పరిశోధన శబ్దం బ్రిటిష్ విద్యావిధానంతోబాటు ప్రాముఖ్యంలోకి వచ్చిందని చెప్పవచ్చు.

1.2. పై శబ్దం కన్నా 'నాడు, నేడు' శబ్దాలు మరింత అస్పష్టమైనవి. స్థూలంగా 'నాడు' పూర్వ కాలాన్నీ 'నేడు' సమకాలాన్నీ సూచిస్తాయి. కాని విమర్శకుల వాడుకలోని 'పూర్వ, ప్రాచీన, అర్వాచీన, సమకాలిక, అధునిక, అధునాతన' శబ్దాల్లో వేటి కివి సమానార్థకాలో స్పష్టంగా చెప్పలేం. ఇప్పటి అర్థంలో 'భాషా పరిశోధన' అనే పదబంధానికి 'ఆధునిక పద్ధతి' భాషా పరిశోధన అని అర్థం చెప్పుకుంటే 'పద్ధతుల్లో' కాలధర్మాన్ని బట్టి వచ్చిన మార్పుతోబాటు భాషలోకూడా అలాగే వచ్చిన మార్పులను కూడా జతచేసి నేటి భాషనుగురించి నేటిపద్ధతుల్లో పరిశోధించటం మాత్రమే ప్రస్తావించవలసి

వుంటుంది. అయితే ఇది అర్థసంకోచానికే దారి తీస్తుంది. 'నేడు' శబ్దానికి విస్తృతార్థం ఆపాదించి 'ఇరవయ్యో శతాబ్ది ద్వితీయార్ధ'మని భావిస్తే పరిశోధన పద్ధతుల్లోనూ, భాషలోనూ ఇటీవలి కాలంలో వచ్చిన లక్షణాలను లక్ష్య పూర్వకంగా చర్చించవచ్చు. అంటే పందొమ్మిదో శతాబ్ది చివరిదాకా భాషా విషయకంగా జరిగిన పరిశోధనలు 'నాటి'వనీ, ఆ తరవాతివి 'నేటి'వనీ భావించటం భావ్యమనిపిస్తుంది. 'నేడు' అని భావించే ఇరవయ్యో శతాబ్దిని కూడా రెండుగా విభజించటం సమంజసం. ఆ మొదటి దశలో సంప్రదాయ పద్ధతి పరిశోధనలు ఎక్కువగా, ఆంగ్ల విద్యా ప్రభావం వల్ల జరిగినవి తక్కువగా ఉండేవి. రెండో దశలోని పరిశోధనల మీద పాశ్చాత్య పద్ధతుల ప్రభావం చాలా ఎక్కువ. మొదటి దశలోని పరిశోధనల కన్నా రెండో దశలోవి గుణాత్మకంగానూ సంఖ్యాపూర్వకంగానూ ఉత్తమ స్థాయిలోవి. అయితే ఆంగ్ల విద్యా ప్రభావం ఇరవయ్యో శతాబ్దికి ముందే తెలుగు వారి మీద ప్రసరించింది. కానీ దాని వ్యాప్తి కాలక్రమాన పెరిగిపోయింది. మొదట 'నాటి' పరిశోధనలను, తరువాత 'నేటి' పరిశోధనలను పరిశీలిద్దాం.

1.3. పూర్వం భాషాధ్యయనమంటే వ్యాకరణ పఠన పాఠనాదులే. కొసరుగా అమరకోశం వంటి నిఘంటువులు ఒప్పచెప్పేవారు. ఒక కావ్యాన్ని వ్యాఖ్యానించేటప్పుడు అందులోని శబ్దాల సాధుత్వాసాధుత్వాలను, నిరుక్తాన్ని, నిఘంటు ప్రామాణ్యాన్నీ చర్చించటమే ప్రథమ కర్తవ్యమై, కవి హృదయావిష్కరణ, కావ్య ప్రయోజన నిర్ణయం, పాత్రచిత్రణ అప్రధానంగా ఉండేవి. నన్నయకు తరవాత ఎప్పటినుంచి వ్యాఖ్యానాలు, టీకాటిప్పణులు, శబ్దస్వరూప చర్చ మొదలైనవి బయలుదేరాయో, వ్యాకరణ గ్రంథేతరాల్లో భాషా పరిశీలన ఎప్పుడు ఆరంభమయిందో తేదీలతో సహా చెప్పటం సాధ్యంకాదు. మన వారికి ఇప్పటి అర్థంలో చరిత్రదృష్టి ఉండేది కాదు. ఇతిహాస పురాణ పద్ధతి నేటి కఠిన ప్రమాణాలకు అనుగుణం కాదు. పూర్వ గ్రంథాలు తాటాకు పుస్తకాలుగా భిన్న పాఠాలతో దొరికినా 'పాఠవిమర్శ' (Textual criticism) అనే పద్ధతిని ఎవరూ పాటించలేదు. వ్యాస పీఠాల్లో, దేవతార్చన మందిరాల్లో తాళపత్ర గ్రంథాలను పూజించటం, అర్థంగాని శబ్దాలను రాయకపోవటం, రాస్తే తమకు అర్థమైన సాధువనిపించిన తీరులో దిద్ది రాసుకోవటం మొదలైనవే మన పూర్వుల అలవాట్లు. అప్పట్లో చదువుకున్నవారి సంఖ్య చాలా తక్కువ. 'విని' ఆనందించేవాళ్లు బహుశా అధికసంఖ్యలో వుండేవారేమోకాని (పురాణ శ్రవణాదుల పుణ్యమా అని), 'చదివి' విమర్శించే వారి సంఖ్య అల్పాల్పంగానే ఉండేదని నిస్సంశయంగా చెప్పవచ్చు. కథకు, పురాణైతిహ్యాలకు, ధర్మాధర్మ నిర్ణయాలకు ఉన్న ప్రాముఖ్యం 'ఆలంకారిక చర్చ'లకే లేదని చెప్పవచ్చు (వ్యాఖ్యానాదుల్లో తప్ప). అందువల్ల వైయాకరణ ఖసూచిత్వం, భాషాదృష్టి ఉన్నవారిసంఖ్య మరీ తక్కువగా ఉండివుండాలి. నిరక్షరాస్యతకు తోడు, తాళపత్ర గ్రంథాల అలభ్యత్వంకూడా భాషాపరిశీలనకు అననుకూల పరిస్థితులనే కల్పించి వుంటుంది. ఇన్ని కారణాలవల్ల 'భాషా పరిశోధన' ఆంగ్లేయుల రాకకుముందు చెప్పుకోదగినంతగా జరగలేదని, జరిగిన నిదర్శనాలు లభించటంలేదని అంగీకరించక తప్పదు.

1.4. పై పరిస్థితికి సంస్కృత భాషాసాహిత్యాల ప్రాబల్యం ఎంతో తోడ్పడింది. నిన్న మొన్నటివరకూ తెలుగు భాషకూ, తద్భాషా పాండిత్యానికీ సమాజంలో, రాజాస్థానాల్లో సరయిన గౌరవం లేదని ఒప్పుకోవాలి. క్రి. శ. 6 వ శతాబ్దినాటి రేనాటి చోళుల కాలంనుంచే తెలుగు శాసనాలు అవిచ్ఛిన్నంగా వచ్చినా, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు నిరూపించినట్లు రెడ్డి రాజ్యాంతం వరకూ చక్రవర్తులు సంస్కృతాన్ని పోషిస్తే, చిన్న చిన్న సామంతులు దానశాసనాల్లో తెలుగును స్వీకరించారు. జయశాసనాలూ ప్రశస్తి శాసనాలూ

సంస్కృతంతోబాటు తెలుగును వాడినవే కాని కేవలం తెలుగు శాసనాలు కాదు. సామ్రాజ్యాలు అంతరించిన తరవాత చిన్నచిన్న రాజులూ జమీన్దారులూ తెలుగు కవులను పోషించినా తెలుగు భాషకు పాండిత్యం దూరంగానే ఉండేది. సంఖ్యాధికంగా కులమత విచక్షణ లేకుండా తెలుగు భాషా సాహిత్యాలను నేర్చుకొనే అవకాశం బ్రిటిష్‌వారు కల్పించిందే. క్రైస్తవ మత ప్రచారకులు ముద్రణయంత్రాలు స్థాపించగా, అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఉన్నత పాఠశాలలూ, కళాశాలలూ, చివరికి మద్రాస్ విశ్వవిద్యాలయాన్నీ స్థాపించింది. క్రైస్తవ వాఙ్మయం తెలుగులో క్రీ.శ. 1720 నుంచి వచ్చినా, ముద్రణయంత్రం 1746 దాకా అందుబాటులోకి రాలేదు. ముద్రణ సౌకర్యం ఏర్పడగానే తెలుగు పుస్తకాల ప్రచురణ మొదలయింది. కర్నల్ కాలిన్ మెకంజీ (1753-1821) కావలి బొర్రయ్య (1776-1803) సహాయంతో బహు వ్యయ ప్రయాసల కోర్చి సిద్ధంచేసిన 'కైఫీయతు' లను ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అరవై రెండు సంపుటాల 'స్థానిక చరిత్ర'లుగా (Local records) అందించటంతో శాస్త్రీయమైనా కాకపోయినా ఒక తీరు చారిత్రక దృష్టి మనవారికి కలిగింది. క్రీ. శ. 1813 లో మద్రాసులో ఒక కళాశాల స్థాపించారు. పఠనపాఠన సౌకర్యంకోసం 1820 లో ఏర్పడ్డ 'దేశభాషా గ్రంథ కరణ సభ' కాలక్రమాన నిఘంటు నిర్మాణం ప్రోత్సహించవలసి వచ్చింది. 1816 నాటి కేంబెల్ తెలుగు వ్యాకరణం, 1852 నాటి బ్రౌన్ నిఘంటువులు, 1855-56 నాటి రాబర్ట్ బిషప్ కాల్డ్వెల్ ద్రవిడభాషా తులనాత్మక వ్యాకరణం, గ్రంథకరణ సభవారు రాయించిన పాఠ్యగ్రంథాలు, ఆంగ్ల విద్యావ్యాసంగం ద్వారా సంక్రమించిన 'భాషాదృష్టి' (ముఖ్యంగా 'Philology' అనే వ్యుత్పత్తిశాస్త్రం) మొదలైనవి సాహిత్యవిమర్శలో, భాషా పరిశీలనలో మనవారికి కొత్త పోకడలెన్నో తెలియజెప్పాయి. క్షీణయుగ పాండిత్యచిహ్నాలుగా నిలిచిన శబ్ద సాధుత్వాసాధుత్వ నిర్ణయాలవంటి సాంప్రదాయక ధోరణులు ఒకవైపు హెచ్చరిల్లినా, అప్పటికి ఆధునికాలైన భాషాసిద్ధాంతాల అనుసరణ కూడా ఏకకాలంలో వాడుకలోకి వచ్చింది. క్రీ.శ. 19 వ శతాబ్ది తొలిరోజులకే ప్రాచీన శాసనాల సేకరణ మొదలయింది. మన భాష పూర్వం ఏ రూపంలో ఉండేదో శిలాక్షరన్యాయంలో తెలుసుకోగలిగారు. చారిత్రకదృష్టి కలిగింది. భాషాప్రయోజనాలను గురించి అంతకు ముందున్న అభిప్రాయాల్లో మార్పు వచ్చింది. 'వాడుకభాష'కు, 'జానపద సాహిత్యా'నికి ఎంతో కొంత గుర్తింపు వచ్చింది. విద్యావకాశాలు పెరిగాయి. సామ్రాజ్యవాదుల ఆర్థిక వ్యవస్థలో ఫ్యూడల్‌యుగంలో కన్నా ఎక్కువ స్వాతంత్ర్యం, జ్ఞానతృష్ణ, విశ్రాంతీ లభించాయి. గ్రంథాలు సులభంగా దొరకటం మొదలయింది. మొదటి తెలుగుపత్రిక 'వర్తమాన తరంగిణి' 1855 లో వెలువడింది. తెలుగులో భాషాపరిశోధన ఆకాలంలోనే మొదలయిందని చెప్పవచ్చు.

1.5. మూలఘటిక కేతన'ఆంధ్రభాషాభూషణ' కాలం నుంచీ వచ్చిన వ్యాకరణ గ్రంథాలు భాషా పరిశోధన ఫలితాలు కావనుకోవటం అపచారం. తెలుగు భాషలో అంతర్గతంగా ఉన్న లక్షణాలను పృథక్కరించి వాటిని సూత్రీకరించటం భాషా పరిజ్ఞాన పరిశీలనలు లేకుండా సాధ్యం కాదు. తెలుగు వ్యాకరణాల చరిత్రను స్థూలంగా పరిశీలించినా శబ్ద సాధుత్వ నిర్ణయాలతోబాటు (అవి నేటివారికి నచ్చక పోయినా), రేఫఱకార నిర్ణయం, సబిందు నిర్బిందుకశబ్ద చర్చవంటి వాటిలో కూడా 'పరిశోధన' ప్రతిఫలిస్తుంటుంది. ఆవివరా లిక్కడ ప్రధానం కాదు. పైన పేర్కొన్న శకటరేఫ, సబిందుకాదుల విషయమే 19 వ శతాబ్ది నాటి తొలితరం భాషా పరిశోధకుల దృష్టిని ఎక్కువగా ఆకర్షించిన మాట వాస్తవం. పూండ్ల రామకృష్ణయ్యగారి పత్రిక 'అముద్రితగ్రంథ చింతామణి'లో 1891 లో 'రేఫద్వయ' చర్చ ప్రాధాన్యం సంపాదించుకుంది. అలాగే 1897 లో

'విధవ' శబ్ద విచారం కూడా. అటువంటి చర్చలెన్ని జరిగాయో ఇప్పుడు మనకు తెలియటం లేదు-ఆధారాలు దొరక్క. అలాగే 1840 లో వెలువడ్డ రావిపాటి గురుమూర్తిశాస్త్రి వ్యాకరణంలో గ్రాంథిక శబ్దాలతో బాటు వ్యావహారిక రూపాలు కూడా వ్యాకరణీయాలైనందుకు, 1840-55 ల మధ్య వచ్చిన చిన్నయసూరి వ్యాకరణ గ్రంథాంతో గురుమూర్తి శాస్త్రి గ్రంథాన్ని పోల్చి ఎన్ని విధాల అప్పటి పండితులు చర్చించారో మన కిప్పుడు ఆధారాలు లేనందువల్ల సరిగ్గా తెలేదు. 1862 నాటి స్వామినేని ముద్దు నరసింహంనాయుడుగారి 'హితసూచని' పీఠికలోని రేఫద్వయ విషయం, అర్ధానుస్వార ప్రసక్తి అప్పటి పండితలోకం కొన్ని చర్చలు చేసిందనటానికి నిదర్శనం. 1892 నాటి గిడుగు వేంకట రామమూర్తి గారి సవరభాషా నిఘంటువులు,ఆ యేడే తాతవెల్లి మిరాసీదార్ శేషగిరిశాస్త్రిగారు ప్రచురించిన 'అర్ధానుస్వార తత్వం' అప్పటి పాశ్చాత్యుల భాషాశాస్త్ర పరిజ్ఞానాన్ని అన్వయించటంలో తెలుగు వారు పరిశ్రమించటం మొదలుపెట్టారనటానికి ప్రత్యక్షసాక్ష్యాలు. 'Philology' అనే శాస్త్రాన్ని, దాని ప్రయోజనాన్ని, నిఘంటు నిర్మాణంలో ఆ రకం భాషా పరిశోధనలకున్న ప్రాశస్త్యాన్ని వేదం వేంకటరాయశాస్త్రిగారి వంటి సంప్రదాయ విజ్ఞానులు కూడా 1915 నాటి 'ఆంధ్ర భాషా సర్వస్వార్హ నియమ కతిపయములు' అనే గ్రంథంలో గుర్తించక తప్పింది కాదు. అంటే 19 వ శతాబ్ది చరమకాలానికే అప్పటి పాశ్చాత్య భాషా పరిశోధన విధానం తెలుగులో కాలూనిం దని చెప్పాలి.

1.6. క్రీ.శ. 20 వ శతాబ్ది ప్రథమార్ధంలో 'భాషాశాస్త్ర పద్ధతి' పరిశోధనలకు దారి చూపిన మహనీయులు గిడుగు వేంకటరామమూర్తి గారే. 1912 లో ప్రపంచ విఖ్యాత భాషావేత్త డేనియల్ జోన్సుతో చర్చించినప్పటికే తెలుగువారి ఉచ్చారణలో వివృత సంస్పృతాచ్చుల భేదం ఏమిటో తొలిసారిగా ఆయన నిరూపించారు. 'పిట్ట-పిట్టు, పీక-పీకు, గూడ-గూడు, పొట్ట-పొట్టు' వంటి జంట మాటల్లోని ఉచ్చారణ భేదాన్ని ఆయనే గుర్తించారు. వ్యావహారిక భాషోద్యమం ద్వారా ఉచ్చరిత ధ్వనికి భాషాధ్యయనంలో ఉండవలసిన ప్రాముఖ్యాన్ని ఆయన పండితుల దృష్టికి తెచ్చారు. భాష పరిణామ శీలమని ఆయన నిరూపించారు. మాండలిక పదకోశ నిర్మాణావసరం ఆయనే తొలిసారిగా ప్రస్తావించారు. తెలుగు భాషకు సమగ్ర నిఘంటువు నిర్మించాలని ఆయనే వాదించారు. సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ పద్ధతిలోని లోపాలను ఆయనే బైటపెట్టారు. పాఠ పరిష్కరణ పద్ధతిని ఆయనే పట్టుదలతో ప్రచారం చేశారు. కవి ప్రయోగాలకూ ప్రాచీన సంప్రదాయాలకూ భాషావేత్తలు ఎంత గౌరవ మివ్వాలో ఆయన నిరూపించారు. కానీ ఆయన ఆదర్శాలకూ ఆలోచనలకూ అనుగుణమైన భాషా పరిశోధనలు 1950 లోగా పెద్ద యెత్తున రాలేదు. అయినా అనేకులు ఆయన మార్గంలో పరిశోధనలు చేశారు. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, భారతి, త్రిలింగ, ప్రతిభవంటి సారస్వత పత్రికలు భాషా పరిశోధనలకు అనేక విధాల తోడ్పడ్డాయి. ఆ కాలంలో జరిగిన భాషా పరిశోధనలకు గిడుగువారే యుగకర్తలయినా, మరి రెండు మూడు ధోరణుల్లో పదిశోధనలు జరిగాయి. చరిత్ర పరిశోధకులూ, సంప్రదాయ వ్యాకరణ పండితులూ భాషా విషయాలను చర్చించారు. మీరు గాక మరికొందరు 'భాషాశాస్త్ర' పద్ధతిలో పరిశోధనలు చేశారు. శాసనావిష్కారం ద్వారా తెలియ వచ్చిన 'ఱ' కార విషయం 1904 లోనే కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిని ఆకర్షించింది. అముద్రిత గ్రంథ చింతామణిలో శ్యమంతకాది శబ్దాల స్వరూప వ్యుత్పత్తులమీద చర్చలు జరిగాయి. 1920 నాటి త్రిలింగలో దంత్యచజలు, కళాద్రుత ప్రకృతికాలు, ఎడుత వర్ణకాలు మొదలైన విషయాల మీద తర్జన భర్జనలు జరిగాయి. కాసట బీసట, స్నాన స్నాన శబ్ద విచారం, ఆంధ్ర శబ్ద చింతామణి

కర్తృత్వ విషయం (దీన్ని కందుకూరి వీరేశలింగం గారే మొదలేశారు), త్రిలింగ శబ్ద వ్యవహారం, ద్రావిడ భాషలేవనే ప్రశ్న, దేశ్యాదేశ్యాల సంగతి, తెలుగు మాటల నిష్పత్తి క్రమం మొదలైన అనేక సమస్యలమీద చర్చలు జరిగాయి. కొమర్రాజు లక్ష్మణ రావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి చారిత్రక పరిశోధకులు శాసన భాషా పరిశీలన ఫలితంగా నిఘంటువుల కెక్కని ఎన్నో మాటలచరిత్రనువివరించారు. చిలుకూరినారాయణరావు, కోరాడ రామకృష్ణయ్య, వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి, గంటి జోగి సోమయాజి వంటి విద్వాంసులు ద్రవిడ భాషా చరిత్రను, ఆంధ్ర భాషా చరిత్రను, ఆంధ్ర వ్యాకరణ గ్రంథ పరామర్శను అనేక వ్యాసాల ద్వారా, తమ గ్రంథాలద్వారా ప్రకటించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1926 లో స్థాపితమైన తరవాత వీరి రచనలు పఠన పాఠనాల్లో చోటు చేసుకున్నాయి. ఇవన్నీ ఒక ఎత్తు, సంప్రదాయ వ్యాకరణ పండిత లోకంలో చిన్నయసూరి బాల వ్యాకరణం శిష్టు కృష్ణ మూర్తి శాస్త్రి 'హరికారిక' లకు అనువాదమా కాదా అనే వివాదం, భాగవతుల రామమూర్తి 'హరికారికా శేష సర్వస్వం' బహుజనపల్లి సీతారామాచార్యుల వారి ప్రౌఢ వ్యాకరణానికి మూలమా అనువాదమా అనే విషయం తుఫాను లేపాయి. 1917 నుంచి 1939దాకా ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, భారతి, ప్రతిభల్లోనే గాక ఇతర పత్రికల్లోనూ, రమణీయంలోను, గుప్తార్థ ప్రకాశికలోను 'పార్థమన్యు శ్రీమహోత్సవం' పేరిట గందరగోళం సృష్టించాయి. నిజానికి ఈ వివాదం భాషా వ్యాకరణ శాస్త్ర సంబంధం కాకపోయినా వాదోపవాదాల్లో అనేక భాషా వ్యాకరణ పరిశోధ నాంశాలు బయటపడ్డాయి. ఇది యువలోకంలో భాషావిషయాలమీద అభిరుచి కలిగించినమాట వాస్తవం. శబ్దార్థ నిర్ణయం విషయంలో సూర్య రాయాంధ్ర నిఘంటువు ప్రథమ సంపుటాన్ని విమర్శిస్తూ గిడుగువారు ప్రతిభలో రాసిన వ్యాస పరంపరలో అలనాటి భాషాపరిశోధన లన్నిటిలోకీ శాస్త్రీయమైన ఉత్తమ రచన అని చెప్పవచ్చు.

1.7. క్రీ.శ. 20 వ శతాబ్ది ప్రథమార్థం దాకా వచ్చిన భాషాపరిశోధనల్లో కొట్టవచ్చినట్లుగా కనిపించే దుర్లక్షణం వ్యక్తి దూషణ. ఈ లక్షణం చరిత్ర పరిశోధకుల్లోకి కూడా వ్యాపించింది. బహుశా అది యుగధర్మమేమో ! ప్రాచీన శాసనాలను ప్రచురించటంలో, శాసనపద్యాలను 'సంస్కరించి' ప్రచురించి పూర్వ భాషా లక్షణాలను వెలికి తీయటంలో జయంతి రామయ్య పంతులుగారి సేవ అపారం. ఆయన పరిశ్రమలో, ఆయన అనుయాయుల పరిశోధనల్లో కనిపించే పెద్ద లోపం ఆత్మాశ్రయత్వం. అందువల్ల పరిశోధనల్లో నిర్మోహత్వం, శాస్త్రీయత కొరవబడ్డాయి. క్రీ.శ. 1950 తరవాత 'ఆధునిక' భాషా శాస్త్ర ప్రభావం కూడా తెలుగువారిమీద పడ్డది. భద్రిరాజు కృష్ణ మూర్తిగారు అమెరికాలో భాషా శాస్త్రాభ్యాసం చేసి వచ్చి, ఆంధ్రాది విశ్వవిద్యాలయాల్లో చారిత్రక, తులనాత్మక, వర్ణనాత్మక, సామాజిక, మాండలికాది భాషా శాస్త్ర పద్ధతులను పఠన పాఠనాల్లోనూ, నేటి 'పరిశోధన'ల తీరులోనూ వ్యాప్తికి తేవటంతో మరో యుగం అవతరించింది. ఆ తరవాత కొన్ని విషయాలు నేర్చి వచ్చినవారు తామే అత్యాధునిక ప్రవక్తల మనుకున్నా, శాస్త్రీయ పద్ధతిలో భాషా శాస్త్ర పద్ధతులు భద్రిరాజు వారితోనే మొదలై అవిచ్ఛిన్నంగా సాగు తున్నాయి. భాషాశాస్త్ర శాఖ వేరుగా ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఏర్పడింది. తెలుగుశాఖల్లో ఆ శాస్త్రాన్ని బోధించటం కొన్ని విశ్వవిద్యాలయాల్లోనయినా జరుగు తున్నది. ఆయన పరిశ్రమ ఫలితంగా విశ్వవిద్యాల యాల్లో వ్యక్తినిష్ఠంగా ఉంటున్న భాషాశాస్త్ర పరి శోధనలకు తోడుగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, తెలుగు అకాడమీ వంటి సంస్థల్లో సంస్థా గతంగా పదిమంది 'కలిసి' పరిశోధనలు చేసే అవ కాశాలు కలిగాయి. కృష్ణమూర్తిగారి కృషి ఫలితంగా

సాహిత్య అకాడమీ వారు పద ప్రయోగ కోశాలు (Concordances), మాండలిక వృత్తి పదకోశాలు (Dialect dictionaries of occupational vocabularies), తెలుగు భాషా చరిత్ర (History of Telugu Language), తెలుగు శాసనాల వంటి గ్రంథాలు ప్రచురించారు - ప్రచురిస్తున్నారు. తెలుగు అకాడమీ వారు ఆంధ్రప్రదేశ్ సామాజిక భాషా పరిశీలన(A Socio-linguistic survey of Andhra Pradesh) చేస్తున్నారు. వాణిజ్య పదకోశం, మాండలిక పదకోశం వంటివి సిద్ధం చేస్తున్నారు. 'భాష-వ్యాకరణం, ధ్వని-వర్ణం, పదం -పదాంశం' వంటి కృష్ణమూర్తిగారి వ్యాసాలూ, వారు సంపాదించిన వృత్తి పదకోశాలూ తెలుగులోనే వున్నా ప్రామాణికమైన 'Telugu Verbal Bases' గాని, వారి అనేక పరిశోధన పత్రాలుగాని ఇంగ్లీషులోనే ఉండటం తెలుగువారి దురదృష్టం. ఇంగ్లీషులో సంకేతమయమైన భాషాశాస్త్రంలో మంచి ప్రవేశంలేని వారికి అందుబాటులో లేకపోవటమే భద్రిరాజు వారి రచనలేగాక వారి శిష్యమిత్రుల పరిశోధనలు కూడా లోకానికి సరిగా తెలియకపోవటానికి ప్రధాన కారణం.

1.8. ప్రస్తుతం భాషాశాస్త్ర పరిశోధనలు కొన్ని విశ్వవిద్యాలయాల్లోని తెలుగు శాఖల్లో, ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని భాషా శాస్త్రశాఖలో, తెలుగు అకాడమీవంటి సంస్థల్లో జరుగుతున్నాయి. 1950-80 మధ్యకాలంలో ఎం.ఫిల్., పిహెచ్.డి. వంటి డిగ్రీల కోసం భాషాశాస్త్రంలో పరిశోధిస్తున్నవారి సంఖ్యా విశేషాలను కింది పట్టిక వివరిస్తుంది.

| | అభిమాన విషయం | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శాఖ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | మొత్తం |
| తెలుగు | 4 | 5 | 9 | - | - | - | 3 | 8 | 2 | 31 |
| భాషాశాస్త్రం | 4 | 3 | 1 | 3 | 4 | 2 | - | - | - | 17 |
| మొత్తం | 8 | 8 | 10 | 3 | 4 | 2 | 3 | 8 | 2 | 48 |

*గమనిక* : అభిమాన విషయాల కిచ్చిన సంఖ్యలకు వివరణ :

1. చారిత్రక/తులనాత్మక వ్యాకరణం
2. వర్ణనాత్మక వ్యాకరణం
3. పదజాలం
4. వాక్య నిర్మాణం
5. మాండలిక/సామాజిక - భాషాశాస్త్రం
6. ధ్వనివర్ణశాస్త్రం
7. అర్థ విపరిణామం
8. సంప్రదాయ వ్యాకరణ పరిశీలన
9. స్థలనామ పరిశీలన

పై పట్టిక తెలుగు శాఖల్లో జరుగుతున్న భాషా పరిశోధనలు తెలుగు కావ్యాలకు వర్ణనాత్మక వ్యాకరణాలు రాయటంతోబాటు అర్థ విపరిణామ, స్థలనామ పరిశీలన, సంప్రదాయ వ్యాకరణ పరిశీలనలకు ప్రాధాన్యమివ్వగా భాషాశాస్త్రశాఖ చివరి మూడు విషయాలకూ ఎటువంటి అవకాశం కల్పించటం లేదని సూచిస్తున్నది. అలాగే మాండలిక, ధ్వనివర్ణ, వాక్య నిర్మాణ విభాగాలమీద తెలుగుశాఖలు పరిశోధించటం లేదని తెలుస్తున్నది.

1.9. కింది పట్టిక 1950-80 మధ్య కాలంలో ఏ దశాబ్దంలో ఏ విధమైన భాషాపరిశోధనలు జరిగాయో నిరూపిస్తుంది.

| అభిమాన విషయం | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| దశాబ్దం | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | మొత్తం |
| 1951-60 | 1 | - | - | - | - | - | - | 1 | - | 2 |
| 1961-70 | 4 | 2 | 4 | 1 | - | - | 1 | 3 | - | 15 |
| 1971-80 | 3 | 6 | 6 | 2 | 4 | 2 | 2 | 4 | 2 | 31 |
| మొత్తం | 8 | 8 | 10 | 3 | 4 | 2 | 3 | 8 | 2 | 48 |

*గమనిక:* అభిమాన విషయాల సంఖ్యలు ముందు పేరాలో చెప్పినవే.

పైన పేర్కొన్నవిగాక ఇటీవలి కాలంలో గిరిజన భాషాధ్యయనం కూడా పరిశోధనాంశంగా పరిణమించింది. పై పట్టిక ద్వారా చారిత్రక తులనాత్మకాధ్యయనం తిరుగుముఖం పట్టి, ఆ మేరకు(25 శాతం దాకా) సంప్రదాయ వ్యాకరణ సిద్ధాంతాల పునఃపరిశీలన అధికమయిందని తెలుస్తున్నది. మాండలిక సామాజిక భాషాపరిశీలనలు, ప్రాచీన కావ్యాలకు వర్ణనాత్మక వ్యాకరణాలు రాయటం 75 శాతం దాకా రెండు దశాబ్దాల్లో పెరిగాయని కూడా తెలుస్తున్నది. తక్కిన అభిమానవిషయాల్లో పరిశోధనలు 50 శాతం పెరిగాయి. ఆయా విశ్వవిద్యాలయాల్లోని శాఖాధ్యక్షుల అభిమాన విషయాలమీద సహజంగానే పరిశోధనలు జరిగాయి- జరుగుతున్నాయి. జి. నారాయణ స్వామిరెడ్డి గారి పర్యవేక్షణలో అర్థవిపరిణామ, స్థల నామ పరిశోధనలు ఎక్కువగా జరిగితే, కె. మహదేవ శాస్త్రి గారి దగ్గర వర్ణనాత్మక వ్యాకరణ రచన, టి. దొణప్ప గారి ఆధ్వర్యంలో పదజాల పరిశీలన అధికంగా జరుగుతున్నాయి. వివరాలన్నీ ఇక్కడ ఇవ్వటం లేదు. భాషా పరిశోధనలను విడిగా కాక, సాహిత్య పరిశోధనలతో పోల్చి చూసినప్పుడు పరిస్థితి మరో విధంగా కనిపిస్తుంది. 1955-70 మధ్య కాలంలో 25 మంది పరిశోధక విద్యార్థులు భాషా విషయాలను అభిమానించగా 76గురు సాహిత్య విషయాల్లో పరిశోధించారు. ఆ తరవాతి దశాబ్దంలో 101 మంది పరిశోధకుల్లో 10 మంది మాత్రమే భాషా పరిశోధన లభిమానించారు. సంఖ్యా దృష్టితో చూస్తే భాషాశాస్త్ర పరిశోధనలు తగ్గుముఖం పట్టాయనక తప్పదు. అయితే ఈ సంఖ్యలు పరిశోధక విద్యార్థులకు సంబంధించినవి మాత్రమే. పత్రికల్లో వ్యాసరూపంలోనూ, ప్రత్యేక గ్రంథాలుగానూ, పరిశోధన పత్రాలుగానూ వచ్చిన పరిశోధనలు ఈ లెక్కలో చేరలేదు. కాని ఈ అంకెలు భాషాశాస్త్ర పరిశోధనల మొత్తం పరిస్థితిని ప్రతిబింబించవని కూడా చెప్పలేం. ప్రత్యేకంగా భాషాశాస్త్ర శాఖ గడచిన రెండు దశాబ్దాలుగా వున్నా ఈ పరిస్థితి ఇలా వుందంటే ఇందుకు బలీయమైన కారణాలుండాలి.

1.10. నిర్మొహమాటంగా కింద పేర్కొన్న కారణాల్లో కొన్నిగాని, అన్నీగాని, పై పరిస్థితికి దారితీశాయని చెప్పవచ్చు.

i) భాషాశాస్త్రంలో రాష్ట్రం మొత్తం మీద ఒక్క విశ్వవిద్యాలయంలో మాత్రమే ప్రత్యేక శాఖ వుంది. తెలుగు శాఖల్లో పూర్వం భాషా వ్యాకరణాల పఠన పాఠనా లున్నచోట్లకూడా ప్రస్తుతం ఆ అవకాశం లేదు. ఉదా. ఆంధ్ర విశ్వవిద్యాలయం.

ii) తెలుగు శాఖల్లోనూ ఇతర సంస్థల్లోనూ భాషా-సాహిత్య వివాదం, ఆయా శాస్త్రాభిమానుల మధ్య స్పర్ధ మునుపటిలాగానే ఉన్నందువల్ల భాషాధ్యయనానికి తగినంత ప్రోత్సాహం లభించటం లేదు. విశ్వవిద్యాలయాల్లో తప్ప డిగ్రీస్థాయిలో భాషాశాస్త్రం (ఒక్క ఉస్మానియాలో తప్ప) అభిమానవిషయంగా లేదు. భాషాశాస్త్రంలో, వ్యాకరణశాస్త్రంలో పరిశీ

రెండు పేపర్లున్న విశ్వవిద్యాలయాల తెలుగుశాఖల్లో కూడా ఆయా శాస్త్రాల పరిచయం మాత్రమే కలుగుతున్నది గాని, అభిమాన విషయంగా నేర్చుకోవాలనిపించేటంత విషయాభిరుచి కన్పించటం లేదు-విద్యార్థులకు కలగటం లేదు.

iii) 'ఆధునిక' భాషాశాస్త్ర సిద్ధాంతాలనూ అనువర్తనలనూ పరిచయంచేసే ప్రామాణికగ్రంథాలు తెలుగులో లేవు. సంప్రదాయ వ్యాకరణాలనే కాక సాంప్రదాయకమైన ప్రతివిషయాన్నీ అజ్ఞానంవల్ల కొంత, అవసరం లేమివల్ల కొంత, అసహనం వల్ల కొంత, నేటి భాషా శాస్త్రజ్ఞులు నిరసిస్తున్నారన్న భావం పండితలోకంలో పర్యాప్తంగా ఉంది. సాధారణ సాహిత్య విద్యార్థి ఇంగ్లీషులో ప్రామాణిక గ్రంథాలను చదవటంలోగాని, ఇంగ్లీషులో ఆ శాస్త్ర విషయాన్ని రాయటంలోగాని చొరవ చూపటం లేదు. అలాగే కేవలం భాషా శాస్త్రాన్ని ఇంగ్లీషులో చదివి నేర్చిన విద్యార్థి తెలుగు సంప్రదాయ వ్యాకరణాలతో సహా సాహిత్య శాస్త్రాన్నీ సాహిత్యాన్నీ చిన్న చూపు చూడటం పరిపాటయింది. భాషా సాహిత్యాలు తెలుసుకోకుండానే, పూర్వుల పరిశ్రమను పరిగణించకుండానే 'ఆధునిక' భాషాశాస్త్ర మర్యాదల్లో అద్భుత పరిశోధనలు చేస్తున్నామని, చేయగలమని, చేశామని భాషా శాస్త్ర విద్యార్థులు భావించటం ఇందుకు తోడయింది.

iv) భాషాశాస్త్ర పరిశోధన సాహిత్య పరిశోధనలాగా హృదయతలస్పర్శి కాదని, ఆనంద ప్రపంచం కాదని విద్యార్థిసామాన్యంలోనే గాక చాలా మంది భాషోపాధ్యాయుల్లో కూడా వ్యాపించింది. భాషా విద్యార్థికి సాహిత్యం అందుబాటులో ఉన్నంతగా, సాహిత్య విద్యార్థికి భాషాశాస్త్రం అందుబాటులో లేదు. అందుకు కారణం ప్రామాణిక గ్రంథాలు తెలుగులో లేకపోవటం ఒక్కటేకాదు, భాషా విద్యార్థి ఎక్కువ శారీరక శ్రమ కూడా చేయవలసి వస్తుందని, భాషా పరిశోధనకు ఎక్కువ కాలం, ధనం పెట్టుబడి పెట్టాలని, అయినా ఉద్యోగావకాశాలు తక్కువగా ఉన్నందువల్ల శ్రమకు తగ్గ ఫలితం లేదనే నిర్వేద భావం వేళ్ళుతన్నింది.

v) భాషా శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలకు పాశ్చాత్య దేశాల్లో గుర్తింపు రావాలని ఆశించినంతగా స్వరాష్ట్రంలో రావాలని కోరటం లేదు. పదిమందినీ కూడగట్టుకోవాలని కాక, పదిమందికీ దూరంగావుండి తమ 'ప్రత్యేకత' నిలుపుకోవాలని తపన పడుతున్నారు. భాషాపరిశోధన ఫలితాలు ఎంత అలభ్యంగా ఎంత దీర్ఘకాలికంగా విద్యార్థులకు అందితే అంత గొప్పతనం లభిస్తుందనుకుంటున్నారు. తమ పరిశోధనలు తప్పతక్కినవి జరగలేదనీ, జరిగినా ప్రామాణికాలు కావనే భావన వారిని వీడలేదు.

1.11. ఈనాటి భాషాశాస్త్ర పరిశోధనలు కాక మరికొన్ని భాషా పరిశోధనలు లేకపోలేదు. అవి నిఘంటు నిర్మాణం, మాండలిక పదార్థ పరిశీలన, అప్పుడప్పుడు సంప్రదాయ వ్యాకరణాల పునర్వివేచన మొదలైనవి. ఏమైనా భాషాసాహిత్యోపాధ్యాయులకూ భాషాశాస్త్రోపాధ్యాయులకు మధ్య సదవగాహన ఏర్పడనిదే, భాషా శాస్త్రంలోని ప్రామాణిక గ్రంథాలు తెలుగులో ప్రచురితం కానిదే, భాషాశాస్త్ర పఠన పాఠనాలకు కళాశాలల్లో కూడా అవకాశం ఏర్పడనిదే, భాషా శాస్త్రం నేర్చిన వారికి ఉద్యోగావకాశాలు కలగనిదే, భాషా పరిశీలనలో కూడా ఆత్మానందం పొంద వచ్చనే విశ్వాసం విద్యార్థి లోకంలో వ్యాపించనిదే పరిస్థితిలో మార్పు వస్తుందనే నమ్మకం లేదు. పూర్వ భాషా పరిశోధకులకూ నేటి వారికీ మధ్యనున్న పెద్ద భేదం అప్పటి వారివలె కాక ఇప్పటివారు వ్యక్తి దూషణలకూ, అవహేళనలకూ దూరంగా ఉండటం. నాటి పరిశోధనలు చాలావరకు వైయక్తికాలు. నేడు కలిసికట్టుగా పది మంది సంస్థాగత సౌకర్యాలు పొంది పరిశోధించే

అవకాశాలు కూడా ఉన్నాయి. తెలుగు భాషకు ఈనాటికీ విపులమైన వ్యాకరణ గ్రంథం కాని, విస్తృతమైన నిఘంటువు కాని లేదు. అవి వ్యక్తి పరిశోధన సాధ్యాలు కావు. సమష్టి కృషి ఫలితాలు మాత్రమే. సమష్టి కృషి సమన్వయ దృష్టి, సరళ స్వభావం లేకుండా సాధ్యం కాదు. లిఖిత వాగ్రూపాల్లోని భాషను సమదృష్టితో పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది. సాహిత్యాభిరుచినీ భాషా పరిశోధనలనూ వేరువేరుగా పరస్పర వ్యతిరేక విషయాలుగా చూడవలసిన ఆవసరం లేదు. దేని ప్రయోజనాలు దానివైనా అవి రెండూ పరస్పరాధారితాలు. భాషకు కేవల వాగ్వ్యవహారంకన్నా అక్షరమైన ఆనంద ప్రదమైన రూపమే సాహిత్యం. సాహిత్య ప్రయోజనాల వ్యాప్తికి ప్రధాన సాధనం భాష. సాహిత్యం జానపదమైనా, ప్రౌఢమయినా, భాష లిఖితమైనా, వాగ్రూపమైనా, పరస్పర విరుద్ధాలు కాకపోగా అన్యోన్యాశ్రితాలుగానే భాసిస్తాయి.

1.12. ఇది కేవలం స్థూలమయిన పరామర్శ. ఈనాటి వరకూ జరిగిన భాషా పరిశోధనలన్నిటి గుణ దోష ప్రదర్శన ఈ వ్యాస లక్ష్యం కాదు. ఆ పరిశోధనల స్వరూప స్వభావాలను రేఖామాత్రంగా ప్రస్తావించాం. ఈ వ్యాసరచనలో తోడ్పడ్డ సాంఖ్యక విషయాలు (Statistical information) తెలుగు అకాడమీ ప్రచురించిన పరిశోధన సంహిత నుంచి గ్రహించినవి'.



# తెలుగులో సాహిత్య పరిశోధన :
# నాడు - నేడు

— జి. వి. సుబ్రహ్మణ్యం

'Criticism' అన్న ఆంగ్ల పదానికి సమాంతరంగా 'విమర్శ' అనీ, 'Research' కి సమానార్థకంగా 'పరిశోధన' అనీ తెలుగులో వాడుతున్నాము. పరిశోధన శబ్దం ఆంగ్లభాషా ప్రభావం వలన మనం కల్పించుకొన్న పారిభాషిక పదమే. సంస్కృతంలో 'శోధన' శబ్దం తైత్తిరీయ సంహితలో కనపడవచ్చు,[1] ఆయుర్వేదాది శాస్త్రాలలో 'పరిశోధన' శబ్దం కూడా వాడబడి యుండవచ్చు, లాక్షణికులు కూడా ఈ మాటలను తమ గ్రంథాలలో ప్రసక్తానువశంగా పేర్కొని యుండవచ్చు. కాని, పరిశోధన అంటే 'రీసర్చి' అనే అర్థమే రూఢి కెక్కి ఉంది ఈనాడు. ఆ మాటకు వస్తే, పరిశోధన అనే ప్రక్రియ ఆ పేరుతో గుర్తింపబడింది ఆంగ్ల భాషా ప్రభావం పడిన తరువాతనే అన్న విషయం నిర్వివాదాంశం.

అట్లని, భారతీయులకు పరిశోధన అంటే, అందులోనూ సాహిత్య పరిశోధన అంటే నిశ్చితమైన అభిప్రాయాలూ, అవగాహనలూ లేవని తలంచటం తొందరపాటే అవుతుంది.

'తస్మాత్ సతా మత్ర న దూషితాని
మతాని తాన్యేవతు *శోధితాని*
పూర్వ ప్రతిష్ఠాపిత యోజనాసు
మూలప్రతిష్ఠా ఫల మామనంతి''

''తదుచ్యతాం పరిశుద్ధతత్త్వం''[2] అన్న అభినవ గుప్తుని మాటలు గమనిస్తే పరిశోధన పరమార్థం ప్రాచీనులకు అవగతమైన దన్న విషయం స్పష్టమౌతుంది.

Research అన్న పదాని కున్న వాచ్యమైన అర్థాన్ని గ్రహిస్తే 'పునరన్వేషణ' లేదా 'పునఃపరిశీలన' కావాలి. ఆ అర్థం కూడా ఆంగ్లభాషలో ఉంది. దాన్ని శాస్త్ర పరిశోధనాదుల్లో కూడా గ్రహిస్తారు. కాని, దాని కంత ప్రాముఖ్యం, ప్రామాణికత్వం ఇవ్వరు. అట్లని ఆ అర్థం పరిశోధన ప్రవృత్తికి పట్టదని చెప్పలేము. ''The activities that go by the name of research involve mainly a 're-search' ie., activities undertaken to repeat a search.''[3] ఈ అర్థాన్ని ప్రతిబింబించేలా తెలుగులో వాడవలసి వస్తే 'పునశ్శోధనం' అనాలి. కాని, శబ్దవ్యుత్పత్తిని బట్టి వచ్చే ఆ అర్థాన్ని మనం స్వీకరించలేదు.

---

1. 'సోమ విక్రయన్ సోమం శోధయ' - తైత్తిరీయ సంహిత VI. 1. అనువాకం. 9. బ్రాహ్మణభాగం.
2. అభినవభారతి.
3. T.S. Wilkinson&P.L. Bhandarkar: Methodology and Techniques of Social Research (1979), P. 9.

Research స్వభావాన్ని నిర్దేశించే అర్థాన్ని గ్రహించి 'పరిశోధన' పదాన్ని ఎన్నుకొన్నాం. ఇంగ్లీషులో Research కున్న స్వభావపరమైన నిర్వచనాలను కొన్ని గమనిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

1. "A careful critical inquiry or examination in seeking facts or Principles; diligent investigation in order to ascertain something."

-Webster'sInternational Dictionary.

2. "A critical and exhaustive investigation or experimentation having as its aim the revision of accepted conclusions in the light of newly-discovered facts."

-The Encyclopaedia of Social Sciences, Vol. IX, (1930).

3. "The more formal, systematic, intensive process of carrying on the scientific method of analysis."

-Best, J.W., Research in Education (1963). P. 4.

4. "Research is a systematic attempt to push back the bounds of comprehension and seek beyond the horizons of our knowledge some "truth", some reality, shrouded in a subtle way and consequently to keep on extending as also consolidating these horizons without end."

-Wilkinson and Bhandarkar (1979).

విజ్ఞాన పరిధులను విస్తరింపజేసే యత్నంలో నూతన సత్యాలను, సూత్రాలను, సిద్ధాంతాలను కనుగొనటానికి, శాస్త్రీయ పద్ధతులలో క్రమబద్ధంగా గాఢతరమైన అన్వేషణ, పరిశీలన చేసే విధానం పరిశోధన. లక్షించిన ఏ అంశాన్నైనా నిర్ధరించటానికి సోపపత్తికంగా సామగ్రిని సేకరించి వాటిని నిశితంగా పరీక్షించటం, ఒకవేళ ఆ సామగ్రి ద్వారా పూర్వ ప్రవర్తిత సిద్ధాంతాలనుగానీ, సమన్వయాలనుగానీ, ఫలితాలనుగానీ పునర్మించవలసివచ్చినా, పునర్వ్యవస్థీకరించవలసివచ్చినా, నిర్దుష్టంగా రూపొందించవలసి వచ్చినా, చివరకు ఒక వినూత్నాంశాన్ని ప్రతిపాదించవలసివచ్చినా సత్యాన్వేషణ దృష్టితో, సమన్వయ దృక్పథంతో, నిర్మాణాత్మక వైఖరితో, వాస్తవాన్ని వ్యక్తీకరించాలన్న దీక్షతో పరిశోధన లక్ష్యమైన విజ్ఞాన వికాసాన్ని సాధించటమే పరిశోధన. ఈ పరిశోధన ఒక నిరంతర సాధన. దీనికి మొదలే కాని తుది లేదు. అవగాహన యొక్క అవధుల విస్తృతీకరణం, వినూత్న సిద్ధాంతాదుల ప్రతిపాదనం, తద్వారా సత్యాన్వేషణపరత్వాన్ని సమున్మేషింపచేయటం పరిశోధన.

పరిశోధనలో శాస్త్ర పరిశోధన, కళా పరిశోధన అని రెండు విధానాలను పేర్కొనవచ్చు. ఈ రెండింటికీ మౌలికంగా శాస్త్ర కళా ప్రవృత్తులకున్న స్వభావాలనుబట్టి భేదం ఉంటుంది. శాస్త్రం వాస్తవమూలం, కళ దర్శన మూలం; శాస్త్రంలో భౌతికసత్యం, కళలో దార్శనికసత్యం మూలతత్త్వాలుగా గ్రహింపబడతాయి. "Science never imposes anything, Science states. Science aims at nothing but making true and adequa-te statements about its objects"[4] అన్న Schroedniger మాటలు శాస్త్ర స్వభావాన్ని వ్యక్తం చేస్తున్నాయి. "The experience of unique value in literature is basic

4. Mind and Matter; (Cambridge,) 1958. P. 37.

to any theory concerning the nature of the value. Our shifting theories attempt to do progressively better justice to the experience"[5] అన్న రెనె వెలెక్, ఆస్టిన్ వారెన్ మాటలు సాహిత్య స్వభావమైన విలువల వివేచనాన్ని వ్యక్తం చేస్తున్నవి. రవీంద్రనాథ్ టాగూర్ శాస్త్రకళా స్వభావాల భేదాన్ని నిరూపిస్తూ చెప్పిన ఈ క్రింది వాక్యాలు గమనింపదగినవి– "Scientific knowledge is abstract, aesthetic knowledge is subjective. Science says : 'I know', Art says : 'I perceive'. All our pictures, images, songs and poetry, say the one and the same thing : 'I perceive'."[6]

శాస్త్ర పరిశోధనకూ, సాహిత్య పరిశోధనకూ మౌలికంగా భేదమున్నా, పరిశోధనలో రెండింటా శాస్త్రీయ విధానం మాత్రం అనుసరింపబడుతుంది. శాస్త్రీయ విధానాన్ని గురించి D. Slestinger and M. Stephenson ఇలా అన్నారు : "A study is scientific when its data are subjected to a logical analysis resulting in a development of a theory whether those data are secured by experiment, by statistics or common sense."[7] సేకరించిన సామగ్రిని తర్కసహమైన విధంగా పరిశీలించి, దాని సహాయంతో ఒక సిద్ధాంతాన్ని రూపొందించాలి. ప్రయోగం ద్వారా కాని, గణాంక విధానం ద్వారా కాని, లోకజ్ఞానం ద్వారా కాని సామగ్రిని సేకరించవచ్చు. సాహిత్యంలో సహృదయ వివేచనం ద్వారా కూడా సామగ్రిని సంతరించవచ్చు. విమర్శకుడు కాని, పరిశోధకుడు కాని సేకరించే సామగ్రి కొంతవరకు వాస్తవ సత్యాలూ, కొంతవరకు అనుభవ సత్యాలూ కూడా కావచ్చు. పరిశోధన సత్యాన్వేషణ కాబట్టి, ఆ సత్యం శాస్త్రసంబంధి అయినప్పుడూ సాహిత్యసంబంధి అయినప్పుడూ తప్పకుండా భేదిస్తుంది. శాస్త్ర సత్యమే సత్యమని పరిగణిస్తే సాహిత్య సత్యం ప్రాతిభాసిక సత్యం లేదా అలౌకిక సత్యం అవుతుంది. దీన్ని పాశ్చాత్యులు సత్యానికి సమమైన సత్యంగా పరిగణిస్తారు ...... "a poem is 'equal to: not true': Poetry is as serious and important as philosophy (Science, knowledge, wisdom) and possesss the equivalence of truth, is truth-like"[8] అన్న విమర్శకుల వివేచనం ఇచట గమనార్హమైనది.

శాస్త్రీయ పద్ధతి ననుసరిస్తూ సత్యాన్వేషణ చేయటంలో కూడా రెండు పద్ధతులున్నాయని విమర్శకులు సామాన్యంగా భావిస్తుంటారు. ఒకటి : భావించి ఫలితార్థాలను నిర్ణయించే పద్ధతి (Method of deduction). మరొకటి : తార్కిక అనుమాన పద్ధతి (Method of induction). ఈ రెండింటి కంటె రూపాంతరీకరణ పద్ధతి ఉత్తమమైనదని మరికొందరు భావిస్తారు. ఈ మూడు విధాలలో ఊహించి ఫలితార్థాలను నిర్ణయించే పద్ధతిని సాలీడు గూడు అల్లటంతోనూ, తార్కిక అనుమాన పద్ధతిని చీమలు మట్టినితోడి కుప్పలుపోసే విధంతోనూ, రూపాంతరీకరణ పద్ధతిని తేనెటీగ పూల మకరందాన్ని తేనెగా

5. Theory of Literature, (1978). P. 32.
6. Rabindranath Tagore on Art & Aesthetics (1961). P. 69.
7. Encyclopeadia of Social Sciences.
8. Theory of literature ( 1978 ) P. 35.

మార్చే విధానంతోనూ పోల్చి అభివర్ణించి, H. A. Larrabee మూడవ పద్ధతే ముప్పుత్తినదని భావించాడు.''If extreme rationalist (deductionalist) is like a spider spinning out theories from within, the extreme empiricist (inductionist) is to be compared...to an ant which piles useless heaps of facts. Better than either the spider or the ant is the bee, which selectively gather pollen and transforms it into honey''.[9] సాహిత్య పరిశోధన మౌలికంగా సౌందర్య తత్త్వ చింతనకు సంబంధించింది కాబట్టి తత్త్వప్రతిపాదనలో రూపాంతరీకరణ పద్ధతి ఉత్తమంగా రాణిస్తుంది. సాహిత్య సౌందర్యానుశీలనంలో భావించి లేక దర్శించి ఫలితార్థాలను నిర్ణయించే విధానం ప్రయోజనకారిగా ఉంటుంది. సాహిత్య విశేషాంశ విశ్లేషణంలో తార్కికానుమాన విధానం ఉపయోగపడుతుంది. సాహిత్య రంగంలో పరిశోధన శాస్త్రీయంగా సాగుతున్నదన్న మాటకు అర్థమేమిటంటే, సాహిత్యేదార్శనిక స్వభావాన్ని గుర్తించి తద్గతమైన సత్యం పై మూడు పద్ధతులలో అన్వేషింపబడుతున్నదన్న మాట!

Research అనే పారిభాషికపదానికి దాదాపు మారు పదాలుగా ఆంగ్ల విమర్శకులు మరికొన్ని పారిభాషికపదాలను వాడుతున్నారు. అందులోనూ సాహిత్య పరిశోధనను Literary study అనీ, Literary scholarship అనీ, Literary theory (లేదా theory of literature) అనీ, critical theory అనీ, Critical path అనీ పేర్కొనడం కూడా పరిపాటి. ఈ పేర్లను వాడేటప్పుడు విమర్శకులు వాటి స్వరూప స్వభావాలలో గల సూక్ష్మాంతరాలను వివేచించి వ్యక్తీకరించారు కూడా:

ఈ క్రింది విమర్శక వాక్యాలు గమనిస్తే కొంత వరకు వాటి స్వభావం గోచరమౌతుంది.

1. ''We must first make a distinction between Literature and **literary study**. The two are distinct activities : one is creative, an art; the other, if not precisely a science, is a species of knowledge or of learning''.[10]

2. ''The conception of **'literary scholarship'**, conceived of as super-personal tradition, as a growing body of knowledge, insights, and judgements''.[11]

3. ''It seems best to draw attention to these distinctions by describing as **'literary theory'** the study of the principles of literature, its categories, criteria, and the like, and by differentiating studies of concrete works as either 'literary criticism' (Primarily static in approach) or literary history''.[12]

-Rene wellek and Austen Warren.

4. ''The use of **critical theory** is not to reflect the given artistic facts, but to serve as a ''Speculative instrument.'' That will arm one's critical vision''.[13] (క్రౌంక్రీ అభిప్రాయం)

-M.H. Abram

9. Reliable knowledge (1945) P. 5.
10. Theory of Literature ( 1973 ) P. 15.
11. Ibid., P. 19.
12. Ibid., P. 39.
13. In search of Literary Theory (1976) P. 25.

5. "**The critical path** I wanted,......,was a theory of criticism which would, first, account for the major phenomena of literary experience, and, second would lead to some view of the place of literature in civilization as a whole."[14]

-Northrop Frye

తెలుగులో 'సాహిత్య పరిశోధన' అనే పారిభాషిక పదానికి సమానార్థకాలుగా గాని, సమీపార్థాలిచ్చేవిగా గాని పదాలను రూపొందించుకోవటం జరుగలేదనే చెప్పాలి. కాని, ఆంగ్లంలో వాడబడుతున్న పై అయిదు పారిభాషిక పదాలను తెలుగులో రూపొందించుకోవలసి వస్తే, యీ క్రింది పేర్లు సముచితంగా ఉండవచ్చునని భావిస్తున్నాను. అవి-

1. పరిశీలనాత్మక సాహిత్యాధ్యయనం (Literary study).

2. సాహిత్య తత్త్వాన్వేషణం ( Literary scholarship).

3. సాహిత్య లక్షణ వివేచనం (Literary theory).

4. కావ్యదర్శన మీమాంస ( Critical theory).

5. కావ్యానుశీలన మార్గప్రవర్తనం (Critical path).

ఈ అయిదు పారిభాషిక పదాలూ పరిశోధన నిర్వహించే అయిదు ధర్మాలను వివరిస్తున్నాయి. ఇటువంటి పేర్లు వాడుకలో లేకపోయినా తెలుగులో జరుగుతున్న పరిశోధన ఈ అంశాలను నిర్వహిస్తూనే ఉంది. అయితే పరిశోధన ప్రవృత్తికి సంబంధించిన విశ్లేషణం తెలుగులో విశేషంగా జరగకపోవటంచేత వాటి స్పష్ట ప్రతిపత్తి వ్యక్తం కాకపోవచ్చును. కాని,ఆ లక్షణాలన్నీ పరిశోధనలో అంతర్నిహితంగా కనపడేవే.

శాస్త్ర పరిశోధనలో ప్రవృత్తిని బట్టి రెండు విధాలు భావింపబడుతున్నాయి. అవి-శుద్ధ పరిశోధనం; అనువర్తిత పరిశోధనం. జ్ఞానాన్వేషణయే శుద్ధ పరిశోధన స్వభావం. జ్ఞానాన్ని ప్రయోగపరంగా అనువర్తింప జేయటం అనువర్తిత పరిశోధన స్వభావం. "Research may be motivated by the desire to know or understand for the sake of knowing ( often called 'pure' or 'basic' research) or by the desire to know in order to use the knowledge for practical concerns (often called 'applied' research)."[15] ఈ విభాగం సాహిత్య పరిశోధనకు కూడా వర్తింప చేయవచ్చు. ఒక విధంగా సంస్కృత సాహిత్య శాస్త్రంలో ప్రతిపాదింపబడిన రస సమీకరణ సిద్ధాంతాలు శుద్ధ పరిశోధనకు వర్తిస్తాయి. రస సూత్రం, కావ్యాత్మ వాదాలు, కావ్య లక్షణ వివేచనాదులు అనువర్తిత పరిశోధనకు ఉదాహరణలుగా నిలుస్తాయి.

పరిశోధన ఏ విధంగా సాగినా అది ఒక సిద్ధాంత ప్రతిపాదనంతో ఫలవంత మవుతుందని సామాన్యంగా విమర్శకులు భావిస్తుంటారు. పరిశోధన అన్వేషణ విధానం; సిద్ధాంతం అన్వేషణ ఫలం. శాస్త్రీయమైన అన్వేషణ పద్ధతిలో దార్శనిక సత్యమైన సాహిత్య సిద్ధాంతాన్ని రూపొందించటం సాహిత్య పరిశోధన పరమార్థం. సిద్ధాంతాన్ని రూపొందించటం ఒక ప్రక్రియ. అది నీటిని గడ్డకట్టించి హిమఖండంగా మార్చటం లాంటిది. ప్రతిపాదిత సిద్ధాంతం సాహిత్యానుశీలనలో అనువర్తింప చేయటానికి ఉపయోగపడుతుంది- మంచుముక్క నీటిని చల్లబరచడానికి తోడుపడినట్లు. పరిశోధన ప్రవృత్తికి ఫలమైన

14. Ibid., P. 93-94.

15. Methodology and Techniques of Social Research (1979) P. 16.

సిద్ధాంతం అనువర్తిత విమర్శకు ఆదర్శ సూత్రంగా సాహిత్యంలో పనికి వస్తుంది. పరిశోధన, సిద్ధాంతం- ఈ రెండూ విలక్షణంగా కనపడుతూనే పరస్పర పోషకాలుగా ఉండి అద్వైత భావంతో వర్తిస్తుంటాయి. "Theory and research may be separable as distinct operations but are inseparable, as necessary complementary components of scientific endeavour. Neither is complete without the other."[16]

సాహిత్య సిద్ధాంతం కావ్యానుశీలనంలో వినూత్న పరిశీలన దృక్పథాలనూ, వివేచన శక్తులనూ కలిగించి, సాహిత్య కళా రహస్య సమాస్వాదనంలో సముచితమైనవిలువలను పెంపొందింపచేస్తుంది. పరిశీలకులైన సహృదయులు ఆ విలువల వలన సాహిత్య రసాస్వాదన శక్తిని ఇనుమడింప చేసికోవటానికే కాక, కావ్యానుశీలనంలో వాటిని సద్వినియోగం చేసికొని కళా సాఫల్యాన్ని సాధించుకోవటానికి యత్నిస్తుంటారు. వారి కటువంటి అవకాశాన్ని కలిగించే విజ్ఞాన సూత్ర వివేకాన్ని అందించటమే పరిశోధన సార్థక్యం, M. H. Abrams మాటల్లో -"This is the primary service of a good critical theory, for in bringing us, with new insights and powers of discrimination to individual works of art in their immediacy, it enhances our appreciation of the only places where artistic values are in fact realized. But as inquisitive men we are interested not only in knowing Hwo to enhance our direct experience of these values, but also in knowing about the works in which such values have their residence, including their relations to each other and to other human pursuits."[17]

అన్ని పరిశోధన రంగాలలో లాగానే సాహిత్యంలో కూడా సిద్ధాంతం కావ్యానుశీలన విధానంలో అనువర్తన సూత్రంగా నిలిచి, ఉపయోగకారిగా ఉన్నప్పుడే దాన్ని గౌరవించి, ప్రామాణికంగా గ్రహించటం జరుగుతుంది. సిద్ధాంతానికి సాహిత్య విమర్శలో సాధనయే నికషోపలం. M.A. Abrams ఈ అంశాన్ని నొక్కి వక్కాణించాడు: "The test of the validity of a theory is what it proves capable of doing when it is put to work. And each good (that is serviceable) theory, as history of critical theory amply demonstrates, is capable of providing insights into hitherto overlooked or neglected features and structural relations of works of art, of grouping works of art in new and interesting ways, and also ot revealing new distinctions and relations between things that (from its special point of view) are art and things that are not."[18]

సిద్ధాంతాలను గురించి వివరిస్తూ Karl Popper ఆలంకారికంగా అభివర్ణించాడు. విశ్వ సముద్రంలో ఉన్న వినూత్న సత్యాలను పట్టటానికి

---

16. Methodology and Techniques of Social Research (1979) P. 348.
17. In Search of Literary Theory (1976) P. 22.
18. In Search of Literary Theory (1976). P. 25.

విస్తరించే వలల వంటివి సిద్ధాంతా లన్నాడు. అలా వలవేసి ప్రోవు చేసిన సత్యాలను హేతుబద్ధంచేసి, వివరించి, వాటిని గురించిన సాధికారికమైన విజ్ఞానాన్ని సాధించటమే సిద్ధాంతాల ధ్యేయమన్నాడు. ఆ వలల అల్లికకు మెరుగులు పెట్టి వినియోగించుకోవటమే పరిశోధన ప్రవృత్తి అని ప్రవచించాడు. ఆ మాటలు గమనించండి– "Theories are nets cast to catch what we call "the world", to rationalize, to explain and to master it. We endeavour to make the mesh finer and finer."[19] అయితే ప్రాచీన సిద్ధాంతాలు పరమ ప్రమాణాలనీ, పరమ సత్యాలనీ, ఖండన మండనాలకూ, మార్పు చేర్పులకూ అతీతాలనీ ప్రాచీనులు భావించేవారనీ, ఆధునికులు ఎంతటి ప్రసిద్ధ సిద్ధాంతమైనా అది తాత్కాలికమే ననీ, పునఃపరిశీలన యోగ్యమనీ, ఏ సిద్ధాంతమూ నిత్య సత్యం కాదని విశ్వసిస్తారనీ విమర్శకులు వివేచిస్తున్నారు. "Whereas the theory in earlier times was considered a final and irrefutable explanation of something, in modern science it is always held with some measure of tentativeness, no matter how great the accumulation of findings consistent with it. ... it is always open to revision."[20] ఈ అభిప్రాయాన్ని భారతీయుల అనుభవం దృష్ట్యా సంపూర్ణంగా అంగీకరించటం కష్టం. భారతీయాలంకారిక ప్రస్థాన చరిత్రను నిశితంగా పరిశీలిస్తే లాక్షణికులు పూర్వ ప్రతిపాదిత సిద్ధాంతాల పట్ల శాస్త్రీయ గౌరవాన్ని ప్రకటించినా, వాటిని ఖండించటంలో కాని, సవరించటంలోకాని, వినూత్న సిద్ధాంతాలను సాహితీ రంగంలో ప్రవర్తింప చేయటంలో గాని ఎటువంటి సంకోచాన్నీ ప్రదర్శించలేదు. సత్యాన్వేషణ దృష్టితో గతంలోని మంచిని గ్రహించారు; తమవైన వినూత్న దృక్పథాలను ప్రసరించారు. క్రొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించారు. తమకు ప్రమాణమైన వాటికి గౌరవ ప్రతిపత్తిని కల్పించారు. అయితే, అక్కడక్కడా ప్రాచీనుల మీద ఉన్న ప్రామాణిక భావం నూత్న సిద్ధాంతాలను రూపొందించజేయటంలో లాక్షణికులకు అడ్డు వచ్చిందన్న సత్యానికి దృష్టాంతాలు లేకపోలేదు. ఉదాహరణకు- రసగంగాధర కర్త భక్తిని రసంగా అంగీకరించకపోవటం భరతాదులపట్ల ఆయన కున్న ప్రామాణిక బుద్ధి వలననే. అయితే, ఆయన కూడా 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ, పూర్వ సిద్ధాంతాలకు పరిష్కృత విధానాన్ని అవలంబించిన వాడే. కాబట్టి, శాస్త్ర దృష్టితో పరిశోధించే ఏ పరిశోధకునికైనా శాస్త్రీయ పద్ధతిమీద అచంచల విశ్వాసం ఉండవచ్చునుగాని, పూర్వ సిద్ధాంతాలన్నీ పునఃపరిశీలనకు పాత్రాలు కావనే అంధవిశ్వాసం ఉండటానికి వీల్లేదు. అయితే, ఒక పరిశోధకుడు ఒక ప్రామాణికమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు, కొంతకాలంవరకు లేదా కొన్ని శతాబ్దాలవరకు లేదా అంతకంటె ఉత్తమ సిద్ధాంతం వెలువడనంతవరకు దానిని గౌరవించటం సర్వసామాన్యం. ఉత్తమ సాహిత్య సిద్ధాంతాలు ఎప్పుడో కాని వెలువడుతూ ఉండవు. వెలువడిన తర్వాత అవి కొంతకాలం రాజ్యం చేస్తూనే ఉంటాయి. కాని, పరిశోధన వాటినికూడా శోధించకుండా మాత్రం నిర్లిప్తంగా ఉండదు. ఇది చరిత్ర చెప్పే సత్యం.

సిద్ధాంతం వలన పరిశోధనకు నిర్దిష్టమైన - అది నిర్దుష్టం కాకపోయినా - ఒక దృక్పథం, ఒక మార్గం లభిస్తుంది. అది సాహిత్యంలోని వివిధాంశాల

19. Logic of Scietific Discovery (1969) P. 5.
20. Methodology and Techniques of Social Research(1979)P. 335.

మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలనూ, సజాతీయ విజాతీయ స్వభావాలనూ, ప్రయోగ వైవిధ్యాలనూ, వాటిలో అన్వేషింపదగిన సమన్వయ సూత్రాలనూ, పరిష్కరణ విధానాలనూ, ఫలితాంశాల అనుశీలన పద్ధతులనూ పరిశోధనకు ప్రసాదిస్తుంది. అలాగే పరిశోధన వలన సిద్ధాంత రూపకల్పనలో కూడా ముఖ్యంగా నాలుగు రకాలైన ఉపయోగాలు కలుగుతుంటాయి. వాటిని ఈ విధంగా పేర్కొనవచ్చు:

1. పరిశోధన, సిద్ధాంత రూపకల్పనకు ప్రేరణగా పని చేస్తుంది. (Research initiates theory).

2. పరిశోధన, సిద్ధాంతాన్ని పరిష్కరించి, పరిశుద్ధతత్త్వంగా రూపొందించడానికి తోడ్పడుతుంది. (Research helps recasting of theory)

3. పరిశోధన, సిద్ధాంతాన్ని అభినవ దృక్పథంతో అనుశీలించటానికి దోహదకారి అవుతుంది. (Research refocuses theory).

4. పరిశోధన, సిద్ధాంతాన్ని విడమరిచి వివేచించటానికి సహాయపడుతుంది.(Research helps in clarifying theory).

పై వివేచనం వలన స్పష్టమయ్యే అంశం ఏమిటంటే- సాహిత్య రంగంలో ప్రతిపాదింపబడిన సిద్ధాంతాలన్నీ విశ్వజనీనాలనీ, సార్వకాలికాలనీ, పరిష్కార సహిష్ణువులు కావనీ భావించటానికి వీలు లేదు. "No theory is adequate to tell the whole story, for each one has limits correlative with its powers. As a speculative instrument, it has its peculiar angle and focus of vision, and what for one speculative instrument is an indistinct or blank area requires an alternative speculative instrument if it is to be brought into sharp focus for inspection"[21] అన్న Abrams మాటలు ఈ అంశాన్ని స్పష్టం చేస్తున్నాయి.

అయితే ఇక్కడ మరొక విషయం గుర్తుంచుకోవాలి. ఒక నూత్న సిద్ధాంతం ప్రతిపాదితమౌతున్నదంటే - పాత యింటిని కూల్చి కొత్త బంగాళాను కట్టినట్లుగా - పాత సిద్ధాంతాలను మూలమట్టం చేసి నూత్న సిద్ధాంతాన్ని రూపొందించడమే అని కొందరు భావిస్తారు. కాని, అది సర్వత్రా సత్యం కాదు. గతంలో వెలువడిన సిద్ధాంతాల వల్ల కలిగిన విజ్ఞాన పరిధిని మరింత విస్తృతం చేయడం వంటిదే అది. R. K. Merton ఈ అంశాన్ని అలంకారికంగా పర్వతారోహణంతో పోల్చి చెప్పాడు. ఆసక్తికరంగా ఉండే అత డిచ్చిన దృష్టాంతం గమనించ దగింది - "It is rather like climbing mountains, gaining new and wider views, discovering unexpected connections between our starting point and its rich environment. But the point from which we started out still exists and can be seen, although it appears smaller and forms a tyny part of our broad view gained by the mastery of obstacles on our way up."[22] పరిశోధన విజ్ఞాన శిఖరారోహణం వంటిది. శిఖరాన్ని ఎక్కినకొద్దీ దృక్పథం విశాల మౌతుంది. అంతకు పూర్వం చూడని అంశాలెన్నో దృగ్గోచర మౌతాయి. బయలుదేరిన చోటుకూ పరిసరాలకూ ఉన్న సంబంధాలు స్పష్టమౌతాయి. అంటే - పూర్వ

21. In Search of Literary Theory (1976) - P. 25.
22. Social Theory and Social Research. P. 157.

ప్రవర్తిత సిద్ధాంతం నుండి అభ్యుదయాన్ని సాధించి సాధ్యమైనంత విశాలమైన, సమగ్రమైన, సక్రమమైన, విశ్వజనీనమైన, నిర్దుష్టమైన మరొక సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం ద్వారా విజ్ఞాన సామ్రాజ్య సీమలను విశాలతరం చేయటం, దృక్పథాలను విస్తృత పరచుకోవటమే సన్నమాట. ఇలా పరిమితత్వం నుండి అపరిమితత్వ సీమల వరకు నిర్విరామంగా సాగే విజ్ఞాన యాత్ర పరిశోధన; ఆ యాత్రలో దర్శించి లోకానికి వెలువరించే విలువైన వివేచనలే సిద్ధాంతాలు.

వినూత్న సిద్ధాంత రూపకల్పనం చేసే లక్ష్యంతో సాగే పరిశోధన ఒకవిధంగా సృజనాత్మక పరిశోధన మనిపించుకొంటుంది. సిద్ధాంత దర్శనమే పరిశోధనలోని సృజనాత్మకత. అయితే, ఒక సిద్ధాంతాన్ని ఆధారంగా చేసికొని దాని పరిష్కారాన్నిగానీ, దాని ప్రయోగ సౌలభ్యాన్నిగానీ, దాని అనుశీలనంలో అనుసరింప వలసిన విధానాన్నిగానీ, ఉపయోగానుపయోగస్థితులనుగానీ వివేచించటం కూడా పరిశోధనే అవుతుంది. అటువంటప్పుడు పరిశోధన సిద్ధాంతం వైపు సాగే పద్ధతి ఒక ప్రస్థానంగానూ, సిద్ధాంతం నుండి పరిశోధన ప్రవర్తిల్లే ప్రస్థానం మరొక పద్ధతిగానూ వివేచించవచ్చు. ఈ రెండు పద్ధతులూ శాస్త్ర రంగంలోనూ, సాహిత్య రంగంలోనూ ప్రాచుర్యాన్ని పొందే ఉన్నాయి. "Coming from theory to research. attention is focussed on truth, the nature of reality, process of knowing and logic of meaningful statements. Startings from research and moving towards theory, attention turns to such issues as measurement in all its phases, translation of hypotheses into operational terms and reliability of empirical indicators."[23] అన్న విల్‌కిన్‌సన్, భండార్కర్‌గార్ల వివేచన శాస్త్ర సాహిత్య రంగాలకు రెండింటికీ వర్తిస్తుంది. సిద్ధాంతంవైపు సాగే పరిశోధనలో- సిద్ధాంత పరమైన వివిధాంశాలను గురించి కూలంకషంగా పరిశీలించి వాటి పరిమితులను వివేచించటం, అవి కావ్యానుశీలనంలో ఎలా ఉపయోగపడతాయో వివరించటం, ఆయా అంశాలు ఎంతవరకు విశ్వాసయోగ్యాలో, సమర్థవంతాలో పరీక్షించటం మొదలైన విధానాలు చోటు చేసికొంటాయి. సిద్ధాంత ప్రాతిపదికగా సాగే పరిశోధనలో ప్రధానంగా పాటింపబడే అంశాలు - సిద్ధాంత ప్రతిపాదిత సత్యాన్ని శోధించటం, దాని అనుభవ వాస్తవికతను వివేచించటం, సిద్ధాంతపరమైన వివిధ ప్రతిపాదనల సార్థక్యాన్నీ, సంబద్ధతనూ, అవగాహన విధానాన్నీ నిర్దేశించటం మొదలైనవి.

సామాన్యంగా సాహిత్యరంగంలో సిద్ధాంతాలను గానీ, సమన్వయాలను గానీ నిర్వచించి సూత్ర రూపంగా వెలువరించాలనే యత్నం ప్రాచీన లక్షణ గ్రంథాల్లో కనపడుతుంది. సాహిత్య లక్షణ మీమాంస సూత్రగ్రంథనం కావటం ఒక ప్రాచీన సంప్రదాయం. అయితే, వాటికి ఉదాహరణ లిచ్చి అన్వయించే వృత్తులను రచించటం కూడా పరిపాటిలోనే ఉంది. కాని, వాటికి కావ్యాలంకార సూత్రాలనే పేరు రూఢిలోకి వచ్చింది. ఆధునికులు నిర్వచన ప్రాయాలైన సూత్రాలు తర్కసహితాలు కావనీ, వాటిని కావ్యాలను సర్వసామాన్యంగా, విశ్వజనీనంగా అనువర్తింప చేయలేమనీ భావిస్తారు. William E. Kennick ప్రాచీనం సాహిత్య లక్షణ సూత్రాలను గురించి ఇలా అంటాడు - "Traditional aesthetics searches for the nature of Art of Beauty and finds it by definition", on the

23. Methodology and Techniques of Social Research(1979).p. 334.

assumption that "all works of art must possess some common nature... a set of nessary and sufficient conditions for their being works of art at all."[24] Morris Weitz కూడా ఈ విధంగానే భావించాడు: "To each question, a Poetics is a purportedly true answer in the form of a theory of the essential, defining, or necessary and sufficient, properties of the art in question."[25] M. H. Abrams అభిప్రాయంలో లక్షణ సూత్రాలు నిర్వచనాలుగా రూపొందింపబడినప్పుడు తర్క-శాస్త్ర దృష్టిలో అవి ప్రమాణ వాక్యాలుగా నిలువకపోవచ్చును గాని, అవి ఆయా అంశాలను గురించి ఉదాత్తంగా వ్యక్తీకరించిన సూక్తులుగా మన్ననలను పొందగలవనీ, కావ్యాదుల వంటి కళాఖండాలను అనుశీలించే విధానంలో అభినవ లోచనాన్ని అందింపగలవనీ నిర్ణయించాడు: "Aesthetic theory, as definition, is "logically doomed to failure", but if looked upon as the "definitional form, almost epigrammatically, to pin-point a crucial recommendation" to concentrate "on certain criteria of exellence," to serve to teach us "what to look for, how to look at it in art".[26] ఒక విధంగా సాహిత్య లక్షణ సూత్రం అనేది శాస్త్ర సూత్రం వంటిదికాదు; దార్శనిక సూత్రం వంటిది. ఈ భేదాన్ని గమనించటానికి కూడా పై విమర్శకుని మాటలు తోడ్పడతాయి. అటు వంటప్పుడు-"Every theory of art, like poetics, is neither true nor false, but an honorific redefinition of 'art'[27] అన్న Morris Weitz మాటలు సమన్వయిస్తాయి. "Evaluations of works of art apply criteria which are supported by reasons, and the good reasons are unchallengeable reasons."[28] అన్న ఆతని మాటలే సాహిత్యానుశీలనంలో సార్థకంగా వినియోగపడే లక్షణ సూత్రాల ప్రామాణికత్వాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

సాహిత్య లక్షణ గ్రంథ రచనం పరిశోధన ఫలితార్థాల వ్యవస్థీకృత సంపుటీకరణం అనటంలో అనుమానం లేదు. అట్టి లక్షణ గ్రంథాలన్నీ ఉత్తమ పరిశోధనకు ప్రమాణాలని చెప్పలేము. ఒక సాహిత్య ప్రస్థానాన్ని పరిశీలించి కావ్య లక్షణాన్ని దాని కనుగుణంగా సమన్వయించి ఒక సమగ్ర కావ్యానుశీలన విధానాన్ని రూపొందించిన లక్షణ గ్రంథాలను సాహిత్య సిద్ధాంత గ్రంథాలుగా చెప్పవచ్చు. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకం అటువంటిది. దానికి అభినవగుప్తుడు లోచన వ్యాఖ్య వెలయించాడు. అతని వ్యాఖ్య ధ్వన్యాలోకంలోని కొన్ని ప్రధానాంశాలను పునర్వ్యవస్థీకరించింది. కొన్ని దోషాలను నిపుణంగా తొలగించి ధ్వని సిద్ధాంతంలోని మూలతత్త్వాన్ని పునర్నిర్మించింది. రస ధ్వని సిద్ధాంతానికి అపూర్వ సమన్వయం సాధించింది. పరిశోధన లక్షణాలన్నీ అభినవగుప్తుని వ్యాఖ్యకు వర్తిస్తాయి. అందువలన ఒక్కొక్కసారి విస్పష్టమైన సాహిత్యదర్శనంతో వివరించే వ్యాఖ్య కూడా పరిశోధనగా పరిగణించబడాలి. సిద్ధాంతం పరిశోధన గమ్యం. దాన్ని సూత్రప్రాయంగా చెప్పినా,

24. In Search of Literary Theory (1976). P. 5.
25. Ibid., P. 9.
26. In Search of Literary Theory (1976). P. 11.
27. Ibid., P. 10.
28. Ibid., P. 41.

అనుశీలన విధానంలో అమర్చి చెప్పినా సిద్ధాంతదర్శన, సమన్వయ, అనుశీలన స్పృహతో చేసిన అన్వేషణ అంతా పరిశోధన అనిపించుకొంటుంది.

ఆధునికులలో కొందరు లక్షణ గ్రంథాలలోని కావ్యాలంకార సూత్రాలు సార్వత్రికంగా సాహిత్యానికి అనువర్తింప చేయటానికి వీలులేదని భావిస్తారు. ఒక సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా పెట్టుకొని కావ్యపరిశీలనం చేయటంగాని, కావ్యానుశీలనం సాగించటంగాని శాస్త్ర సమ్మతం కాదంటారు. సిద్ధాంత ప్రాతిపదిక మీద సాహిత్యానుశీలనం చేసే ప్రాచీనుల ధోరణి దోష భూయిష్ఠమని భావిస్తారు. విలియం కెనిక్ దృక్పథాన్ని ఈ విధమైన ప్రవృత్తికి నిదర్శనంగా గ్రహించవచ్చు: "William Kennick, for example, says that a second mistake of traditional aesthetics, co-ordinate with the mistake of thinking that a theory of art is logically possible, is the "assumption: Criticism presupposes Aesthetic theory"-an assumption he translates as "the view that responsible criticism is impossible without standards or criteria universally acceptable to all works of art."[29] ఈ విధంగా కొందరు భావించటంలో ఉన్న ప్రాతిపదిక ఏమంటే ప్రక్రియాపరంగా అనుశీలించవలసిన సాహిత్య సిద్ధాంతంలో సర్వప్రక్రియలకూ సమంగా వర్తించే విశ్వజనీనమైన సూత్రాలు ఉండటం సాధ్యంకాదనీ, విమర్శ ఒక్కొక్క కావ్యానికి సంబంధించి ప్రత్యేక ప్రతిపత్తితో సాగవలసిందే కాబట్టి సామూహికంగా సాహిత్యాన్నంతా గ్రహించి అనుశీలించటానికి వీలులేదనీ భావించటమే. అయితే ప్రాచీన లాక్షణికులలో చాలమంది ప్రక్రియాపరమైన వివేచనం కొంత చేసినా, సాహిత్యానికంతా వర్తించేటట్లుగా విశేషించి కావ్యప్రక్రియకు (అవాంతర ప్రక్రియల ప్రసక్తి లేకుండా) సంబంధించిన శాశ్వత ప్రమాణాలుగానే తమ లక్షణ సూత్రాలను రూపొందించారన్న మాట పూర్తిగా కాదనటానికి వీలులేదు. అయితే ఆధునిక విమర్శకులలో ప్రామాణికులు కావ్యానుశీలనంలో విశ్వజనీన ప్రమాణాలు కొన్ని, సాపేక్ష ప్రమాణాలు కొన్ని పాటింపక తప్పదని విశ్వసిస్తున్నారు. ఇట్టి దృక్పథానికి రెనె వెలెక్, ఆస్టిన్ వారెన్ మాటలను దృష్టాంతంగా గ్రహించవచ్చు: "One should recognize that each work of literature is both general and particular, or-better, possibly is both individual and general. Individuality can be distinguished from complete particularity and uniqueness. Like every human being, each work of literature has its individual characteristics; but it also shares common properties with other works of art, just as every man shares traits with humanity, with all members of his sex, nation, class, profession etc., We can thus generalize concerning works of art, Elizabethan drama, all drama, all literature, all art. Literary criticism and literary history both attempt to characterize the individuality of a work, of an author, of a period, or of a national literature. But this characterization can be accomplished only in universal terms, on the basis of a literary theory. Literary theory, an

29. In Search of Literary Theory (1976). P. 35.

ORGANON of methods, is the great need of literary scholar ship to-day.''[30]

ఆధునిక యుగంలో కూడా సాహిత్య పరిశోధన ప్రతిపాదించే సిద్ధాంతానికి ఎంత ప్రాముఖ్యముందో పై మాటలు స్పష్టం చేస్తున్నాయి. అంతర్జాతీయ అవగాహనతో వెలువడుతున్న నేటి సాహితీ ప్రయోగాలలో వాటి వైయక్తికమైన వైలక్షణ్యాలకెంత ప్రాధాన్యముందో, సమష్టిగా భాసించే సాహిత్య లక్షణాలకంత ప్రతిపత్తి ఉంది. సాహిత్య సిద్ధాంతం ఈ రెండు రంగాలలోనూ జరిగే పరిశోధన ప్రవృత్తికి ఫలితార్థంగా నిలవటం శ్రేయోదాయం.

## 2

పరిశోధనను గురించి ప్రస్తావిస్తున్నప్పుడు విమర్శను విస్మరించలేము. అయితే విమర్శకూ పరిశోధనకూ ఉన్న భేదాన్నీ, అనుబంధాన్నీ తెలిసికోవటం పరిశోధనను గురించిన సమాలోచనంలో ముందుగా అవసరం.

1. ''పరిశోధనమందు రెండు మార్గములు గుర్తింపబడుచున్నవి. ఒక అంశముపై నూతనాధారములను కనిపెట్టి వాని సహాయమున క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించుట యొకటి. పూర్వాధారములనే సమగ్ర పునర్విమర్శనము చేసి నవ్యాలోకమును ప్రసరింపజేయుట రెండవది.''[31] విమర్శ ఒక కావ్యాన్ని గూర్చి వివేచించేటప్పుడు నూత్న సమన్వయాలను సాధించి వాటి సహాయంతో క్రొత్త విలువలను ప్రతిపాదిస్తుంది. అంతేకాక-అనుశీలనంలో విమర్శ ఆ కావ్యజీవితం అందించే అనుభవాల అంతరాలను అన్వేషిస్తుంది; వివేచిస్తుంది; వాటి విలువలకు విలువ కట్టుతుంది.[32]

2. ''ఏది పరిశోధన, ఏది పరిశోధన కాదు అని నిర్ణయించునది బహుకష్టమైన పని. ఇతరులు చెప్పిన దానిని ఇంకొక రీతిలో చెప్పునది పరిశోధన కాదు. చెప్పిన దానిలో ఏమైన క్రొత్తదన ముంటుంది. అందువలన పరిశోధన మనగ క్రొత్తదానిని చెప్పునది అని మాత్రము చెప్పినను చాలదు. ఆధారములను సంగ్రహించి, వాటి సహాయము నుండి ఒక సంగతి పైన క్రొత్త వెలుగును ప్రసరింప చేయునది అని చెప్పిన, విమర్శ కూడా ఆ పనిని చేస్తుంది గదా అనే ఆక్షేపణకు అవకాశ మున్నది. ప్రకటితము కాకుండా నుండు ప్రతియొక్క దానిని కనిపెట్టి, అథవా ప్రతులను సంగ్రహించి ఆ కృతిని శాస్త్రీయముగా సంపాదించి ప్రకటించునది పరిశోధనమైతే, అట్లు ప్రకటితమైన కృతియొక్క గుణాపగుణములనుగూర్చి విచారించునది విమర్శ, విమర్శలో విమర్శకుని సొంత భావము, అనుభవములు ముఖ్యము. అచ్చట భిన్న వ్యాఖ్యానములకు అవకాశమున్నది. అది వస్తునిష్ఠమైనను వ్యక్తి నిష్ఠము కూడా అగును. పరిశోధన సంపూర్ణముగా వస్తునిష్ఠము.''[33]

3. పరిశోధనకు అన్వేషణం లక్షణం, సాహిత్య సిద్ధాంత దర్శనం లక్ష్యమైతే, విమర్శకు వర్ణనం, విశ్లేషణం, వివేచనం, సమన్వయం, అనుశీలనం అనేవి ప్రధాన లక్షణాలు; విలువల నిర్ధారణం లక్ష్యం.

---

30. Theory of Literature ( 1978 ). P. 19.
31. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము-వీర రసము-(జి.వి.సు.) స్థాపన (పీఠిక) పు. VII.
32. "Criticism, as I understand it, is the endeavour to discriminate between experiences and to evaluate them'' - I. A. Richards., Principles of Literary Criticism (1970) preface. vi.
33. పరిశోధన - ( కన్నడ మూలం - ప్రొ. ఎం. చిదానందమూర్తి) - తెలుగుసేత - హరిహరప్రియ (సాతుపల్లి వెంకట విశ్వనాథ). 1979. పు. 4.

4. పరిశోధనం ఆధారాలను నిశితంగా పరిశీలనం చేసి, సాహిత్య తత్త్వాన్ని గాని, సాధారణ సిద్ధాంతాలను గాని రూపొందించటంలో నిష్ఠను ప్రకటిస్తుంది. విమర్శ కావ్యాంగాలను విశ్లేషించి, వాటి సమన్వయాన్ని శోధించటం ద్వారా కావ్య వ్యక్తిత్వాన్ని నిరూపిస్తుంది. ఒక విధంగా పరిశోధన వ్యష్టిగా కావ్యాన్ని పరిశీలించినా సమష్టిగా సజాతీయ కావ్య సముదాయానికి వర్తించే అనుశీలన సూత్రాలను నిర్దేశిస్తుంది. విమర్శ వ్యష్టిగా గాని, సమష్టిగా గాని సాహిత్యాన్ని అనుశీలించటం నిర్వహిస్తూనే వివేచన మార్గాలను, పద్ధతులను వెలయింప చేస్తుంది.

5. పరిశోధనలో శోధన విధానానికి (Methodology)కి అత్యంత ప్రాధాన్యం ఉంది. పరిశోధనవలన తేలే ఫలితాంశం యొక్క ప్రామాణికత్వం విధానంలో పాటించే ప్రమాణాల మీద ఆధారపడి ఉంటుంది. విమర్శలో విమర్శకుడు అనుసరించే అనుశీలన పద్ధతికి ప్రాముఖ్యం ఉంది. విమర్శవలన తేలే ఫలితాంశానికి సమాధానం చెప్పే బాధ్యత విమర్శకునిపై ఉంటుంది. ఒక్కొక్కసారి అనుశీలన విధానం ఇతరులకు ఆమోదయోగ్యం కాకపోయినా ఫలితాంశం- సాహిత్యపువిలువలకు సంబంధించింది కాబట్టి - అనుసరణయోగ్యం అవుతుంది. సాహిత్య రంగంలో పరిశోధన ఫలం, విమర్శ వివేచనం - రెండూ దార్శనిక సత్యాలుగానే ఉంటాయి. కాని, పరిశోధన ప్రతిపాదించే సత్యం ప్రమాణబద్ధం అవుతుంది. విమర్శ ప్రతిపాదించే సత్యం వివేకబద్ధం అవుతుంది. శాస్త్రపరిశోధనలో లాగా సాహిత్య పరిశోధనలో ప్రమాణాలు భౌతిక దృష్టాంతాలు (Proofs) కావు; పాక్షికంగా తార్కికాలు, పాక్షికంగా అనుభవవేద్యాలుఅవుతాయి. విమర్శలోతార్కిక ప్రమాణ నిర్దేశంకంటె, అనుభవ ప్రమాణ నిర్దేశం అధికం. అందువలననే పరిశోధన ప్రమాణబద్ధం; విమర్శ వివేకబద్ధం అని పేర్కొనటం.

6. పరిశోధన- సాహిత్యాన్ని సమష్టిగా పరిశీలించే ప్రవృత్తి కలదనీ, విమర్శ - సాహిత్యంలోని కావ్యాదులను వ్యష్టిగా అనుశీలించే దనీ కొందరు భావిస్తారు. ఇది సర్వత్రా సత్యం కాకపోవచ్చు. కాని, వాటి స్వభావాలను ప్రాధాన్యవివక్షతో పేర్కొన్న వైఖరే అవుతుంది.

7. సాహిత్య జగత్తు ఒక విజ్ఞాన సర్వస్వం లాంటిది. దానిలో జీవిత సర్వాంశ విమర్శ కళాత్మకంగా ఆవిష్కృతమౌతుంది. విశ్లేషించి చూస్తే సాహిత్యంలో జీవితవిజ్ఞానం ఉంది; సౌందర్యతత్త్వాభివ్యక్తి ఉంది. పరిశోధన ఆ రెండింటిని క్రమంగా శాస్త్రదృష్టితోనూ, దర్శనదృష్టితోనూ శోధిస్తుంది. ఆ రెండింటిని విడివిడిగా విడమరచి వ్యక్తీకరిస్తుంది; రెండింటి కున్న అనుబంధాన్ని, సమన్వయాన్ని సందర్శించి తర్కసహమైన లక్షణ సూత్రంలా, దార్శనిక సిద్ధాంతంలా ఆవిష్కరిస్తుంది. విమర్శ ఈ అంశంలో పరిశోధనకంటె విలక్షణ పాత్ర నిర్వహిస్తుంది. సాహిత్యంలో జీవిత విజ్ఞానం కళాత్మకంగా ఆవిష్కరింపబడే సృజనాత్మక ప్రతిభాలక్షణాలను, ఆ లక్షణాలలో ప్రతిఫలించే ప్రయోగవైలక్షణ్యాలనూ అట్టి వైలక్షణ్యాలవలన ఏర్పడే రూపవైభవాలనూ, వాటిలోని అభివ్యక్తి విశేషాలనూ, అవి అందించే అనుభవాలనూ, వాటి తారతమ్యాలనూ అనుశీలిస్తూ వాటి వ్యక్తిత్వాలను ఆవిష్కరిస్తుంది.వాల్టర్ పేటర్ అన్నట్లు "కళను గురించి చెప్పే కళ సాహిత్య విమర్శ" (Literary criticism is an art about art) అయితే - సాహిత్య పరిశోధన కళను గురించి చెప్పే శాస్త్రం అవుతుంది (Literary Research is a science about art).

8. సాహిత్యంలోని సౌందర్య - తత్త్వాన్ని నిరూపించేది పరిశోధన అయితే, తత్త్వ సౌందర్యాన్ని అనుశీలించేది విమర్శ అని పేర్కొనవచ్చు. కొందరు సౌందర్య తత్త్వాన్ని దర్శనమనీ, తత్త్వ సౌందర్య

వివేచనను విమర్శనమనీ వివేచించి, విమర్శలో దర్శనం అంతర్భవిస్తుంది అని పేర్కొంటారు. విశ్వనాథ సత్యనారాయణ గారి దృక్పథం ఇలాంటిది - ''విమర్శనంలో దర్శనం అంతర్భవిస్తుంది. ఇది తాత్త్విక సత్యం కూడా. విమర్శనం పెద్ద వృత్తమైతే దర్శనం దాని కడుపులోని చిన్న వృత్తం. విమర్శకుడు దాన్ని మరింత పెద్దదిచేసి చూపుతాడు. అదియే కవియొక్క విరాట్స్వరూప దర్శనం. దానికి పాఠకుడు సంసిద్ధుడై ఉండాలి. పిండితార్థ మేమంటే - విమర్శనం కూడా దర్శనమే.''[84] ఇది కాదనటానికి వీలులేని సత్యం. అయితే పరిశోధన దర్శన పరిధికి వర్తిస్తుంది; విమర్శన దాని అనుశీలన పరిధికి వర్తిస్తుంది. పరిశోధన దర్శన బిందువును చేరుతుంది. విమర్శ దర్శన బిందువునుండి తన జీవితాన్ని ప్రారంభించి వర్తుల ప్రవర్తనంగా కావ్య ప్రపంచంలో వ్యాపింప చేసికొంటుంది.

9. రెనేవెలెక్ పరిశోధన స్వరూప స్వభావాన్ని గూర్చి ఇలా పేర్కొన్నాడు– "An other alternative term for the work of literary scholar is 'research.' But this seems particularly unfortunate, for it stresses the mearely preliminary search for materials and draws, or seems to draw an untenable distinction between materials which have to be 'searched for' and those which are easily available. For example, it is 'research' when one visits the British Museum to read a rare book, while it is apparently involves a different mental process to sit at home in an arm-chair and read a reprint of the same book. At most the term 'research' suggests certain preliminary operations, the extent and nature of which will vary greatly with the nature of the problem. But it ill suggests those subtle concerns with interpretation, characterization, and evaluation which are peculiarly characteristic of literary studies.''[35] ఈ వివేచనాన్ని పట్టిచూస్తే, పరిశోధన నూతనాధారాల సేకరణ, శోధన మొదలైన పద్ధతులతోనే ముడిపడి ఉందని భావించరాదనీ, పరిశీలనాత్మక సాహిత్యాధ్యయనంతో కూడా అది సంబంధించి ఉందనీ, అప్పుడే అది సమగ్రమౌతుందనీ భావించటానికి వీలౌతుంది. వెలెక్ పరిగణనంలో Literary study అంటే పరిశీలనాత్మక సాహిత్యాధ్యయనం. దానిలో సమన్వయం, వ్యక్తిత్వస్వభావ శీలాదుల నిరూపణం, అనుశీలనం అనే అంశాలు ప్రధాన పాత్ర నిర్వహిస్తాయి. Literary scholarship అనే పదాన్ని పరిశోధనకు పర్యాయపదంగా వెలెక్ వాడాడు. వ్యష్టిగా కావ్యాలను అనుశీలించే విధానం కంటె అతీతంగా ఉండే సాధారణీకరణ సంప్రదాయం (Super - personal tradition) గా భావించాడు. విజ్ఞాన విస్తరణం, అంతర్దృష్టి ప్రసారం, అనుశాసన విధానం దాని స్వభావంగా పేర్కొన్నాడు. పరిశీలనాత్మక అధ్యయనాన్ని సంపదించుకొనని పరిశోధన పరిమళం లేని పూవులా ఉంటుందన్నట్లు స్పష్టపరిచాడు.

10. పాశ్చాత్య విమర్శలో తరచుగా వినపడే మరి మూడు పారిభాషిక పదాలను - Literary theory (సాహిత్య లక్షణ వివేకం), Literary history (సాహిత్య చోదనశక్తుల ప్రగతిశక్తుల

84. చూడు : బ్రాహ్మీమయమూర్తి. పు. 83.
35. Theory of Literature ( 1978 ). P. 38-39.

చారిత్రకాధ్యయనం); Literary criticism (సాహిత్య విమర్శ)-అనేవాటిని వివరించటానికీ, వాటి భేదాన్ని నిరూపించటానికీ యత్నిస్తూ రెనెవెలెక్ ఇలా అన్నాడు: "It is best to draw attention to these distinctions by describing as 'literary theory' the study of the principles of literature, its categories, criteria, and the like, and by differentiating studies of concrete works of art as either Literary criticism (primarily static in approach) or literary history."[36] ( the 'dynamics' of literature). రెనేవెలెక్ విశ్లేషణ ననుసరించి - సాహిత్య లక్షణ వివేకం, సాహిత్య విమర్శ సాహిత్యంలోని స్థిర శక్తులను వివేచించేవి. సాహిత్య చరిత్ర సాహిత్య ప్రగతికీ పరిణామానికీ ప్రేరకంగా ఉండే చోదక శక్తులను క్రియాశక్తులను కాలక్రమ దృష్టితో, చారిత్రక దృక్పథంతో సమీక్షించేది. రెనేవెలెక్, ఆస్టిన్‌వేరెన్ కలిసి వ్రాసిన గ్రంథానికి "Theory of Literature" అని పేరు పెట్టారు. ఆ పేరే ఒక పారిభాషికపదమన్నారు. దాన్ని వివరిస్తూ - "The term 'Theory of Literature' might well include—as this book does—the necessary "theory of literary criticism and theory of literary history" అని స్పష్టపరిచారు. ఈ పారిభాషిక పదానికి తెలుగులో 'సాహిత్య సిద్ధాంతం' అనవచ్చు. దీన్నే వివరించవలసి వస్తే-సాహిత్యంలోని స్థిర గతిశక్తుల (Static and dynamic forces) విలువలను వివేచించి వాటికి సంబంధించిన అంశాలను సిద్ధాంతాలుగా రూపొందించే వ్యవస్థీకృత విధానం అనవచ్చు. ఇటువంటి విధానంతో రూపొందించిన నిబంధనాన్నే మనం 'సిద్ధాంతవ్యాసం, గ్రంథం/నిబంధనం' అని పిలుస్తున్నాం. దాన్ని పరిశోధనగా మన్నిస్తున్నాం. కాబట్టి పరిశోధన పరిధిలో పైన చెప్పబడిన మూడంశాలూ ప్రవర్తించటానికి వీలుందని స్పష్టమౌతున్నది.

11. ఈ వ్యాసంలోని మొదటి భాగంలో పేర్కొన్న కావ్యదర్శన మీమాంస (Critical theory), కావ్యానుశీలనమార్గ ప్రవర్తనం (Critical path) అనే పేర్లు ప్రధానంగా సాహిత్య విమర్శకు సంబంధించినవి. మొదటిది విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొన్నట్లు విమర్శ దర్శనం; రెండవది అనుశీలన మార్గ దర్శకం. కాని, ఈ రెండింటిని పరిశోధన ప్రక్రియలో అంగాలుగా పరిగణించే పరిపాటి కూడా ఉంది. ఎందువలననంటే-విమర్శకూ పరిశోధనకూ అవినాభావ సంబంధం ఉంది కాబట్టి. శాస్త్ర సంబంధి పరిశోధనలలో పరిశోధకుడు విమర్శకుడు కావలసిన అవసరం లేదు; పరిశీలకుడు అయితే చాలు. కాని, సాహిత్యసంబంధి పరిశోధనలలో పరిశోధకుడు పరిశీలకుడు మాత్రమే అయితే సామగ్రిని ప్రోగుచేసి, వర్గీకరించి, వాటిని వ్యవస్థీకరింపగలడే కాని, వాటినుండి ఒక తాత్త్విక దర్శనాన్ని పిండి, సిద్ధాంతాన్ని ప్రతిపాదించలేడు; చివరకు సమన్వయాన్ని కూడా సాధించలేకపోవచ్చు. విమర్శకుడు పరిశోధనలో స్వీయాభిరుచులను ప్రవేశ పెడతాడనే అపప్రథ ఒకటి ఉంది. ఆ నింద అపరిణత విమర్శకులకు వర్తిస్తుంది లేదా అభిరుచి విమర్శకులకు వర్తిస్తుంది, లేదా నిబద్ధ విమర్శకులకు వర్తిస్తుంది. ఆ ముగ్గురూ ఉత్తమ విమర్శకులు కాలేరు. కాబట్టి వారి ప్రసక్తిని వదలిపెడితే విమర్శ ప్రవృత్తి పరిశోధనలో పోషకశక్తిగా పనిచేస్తుంది. అనువర్తిత పరిశోధనలో విమర్శ, పరిశోధనతోపాటు సమాన గౌరవాన్ని పొందుతుంది. శుద్ధ పరిశోధన సాహిత్యరంగంలో సకృత్తు. అందు

36. Theory of Literature ( 1978 ). P. 39.

వలన సాధారణంగా విమర్శను ఆలంబనంగా చేసికొని పరిశోధన సాగక తప్పదు. అప్పుడు పరిశోధనకు విమర్శ లక్షణాల సాంగత్యం తప్పదు. ఆ లక్షణాలా పరిశోధనలో ప్రతిఫలించే విధానాన్నిబట్టి పరిశోధన స్వభావంలో కూడా భేదా లేర్పడక తప్పదు. ఆ భేదా లను ఈ క్రింది చిత్రంద్వారా తెలిసికొనటం సులభ మౌతుంది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | | | | | |
| 2 | 1/2 | 1/2 | | | | |
| 3 | 1/3 | 1/3 | 1/3 | | | |
| 4 | 1/4 | 1/4 | 1/4 | 1/4 | | |
| 5 | 1/5 | 1/5 | 1/5 | 1/5 | 1/5 | |
| 6 | 1/6 | 1/6 | 1/6 | 1/6 | 1/6 | 1/6 |
| | (1) | (2) | (3) | (4) | (5) | (6) |

నిలువుగీత మీద ఉన్న సంఖ్యలు పరిశోధన స్వభావాన్ని- పరిశోధనలో సిద్ధాంత ప్రతిపాదననూ, విమర్శ లక్షణాల వినిమయ నిష్పత్తిని తెలుపుతాయి. క్రింది గీతపై బ్రాకెట్లలో ఉన్న సంఖ్యలు విమర్శ లక్షణాల వినియోగాన్ని తెలుపుతాయి. వాటిని ఈ విధంగా పేర్కొనవచ్చు. 1. సాహిత్య సిద్ధాంత ప్రతి పాదనాత్మక పరిశోధనం. 2. అనుశీలనాత్మక సిద్ధాంత నిబంధనం. 3. సమన్వయాత్మక సిద్ధాంత గ్రంథం. 4. వివేచనాత్మక సిద్ధాంతగ్రంథం. 5. విశ్లేషణాత్మక సిద్ధాంతవ్యాసం. 6. వర్ణనాత్మక సిద్ధాంతవ్యాసం. (1) సిద్ధాంత దర్శనం (2) అనుశీలనాత్మక విమర్శ (3) సమన్వయాత్మక విమర్శ (4) వివేచనాత్మక విమర్శ (5) విశ్లేషణాత్మక విమర్శ (6) వర్ణనాత్మక విమర్శ.

ఒక వినూత్న సాహిత్య సిద్ధాంతదర్శన ప్రతి పాదనం చేస్తేనే అది ఉత్తమ సాహిత్య పరిశోధన మనబడుతుంది. సిద్ధాంతదర్శన స్పృహతో సాహిత్యపు విలువలను నిగ్గు తేల్చే ప్రవృత్తిని ప్రదర్శిస్తే నిజానికి అనుశీలనాత్మక విమర్శ అని పిలువవలసియున్నా నేడు విశ్వవిద్యాలయాలలో అనుశీలనాత్మక పరిశోధ నగా పరిగణించటం పరిపాటిగా ఉంది. ఇలాగే మిగిలి నవి కూడా. సిద్ధాంత దర్శన- అనుశీలన ప్రవృత్తు లతో సాహిత్యంలో లక్ష్య లక్షణ, అంగాంగి, బహి రంతరాంశ సమన్వయాన్ని విమర్శ సాధిస్తే పరిశోధన గానూ, కావ్యాదులలోని వివిధాంశాలను ఒక క్రమబద్ధ మైన ఆవిష్కరణ పద్ధతిలో కార్యకారణ సంబద్ధమైన శిల్పాన్ని అనుసరించి, వివేచిస్తే వివేచనాత్మక పరి శోధనగానూ, విషయాంశ విశ్లేషణ దృష్టి ప్రధానంగా సాగిస్తే విశ్లేషణాంశ పరిశోధనగానూ, విషయ వివ రణ ప్రధానంగా నడిపిస్తే వర్ణనాత్మక పరిశోధనగానూ పేర్కొనవచ్చు. పై చిత్రంలో సూచించినట్లు వర్ణ నాత్మక పరిశోధనలో కూడా సిద్ధాంత దర్శనం కనీసం ఆరవపాలైనా ఉండాలి. అయితే, వర్ణనమే ప్రధానమై సిద్ధాంత దర్శనాదులు ఉండవలసిన పాళ్ల కంటె తక్కువైనా, లోపించినా అది పరిశోధన కాదు, విమర్శ కాదు, ఒట్టి సమీక్ష అయిపోతుంది. ఇలాగే ఈ అంశాన్ని మిగిలిన పరిశోధన విధానాలకు కూడా అన్వయించుకోవాలి.

సాహిత్యంలో నిజమైన పరిశోధనమంటే సాహిత్య సిద్ధాంత దర్శనమే. దానిని ప్రతిపాదించే సిద్ధాంత వ్యాసం సంగ్రహంగా, సారవంతంగా, సూత్రప్రాయంగా, శాస్త్ర దర్శనంగా, తత్త్వసుంద రంగా ఉంటుంది. అయితే, ఆధునిక సాహిత్య విమర్శకులు పరిశోధనలో అనుశీలనానికి కూడా సమస్థానాన్నివ్వాలని భావిస్తున్నారు. ఇది ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఆమోద ముద్ర.

సాహిత్య పరిశోధనలో ఉత్తమమధ్యమాధమ భేదాలను పరిగణింపవలసివస్తే పైన పేర్కొన్న ఆరు విధాలలో క్రమంగా మూడు జంటలను ఎన్నుకోవచ్చు. మొదటి రెండూ ఉత్తమ శ్రేణికి చెందినవి; సమన్వయ, వివేచనాత్మకాలు మధ్యమాలు; విశ్లేషణ వర్ణనాత్మకాలు అధమ శ్రేణికి చెందినవి-అని లెక్కించవచ్చు.[37]

37. విశేషాలకు చూడండి - జి. వి. సుబ్రహ్మణ్యం : ఆంధ్రసాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం-1983. పు. 42-51.

12. ఈ వ్యాసంలోని మొదటి భాగంలో పేర్కొన్నట్లు పరిశోధనకు మారుమాటలుగా పాశ్చాత్య విమర్శరంగంలో ఉన్న పారిభాషిక పదాలను దృష్టిలో ఉంచుకొని, ఆయా స్వభావాలకు ప్రాముఖ్యమిచ్చే పరిశోధనను అయిదు విధాలుగా పేర్కొనవచ్చు. అవి-

1. సాహిత్య తత్త్వాన్వేషణ ప్రధానమైన పరిశోధన.

2. సాహిత్య లక్షణ వివేచన ప్రధానమైన పరిశోధన.

3. పరిశీలనాత్మక సాహిత్యాధ్యయన ప్రధానమైన పరిశోధన.

4. కావ్యదర్శన మీమాంస ప్రధానమైన పరిశోధన.

5. కావ్యానుశీలన మార్గ నిర్దేశక ప్రధానమైన పరిశోధన.

ధ్వన్యాలోకం, ఔచిత్య విచార చర్చ మొదలైనవి సాహిత్య తత్త్వాన్వేషణ ప్రధానమైన పరిశోధన గ్రంథాలు. భామహాలంకారాదులు సాహిత్య లక్షణ వివేచన ప్రధానమైన పరిశోధన గ్రంథాలు. ప్రక్రియా పరమైన పరిశోధనలు పరిశీలనాత్మక సాహిత్యాధ్యయన ప్రధానమైన పరిశోధనలు. రాయప్రోలువారి రమ్యాలోకం, మాధురీ దర్శనం మొదలైన గ్రంథాలు కావ్యదర్శన మీమాంసా ప్రధానమైన పరిశోధనలు. పాటిబండ మాధవశర్మగారి ఛందశ్శిల్పం మొదలైన గ్రంథాలు కావ్యానుశీలన మార్గ నిర్దేశకాలైన పరిశోధనలు. ఈ విభాగం స్థూలంగా చేసినదే.

13. పరిశోధకుడు సిద్ధాంత వ్యాసంలో సాహిత్య సిద్ధాంతాన్ని ఆలంబనంగా చేసికొనే విధానాన్నిబట్టికూడా పరిశోధనలో భేదాలను పరిగణించవచ్చు. ఆ భేదాలు ఈ క్రింది ప్రవృత్తుల మీద ఆధారపడి ఉంటాయి:

1. నిశ్చిత సాహిత్య సిద్ధాంత నిరూపణం.

2. అనుమాన సిద్ధాంత స్థిరీకరణం.

3. పూర్వ సిద్ధాంత పరిష్కరణం.

4. వినూత్న సిద్ధాంతాన్వేషణం.

5. సిద్ధాంతానుశీలన విధాన వివేచనం.

నిశ్చితసాహిత్యసిద్ధాంతాన్వేషణంచేసే పరిశోధనలు పూర్వ ప్రతిపాదిత ప్రమాణాలనే ఆదర్శంగా తీసికొనిలక్ష్యలక్షణ సమన్వయం చేసే ప్రవృత్తిని ప్రకటిస్తాయి. ఇవి ఎంత విలువైనవైనాఆధునికుల దృష్టిలో అంతగా ఆదర గౌరవాలను పొందటం లేదు. దానికి కారణం, ఆధునికులు పరిశోధనలో కూడా సృజనాత్మకతను కోరుతున్నారు. పరిశోధనలో సృజనాత్మకత అంటే వినూత్న దృక్పథంతో సాహిత్యాన్ని చూసే చూపును ప్రసాదించటం. సృజనాత్మకత లోపించిన పరిశోధనను లక్షణ విమర్శ క్రింద జమకడుతున్నారు. అనుమాన సిద్ధాంతం పరిశోధకుని దర్శన ప్రతిభాబలం మీద ఆధారపడి ఉంటుంది. ఒక వినూత్న ప్రక్రియను అనుశీలించే విలక్షణమైన అనుశీలన మార్గాన్ని అతడు మొదట దర్శించి, నిర్ణయించుకొంటాడు. దాని నాప్రక్రియకు అంతర్నిహితమైన ప్రమాణ పద్ధతిగా స్థాపించి ప్రతిపాదిస్తాడు. లేదా వివిధ పరిశోధకులచేత అసమగ్రంగా, అంచెలంచెలుగా, వివిధ స్థాయిలలో పేర్కొనబడిన ప్రమాణాలను సమీకరించి, వాటికొక నిర్దిష్టమైన ఆకృతిని కల్పిస్తాడు. ఈ ప్రవృత్తికి నేటి పరిశోధనలో గౌరవం బాగా లభిస్తున్నది. పూర్వ సిద్ధాంతాలను మారుతున్న విలువల దృష్ట్యాకాని, వాటిలో ఉన్న సహజ విరుద్ధ లక్షణాల దృష్ట్యాకాని పునఃపరిశోధించి వాటి అనుశీలన శక్తిని పెంచేటట్లుగా, పరిష్కరించి అభినవ రూపంలో వ్యక్తీకరించటం పూర్వసిద్ధాంత పరిష్కరణం. ఇందులో సామాన్యంగా విమర్శపై విమర్శ (Meta-Criticism)ముఖ్యపాత్ర నిర్వహిస్తుంది. పరిశోధనలోని సత్యాన్వేషణ నిష్ఠను సమకాలీన సాహిత్యానుశీలన కనుగుణంగా సంవదించే విధానం ఇందులో ప్రధానం. ఈ పద్ధతి కూడా ఆధునికుల దృష్టిని బాగా ఆకర్షిస్తున్నది. ఇక, వినూత్న సిద్ధాంత ప్రతి-

పాదనం అన్ని కాలాంలో, అందరిచేతా సమాదరింప బడేదే. సిద్ధాంతం సాహిత్య సమన్వయానికే కాక, వినూత్న సాహిత్య ప్రక్రియా సృజన వ్యాపారానికి, అనుశీలన విధానానికీ కూడా తోడ్పడుతుంది. ఇట్టి ప్రవృత్తి కలిగిన సిద్ధాంత గ్రంథాలు నేటి తెలుగు సాహిత్య పరిశోధనలో వేళ్లమీద లెక్కించదగినన్ని కూడా దొరకటం కష్టం. ఈ పరిస్థితి అన్ని సాహిత్య పరిశోధన రంగాలలోనూ సామాన్యం. ఆధునిక సాహిత్య పరిశోధనలో సాహిత్య ప్రమాణాలతోనే కాక, సాహిత్యేతర ప్రమాణాలతో కూడా సాహిత్యాన్ని అనుశీలించే విధానాలూ, వివిధ శాస్త్ర పరిశోధన ప్రక్రియలను సాహిత్య పరిశోధనలో సంపదింప చేయాలన్న ప్రయోగాలూ విరివిగా సాగుతున్నాయి. ఇవి సామాన్యంగా సాపేక్ష ప్రమాణాల నాశ్రయించి నంతవరకూ విమర్శస్థాయిని మించిపోవు. శాశ్వత ప్రమాణాల ప్రతిపాదనంతోపాటు అనుశీలన సూత్రాలను కూడా అన్వేషించి ప్రతిపాదింప గలిగినప్పుడు పరిశోధన స్వభావాన్ని సంతరించుకొంటాయి. ఇటు వంటి పరిశోధనలు తెలుగులో ప్రయోగాత్మకంగా మొదలయ్యాయి. ప్రామాణికతకు పరిశ్రమిస్తున్నాయి.

14. ఆధునిక సాహిత్య విమర్శలో ప్రకియా పరమైన అధ్యయనం ప్రత్యేక ప్రతిపత్తిని గడించింది. ఆ విమర్శ ప్రవృత్తి ఆధునిక పరిశోధనలో గణనీయ మైన పాత్ర నిర్వహిస్తున్నది. తెలుగు పరిశోధన ఈ విమర్శ సహాయంతో వినూత్న సత్యాలను, సమన్వయాలనూ, సిద్ధాంతాలనూ సాధించే యత్నం చేస్తున్నది. ఈ విమర్శ పద్ధతిని ఇంగ్లీషులో 'Theory of Genres' అంటారు. (genre - ప్రక్రియ) దీనిని గురించి పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాలు గమనింపదగినవి.

1. "Every wotk of literature belongs to at least one genre. Indeed, it is sure to have a significant generic element".[38] - Alastair Fowler.

2. "Theory of genres is a principle of order : it classifies literature and literary history not by time or place (period or national language) but by specifically literary types of organization or structure".[39]

-Austin Warren.

3. "Genre criticism has tended to split into two quite distinct and almost unrelated activities. One is abstract speculation about permanent genre.....The other activity is plodding chronicle history of individual genres that continually transform themselves without ever waiting long enough for generalization. One concentrates on fixity (if necessary, inventing it), the other on change (even if no general ideas emerge)."[40]

4. "The outmoded genres 'defined' by older criticism are still widely used. But, fortunately there are other ways to arrive at generic ideas."[41]

---

38. Kinds of Literature(1982).P. 20.
39. Theory of Literature ( 1976 ). P. 226.
40. Kinds of Literature ( 1982 ). P. 48-49.
41. Ibid., P. 52.

5. "Some good critics have spoken of literature itself as moving away from genre. But that is at best a loose formulation. (Much of the tenor of this book has gone to show that ) while literature may move away from the old genres, it cannot move away from genre altogether without ceasing to be literature. It would neither communicate with readers nor have leverage on existing values."[42] - Alstair Fowler.

తెలుగు సాహిత్య పరిశోధనలో ప్రక్రియా పరమైన పరిశోధన విస్తృత పరిధిలో సాగింది. అది అనుశీలన విమర్శ ధర్మాన్ని విరివిగా వాడుకొన్నది. అందువలన ఈ శాఖకు ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది.

15. విమర్శ భేదాలలో ఒకటిగా పరిగణింప బడుతున్నా, విమర్శగా గాక, విమర్శకు పూర్వ రంగంగా గుర్తింపబడుతున్న గ్రంథ పరిష్కార విమర్శ (Textual criticism) ను పరిశోధనగా గుర్తించటం ప్రపంచ వ్యాప్తంగా ఉన్న పరిపాటి.

16. సాహిత్య పరిశోధనలో భాషకు సంబంధించిన అధ్యయనం గణనీయమైన పాత్ర నిర్వహిస్తుంది. భాష శాస్త్రంలోనూ ఉంది; వ్యవహారం లోనూ ఉంది; సాహిత్యంలోనూ ఉంది. కాని, ఈ మూడింటి అభివ్యక్తిలో అది ప్రత్యేకతను సంతరించుకొంటుంది. Northrop Frye మాటలలో- "Literature, like mathematics, is a language and a language in itself represents no truth, though it may provide the means for expressing any number of them. But poets and critics alike have always believed in some kind of imaginative truth, and perhaps the justification for the belief is in the containment by the language of what it can express".[43] సాహిత్యంలో భాష భావాభివ్యక్తికి సాధనంగాఉంటూనే అనుభూతిని అందించే అర్థాన్ని సమర్పిస్తుంది. శాస్త్ర భాషకూ సాహిత్య భాషకూ భేదం ఉంది. సాహిత్యభాష వ్యంజనాదిశక్తులతో సుందరంగా,మధురంగా కళాత్మకాభివ్యక్తిని భజిస్తుంది. శాస్త్రభాషకు పదార్థజ్ఞానం ప్రధానం. కావ్యభాషకు పదార్థశక్తి ప్రధానం. ఇలాగే నిత్య వ్యవహారంలో ఉండే భాషకూ సాహిత్య భాషకు కూడా భేదం ఉంది. రెనే వెలెక్ మాటలలో ఆ భేదం స్పష్టమౌతుంది - "Literary language is first of all to be differentiated from the varied use of every day. The resources of language are exploited much more deliberately and systematically. In the work of a subjective poet, we have manifest a 'personality' far more coherent and all-pervasive than that of persons as we see them in every situations... Poetic language organizes, tightens, the resources of everyday language, and sometimes does even violence to them, in an effect to force us into awareness and attention......In certain epochs, the poet merely uses an established convention : the language, so to speak, poeticizes for

42. Ibid., P. 278.

43. Anatomy of Criticism (1973). P. 354.

him. Still, every work of art imposes an order, an organization, a unity on its material.''[44] భాషను రమణీయార్థ వ్యంజకంగా, కవి వ్యక్తిత్వాన్ని, కవితాభివ్యక్తిని రూపించే సాధకంగా అనుశీలించటం సాహిత్య విమర్శ/పరిశోధన ధర్మం. అయితే, భాషను శాస్త్రంగా అధ్యయనం చేసే సంప్రదాయం కూడా ఉంది. శబ్ద శాస్త్రం, భాషాశాస్త్రం ఆ పని చేస్తాయి. అవి చేసే పరిశీలన, పరిశోధన సాహిత్య శాఖకు వర్తించవు. అయితే, సాహిత్య పరిశోధనలో భాషా పరిశోధన అనేది ఒక శాఖగా పరిగణించే పరిపాటి ఉంది. నిజానికి దర్శన ప్రధానమైన సాహిత్య పరిశోధనా, శాస్త్రజ్ఞాన ప్రధానమైన భాషా పరిశోధనా తిల తండుల న్యాయాన్నే భజిస్తాయి. ఒక విధంగా కావ్య పాఠ పరిష్కరణ విధానం, నిఘంటు నిర్మాణం, శబ్దార్థ శాస్త్రార్థ చర్చలు, భాషోత్పత్తి వికాస పరిణామ పరిశీలనం, నవీన భాషాశాస్త్ర (Linguistics) సంబంధమైన ప్రయోగ ప్రక్రియలూ-మొదలైనవి భాషా సంబంధులైన పరిశోధనలు, సాహిత్య సిద్ధాంత దర్శనం వీటికి ధ్యేయం కాదు. Siytistics కొంతవరకు సాహిత్య భాషా పరిశోధనలకు వంతెన కట్టే అవకాశం ఉంది. ఏమైనా, సాహిత్యంలో భాష అనుభవ స్ఫూర్తిని అందించే అర్థ శక్తిగల సాధనంగా మాత్రమే అనుశీలించ బడుతుంది. సాహిత్య పరిశోధనలో భాష కళాద్రవ్యం. ''Language is the material of literature as stone or bronze is of sculpture, paints of picture, or sounds of music. But one should realise that language is not mere inert matter like stone but is itself a creation of man and is thus charged with the cultural heritage of a linguistic group.''[45]

17. పరిశోధన అనేక రంగాలతో జరుగుతూ ఉండటంచేత పరిశోధన అంటే ఏమిటి? అని నిర్వచించే ప్రయత్నాలు అనేకులు చేశారు. కాని, ఇక్కడ మాత్రం సాహిత్య పరిశోధనకు తగినవాటినే గ్రహించటం శ్రేయస్కరం. ఉదాహరణకు ప్రొఫెసర్ ఎం.చిదానందమూర్తిగారు పరిశోధనను గురించి చెప్పిన ఈ వాక్యాలు గమనించండి: ''పరిశోధన దృష్టితో సామగ్రి సంగ్రహము చేయుట, అథవా ముందు ముందు పరిశోధనకు సహాయకారి అనే దృష్టితో సామగ్రి సంగ్రహము చేయుట కూడా పరిశోధన అనిపించుకొనును.''[46] ఈ మాట భౌతిక, సామాజిక శాస్త్ర చరిత్ర పరిశోధనలకుగాని, భాషా పరిశోధనకు గాని వర్తించినంతగా సాహిత్య పరిశోధనకు వర్తింపక పోవచ్చు. కాని, సాహిత్యపరిశోధనకు సంబంధించినంతవరకు తాళ పత్రాలను లేదా లిఖిత పత్రాలను, గ్రంథాలను సేకరించి భద్రపరచటంలాంటి ఉద్యమాలకు దీనిని అన్వయం చేసికోవచ్చు. అయినా సేకరణ పరిశీలన కాదు, శోధన కాలేదు.

18. పరిశోధనలో బుద్ధిశక్తి ముఖ్యమా ? పరిశ్రమము ముఖ్యమా అని చర్చిస్తూ ప్రొ. చిదానందమూర్తి ఇలా అన్నారు: ''పరిశోధనలో పరిశ్రమ చాలా ముఖ్యమైనది అనుదానిలో సందేహము లేదు. కేవలం బుద్ధిశక్తి మనుష్యుణ్ణి బహుదూరము తీసుకొని పోజాలదు. బుద్ధిశక్తి కొంచెము తక్కువ యుండినను వ్యవస్థిత పరిశ్రమకు సిద్ధులైయుండువా రెవరైనను పరిశోధకులు కావచ్చును. దానివలన పరిశోధకు డొక మానసిక శ్రమ జీవి.''[47] శాస్త్ర పరిశోధనలో ఈ

44. Theory of Literature ( 1978 ). P. 24.
45. Theory of Literature ( 1978 ). P. 22.
46. పరిశోధన - ( అనువాదం : హరిహరప్రియ ). (1979). పు. 4-5.
47. Ibid., పు. 10.

మాట సత్యం. కాని, సాహిత్య పరిశోధనలో బుద్ధి శక్తికి అగ్రతాంబూలం అందుతుంది. దాన్ని గౌణంగా భావించి, పరిశోధనలు సాగిస్తే సాహిత్యరంగంలో కొంత నిరాశ కలుగక తప్పదు. ఇటువంటి నిరాశ తెలుగులో పరిశోధనను గురించి వ్యాఖ్యానించిన ఆచార్య బి.రామరాజు మాటలలో వ్యక్తం కావటానికి-పరిశ్రమకంటె బుద్ధిశక్తి తక్కువగా ఉందని భావించటం కారణం కావచ్చు. వారి మాటలు వినండి-

"పరిశోధన పేరుతో వ్రాస్తున్న సిద్ధాంత గ్రంథాలన్నీ అచ్చంగా పరిశోధన గ్రంథాలు కావు. కొన్ని సిద్ధాంత గ్రంథాలలో కొంత పరిశోధన, మరికొంత ఉపరిశోధన, కొంత విమర్శ, కొంత సమీక్ష, కొంత-సేకరించిన సామగ్రి కుప్పలు, ఉదాహరించిన గద్య పద్యాలు తెప్పలు. కొన్నింట కొటేషన్లు, మరికొన్నింట 'కొట్టేసెన్' లు ఎక్కువగా ఉన్నవి. సిద్ధాంత గ్రంథాలు ఈ విధంగా ఉండటానికి కారణం కేవలం మసిబూసి మారేడుకాయ చేయవలెననే ఉద్దేశంతో కాకపోయినా పరిశోధన అంటే ఏమిటి ? సిద్ధాంత గ్రంథ రచనం ఎలా ఉండాలె ? అనే సరియైన అవగాహన అందరు పరిశోధకులకూ, అందరు పర్యవేక్షకులకూ లేకపోవటమే."[48] అవగాహన, ప్రమాణాలు ఉన్నా లేకపోయినా డిగ్రీలు వస్తున్నాయన్న విషయాన్ని అలా ఉంచితే, ఆచార్యుల వారి మాటలలో తెలుగులో పరిశోధనను గురించి ఎంతో తెలుసుకోవలసిన అవసరం ఉన్నదన్న సత్యం బయటపడుతున్నది. అయినా వారు కొన్ని సిద్ధాంత గ్రంథాలు మాత్రమే అలా ఉన్నాయనటంలో మరికొన్ని సిద్ధాంత గ్రంథాలు పరిశోధన ప్రమాణంలో ఉన్నాయని కూడా పరోక్షంగా అంగీకరించారు.

ఒక ప్రక్రియ సాధనలో ఉన్నప్పుడు అన్నీ ఉత్తమ గ్రంథాలే వస్తాయనీ, అన్నీ ఉత్తమ ప్రమాణాలతో వెలువడతాయనీ భావించటం కూడా అంత సమంజసం కాదు. అయినప్పటికీ వెలువడిన పరిశోధన గ్రంథాలను వర్గీకరించి వాటి విలువలనూ, వాటి స్వభావాలనూ, వాటి సాధనలనూ వివేచించి నిర్ణయించటానికి అనువైన విధానాలను కూడా ఏర్పరచుకోవటం అనుశీలనంలో అవసరమౌతుంది.

### 3

తెలుగులో సాహిత్య పరిశోధన-నాడు, నేడు-అన్న సమస్యను ఎలా నిర్వహించాలన్నదీ ఒక సమస్యే. సామాన్యంగా ఒక పరిణామం చెందే వ్యవస్థను గురించి చెప్పేటప్పుడు తొలిదశను, పరిణామదశను గానీ, పూర్వస్థితినీ, ఆధునిక స్థితినిగానీ తారతమ్య దృష్టితో, చారిత్రకనే పథ్యంతో సమీక్షించే రచనకు ఇటువంటి శీర్షికను ఉంచవచ్చు. తెలుగులో పరిశోధన ఆంగ్ల ప్రభావం వలన అభినవంగా రూపొందింది. అంతకు పూర్వం పరిశోధన - ఆ పేరుతో లేకపోయినా - తెలుగులో ఉంది. అయితే, అది లక్షణ గ్రంథ రూపంగా మాత్రమే కనపడుతున్నది. కాని, ప్రాచీనాంధ్ర లక్షణ గ్రంథాలలో సృజనాత్మక పరిశోధన ప్రవృత్తి దాదాపు మృగ్యం. చాలవరకు అనువాదాలో, అనుకరణలో, సంకలనాలో కనపడతాయి. కొన్ని మాత్రం కొన్ని కొన్ని అంశాలలో క్రొత్త వెలుగులను ప్రసరించినవి వున్నాయి, కొన్ని క్రొత్త ప్రతిపాదనలు చేసినవి ఉన్నాయి. కాని, ఒక సాహిత్య దృక్పథాన్నో, సిద్ధాంతాన్నో ఆంధ్ర సాహిత్య జగత్తుకు సమర్పించినవి లేవు.

ఉదాహరణకు విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకారచూడామణి ప్రాచీనాంధ్రాలంకార గ్రంథాలలో ఒకటి. కాని, అది అనువాద తుల్యం; అనుకరణ ప్రాయం. దూసి రామమూర్తి శాస్త్రిగారి వివేచనం ఇందుకు సాక్ష్యం.

(1) "మొత్తముమీదఁ బ్రతాపరుద్రీయములో నుండి యిచటికిఁ దిగిన పునరుక్తులు గొన్నియు విభిన్నములగు దండి విద్యానాథ మతములు జోడించి

48. 'పరిశోధన' కు వ్రాసిన 'పరిచయం' - (1979) పు. vii - viii.

నందున సంభవించిన పునరుక్తి పూర్వాపర సందర్భ విరోధములు గొన్నియు నీ గ్రంథమున సమావేశమైన వని తత్సందర్భ పరిశీలనము వలన సువ్యక్తమగు చున్నది.''

(2) ''ఇందలి విలక్షణములు సంస్కృత లక్షణములవలె స్పష్టార్థము నీయఁజాలకున్నవి. మఱియు నొక్కొకచో విపరీతార్థమును గూడ నొసంగక్షమములై యున్నవి.''49

ఇంచుమించుగా ఈ కోవకు చెందిందే భట్టుమూర్తి నరసభూపాలీయం. ఈ విషయం సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాఖ్యానం చదివినవారికి స్పష్టమౌతుంది. వారు పీఠికలో మనవి చేసిన మాటలు ఆంధ్ర లక్షణ గ్రంథాల అప్రౌఢ స్థితిని స్పష్టం చేస్తున్నాయి. ''ఆంధ్రమున గల యలంకార గ్రంథములు ప్రాచీనార్వాచీనములు 27. అందొక్క దానియందును సర్వాలంకార విషయ సామగ్రి లేదు. సరికదా! మీదు మిక్కిలి కొన్ని ప్రాచీన గ్రంథములు దోషభూయిష్ఠములు, లక్ష్యముల కును లక్షణములకును బొత్తులేదు. లక్షణములన్నియు నవ్యాప్త్యాది దోషజుష్టములే. వీనికిఁ దోడుగా నపపాఠములు. ఈ యున్న గ్రంథములలోఁ గావ్యాలంకార చూడామణి, సరసభూపాలీయములు విశ్వవిద్యాలయ పరీక్షలకుఁ బాఠ్యములు. ఈ గ్రంథకర్తల కలంకార శాస్త్రమునఁగూలంకషమగు ప్రజ్ఞ లేదన్నట్లు వారి గ్రంథములేసాక్ష్యమిచ్చుచున్నవి. అట్టి గ్రంథములవలన విద్యార్థులకెంత యలంకారశాస్త్ర విజ్ఞానము లభించును? కావున నాంధ్రభాషలోఁ దుదికి సాహిత్యదర్పణము వంటి నిర్దుష్టమగు సాహిత్యశాస్త్రగ్రంథ మని చెప్పఁదగిన దేదియు లేదు. అట్టి గ్రంథ మొకటి యవశ్యమై యున్నది. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారి యాంధ్ర సాహిత్యదర్పణము కన్న సంస్కృత సాహిత్యదర్పణమే విద్యార్థులకు సుబోధ మని నా తలంపు.''50

ప్రాచీనాంధ్ర కావ్యాలంకార గ్రంథాలకంటె ఛందోఽలంకార గ్రంథాలు పరిశోధన ప్రవృత్తిని ఎక్కువగా ప్రకటిస్తున్నాయి. బహు గ్రంథాలనుండి లక్ష్యాలను సేకరించటంలో ఆధారాల / ఆకరాల సమీకరణ శ్రమ వ్యక్తమౌతుంది. లక్షణాలు చెప్పటంలో కూడా వైలక్షణ్యం, దేశీయ ప్రక్రియా విశేషాలను వివేచించటంలో వ్యక్తిత్వం ప్రదర్శించటంతో పాటు సాధారణ కావ్యాంగ స్వరూప స్వభావాలను చెప్పేటప్పుడు కొన్ని క్రొత్తవైన విశ్లేషణలు, దృక్పథాలూ ప్రకటించటం కనపడుతుంది. ఇటువంటి గ్రంథాలలో 'అప్పకవీయం' అగ్రగణ్యం. అఖండ యతిని అంగీకరించకుండా అప్పకవి త్రొక్కినమార్గం విశిష్టం. తృతీయ ప్రకరణంలో అతని విశిష్టదృక్పథం వ్యక్తమౌతుంది. అది తరువాతి విమర్శకులకు చర్చా వేదిక అయింది; పరిశీలన రంగం అయింది. యతి భేదాలతో పాటు, కవిభేదాలను ప్రకటించడంలోకూడా అప్పకవి ప్రజ్ఞను ప్రదర్శించాడు. ''ఇతని ముఖ్య కార్యములలో నొకటి కవులను విభజించుట. నే నెఱిగినంతవఱ కితఁడే యీ విభాగమున కాదికర్త యని యూహించెదను''51—అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు పేర్కొనటం గమనింపదగింది.

ఇలా పూర్వలక్షణగ్రంథాలలో ఉన్న పరిశోధనాంశాల గురించి చెప్పటం ఈ వ్యాసపరిధిలోకి రాదు. అయితే, ఆధునిక పరిశోధన నుండే సమీక్ష మొదలు కావాలి.

---

49. భారతి., జనవరి 1927 (చూడు : జి. వి. సుబ్రహ్మణ్యం ( సం ) సారస్వత వ్యాసములు III (1969) - పు. 138, 140.
50. కావ్యాలంకార సంగ్రహము (1959); మలిపలుకు—పు. 12-13.
51. "అప్పకవి కవితాసిద్ధాంతములు" (వ్యా) -సారస్వత వ్యాసములు సంపు. 2; పురిపండా అప్పలస్వామి (సం.) (1969) పు. 115.

తెలుగులో పరిశోధనకు ఉషోదయాన్ని కలుగజేసిన పాశ్చాత్య పండితుల కృషిని గురించి వివరిస్తూ కొత్తపల్లి వీరభద్రరావుగారన్నమాట లివి- "భాషా విషయకమైన కృషియే కాక, చారిత్రకమైన కృషిని గూడ చేసి, బ్రౌనుదొర ఆ రంగమునను తన ముద్రను గీలుకొల్పెను.......ఈ విధముగా పరిశోధనము సాగించి తెలుగుదేశములో పరిశోధనలకు పునాదులు వేసినవాడు మెకంజీ (1753-1821) తరువాత బ్రౌనుదొరయే (1798-1884). వీరిరువురి కృషియే లేకున్న తెలుగుదేశమున పరిశోధనయే లేదన్నచో, తరువాతివారికృషిపై వీరి ప్రభావ మెంత గాఢమో స్పష్టమగును."[52]

మెకంజీ బ్రౌనులతో పాటు వారి దగ్గర పండితులుగా పనిచేసి తెలుగు భాషా సాహిత్య పరిశోధనలకు దోహదాన్ని కలిగించిన వారిని కూడా ఇక్కడ స్మరించాలి. మెకంజీకి కుడిబుజంగా ఉన్నవారు కావలి సోదరులు. అందులో బొర్రయ్య "చరిత్ర పరిశోధనకును,వాఙ్మయ చరిత్ర సామగ్రిని సేకరించు విధానమునకును, దక్షిణ దేశమున (ఈతడే) మార్గదర్శకుడు."[53] అతని తమ్ముడు కావలి వేంకటరామస్వామి మెకంజీతో కలిసి పర్యటన చేస్తూ సేకరించిన సామగ్రితో "Biographical Sketches of Deccan Poets" ను రచించి 1829 లో ప్రకటించాడు. "దక్షిణ దేశములోని వివిధ భాషలలోని కవులను గూర్చి వ్రాయబడిన పుస్తకములలో నిది ప్రాచీనమైన దనవచ్చును."[54]

బ్రౌనుదొరకున్న పరిశోధన నిష్ఠ అసామాన్యం. "While I was engaged in printing the Dictionaries and translating the Bible, my Pandits steadily proceeded in the task of editing the native authors, preparing Telugu commentaries and indexes. Thus there were three separate sets of Brahmans engaged under my roof, which people called "Brown's College."[55] పరిశోధనలో బ్రౌనుకు అండదండలుగా నిలిచి కావ్య వ్యాఖ్యలు వ్రాసి, పట్టికలు తయారు చేసిన పండితులలో ముఖ్యులు జూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారలు.

తెలుగు భాషా సాహిత్యాల చరిత్రలో క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధాన్ని "బ్రౌణ్యయుగం" అని పిలిచారు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు. అందులో తెలుగు పరిశోధన ఉషఃకాంతులను ప్రసరించింది. భాషా పరిశోధన ప్రధానం; సాహిత్య పరిశోధన గౌణం. తాళపత్ర, లిఖిత గ్రంథ సేకరణం, స్థలచరిత్రల సేకరణం, శాసనాల ప్రతుల సేకరణం మొదలైన సాధన సామగ్రి సేకరణ కార్యక్రమం ఈ యుగంలో ముమ్మరంగా సాగింది. ఆ సామగ్రితో దక్షిణ భారత కవుల జీవిత చరిత్రను నిర్మించే ప్రయత్నం జరిగింది. గ్రంథ పరిష్కరణం, వ్యాఖ్యానం, పీఠికా రచనం, సాహిత్యాధ్యయం అనే ప్రవృత్తులు బ్రౌను కాలంలో ప్రాచుర్యాన్ని చెందాయి. ఇవన్నీ పరిశోధనలకు ఒక సమగ్రమైన రూపకల్పనం జరగటానికి పూర్వరంగ ప్రక్రియలుగా తోడ్పడ్డాయి.

ఒక విధంగా తెలుగులో నిర్మింపబడుతున్న పరిశోధన భవనానికి బ్రౌణ్య యుగంలోని పాశ్చాత్య ఆంధ్ర పండితులు పునాదులకు కందకాలు త్రవ్వారని చెప్పాలి. ఆ తరువాత ప్రవర్తిల్లిన వీరేశలింగయుగం

52. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము (1960) పు. 140-141.
53. Ibid., పు. 161
54. Ibid., పు. 167
55. cf. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము - పు. 171

(క్రీ.శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధం) లోని పండితులు పునాదులు కట్టటానికి రాళ్ళెత్తారని చెప్పాలి. వారిలో కందుకూరి మేస్త్రీ. వీరేశలింగం గారి 'ఆంధ్ర కవుల చరిత్ర' నిర్మాణం వెనుక ఎంతటి పరిశ్రమ ఉందో, ఎంత విలువైన సామగ్రిని ఎన్ని కష్టనిష్ఠురాల కోర్చి సేకరించవలసి వచ్చిందో, ఎందరు పరిశోధకులు ఆ కృషికి చేయూత నిచ్చారో ఆ గ్రంథ పీఠికను(1917) చదివితే తెలుస్తుంది. దిఙ్మాత్రంగా కొన్ని వాక్యాలను ఉదాహరిస్తాను — ''నే నీకవుల చరిత్రమును వ్రాసి ప్రకటించి యిప్పటికి ముప్పది సంవత్సరములు దాటి పోయినది. నే నప్పటికి దొరికిన సాధనకలాపముతో కవుల కాల నిర్ణయాదులను జేయుచు నేదో యొకరీతిని గ్రంథము సొంతము చేసితిని. ఇప్పటి వలె నప్పుడు గ్రంథాలయములు లేవు; ఇప్పుడు ముద్రింపబడి యెల్ల వారికిని సుసాధ్యములయి యున్న గ్రంథములలో నూఱుల కొలఁది కాకపోయినను పదులకొలదియైనను తెలుగు గ్రంథము లప్పు డముద్రితము లయి తాళ పత్త్రైక శరణ్యములయి దుస్సాధ్యము లయియుండెను; ఇప్పుడు ప్రకటింపఁబడియున్న శిలాతామ్రశాసనాదు లలో ననేకము లప్పుడు ప్రకటింపబడకుండెను. ఇట్టి స్థితిలో కవుల చరిత్రమును వ్రాయుట యప్పు డెంత కష్టకార్యముగా నుండునో నేను చెప్పనక్కఱలేకయే బుద్ధిమంతు లూహించుకో వచ్చును. అయినను నేను వ్యయప్రయాసలకు వెనుకదీయక పుస్తక సంపాద మునకయి చెన్నపురి, తంజాపురి మొదలయిన దూర ప్రదేశములకు సహిత మరిగి యిచ్చినవారి యొద్ద నుండి తాళపత్త్ర పుస్తకములను సంపాదించియుఁ గొన్నిటికి మాతృకలకు ప్రతికలు వ్రాయించియు నియ్యని వారికడ జీర్ణ తాళపత్త్ర పుస్తకముల నెర వుగాఁ గొని చదివి వానినుండి కావలసిన చరిత్రాంశ ములను వ్రాసికొనియు నెలలకొలది చెన్నపట్టణములో నుండి యచ్చటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార మున కనుదినమును బోయి యందలి పుస్తకముల నెల్లఁ బరిశోధించి, వానిలో నుండి యావశ్యక భాగ ములను వ్రాసికొనియు శక్తివంచనలేక పాటుపడి నా కప్పటికి లభించిన పరికర సాహాయ్యమున నాంధ్ర కవులను గూర్చి యేదో తోఁచిన దానిని వ్రాసి ప్రక టించి కవుల చరిత్ర మనిపించితిని.'' ఇందులో ఏదో తోచిన దానిని వ్రాసినాన్న మాట వినయోక్తి. ఆయన ఆ గ్రంథ సామగ్రి సేకరణకు పడిన శ్రమ పరిశోధ కుని నిరంతర గాఢ పరిశ్రమకు దృష్టాంతం. ఆయన కృషికి సాయమందించిన సమకాలీన పరిశోధక మనీ షులు - విజ్ఞాన చంద్రికా సంస్థాపకులు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు, ఆంధ్ర సాహిత్య పరిషత్ స్థాపకులు, పరిషత్పత్రికా సంపాదకులు జయంతి రామయ్య పంతులు గారు, ఆంధ్ర పరిషత్పత్రికా నిర్వాహకులు కొత్తపల్లి సూర్యారావుగారు, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార కార్యస్థాన పండితులు వేటూరి ప్రభాకరశాస్త్రి, పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారలు, పిఠాపురాంధ్ర పుస్తక పరిశోధక మండలి వారి గ్రంథాలయ కార్యదర్శి వంగూరి సుబ్బారావుగారు. వీరేకాక గిడుగు రామమూర్తి, బుర్రా శేషగిరిరావు, మానవల్లి రామకృష్ణ కవి మొదలైన వారు పంతులు గారికి సామగ్రిని సమకూర్చిపెట్టటంలో తోడ్పడ్డట్టు వారి పీఠిక చెపుతున్నది.

వీరేశలింగ యుగం వివిధ సాహిత్య ప్రక్రియల రచనాప్రయోగ దశకు ఎలా ఆరంభ వికాస దశలు కలిగించటానికి తోడ్పడిందో, అలాగే పరిశోధన మార్గాన్ని కొన్ని బాటలు వేయటానికి కృషి చేసింది. పరిశోధన ఒక వ్యక్తి చేయవచ్చుననీ, వ్యక్తుల సమూహం కలసికట్టుగా చేయవచ్చుననీ, సంస్థలు చేపట్టవచ్చుననీ బ్రౌణ్యయుగం నిరూపించింది. వీరేశ లింగయుగం దానిని ప్రయోగాత్మకంగా నిర్వహించ టానికి యత్నించింది. ఈ యుగంలో మార్గదర్శులైన మనీషులు కనపడతారు; వారి పర్యవేక్షణలో పరిశో ధన కార్యకలాపాలను నిర్వహించే సంస్థలు ప్రత్యక్ష మౌతాయి; పరిశోధన విశేషాలను ప్రకటించటానికి వెలువడిన పత్రికలు గోచరిస్తాయి; గ్రంథమాలలు,

ప్రచురణ సంస్థలు పరిశోధనకు దోహదకారులుగా ఉంటాయి. ఒక జాతి నిద్రాణదశనుంచి మేల్కాంచి, పరిశోధనను శాస్త్ర సమ్మతంగా సాహితీరంగంలో నిర్వహించాలన్న ఉద్యమస్ఫూర్తితో పరిక్రమిస్తున్నప్పుడు సహజంగా రూపుదిద్దుకొనే చైతన్యప్రవృత్తులన్నీ ఈ యుగంలో బీజావస్థనుండి అంకురావస్థకు అందుకొన్నాయి.

పరిశోధన ప్రక్రియలో ఆకరాల సేకరణ, విషయ సేకరణ, సూత్రాధారాల సమీకరణ అనే అంశాలు ప్రాతిపదికలుగా పనికివస్తాయి. వీటిని వర్గీకరించి, విశ్లేషించి, ఉద్దిష్టమైన పరిశోధన సమస్యకు సంబంధించిన ఫలితాంశాలను సాధించడానికి పరిశోధకుడు పూనుకుంటాడు. ఈ యుగ చైతన్యంలో ఇటువంటి ప్రవృత్తి శాస్త్రీయంగా సాగింది. ముఖ్యంగా ఈ యుగ పరిశోధకులు భాషకు, చరిత్ర సంస్కృతులకు, సారస్వతానికి సంబంధించిన సమస్యలకు ప్రాముఖ్యమిచ్చారు. భాషాపరిశోధన ప్రవృత్తి - ఆంధ్రభాష సంస్కృత ప్రాకృత జన్యమా? ద్రావిడ భాషాజన్యమా? అనే సమస్యను ప్రధానంగా ఎన్నుకొన్నది. దానికి గౌణంగా వ్యాకరణాంశాలు, గ్రంథ పరిష్కారాంశాలు, శబ్ద సాధుత్వాసాధుత్వ చర్చలు, నిఘంటునిర్మాణం మొదలైనవి తల ఎత్తాయి. పాఠ్య గ్రంథాలలో వాడవలసిన భాషను గురించి వెలువడిన వాదాలు గ్రాంథిక వ్యావహారికభాషా చర్చలకు దారి తీశాయి. ఇటువంటి చైతన్యంతో భాషాసమస్యకు అనుగుణంగా అపారమైన ఆధారాలను సేకరించి, సత్యాన్వేషణతో పరిశోధన ప్రవృత్తిని దానికి కల్పించి, శాస్త్రీయదృక్పథంతో తెలుగున వ్యాసాలను, గ్రంథాలను రచించిన వారిలో అగ్రగణ్యుడు, ఆచార్య స్థానీయుడు గిడుగు రామమూర్తి పంతులుగారు. చరిత్ర సంస్కృతులకు సంబంధించిన శాఖ శాసనాదులను వెలికితీసి, పఠించి, వాటిలోని చారిత్రకాంశాలను విశ్లేషించి ఆంధ్ర చరిత్రను ప్రమాణబద్ధంగా నిర్మించాలనే యత్నంలో పరిశోధన స్థాయిని ప్రకటించింది. ఈ రంగంలో జయంతి రామయ్య పంతులు గారి కృషి గణనీయమైంది. "భాషా విషయక పరిశోధనలను, ఐతిహాసిక పరిశోధనలను సమదృష్టితో పరిశీలించిన జయంతి రామయ్య పంతులు గారు, తెలుగుదేశ చరిత్రకు సంబంధించిన శాసనముల నెన్నింటినో ప్రకటించిరి. వీరి 'శాసన పద్యమంజరి' భాషా విషయకమైన వీరి పరిశోధనా ప్రాగల్భ్యమునకు తార్కాణము, భాషా పరిశోధనలకు ఆలంబనము. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలలో వీరు ప్రచురించిన అనేక వ్యాసములు ఇటు వాఙ్మయ సేవలకును, అటు ఐతిహాసిక పరిశోధనలకు కూడ నావశ్యకములై వరలినవి. 'సూర్యరాయాంధ్ర నిఘంటువు' యొక్క సంకలనమునకు వీరు ప్రాతిపదిక వేసిరి. వీరు ఇవిగాక శాస్త్ర పారిభాషిక పదముల పట్టికను గూడ కొంతవరకు సిద్ధము చేసి ప్రచురించిరి. ఇట్లు వీరి కృషి పాశ్చాత్య పరిశోధనా పద్ధతుల ప్రభావమున ప్రవర్ధమానమైనది"[56] - అన్న ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారి మాటలు విలువైన వివేచనలు.

ఈ యుగ పండితులలో 'జంగమ విజ్ఞాన సర్వస్వం'లా కనపడేవారు కొమర్రాజు లక్ష్మణరావు పంతులు గారు. వీరభద్రరావుగారి మాటలలో "19 వ శతాబ్ది ఉత్తరార్ధములో జన్మించిన ఆంధ్ర మహాపురుషులలో నొకరగు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారు (1877-1923) ఆంధ్ర భాషా సాహిత్యముల, నాగరకతా సంస్కృతుల వికాసమున కావశ్యకములగు సమస్త విషయములలోను కృషి చేసినవా రని స్థూలముగా చెప్పవచ్చును... వీరు ప్రారంభించిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' వీరి ప్రజ్ఞా ప్రాగల్భ్యమును, కార్యదీక్షను వేనోళ్ల చాటుచున్నది... ఆంధ్రులకు వీరు చేసిన అమూల్యమైన సేవలు రెండు.

---

56. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము (1960) పు. 527-528.

స్క్రమమైన పరిశోధన విధానమును దేశమున నెల కొల్పుట మొదటిది. వైజ్ఞానిక రచనలకు పనికివచ్చు పారిభాషిక పదజాలమును సృష్టించుట రెండవది. ఈ రెండు పనులయందును వారికి సాయపడినవి, దారి చూపినవి పాశ్చాత్య పరిశోధనా పద్ధతులు. ఇతర భారతీయ భాషలతో కూడ వారికి పరిచయముండు టచే, పాశ్చాత్య పరిశోధనా పద్ధతులను ఆయా భాషల వారెట్లు వినియోగించుకొనిరో ప్రత్యక్షముగ తెలిసికొను అవకాశము కూడ వారికి కలిగినది.''[57] లక్ష్మణరావు పంతులు గారు ప్రాచుర్యానికి తెచ్చిన పరిశోధన విధానంవలన, నెలకొల్పిన పారిభాషిక పదజాలంవలన తెలుగులో 'పరిశోధన వ్యాస ప్రక్రియ' పటిష్ఠంగా రూపొందింది. ఎన్నుకొన్న అంశాన్ని పరిశోధించ దగిందా కాదా అని నిర్ణయించటంలోను, దాని పూర్వాపరాలను చర్చించటంలోను, ప్రస్తావించవలసిన ఆధారాలను విహంగ వీక్షణం చేయటంలోను, వీటన్ని టిని సమకూర్చి విషయాన్ని గాఢంగా పరిశీలించటం లోను, ఫలితాంశాలను నిగ్గు తేల్చటంలోను లక్ష్మణ రావుగారు భావిపరిశోధకులకు ఆదర్శప్రాయులు కావటమే కాకుండా, చేసిన పరిశోధనకు సాహిత్య పరంగా ఒక రూపాన్నివ్వటంలో కూడా తమ రచనల ద్వారా బాటలు వేసి చూపారు. కొమర్రాజు వారు తెలుగు పరిశోధనలో సృజనాత్మకతను ప్రవేశ పెట్టారు; చరిత్రకు సైతం సాహిత్య గౌరవాన్ని కల్పించారు.

సారస్వత శాఖలో పరిశోధకులు సాగించిన కృషి తాళపత్రాది గ్రంథ సేకరణం, కవుల చరిత్ర రచనం, గ్రంథ పరిష్కరణం, ప్రచురణం అనే నాలుగు పాదాల మీద నడిచింది. గ్రంథసేకరణం పరిశోధనకు నాందివంటిది; ఆ గ్రంథాలలో లభించే సామగ్రి నాధారంగా చేసికొని, దేశంలో లభిస్తున్న సమాచారాన్ని జోడించి రచించిన కవుల చరిత్రలు పరిశోధనకు ప్రస్తావనల వంటివి; అయితే, ఆ గ్రంథా లను పరిష్కరించి, పీఠికలు వెలయించి, ప్రకటిం చటం అనే సాధనలు మూడూ మూడు ఉద్యమాల వంటివి. ఈ మూడింటినీ కలిపి సాగించిన సంస్థలు ఆ కాలంలో ఎన్నో వెలువడ్డా ఇప్పటికీ మన స్మృతి పథంలో నిలిచి ఉన్నవి మూడు : ఆంధ్ర సాహిత్య పరిషత్తు, అముద్రిత గ్రంథ చింతా మణి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు. ఈ సంస్థలు పాటించిన గ్రంథ పరిష్కార పద్ధతిలో కొన్ని లోపాలు ఉండవచ్చు. సమకాలీన వ్యాకర్తల సూత్రాల కనుగుణంగానో, అప్పకవీయాది ఛందో గ్రంథాల లక్షణాల కనువుగానో పండితులు పాఠాలు మార్చి ఉండవచ్చు. అయినా, తెలుగున కా ప్రక్రి యలో ఒక ఒరవడిని కల్పించిన గౌరవం ఆ సంస్థ లకు, ఆ సంస్థల వెనుక అజ్ఞాతంగానూ, జ్ఞాతంగాను పరిశోధించిన పండితులకు దక్కుతుంది. చిలుకూరి నారాయణరావు, మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి మొదలైన పరిశోధకుల కృషి తెలు గులో గ్రంథ పరిష్కార విమర్శకు పరిణతిని కల్పిం చింది. ఒక విధంగా వీరేశలింగయుగ సాహిత్య పరి శోధన చైతన్యంలో గ్రంథ పరిష్కార విమర్శ- (దీనిని పరిశోధనగా గుర్తిస్తున్నాం) ప్రధాన పాత్ర నిర్వహించిందని చెప్పవచ్చు. ఇటువంటి పరిశ్రమ ప్రతి సాహిత్యంలోనూ పరిశోధనకు పూర్వరంగ ప్రయోగాన్ని నిర్వహిస్తూనే ఉంటుంది. పూర్వరంగం నాటకం కానట్లూ, పూర్వరంగం లేనిదే రంగము మొదలు కానట్లూ-ఈ గ్రంథ పరిష్కార విమర్శ పరిశోధన రంగంలో పరిగణింపబడుతుంది.

''One of the first tasks of scholarship is assembly of materials, the careful undoing of the effects of time, the examination as to authorship, authenticity, and date. Enoromous acumen and diligence

57. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. (1960) పు. 531-532.

have gone into the solution of these problems; yet the literary student will have to realize that these labours are preliminary to the ultimate task of scholarship. Often the importance of these operations is particularly great, since without them, critical analysis and historical understanding would be hopelessly handicapped''[58] — అన్న రెనెవెలిక్ మాటలు అక్షరాలా ఆంధ్ర సాహిత్య పరిశోధనకు కూడా వర్తిస్తాయి.

కొత్తపల్లి వీరభద్రరావుగారు వారి సిద్ధాంత వ్యాసంలో ఆ రచనా ప్రణాళిక ననుసరించి, ప్రౌఢ్య యుగం (క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం), వీరేశలింగ యుగం (క్రీ.శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధం) అని రెండు యుగాలుగా విభజించుకొని తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావాన్ని పరిశీలించారు. ఆ యుగద్వయాన్ని పరిశోధనకు వర్తింప చేయటం జరిగింది వ్యాసంలో. అన్వయం ఎంతో సహజంగా కూడా కుదిరింది. అలాగే తెలుగులో పరిశోధనకు సంబంధించినంతవరకు 20 వ శతాబ్దిని కూడా రెండు యుగాలుగా విభజిస్తే-వాటిని రాయప్రోలు యుగం (20 వ శతాబ్ది పూర్వార్ధం); విశ్వవిద్యాలయ యుగం (20 వ శతాబ్ది ఉత్తరార్ధం) అనిపిలిస్తే సమంజసంగా ఉంటుంది

క్రీ.శ. 20 వ శతాబ్ది పూర్వార్ధంలో పరిశోధనకు పరిపోషకంగా సాగే సాహిత్యవిమర్శ రూపు దిద్దుకొన్నది. విమర్శకు లక్షణాలైన వర్ణనం, విశ్లేషణం, వివేచనం, సమన్వయం, అనుశీలనం నాటి విమర్శ ప్రవృత్తిలో మొగ్గతొడిగి వికాశదశకు వచ్చాయి. ప్రాచ్యపాశ్చాత్య విమర్శ లక్షణాలను తెలుగులో సంపదించుకోవటానికి ప్రత్యేక పరిశ్రమ జరిగింది. పి. దక్షిణామూర్తి, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి, పెన్నేటి రామచంద్రరావు, పుదుప్పాకం సుబ్రహ్మణ్యఅయ్యరు, వింజమూరి రంగాచార్యులు, బుర్రా శేషగిరిరావు గారల విమర్శలు ఇటువంటి ప్రవృత్తికి విలువైన ఉదాహరణాలు. పెన్నేటి, వింజమూరుల విమర్శలో పాశ్చాత్య లక్షణాలను ప్రాచ్య లక్షణాలతో సంపదించి ప్రవర్తింప చేయాలన్న ఉత్సాహం కనపడుతుంది. కాని, పాశ్చాత్య విమర్శోద్యమాలలో దేనికైనా గాఢంగా స్పందించి, ఆ ఉద్యమ చైతన్యాన్ని తెలుగులోకి తీసికొని రావాలన్న తీక్ష్ణమైన స్వభావం లేదు. బుర్రావారి విమర్శకూడా ప్రవక్తగా పలికిందే కాని, ప్రయోక్తగా ప్రదర్శించి చూపలేదు. డ్రైడెన్, కార్లయిల్, మాథ్యూ ఆర్నాల్డ్ అభిప్రాయాలను పేర్కొనటం ఒక ప్రత్యేక ఉద్యమ స్ఫూర్తి నివ్వటం కాదు. ప్రసిద్ధ సాహితీ వేత్తల (వివిధ యుగాలకు చెందిన వారి) అభిప్రాయాలను తెలుగువారికి పరిచయం చేయటమే. దీనికంటె బుర్రా వారి 'విమర్శాదర్శం' (1912), అంతకంటె పురాణం సూరిశాస్త్రి 'విమర్శక పారిజాతం' (1925) విశిష్టం. ఆంగ్ల సాహిత్య విమర్శ స్వభావాన్ని వర్గీకరణ పద్ధతి ననుసరించి వివరించటానికి యత్నించిన పరిచయ గ్రంథా లవి.

ఇదే కాలంలో తెలుగులో కొందరు ప్రసిద్ధ విమర్శకులు లక్షణ విమర్శను కూడా వెలయించారు. సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథాలలోని ప్రమాణాలను గ్రహించి కావ్యాలకు అనువర్తింప చేయటం ఈ విమర్శ స్వభావం. కొక్కొండ, వడ్డాది, శ్రీపాద, తిరుపతి వేంకటకవులు, పార్నంది రామశాస్త్రి, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, వేదం వెంకట్రాయ శాస్త్రి, సడకుదుటి వీరరాజు పంతులు, ముట్నూరి కృష్ణరావు మొదలైనవా రెందరో ఈ శాఖను పోషించారు. ఈ కాలంలోనే విమర్శపై విమర్శ (Meta-criticism) రూప వైభవాన్ని సంతరించుకొన్నది.

---

58. Theory of Literature ( 1970 ). పు. 57.

ఆంధ్ర సాహిత్య విమర్శ కొక వ్యక్తిత్వాన్ని కల్పించి కావ్యానుశీలన మార్గాన్ని ఆంగ్ల విమర్శ స్వభావ ముద్రితంగా మలచి, సాహితీ లోకంలో ప్రసరింప చేసిన మనీషి కట్టమంచి రామలింగారెడ్డి గారు. వారి కవిత్వ తత్త్వ విచారం (1914) ఆంధ్ర విమర్శకు అభినవ లోచనాన్ని అందించింది. ఒక విమర్శకుడు తానేర్పరచుకొన్న సాహిత్య దృక్పథంతో, ప్రమాణ సూత్రాలతో తానెన్నుకొన్న కావ్యాలలో కవిత్వాన్ని, కావ్యగుణ దోషాలను అనుశీలించే పద్ధతి ఆంగ్ల కాల్పనికోద్యమ విమర్శకులు సామాన్యంగా పాటించింది. రెడ్డిగారి కవిత్వ తత్త్వ విచారం కూడా ఆ పద్ధతిని పుణికి పుచ్చుకొన్నది. ముందు లక్షణ వివేచనం, ఆ తరువాత కావ్యానుశీలనం అనే క్రమం ఈ గ్రంథంలో పాటింపబడిన నిర్మాణ పద్ధతి. ఇది పాశ్చాత్య లక్షణ వివేచన స్వభావంతో పాటింప బడిన నిర్మాణ పద్ధతి.

కట్టమంచివారు విశ్లేషణాత్మక విమర్శ పద్ధతులకంటె సమన్వయాత్మక విమర్శ వివేచనం వైపు విమర్శకుల దృష్టిని మరలించారు. సమన్వయ విమర్శ పద్ధతి కట్టమంచివారికి ముందే ప్రవర్తిల్లుతూ ఉన్నా, అనుశీలనాత్మక విమర్శకు దానిని ప్రధానాంగంగా మలచుకొన్న గౌరవం కట్టమంచివారికే దక్కింది. కళాపూర్ణోదయ కావ్య విమర్శనం దానికి చక్కని దృష్టాంతం.[59]

భావి కాలంలో వెలువడిన అనుశీలనాత్మక పరిశోధనకు మార్గాన్ని చూపటమే కాకుండా, దానికి పుష్టినీ అనుశీలన పద్ధతినీ కలిగించిన విమర్శకులలో అగ్రగణ్యుడు కట్టమంచి రామలింగారెడ్డిగారు. కోరాడ రామకృష్ణయ్య, విశ్వనాథ సత్యనారాయణ, దువ్వూరి రామిరెడ్డి, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ మొదలైనవారు ఈ మార్గానికి చేవను కల్పించి ప్రయోగ గౌరవాన్ని కల్పించారు. గురజాడ అప్పారావుగారు కాల్పనిక యుగ చైతన్యమార్గం కంటె భిన్నంగా అభ్యుదయ మార్గాన్ని ప్రవర్తింపచేశారు. సాహిత్యాన్ని సామాజిక వాస్తవికతతో అనుసంధించే ప్రవృత్తికి బీజావాపనం చేశారు.

క్రీ.శ. 20వ శతాబ్ది పూర్వార్ధం విమర్శకే అంకితమైపోయిందని చెప్పాలి. కాని, ఆ యుగంలో రాయప్రోలు సుబ్బారావుగారు అభినవ కవిత్వ ప్రస్థానాన్ని సాగించి, అందులో అమలిన శృంగార సిద్ధాంతాన్ని, మాధురీదర్శనాన్ని ప్రతిఫలింపచేయడమే కాకుండా, రమ్యాలోకము, మాధురీ దర్శనము అనే సాహిత్య దర్శన లక్షణగ్రంథాలను పద్యంలో రచించి కావ్యదర్శన మీమాంస (Critical theory)కి, కావ్యానుశీలన మార్గ ప్రవర్తనానికి (Critical path) దోహదం చేసే సాహిత్య సిద్ధాంత దర్శన పరిశోధనకు ప్రాణం పోశారు. రాయప్రోలువారు కవిగా ఆధునికాంధ్ర సాహిత్య జగత్తులో ఎంతగా యుగకర్తృ గౌరవాన్ని పొందారో, పరిశోధకునిగా సాహిత్య సిద్ధాంత దర్శన ప్రవర్తక గౌరవాన్ని అంతగా పొందగలిగారు. ఆధునికాంధ్ర జగత్తులో తనదైన ఒక సాహిత్యసిద్ధాంతాన్ని ప్రమాణాలద్వారా చూపించి, లక్షణగ్రంథాలుగా వెలయించిన గౌరవం రాయప్రోలువారి కొక్కరికే దక్కింది. సృజనాత్మక పరిశోధన ప్రతిపత్తిని ఆయన లక్షణగ్రంథాలు వెలార్చాయి. సంస్కృత లక్షణ గ్రంథాలకంటే వీటియందున్న వైలక్షణ్యం ఆధునిక సిద్ధాంతగ్రంథాలకుండే-లేదా ఉండదగిన-వైశిష్ట్యాన్ని ప్రతిపాదిస్తుంది. అయితే, ఆయన వ్రాసింది పద్యాలలో. ఆధునిక విమర్శ వచనాన్నే వరించింది. కాని, పద్యంలో ఉన్నా వాటి పెద్దరికాని కేమీ లోటు లేదు.

రాయప్రోలువారి కవితాదర్శాన్ని తెలిపే గ్రంథం రమ్యాలోకం. ఆయన సాహిత్యదర్శనాన్ని చెప్పే గ్రంథం మాధురీ దర్శనం. ఈ రెండూ వారి అభినవ కవితకు లక్షణగ్రంథాలు. వాటిని విశేషించి ప్రధానంగా ఒక దశసూత్రిని దర్శింపవచ్చు.

---

59. వివరాలకు – జి. వి. సుబ్రహ్మణ్యం – 'ఆంధ్ర సాహిత్య విమర్శ – ఆంగ్ల ప్రభావం', 1983 చూడండి. పు. 164-180.

1. 'జన్మభూమి స్వర్గంబ యగును'. 'తల్లి నుడికంటె పరమామృతంబు లేదు'. 'భాషకంటె నవ్యులకు తపస్సు లేదు'.

2. 'సంస్కృతము లగు గాక, దేశ్యంబు లగును గాక, పరదేశజము లగు గాక, సూక్తు లాత్మ భాషా(శ్రుతి స్థాయి ననులయించి లీనమగును స్వస్థాన వేషానుకృతుల'.

3. 'కాలధర్మానుగతమై జగ(త్ప్రవృత్తి మారు నపుడు వాఙ్మయమును మారు; నిజము'.

4. 'రసములకు నెల్ల శృంగారరసము తల్లి' అనిరి పూర్వులు సంభోగ మవధి గాగ; అక్షరానంద సిద్ధి లక్ష్యముగ నెంచు నవ్యులకు నది అ(ప్రధానంబ యయ్యె'.

5. 'కానరాదు సౌందర్య శృంగారములకు భేద మధిక మారాధన వృత్తియందు. గుణము శృంగార మగును; తద్గుణ శరణ్య మమృత సౌందర్య మగును నవ్యార్చకులకు'.

6. 'కానబడ కనుమాన (ప్రమాణమునకె యందియందని పరతత్త్వ మవల నుంచి పంచభూత దృశ్యంబైన (ప్రకృతి యొకటె సన్నిహిత లక్ష్య మనియె వచస్వి నేడు'.

7. 'కలశభాంగీ పయోధర కుసుమమందు మోహమధువె గవేషించె మున్ను సుకవి; సాత్త్విక (ప్రేమకోశ పేశలములయిన వత్సలామృత రుచులను వలచె నేడు'.

8. '(ప్రేమతం(త్ర మహోపాసనామయులగు నవ్యుల కుపాధి యయ్యె సౌందర్య మొకడె.'

9. 'కవితకు రస మసువులు, తత్కావనము (ప్రఫుల్ల కమనీయముగా నవనవలాడెడి నుడువుల నవరిం(త్రు కవులు సహృ(త్ప్రసన్నగతి బుధా!'

10. 'భావము సాహిత్య కళాజీవము; తత్కా మనీయ సిక్తస్థాయీ భావము రసోదయోష్ణ శ్రీవాల్లభ్య మగును కవికృతియందు బుధా!'

మధువులో తీపీ సువాసనా ఉన్నట్లే కావ్యంలో రసమూ, రామణీయకమూ ఉంటాయనీ, అంతఃకరణ యోగంవలన రసాన్నీ, ఆకర్షణీయ రచనం వలన రామణీయకాన్నీ సహృదయు లాస్వాదిస్తారనీ రాయ (ప్రోలువారు రమ్యాలోకంలో బీజ(ప్రాయంగా చెప్పిన సిద్ధాంతాన్నే మాధురీదర్శనంలో సాహిత్యపరంగా అన్వయించి అభివ్యక్తీకరించారు. రాయ(ప్రోలు వారి సాహిత్య దర్శనంలో విభావ విస్ఫూర్తిని వెలార్చేది శబ్దం. శబ్దబంధంలో భాసించే సహభావం జీవుల మధ్య రాణించే స్నేహశక్తివంటిది. శబ్ద శక్తివలననే అర్థం (ప్రతీయమానమౌతుంది. అర్థం (ప్రఫుల్లమైన భావ జీవితానికి అనుభవ విన్యాసాన్ని అలవరుస్తుంది. అది సహృదయ అంతఃకరణంలో చర్వ్యమాణమై సాత్త్వికస్థితిని పొందుతుంది. లలిత పరుష భావ సంఘర్షణానికి తట్టుకొని మధుర స్నేహాద్వైతస్థితి నందించే స్థాయి ధ్వనిరూపంగా భావనామయమై అనుభవస్థితి కంది స్థాయిత్వాన్ని భజిస్తుంది. అందు వలన సహృదయుడు రచనలోని రామణీయకత్వాన్ని రమ్యాలోకంతో (గ్రహించి, అంతఃకరణ (ప్రవృత్తు లలో జరిగే మథనంలో నుంచి రూపనవనీతాన్ని సాధించి, తచ్చర్వణాన్ని ఆత్మ చిత్కళయైన రతితో సాధించటమే రాయ(ప్రోలు వారు చెప్పే అమలిన శృంగార రస (ప్రస్థానం. ఇది లోకంలో నరనారీజనం రతిని చిరస్నేహంగా సుమానుషీకరించి భావించి, అనుభవించే మాధుర్యం వంటిదని వారి నిర్దేశం.

జీవితంలో శృంగారం ఎంత సాధనావృత్తికి సంబంధించి ఉంటుందో కావ్యంలో కూడా శృంగారం అంత ఆరాధనా(ప్రవృత్తి నా(శ్రయించి ఉంటుంది. శబ్దబంధ రూపమైన సాహిత్యంలో ఆస్వాదనీయమైన కళాస్థానం ఏమంటే- మృదు పద ముదితమైన వాక్కుకూ, ఇష్టవ్యంజనానురంజనమైన అర్థానికీ మధ్య నిత్య నవ్యమైన రాగభావం. ఆ భావం శృంగారం. ఆ శబ్దార్థబంధంలోని వ్యంజనం సౌందర్యం. వివక్షితా వివక్షిత ధ్వని మూలమైన

సౌందర్యం ఆస్వాదస్థితి నందినపుడు రసంగా పర్యవ సిస్తుంది.రసపర్యవసస్థితి మాధుర్యం. అది అద్వైతస్థితి వంటిది. అప్పుడు రసరామణీయకాలకు రస్యమాన మైన ద్రవస్థితి ఏర్పడి, నీరక్షీరన్యాయంగా ఐక్యత ఘటిల్లి, సహృదయ హృదయానికి మధురానుభూతి కలుగుతుంది. ఇదే రాయప్రోలు వారి రమ్యాలోకం సాధించిన మాధురీదర్శన నవనీతం.[60] రమ్యాలోకం సిద్ధాంత వివేచనాన్ని వ్యక్తీకరించే ప్రణాళికాగ్రంథం; అభినవ కవిత్వతత్త్వ నిరూపణకు తోడ్పడే వివేచనల విలువలను సూక్తి సుందరంగా, సమన్వయ సమన్వి తంగా, వృత్తి సహితంగా ప్రతిపాదించిన కావ్య లక్షణం. మాధురీ దర్శనం (1949) ఒక సిద్ధాంత తత్త్వాన్ని సాంగంగా నిర్వహించిన పద్యమయ సిద్ధాంతగ్రంథం. రాయప్రోలువారి మాధురీదర్శనం సాహితీ జగత్తుకు కలిగించిన నూత్న చైతన్యాన్ని సప్తపర్ణిగా సంభావించవచ్చు. దాని పర్ణవిన్యాసం ఇది:

1. ప్రకృతి మీది రక్తి.
2. అంతఃకరణ ప్రవృత్తిపై ఆసక్తి.
3. రచనలో రమ్యమైన రమణీయార్థాభివ్యక్తి.
4. శబ్దార్థబంధాలలో గమ్యమైన వ్యంజనావృత్తి.
5. స్థాయిగా స్నేహ ప్రవృత్తి.
6. రసంగా ఆత్మచిచ్చైతన్య ప్రేమశక్తి.
7. అనుభూతిగా మాధురీ దర్శన భుక్తి.

ఆధునిక యుగంలో విమర్శలు, పరిశోధనలు కొన్ని వినూత్న దృక్పథాలను, సిద్ధాంతాలను, లక్షణా లను ప్రతిపాదించి ఉండవచ్చు. కాని, దర్శనమూల మైన సాహితీ ప్రస్థానాన్ని సిద్ధాంత గ్రంథంగా వెలార్చిన గౌరవం రాయప్రోలుకే దక్కింది. ధ్వన్యా లోకం ఒకనాటి సృజనాత్మక తత్త్వ సిద్ధాంత దర్శన గ్రంథం. మాధురీ దర్శనం ఈ శతాబ్దంలో వెలుపడిన సిద్ధాంత దర్శన గ్రంథం. అందువలన 20 వ శతాబ్ది పూర్వార్ధాన్ని పరిశోధన చరిత్రలో రాయప్రోలు యుగం అనటం న్యాయం; సమంజసం.

రాయప్రోలు యుగందాకా పరిశోధన సాధించిన ప్రగతిని ఒక్కసారి సింహావలోకనం చేస్తే మనకు అయిదు దశలు గోచరిస్తాయి. వాటిని ఇలా పేర్కొన వచ్చు:

1. సమాచార సామగ్రి సేకరణ దశ (Collection of information and material). ఈ దశకు దోహదం చేసినవారిగా మెకంజీని, అతని పండితులను ప్రధానంగా పేర్కొ నాలి.

2. పరిశీలన విధాన సాధన దశ (Process of investigation). ఈ దశకు వన్నెచిన్నెలు దిద్ది బాటలను వేసిన వారిలో బ్రౌనును, అతని పండి తులకు, సమకాలీనులను ముఖ్యంగా పరిగణించాలి.

3. సమన్వయ వైఖరీ ప్రవర్తన దశ (Modes of interpretation). ఈ దశకు రూపురేకలు దిద్దింది వీరేశలింగ యుగం.

4. అనుశీలన మార్గాన్వేషణ దశ (Methods of evaluation). ఈ దశ విమర్శ పరిధిలో సాగింది. కావ్యానుశీలన యుగ ప్రవృత్తిని ఈ దశలో పరిగణించాలి. కట్టమంచి, రాళ్లపల్లి, విశ్వనాథ మొద లైనవా రీశాఖను పోషించారు.

5. సిద్ధాంత ప్రతిపాదన దశ (Innovo-tion to Aesthetic theory). ఈ దశ రాయప్రోలు మాధురీ దర్శనంలో కనపడుతుంది.

సాహిత్యంలో ప్రతి ప్రక్రియా ఒక పరిణతి సాధించాలంటే కొన్ని వికాస దశలను పొందక తప్పదు. ఆ దశలకు ప్రేరణ శక్తులు, సాధన శక్తులు కూడా ఉంటాయి. అవి ఒక్కొక్కసారి వ్యక్తులు కావచ్చు, సంస్థలు కావచ్చు. ప్రగతి సాధనకు వ్యక్తుల

60. చూడు: వివరాలకు అభినవలోచనం (1983)లోని వ్యాసాలు-రాయప్రోలు సుబ్బారావు, రాయప్రోలు వారి మాధురీ దర్శనం-జి. సుబ్రహ్మణ్యం-యువ భారతి ప్రచురణ.

సాధన; పరిస్థితుల ప్రేరణ కలిసి రావాలి. తెలుగు సాహిత్య రంగంలో పాశ్చాత్య ప్రభావంతో మొదలైన పరిశోధన ప్రవృత్తి సహజ పరిణామ దశా విస్ఫూర్తిని వెలార్చి ప్రక్రియాగౌరవాన్ని పొంది, సత్ఫలితాలను సాధింప గలదనే దృఢమైన విశ్వాసం 20 వ శతాబ్ది పూర్వార్ధ చరిత్ర మనకు కలిగించింది. ఇప్పటికి పరిశోధన బాల్య దశను దాటి యౌవన దశలో అడుగు పెట్టినట్లు భావించవచ్చు. ఇక పరిశోధన విలాసం విశ్వవిద్యాలయ రంగం మీద ప్రదర్శిత మౌతుంది.

4

విశ్వవిద్యాలయాలలో తెలుగు సాహిత్య పరిశోధన క్రీ.శ. 1950 సం॥ తరువాతనే విశేషంగా ప్రారంభమైంది. ఆ మాటకు వస్తే - అసలు భారత దేశంలోనే విశ్వవిద్యాలయాలలో కళలకు, చరిత్రలకు, తత్త్వశాస్త్రానికీ,సాహిత్యానికీ సంబంధించిన పరిశోధన విశేషంగా జరుగవలసి ఉందని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ కమీషన్ నివేదిక (1949) స్పష్టం చేసింది. "Universities are responsible as much for extending the boundaries of knowledge as for the training of the citizens : in fact, the advancement of knowledge is a necessary condition of their continued vitality of their teaching, for unless a study is rooted in research, it will die. Although the argument for research must rest upon the broad basis of its value in the intellectual progress of mankind, in India research has become a practical necessity for the continued progressive growth for our national life - in a critical appraisal and conservation of the best in our ancient indigenous culture (arts, history, Philosophy and literature)as well as in modernizing and improving our agriclture, industries and public health."[61] ఈ మాటల వలన విశ్వవిద్యాలయాంకు పరిశోధనపట్ల ఉండే బాధ్యతయే కాకుండా, హ్యూమానిటిక్స్‌లో పరిశోధన జరుగ వలసిన అవసరం 20 వ శతాబ్ది ఉత్తరార్ధ ప్రారంభంలో ఎంతో ఉందని స్పష్టమౌతున్నది.

విశ్వవిద్యాలయాలంటే పరిపాలన కాదు; భవనాలు కావు; అందులో పనిచేసే ఆచార్యులు, విద్యార్జనచేసే విద్యార్థులు - వారు సాధించే విజ్ఞాన ఫలితాలు. పరిశోధన ప్రగతి వీటిమీదనే ఆధారపడి ఉంటుంది. అధ్యాపకులైన విశ్వవిద్యాలయాచార్యుల బాధ్యతను గురించి కమీషన్ ఇలా పేర్కొన్నది: "They (University teachers) should give the community,....punctuality, efficiency and devotion to duty in relation to their teaching work, and the germs of new ideas and newer methods in relation to their research work. They should not only impart existing knowledge, but should be, in a real sense, creators of new knowledge."[62] దీనివలన విశ్వవిద్యాలయాచార్యుల కందరికీ పరిశోధన వారి బాధ్యతలలో ఒకటిగా పరిగణింపబడింది. దానితోపాటు దేశంలో పరిశోధకుల సంఖ్య పెరిగేటట్లు చూడాలని, దానికి తగిన పరిశోధన విభాగాలు వివిధ విశ్వవిద్యాలయా

61. The Report of the University Education Commission - (Dec. 1948-Aug. 1949).Vol I., G.O. I. (1949). P. 140.
62. R.O.U.E.C. (1949). పు. 152

లలో ఏర్పాటు కావాలనీ కమీషన్ సూచించింది. "A few distinguished research workers in a large country like ours are not enough; we should not only have a large number of them but should raise the general average quality and quantity of research at all the universities."[63] కమీషన్ అభిప్రాయంలో 'మంది ఎక్కువైతే మజ్జిగ పల్చబడుతుంది' అన్న సామెత పరిశోధన రంగంలో నిజం కాకూడదని స్పష్టమౌతున్నది. ఉత్తమ పరిశోధన ఉత్తమ ప్రమాణాల మీద ఆధారపడి ఉంటుంది; దాన్ని నిర్వహించే పరిశోధకులు, పర్యవేక్షించే ఆచార్యులు ఆ ప్రమాణాలకు పరిరక్షకులు. ఈ అంశాలను గురించి కమీషన్ పేర్కొన్న విశేషాలు విలువైనవి.

1. "It is a specialised form of intellectual life for which carefully selected students should be given training in the methods and principles of research. They must not be mere compilers, chroniclers or technicians, but scholars and scientists who pocess breadth of vision, imagination and ability to assimilate and integrate facts and communicate their findings."

2. "He (Ph.D., Student) should not take up a vague subject : it should be definite enough to make him concentrate and significant enough to deepen and extend his general knowledge. His investigations should include wide reading, critical appraisal of material and reflection essential to intellectual progress."

3. "The candidate should show ability to study a problem systematically and to relate his results to the general body of the subject. He should present a thesis embodying his original contribution to the knowledge set forth in such a manner as to be fit and ready for publication.

4. "The supervisor,.....should be a specialist in the subject and a sucessful researcher."[64]

ఇటువంటి పరిశోధన వ్యవస్థతో విశ్వవిద్యాలయాలలో పరిశోధన 1950 తరువాత విస్తరించింది. మదరాసు, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలు తెలుగులో పరిశోధనను మొదలుపెట్టాయి. "The university is a first - rate place for studying literature, but at best a second-rate place for producing it"[65] అన్న Northrop Frye మాటలు నిజమనిపించాయి.

విశ్వవిద్యాలయాలు, అందులో తెలుగుశాఖలు పని చేయటం ప్రారంభించినతరువాత పండితులలో మూడు బలమైన సంకల్పాలు ఏర్పడ్డాయి. అవి 1. తెలుగు సాహిత్యానికి సమగ్రమైన చరిత్ర నిర్మింపబడాలి. 2. తెలుగుభాషకు చారిత్రక వర్ణనాత్మక వ్యాకరణాలు వ్రాయబడాలి. 3. తెలుగులో సమగ్రమైన నిఘంటువు

63. Ibid., పు. 147
64. R.O.U.E.C. (1949) పు. 148-149.
65. In search of Literary Theory (1976) పు. 185.

ఏర్పడాలి. ఈ మూడు లక్ష్యాలను ముందుంచుకొని తెలుగుశాఖలు పరిశోధనరంగంలో కృషి ప్రారంభించి నట్లుగా స్పష్టమౌతుంది. వాటిలో సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణయత్నం సాహిత్యపరిశోధన సమీక్షలో ప్రస్తుతం అవుతుంది. నిజానికి ఇటువంటి యత్నం క్రీ.శ. 20 వ శతాబ్ది పూర్వార్థంలోనే ప్రారంభమ యింది. ''1938 వ సం॥న ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్య క్షులుగా నున్నప్పుడు విపులమైన ఆంధ్ర వాఙ్మయ చరిత్రను వ్రాయించుటకై యొక ప్రణాళికను తయారు చేసి రెండు సంవత్సరములు గడువు నిచ్చి, వేయి రూపాయలు పారితోషికమిచ్చునట్లుగా ప్రకటించిరి. 1940 సంవత్సరములో తిరుపతిలో జరిగిన దశమ సకల భారత ప్రాచ్య విద్యాసమావేశమున ద్రావిడ శాఖాధ్యక్షులుకూడ నట్టి సమగ్రమైన విపులాంధ్ర వాఙ్మయ చరిత్ర రచనావశ్యకతను గూర్చి యుగ్గ డించిరి. అంతకుపూర్వము ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహములు రెండుమూడు కలవు. అవియన్నియు అసమగ్రములు, అసంతృప్తికరములుగ నుండుట చేతనే ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు విపులమైన సమగ్రవాఙ్మయ చరిత్ర రచనకు ప్రకటించినారు. అప్పుడుకాని తర్వాతకాని యట్టి సమగ్ర రచనకు నెవరును వ్రాయ ప్రయత్నింపలేదు. 1950 వరకు దానికి ప్రయత్నించినవారే లేరు.''[66]

మదరాసు విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖ పరిశోధనకే పూర్తిగా అంకితమైనది. అనుబంధ కళాశాలలో మాత్రమే బోధన సాగుతుంది. అందు వలన ఆ శాఖలో పరిశోధనయే ప్రవృత్తిగా ఉన్నది కాబట్టి శాఖాధ్యక్షులు ప్రధానంగా ఆంధ్ర సాహిత్య చరిత్ర నిర్మాణానికి అనువైన ప్రణాళికలనే చేపట్టి నిర్వహించటం గమనింపదగిన అంశం. విశ్వవిద్యా లయాలవా రిచ్చే డాక్టరేట్ బిరుదం లేకపోయినా 'పరిశోధన పరమేశ్వరులు'గా ప్రసిద్ధి గాంచిన నిడద వోలు వెంకటరావుగారు ''శాసన పద్య కవులను గూడ చేర్చి 'ఆంధ్ర కవుల చరిత్ర' అను పేరుతో ప్రారంభము నుండి తిక్కన వరకు గల కవుల చరిత్రను రచింపగా మద్రాసు విశ్వకళా పరిషత్తు వారు దానిని 1951 లో ప్రచురించిరి. దక్షిణాంధ్ర వాఙ్మయమను పేరుతో తంజావూరు, మధుర మొద లైన దక్షిణ సంస్థానములందు వెలసిన యాంధ్ర కవుల చరిత్రను రచింపగా మద్రాసు విశ్వకళా పరిషత్తు వారు దానిని 1955 ప్రాంతమున ప్రచు రించిరి.''[67]

విశ్వవిద్యాలయాల పరిశోధన ప్రణాళికకు సంబంధించకపోయినా సాహిత్య చరిత్ర నిర్మాణ యజ్ఞంలో ఋత్విజులుగా కృషి చేసిన వారెందరో మహానుభావులున్నారు. ఒకవిధంగా ఈ యత్నం కవుల చరిత్రల రూపంగా ప్రారంభమై వాఙ్మయ చరిత్రల రూపంగా పరిణతి పొందింది. వీరేశలింగ యుగంలో గురజాడ రామమూర్తి గారి కవి జీవి తములు (1875 ప్రాంతం), కందుకూరి వీరేశ లింగం పంతులుగారి 'ఆంధ్ర కవుల చరిత్రము' (1867) చాగంటి శేషయ్యగారి 'ఆంధ్ర కవి తరంగిణి' (1947 నుంచి ప్రారంభించి) 13 సంపు టాలు, టేకుమళ్ల అచ్యుతరావుగారు మొదలు పెట్టిన పూర్వాంధ్ర కవుల చరిత్ర మొదలైనవి కవుల చరిత్ర నిర్మాణానికి చేసిన విలువైన యత్నాలు. వీటికి అనుబంధంగా 19 వ శతాబ్దికి చెందిన రచయి తల సాహితీ వ్యక్తిత్వాలను వాఙ్మయ చిత్రాలుగా రూపొందించిన మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి 'ఆంధ్ర రచయితలు' (1950) ప్రత్యేకంగా పేర్కొనదగింది. కాని, కవుల చరిత్రలు, పరిచయాలు వాఙ్మయ చరిత్రలు కాలేవు. వాటికి ఉపకరించే విలువైన సామగ్రి గ్రంథాలు మాత్రమే కాగలవు.

66. శిష్టా రామకృష్ణశాస్త్రి-మద్రాసు విశ్వకళాపరిషత్తు-తెలుగు పరిశోధన (వ్యా) మహతి (1972). యువ భారతి ప్రచురణ. పు. 257.
67. మహతి (1972). పు. 258.

'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' మనే పేరుతో వంగూరు సుబ్బారావుగారు సాహిత్య చరిత్ర నిర్మాణానికి ఒక క్రొత్త పుంత చూపించారు. 1920 లో మొదట ఈ గ్రంథం ప్రచురింపబడి, 1957 లో పరిష్కరింపబడింది. వాఙ్మయ పరిణామ పరిశీలనంతోపాటు ఆ పరిణామ వికాసానికి దేశ కాల భాషా మత రాజకీయాది పరిస్థితులు ఎలా దోహదం చేశాయో వివరించే ప్రయత్నాన్ని చేసి, ఆ రంగంలో ఒక అడుగు ముందుకు వేశారు సుబ్బారావుగారు. 1928లో ప్రచురింపబడిన 'వాఙ్మయ చరిత్ర సంగ్రహము' విలువైనది. దాని రచయిత 'కవిత్వవేది' (కల్లూరి వేంకట నారాయణరావు). ఈ గ్రంథ రచనలో రచయిత పాటించిన విభాగం సమన్వయాత్మకంగా ఉంది. ప్రాచీన కవిత్వం (క్రీ.పూ.28-క్రీ.వె.1000), పురాణ కవిత (1000-1380), కావ్యప్రబంధ కవిత్వము (1380-1650), అర్వాచీన కవిత (1650-1875), నవ్యకవిత (1900-) అనే స్థూలమైన విభాగం కవిత్వ స్వభావాన్నిబట్టి చేసింది. రచయిత వాటిని ఖండాలని పేర్కొన్నాడు. అంతర్విభాగాలలో సంఘ చరిత్ర, వాఙ్మయ చరిత్ర, కావ్య విమర్శ, యుగలక్షణ సమన్వయం - అనే అంశాలను తీసికొని విశ్లేషణాత్మకంగా వివేచనాత్మకంగా రచన చేశారు. వీరేకాక మరెందరో మహానుభావులు సంగ్రహ సాహిత్య వాఙ్మయ చరిత్రలు వ్రాశారు. ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో వచ్చిన వాఙ్మయ చరిత్రలలో "నవ్యాంధ్ర సాహిత్య వీధులు" (1942 – 51) (కురుగంటి, పిల్లలమఱ్ఱి), 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వం' మొదటి భాగం (శిష్టా రామకృష్ణశాస్త్రి) (1956), 'సమగ్రాంధ్ర సాహిత్యం' (12 సంపుటాలు) (ఆరుద్ర), History of Telugu literature (ఆంగ్లం), (గిడుగు సీతాపతి), 'ఆంధ్ర సాహిత్య చరిత్ర' (మొదటి సంపుటం) (పింగళి) పేర్కొనదగినవి. అయినా, ఇవి అసమగ్రాలే. వాఙ్మయ చరిత్ర సంతతినీ పరిశోధన అనలేమేమో! కాని, పరిశోధనాంశాలను గ్రహించి సమన్వయాత్మకంగా వ్యక్తీకరించిన చరిత్ర రచన అని అనగలం- లేదా - క్రొత్త సామగ్రిని సేకరించి సరిక్రొత్తవైన కొన్ని అంశాలతో వివరించిన చరిత్ర రచనం అనగలం. అయినా, చరిత్ర రచనలో చారిత్రకాంశాలతో పాటు ఆయా యుగాల సాహిత్యాల, ప్రక్రియల, పరిణామాల చరిత్రను సమీక్షించేటప్పుడు సాహిత్యాధ్యయనానికి అనువైన పరిశీలనలను అందించినప్పుడు సాహిత్య చరిత్ర కూడా పరిశోధనగానే పరిగణింపబడుతుంది.

అయితే సమగ్ర సాహిత్య చరిత్ర రచనం ఒక బృహత్ప్రణాళిక. ఒకవ్యక్తి చేయగలిగింది కూడ కాదు. సంస్థలు చేపట్టవలసింది. పలువురు పండితులు పలురంగాలలో కృషిచేసి పలురకాలైన సామగ్రిని సేకరించి, వాటిని సమన్వయించి, చారిత్రక అవగాహనతో సంపుటీకరింపవలసిన సంశ్లిష్ట కృషి. ఈ పరిశ్రమలో మూడు ముఖ్యమైన ప్రవృత్తులు ఇమిడి ఉన్నాయి. 1. నూత్న సామగ్రి సేకరణ ప్రవృత్తి. 2. నూత్న సమన్వయ సాధన ప్రవృత్తి. 3. వ్యవస్థీకృత సంవిధాన ప్రవృత్తి. ఆంధ్ర భారతి అదృష్ట వశాత్తు సమకాలీనంగా సమాజంలో ఉన్న సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణాకాంక్షకు ప్రాతినిధ్యం వహించేటట్లు, మూడు ప్రవృత్తులకూ ముచ్చటైన ప్రతీకలుగా నిలిచినట్లు మద్రాసు, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు తెలుగు పరిశోధన రంగానికి దర్శకత్వం నిర్వహించే అవకాశం దొరికింది. వారే నిడదవోలు వెంకటరావు, పింగళి లక్ష్మీకాంతం, ఖండవల్లి లక్ష్మీరంజనంగారలు. ప్రతి పత్తికి ఈ ముగ్గురూ ముగ్గురు వ్యక్తులు, కానీ పరిశోధన చరిత్రలో ఈ ముగ్గురూ మూడు ప్రవృత్తులు.

ఈ ముగ్గురూ సాహిత్య చరిత్ర నిర్మాణ లక్ష్యంతో కృషి చేసినవారే. అయితే నిడదవోలు వారు ప్రధానంగా చరిత్ర రచనంలో కంటె చరిత్రకు కావలిసిన సామగ్రిని సేకరించి (Collection of

material), విశ్లేషించి (analysis), పరిశీలించి (scrutiry) ఫలితాంశాలను ప్రకటించే పద్ధతిలో పరిణతిని ప్రదర్శించిన పరిశోధకులు. పింగళివారు స్వయంగా సాహిత్య చరిత్రను కావ్యానుశీలనమును విద్యార్థులకు బోధించేవారు. యుగవిభాగం, ప్రక్రియా స్వభావం, కావ్యవైలక్షణ్యం, కవితాసౌందర్యం అనే అంశాలకు ప్రాధాన్యమిస్తూ వారు పరిశోధనలో కావ్యానుశీలనం (evaluation of a work of art) చేసే పద్ధతిని రూపొందించి, పరిశోధన సామగ్రిని సంయోజించి (synthesis), సమన్వయించే (Interpretation) మార్గాన్ని ప్రవర్తింపజేశారు.ఖండవల్లివారు వస్తుతః సాహిత్యాధ్యయన ప్రియులు. విజ్ఞాన సరస్వనిర్మాణంఆయన ధ్యేయం;చారిత్రకదృష్టిఆయన స్వభావం; ఆ రెండు లక్షణాలూ సాహిత్య చరిత్ర రచనలో ప్రతిఫలించాయి. కొమర్రాజు, మల్లంపల్లి, విశ్వనాథ విమర్శ ప్రవృత్తులు ఖండవల్లి వారిలో త్రివేణీ సంగమంలా సంవదించాయి. వీరి పరిశోధన దృక్పథంలో సామగ్రి సేకరణం కంటె, సమన్వయం ముఖ్యం; దానికంటె కూడ వ్యవస్థీకృత సిద్ధాంత వ్యాస సంవిధానం ముఖ్యం. నేను ఇలా అనుకుంటుండేవాణ్ణి - విశ్వవిద్యాలయాలలో జరిగే పరిశోధన జగత్తుకు పింగళివారు బ్రహ్మకల్పులు; ఖండవల్లివారు విష్ణు సదృశులు. నిడదవోలు వారు పరమేశ్వరప్రాయులు. ఈ ముగ్గురికీ పిహెచ్.డి. డిగ్రీలు లేవు. కాని, ఎందరికో ఆ డిగ్రీలు వచ్చే పరిశోధన మార్గాన్ని విశ్వకళా పరిషత్తులలో వెలయింపజేశారు. "All this research activity was due to the hard work and enthusiam of a few university professors, who had to work with megre grants, insufficient equipment and inadequate library facilities-"[68] అని రాధాకృష్ణ పండితుని కమిషన్ ప్రశంసించిన పండిత పరిశోధకులకోవకు చెందిన దీ ఆచార్యత్రయం.

నిడదవోలు వారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారానికి సన్నిహితులుగా ఉండటంతో ఆకరద్రవ్యాలను సేకరించి సాహిత్య చరిత్రలో కుప్పలు పోశారు. పింగళి వారు ప్రధానంగా విమర్శకుడు, భావుకుడు. ఆయన పరిశోధన కవితాసిద్ధాంతాన్ని ఎక్కువగా దర్శించేది. లక్ష్మీరంజనం గారు విమర్శక పరిశోధకుడు. ఈ ముగ్గురిలో పింగళి వారికి సన్నిహితులు ఖండవల్లి వారు. వీరి ముగ్గురిలో ఎంత పొట్టివారో అంత పొడుగువారు ఖండవల్లి వారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రారంభింపబడిన పరిశోధన ఒక ప్రణాళిక ననుసరించి సాగినట్లుగా సమీక్షకులకు స్పష్టం కాగలదు. తెలుగులో సాహిత్య చరిత్ర నిర్మాణ లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకొని తొలినాళ్ళల్లో పరిశోధన విషయాలను ఎంపిక చేసినట్లు తోస్తుంది. ఆ ఎంపికలో సాహిత్య ప్రక్రియలకూ, యుగాలకూ, భాషా చారిత్రక సాంస్కృతికాంశాలకూ ప్రాధాన్యం ఇవ్వటం జరిగింది. ఇటువంటి యత్నం ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో జరిగినా అక్కడికంటె విస్తృతంగా సుసంఘటితంగా, సు వ్యవస్థితంగా ఉస్మానియాలో జరిగిందని చెప్పవచ్చు. జానపద సాహిత్యం, ప్రాఙ్నన్నయ యుగం, కవిత్రయ యుగం, శ్రీనాథ యుగం, ప్రబంధ యుగం, దక్షిణాంధ్ర యుగం, ఆధునిక యుగం, నాటక ప్రక్రియ, శతక ప్రక్రియ, నవలాసాహిత్యం-ఇలా పరిశోధనాంశాలు ఇవ్వబడినాయి మొదట. ఆ తరువాత ప్రసిద్ధకవుల కావ్యాల పరిశోధనం సాగింది. ఆ తరువాత నిర్దిష్టమైన అంశాలపై పరిశోధన సాగింపబడింది. చారిత్రక భాషా సాంస్కృతికాధ్యయనం అనుబంధంగా సాగింది. ఈ విభాగం ఈ శాఖలో జరిగిన పరిశోధన ప్రణాళికను విశ్లేషణ దృష్టితో వివేచిస్తే విమర్శకులకు ప్రత్యక్షమౌతుంది. ఈ బృహత్ప్రణాళికకు రూపకల్పనం

---

68. R.O.U.E.C. (1949); పు. 145.

చేసిన గౌరవం ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి దనటంలో సంశయం లేదు. పరిశోధన వ్యాసానికే ప్రమాణిక ప్రాణం. ఇక విశ్వవిద్యాలయ పరిశోధన జీవితానికి ఎంతటి వ్యూహం కావాలి? ఆ వ్యూహ స్ఫూర్తి ఖండవల్లివారి పరిశోధన దర్శకత్వంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రూపుకట్టింది.[69]

ఈ సంగతి 20వ శతాబ్ది ఉత్తరార్ధంలో మొదటి పది పదిహేనేళ్లలో పిహెచ్.డి.,డిగ్రీలు వచ్చిన సిద్ధాంత వ్యాసాలను సమీక్షిస్తే స్పష్టమవుతుంది. క్రీ. శ. 1945 లో డా॥ కె.వి.ఆర్. నరసింహంగారు 'ఆంధ్ర ప్రబంధము-అవతరణ వికాసములు' అను అంశంపై పిహెచ్.డి., పట్టాన్ని పొందారు. విశ్వ విద్యాలయాలలో జరిగిన సాహిత్య పరిశోధన 1956 వ సంవత్సరంలో మొదటి ముందడుగు వేసింది. ఆ సంవత్సరంలో డా॥ బి. రామరాజుగారు 'తెలుగు జానపద గేయ సాహిత్యము' అనే అంశం మీద, డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అనే అంశం మీదా పిహెచ్.డి., పట్టాలను క్రమంగా ఉస్మానియా, ఆంధ్ర విశ్వవిద్యాలయాలనుంచి పొందారు. అదే యేడు జి.యన్. రెడ్డిగారు 'తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం-అనువాదాలు-అనుసరణలు' అనే అంశం మీద మద్రాసు వి. నుంచి ఎం.లిట్., పట్టాన్ని పొందారు. ఉస్మానియా - విస్మృత వాఙ్మయమైన జానపద సాహిత్యం మీద పరిశోధన మొదలు పెడితే, ఆంధ్ర- ప్రభావపరిశీలనకు అంకురారోపణం చేసింది. ఉస్మానియాలో ఆ తరువాత క్రమంగా ప్రాఙ్నన్నయ యుగం మీదా, ప్రబంధ వాఙ్మయం మీదా, తెలుగు నాటక వికాసం మీదా, ఆంధ్ర నవలా పరిణామం మీదా, ఆంధ్ర వచన వాఙ్మయం మీదా, ఆంధ్ర శతక వాఙ్మయం మీదా పరిశోధన జరిగి 1965 నాటికి పరిశోధకులకు పిహెచ్.డి. పట్టాలు వచ్చాయి. అప్పటికి ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర', 'తెలుగులో స్థల పురాణాలు' అనే అంశాలమీద డాక్టరేట్ డిగ్రీలు పరిశోధకులు పొందారు. అంటే 1965 నాటికి సాహిత్య యుగాల మీదా ప్రక్రియల మీదా ఉస్మానియాలో 8 పిహెచ్.డి. డిగ్రీలు వస్తే, ఆంధ్రలో 3 డిగ్రీలు ఇచ్చారుయన్నమాట. మొదటి దశాబ్దిలో (1956-1965) పరిశోధన ప్రధానంగా ప్రక్రియలమీద సాగిందని స్పష్టమౌతున్నది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలన్నీ కాలక్రమ పద్ధతిలో వ్రాయబడినవే. అందువలననే అవి యుగ విభజనం మీద ఆధారపడి, చారిత్రక పద్ధతి ననుసరించి వెలువడినవి. కాని, సాహిత్య వ్యక్తిత్వాన్ని వెలార్చే ప్రక్రియల పుట్టుపూర్వోత్తరాలను, పరిణామాలను, ప్రభావాలను, ప్రయోగ విశేషాలను పరిశీలించే పరిశోధనలు వెలువడినప్పుడు, సాహిత్యచరిత్ర స్థితగతినిగాక, పరిణామగతిని కార్యకారణబద్ధంగా నిరూపింపగలుగుతుంది. చరిత్రలో సవిమర్శక చారిత్రక అధ్యయనం ప్రతిబింబించాలి; చరిత్ర తత్త్వం వ్యక్తీకరింప బడాలి. ఈ రెండింటినీ సాధించటానికి ప్రక్రియాపరమైన పరిశోధనం ఉపయోగపడుతుం దని ఆధునికులు భావిస్తున్నారు. "It has been argued on the one hand that to write a critical history is impossible,......and on the other that a history without a philosophy of history is mere chronicle. Both contentions have force. The answer would appear to be that the history of Elizabethan tragedy can be written in terms of the development

---

69. వివరాలకు చూడు : జి. వి. సుబ్రహ్మణ్యం - 'ఉస్మానియా విశ్వవిద్యాలయము - తెలుగుశాఖ' (వ్యా.) - వివేచన (ఉ. వి. పరిశోధన పత్రిక) సం. 1. (డిసెం. 1976).

towards Shakespeare and the decline from him, but that anything like a histoty of tragedy will have to practise a double method, that is define 'tragedy' in common denominator terms and trace in chronicle fashion the links between one period-and-nation tragic school and its successor, but upon this continnum superimpose a sence of critical sequences. The subject of the genre, it is clear, raises central questions for literary history and literary criticism and for their interrelation. It puts, in a specifically literary context, the philosophical questions connecting the relation of the class and the individuals composing it, the one and the many, the nature of universals.''[70] తెలుగులో జరిగిన ప్రకియా పరమైన పరిశోధన వెనుక ఇటువంటి దృక్పథం స్పష్ట మౌతుంది. 'యక్షగాన వాఙ్మయ చరిత్ర' లోని డా॥ యస్వీ జోగారావుగారి ప్రణాళిక, నిర్వహణ, పై సాహిత్య ప్రక్రియా పరిశీలన విధానాన్ని చక్కగా ప్రతిబింబిస్తున్నది. మిగిలినవి కూడా అ బాటనే సాగాయి.

ప్రభావ పరిశీలనానికే కాక, పరిశోధించిన అంశాన్ని సాధికారికంగా ప్రతిపాదించటానికీ, విస్పష్ట మైన విశ్లేషణకూ, విశిష్టమైన వివేచనకూ తెలుగు పరిశోధనలో బాటలు చూపిన సిద్ధాంత గ్రంథం డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారి ''తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము'' 19 వ శతాబ్దికి సంబంధించిన ఏఅంశంమీద పరిశోధన చేసేవారికైనా ఈ గ్రంథం అవశ్యమైన ఆకర గ్రంథం.

'ఆధునిక సాహిత్యం - సంప్రదాయం - ప్రయోగం' అనే డా॥ సి. నారాయణరెడ్డిగారి సిద్ధాంత గ్రంథం - ప్రభావ పరిశీలనమూ, అనుశీల నాత్మక పరిశోధనమూ, ప్రక్రియాపరమైన పరిశోధనలో విలీనం చేసిన విశిష్ట గ్రంథం. సమన్వయాత్మక విమర్శకు ఈ గ్రంథరచనం తెలుగులో వెలుగు బాటలు వేసింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి వెలువడిన ప్రక్రియాపరమైన సిద్ధాంత వ్యాసాలలో అనేకం సామగ్రి సేకరణం చేసి సమన్వయించటంలోనూ, విషయ విశ్లేషణం చేసి వస్తు స్వభావ స్వరూపాలను వ్యక్తీకరించటంలోనూ, కొంతవరకు తులనాత్మకాధ్యయనం చేయటంలోనూ తమ కృషిని కేంద్రీకరించాయి. తెలుగులో ప్రక్రియా పరమైన పరిశోధనం వలన ఆయా ప్రక్రియలలో విలువైన రచనలేవో తెలిశాయి: ప్రక్రియా వికాస పరిశీలనంలో కంటే వాటిని ప్రత్యేకంగా గ్రహించి పరిశీలింప వలసిన అవసరమున్నదనే అంశ స్పష్టమయింది. ప్రతి ఉత్తమ రచనకూ ప్రకృతి సిద్ధంగా ఒక ప్రక్రియాపరమైన లక్షణం ఉంటుంది. దానితోపాటు దాని వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించే అనుబంధ లక్షణాలూ ఎన్నో ఉంటాయి. వాటి నన్నింటినీ ప్రక్రియా వికాస చరిత్రలలో చెప్పటం కష్టం. అందువలన ఒక్కొక్క మహా కావ్యాన్ని తీసికొని పరిశోధించే అవసరం ఏర్పడింది. దాదాపు 1965 నుండి కావ్య పరిశోధనల సంఖ్య పెరగటం మొదలైంది. దానితో పరిశోధనలో రెండు శాఖలూ స్పష్టంగా గోచరించాయి.

''Every great book is unique and it is not easy to say, on first reflection, how its uniqueness is related to its style, its structure,

70. Theory of Literature ( 1978 ). పు. 236-237.

its expressiveness, and its subject''.[71] అన్న Knox C. Hill మాటలు తెలుగులో కావ్య పరిశోధన ప్రవృత్తి వెనుక నున్న దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నవి.

ప్రక్రియా పరమైన పరిశోధనం విశ్లేషణ (analysis) ప్రధానమైంది; కావ్యపరిశోధన అనుశీలన (evaluation) ప్రధానమైంది. తెలుగు, సిద్ధాంత గ్రంథాలలో ఈ భేదం కనపడుతుంది. కాని అనుశీలనం చేయటానికి పరిశోధకునకు సామర్థ్యం కావాలి. పరిశోధకు లందరూ విశ్లేషణ చేసినంతగా సమన్వయం సాధించలేరనీ, ఆపైన వివేచనం, అనుశీలనం సులభంగా నిర్వహించలేరనీ, మనం గ్రహించాలి. పరిశోధకుని అధికారాన్నిబట్టి కావ్యపరిశోధనం ఆయా లక్షణాలతో ప్రధానంగా వెలువడుతూ ఉంటుంది. అట్లని విశ్లేషణ మంటే తక్కువ రకమని భావించరాదు. ''A good analysis ...will make parts intelligible as parts, and will bring about an understanding of the whole as a whole''.[72] ఇంతకంటె పర్ణనాత్మక పరిశోధనలు తక్కువరక మని అనడం న్యాయం.

విశ్లేషణ ప్రధానమైన ప్రక్రియా చరిత్రలు చరిత్రలు విశ్వవిద్యాలయ పరిశోధన పరిధికి ఆవల కూడా రచింపబడినాయి. నిడదవోలు వెంకటరావు గారి 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర' అలాంటిది. ఇది విశ్లేషణం వర్ణనం ప్రధానంగా సాగిన పరిశోధన. దీనిలో కాలక్రమంగా వెలసిన గ్రంథాల పరిచయ మున్నంతగా ప్రక్రియాపరమైన తత్త్వ వివేచనం లేదు. ఒకవేళ తత్త్వ దృష్టితోనే చూస్తే నిడదవోలు వారి గ్రంథమంతా ఒక యెత్తు. ఆ గ్రంథంపై అభిప్రాయంగా వ్రాసిన విశ్వనాథవారి ముందుమాటలు ఒక యెత్తు. తత్త్వోన్ముఖంగా సాగే అనుశీలనం ఆలోచనామృతం.

1975 నాటికి పరిశోధన క్రమంగా శ్రీ వెంకటేశ్వర, బెంగుళూరు, మైసూరు విశ్వవిద్యాలయాల్లోనూ, క్రొత్తగా వెలసిన స్నాతకోత్తర కేంద్రాలలోనూ ప్రారంభమయి, పరిశోధకులు డిగ్రీలు సాధించటం మొదలయింది. పి హెచ్. డి., తో పాటు ఎం.ఫిల్., కోర్సులు కూడా మొదలయ్యాయి. పరిశోధన గ్రంథ నిర్మాణ సూత్రాలను, సాహిత్య సిద్ధాంత ప్రతిపాదన విధానాలనూ పరిశోధక విద్యార్థులకు బోధించటం ప్రారంభమయింది. సుశిక్షితులైన పరిశోధకులను తయారు చేయటానికై పరిశోధనకు పూర్వరంగంగా Research Methodology, Theory of Literature, Broad field కోర్సులు బోధింపబడసాగాయి.సిద్ధాంత గ్రంథ లక్షణ పరిజ్ఞానం వేరు, సిద్ధాంత ప్రతిపాదనం వేరు. లక్షణం శిక్షవలన కలుగుతుంది; సిద్ధాంతం పాండిత్యం వలనా, దర్శన శక్తివలనా సాధ్యమౌతుంది. విశ్వవిద్యాలయాలలో పరిశోధన ఒక విధంగా ఉద్యోగార్హతలలో ఒకటైపోయింది. అందువలన అధ్యాపకులకు ఐచ్ఛికం కాకుండా అత్యవసరమై పోయింది. దానితో పరిశోధన ప్రవృత్తి లేని పండితులు కూడా బలవంతపు మారథాన్లు చేయవలసి వచ్చింది. ఇక విద్యార్థులు కూడా భవిష్యజ్జీవితంలో పరిశోధన పట్టం అత్యవసరమైన విద్యార్హత కావటంచేత ఎం.ఏ. పూర్తి చేసికోగానే పరిశోధనకు పూనుకొనసాగారు. వారిని ఉద్దేశించే M.Phil., కోర్సులు ప్రారంభింపబడినవి. M.Phil., విద్యార్థులు డిగ్రీకోసం సమర్పించే Dissertations ను పరిశోధన వ్యాసాలనీ, Ph.D.,అభ్యర్థులు సమర్పించే థీసిసుల(Theses)ను సిద్ధాంత గ్రంథాలనీ సామాన్యంగా వ్యవహరిస్తున్నారు. Ph.D., తరువాత సంపాదించే డిగ్రీలు కూడా

71. Interpreting Literature (1966)- Introduction. P. 9.

72. Ibid., P. 6.

ఉన్నాయి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వంటివి D.Lit., లను ఇచ్చి పరిశోధకులను ప్రోత్సహిస్తున్నవి. సవిమర్శక పరిశోధన గ్రంథం. ప్రచురింపబడిన దేదైనా ఈ డిగ్రీకి అర్హమని భావింపబడుతున్నది. 1975 నుండి పరిశోధన విద్యార్థులకూ, అధ్యాపక పరిశోధకులకూ యు.జి.సి., వారు ఎన్నో రకాలైన ఫెలోషిప్పులూ, స్కాలర్‌షిప్పులూ, ఆర్థిక సహాయ సదుపాయాలూ కల్పిస్తున్నారు. పూర్వం పరిశోధకులు ఆస్తులు అమ్ముకొని తమ పరిశోధనలను సాగించారు; ఈనాడు అర్హులకు ఆర్థిక సహాయం లభిస్తోంది. ఆనాడు పండితులు తమ సిద్ధాంతవ్యాసం వలన తమ కొక ప్రత్యేకమైన గుర్తింపు, ఒక విశిష్ట ప్రతిపాదనం చేసిన గౌరవ ప్రతిపత్తి కలగాలనే దృష్టితో పరిశోధనలు చేశారు. వారికి ప్రతిఫలాపేక్ష గౌణంగా ఉండేది; ప్రస్తుత పరిశోధన విద్యార్థులు పరిశోధన ముఖ్యంగా డిగ్రీ కొరకనీ, అ తరువాత గుర్తింపు గౌణమనీ సామాన్యంగా భావిస్తున్నారు. పూర్వం పర్యవేక్షకులు నిమిత్తమాత్రంగా ఉండేవారు; ఇప్పుడు వారు మార్గదర్శకులుగా వ్యవహరిస్తున్నారు.

మన విశ్వవిద్యాలయాలలో జరుగుతున్న పరిశోధనను సింహావలోకనం చేస్తే కొన్ని విశేషాలు స్పష్టమౌతాయి. కొందరు కొన్ని ప్రసిద్ధ ప్రవృత్తులకు ఆదర్శ పథాలను వేశారు, ఉదాహరణగా కొన్ని పరిశోధనలను గమనిద్దాం. డా॥ దివాకర్ల వేంకటావధానిగారు తమ సిద్ధాంత గ్రంథంలో నన్నయ అనువాద విధానాన్ని, కవితా వ్యక్తిత్వాన్నీ విశ్లేషణాత్మకంగా, అనుశీలనాత్మకంగా వివరించారు. ప్రాచీన సాహిత్యంలోకాని, ఆధునిక యుగంలోగాని అనువాద కావ్యాలను అనుశీలించే విధానానికి అ పరిశోధన గ్రంథం ఒజ్జబంతిగా నిలుస్తోంది. ఇతిహాస ప్రక్రియను ప్రాచ్య పాశ్చాత్య దృక్పథంతో పరిశీలించి దానిని ఆంధ్రేతిహాసాలకు వర్తించే విధానాన్ని డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారు తమ అనుశీలనాత్మక సిద్ధాంత గ్రంథం- 'తిక్కన కావ్య శిల్పం- తత్వదర్శనం'లో ప్రపంచించారు; అనుశీలనాత్మక తత్త్వదర్శన పరిశోధన కా గ్రంథం చక్కని ఉదాహరణం. అది ఒక బాటను చూపించింది. పురాణ ప్రక్రియానుశీలనాన్ని తెలుగు సాహిత్య పరిశోధనలో అనువర్తింప చేసే విధానానికి డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం రచించిన 'ప్రథమాంధ్రమహాపురాణము-ప్రబంధకథామూలము' అనే సిద్ధాంత గ్రంథం క్రొత్త పుంతలను తెరిచింది. డా॥ బి. రామరాజుగారి 'తెలుగు జానపద గేయ సాహిత్యం' జానపద సాహిత్య పరిశోధనకు వెలుగు బాటగా నిలిచింది. తెలుగులో గ్రంథ పరిష్కార విమర్శకు ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన ఆంధ్ర మహాభారత సంశోధిత ప్రతి ఉత్తమ ప్రమాణాలను సంతరించి పెట్టింది. సాహిత్యంలో సాంఘిక పరిస్థితులను చిత్రించే పరిశోధన గ్రంథాలు ప్రత్యేకంగా కొన్ని ఉన్నాయి. వీటన్నింటికి తొలి పునాదులు వేసి, ప్రస్థాన పద్ధతులను చూపించింది సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర. ఇది విశ్వవిద్యాలయ పరిధిలోకి రాదుకాని,ఆ పరిధిపై బలంగా ప్రభావం వేసింది. ప్రభావ పరిశోధన విధానంలో డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ సి. నారాయణరెడ్డి గారల గ్రంథాలను ప్రత్యేకంగా పేర్కొనాలని ఇదివరకే సూచించటం జరిగింది. అలాగే దేశి ప్రక్రియానుశీలనానికి డా॥ యస్వీ జోగారావు గారు ప్రామాణికమైన పద్ధతిని రూపొందించారు. డా॥ వేటూరి ఆనందమూర్తిగారి 'విజయనగర యుగపు తెలుగు సాహిత్యముపై వైష్ణవ తత్త్వం ప్రభావము' ఈ వరుసలో ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఆ సిద్ధాంత గ్రంథంలోని ప్రధాన భాగాన్ని 'తాళ్ళపాక కవుల కృతులు, వివిధ సాహితీ ప్రక్రియలు' అనే పేరుతో 1974 లో ప్రచురించారు. తాళ్లపాక కవుల సాహిత్య ప్రక్రియల వివేచనం ఇందులోని ప్రత్యేకత.

ఒక కావ్యాన్ని ప్రామాణికంగా అనుశీలించి, ఒక ప్రత్యేక దృక్పథాన్ని ప్రసరించే పరిశోధన మార్గాన్ని డా.జి.వి. కృష్ణరావుగారి 'Studies in

Kalapurnodayam' అనే సిద్ధాంత గ్రంథం ఆవిష్కరించింది. ఒక యుగంలో ఒక ప్రత్యేక వైలక్షణ్యంతో వెలసిన కావ్యాలను అనుశీలించే విధానానికి డా॥ వల్లా దుర్గయ్యగారి సిద్ధాంత గ్రంథం వెలుగు రేకలు ప్రసరించింది. కావ్య విమర్శలో ఛందః శిల్పాన్ని రసానుగుణంగా అనుశీలించే విశిష్ట మార్గానికి డా॥ పాటిబండ మాధవశర్మగారి సిద్ధాంత గ్రంథం క్రొత్త చూపును ప్రసాదించింది. ఇవన్నీ అనుశీలనాత్మక సిద్ధాంత ప్రతిపాదక ప్రధానాలైన పరిశోధన గ్రంథాలని చెప్పవచ్చు.

అలంకార సిద్ధాంతాలను కావ్యాలకు అన్వయించి పరిశీలించే సిద్ధాంత గ్రంథాలు, విశ్వవిద్యాలయాల నుండి వెలువడినాయి. ఇవి దాదాపు 25 కనపడుతున్నాయి. వీటిలో డా॥ మాదిరాజు రంగారావుగారి 'కవిత్రయం-నాచన సోమన-కావ్యానుశీలనం', డా॥ ముకురాల రామారెడ్డిగారి 'తెలుగులో కావ్యాదర్శాలు-పరిణామాలు' అనుశీలనంలో సిద్ధాంత సమన్వయాన్ని రూపుకట్టించినవి; డా॥ యన్. రాధాకృష్ణగారి 'కరుణ రసం - ఆంధ్ర వాఙ్మయం' డా॥ జంధ్యాల జయకృష్ణప్రసాద్ బాపూజీగారి 'శ్రీనాథుని సాహిత్య ప్రస్థానం', డా॥ ఎం.వి.యల్. నరసింహారావుగారి 'నన్నయగారి అక్షర రమ్యత', డా॥ శలాక రఘునాథశర్మగారి 'ఆంధ్ర మహా భారతం-ధ్వని సిద్ధాంత సమన్వయం', డా॥ ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తిగారి 'ఔచిత్య ప్రస్థానం-సూరన కవిత్వం', డా॥ కె. రాజన్నశాస్త్రిగారి 'ధ్వని-మను చరిత్ర', డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి 'రస సిద్ధాంతం - ఆంధ్రుల వరివస్య', డా॥ సర్రాజు లక్ష్మీనరసింహారావుగారి 'ఆంధ్ర మహా భారతం - అలంకార సమీక్ష', డా॥ బి. రుక్మిణిగారి 'నన్నయ భారతంలో ఉపమ; డా॥ బి. సుమతిగారి 'తిక్కన చేసిన మార్పులు, ఔచిత్యపు తీర్పులు', డా॥ జి. హరనాథ్‌గారి 'మహా భారతంలో కరుణ రసం', డా॥ ఎల్లూరి శివారెడ్డిగారి 'ఆంధ్ర మహా భారతంలో రసపోషణ' అనే సిద్ధాంత గ్రంథాలు పూర్వ సిద్ధాంతాలను ఆధారంగా చేసికొని కావ్యాంశాలను సమన్వయించినవి.

ఆధునిక సాహిత్య వివేచనంలో - డా॥ డి. లలిత కుమారిగారి 'ఆధునికాంధ్ర కవితాతత్త్వం', పేర్కొనదగింది. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి 'కవి సమయాలు' సాహిత్యశాస్త్రాంశాన్ని వివరించే సిద్ధాంత గ్రంథం. పరిశోధన వ్యాసాలలో కూడా కొన్ని ఆలంకారిక శాస్త్రాంశాలను సమన్వయించేవి వెలువడినాయి. ఒకవిధంగా ఇటువంటి సిద్ధాంత వ్యాసాలు సమన్వయాత్మక పరిశోధన ప్రవృత్తిని తెలుగులో పోషించాయని చెప్పవచ్చు.

అయితే ప్రాచీనాలంకారిక సిద్ధాంతాలను పునరన్వేషించి, నూత్న సిద్ధాంతాలను, సమన్వయాలను ప్రతిపాదించే ప్రవృత్తిని కొందరు ప్రకటించారు. వారిలో 'ధర్మవీర ఏవ రసానాంరసః' అని ప్రతిపాదించిన డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం రచనలను, హాస్యం అలౌకిక రసం కాదని ప్రతిపాదించి హాస్య భేదాలను విశ్లేషించిన మునిమాణిక్యం నరసింహారావు గారి 'మన హాస్యం', ఛందస్సంబంధులైన అనేక నూత్నాంశాలను వెలికి తెచ్చిన డా॥ గిడుగు సీతాపతి గారి 'తెలుగులో ఛందోరీతులు', అనే గ్రంథాలు పేర్కొనదగినవి. ''Successful revolt against the accepted views results in unexpected and completely different developments becoming a source of new philosophical aspects''.[73] అన్న Einstein and Infeld గారల మాటలు ఇటువంటి పరిశోధన ప్రవృత్తికి ఈ మార్గంలో వెలువడిన గ్రంథాలు ఉత్తేజక సూత్రాలు. ఈ మార్గంలో

73. cf. Methodology and Techniques of Social Research (1979). P. 346.

వెలువడిన గ్రంథాలు సిద్ధాంత దర్శన పరిశోధనల కోవకు చెందుతాయి.

ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతావగాహనతో, సాహిత్య భాషా లక్షణ సూత్రాల సమన్వయ దృక్పథంతో అలంకారిక సూత్రాలను పునర్విమర్శించి పరిశోధించే పద్ధతికి డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద గారి 'వ్యంజన సూత్రం' చక్కని ఉదాహరణం.

వివేచనాత్మక పరిశోధన ప్రవృత్తిని ప్రదర్శించే సిద్ధాంత వ్యాసాలలో సాళ్వ కృష్ణమూర్తి గారి 'పెద్దన కవిత్వ నిర్వచనం, మనుచరిత్ర', డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావుగారి 'అముక్తమాల్యద సౌందర్యం', డా॥ నాయని కృష్ణకుమారిగారి "జానపద గేయ గాథలు', డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'ఈశ్వరార్చన కళాశీలుడు' డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి 'భాగవతానుశీలనం' డా॥ పి. యశోదా రెడ్డిగారి 'తెలుగులో హరి వంశాలు', డా॥ కిళాంబి (వింజమూరి) జ్యోతిర్మయిగారి 'వసుచరిత్ర-ధ్వని శ్లేషల పరిశీలనం', డా॥ కె. సుప్రసన్నాచార్యులవారి 'రామరాజ భూషణుని కృతులు', డా॥ రత్నాకర బాలరాజుగారి 'సీతా రామాంజనేయ సంవాద కావ్యం - సమాలోచనాత్మక పరిశీలన', డా॥ సి. రాధాకృష్ణ శర్మగారి 'తమిళం-తెలుగులలో రామాయణాలు', డా॥ బాడాల రామయ్యగారి 'బసవేశ్వర వచనాలు - సమగ్ర పరిశీలన', డా॥ అరిపిరాల విశ్వంగారి 'ఆధునిక కవిత్వంలోని మానవుడు-ప్రకృతి' డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారి 'పానుగంటి వారి సాహిత్య సృష్టి', డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారి 'తెలుగు వీరగాథా కవిత్వం' డా॥ కె. సంపత్కుమారాచార్యగారి 'ఆధునికాంధ్ర సాహిత్యంలో విమర్శ', మొదలైనవి పేర్కొనదగినవి.

తులనాత్మక పరిశీలన ప్రధానంగా వెలువడిన సిద్ధాంత వ్యాసాలు కూడా ఈ కోవలోకే వస్తాయి. డా॥ గంధం అప్పారావుగారి 'వేమన ; సర్వజ్ఞుడు', డా॥ బయ్యా రత్నావణిగారి 'పంప నన్నయల భారతం' డా॥ జంగా వెంకట సుబ్బరాయుడుగారి 'తెలుగులో ద్విపద రామాయణాలు', డా॥ బయ్యా సూర్యనారాయణగారి 'తెలుగు-హిందీ సాహిత్యాల్లో 19 వ శతాబ్ది వరకు పొందిన గద్య వికాసం', డా॥ కంబాళూరు వేంకటేశ ఆచార్యగారి 'మహాభారతం-పెరుందేవనార్, పంప, నన్నయల తులనాత్మక పరిశీలన' డా॥ కావేరిపాకం సర్వోత్తమన్‌గారి 'దాక్షిణాత్య దేశిచ్ఛందోరీతులు', డా॥ ఆర్.వి.యస్. సుందరం గారి 'తెలుగు కన్నడ జానపద గేయాలు' మొదలైనవి ఈ శాఖను పరిపుష్టం చేసిన సిద్ధాంత గ్రంథాలు.

తులనాత్మక సాహిత్యాధ్యయనం సమగ్ర సాహిత్య చరిత్ర రచననే కాక, ఒక దేశపు సాహిత్య చరిత్రను, విశ్వసాహిత్య చరిత్రను నిర్మించటానికి దోహదకారి అవుతుంది. రెనె వెలెక్ మాటలలో దాని విలువ గమనింపవచ్చు: "Literary history as a synthesis, literary history on a super-national scale, will have to be written again. The study of comparative literature in this sense will make high demands on the linguistic proficiencies of our scholars. It asks for a widening of perspectives, a suppression of local and provincial sentiments, not easy to achieve. Yet literature is one, as art and humanity are one, and in this conception lies the future of historical literary studies."[74]

---

74. Theory of Literature ( 1978 ). P. 50.

మన విశ్వవిద్యాలయాలలో వెలువడుతున్న సిద్ధాంత గ్రంథాలలోనూ, పరిశోధన వ్యాసాలలోనూ దాదాపు సగంపాలు విశ్లేషణాత్మక ప్రధానాలనే చెప్పాలి. సాహిత్యరంగంలో విశ్లేషణ ప్రవృత్తి యాంత్రికం కాదు. పరిశోధకుడు ఒక అంశాన్ని పరిశీలించే దృక్పథం మీద అది ఆధారపడి ఉంటుంది. విశ్లేషణం దృక్పథాన్ని సమర్థించాలి; సమన్వయాన్ని రూపు కట్టించాలి. అందువలన పరిశోధనలో అనుసరించే విశ్లేషణ విధానం నియతం కాదు. అయినా, పరిశోధనలో అది ఆత్మాశ్రయం కూడా కాదు. ఈ అంశాన్ని గురించి Knox C. Hill మాటలు గమనించండి- "Analysis can often take the reader's feelings as its point of departure ... our purpose is to analyse the book, not ourselves. Once we begin this procedurc it is hard to see the end of it, for the effort to account for one's feelings is likely to throw new light on the structure of the book, and this new light will in turn change our feelings......The reader's feelings are determined by the kind of person he is, as well as by the structure of the books he reads. One great value of reading good literature lies in the fact that it teaches us what kind of beings we are''.[75] ఒక్కొక్క సిద్ధాంత గ్రంథంలో ఒక్కొక్క పరిశోధకుడు ఒక్కొక్క విశ్లేషణ పద్ధతిని అనుసరించి సమస్యను పరిశీలించవచ్చు. ఆ విశ్లేషణాన్ని యథాతథంగా తరువాతి వారు అంగీకరించక పోవచ్చును; ఒక్కొక్కసారి అది కొంతకాలం వరకు ప్రామాణికంగా మన్నించబడవచ్చు. విశ్లేషణ అనేది ఒక విధానం; ఆ విధానాన్ని రూపొందించే పద్ధతి పరిశోధకునిది. ఈ దృష్టితో విశ్లేషణాత్మక సిద్ధాంత గ్రంథాలను అనుశీలించాలి. తెలుగులో ఇటువంటివి, ప్రామాణికమైనవి కొన్ని వచ్చాయి. వాటిలో- డా॥ పి.యస్. అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసం' డా॥ కొలకలూరి ఇనాక్ గారి 'తెలుగు వ్యాస పరిణామం', డా॥ ఎం. కులశేఖరరావు గారి 'ఆంధ్ర వచన వాఙ్మయం', డా॥ కె. గోపాలకృష్ణరావు గారి 'ఆంధ్ర శతక వాఙ్మయం', డా॥ పోరంకి దక్షిణామూర్తి గారి 'తెలుగు కథానిక', డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారి 'వ్యాసభారతం - నన్నయ పరిష్కారం', డా॥ మిరియాల రామకృష్ణ గారి 'శ్రీశ్రీ కవిత్వం, వస్తువు- సంవిధానం', డా॥ వెల్చేరు నారాయణరావు గారి 'తెలుగులో కవితా విప్లవాలు', డా॥ ఎస్.వి. రామారావు గారి 'తెలుగులో సాహిత్య విమర్శ', డా॥ తూమాటి దోణప్ప గారి 'హరికథా వాఙ్మయం', డా॥ పి. వి. రమణ గారి 'తెలుగు సాంఘిక నాటకం', డా॥ ముదిగొండ శివప్రసాదు గారి 'ఆధునికాంధ్ర కవిత్వంపై ఉద్యమాల ప్రభావం', డా॥ వి. సీతాకల్యాణి గారి 'తెలుగులో జాతీయ కావ్యాలు', డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారి 'తెలుగులో గేయనాటికలు', డా॥ టి. సుశీల గారి 'ద్విపద వాఙ్మయం' మొదలైనవి పేర్కొనదగినవి. ఈ గ్రంథాలు ఆయా అంశాలను విభజించటంలోనూ, విశ్లేషించటంలోనూ చాలవరకు ప్రామాణికమైన విధానాలను అనుసరించటం ద్వారా పరిశోధకుల వైయక్తికమైన దృక్పథాలకు అతీతంగా ఉండగలిగాయి. ఈ శాఖలోని ఉత్తమ ప్రమాణం అదే.

తెలుగు సిద్ధాంత గ్రంథాలలో వర్ణన ప్రధానమైనవి కూడా బాగా ఉన్నాయి. ఆ మాటకు వస్తే విశ్లేషణ ప్రధానమైన వాటిల్లో కూడా వర్ణనం కొంత చోటు చేసికొన్నది. విశ్లేషణాన్ని ముంచెత్తే [illegible]

75. Interpreting Literature (1966). P. 8.

ణాన్ని మనం వర్ణనం అని అంటున్నాం. ఉదాహరణకు డా॥ బొడ్డపాటి కుటుంబరావుగారి 'ఆంధ్ర నవలా పరిణామం' ఇటువంటి పరిశోధనకు ఉదాహరణంగా పేర్కొనవచ్చు. ఎన్నుకొన్న విషయమే విస్తృతమైనది. అందులో ప్రతి నవలను సమీక్షించేటప్పుడు అందులోని కథను సంగ్రహంగా చెప్పటం, అందులోని వివిధాంశాలను విస్తరించటం మొదలైన పద్ధతులను ప్రవేశపెట్టటం వలన పఠితకు ఫలితార్థం హృదయానికి హత్తుకోదు. ఇటువంటి సిద్ధాంతవ్యాసాల వలననే 'తెలుగు పరిశోధన గ్రంథాలను బండ్లపై ఎత్తుకొని పోవాలి' అనే అపప్రథ కలిగింది, అయితే యుగాలను, ప్రక్రియలను, చరిత్రలను పరిశోధనాంశాలుగా ఎన్నుకొన్నప్పుడు కొంత ఈ బాధ తప్పదు. నవలలమీద, కావ్యాలమీద పరిశోధన చేస్తున్న పరిశోధకులు ఈ శాఖను యథాశక్తి పోషిస్తున్నారు. అయితే పరిశోధన ప్రక్రియలో సుశిక్షితులైన అభ్యర్థులు మాత్రం ఈ బలహీనతకు లోనుకాకుండా జాగ్రత్త పడుతున్నారు. ఈ విషయంలో పర్యవేక్షకుల దృక్పథం కూడా గణనలోనికి వస్తుంది. వారే వర్ణనాత్మక ఫణితిని నిర్దేశిస్తే- పరిశోధక విద్యార్థులకు మార్గాంతరం ఉండదు.

విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలు కొన్ని రంగాలలో వ్యవస్థితమైన పరిశోధనను చేపట్టి పరిశోధక విద్యార్థులచేత ఆయా రంగాలకు సంబంధించిన వివిధాంశాలపై పరిశోధన చేయిస్తూ ఉండే పరిపాటి ఉంది. ఇప్పుడు ఆ విధంగా పనిచేస్తున్న ఆంధ్రశాఖలలో - ఉస్మానియా, ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, కాకతీయ, నాగార్జున, శ్రీ కృష్ణదేవరాయ, మదరాసు, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయాలను పేర్కొనవచ్చు. ఉస్మానియా, జానపద సాహిత్యానికి, గ్రంథ పరిష్కార పరిశోధనకూ ప్రాధాన్యం ఇస్తోంది. ఆంధ్ర-ప్రక్రియాపరమైన సాహిత్యాధ్యయనానికీ, అలంకార శాస్త్రానికీ ప్రాధాన్యం ఇస్తోంది. నాగార్జున, శ్రీ వేంకటేశ్వరలు - భాషాశాస్త్రానికీ, వ్యాకరణానికీ, దేశి ప్రక్రియలకూ మొగ్గుచూపుతున్నవి. కాకతీయ- 19వ శతాబ్ది రచయితల జీవిత వాఙ్మయ విశేష సూచికలకు, ఆధునిక కవిత్వ విమర్శ పద్ధతులకూ ప్రోత్సాహాన్ని అందిస్తున్నది. శ్రీకృష్ణదేవరాయ కావ్యతత్త్వవివేచనకూ, మదరాసు తులనాత్మక పరిశీలనకూ, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం సాహిత్య సిద్ధాంత సమన్వయానికీ, తులనాత్మక భాషా సాహిత్యాధ్యయనానికూ ప్రాధాన్యత నిస్తున్నాయి. ఆయా శాఖాధ్యక్షులు, ఆయా శాఖలలో పనిచేస్తున్న అధ్యాపకులూ వారివారి ప్రత్యేక రంగాలకు సంబంధించిన ప్రణాళికలను రూపొందించుకొని పరిశోధన కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఈ వరుసలో బెంగుళూరు, మైసూరు, బెనారసు, మధురై కామరాజు విశ్వవిద్యాలయాంధ్ర శాఖలను కూడా పరిగణించాలి. ఇవి తులనాత్మక భాషా సాహిత్యాధ్యయనాలపై ప్రత్యేకాభిమానాన్ని ప్రకటించటం సహజం. అవి తెలుగు సాహిత్య చరిత్రావగాహనకు ఎంతగానో తోడ్పడగలవు.

వివిధ శాస్త్రాలలో అనుసరింపబడుతున్న పరిశోధన విధానాలను చొప్పించి సాహిత్య పరిశోధనలో ప్రయోగాలు నిర్వహించాలనీ, సామాజిక, ఆర్థిక, తాత్త్విక శాస్త్ర సిద్ధాంతాలనూ, దర్శనాలనూ సాహిత్యానుశీలనానికి సాధనాలుగా అనుసంధించుకోవాలనీ ప్రయత్నాలు ఆధునికంగా సాగుతున్నాయి. ఇవి కూడా పాశ్చాత్య ప్రభావం వలన తెలుగు పరిశోధన అలవరచుకొన్న లక్షణాలే. ఇవి పరిశోధన విధానాల విస్తృతికి తోడ్పడుతున్నాయి. కాని, ఆ విధానాలను విశ్లేషణకు ఉపయోగించుకొన్నంతగా పరిశోధకులు సిద్ధాంతదర్శనానికి ఊతగా గ్రహించటం లేదు. పైన పేర్కొన్న సిద్ధాంతాలు సాహిత్య సంబంధులు కావు. వాటిలో కొన్ని సాహిత్యాన్ని ఒక దృక్పథంతో అనుశీలించటానికి తోడుపడేవే. సాహిత్యేతరమైన సిద్ధాంతం సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నప్పుడు దానికి సాహిత్య తత్త్వ రూపమైన సిద్ధాంత కల్పనం జరుగకపోతే అది సాహిత్యానికి ఆకృతి నిస్తుందే తప్ప ఆత్మను ప్రసా

దింపలేదు. అందువలన ప్రతి భాషావేత్తా, వ్యాకరణ శాస్త్రవేత్తా, సాంఘిక శాస్త్రవేత్తా, తత్త్వశాస్త్రవేత్తా, రాజకీయ శాస్త్రవేత్తా సాహిత్య పరిశోధకుడు కాడు.

సాహిత్య పరిశోధనలో బహిరంగ పరిశీలన పద్ధతులు, అంతరంగ పరిశీలన పద్ధతులు (The extrinsic methods and intrinsic methods) ఉంటాయని పాశ్చాత్యులు వివేచించారు. ఆధునికులు మొదటి వాటికంటె రెండవ వాటిని సాహిత్య పరిశోధనలో ప్రయోగించటం సముచితమని భావిస్తున్నారు. రెనె వెలెక్, ఆస్టిన్ వారెన్ల వివేచనం గమనింపదగింది.

1. "The most widespread and flurishing methods of studying literature concern themselves with its setting, its environment, its external causes. These extrinsic methods are not limited to a study of the past but are equally applicable to present-day literature".

2. "Though the 'extrinsic' study may merely attempt to interpret literature in the light of its social context and its antecedents, in most cases it becomes a 'Casual' explanation, professing to account for literature, to explain it, and finially to reduce it to its origins (the 'fallacy of origins')."

3. "The natural and sensible starting-point of work in literary scholarship is the interpretation, and analysis of the work of literature themselves".

4. "In recent years a healthy reaction has taken place which recognizes that the study of literature should, first and foremost, concentrate on the actual works of art themselves. The old methods of classical rhetoric, poetics or metrics are and must he reviewed and restated in modern terms. New methods based on a survey of the wider range of forms in modern literature are being introduced."[76]

తెలుగు సాహిత్య పరిశోధనలో బహిరంగ పరిశీలన పద్ధతులను ప్రవేశపెట్టి విమర్శించటమే అత్యంత ఆధునికమైన ప్రయోగమని మనం భావిస్తున్నాం. కాని పాశ్చాత్య పరిశోధకులు బహిరంగ పద్ధతుల బలహీనతలను చవిచూచి, అంతరంగ పరిశీలన పద్ధతులను ఆధునికంగా నిర్మించుకొంటున్నారు. ప్రాచీన సాహిత్య సిద్ధాంతాలను పునఃపరిశీలిస్తున్నారు; ఆధునికీకరిస్తున్నారు. పరిభాషను, ప్రవృత్తులను, వ్యాఖ్యానాలను పునర్వ్యవస్థీకరించుకొంటున్నారు. సాహిత్యాన్ని సాహిత్య ప్రమాణాలతోనే అనుశీలించాలనీ, పరిశీలించాలనీ, అదే స్వభావసిద్ధమైన అంతరంగ పరిశీలన విధానమనీ విశ్వసిస్తున్నారు. అయితే, ఇలా ఆలోచించేవారు తెలుగులో కూడా ఉన్నారు. వీరు సంప్రదాయైకబద్ధులు కారు; విప్లవైకనిబద్ధులూ కారు; కాగా - నిర్మాణాత్మకమైన అభ్యుదయాన్ని కోరే సమన్వయశోధన బుద్ధులు వారు.

సాహిత్య పరిశోధన ఆధునిక సాహిత్యోద్యమాలలో ఒకటి. దానిని నిర్వహించే సంస్థలలో విశ్వవిద్యాలయాలు ముందంజ వేస్తున్నవి. కాని, ప్రయో

76. Theory of Literature (1973). P. 73 & 139.

జనం కోసం ప్రమాణాలను కోల్పోకుండా, విస్తృతి కోసం వివేకాన్ని వదలకుండా, పరుగులో పరమార్థాన్ని విస్మరించకుండా, ప్రగతిలో ప్రామాణికత్వాన్ని రక్షించుకొనే బాధ్యత వాటిమీద ఎల్లప్పుడూ ఉంది.

## 5

విశ్వవిద్యాలయ పరిశోధనలస్థాయి నానాటికీ దిగజారి పోతున్నదని ప్రపంచమంతటా విమర్శకులు బాహాటంగానే ప్రకటిస్తున్నారు. అదే నిజమైతే అది ఒక భారత దేశానికే కాదు - అన్ని దేశాలకూ వర్తించేదే. అప్పుడు తెలుగు పరిశోధనకు కూడా వర్తిస్తుంది. తెలుగు పరిశోధనలో ప్రమాణాలు పడిపోతున్నాయని ఈ దేశంలో ఉన్న సంప్రదాయ పండితులూ అంటున్నారు; పాశ్చాత్య దేశాలను దర్శించి వచ్చిన తెలుగు పండితులూ అంటున్నారు. ఇందరంటున్న తరువాత అందులో ఇంతో అంతో నిజం లేకుండా ఉండదు కూడాను.

తెలుగు పరిశోధనల తీరు తెన్నులను గురించి డా॥ వెల్చేరు నారాయణరావుగారు వ్రాసిన వ్యాసం విలువైనది.[77]

అందులోని ముఖ్యాంశాలివి—

1. 'యూనివర్సిటీల పరిశోధన పత్రాలు నిర్దిష్ట ప్రమాణాలు నెలకొల్పలేక పోయాయి.'

2. 'మన విద్వాంసుల పాండితీ చరిత్రను పరిశీలిస్తే మనం ఈ రెండు (సంస్కృతం, ఇంగ్లీషు) భాషా సంప్రదాయాల్ని జీర్ణం చేసికోలేదనీ, కేవలం వాటి పైపై అంశాలను అనుసరించామని తెలుస్తుంది.'

3. 'మనది ఉద్వేగ ప్రధాన ధోరణి. సంస్కృత ముద్ర ఉన్నదంతా మన సొత్తే నని మనకో అస్పష్ట విశ్వాసం ఉండేది. కాలక్రమంలో పాశ్చాత్య సాహిత్యాల్లో ఉన్నదంతా కూడా మన సొత్తే నన్న భ్రమలో పడిపోయి మనల్ని మనం మోసగించుకున్నాం.'

4. 'కొంతమంది గొప్ప పరిశోధకులతో సహా అనేక మంది పరిశోధకులకు రచనా పద్ధతిలో ప్రాథమిక శిక్షణ కూడా లేదు.'

5. 'పదశక్తికి భంగపడటంలోనూ, భావాలను తప్పుగా అర్థం చేసుకోవటంలోనూ మనకున్న సామర్థ్యం ఆశ్చర్యకరమైనది.'

6. 'ప్రమాణాలు చూపక పోవటం, నిరాధార సాధారణీకరణ' అనే లోపాలు.

7. 'మన పరిశోధకులందరికీ ఒక సమాన లక్షణముంది. అది సమాచారం దండిగా సేకరించటం.'

8. 'మనకు పరిశోధన అంటే విశ్లేషణ, వ్యాఖ్యానం, సిద్ధాంతీకరణం.'

9. 'మేధాశక్తినీ, భావనాబలన్నీ, మనసును, హృదయాన్ని వేరుచేసి చూడడం మన సంస్కృతిలో ఎన్నడూ లేదు.'

10. 'ఇప్పటివరకూ మనంచేసిన పని గురించి, సాహిత్యం అంటే మనకున్న దృక్పథాన్ని గురించి మన సాహిత్య విమర్శ సిద్ధాంతాలను గురించి ఒక్కమాటలో చెప్పాలంటే అవి అభిరుచి ప్రధానాలు (Impres sionistic).'

11. 'సైద్ధాంతిక నైపుణ్యం (Theoretical sophestication) గాని, బుద్ధి సారళ్యం (Intellectual honesty) గాని లేవు.'

12. 'మన తక్షణావసరం పాఠవిమర్శ (Textual criticism).'

13. 'తెలుగు సాహిత్యాన్ని విశ్లేషించటానికి ఫ్రెంచి నిర్మాణ (క్రమ) వాదుల (Structuralism), రష్యన్ రూపవాదుల (Formalists) పద్ధతులు ఉపయోగపడతాయేమో పరిశీలించాలి.'

---

77. చూడు : అభ్యుదయ ( విమర్శ విశేష సంచిక ). పు. (13-21).

14. 'సాహిత్యాన్ని చర్చించేటప్పుడు మనం చేసిన ఘోరమైన పొరపాటు ఏమిటంటే - ఏకవ్యక్తి కృతికర్తగా, (సామాజిక) వ్యక్తిగా వ్యవహరిస్తున్నందువల్ల వారిద్దరి వ్యక్తిత్వమూ ఒకటే నని భావించటం',

15. 'వివేకంతో అర్థం చేసికొని, సృజనాత్మకంగా అనువర్తిస్తే మార్క్సిస్టు పద్ధతులు సాహిత్యాన్ని విమర్శించటంలో సత్ఫలితా లిస్తాయి'.

16. 'మార్క్సిజం, నిర్మాణ (క్రమ) వాదం లాంటి సిద్ధాంతాలను అంగీకరించని సాహిత్య చరిత్రకారుల దృష్టిలో సాహిత్య చరిత్రకు, చారిత్రక సాహిత్య సంఘటనలకు భేదం కనిపించదు.'

17. 'యూరపియన్ సాహిత్యం కోసం రూపొందించిన పద్ధతులుగాని, సంస్కృత ఆలంకారికుల సూత్రాలుగాని తెలుగు సాహిత్యానికి యథాతథంగా వర్తింపచేయటానికి వీలులేదు. సంబంధి భావాలను పద్ధతులను అరువు తెచ్చుకున్నప్పటికీ, తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు దాని సంప్రదాయాలను, కొలబద్దలనే పాటించాల్సి ఉంటుంది'.

తెలుగులో ఇంతవరకూ వెలువడిన సాహిత్య విమర్శ, పరిశోధన-అంతా అభిరుచి ప్రధానం అని ఒక్కమాటలో తేల్చి చెప్పిన నారాయణరావుగారి సమీక్షకూడా అభిరుచి ప్రధానమే నని పై అంశాల వలన తెలిసికోవటం సులభం. ఆయన కున్న నిబద్ధమైన దృష్టితో చూస్తే పరిశోధన అంతా అలాగే కనపడుతుంది. అయినా, తెలుగు సిద్ధాంతగ్రంథాలను అనుశీలించేటప్పుడు-మన రాష్ట్రంలో ఏ పరిస్థితులలో పరిశోధన మొదలై, ఏయే ప్రేరకశక్తుల వలన చైతన్యాన్ని పొంది, ఏయే సమస్యల నెదురుకొంటూ, ఏయే పరిణామాలను పొంది, ఏయే ప్రయోజనాలను సాధిస్తూ, ఏయే రంగాలలో విజయాలను సాధించి, ఏయే రంగాలలో వైఫల్యాన్ని పొంది, ఏవిధంగా ముందుకు సాగుతూ తనదైన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటానికి ఎలా యత్నిస్తున్నదో, తెలుగు సాహిత్యానికి సంబంధించిన సంప్రదాయాలను, కొలబద్దలను ఎలా పాటిస్తున్నదో - వారు పేర్కొన్న 'సాహిత్య చరిత్ర' దృష్టితోనే సమీక్షిస్తే మరికొంత సహృదయ సమ్మతంగా ఉండేది. 'మనది ఉద్వేగ ప్రధాన ధోరణి' అని వెల్చేరువారు కూడా మరొకసారి నిరూపించారు. అయినా, లోపాలను చెప్పిన వారి లోపాలను మనం ఎన్నకూడదనే సంస్కృతి మర్యాదను పాటించినా, విమర్శకుని చూపులోనే ఉన్న లోపాలను గమనించి వాటిని ప్రమాణాలని నమ్మలేము. లోపాల నెత్తి చూపటంతోపాటు కొన్ని మంచి సలహాలను కూడా ఇచ్చారు వారు. అవి పరిశోధకులు గమనింపదగినవి.

భాషా పరిశోధనకంటె సాహిత్య పరిశోధన సులభం అనే అభిప్రాయం లోకంలో వ్యాపించి ఉంది. డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు ఆ అభిప్రాయాన్ని ఒక రకంగా సమర్థిస్తూనే, ఉత్తమ పరిశోధన ఏ రంగంలోనైనా శ్రమతో కూడుకొన్న విషయమే అని అన్నారు. వారి మాటలు గమనించండి - ''స్థూలంగా తెలుగు సిద్ధాంత గ్రంథాల విషయాన్ని భాషకు సంబంధించినవి, సాహిత్యానికి సంబంధించినవి-అని విభజించవచ్చు. సిద్ధాంత గ్రంథాలలో నూటికి మూడు వంతులు సాహిత్యానికి సంబంధించిన విషయాల్ని గ్రహించి వ్రాసినవే. ఈ పద్ధతి కొంత సులభం అని దేశంలో ప్రచారంలో ఉంది.ఇది సత్యదూరం కాదు. ఏదో కొంత తెలుగులో సాఫీగా వ్రాసి పారేస్తే డిగ్రీ రాక ఏమవుతుంది? అనే భావం కొన్ని వర్గాలలో గట్టిగానే ఉంది. దీనితో ఏమయిందంటే భాషకు సంబంధించిన పరిశోధన కష్టమనీ, సాహిత్యానికి సంబంధించిన పరిశోధన సులభమనీ ప్రచారాలకు వచ్చి స్పర్ధలూ, కలతలూ బయలుదేరాయి. నిజానికి ఉత్తమ పరిశోధనం కష్టం. పదికాలాలపాటు నిలిచే

పరిశోధన, సలుగురూ ఉపయోగించుకొనే పరిశోధన కష్టమయింది. దీనికి విషయంతో నిమిత్తం లేదు.''[78] ఉత్తమ పరిశోధనను గురించి వీరన్న మాట సత్యం. అయితే, భాషా పరిశోధన కష్టం, సాహిత్య పరిశోధన సులభం అని కొన్ని వర్గాలు అనుకొంటూంటే అనుకొంటూ ఉండవచ్చు. అటువంటి అభిప్రాయానికి కారణం కూడా వీరభద్రరావుగారు పేర్కొన్నారు. కాని, దాన్ని సర్వసాధారణం చేయటం సమంజసం కాదు. భాషా పరిశోధన శుద్ధ శాస్త్ర పరిశోధన. అందులో భాష భౌతిక ద్రవ్యం. సాహిత్య పరిశోధన దర్శనపరమైన శాస్త్రీయ పరిశోధన. అందులో అభివ్యక్తి కళాద్రవ్యం. భౌతికద్రవ్య పరిశీలనం కంటె కళాద్రవ్య పరిశీలనం కష్టం. అయినా, కొందరు భౌతికద్రవ్య పరిశీలనం శాస్త్రీయమనీ, కళా ద్రవ్య పరిశీలనం శాస్త్రీయం కాదనీ భావించేవారున్నారు. ఆ అభిప్రాయం పొరపాటు. "The study of literature, ..... is like the study of other areas of human knowledge. It shows what is to be seen; and yet what is to be seen may be something one has seen and failed to notice a thousand times''[79]- అన్న జార్జి వాట్సన్ మాటలు గమనిస్తే సాహిత్య పరిశోధన శాస్త్ర స్వభావాన్ని సంతరించుకొంటూనే తన దర్శన తత్త్వాన్ని ఎలా వెలారుస్తుందో బోధపడుతుంది. ఒక విధంగా చూస్తే భాషా పరిశోధన లాగా సాహిత్య పరిశోధన ద్రవ్య పరిశీలన విధానాన్ని అనుసరించినా, ద్రవ్య లక్షణాలను బట్టి ఒకటి భౌతిక సత్యాలను కనుగొంటుంది; మరొకటి అనుభవ సత్యాలను దర్శిస్తుంది. అన్వేషించి కనుగొన్న దానికంటె, అన్వేషించి దర్శించటం విశిష్టం. ఇది ఎలా ఉంటుందంటే- వ్యాకరణ గ్రంథం వ్రాయటం కష్టమా?లక్షణ గ్రంథం వ్రాయటం కష్టమా?అని ప్రశ్నించినట్లుంటుంది. ప్రయోగ శరణ్యం వ్యాకరణం. విశ్లేషణం దాని మూల స్వభావం. అనుభవ శరణ్యం, దర్శన మూలం లక్షణ గ్రంథం. వివేచనం దాని మూల స్వభావం. విశ్లేషణం పరిశ్రమ వలన సాధ్యం; వివేచనం ప్రజ్ఞ వలన సాధ్యం. పరిశ్రమ కంటె ప్రజ్ఞ విశిష్టం. భాషా పరిశీలనం వస్తునిష్ఠం, సాహిత్య పరిశోధనం తత్త్వనిష్ఠం. వస్తువు కంటె తత్త్వం ప్రయత్న సాధ్యం. ప్రతి ప్రయోగంలోనూ అసమర్థ రచనలు కొన్ని ఉండవచ్చు. పక్షపాత వైఖరులు, పాక్షిక దృక్పథాలు ఉండవచ్చు. వాటికి ప్రామాణికత ఎన్నడూ రాదు, ఇవ్వరాదు. ఉత్తమ పరిశోధన ఎప్పుడూ కష్టమే. "A progressive society depends on its inclusion of three groups : scholars, discoverers, inventors.''[80] అన్న Whitehead విశ్లేషణను సాహితీ జగత్తుకు వర్తింపచేస్తే భాషా (శబ్ద) శాస్త్ర పరిశోధకులు Scholars కోవకు, సాహిత్య పరిశోధకులు Discoverers కోవకు, రచయితలు Inventors కోవకు చేరుతారు. ఏ భాషలో జరిగే పరిశోధనలోనైనా ఈ మూడు వర్గాల సమన్వయమే శ్రేయోదాయకం. వీరిలో తరతమ భేదాలు లేని అవగాహనతో నిండిన స్నేహశీలం, నిర్మాణాత్మక సమన్వయ దృక్పథం ముఖ్యం. తెలుగులో ఈ మూడు వర్గాల మధ్యసంఘర్షణ లేదు కాని, సమన్వయం తక్కువ. ఇప్పుడిప్పుడే ఈ ముగ్గురూదగ్గరౌతున్నారు. ఈ మూడు వర్గాల సాధనలు ముడిపడితే ఫలితాలు మూడు పూవులారుకాయలుగా విస్తరిల్లుతాయి. అట్టి భవిష్యత్తును ఆహ్వానిద్దాం.

78. 'పరిశోధన-పరమార్థ పరిశీలన' (వ్యా.) సమాలోచనం (1980) ఆం. ప్ర. సా. అ. ప్రచురణ. పు. 54-55.
79. The study of Literature (1969). P. 26.
80. cf. R.O.U.E.C. Vol. (1949). P. 140.

ఇప్పటివరకు వెలువడిన పరిశోధన వ్యాసాలూ, సిద్ధాంత గ్రంథాలూ అన్నీ కలిసి దాదాపు 600 వరకు ఉండవచ్చు. అందులో ప్రామాణికాలుగా పరిగణింపబడేవి ఒక వంద గ్రంథాలు ఉండవచ్చు. ప్రామాణికాలైనా ప్రచారంలో ఉన్నవి ఒక 60 కి మించవు. ఆంధ్ర సాహిత్య లోకంలో విమర్శకులనీ, పరిశోధకులనీ, సమీక్షకులనీ ప్రత్యేకంగా గుర్తింపదగిన ప్రసిద్ధులే ఉన్నారు. వారందరిలోనూ నాలుగు కాలాలపాటు నిలిచే సాహిత్య పరిశోధకు లెంత మంది ?...

దాదాపు రెండు వందల యేండ్ల సాహిత్య పరిశోధన చరిత్రలో ఇరవై మంది అటువంటివారు ఉంటే సంతోషింపవలసిందే. ఈ లెక్కను బట్టి చూస్తే మనం సంతోషించటమే కాదు, గర్వించవచ్చును కూడ ![81]



# అనుబంధం - 2

# విశ్వవిద్యాలయాలలో తెలుగు పరిశోధన

తెలుగు భాషకు, సాహిత్యానికి సంబంధించిన వివిధ విషయాల మీద వివిధ విశ్వవిద్యాలయాలలో పరిశోధన జరుగుతూ వస్తోంది. ఆ పరిశోధకుల పేర్లు, పరిశోధన విషయం, వారు పొందిన పట్టం, పట్టప్రదానం చేసిన విశ్వవిద్యాలయం, సంవత్సరం, ఆయా పరిశోధన వ్యాసాలను, సిద్ధాంత గ్రంథాలనూ పర్యవేక్షించిన పరిశోధకుల పేర్లను తెలుసుకోదలచినవారికి ఉపయోగపడాలని ఈ అనుబంధంలో ఈ పట్టిక కూర్చటం జరిగింది.

పరిశోధకుల పేర్లను ప్రధానంగా తీసికొని అకారాదిక్రమంలో పట్టిక కూర్చబడింది. పరిశీలకుల సౌలభ్యంకోసం పి. హెచ్.డి., డి.లిట్. పట్టాలను గ్రహించిన వారి పేర్లు విడివిడిగానూ, ఎం. లిట్., ఎం.ఫిల్., ఎం.ఏ. (ఆనర్స్), ఎం.ఒ.యల్.,పట్టాలను పొందినవారిపేర్లు ప్రత్యేకంగానూ ప్రచురింపబడుతున్నవి. ఆధునిక పరిశోధన గ్రంథ రచన, గ్రంథ శీర్షిక వాడుకభాషలోనే సాధారణంగా ఉంటున్నాయి కాబట్టి ఈ పట్టిక కూర్పులో వాడుకభాషలోనే పరిశోధనాంశాల శీర్షికలు పేర్కొనటం జరిగింది. మరో విషయం: 'వెంకట' 'వేంకట'—రూపభేదం గురించి. ఇవి రెండూ పక్కపక్కల్నే వస్తాయి కాబట్టి చూసుకోవటం సమస్య కాదు.

ఈ పట్టికను మొదట 'తెలుగులో పరిశోధన' అనే శీర్షిక క్రింద డా॥ పోరంకి దక్షిణామూర్తిగారిచే సిద్ధం చేయించి, ముద్రించి, వ్యాసకర్తలకూ, విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులకూ పంపినాము. ఆ పట్టికలో ఏవైన చేర్పులుకాని, మార్పులుకాని ఉన్నట్లయితే సూచింపుడని కోరినాము. వారిలో కొందరినుండి మాకు సమాచారము పూర్తిగా అందలేదు. అయినా అందినంతవరకు సమాచారాన్ని ఆ పట్టికలో పొందుపరిచి, పర్యవేక్షకుల పేర్లను కూడా జతపరిచి ఈ పట్టికను మరల సిద్ధము చేయటమైనది. అయినా, ఈ పట్టిక సంపూర్ణమని మేము అనుకోవటంలేదు. కాబట్టి సమాచారం కొరవడిన అంశాలకింద, అనుమానంగా ఉన్న అంశాల దగ్గరా ప్రశ్నార్థకం పెట్టటం జరిగింది. సాధ్యమైనంతవరకు మా ప్రయత్నలోపం లేకుండా విషయాన్నంతా సమకూర్చటానికి యత్నించాం. ఇంకా ఇందులో చేరవలసిన అంశాలు ఉండవచ్చు. అటువంటి వేమైనాఉంటే సహృదయులు మన్నిస్తారని భావిస్తున్నాం.

ఈ పట్టికలో విశ్వవిద్యాలయాల పేర్లూ, పర్యవేక్షకుల పేర్లూ సంగ్రహనామాలతో సూచించటం జరిగింది. ఆ సంగ్రహనామాల వివరణ పట్టికలు ప్రత్యేకంగా పొందుపరుస్తున్నాం. వాటితోపాటు మరికొన్ని వివరాల పట్టికలను కూడా పరిశీలకుల సౌలభ్యంకోసం ఇందులో జతపరుస్తున్నాం. —సంపాదకవర్గం

## 1. పిహెచ్.డి., పట్టములు పొందిన పరిశోధకులు

| పరిశోధకులు | పరిశోధన విషయం | సంవత్సరం | పర్యవేక్షకులు | విశ్వవిద్యాలయం |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| అంకయ్య, వడ్డెంగుంట | ఆంధ్రకవిత్వం - గాంధీతత్త్వం | 1973 | కె. వి. ఆర్. | ఆంధ్ర |
| అక్కిరెడ్డి, ఎస్. | తెలుగులో ఇంగ్లీషు ఆదాన పదాలు | 1971 | జి.యన్. రెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| అనంతరామశాస్త్రి, నేతి | శ్రీనాథునిభాష-వర్ణనాత్మక విశ్లేషణ | 1978 | దొణప్ప | నాగార్జున |
| అన్నపూర్ణమ్మ, ఆర్. | ప్రాచీనాంధ్ర, ఆధునికాంధ్ర భాషల తారతమ్య పరిశీలన | 1979 | పి. ఎస్. | అణ్ణామలై |
| అప్పల నరసింహమూర్తి, ఉపాధ్యాయుల | ఔచిత్య ప్రస్థానం-సూరన కవిత్వం | 1980 | యస్వీ | ఆంధ్ర |
| అప్పారావు, గంధం | వేమన: సర్వజ్ఞుడు-తులనాత్మక పరిశీలన | 1972 | హిరేమత్ | కర్ణాటక |
| అప్పారావు,పోణంగి శ్రీరామ | తెలుగు నాటక వికాసం | 1961 | ఖండవల్లి | ఉస్మానియా |
| అయ్యవారు, టి.బి.ఎం. | మహాకవి ధూర్జటి కావ్యానుశీలన | 1974 | కె.సు.రా. | మైసూరు |
| అరుణకుమారి, బాల | తెలుగు వాఙ్మయంలో చారిత్రక కావ్యాలు (క్రీ. శ. 13 వ శతాబ్ది నుండి 17 వ శతాబ్ది వరకు) | 1974 | కె.వి.ఆర్. | ఆంధ్ర. |
| ఆంజనేయులు, ఎ. | శ్రీనాథ పదప్రయోగ సూచిక ఆధారంగా శ్రీనాథుని భాష | 1981 | సుశీల | ఢిల్లీ |
| ఆనందమూర్తి, వేటూరి | విజయనగరయుగపు తెలుగు సాహిత్యంపై వైష్ణవ తత్త్వ ప్రభావం | 1966 | ఖండవల్లి | ఉస్మానియా |
| ఆనందలక్ష్మి, సి. | తెలుగు నవలలో కుటుంబ జీవనం | 1976 | సి.నా.రె. | ,, |
| ఇందిరాదేవి, కె.ఎస్. | ఆంధ్రమహాభారతంలో ద్రౌపదిపాత్ర-సమగ్ర పరిశీలనము | 1982 | నాయని | ,, |
| ఇందిరారాణి, ఎ. | ఆంధ్ర మహాభారతం-ధర్మ స్వరూపం | 1983 | హేమలత | శ్రీవేంకటేశ్వర |
| ఇనాక్, కొలకలూరి | తెలుగు వ్యాస పరిణామం | 1974 | కోరాడ | శ్రీవేంకటేశ్వర |
| ఉమ, పుల్లూరి | మల్లన రాజశేఖర చరిత్ర-పరామర్శ | 1979 | శ.రా. | మద్రాసు |
| ఉషారాణి, టి. | తెలుగు నిఘంటువుల పరిశీలన | 1975 | జి.యన్. రెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| ఎలిజబెత్ కుమారి, జెడ్. | తెలుగులో చారిత్రక నవలలు | 1979 | సుబ్బారెడ్డి | ,, |
| కందప్పచెట్టి, ఎం. | క్రీ.శ. 12-19 శతాబ్దుల తెలుగుశాసన భాషా చారిత్రక వ్యాకరణం | 1968 | భద్రిరాజు/కోరాడ | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| కనకయ్య, చామర్తి | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్న కథలు-సమగ్ర సమీక్ష | 1979 | చక్రధర | ఆంధ్ర |
| కమల, అనార్కలి | పిఠాపుర సంస్థానము పోషించిన కవులు | 1975 | పాటిబండ | ఉస్మానియా |
| కమలాదేవి, ఆంధ్ర | తిక్కన భారతం-రసపోషణ | 1978 | సి.సు. | ఆంధ్ర |
| కాంతలక్ష్మి, ఐ.వి. | ధూర్జటి కవులు | 1983 | దివాకర్ల | ఉస్మానియా |
| కామేశ్వరరావు, వేదుల | నాచన సోమన-అతని కృతులు | 1966 | కె.వి.ఆర్. | ఆంధ్ర |
| కాశీ విశ్వేశ్వరశాస్త్రి, కొత్తపల్లి | అయ్యలరాజు రామభద్రుని కవితారీతులు | 1974 | యస్వీ | ,, |
| కుటుంబరావు, బి.వి. | ఆంధ్ర నవలా పరిణామం | 1963 | ఖండవల్లి | ఉస్మానియా |
| కుమారదేవి, సుంకర | తెలుగువార్తాపత్రికలలో భాషా స్వరూప ప్రయోగాలు | 1983 | బ్రహ్మానంద | శ్రీకృష్ణ దేవరాయ |
| కులశేఖరరావు, ఎం. | ఆంధ్ర వచన వాఙ్మయం-ఉత్పత్తి వికాసాలు (18వ శతాబ్దివరకు) | 1964 | దివాకర్ల | ఉస్మానియా |
| కుసుమకుమారి, పి. | తెలుగులో హిందూస్తానీ ఆదాన పదాలు (రాయలసీమలోని బ్రిటిషు రికార్డులు) | 1982 | కె.వి.రె. | శ్రీవేంకటేశ్వర |
| కుసుమాబాయి, కొండూరు | మడికి సింగన కృతుల పరిశీలన | 1980 | బి.రా.రా. | ఉస్మానియా |
| కృష్ణకుమారి, నాయని | తెలుగు జానపద గేయగాథలు | 1970 | ఖండవల్లి | ,, |
| కృష్ణమరాజు, దేవరాజు | శ్రీశ్రీ కవిత్వం-మనోవిశ్లేషణాత్మక పరిశీలన | 1981 | గోపాల | ,, |
| కృష్ణమాచార్య, ఎక్కిరాల | తెనాలి రామకృష్ణుని కావ్య పరిశీలన | 1967 | కె.వి.ఆర్. | ఆంధ్ర |
| కృష్ణమాచార్యులు, వేదాంతం గోపాల | తెలుగులో స్థలపురాణాలు - వాటి స్వభావ పరిశీలన | 1962 | సోమయాజి | ,, |
| కృష్ణమూర్తి, ఇరివెంటి | కవి సమయాలు | 1976 | సి.నా.రె. | ఉస్మానియా |
| కృష్ణమూర్తి, కె.జి. | తరిగొండ వెంకమాంబ కృతులు-సవిమర్శక పరిశీలన | 1980 | చెన్నారెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| కృష్ణమూర్తి, భద్రిరాజు | తెలుగు వెర్బల్ బేసెస్-కంపారిటివ్ అండ్ డిస్క్రిప్టివ్ స్టడీ | 1957 | ఎమినవ్ | పెనిసిల్వేనియా |
| కృష్ణస్వామి, మోపిదేవి | భారతం-ధర్మాద్వైతం-వ్యాసుని దర్శనం-తిక్కన సందర్శనం | 1981 | సి.సు. | ఆంధ్ర |
| కృష్ణారావు, జి.వి. | స్టడీస్ ఇన్ కళాపూర్ణోదయం | 1958 | — | మద్రాసు |
| కృష్ణారావు, వైద్యుల | జయదేవుని గీత గోవిందం-ఆంధ్రానువాదం | 1961 | సి.సు. | ఆంధ్ర |
| కోటేశ్వరన్, సి.ఎస్. | వెన్నెలకంటి సూరన విష్ణుపురాణం-విమర్శనాత్మక పరిశీలన | 1981 | శ.రా. | మద్రాసు |

| | | | | |
|---|---|---|---|---|
| కోటీశ్వరమ్మ, ఎ. | సంఘ సంస్కరణ-వీరేశలింగం గారి సాహిత్యం | 1979 | దొణప్ప | నాగార్జున |
| కోటీశ్వరి, నాయని | ముద్రిత జానపదగేయాల్లో నిఘంటువుల కెక్కని పదాలు | 1978 | బి.రా.రా. | ఉస్మానియా |
| కోటేశ్వరరావు, తుమ్మపూడి | ఆముక్తమాల్యద సౌందర్యం | 1967 | దివాకర్ల | ఉస్మానియా |
| కోదండరామయ్య, తిమ్మావఝ్ఝుల | ఆంధ్ర సాహిత్యంలో దేశి కవితోద్యమం-పాల్కురికి సోమనాథుని పాత్ర | 1968 | జి.యన్.రెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| గంగప్ప, శ్రీరామప్పగారి | శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాలు-ఇతర రచనలు, వాటి వైశిష్ట్యం | 1972 | ,, | శ్రీవేంకటేశ్వర |
| గుణశేఖర్, జి. (alias రోసినాయుడు.జి.) | దామెర్ల అంకభూపాలుని ఉషా పరిణయము-సంశోధిత ప్రతి | 1982 | చిన్నికృష్ణ | మద్రాసు |
| గురప్ప, ఎం.ఎల్. | డా॥ సి. నారాయణరెడ్డి-అతని కృతులు | 1980 | తంగిరాల | బెంగుళూరు |
| గురవయ్య, మల్లెల | ప్రబోధ చంద్రోదయ విమర్శ-తులనాత్మక పరిశీలన | 1976 | జా.సూ.నా. | శ్రీవేంకటేశ్వర |
| గురురామప్రసాద్, టి. | (కర్నూలు జిల్లా) వీరగాథా కవిత్వం- | 1983 | సుబ్బారెడ్డి | ,, |
| గోదావరిబాయి, సంధ్యావందనం | ఎఱ్ఱయ హరివంశము-విమర్శనాత్మక పరిశీలనము | 1983 | శలాక | శ్రీకృష్ణదేవరాయ |
| గోపాల్, ఎన్. | ప్రజాకవి వేమన | 1979 | రాజేశ | ఉస్మానియా |
| గోపాలకృష్ణమూర్తి, నందుల | ఆంధ్ర మహాభారతం-ఔపదేశిక ప్రతిపత్తి | 1980 | యస్వీ | ఆంధ్ర |
| గోపాలకృష్ణరావు, కె. | ఆంధ్ర శతక వాఙ్మయం-ఉత్పత్తి వికాసాలు | 1965 | దివాకర్ల | ఉస్మానియా |
| గోపాలకృష్ణరావు, టి. | తెలుగు-కన్నడ జానపద కవిత్వంలో రామాయణ కథ | 1982 | ఆర్.వి.యస్. | మైసూరు |
| గోపాలరావు, అయ్యల సోమయాజుల | వఝ్ఝలవారి వ్యాకరణ వరివస్య-ఒక సమీక్ష | 1980 | వి.సు. | ఆంధ్ర |
| గోవిందస్వామి నాయుడు, ఎం. | అనంతపూరు జిల్లా స్థల నామములు - సామాజిక భాషాశాస్త్ర పరిశీలనం | 1983 | జి.యన్.రెడ్డి. | శ్రీవేంకటేశ్వర |
| చంద్రమౌళి, ఇ. | దాశరథి కవిత్వం-సవిమర్శక పరిశీలనం | 1983 | సుబ్బారెడ్డి | ,, |
| చంద్రశిరీష, ఎం. | తెలుగు రచయిత్రుల సాంఘిక నవలలు - సమీక్ష | 1979 | కె.వి.రె. | శ్రీవేంకటేశ్వర |

| | | | | |
|---|---|---|---|---|
| చంద్రశేఖర్, ఎస్.జి.డి. | ఆధునిక కవిత్వంలో ఆత్మీయత | 1983 | సుబ్బారెడ్డి | ,, |
| చంద్రశేఖరరెడ్డి, రాచపాళె | శిల్ప ప్రభావతి (ప్రభావతీ ప్రద్యుమ్న కావ్య విమర్శ) | 1977 | తుమ్మపూడి | ,, |
| చంద్రశేఖర్‌రెడ్డి, వి. | నెల్లూరు జిల్లా స్థలనామములు-సామాజిక భాషాశాస్త్ర పరిశీలనం | 1982 | కే.వి.రె. | ,, |
| చంద్రశేఖరశర్మ, మూలంపల్లి | మహాభారతం - విజ్ఞాన సర్వస్వము | 1979 | బి. రా. రా. | ఉస్మానియా |
| చక్రధరరావు, లకంసాని | ఆంధ్ర శాసన సారస్వతంలోని ఉర్దూ-మరాఠీ పదాలు | 1967 | కె.వి.ఆర్. | ఆంధ్ర |
| చలపతి, జి. | కవికర్ణ రసాయన కావ్యానుశీలన | 1978 | సుబ్బారెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| చిన్నికృష్ణయ్య, దేవళ్ల | హరిభట్టు - వరాహ పురాణం సంశోధిత ప్రతి | 1974 | స్వతంత్రం | మద్రాసు |
| చిన్మయ కవి, చేబ్రోలు | శ్రీపాదవారి కృష్ణ భారతము-సమగ్ర సమీక్ష | 1983 | యస్వీ. | ఆంధ్ర |
| చెంగారెడ్డి, డి. | చిత్తూరు జిల్లా స్థలనామాలు-సాంఘిక భాషాశాస్త్ర పరిశీలనం | 1982 | కె.వి.రె. | శ్రీవేంకటేశ్వర |
| చెన్నకేశవరెడ్డి, జి. | ఆధునికాంధ్ర గేయ కవిత్వం | 1979 | సి.నా.రె. | ఉస్మానియా |
| చెన్నారెడ్డి, జీరెడ్డి | తెలుగు భాషా వాఙ్మయంపై వీరశైవ మత ప్రభావం | 1965 | కె.సు.రా. | మైసూరు |
| జగన్నాధాచార్యులు, ఎం. | తిక్కన కుమారవ్యాసుల భారతము-తులనాత్మక పరిశీలనము (విరాటోద్యోగ పర్వములు) | 1983 | రా.చ.రె. | శ్రీకృష్ణ దేవరాయ |
| జయకృష్ణప్రసాద్ బాపూజీ, జంధ్యాల | శ్రీనాథుని సాహిత్య ప్రస్థానం | 1973 | యస్వీ. | ఆంధ్ర |
| జయప్రకాశ్, ఎస్. | చెంగల్పట్టు జిల్లా గ్రామనామాలు (5 ఉత్తరదిశ తాలూకాలు) | 1981 | అప్పారావు | మద్రాసు |
| జయలక్ష్మి, చెన్నాప్రెగడ | విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కువెంపు శ్రీరామాయణ దర్శనం-తులనాత్మకానుశీలనం | 1982 | తంగిరాల | బెంగుళూరు |
| జోగారావు, యస్వీ. (శిష్టా వేంకట) | ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర | 1957 | సోమయాజి | ఆంధ్ర |

| | | | | |
|---|---|---|---|---|
| జ్యోతిర్మయి, కిళాంబి (వింజమూరి) | పద చరిత్ర - ధ్వనిశ్లేషల పరిశీలన | 1978 | ? | మద్రాసు |
| తిరుపతయ్య, వి. | అడవి బాపిరాజు రచనలు | 1982 | కు.శే.రా. | ఉస్మానియా |
| తిరుపతిరావు, సి. | పారిజాతాపహరణం, జగన్నాథ విజయం-తులనాత్మక పరిశీలన | 1974 | తంగిరాల | మద్రాసు |
| దక్షిణామూర్తి, పోరంకి | తెలుగు కథానిక స్వరూప స్వభావాలు | 1977 | సి.నా.రె. | ఉస్మానియా |
| దామోదరనాయుడు, గార్లపాటి | తెలుగులో అవధాన కవిత, చాటుకవిత-తులనాత్మక పరిశీలన | 1970 | బి.వి.సూ. | బెనారస్ |
| దీనావతి, మానాప్రగడ | కావ్యావతారికలు - ఆంధ్రదేశ చరిత్ర సామగ్రి - క్రీ. శ. 1600 వరకు | 1977 | బొడ్డపాటి | ఉస్మానియా |
| దుర్గయ్య, పల్లా | 16వ శతాబ్ది యందలి ప్రబంధ వాఙ్మయం - తద్వికాసం | 1960 | ఖండవల్లి | ,, |
| దేవకి, ఎం.కె. | తెలుగులో బాలగేయ సాహిత్యం-సవిమర్శక సమీక్ష | 1979 | నాగయ్య | శ్రీవేంకటేశ్వర |
| దొణప్ప, తూమాటి | వైకృత పద స్వరూప నిరూపణ | 1965 | సోమయాజి | ఆంధ్ర |
| దొరస్వామి నాయుడు, ఎం. | తెలుగు సాహిత్యంలో నలకథ | 1982 | నాగయ్య | శ్రీవేంకటేశ్వర |
| ధర్మేశ్వరరావు, జి. | తెలుగులో చిత్ర కవిత్వం | 1983 | బి. రా. రా. | ఉస్మానియా |
| నరసింహం, అంతటి | ప్రబంధాల్లో ప్రకృతి వర్ణన | 1974 | జి.యన్.రెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| నరసింహం, కాకర్ల వెంకటరామ (కె.వి.ఆర్.) | ఆంధ్ర ప్రబంధం-అవతరణ వికాసాలు | 1945 | పింగళి | ఆంధ్ర |
| నరసింహాచార్యులు, కిడాంబి | తిరునామాలు (శ్రీవైష్ణవ భక్తిగీతాలు) | 1980 | సుప్రసన్న | కాకతీయ |
| నరసింహాచార్యులు, మరింగంటి | ప్రబంధయుగం - సమాజ చిత్రణ | 1975 | బి.రా.రా. | ఉస్మానియా |
| నరసింహారావు, అత్తలూరి | తిలక్ కవితా తత్త్వం | 1979 | చక్రధర | ఆంధ్ర |
| నరసింహారావు, వి.వి.ఎల్. (వావిలి వేంకటలక్ష్మి) | నన్నయ అక్షర రమ్యత | 1974 | జి.యన్.రెడ్డి | శ్రీవేంకటేశ్వర |
| నరసింహారెడ్డి, పాపిరెడ్డి | ఆముక్తమాల్యద - భాషా పరిశీలన | 1979 | తుమ్మపూడి | అనంతపురం |
| నరసింహారెడ్డి, పి.సి. | సోషియోలింగ్విస్టిక్ ఆస్పెక్ట్ ఇన్ తెలుగు-టామిల్ బైలింగ్యులిజం | 1983 | జి.యన్.రెడ్డి. | శ్రీవేంకటేశ్వర |
| నరసింహారెడ్డి, వి. | పాల్కురికి సోమనాథుని కృతులు-పరిశీలన | 1974 | ఖండవల్లి | ఉస్మానియా |

| | | | | |
|---|---|---|---|---|
| నాగభూషణరావు, కల్లూరి | నన్నయ భాషకు వర్ణనాత్మక వ్యాకరణం | 1965 | భద్రిరాజు | శ్రీవేంకటేశ్వర |
| నాగమ్మరెడ్డి, కె. | తెలుగు స్వర వ్యంజనాలు-యాంత్రిక విశ్లేషణాత్మక పరిశీలన | 1981 | ఉల్డాల్&అషర్ | ఎడింబరో |
| నాగయ్య, గూడూరు | ద్విపద వాఙ్మయము | 1966 | పింగళి | శ్రీవేంకటేశ్వర |
| నారాయణరావు, అరిపిరాల | గురజాడ అప్పారావు-19వ శతాబ్దంలో తెలుగు సాహిత్య శైలీ వికాసం | 1980 | బి.వి.సూ. | బెనారస్ |
| నారాయణరావు, చిలుకూరి | పదకొండో శతాబ్ది తెలుగు భాష | 1929 | - | మద్రాసు |
| నారాయణరావు, వెల్చేరు | తెలుగులో కవితావిప్లవాల స్వరూపం | 1974 | దొణప్ప | ఆంధ్ర |
| నారాయణరెడ్డి. సి. | ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు | 1962 | ఖండవల్లి | ఉస్మానియా |
| నారాయణ శాస్త్రి, తంగిరాల వేంకట | ప్రాచీనాంధ్ర శాసనాలు | 1956 | సోమయాజి | ఆంధ్ర |
| నారాయణస్వామి రెడ్డి, గోళ్ల | ఎ స్టడీ ఆఫ్ తెలుగు సెమాంటిక్స్ | 1964 | స్వతంత్రం | మద్రాసు |
| నిర్మల, డి. | తెలుగు-తమిళ జానపద సాహిత్యం తులనాత్మక పరిశీలన | ? | ? | ,, |
| నిర్మల, తమ్మారెడ్డి | కుమార సంభవ విమర్శ | 1967 | కె.వి.ఆర్. | ఆంధ్ర |
| నిర్మల, సి. | ఫస్ట్ లాంగ్వేజ్ (తెలుగు) డెవలప్ మెంట్ ఇన్ చిల్‌రెన్-షార్ట్ & డిస్క్రిప్టివ్ స్టడీ | 1981 | చే.రా. | ఉస్మానియా |
| నిర్మలాదేవి, ఎన్. | కృష్ణశాస్త్రి కృతులు-పరిశీలన | 1978 | రాజేశ | ఉస్మానియా |
| నీరజ, తిరుమల | జక్కన విక్రమార్క చరిత్ర-విమర్శనాత్మక పరిశీలన | 1980 | శ.రా. | మద్రాసు |
| పద్మనాభరావు, ఆర్.ఎ. | కందుకూరి రుద్రకవి రచనలు-సవిమర్శక పరిశీలన | 1977 | జా.సూ.నా | శ్రీవేంకటేశ్వర |
| పద్మనాభశాస్త్రి, వి.బి.ఎ. | ప్రాచీనాంధ్ర సంప్రదాయ వ్యాకరణాలు-సమగ్రాధ్యయనం | 1979 | శలాక | అనంతపురం |
| పద్మాకరరెడ్డి, ఎ.వి. | తెలుగులో హరిశ్చంద్ర కథ | 1977 | నాగయ్య | శ్రీవేంకటేశ్వర |
| పద్మావతి, ఆర్. | సి.పి. బ్రౌన్-తెలుగు కావ్య సముద్ధరణ | 1980 | శ.రా. | మద్రాసు |
| పద్మావతి, ఈటూరి. | తెలుగులో ప్రహసనాలు- (వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం) | 1980 | బి.వి.సూ. | బెనారస్ |

| | | | | |
|---|---|---|---|---|
| పద్మావతి, ఎస్. | ఆధునికాంధ్ర కవిత్వం-కావ్య బింబ పరికల్పన-తిలక్, దాశరథి, నారాయణరెడ్డి కవితలలో ప్రత్యేక పరిశీలన | 1983 | కొత్తపల్లి | హైదరాబాద్ |
| పాండురంగారావు, మారుటూరి | ఉత్తర రామాయణ విమర్శ-తిక్కన, కాచ విభులుదు, పాపరాజు | 1968 | కె.వి.ఆర్. | ఆంధ్ర |
| పున్నారావు, ఆకురాతి, | సంస్కృతంలో ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు (ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకాల కర్తృత్వ నిర్ణయం) | 1974 | దొణప్ప | ,, |
| పురుషోత్తం, కాళిదాసు | గోపీనాథ వెంకటకవి - వెంకటగిరి సంస్థానమునకు చెందిన ఇతర కవులు | 1971 | బి.రా.రా. | ఉస్మానియా |
| పురుషోత్తం, బొడ్డుపల్లి | తెలుగు వ్యాకరణ వికాసం | 1966 | సోమయాజి | ఆంధ్ర |
| పురుషోత్తమాచార్యులు, పి. | తెలుగు నాటక యక్షగానములపై పారిజాతాపహరణ ప్రభావం | 1983 | బి.వి.సూ. | బెనారస్ |
| ప్రకాశం, వెన్నెలకంటి | ఎ సిస్టెమాటిక్ ట్రీట్‌మెంట్ ఆఫ్ సర్టెన్ ఆస్పెక్ట్స్ ఆఫ్ తెలుగు ఫోనాలజీ | 1972 | సిల్వా | యార్క్ |
| ప్రభాకరరావు, ఇందుర్తి | సురవరం ప్రతాపరెడ్డి గారి జీవితం, రచనలపై సమగ్ర పరిశీలన | 1976 | బి.రా.రా. | ఉస్మానియా |
| ప్రభావతీదేవి, వాసా | ఆంధ్రసాహిత్యంలో హరిశ్చంద్రో పాఖ్యానం | 1978 | బొడ్డపాటి | ఉస్మానియా |
| ప్రసాదరావు, ఎమ్.వి.ఎస్. | దువ్వూరి రామిరెడ్డి కావ్యములు, ఖండ కావ్యములు-ఒక పరిశీలన | 1982 | బి.వి.సూ. | బెనారస్ |
| ప్రసాదరావు, ఏటుకూరి | తాపీ ధర్మారావుగారి జీవితం-రచనలు | 1982 | రామారావు | ఉస్మానియా |
| ప్రసాదరావు, పి.వి.యల్.వి. | ఆంధ్ర భాగవత విమర్శ | 1967 | పింగళి&కోరాడ | శ్రీవేంకటేశ్వర |
| ప్రేమలత, రావి | తెలుగు జానపద సాహిత్యం-పురాణ గాథలు | 1980 | నాయని | ఉస్మానియా |
| ప్రేమసాగర్, లింగుట్ల | తెలుగు సాహిత్యంపై తెలంగాణా సాయుధ పోరాట ప్రభావం | 1981 | చక్రధర | ఆంధ్ర |
| బసవయ్య, వి. | కవిత్రయ భారతంలో శ్రీకృష్ణ పాత్ర | 1983 | దొణప్ప | నాగార్జున |
| బసవశంకరరావు, లింగంనేని | నన్నెచోడ కుమారసంభవానికి వర్ణనాత్మక వ్యాకరణం | 1967 | కోరాడ | శ్రీవేంకటేశ్వర |
| బాపిరెడ్డి, ఎస్. | ప్రభావతీ ప్రద్యుమ్నం-సమగ్ర పరిశీలన | 1980 | దొణప్ప | నాగార్జున |

# ఆధునిక సాహిత్యానికి అకాడమీ చేస్తున్న కృషి

—డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

సమకాలీన సాహిత్యమంతా ఆధునిక సాహిత్యం కాదని విజ్ఞులకు తెలిసిందే. అత్యంత నవీన ధోరణులలో ప్రయోగాలు నిర్వహిస్తూ, సరిక్రొత్త దృక్పథాలతో ముందుకు సాగుతున్న సాహిత్యాన్నే ఆధునిక సాహిత్య మనటం సమంజసం. అత్యంత ఆధునిక ప్రక్రియలన్నీ క్రొత్త క్రొత్త ప్రయోగాలను నిర్వహిస్తూ తమ అస్తిత్వాన్నీ, ప్రభావాన్ని సాహితీ జగత్తులో వ్యాపింప చేసికోవటానికి యత్నిస్తూ ఉంటాయి. వాటి ప్రామాణికత్వం నాలుగు కాలాలపాటు నిలిచే పాటవం, సాహిత్యం మీద వేసే శాశ్వతమైన ముద్ర, ప్రజాదరణం మొదలైనవి నిలకడ మీద తేలే అంశాలు. ఆధునిక దృక్పథాలన్నీ విశ్వజనీనాలుగానూ, అందరికీ ఆమోద యోగ్యాలుగానూ ఉండటం అసాధ్యమే. అందులోనూ నేటి ఆధునికాంధ్ర సాహిత్య క్షేత్రంలోలాగా తీవ్ర వాదాలు తమతమ బలాలను నిరూపించుకోవటానికి తలపడినట్లుగా పరిస్థితులుంటే వాటిలో ఏదో ఒక శాఖకు అకాడమీ మద్దతుగా నిలిచి వాదోపవాదాలలో భాగస్వామి కావటం అంత అభిలషణీయం కాకపోతుంది. అకాడమీ ఒక దృక్పథానికి చెందింది కాదు, కారాదు. ఆంధ్రప్రదేశ్ అకాడమీ అలా కాలేదు. అదే దాని వ్యక్తిత్వం కూడా.

అకాడమీ, ఆధునిక సాహిత్యానికి ఏ విధంగా సేవ చేయాలి అన్న పథకాన్ని రూపొందించుకోవటానికి అనువైన సూచనలు చేయటానికి ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఆ సంఘం చేసే సూచనలను కూలంకషంగా చర్చించి, ఆచరణ యోగ్యమైన వాటిని అమలుపరుస్తూ వస్తున్నది. ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో కవిత, నవల, కథానిక, నాటిక, వ్యాసం, సమీక్ష, పత్రికా రచన మొదలైన అంశాలు గ్రహింపబడుతున్నాయి.

ప్రతి సంవత్సం అకాడమీ నవల, కథానిక, కవిత, సాహిత్య విమర్శ, నాటకం, ఇతర సాహిత్య ప్రక్రియలు అనే అంశాలమీద కడచిన మూడేళ్లలో ప్రచురిత గ్రంథాలలో ఉత్తమమైన వాటికి బహుమతుల నిచ్చి ఆధునిక రచయితలను, రచనలను ప్రోత్సహిస్తోంది. ప్రతి సంవత్సరం రెండంశాలమీద పోటీ రచనలను ఆహ్వానించి, వాటిలో ఉత్తమమైన వాటికి బహుమతుల నిస్తోంది. ఇచ్చిన అంశాల్లో మూడప వంతుకు పైగా అధునికాంశాలు ఉన్నాయి. రచయితల కిచ్చే ఆర్థిక సహాయం ఆధునిక సాహిత్య రచయితలకు కూడా అందుతోంది.

అకాడమీ ఆధునిక సాహిత్యానికి చేయదగిన కృషి ప్రధానంగా రెండంశాలమీద ఆధారపడి ఉంటుందనుకుంటాను. 1. ఆధునిక సాహిత్యానికి అకాడమీ చేయవలసినకృషి - లేక - చేపట్టవలసిన కార్యక్రమాలు ఏ రూపంగా ఉండాలని సాహితీ వేత్తలు చేసే నిర్మాణాత్మకమైన సూచనలు. 2. అకాడమీ ఆధునిక సాహిత్యానికి కేటాయింప వలసిన నిధుల నిష్పత్తి. నాకు తెలిసినంత వరకు ఆధునిక సాహిత్య సంఘ సూచనలన్నీ కొన్ని పరిమిత పరిధులను దాటి వెళ్లలేదు. చాల వరకు కవితా సంకలనాలను, కథా రచయితల అనుశీలన వ్యాస సంపుటులు, ఆధునిక సాహిత్య చరిత్ర రచన అనే అంశాలపై, ఆధారపడి ఉన్నాయి. వీటన్నిట్లో కవితా సంకలనాలు తప్ప మిగతా అంశాలన్నీ సంఘ సూచనల ననుసరించి అకాడమీ ప్రచురించింది. కవితా సంకలనాలను

వివిధ సాహిత్య సంస్థలు వివిధ దృక్పథాలతో ప్రచురిస్తూ, ఉండటం చేత అకాడమీ ఆ శాఖలో చర్వితచరణం చేయదలచలేదు. నవలా ప్రచురణం బహుళంగా సాగటం చేత అకాడమీ ఆ ప్రక్రియా ప్రచురణం చేపట్టలేదు. సృజనాత్మక రచనల సంకలనాలను ప్రచురిస్తే, ప్రక్రియకు ప్రచారం రావచ్చునేమో కాని, ప్రక్రియా పరమైన సమీక్షలు ప్రచురించటం వల్ల సాహిత్యానుశీలనం దేశంలో వ్యాప్తిపొందుతుంది. ఆ దృక్పథంతో అకాడమీ నూరేళ్ల నవల, నూరేళ్ల వ్యాసం, ఇరవైయేళ్ల సాహిత్య ప్రక్రియా వికాసం, మహిళా రచయితల కృషి మొ॥ అంశాల మీద గోష్ఠులను నిర్వహించి, ఆ వ్యాసాలను గ్రంథాలుగా ప్రచురించింది. తెలుగు కథా రచయితలు, తెలుగు కవితా వికాసం వంటి గ్రంథాలను ప్రకటించింది. Modern Trends in Telugu Literature, Facts of Telugu Literature, History of Telugu Language అనే ఆంగ్ల గ్రంథాలను ప్రచురించే ప్రయత్నం చేస్తోంది.

ఆధునిక సాహిత్య వికాసానికి తెలుగు సాహితీవేత్తలు సూచించే సూచనలలో దేశం గమనింపవలసిన అంశాలు రెండున్నాయి. ఆధునిక సాహిత్యానికి చేయవలసింది ఎంతో ఉంది. అకాడమీ ఏమీ చేయటం లేదు అనే వారు కొందరున్నారు. అయితే, సదస్సులు, కమిటీ సమావేశాలు జరిపి నిర్మాణాత్మకమైన సూచనలు చేయండని అడిగితే ఏకవాక్యంతో అందరూ నేడు దేశానికి కావలసింది ఇది అని ప్రతిపాదించటం మన దేశంలో కనపడటం లేదు. సమష్టి దృక్పథం కంటె వ్యష్టి దృక్పథం మనలో ఎక్కువగా గోచరిస్తోంది. కేంద్ర అకాడమీ వారు ప్రతి సంవత్సరం ప్రచురించే ఉత్తమ సాహిత్య గ్రంథ బహుమానానికి ఇద్దరు ఆంధ్ర పండితులు ఏకాభిప్రాయంతో ఒక్క గ్రంథం ఉత్తమమైనదని సూచించలేని అనైక్యతయో, లేక; ఏకాభిప్రాయరాహిత్యమో మనలో ఉండటం చేతనే ఒక్కొక్కసారి తెలుగుకు బహుమతియే రాదు, రాష్ట్రస్థాయిలో కూడా అంతే జరుగుతోంది. నిర్మాణాత్మక కార్యక్రమ ప్రతిపాదనలు చేయటానికి పండితులకు, రచయితలకు విలువల వివేచనం, భవిష్యద్దర్శనం ముఖ్యంగా ఉండాలి. ఈ రెండూ కలిసి ఒక ప్రతిపాదనగా రావటమే కష్టం. నాకు తెలిసినంతవరకు అటువంటి ప్రతిపాదన వచ్చినప్పుడు అకాడమీ దాన్ని ఆచరించటంలో ఎప్పుడూ వెనుకంజ వేయలేదని చెప్పగలను. నిర్మాణాత్మకమైన సూచనలను చేసి అకాడమీ ఆచరించకపోతే దానిని విమర్శించటం ఉచితం. నింద నింద కోసమే కాకూడదు. తన కున్న ఆర్థిక వసరులలో ఆధునిక సాహిత్యానికి ఇదివరకు కంటే అయిదేళ్ల క్రితం నుంచి అకాడమీ అధికశ్రద్ధ వహిస్తోంది. చేయవలసింది చాలా ఉండటం అభివృద్ధి చెందే ఏ వ్యవస్థలోనైనా సజీవంగా ఉండే సమస్య.

తెలుగు దేశంలో ఇద్దరి రచయితల్ని ఒకచోట కూర్చోబెట్టటం కష్టం. ఇద్దరిచేత ఒక నిర్ణయం చేయించటం మరీ కష్టం. ఒక నిర్ణయాన్ని ఇద్దరిచేత 'అమలుచేయించడం మరింత కష్టం. శతాధిక సంఖ్యల్లో, సహస్రాధిక దృక్పథాలతో, స్వీయప్రతిభాప్రతిపాదనమే పరమార్థంగా భావించి ముందుకుసాగే ఆంధ్ర రచయితల నొక వేదికమీద రప్పించి, వారి అభిప్రాయాలను సేకరించి, అభిప్రాయ భేదాలున్నా వాగ్యుద్ధాలను మాన్పి, వైవిధ్యంలోనే ఏకత్వాన్ని సాధించి, దానికి అక్షరరూపాన్ని ఇస్తూ ఆధునిక సాహిత్యానికి అకాడమీ కృషిచేస్తూ వెండి పండుగ చేసికుంటున్నందుకు మనందరం దానిని అభినందించటంలోనైనా కొంతవరకు ఏకాభిప్రాయాన్ని ప్రకటిద్దాం. వెండిని బంగారంగా మార్చుకోవటం మన చేతిలో ఉన్న పని.

(ఆకాశవాణి - హైదరాబాదు కేంద్రం సౌజన్యంతో)



# అనుబంధం - 4

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి విశిష్ట సభ్యులు

| | పేరు | విశిష్ట సభ్యునిగా ఎన్నుకొన్న సంవత్సరం |
|---|---|---|
| 1. | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ | 1965 |
| 2. | శ్రీ కాశీ కృష్ణాచార్య | 1965 |
| 3. | డా॥ గిడుగు వేంకట సీతాపతి | 1965 |
| 4. | శ్రీ తాపీ ధర్మారావు | 1965 |
| 5. | శ్రీ ఆదిరాజు వీరభద్రరావు | 1965 |
| 6. | శ్రీ బాలాంత్రపు వేంకటరావు | 1966 |
| 7. | శ్రీ గుండేరావు హర్కారే | 1966 |
| 8. | శ్రీ వేలూరు శివరామశాస్త్రి | 1966 |
| 9. | శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ | 1966 |
| 10. | శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి | 1966 |
| 11. | శ్రీ గుఱ్ఱం జాషువా | 1966 |
| 12. | శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి | 1966 |
| 13. | శ్రీ నాయని సుబ్బారావు | 1966 |
| 14. | శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి | 1966 |
| 15. | శ్రీ తుమ్మల సీతారామమూర్తి | 1966 |
| 16. | శ్రీ రాయప్రోలు సుబ్బారావు | 1967 |
| 17. | శ్రీ విశ్వనాథ సత్యనారాయణ | 1967 |
| 18. | శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి | 1967 |
| 19. | శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు | 1967 |
| 20. | శ్రీ మునిమాణిక్యం నరసింహారావు | 1967 |
| 21. | శ్రీ బండారు తమ్మయ్య | 1968 |
| 22. | శ్రీ స్వామి శివశంకరస్వామి | 1968 |
| 23. | శ్రీ పురిపండా అప్పలస్వామి | 1968 |
| 24. | శ్రీ ఎస్.టి.జి. వరదాచార్యులు | 1969 |
| 25. | శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి | 1969 |

| | | |
|---|---|---|
| 26. | శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి | 1969 |
| 27. | శ్రీ పింగళి లక్ష్మీకాంతం | 1970 |
| 28. | శ్రీ గుడిపాటి వెంకటచలం | 1970 |
| 29. | శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు | 1970 |
| 30. | డా॥ నేలటూరి వేంకటరమణయ్య | 1971 |
| 31. | శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి | 1971 |
| 32. | శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి | 1971 |
| 33. | శ్రీ వానమలై వరదాచార్యులు | 1971 |
| 34. | శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి | 1972 |
| 35. | శ్రీ గంటి జోగి సోమయాజి | 1972 |
| 36. | శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి | 1972 |
| 37. | డా॥ బెజవాడ గోపాలరెడ్డి | 1973 |
| 38. | డా॥ బోయి భీమన్న | 1973 |
| 39. | డా॥ దివాకర్ల వేంకటావధాని | 1973 |
| 40. | శ్రీ దేవులపల్లి రామానుజరావు | 1973 |
| 41. | శ్రీ నోరి నరసింహశాస్త్రి | 1973 |
| 42. | శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం | 1973 |
| 43. | శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ | 1974 |
| 44. | శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి | 1975 |
| 45. | శ్రీ నిడదవోలు వెంకటరావు | 1976 |
| 46. | శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు | 1976 |
| 47. | శ్రీ విద్వాన్ విశ్వం | 1976 |
| 48. | శ్రీ గడియారం రామకృష్ణశర్మ | 1977 |
| 49. | శ్రీ మోటూరు సత్యనారాయణ | 1977 |
| 50. | శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి | 1977 |
| 51. | శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి | 1978 |
| 52. | శ్రీ యం.ఆర్. అప్పారావు | 1979 |
| 53. | శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి | 1980 |
| 54. | శ్రీ యస్. సంజీవదేవ్ | 1980 |



# తెలుగులో పరిశోధన

# కొత్తపుంతలు : భవిష్యద్దర్శనం

—కొత్తపల్లి వీరభద్రరావు

భవిష్యాన్ని గురించి మనం ఏ మాటలు చెప్పాలనుకొన్నా అవి భూతవర్తమానాలమీద-చాలావరకు-ఆధారపడి ఉంటాయనే విషయం విస్మరించకూడదు. వర్తమానం - ఓ వైపు భూతమైపోతూ, ఇంకోవైపు భవిష్యాన్ని వర్తమానం చేసుకొంటూ సాగిపోతుంది. భూతంలేని వర్తమానంలేదు. వర్తమానంలేని భవిష్యం లేదు. అది భవిష్యానికి క్రమంగా భూతమైపోతూ ఉంటుంది. ఇందువల్లనే కాలం అనాది, అనంతం అనే నమ్మకం ఏర్పడింది. ప్రవాహంగా సాగుతున్న కాలాన్ని మన వీలుకోసం, అనుభవాన్నిబట్టి త్రికాలాలుగా విభజించుకొన్నాము. అయినా, ఒక విధంగా చూస్తే ఉన్నది ఎప్పుడూ వర్తమానమే! నిన్న గతించింది! రేపు జన్మించలేదు! ప్రవహిస్తూ ఉన్న నదిలో ఎప్పుడూ కొత్త నీళ్ళే! అయితే, మిగిలిన కాలాల మాటేమిటి? మన స్మృతులు భూతకాలానివి. కృషి వర్తమాన కాలానిది. ఫలితాలు భవిష్యత్కాలానివి. ఇందువల్ల, సత్ఫలితాలకోసం వర్తమానంలో గట్టి కృషి చెయ్యాలి. భూతకాలానుభవంతో వర్తమానాన్ని సరిదిద్దుకొంటూ భవిష్యాన్ని శాసించాలి. వ్యక్తిగత జీవితంలో, జాతి మనుగడలో సర్వేసర్వత్ర ఇది సత్యం. మానవుల కృషిమీద ఆధారపడి ఉన్న అన్ని విషయాలలోను ఇది గమనించవలసిందే.

మానవుల్ని ఇతర జీవులనుండి వేరుచేసిందీ విశిష్టతను సమకూర్చిందీ భాషే గదా! ఆ భాషలోనే సాహిత్యసృష్టి; సాహిత్యంలో మంచిచెడ్డల పరిశీలన. ఈ పరిశీలనకు మానదండం-సామాజిక ప్రయోజనం ఒక వైపు; ఆనందం ఒక వైపు. విశ్వశ్రేయస్సు, ఆనందం-రెండూ సాధించినది ఉత్తమ సాహిత్యమనే నిర్ణయం. ఈ పరిశీలన, విమర్శకు దారితీసింది ఈ విధంగా. విమర్శలో గుణదోష విచారణం సహజం. సమగ్ర విమర్శలో - గృహీత రచనను విశ్లేషణాత్మకంగా, వివరణాత్మకంగా పరిశీలించి వస్తుస్వరూపాన్ని సహృదయ పఠితలకు ప్రదర్శించడం ఉంటుంది. దీనివల్ల పఠితల చైతన్యం నిశితమై వారి విజ్ఞాన వికాసాదులు అభివృద్ధి పొందుతాయి. విద్వాంసుడైన సహృదయ విమర్శకుని విమర్శవల్ల గృహీత రచనలోని వైశిష్ట్యం సామాన్య పాఠకులకు కూడా అవగతమై వారందరూ ఆ రచనను ఇతోధికంగా ఆనందించడానికి వీలు కలుగుతుంది. పండిత పాఠకులకు ఆ రచనను సంపూర్ణంగా ఆమోదించడానికి మార్గం ఏర్పడుతుంది. అంటే, విమర్శ- విమర్శితరచనను వివిధ దృక్పథాలలో పరిశీలించి పఠితలకు - వారు పామరులైనా, పండితులైనా-ఆ రచనను అవగాహన చేసుకోవడంలో విచక్షణతను అధికం చేస్తుంది అన్న మాట! అయితే, విమర్శకుడు గ్రహించిన ప్రమాణాల ననుసరించి విమర్శ స్వరూపం మారుతుందనడంలో విప్రతిపత్తిలేదు. విమర్శ - ప్రాచ్య ప్రమాణానుసారం సాగినా, పాశ్చాత్య లక్షణానుసారం కొనసాగినా,

ఉభయ ప్రమాణాల సమ్మేళనానుసారం సాగినా-ఫలితాలలో భేదాలు వచ్చినా - వ్యక్తిగతాలైన ద్వేషాభిమానాలకు చోటు లేకపోతే - దాన్ని మనం ఉత్తమ విమర్శ అనవచ్చును. కాని, రచన బయలుదేరిన దేశకాలపాత్రానుసారంగా ప్రమాణాలను గ్రహించక, ఇతర ప్రమాణాలతో ఆ రచనను విమర్శించడం ఎంతవరకు ఔచిత్యశోభితం అనే ప్రశ్న ఉదయించక పోదు! దేశకాలపాత్రాదుల వైవిధ్యంఉన్నా రచనల లోని వస్తువులో విశ్వజనీనత ఉన్నట్లయితే అది ఏ విధంగా సర్వులకు ఉపాదేయమో, అదే విధంగా విమర్శప్రమాణాలలో తారతమ్యాలున్నా వైషమ్యాలు లేని సార్వకాలిక ప్రమాణాల నంగీకరించి విమర్శ కొనసాగిస్తే అదీ అంగీకృత మవుతుంది.

ఒక రచనకు సంబంధించిన వివిధ విషయాలను ఆకళింపునకు తెచ్చుకొని ఆ రచనను పరిశీలించి విమర్శించడమనేది ఆచరణలోనికి రావడంతో పరిశోధనకు ప్రాముఖ్యం వచ్చింది. ఆ రచన బయలుదేరిన దేశకాలాదులను, రచయిత సంస్కారాదులను, ఆర్థికాది పరిస్థితులను - విమర్శ పద్ధతులలో మార్పులను తీసుకొని రావడానికి ఆధారాలు గ్రహించినప్పుడు, పరిశోధన ద్వారా పైన వివరించిన ''రచన వాతావరణం'' పరిశీలించకుండా విమర్శ చేయడం పొసగదు. ఇది నవీన పద్ధతి. మన ఆలంకారికులు రచనలను పరిశీలించేటప్పుడు కావ్య శాస్త్ర దృష్ట్యా రసాదుల విషయాన్ని విమర్శించి వ్రాసేరేగాని, కవికాలాదులను విమర్శను ప్రభావితం చేసే అంశాలుగా గ్రహించినట్లు కనబడదు. ఈ గ్రహింపు లేనప్పుడు, ఆధునిక కాలంలో మన మనుకొంటూ ఉన్న పద్ధతిలో విమర్శ వ్రాయడం ఉండదు గనక ఇలాంటి విమర్శ రచనలు ఆనాడు లేవు. కాళిదాసాది మహాకవులను గురించి ప్రస్తావన వచ్చినప్పుడు ''పురాకవీనాం గణనా ప్రసంగే'' మొదలైన పద్ధతిలో తమ గౌరవాన్ని సూక్ష్మంగా మనోహరంగా తెలుపుకోవడమో, కవుల రచనలలోని గుణాదులను వ్యక్తం చేయడమో జరుగుతూ ఉండేది. ఆధునిక కాలంలో వచ్చిన సుదీర్ఘ రచనలను పోలిన రచనలు లేవు. కవి కాలాదులకు, సామాజిక పరిస్థితులకు- కవుల రచనల గుణదోష విచారణలో స్థానం లేకపోవడంవల్ల ఈనాడు మనం పరిశోధన అనుకొంటూ సాగిస్తూ ఉన్న అన్వేషణ ఆనాడు లేదంటే సత్యదూరం కాదు. ఈ విధంగా, పరిశోధన, విమర్శ అనేవి పరస్పర పోషకాలుగా ఆధునిక కాలంలో అభివృద్ధికి వచ్చి - ఆధునిక కాలమంటే, పాశ్చాత్య సాహిత్య సంస్కృతులతో మనకు సంపర్కం వచ్చినప్పటి నుండి అని స్థూలంగా చెప్పుకోవచ్చును - కాలక్రమంగా కొత్త పుంతలను తొక్కడం ప్రారంభించాయి.

భవిష్యాన్ని గురించి వ్రాసేటప్పుడు - నేను ప్రారంభంలోనే చెప్పినట్లు - ఆ వ్రాతలో ''కొత్త పాతలు'' కలిసి తీరుతాయి. ''ఊహ''కు తావున్న రచన అవుతుంది గనక, దానిలో కొంత ''తత్త్వ చింతన'' ఉండకుండా ఉండదు. కేవలం-విషయాల చారిత్రక వివరణగాని, జరిగిన పనిని సర్వేక్షించడం గాని కాకపోవడంవల్ల - చెప్పినదాన్ని నలుగురూ ఆమోదించి ఆచరణలో పెట్టినప్పుడు గాని దాని మంచి చెడ్డలు, సాధ్యాసాధ్యాలు నిర్ణయం కావు. కాని, భవిష్యం కోసం మనం చేసే సూచనలు, ప్రణాళికలు - భూత కాలంలో జరిగిన విషయాలను, వర్తమానంలో జరుగుతున్న అంశాలను ఆధారంగా చేసుకొని - లోటులను పూర్తి చేసుకోవాలనీ లోపాలను సవరించుకోవాలనీ - చెప్పేవే గనక పూర్వాపర సంబంధం ఉంటుంది. ఆవశ్యకం కూడా. పరిశోధన రంగంలో జరిగిన కృషి, జరుగుతున్న కృషి మనకు తెలిసే ఉంది. భవిష్యంలో జరగవలసిన కృషి వీటిమీద ఆధారపడి ఉంటుంది, వీటి నధిగమించీ ఉంటుంది. కొత్త పుంతలలో నడవడమూ ఉంటుంది, పాతవాటిని విస్తృత పరిచి పయనించడమూ ఉంటుంది. భాషా సాహిత్యాలకు సంబంధించిన పరిశోధనలలో కొత్త పాతల కలయిక తప్పదు. చాలా

విషయాలలో, వస్తువు పాతదైనా, దృక్పథంలో కొత్తదనం తీసుకొని రావడం, కొత్త పుంతలను తొక్కడమే అవుతుంది. వస్తువూ దృక్పథమూ రెండూ కొత్తవి కావడమూ ఉంటుంది. మేధాశక్తి, హృదయ స్పందన - మనుష్యుని ముఖ్య లక్షణాలయితే, భాషా సాహిత్యాలు అతని వైశిష్ట్యాన్ని చాటేవి. మానవ పురోగతి భాషా సాహిత్య రథం మీద పయనిస్తుంది అనుకొంటే ఈ రథానికి - పరిశోధన విమర్శలు రెండు చక్రాలు. ఒక్కొక్కప్పుడు, ఈ రెండు చక్రాలు సూర్యుని ఏక చక్రంలా పని చేయడమూ ఉంది! భాషా సాహిత్యాలు వేరువేరు రథాలు అనుకొన్నా ఈ రెండూ చక్రాలుగా ఉండగలవు! ఇంకో దృష్టికోణం నుండి చూస్తూ ఈ రెండింటిని - పరిశోధన, విమర్శలను - వర్ణించదలచినట్లైతే వీటిని ఒకే నాణేనికి ఉన్న రెండు పక్కలుగా ఉపమించవచ్చు. ఇవి పరస్పర ప్రవేశార్హతలు లేని, పరస్పర ప్రవేశాలు లేని పృథగ్విషయాలు కావు. ఇందువల్లనే ప్రప్రథమ విమర్శకులలో పరిశోధన దృష్టి పరిశోధకులలో విమర్శ దృష్టి మనకు కనబడతాయి. ఆనాటి విమర్శకులు, విమర్శించే విషయాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవడానికి పరిశోధన చేయవలసివచ్చేది. లభ్యమైన విషయం ఎంత వరకు సత్యసమ్మతమో ఉపాదేయమో నిర్ణయించుకోవడానికి విమర్శ అవశ్యకమయ్యేది ఆనాటి పరిశోధకులకు. ఈ రెండూ ఈనాటికీ కావలసినవేగాని ఆనాడు కావలసినంత ఈనాడు కాదు. విమర్శ పరిశోధనలు తమంత తాము నిలుస్తున్నాయి. నిలువగలవు. అయినా ఈ రెండింటికి అవినాభావ సంబంధం ఉంది. పరిశోధనలవల్ల భాషా సాహిత్యాలలో లభించిన నవ్యాంశాలు గ్రహించి విమర్శలు విస్తృతం కావడానికి అవకాశాలున్నాయి. విమర్శల తీవ్రతలను తట్టుకోవడానికి పరిశోధనలు ఇతోధికంగా కొనసాగి నూతన విషయాలను ఆవిష్కరించడానికి వీలున్నది. కొత్త పుంతలలో పరిశోధనలను ఎలా నడిపించవచ్చునో భావించుకొనేముందు, దిఙ్మాత్రంగా ఇతఃపూర్వం పరిశోధనలు నడిచిన తీరుతెన్నులను పరామర్శించుకొందాము. సమగ్రంగా ఈ విషయాలన్నీ ఈ గ్రంథంలోనే ఇంతకుముందు సమీక్షితాలయ్యాయి. విషయాలన్నీ చర్విత చర్వణాలు కానక్కరలేదు గాని, వాటిని స్థూలంగా స్మరించుకోవడం పరిశోధన భవిష్యద్దర్శనానికి సముచిత నేపథ్యం అవుతుంది.

భాషా సాహిత్యాల సిద్ధాంత ప్రమాణాలను గురించి పరిశోధనలను వికాస దశకు తెచ్చిన మనీషుల కృషికి పూర్వ రంగంగా జరిగిన కృషియొక్క పుట్టుపూర్వోత్తరాలు, పరిశోధనల నిర్వహణ విషయంలో వివిధ సంస్థల పాత్రను గురించి, ప్రక్రియాపరంగా జరిగిన పరిశోధనలనుగురించి తెలుసుకోవడం జరిగింది. ప్రక్రియలలో - కావ్యపురాణాదులకు సంబంధించిన పరిశోధన; శతకోదాహరణాల పరిశోధన; పద, జానపద సాహిత్య పరిశోధన; దేశిరూపక ప్రక్రియలకు సంబంధించిన పరిశోధన; నవల, చిన్న కథల పరిశోధన; ఛందః పరిశీలన; ఇతిహాసాదుల పరిశీలన; భాషాశాస్త్ర పరిశోధన మొదలైనవి ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. పరిశోధన క్రమపరిణామ వికాసాలు కూడా చర్చించడం జరిగింది.

మన సంప్రదాయంలో గ్రంథాలకు బయలుదేరిన వ్యాఖ్యానాలు మొదలైనవి పరిశోధన విమర్శలకూడలి. ఇందే, వ్యాఖ్యాతలు పూర్వ వ్యాఖ్యాతలను విమర్శించడం సోపపత్తికంగా తమ అభిప్రాయాలను ప్రకటించడం జరుగుతూ ఉండేది. మల్లినాథాది మహావ్యాఖ్యాతలు, ఇతరుల వ్యాఖ్యానాలవల్ల కాళిదాసాది మహా కవుల కావ్య సరస్వతి "కువ్యాఖ్యా విషమూర్ఛితా" అని వ్రాసి తమ విమర్శనాత్మకాలైన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. రచనలమీద గాని రచయితల మీద గాని వేరే- ఈనాడు మనమనుకొంటూ ఉన్న పద్ధతిలో- విమర్శ గ్రంథాలు వ్రాయడం అలవాటు లేని ఆ దినాలలో వ్యాఖ్యాత తానే విమర్శకుడుగా

అవతరించి తన పాండిత్యప్రకటనకు భావవ్యక్తీకరణకు వ్యాఖ్యానమే మార్గం కాబట్టి దానిలోనే తన పాండిత్యాన్ని - ఒక్కొక్కప్పుడు వ్యాఖ్యాన ప్రయోజనాన్ని కూడా విస్మరించి - ప్రకటించేవాడు. పంధొమ్మిదో శతాబ్దిలో - ఇంచుమించుగ అరవై సంవత్సరాలు - తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికోసం శ్రమించిన సి. పి. బ్రౌన్ (1798-1884) ఆనాటి పండితుల వ్యాఖ్యానాలను గురించి ఇలా అన్నాడు:

"Hitherto every path was over grown with gay weeds of pedantry which I have cleared away......we ask for grain: they give it us on the condition that we will, with it, submit to eat the straw...They were written more to glorify the acumen of the critic and less to aid the learner..."

ఇందువల్లనే, తన కోరిక ననుసరించి మొట్టమొదట ములుపాక బుచ్చయ్యశాస్త్రి "వసు చరిత్ర"కు వ్యాఖ్యానం వ్రాసినా, దానిలో పాండిత్య ప్రకర్ష ఉన్నంతగా విషయ స్పష్టీకరణలేదని భావించి బ్రౌనుదొర తిరిగి దానికి వ్యాఖ్యానం జూలూరు అప్పయ్య పంతులుచేత వ్రాయించి 1844 లో అచ్చువేయించాడు. ఈ గ్రంథానికి తానేవ్రాసిన "నోటీస్" (Notice)లో ఈ నవ్య వ్యాఖ్యానం ఉద్దేశించిన విషయాన్ని ఇలా వివరించాడు:

"The former annotators have chiefly criticised the peculiarities of rhetoric, rhyme, or orthography; but the present notes have a very different object being intended to explain to text, word by word, in the clearest manner, so as to do away the necessity of oral instruction."

బ్రౌనుదొర మొదలైన పాశ్చాత్యులు తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికి చేసిన కృషి మౌలికమైనదీ మన విమర్శ, పరిశోధనలను నవ్య మార్గాలలో నడిపించినదీ కావడంవల్ల ఈ విషయాన్ని గురించి కొంత విస్తృతంగా వ్రాయడం జరిగింది. తెలుగుభాషా సాహిత్యాల విమర్శ పరిశోధనల చరిత్రను స్థూలంగా ఈ కారణాలవల్లనే అయిదు యుగాలుగా విభజించవచ్చును. పంధొమ్మిదో శతాబ్ది ప్రారంభంవరకు (1800 క్రీ. శ. వరకు) పరిశోధన విమర్శకులకు ప్రాచీన యుగం అనవచ్చు. ఈ యుగం చివరి దశాబ్దులలో తెలుగు కావ్యాలకు బయలుదేరిన వ్యాఖ్యానాలు, ఛందో వ్యాకరణ గ్రంథాలలో కనబడే విమర్శాత్మకమైన వివరణలు, ఈనాటి మన పరిశోధన విమర్శల పనులు నిర్వర్తించాయి. విమర్శ పరిశోధనల దృష్ట్యా దీన్ని వ్యాఖ్యాన యుగం అనవచ్చు. 1800 మొదలు 1850 వరకు బ్రౌణ్యయుగం. తెలుగు భాషా సాహిత్యాలలో కృషి చేసిన పాశ్చాత్య విద్వాంసుల యుగమిది. ఈ విద్వాంసులలో బ్రౌనుదొర సర్వప్రథముడు. ఈ యుగంలోనే తెలుగు ముద్రణ పరిణామ వికాసాలను పొందింది. పదులకొలది ముద్రాక్షరశాలలు మద్రాసులోను, తెలుగు ప్రాంతంలోను స్థాపితాలయ్యాయి. బ్రౌను దొర (1798-1884) తెలుగు పుస్తకాల సేకరణలోను, వాటికి పండితులచేత వ్యాఖ్యానాలు వ్రాయించి ముద్రించడంలోను, వేమన మొదలైన కొన్నింటిని ఇంగ్లీషులోనికి అనువదించడంలోను అగ్రగణ్యుడయ్యాడు., ముద్రణకళావైశిష్ట్యాన్ని గుర్తించి తెలుగువారికి దానియందభిరుచి కలిగించాలని ప్రయత్నించాడు:

"I have done what I could to awaken the Telugus to the advantages of printing and after more than twenty years of exhortation,

they are following my leading......I now see my advice is followed, and in 1865 the Telugu printing trade is as fairly established as the Bengali was eighty years before, and the Tamil earlier still.......I knew that this literature would never flourish until the book-sellers took it up as a profitable business."

బ్రౌనుదొర, తాను వ్యాఖ్యానాలు వ్రాయించి అచ్చునకు సిద్ధము చేయించిన తెలుగు కావ్యాలను, అచ్చువేసుకొనుటకు ఇతర ముద్రాపకుల కియ్యడం కూడా ఉంది. ఈ విధంగా లాభం పొందిన వారిలో పురాణం హయగ్రీవశాస్త్రి, పువ్వాడ వెంకటరావు మొదలైన ముద్రాక్షరశాలాధికారులున్నారు. హయగ్రీవశాస్త్రి 1848లో స్వకీయ వివేకాదర్శ ముద్రాక్షరశాలలో అచ్చువేసిన పోతన భాగవతము, బ్రౌనుదొర ముద్రణకు సిద్ధం చేయించిందే! పువ్వాడవారు అచ్చువేసిన తెలుగు భారతంలోని కొన్ని పర్వాలు, బ్రౌను దొర అచ్చునకు సిద్ధం చేయించినవే! ఈయనది వర్తమాన తరంగిణి ముద్రాక్షరశాల. ఇదే పేరుతో ఒక పత్రికను కూడా ఈయన కొంత కాలం నడిపాడు.

తెలుగు భాషా సాహిత్యాలమీదే కాకుండా, దేశ చరిత్రమీద కూడా విశేష ప్రభావం చూపించిన కృషి చేసిన కల్నల్ కాలిన్ మెకంజీ (1753 - 1821), ఆయన పండితులు-కావలి వెంకట బొర్రయ్య (1776-1803), రామస్వామి, లక్ష్మయ్య ప్రభృతులు పరిశోధనకు పునాదులు వేసినవారే. పంధొమ్మిదో శతాబ్ది ప్రారంభ దశాబ్దులలోనే - తెలుగు సంస్కృత భాషా జన్యం కాదని కంఠోక్తిగ ఏ. డి. కేంబెల్ (మృతి-1857) తన తెలుగు వ్యాకరణం (1816)లో చెప్పడం జరిగింది. ఈ వ్యాకరణంలో ప్రారంభంలో ఒక నోటు వ్రాసిన ఫ్రాన్సిస్ ఎల్లిస్ (మృతి-1819) కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. ఇంతకు పూర్వం, డా॥ విలియమ్ కెరే (1761 - 1834) తన తెలుగు వ్యాకరణాన్ని 1814 లో అచ్చువేసి దానిలో తెలుగు సంస్కృత జన్యం అని వ్రాశాడు. కేంబెల్ ప్రభృతులు దీన్ని ప్రతిఘటించారు. బిషప్ కాల్డ్‌వెల్ వ్రాసిన ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణంకూడా (1856) ద్రావిడ భాషల శాస్త్రీయాధ్యయనాన్ని పెంపొందించింది. బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ (1814 - 1891) బ్రౌను దొరను బాగా ఎరుగును. ఇద్దరూ ఒకసారి కలిసి ఓడలో ఇంగ్లండు నుండి ఇండియాకు ప్రయాణం చేశారు.

ఈ యుగంలోనే ఇంకా ఎందరో పండితులు తెలుగు భాషా సాహిత్యంలో కృషి చేశారు. పరవస్తు చిన్నయసూరి (1806 - 1862) వంటి వారున్నారు- బ్రౌనుదొర పండితులైన - వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి, జూలూరు అప్పయ్య పంతులు మొదలైనవారు, కంపెనీ పరిపాలనలో ఉన్నతోద్యోగాలు చేసిన బహుభాషావేత్తలు - ఏనుగుల వీరాస్వామయ్య (1780-1836), వెన్నెలకంటి సుబ్బారావు (1784-1839), గాజుల లక్ష్మీనరుసుసెట్టి (1806 - 1868) ప్రభృతులు ఎందరో ఉన్నారు. ఎన్నో విద్యాసంస్థలు బయలుదేరాయి. పత్రికలు వ్యాప్తి పొందాయి. రాబోయే దశాబ్దులలో జరిగే విమర్శ పరిశోధనల కృషికి కావలసిన సామగ్రి సమస్తం సమకూడిన యుగం ఇది-

1850 మొదలు 1900 వరకు వికేంద్రీకరణ యుగం. ఈ యుగంలో-పదుల కొలది ముద్రాక్షరశాలలు వందలలోకి మారి దేశంలో- ఇంచుమించుగా- ప్రతి పట్టణంలోను ఇవి ఏర్పడ్డాయి. పరిశోధన విమర్శల రంగాలు విస్తృత మయ్యాయి. ఇరవయ్యో శతాబ్దిలో ప్రాముఖ్యానికి వచ్చిన వ్యావహారిక భాషోద్యమం మొదలైనవాటికి బీజావాపం జరిగింది- ఇరవయ్యో శతాబ్ది ప్రారంభ దశాబ్దులలో పరిశోధన విమర్శలలో ప్రముఖులైన వారందరూ జన్మించారీ కాలంలోనే. విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి-

సాహిత్యం ద్వారా సామాజిక విప్లవాన్ని సాగించిన వీరేశలింగం (1848-1919), గురజాడ అప్పారావు (1861-1915) ప్రభృతులు ఈ యుగంలోనే విజృంభించారు. పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులు స్థిరపడ్డాయి. ఇంగ్లీషు చదువులు నిర్ణీత పద్ధతిలో జరగడం మొదలై వ్యాప్తి పొందాయి.

1900 మొదలు 1950 వరకు నాల్గవ యుగం. ఈ యుగాన్ని, విమర్శ పరిశోధనల దృష్టిననుసరించి ప్రాగాధునికయుగం అనవచ్చును. మూడో యుగంలో బయలుదేరిన కవిజీవితాదుల విమర్శ, శాబ్దిక చర్చలు ఈ యుగం ప్రారంభ దశాబ్దులలో విశేషంగా జరిగాయి. ఇందువల్ల ఈ యుగాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చు. అధ్యయనానుకూల్యమే దీనివల్ల మనకు సిద్ధించేది. మొదటి విభాగాన్ని శాబ్దిక చర్చా విభాగం అందాము. ఆనాడు మహావిద్వాంసులని పేరు పొందినవారందరూ శాబ్దికచర్చల ద్వారా పరస్పరం దూషించుకొన్నవారే! ఎవరికీ ఏమీ రాదని నిర్ణయించుకొన్నవారే' వీరిలో ప్రాక్పశ్చిమ పద్ధతుల కలగలుపు కనబడుతుంది. వీరిలో- వేదం (1853-1929), కొక్కొండ (1842-1915) మొదలైన మహావిద్వాంసులున్నారు. రెండో విభాగాన్ని కవిత్వ తత్త్వ విచార విభాగం అనవచ్చును. పాశ్చాత్య పరిశోధన, విమర్శ పద్ధతులను పుణికి పుచ్చుకొన్న రచనలు సాగించిన కట్టమంచి (1880-1951) వారి ''కవిత్వ తత్త్వవిచారము'' (1914) ఆధారంగా నామకరణం చేయడం జరిగింది. ఎందరో ఉత్తమ విమర్శకులు, పరిశోధకులు (వేటూరి, మల్లంపల్లివంటివారు) రచనలు సాగించారు.

1950 నుండి పరిశోధన- విస్తృత పరిధిలో- విశ్వవిద్యాలయాలను ఆశ్రయించింది. ఇంతకు పూర్వం, డిగ్రీలకోసం ఇంత విరివిగా పరిశోధనలు చేయడం లేదు. ఎప్పుడో (1927 (?)/1929 మద్రాసు విశ్వవిద్యాలయం) చిలుకూరి వారికి పరిశోధనవల్ల ''రిసెర్చి డిగ్రీ'' వచ్చిందని విన్నాము. తరవాత, ఇంచుమించుగా రెండు దశాబ్దులు ఎవరికీ రిసెర్చి డిగ్రీ ప్రస్తావనే లేదంటే పెద్ద అతిశయోక్తి కాదు. ఇంత మాత్రంచేత, దేశంలో పరిశోధనలు జరగలేదని కాదు. ఉత్తమ పరిశోధకులు అనేక రంగాలలో ఎన్నో కొత్త విషయాలు, మన కవులను గురించి కావ్యాలను గురించి, తెలుసుకొని వాటిని వెలువరించారు. తెలిసిన అంశాలను నవ్య దృక్పథంతో పరిశీలించి సమీక్షించారు. ఎన్నో ఉద్గ్రంథాలు వచ్చాయి. ''డిగ్రీలులేని పాండిత్యము పన్నైకురాని ఈ పాడు కాలాన'' పుట్టినవారు కూడా తమ ప్రతిభావ్యుత్పత్తుల వల్ల ఉత్తమ పరిశోధనలు చేసి ప్రజాదరణను, పండితుల ప్రశంసలను పొందారు. తమ పరిశోధనలవల్ల వారికి విశ్వవిద్యాలయాల డిగ్రీలు రాలేదంటే. తమంత తాము, విశ్వవిద్యాలయాలకు సంబంధం లేకుండా పరిశోధన సాగించి బృహద్గ్రంథాలను వ్రాసినవారికి విశ్వవిద్యాలయాల డిగ్రీలు రావడం ఆ రోజులలో తక్కువ. అవకాశాలు లేవు.

ఉద్యోగం చేస్తూ - అది విశ్వవిద్యాలయంలో కాకపోతే- రిసెర్చి డిగ్రీ సంపాదించడానికి ఆ రోజులలో అవకాశాలే లేవు. సెలవుమీద వచ్చి విద్యార్థిగా చేరి పరిశోధన చేయవలసిందే. మేమంతా అలా శ్రమపడ్డవారిమే. ఆనాడు, ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులను ఎవరైనా ''ఏమండీ, ఉత్తమ పరిశోధన చేసి ఉద్గ్రంథాన్ని రచిస్తే దానికి రిసెర్చి డిగ్రీ ఎందుకు ఇయ్యకూడదు?'' అని ప్రశ్నిస్తే, ''ఉత్తమ గ్రంథం వ్రాసినవారిని లోకం ఎలాగా గౌరవిస్తుంది. వారికి మా డిగ్రీ ఎందుకు?'' అని ఉపాధ్యక్షుల వాదం. ''ఒక పద్ధతిలో, నియమానుసారం, విద్యా సంబంధమైన కొన్ని నియమాలను పాటించినవారికే మేము రిసెర్చి డిగ్రీ ఇస్తాము. అవి పాటించనప్పుడు, వారికి దేశంలో పరిశోధనలవల్ల పేరు ప్రతిష్ఠలు రావచ్చును. మా డిగ్రీ మాత్రం రాదు. దానికి మా పద్ధతులు కావాలి'' అని ఉపాధ్యక్షుల నిర్ణయం. ఇప్పుడివి మన విశ్వవిద్యాలయాలలో కొంత

సడలిసాయనవచ్చును. అయినా, ఇప్పటికీ ''రిసెర్చి డిగ్రీలు'' పరిశోధన చేసి వ్రాసిన సిద్ధాంతవ్యాసాలకే వస్తున్నాయి. తెలుగులో విస్తృతపరిధిలో ఇప్పుడు జరుగుతున్న పరిశోధన అంతా డిగ్రీలకోసమే అంటే విప్రతిపత్తి లేదు. భాషా సాహిత్యాలలో బాగా పని జరుగుతోంది. ఉద్యోగం లభించడానికి ఎమ్.ఫిల్., ఉద్యోగంలో అభ్యుదయానికి పిహెచ్.డి., అనివార్యాలయ్యాయి. ఈ పరిస్థితులలో విద్య నేర్చిన యువతీయువకులు ''కొత్త నీటికి ఎగపడ్డ చేపల''లా, రిసెర్చి డిగ్రీలకోసం పాకులాడుతున్నారు. విశ్వవిద్యాలయాలతో సంబంధం లేనివారి గ్రంథాలకు అప్పుడప్పుడు విశ్వవిద్యాలయాలు డిగ్రీలు ఇయ్యడం ఇప్పుడు కనబడుతోంది. కాని, విశ్వవిద్యాలయాలలో పరిశోధనలు ప్రారంభమై అభివృద్ధి పొందుతూ ఉండడంవల్ల, ''సిద్ధాంతవ్యాసం'' అనే పేరు, ఆ రచనకు కొన్ని నిర్దిష్ట లక్షణాలు వచ్చాయి. ఈ సిద్ధాంత గ్రంథం రచన ఎలా ఉండాలి, అథస్సూచికలు మొదలైనవి ఎలా ఉండాలి, అనుబంధాలు ఎలా వ్రాయాలి-చివరికి బైండింగు ఎలా ఉంటాలి అనేవరకు-అన్ని విషయాలు చెప్పే ''సిద్ధాంతవ్యాసరచన పద్ధతులు'' అనే కోర్సు కూడా మన విశ్వవిద్యాలయాలలో వచ్చింది. దీనికి వెనుక, పాశ్చాత్య విశ్వవిద్యాలయాల ప్రభావం చాలా ఉంది. ఇంక ఇప్పుడు పరిశోధన అంటే విశ్వవిద్యాలయాలలో డిగ్రీకోసం చేసే-నిర్ణీతకాలంలో- కృషి అని రూఢమైంది. విశ్వవిద్యాలయేతర సంస్థలలో జరుగుతున్న పరిశోధనలను కూడా కొన్ని విశ్వవిద్యాలయాలు పరిగణించి డిగ్రీలు ఇస్తూ రావడంతో అక్కడ జరిగేటువంటి పరిశోధన కూడా, గ్రంథ రచనాదికంలో విశ్వవిద్యాలయ విద్యార్థుల పరిశోధన పద్ధతులను అవలంబించడం జరుగుతోంది. ఇందువల్ల, ఈనాటి పరిశోధనల ఫలితాలు గ్రంథరూపం పొందేటప్పుడు ఒక నిర్దిష్టమైన ఏకరూపతను పొందుతున్నాయి. ఇంచుమించుగా, మూడు నాలుగు దశాబ్దులనుండి ఈ పద్ధతిలో తెలుగు భాషా సాహిత్యాలలో పరిశోధనలు జరుగుతూ రావడంవల్ల వాటి నన్నింటిని సమీక్షించడం, మంచిచెడ్డలు తైపారు వేసి పరిశీలించుకోవడం, ఈ కృషి భవిష్యంలో ఎలా జరిగితే ఇంకా సత్ఫలితాలు లభిస్తాయి అని ఆలోచించుకోవడం సహజమే కాకుండా ఆవశ్యకం కూడా. పరిశోధనకు విమర్శకు అవినాభావ సంబంధం ఉంది గనుక కూడా పై విషయాల పరిశీలనకు అత్యంత ప్రాముఖ్యం ఉంది.

ఇంతవరకు జరిగిన పరిశోధనను-ముఖ్యంగా విశ్వవిద్యాలయాలలో జరిగిన దానిని-పరిశీలిస్తే కనబడే విషయాలను, మూడు ముఖ్యాంగాలుగా విభజించి చూచుకొంటే భవిష్యంలో ఎలా అభివృద్ధిని ఇతోధికంగా సాధించగలమో తెలుస్తుంది. తెలుగులో జరుగుతూ ఉన్న, జరిగిన పరిశోధన ముఖ్యంగా ''భాషా సాహిత్యాలు'' అనే రెండు నిర్దిష్టమైన విభాగాలలో జరుగుతోంది. ఈ రెండింటికి అన్వయించే పద్ధతిలో మన ''పరిశోధన వాఙ్మయా''న్ని విశ్లేషించి చూడడానికి మనం మూడు దృష్టి కోణాలను గ్రహించవచ్చు. విషయం, భాష, ప్రదర్శనం-అనేవే ఆ మూడూను. ఇందువల్ల, ఈ మూడుకోణాలనుండి భవిష్యంలో అభివృద్ధి ఎలా సాధించడానికి కృషిచేయాలో నిర్ణయించుకోవచ్చును. పరిశోధనకు పరిశోధకుడు గ్రహించే విషయం లేదా వస్తువు; గ్రహించిన విషయాన్ని వ్యక్తం చేసేటప్పుడు భాష విషయంలో ఉండవలసిన దృష్టి; సిద్ధాంతగ్రంథాన్ని సహృదయుల ముందు పెట్టేటప్పుడు వస్తువునకు, భాషకు ప్రత్యక్షంగా సంబంధించని-కాని సిద్ధాంతగ్రంథం పరిపూర్ణతకు ఆవశ్యకాలైన-విషయాలను ప్రదర్శించడంలో తీసుకోవలసిన కొన్ని ''జాగ్రత్తలు'' - అనేవి కొంత పరిశీలించదగినవి.

తెలుగులో, భాషా సాహిత్యాలలో పరిశోధనల వల్ల ఇంతవరకు ఆరు వందల మంది కంటె ఎక్కువగానే రిసెర్చి డిగ్రీలు పొందినట్లుగా తెలుస్తోంది. ఈ పరిశోధకులు స్వీకరించిన విషయాలను చూస్తే,

ఇంచుమించుగా, నూటికి ఎనభై శాతం కంటె ఎక్కువ మంది సాహిత్య విషయాలను తీసుకొని పరిశోధనలు చేసినట్లు కనబడుతోంది. భాషకు సంబంధించిన విషయాలను గ్రహించి పరిశోధనచేసిన వారి పరిశోధనలు, భాషాశాస్త్ర శాఖలో చేరిపోవడం కూడా దీనికి కారణం కావచ్చును. ఏది ఎలా ఉన్నా తెలుగులో సాహిత్య విషయాల మీద జరిగినంత, జరుగుతున్నంత పరిశోధన భాషా విషయాల మీద జరగలేదు; జరగడం లేదు. ముందు ఇది మనం గుర్తించి, దీన్ని సరిచేసుకోవాలి. సాహిత్యానికి ఎంత ప్రాముఖ్యం ఉన్నా, అంత ప్రాముఖ్యం భాషకు లేదనుకోవడం- అలాంటి భావం ఉంటే-తప్పు. ఆధునిక యుగంలో ''ప్రజల భాష'' అంతకు పూర్వం ఎప్పుడూ వహించనంత ప్రాముఖ్యం వహించింది. దీని వల్ల అది వహించవలసిన భారమూ అధికమే అవుతుంది: అయింది కూడా. తెలుగు విషయంలోనూ ఇది సత్యమే. అధికార భాషగా, బోధన మాధ్యమంగా రూపొందుతూ ఉన్న ఈ భాష ''లోతు పాతులు'' బాగా తెలియాలంటే దీనిలో ఎంతో కృషి జరగాలి. సాహిత్యం భాషకున్న ఏక దేశమైన శక్తినే ప్రకటిస్తుంది గాని, శాస్త్రాది విషయాలను వివరించడంలో భాషకున్న సామర్థ్యాన్ని ప్రకటించదు. ఈ సామర్థ్యాన్ని-తెలుగు విషయంలో - మనం పూర్తిగా తెలుసుకోలేదు. దీనికి శాస్త్ర గ్రంథాలు తెలుగులో వ్రాయడమే కాకుండా, పరిశోధనల ద్వారా దాని నిగూఢ శక్తిని బహిర్గతం చేయాలి. ఇప్పటి కింకా తెలుగు ద్రావిడ భాషా కుటుంబనికి చెందినదా? కాదా? అనే వివాదం సమసిపోలేదంటే, మనం ఇంకా ఎంత కృషిచేసి అభిప్రాయ భేదం లేకుండా చేయాలో ఆలోచించండి. ఇతర ద్రావిడ భాషలలో తెలుగున కున్న స్థానాన్ని గురించి కొంత కృషి జరిగిన మాట నిజమే. కాని మూల ద్రావిడ భాషకు దానికి ఉన్న సంబంధాన్ని గురించి ఇంకా విస్తృత పరిధిలో పరిశోధనలు జరగవలసి ఉన్నాయి. ఇదే విధంగా, మాండలికాలను గురించి ఇంకా పరిశోధన జరగవలసి ఉంది. ఈ పరిశోధనను పెద్ద ఎత్తున తలపెట్టిన తెలుగు అకాడమి వంటి సంస్థలు, తమ కార్యక్రమాదులను ప్రణాళికలను సత్వరం పూర్తి చేసుకోవడానికి సంపూర్ణ సహకారం ప్రజలు, ప్రభుత్వం, విశ్వవిద్యాలయాలు ఇయ్యాలి. ఈ కృషిలో నిమగ్నులై ఉన్నవారు జిల్లాల వారీగా వ్రాసిన వర్ణనాత్మక వ్యాకరణాలకు, ఇతర కృషులకు విశ్వవిద్యాలయాల వారు రిసెర్చి డిగ్రీలు ఇచ్చి వారిని ఉత్సాహ పరచాలి. ప్రాకృతాలకు ద్రావిడ భాషలకు ఉన్న సంబంధాన్ని గురించి జరిగిన పరిశోధనలు చాలా తక్కువ. ఇంక తెలుగు విషయంలో ఈ దృష్టి కోణం నుండి తగినంత పరిశోధన జరగలేదనడం పరమ సత్యం. సంప్రదాయానుసారంగా వ్యాకరణాలు వ్రాసిన వారంతా సంస్కృతం తరవాత ప్రాకృతం (ప్రాకృత భాషలు) తెలుగు మీద విశేష ప్రభావం చూపిందంటూనే వచ్చారు. ఇది కేవలం శబ్ద జాలానికి మాత్రమే పరిమితమై ఉందా? లేదా నిర్మాణం మీద కూడా ప్రభావం చూపించిందా? అనే సంగతి తేలవలసి ఉంది. వ్యాకరణానికి, ఛందస్సునకు సంబంధించిన పరిశోధనను కూడా భాషా విషయకమైన పరిశోధనగా గ్రహించి చూస్తే ఈ రంగాలలో జరిగిన పరిశోధన తక్కువ అనిపిస్తుంది. ఈ రంగాలలో తులనాత్మక పరిశోధనలు జరగాలి. తెలుగు వ్యాకరణాన్ని సంస్కృత వ్యాకరణంతో పోల్చి చూచే వారి సంఖ్యే అధికం గాని, ఇతర ద్రావిడ భాషలతో పోల్చిచూచే వారి సంఖ్య అత్యల్పం. ఆధునిక భాషాశాస్త్ర దృష్టితో కొన్ని అంశాలను పోల్చి చూపిన పరిశోధనలు జరిగాయి; జరుగుతున్నాయి కూడా. కాని, సంప్రదాయ పద్ధతిలో బయలు దేరిన తెలుగు వ్యాకరణాలను ఇతర ద్రావిడ భాషల వ్యాకరణాలతో పోల్చి చేసిన పరిశోధన లేదంటే అతిశయోక్తి కాదు. ఉన్నా ఆ కృషి అత్యల్పం. దీనికి ముఖ్య కారణం, తెలుగుతోబాటు

ఇతర ద్రావిడ భాషలు-ఒక్కటైనా - బాగా తెలిసిన వారి సంఖ్య తక్కువగా ఉండడమే !

ఇదే విధంగా తెలుగును భాషాశాస్త్ర దృష్ట్యా హిందూర్య భాషలతో పోల్చిచూచే, చూచిన పరిశోధనలు చాలా తక్కువ. హిందీతో కొంత పోల్చిచూచిన, చూచే పరిశోధనలు జరుగుతున్నాయి గాని, మనకు సన్నిహితమైన మరాఠీ, ఒరియా భాషలతో పోల్చి చూచే పరిశోధనలు లేనేలేవు. యుగ యుగాలుగా మరాఠీ ప్రాంతంతో (ఆంధ్ర సాతవాహనుల కాలం నుండి) మనకు సంబంధం ఉంది. కాని, భాషా విషయకమైన తులనాత్మక కృషి మృగ్యం. ఇది ఒరియా విషయంలోనూ సత్యమే ! ఈ వాక్యాలన్నీ ఛందస్సునకు వర్తిస్తాయి. తెలుగులో ఛందః పరిశోధన చేసిన విద్వాంసులు చాలా మంది ఉన్నారు. కాని, తులనాత్మకంగా జరిగిన పరిశోధన తక్కువ. దీనికి కూడా కారణం ఇతర భాషల పరిచయం లేకపోవడమే అంటే అది సత్యదూరం కాదు.

భాష సామాజిక విలువ ఉన్న ఒక గొప్ప సాధనం. సామాజిక మానవీయ శాస్త్రాలలో ఆధునిక యుగంలో జరిగిన పరిశోధనల దృష్ట్యా, లభించిన ఫలితాల దృష్ట్యా భాషాధ్యయనం జరగాలి. ఇటీవలి కాలంలో-గ్రామ నామాలు, ఇంటి పేర్లు మొదలైన వాటి మీద జరుగుతూ ఉన్న కృషి, జరిగిన కృషి - వీటికి ఈ శాస్త్రాలతో ఉన్న సంబంధాన్ని తెలిపేదిగా ఉంది. భాషను ఆధునికీకరణం చేసే విషయంలో జరగవలసిన కృషిని కూడా వివిధాంశాలుగా విభజించి పరిశోధనలు చేయించాలి. రిసెర్చి డిగ్రీ లభించే అవకాశాలు ఉన్నప్పుడు చాలామంది యువకులు, యువతులు ఈ విషయమై కృషి చేయడానికి ఉద్యుక్తులవుతారు. ఆధునిక శాస్త్రాల అధ్యయనం తెలుగులో పెద్దపెట్టున జరుగుతూ ఉన్నప్పుడు పరిభాషకు సంబంధించిన కృషి ఇతోధికంగా జరగవలసిఉంది. భాషాశాస్త్రాధ్యయనం చేసిన వారివల్ల ఈ కృషి శాస్త్రీయంగా జరగడానికి అవకాశాలు ఎక్కువ గనక వారిని ప్రోత్సహించాలి. మన కళాశాలలలో విశ్వవిద్యాలయాలలో భాషా శాస్త్రాన్ని ఇంకా సంశయాత్ములై చూస్తున్నారు. భాషా శాస్త్రాధ్యయనం జరగవలసినంత జరగడం లేదు. ఈ శాస్త్రమేదో పై నుండి వచ్చి మనమీద పడిందనుకొనే వారున్నారు. ఇది నిజం కాదు. మన సంస్కృత వ్యాకరణం, దానిమీద వచ్చిన ఆర్షిక గ్రంథాలు ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలతో సంవదించే ఉన్నాయి. ఒక విధంగా చూస్తే, ఆధునిక యుగంలో పాశ్చాత్య దేశాలలో భాషా శాస్త్రాధ్యయనానికి పునాదులు, ఆ దేశస్థులు పంథొమ్మిదో శతాబ్దిలో సంస్కృత భాషా ప్రాశస్త్యాన్ని గుర్తించినప్పుడే పడ్డాయి. ఇది పాశ్చాత్య భాషా శాస్త్రవేత్త లందరూ గుర్తించి చెప్పిందే! లియోనార్డ్ బ్లూంఫీల్డ్ అనే ప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త సంస్కృతాన్ని గురించి, పాణిని వ్యాకరణం గురించి ఇలా అన్నాడు:

"It was in India, however, that there arose a body of knowledge which was destined to revolutionize European ideas about language...... This grammar(the grammar of Panini) which dates from somewhere round 350 to 250 B. C. is one of the greatest monuments of human intelligence...No other language, to this day, has been so perfectly described ...round the beginning of the nineteenth century, the knowledge of Sanskrit became part of the equipment of European scholars.......The Indian grammar presented to European eyes, for the first time, a complete and accurate description of a language, based not upon theory

but upon observation...The Hindu grammar taught Europeans to analyse speech-forms.''

ఆధునిక భాషా శాస్త్రవేత్తల కందరికి ఇది తెలిసిన విషయమే. కాబట్టి, భాషాశాస్త్రాధ్యయనానికి మన విద్యాసంస్థలలో సముచితస్థానాన్ని ఇచ్చి భాషలో పరిశోధనలను ప్రోత్సహించవలసి ఉంది. బ్లూంఫీల్డ్ వాక్యాలను బట్టి చూస్తే మన నైపుణ్యమే విదేశాలకు పోయి కొత్తగా ముస్తాబయి వచ్చిందని తెలుస్తుంది.

బోధనమాధ్యంగా, అధికార భాషగా తెలుగునకు ప్రాముఖ్యం రావడం వల్ల - తెలుగు మాతృభాషగా చదివేవారికి, తెలుగు ద్వితీయ భాషగా చదివే వారికీ కూడా భిన్న భిన్న పద్ధతులలో, విధానాలలో తెలుగును బోధించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఈ ఆవశ్యకతకు తగినన్ని అవకాశాలూ బోధన సామగ్రీ లేవు. భాషలో పరిశోధన చేసేవారు ఈ రంగాలకు చెందిన అంశాలను గ్రహించి కూడా పరిశోధనలు సాగించి జిజ్ఞాసువులకు సామగ్రిని సంపాదించిపెట్టాలి. వివిధ భాషల నిర్మాణాల సమాన వ్యతిరేకతలను పరిశీలించి ద్వితీయ భాషగా తెలుగు బోధించే వారికి సాయపడాలి. ఇదే విధంగా, ప్రయోజనాత్మకమైన తెలుగును అభివృద్ధి చేసే మార్గాలను అన్వేషించి అన్ని స్థాయులలో తెలుగు బోధనమాధ్యంగా పరిణతి పొందడానికి తోడ్పడాలి. చక్కగా చదువుకొన్న యువకులు, యువతులు, ఈ యుగంలో డిగ్రీలు ఆవశ్యకం గనుక, డిగ్రీల కోసమైనప్పటికీ విశేష ప్రచారంలో లేని పరిశోధనాంశాలను భాషా పరిశోధనకు ఎన్నుకొని భాషాసేవ చేయాలి. ఇదే విధంగా, ఈ యుగంలో అనువాదానికి విశేష ప్రాముఖ్యం ఉంది గనుక- అనువాదం కేవలం ''కళ'' అని విడిచి వేయకుండా — దాని పద్ధతులను శాస్త్రీయంగా అధ్యయనం చేయవలసి ఉంది. సాహిత్య అకాడమీ దూరదృష్టివల్ల విద్వాంసుల సాయంవల్ల - వృత్తిపదకోశాలు, కవుల రచనల పదప్రయోగకోశాలు మొదలైన కోశ వాఙ్మయం తెలుగులో బాగా అభివృద్ధికి వచ్చింది. వ్యుత్పత్తి కోశాలు వస్తున్నాయి; కొన్ని వచ్చాయి. తెలుగులో అర్థ నిర్మాణానికి సంబంధించిన పరిశోధన కొంత జరిగింది కాని ఇంకా జరగవలసింది చాలా ఉంది. శైలీ శాస్త్ర సంబంధమైన పరిశోధన తెలుగులో అంతగా జరగలేదు. తెలుగు ''ప్రసంగ'' స్వరూపం మీద పని ఇప్పుడిప్పుడే ప్రారంభమయిందని చెప్పాలి. ఆధునికమైన అవసరాలకు అనుగుణంగా తెలుగు భాష మారవలసి నప్పుడు, మారుతూ ఉన్నప్పుడు తదనుగుణంగా, దానికి సాయం చేసేదిగా పరిశోధన మారాలి. పత్రికల భాష మీద జరగవలసినంత కృషి ఇంకా జరగలేదు. ఆధునిక యుగంలో ప్రసార సాధనాలకు విశేష ప్రాముఖ్యం ఉంది గనుక పత్రికల భాష మీద, రేడియో ప్రసంగాలు, వార్తలు మొదలైన వాటి భాష మీద పరిశోధన విస్తృతంగా జరిగిన నాడు, ఆ ఫలితాల సాయంతో, ఈ సాధనాలతో భాషను ఇంకా సమర్థవంతంగా వాడడం సాధ్యమవుతుంది. ప్రమాణ భాషను నిర్ణయించే విషయంలో, వయోజన విద్యకు అనువైన పుస్తకాల రచనకు పనికివచ్చే సామగ్రి తయారీలో పరిశోధకులు సాయం చేయాలి. పరిశోధన విషయం ఏదైనా అది ఉత్తమ శ్రేణి పరిశోధన అయితే పరిశోధకునకు ''డిగ్రీ'' ఇచ్చి విశ్వవిద్యాలయాలు ప్రోత్సహించాలి. అప్పుడే పరిశోధన అభివృద్ధి పొందుతుంది. భాషకు సంబంధించిన సమస్త విషయాలలో పరిశోధనకు అవకాశాలున్నాయి గనుక పరిశోధకులు అవసరమైతే కొంత సాహసించి - ప్రచారంలో లేని విషయాలను ఎన్నుకోవడం విషయంలో - కృషి చేయవలసి ఉంది. భాషకు సామాజిక మానవీయ శాస్త్రాలతో పోరాని సంబంధం ఉంది గనుక, భాషా శాస్త్రాధ్యయనానికి అవి తోడ్పడతాయి గనుక వీటికి సంబంధించిన విషయాలను కూడా పరిశోధనకు తీసుకోవాలి. వీటితో బాటు ప్రాచీన భారతీయ తత్త్వవేత్తలు భాషా సంబంధమై చేసిన వివరణలను ఆధునిక శాస్త్రదృష్ట్యా పరిశీలించవలసి ఉంది. ఈ విషయమై భర్తృహరి మొద

లైన వారి భావాలు, భాట్ట సంప్రదాయానికి చెందిన మీమాంసకుల భావాలు, ప్రాభాకర సంప్రదాయానికి చెందిన మీమాంసకుల ఊహలు, నైయాయికుల భావాలు, నవ్య న్యాయానికి చెందిన వారి భావాలు గ్రహించి కృషి చేయవలసి ఉంది. తెలుగు భాషతో సంబంధం లేని కేవల భాషాశాస్త్ర శాఖ ఆధ్వర్యంలో జరిగే పరిశోధనల వంటివి. సమర్థులైన పరిశోధకులు తెలుగు శాఖ ఆధ్వర్యంలో చేస్తే దోషం లేదు గదా!

తెలుగుభాషకు సంబంధించిన పరిశోధన-నిఘంటు నిర్మాణంమొదలుకొని న్యాయపదకోశ నిర్మాణంవరకు; చిన్నపిల్లల శబ్దజాలాన్ని పరిశీలించడం మొదలుకొని వయోజనులకు పనికివచ్చే శబ్దజాల పరిశీలన వరకు; తెలుగువారికి ప్రయోజనాత్మకమైన తెలుగు బోధించడం మొదలు తెలుగురాని వారికి తెలుగు ద్వితీయ భాషగా బోధించే వరకు; అర్థ నిర్మాణ పరిశీలన మొదలు అనువాద ప్రక్రియకు సంబంధించిన విషయాల వరకు; వృత్తి పదకోశాలు మొదలుకొని వ్యుత్పత్తి కోశాల వరకు; పదవాక్య నిర్మాణాల పరిశీలన మొదలుకొని కవుల పద ప్రయోగకోశాల వరకు; మాటల పౌరాతన్య పరిశీలన మొదలుకొని పద గణాంకశాస్త్రం (Lexicostatistics) వరకు, ప్రాదేశిక మాండలిక భాషా పరిశీలన మొదలుకొని వర్గ మాండలిక భాషా పరిశీలన వరకు - కొనసాగుతూ ఉన్నది. ఇంకా ఎన్నో మనం తొక్కిచూడని కొత్త పుంతలున్నాయి. పై వాటిలో కూడా సంపూర్ణంగా సమగ్రంగా పరిశోధనలు జరగని భాగాలున్నాయి. భాషా విషయకమైన మన జ్ఞానం అభివృద్ధి పొందుతున్న కొలదీ మనకు తెలియని అనేకాంశాలు బయటపడి మన అజ్ఞానం కూడా పెరుగుతూ ఉంటుంది. ఎప్పుడూ తెలిసిన విషయాలు తక్కువ. తెలియని విషయాలు ఎక్కువ. ఈ సత్యాన్ని గుర్తించడమే ప్రగతి.

మనం ఇదివరలో అనుకొన్నట్లు, తెలుగులో సాహిత్య విషయాలమీద పరిశోధన బాగా జరిగింది. కాని, ఇంకా తొక్కవలసిన కొత్త పుంతలు చాలా ఉన్నాయి. జరిగిన జరుగుతూఉన్న పరిశోధన విషయాలను ఒక్కసారి పరిశీలిస్తే మనకు ముందుగా కనబడేది- సాహిత్యాల విషయమై తులనాత్మక పరిశీలన చాలా తక్కువగా జరిగిందనేది. నూటికి పదిమంది పరిశోధకులు కూడా ఈ మార్గంలో పరిశోధన చేయడం లేదు. బహు భాషా సాహిత్యాలున్న మన దేశంలో భారతీయ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసే వారందరూ ముఖ్యంగా ముందుగా గుర్తించవలసిందిది, పరస్పరావగాహనకు ఇతర సాహిత్యాల-పోనీ, ఒక్క సాహిత్యమైనా - పరిశోధన చేయవలసి ఉంది. అన్నీ ఒకేలాగా వీలుకావు. అవకాశం ఉన్నంతవరకు వాటి కలరూపు - మూలం చదవడానికి తగినశక్తి లేకపోయినా గ్రహించాలి. భారతీయ నాగరకతా సంస్కృతులలో అంతర్గర్భితంగా ఏకత ఉండడంవల్ల, ప్రాదేశిక భేదాలను గుర్తించడం వల్ల చాలా లాభం ఉంటుంది. ఈ ఏకతను గుర్తించినందు వల్లనే కేంద్ర సాహిత్య అకాడమి వారు, భారతీయ సాహిత్యాన్ని ఇలా నిర్వచించారు: Indian literature is one though written in many langueges. సాహిత్యాల తులనాత్మకాధ్యయనంవల్ల, అనేకత్వంలో ఉన్న ఏకత్వం బయట పడడమేకాక, ప్రాదేశిక సాహిత్య వైవిధ్యం కూడా వ్యక్తమవుతుంది. ఇది ముఖ్యమైన విషయం. ఈ తులనాత్మక పరిశీలన - సజాతీయ ద్రావిడ భాషల సాహిత్యాల విషయంలోనే కాకుండా, హింద్వార్య భాషా సాహిత్యాల విషయంలోనూ చేయవలసిందే. సజాతీయ ద్రావిడ భాషల సాహిత్యాలను పోల్చి చూడడంవల్ల, సాహిత్యాలకు సహజమైన వైవిధ్యం ఉన్నా ఒకే భాషా కుటుంబానికి చెందిన సాహిత్యాలు కావడంవల్ల వాటిలో-విజాతీయ భాషల సాహిత్యాలలో కానరాని - సన్నిహితత్వం ఏమైనా ఉందా అనే విషయం పరిశీలించవచ్చును. విభిన్న కుటుంబాలకు చెందిన భారతీయ భాషల సాహిత్యాలను తులనాత్మకంగా పరిశీలించడం వల్ల-అందరూ ఉందని అంగీకరించిన - ఏకత్వం, ఏమైనా ఉందా? ఉంటే

ఏ ప్రమాణంలో ఉంది ! అనే విషయాలు గ్రహించవచ్చును. హింద్వార్య భాషలలో హిందీ భాషా సాహిత్యాన్ని తులనాత్మక పరిశీలనకు మన వారు ఎక్కువగా తీసుకొన్నారు. అయితే, ఈ పరిశోధన వల్ల వచ్చిన సిద్ధాంత వ్యాసాలు ఎక్కువగా హిందీలో వచ్చాయి. హిందీ నేర్చిన తెలుగువారు వ్రాసినవి ఇవి చాలావరకు. తెలుగులో వచ్చినవి చాలా తక్కువ. మన పరిశోధకులను విశేషంగా ఆకర్షించిన ఆర్యభాష సంస్కృతం. ఇది సహజంకూడా. కాని, ఇక్కడ కూడా తులనాత్మక అధ్యయనంలో శాస్త్ర విషయాలు తీసుకొని తులనాత్మకంగా వ్రాసినవారూ ఎక్కువ మంది లేరు. శాస్త్ర విషయాలలో మన వారిని విశేషంగా ఆకర్షించినవి ఆలంకారిక విషయాలు. రసం, ధ్వని, అలంకారాలు - అనే మూడింటిని వేరు వేరు విషయాలుగా గ్రహించి సిద్ధాంత వ్యాసాలు వ్రాసిన వారున్నారు. కొంతవరకు సంస్కృత వ్యాకరణానికి సంబంధించిన పరిశోధన చేసిన వారున్నారు. వేదాంతాది శాస్త్రాల జోలికిపోయిన వారి సంఖ్య అత్యల్పం. జైన బౌద్ధాది మతాల ప్రభావం ఇతర ద్రావిడ భాషల మీద - ముఖ్యంగా తమిళ కన్నడ భాషలమీద- ప్రస్ఫుటంగా ఉంది. తెలుగు విషయమై రూఢిగా చెప్పలేము. ఉన్న కొంచెం- జైనం- విషయం పరిశోధించినవారు లేరనే చెప్పాలి. వీరశైవం, వైష్ణవం తెలుగు సాహిత్యం మీద చూపిన ప్రభావాలను వివిధ కాలాలను, కవులను దృష్టిలో పెట్టుకొని పరిశోధనలు చేసినవా రున్నారు. కాని, కన్నడ తమిళ భాషలలోనున్న ఆయా రచనలను గ్రహించి తులనాత్మకంగా పరిశోధించి సిద్ధాంత వ్యాసాలు వ్రాసిన వారి సంఖ్య వేళ్లమీద లెక్క పెట్టవచ్చును. ఆ వ్రాసిన వారిలో కూడా ఉభయ భాషా సాహిత్యాలు క్షుణ్ణంగా తెలిసి చేసిన వారి సంఖ్య ఇంకా తక్కువ. ఉన్నవారందరూ ఇంచుమించుగా రాష్ట్రేతర ప్రాంతాలవారే. దీనిలో దోషం లేదుగాని, పరిశోధనకోసం భాషలు నేర్చుకొని పరిశోధన చేసే వారి పట్టుదల మనవారిలో కనబడదు. ఈ సందర్భంలో, భారతీయ భాషలు నేర్చుకొని తులనాత్మక విషయాలమీద పరిశోధనలు సాగించే పాశ్చాత్యులను పరిగణించి చూస్తే మన కొరత కొట్టవచ్చినట్లు కనబడుతుంది.

ఈ తులనాత్మక పరిశోధన విషయంలో- తెలుగుదేశానికి ఇరుగు పొరుగు హింద్వార్య భాషలైన మరాఠీ, ఒరియా భాషా సాహిత్యాలను గ్రహించి పరిశోధనలు చేసిన వారు, లేరన్నా తప్పు లేనంత తక్కువ మంది ఉన్నారు. ఇదే విధంగా వంగ భాషా సాహిత్యాలను మన కవుల రచనలను- మన రచయితలలో చాలామందికి, వంగభాషా సాహిత్యాలతో ప్రత్యక్ష పరిచయం ఉంది- పోల్చి చూచిన వారే తక్కువ. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికార భాష కాగా, దాని తరువాత ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన ఉర్దూ భాషా సాహిత్య ప్రభావాలకు సంబంధించిన పని చాలా తక్కువ జరిగింది. ఉర్దూ మొదలైన భాషలలోని శబ్దాలు తెలుగులో చేరడాన్ని గురించి జరిగినంతగా పరిశోధనలు, ఉర్దూ కవుల భావాలు తెలుగు కవులను లేదా తెలుగు కవుల భావాలు ఉర్దూ కవులను ఎంతగా ప్రభావితం చేశాయో వివరించి చూపే పరిశోధనలు జరగలేదు. ఇవి జరగవలసినవి. ఈ సందర్భంలోనే స్వాతంత్ర సమరానికి సంబంధించిన రచనల ప్రస్తావన చేయాలి.

మన స్వాతంత్రోద్యమం వల్ల ప్రభావితులై వివిధ భాషలలో కవులు రచనలు సాగించారు. ఈ జాతీయ గీతాల తులనాత్మక అధ్యయనం చేయాలి. వీటిలో సన్నిహితంగా ఉన్న భాషల సాహిత్యాలను పోల్చి చూస్తే సత్ఫలితాలు లభిస్తాయి. ప్రజోద్యమాలలో పాల్గొన్న వివిధ భాషా భాషీయులైన కవులు వ్రాసిన గీతాలలో పరస్పర ప్రభావాలు ఉంటాయి. వీటిని పరిశీలించవలసి ఉంది. వీటిలో కొన్ని అంశాలు పరిమాణంలో అల్పంగా ఉంటే ఎమ్.ఫిల్., కోసం గ్రహించవచ్చును. విస్తృత పరిధిలో ఉన్న వాటిని పిహెచ్.డి., కి గ్రహించవచ్చు. ఈ సందర్భంలో

ఇంగ్లీషు మొదలైన పాశ్చాత్య భాషల విషయంకూడా కొంత చెప్పవలసిఉంది. మిగిలిన పాశ్చాత్య భాషలవల్ల ప్రభావితులైన మన రచయితలు కూడా చాలావరకు వాటి ఇంగ్లీషు అనువాదాల వల్లనే అని గ్రహించాలి. పాశ్చాత్య దేశాలలోని రాజకీయార్థిక సామాజిక ఉద్యమాల ప్రభావాన్ని మనం వారు కొంత పరిశీలించారు. దీనిలో ముఖ్యంగా మార్క్సిజమ్ ప్రభావాన్ని అనేకులు విశేషంగా పరిశీలించి సిద్ధాంత వ్యాసాలు వ్రాశారు. ఇదిగాక, ప్రజాస్వామ్య భావాలవల్ల ఉద్దీపితులై రచనలు సాగించిన వారిని గురించి తక్కువగా ఉంది.

వివిధభాషల సాహిత్యాలలోని-పద, జానపద సాహిత్యాలలోని మూలభూతమైన ధర్మాలను ప్రదర్శించే పరిశోధనలు జరిగినప్పుడు, జానపద కళలను పోల్చి చూచినప్పుడు మన సంస్కృతి ఏకోన్ముఖత్వం అర్థమవుతుంది. ఇదేవిధంగా మన పురాణాలను వ్యష్టిగా పరిశీలించి చూడడమూ సంస్కృత మూలాలతో పోల్చడం జరిగినంతగా ఇతర భాషలలోని పురాణాంతో పోల్చి చూడడం ఎక్కువగా జరగలేదు. ద్రావిడభాషలలో జరిగినంతవరకు - తమిళ, కన్నడ గ్రంథాలతో పోల్చి చూడడమే జరిగిందిగాని, మలయాళంతో అసలు జరగలేదనే చెప్పాలి. సంస్కృత భాషా సాహిత్యాల ప్రభావం మలయాళం మీద విశేషంగా పడింది. తెలుగుమీదా పడింది. ఈ ప్రభావంలోని సాదృశ్య వైరుధ్యాలను పరిశీలించవలసి ఉంది. తెలుగువారు భారతదేశంలో ప్రతి రాష్ట్రంలోనూ ఉన్నారు. దక్షిణాది రాష్ట్రాలలో చాలా అధికసంఖ్యలో ఉన్నారు. దీనికున్న చారిత్రక కారణాలు మనకు తెలుసును. ఆ యా ప్రాంతాలవారి తెలుగుభాషను భాషా శాస్త్రవేత్తలు కొంతకు కొంత పరిశోధించారు. కాని, వారా ప్రాంతాలలో సృష్టించిన సాహిత్యాన్ని మన పరిశోధకులు పరిశీలించినా, దాన్ని తెలుగు సాహిత్యంలో ఒక అంగంగా - కొన్ని భేదాలను వైశిష్ట్యాలను అంగీకరించినా-గ్రహించారేగాని, ఆయా ప్రాంతాల సాంస్కృతిక ప్రభావాలు ఎలా పని చేశాయో అంతగా పరిశీలించలేదు. అంటే-తమిళ ప్రాంతంలో పుట్టి పెరిగిన తెలుగుకవిలో-మామూలుగా అందరూ అనుకొనే తమిళ శబ్దాలు, పలుకుబడులు మొదలైన బాహ్యవిషయాలు కాకుండా-తమిళదనం ఎంత ఉందో పరిశీలించవలసి ఉంది. ఇది ఉదాహరణ కోసం ఇచ్చిందని గ్రహించాలి. ముఖ్యంగా ఈ పరిశోధన సంగీత సాహిత్యాంకు సమప్రాధాన్యమున్న రచనల విషయంలో జరగాలి.

ఇంక రచనలలోని తాత్త్విక విషయాంకు వద్దాము. మన మహాకవులందరూ మహావిద్వాంసులు. భారతీయ తత్త్వశాస్త్ర విషయాలలో నిష్ణాతులు. మహాభారతాది గ్రంథాలలో ఆయా విషయాలు ఏ విధంగా ప్రదర్శితాలో పరిశీలించిన పరిశోధన గ్రంథాలు కొన్ని వచ్చాయి. ఆముక్తమాల్యాది ప్రబంధాలను కూడా ఈ దృష్టితో పరిశీలించిన సిద్ధాంతగ్రంథాలు కొన్ని వచ్చాయి. కాని ఇవి చాలవు. ఇతర కవుల విషయంలోను ఈ పరిశోధన జరగాలి. ప్రాదేశిక భాషలలో కవులు రచనలు సాగించినా, అందరినీ ప్రభావితం చేసిన మన వేదాంతాది విషయాలు సంస్కృతంలో ఉన్నాయి గనుక అవి అందరికీ సమానం. ప్రాదేశిక ధార్మిక ఉద్యమాల ప్రభావం-ఉదాహరణకు-చైతన్య మహాప్రభువు, వల్లభాచార్యులు మొదలైనవారి ప్రభావం-వారి సమకాలికులైన మన కవుల మీద ఏమైనా పడిందా? లేదా? మొదలైన విషయాలు పరిశీలించాలి. ఇదిగాక, ఇస్లాంతో మనకు- ఇంచుమించుగా- వేయి సంవత్సరాల పరిచయం, సంపర్కం. ఆ మతానికి చెందిన సూఫీ సిద్ధ పురుషుల సమాధులు తెలుగుదేశం నాలుగు చెరగులా ఉన్నాయి. వారి ప్రభావం- వేమన మొదలైన వారి మీదపడిందని నమ్మేవారున్నారు. ఆయన విగ్రహారాధనాదికాన్ని అంత తీవ్రంగా నిరసించడానికి కారణం ఇస్లాం ప్రభావం అనేవారున్నారు. వీరబ్రహ్మేంద్రస్వామి ప్రభావం నాటి నుండి నేటిదాకా కనబడుతోంది. ముస్లిం నవాబు

లతో ఆయనకు ప్రత్యక్ష సంబంధం ఉంది. ఆయనకు సిద్ధయ్య మొదలైన ఇస్లాం మతంలో పుట్టిన శిష్యులున్నారు. అలాగే క్రైస్తవ మతం ఉంది. క్రైస్తవులు కాని రచయితలమీద దాని ప్రభావం - నైతికపు విలువలు మొదలైనవాటివల్ల పడినది - ఎంతవరకు పడినదో పరిశీలించవలసి ఉంది. తాత్త్వికంగా ఈ విషయాలన్నీ సాహిత్యంమీద నెరపిన ప్రభావం దృష్ట్యా పరిశీలించవలసి ఉంది. పంధొమ్మిదో శతాబ్దిలో బయలుదేరిన సంస్కరణోద్యమాల ప్రభావం-ఆర్యసమాజం, బ్రహ్మ సమాజం మొదలైన వాటి ప్రభావం- పరిశీలించవలసి ఉంది. అలాగే, జానపద సాహిత్యంలో కనబడే అవైదిక, తాంత్రికాది విషయాలను ప్రత్యేకంగా పరిశీలించాలి. ఇంతవరకు మన పరిశోధకులు సాహిత్యంలో ఉన్న శబ్దార్థాలకు తమ పరిశోధనలో ఇచ్చినంత స్థానం తాత్త్వికాది విషయాల చర్చల కియ్యలేదు. భవిష్య పరిశోధకులు చేయవలసిన పనులలో ఇవి ముఖ్యమైనవి.

మన కవులందరూ ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు పుష్కలంగా ఉన్నవారు. వారి వ్యుత్పత్తిని మనం పరిశోధన దృష్టితో అంతగా పరిశీలించలేదు. వివిధ శాస్త్రాలలో వారి కున్న జ్ఞానం ఏ విధంగా రచనలలో వ్యక్తమయిందో వివరణాత్మకంగా మనం చాలావరకు తెలుసుకోలేదు. ఆయా ప్రాంతాలలో, ఆయా ఘట్టాలలో మన కవులు - అశ్వ గజ ఖడ్గాది విషయాలను గురించి వివరించారు. వాస్తు విజ్ఞానాన్ని ప్రదర్శించారు. వీటిని పరిశీలించవలసి ఉంది. ఉదాహరణగా-తిక్కన వ్రాసిన పద్యంలో తననుగురించి తాను ''కళావిదుఁడ'' అని చెప్పుకొన్నాడు. ఇది ఏయే భాగాలలో ఏ విధంగా ప్రతిబింబితమైంది? ఈ విధంగా తమ్ము గురించి తాము వ్రాసుకొన్న కవులు చాలామంది ఉన్నారు. ఆయా విషయాలు పరిశోధించాలి.

ఇంక, సామాజిక పరిస్థితులకు సాహిత్యానికి సంబంధం ఉందని అందరూ అంటున్నారు; మనమూ అంటున్నాము. దీన్ని ఆధునిక సామాజిక శాస్త్రం సిద్ధంచేసిన ఉపకరణాలతో పరిశీలించాలి. సాహిత్యం మీద ఆర్థిక పరిస్థితుల ప్రభావం ఎప్పుడూ ఉంది. ఈ యుగంలో మార్క్సు ప్రభావం క్రింద ఈ విషయాన్ని అందరూ ఒప్పుకొని మాట్లాడుతున్నారు. ప్రాచీన, మధ్యయుగీన సాహిత్యాల మీద - మార్గదేశి సాహిత్యాల మీద-దీని ప్రభావాన్ని పరిలిశీంచాలి, దేశి సాహిత్యంలో ఇది స్ఫుటంగా కనబడుతుంది. దీన్ని శాస్త్రీయంగా పరిశీలించాలి. పీడితతాడిత జనం సృష్టించిన సాహిత్యాన్ని ఈ దృష్టితో కూలంకషంగా పరిశీలించి సాహిత్య చరిత్ర వ్రాసేటప్పుడు పరిశోధన ఫలితాలను వినియోగించుకోవాలి.

ఇంక ఒక్క ముఖ్యాంశం ఉంది. బ్రౌనుదొర వందల కొలది జాబులను, ఆనాటి పత్రికల (వర్తమాన తరంగిణి మొదలైనవి) లోని వ్యాసాలను, తదితర సామగ్రిని సంపుటాలుగా చేయించి ఉంచాడు. పంధొమ్మిదో శతాబ్ది సామాజిక చరిత్రను వ్రాయాలన్నా, ఆనాటి విద్వాంసులను గురించి వ్రాయాలన్నా ఇది పరిశీలించి తీరవలసిందే. ఈ సామగ్రిని-మద్రాసులో ఉన్నదానిని-వినియోగించుకొని ఇటు భాషలోను, అటు సాహిత్యంలోను, ఆ వైపు సమాజంలోను ఉన్న విశేషాలను వ్యక్తం చేసే పరిశోధనలు చేయవచ్చును. పంధొమ్మిదో శతాబ్ది భారతదేశ చరిత్రలోనే విశిష్టమైంది. ఇరవయ్యో శతాబ్దిలో మనకు స్వాతంత్ర్యాన్ని తెచ్చిన అన్ని ఉద్యమాలు అప్పుడే పుట్టాయి. అందరు నాయకులు, కవులు, తత్త్వవేత్తలు-ఇరవయ్యో శతాబ్దిని ప్రభావితం చేసినవారు-అపుడే జన్మించారు. ఆ శతాబ్దికి చెందిన తెలుగు దేశ సాహిత్య చరిత్ర అనర్ఘరత్నం. కాని, మనకు తెలియదు. మనకు చాలా సన్నిహితం. అవ్యవహిత పూర్వమైన శతాబ్ది. కాని, చాలాదూరం. పరిశోధన విశేషంగా జరగవలసిన శతాబ్ది అది. మనకు ముద్రణ వచ్చి విజృంభించిన శతాబ్ది అది. కాని, మన ముద్రణను గురించి మనకెంత తెలుసును? స్వదేశ సంస్థానాలను గురించి మన కెంత తెలుసును? ఇవన్నీ

చేసిన సాహిత్య సేవ మీద ''ఒక్క పుస్తకం'' ఉంది! ఒక్కొక్క సంస్థానం మీద ఒక్కొక్క పుస్తకం వ్రాయవచ్చు. ఒక యువ పరిశోధకుడు తనకు బాగా తెలిసిన లేదా నచ్చిన సంస్థాన ప్రాంతానికి పోయి సమస్త విషయాలు సేకరించి ''డిగ్రీ''కి పనికి వచ్చే ఒక సిద్ధాంత వ్యాసం వ్రాయవచ్చుగదా! ఇదే విధంగా, మన రాష్ట్రంలోని జిల్లాలలో కొన్నింటిలో పంధొమ్మిదో శతాబ్దిలో చరిత్ర సృష్టించబడింది. తూర్పిండియా కంపెనీ పాలనలో ప్రముఖ పాత్ర వహించిన జిల్లాలు కొన్ని ఉన్నాయి. కొందరు దుబాసీలు, కొన్ని కుటుంబాలు విశేష ప్రాముఖ్యానికి రావడంజరిగింది. వీటికిసంబంధించిన రికార్డులున్నాయి. ఈ రంగంలో కూడా పరిశోధనావకాశాలు చాలా ఉన్నాయి.

తెలుగు దేశంలో ఎన్నో దేవాలయాలు, మఠాలు ఉన్నాయి. వాటి చరిత్రలు పరిశోధనాంశాలుగా స్వీకరించి మంచి గ్రంథాలు వ్రాయవచ్చు. ప్రాచీన తాళపత్ర గ్రంథాలను సంపాదించి సముచిత వ్యాఖ్యానంతో, ఉపోద్ఘాతంతో ప్రతి గ్రంథాన్ని ముద్రణకు సిద్ధం చేస్తే కూడా "డిగ్రీ'' రావడానికి తగిన కృషి అవుతుంది. విశ్వవిద్యాలయాలు కూడా ఈ పనిని ప్రోత్సహించాలి. అప్పుడు, అసూర్యంపశ్యలుగా పడి ఉన్న ఎన్నో తాళపత్ర గ్రంథాలు వెలుగు చూచి పరిశోధకులకు సాయపడతాయి. ఆంధ్రేతర భాషలలో తెలుగు మీద కృషి ప్రపంచంలో ఎక్కడ జరిగినా ఆ ఫలితాలను తెలుగు ద్వారా తెలుగు ప్రజలకు అందుబాటులోనికి తేవడానికి మన భవిష్యత్కార్యక్రమాలలో అవకాశాలు కల్పించాలి.

భాషా సాహిత్య విషయాల మీద జరిగే పరిశోధనల యందు విషయానికి సంబంధించి తొక్కదగిన, తొక్కగలిగిన కొత్త పుంతలను కొన్నింటిని పరిశీలించుకొన్నాము. పరిశోధన భాష, పరిశోధన ప్రదర్శనం-అనేవి సిద్ధాంత వ్యాస రచనకు ముఖ్యమైనవి గనుక వాటిని కూడా కొంత పరిశీలిద్దాము. విషయం ఏదైనా పనికి వచ్చే ముఖ్య సూత్రాలు కొన్ని ఉన్నాయి. ఇవి సామాన్య సూత్రాలు గనుక వీటిని పాటించడం భావి పరిశోధకులకు లాభదాయకమవుతుంది. ఇప్పుడూ ఉత్తమ పరిశోధకుల రచనలలో ఇవి కనబడతాయి. పరిశోధన ఫలితాలను వివరించే సిద్ధాంత వ్యాసంలోని భాష సరళంగా ఉండాలి. విషయాన్ని గ్రహించడంలో పరిశోధకునకు స్వేచ్ఛ ఉన్నా, పరిశోధనకు విలువ నిచ్చే మూల సూత్రాలలో విషయానికి సంబంధించినవి, భాషకు సంబంధించినవి అని వేరు వేరుగా ఉన్నాయనే విషయాన్ని గుర్తించాలి. వీటి ప్రదర్శన అంటే వీటి వ్యక్తీకరణే! ఈ మూల సూత్రాలను చక్కగా పాటిస్తే సిద్ధాంత గ్రంథానికి శాస్త్ర రూపం వస్తుంది. మమతా విరహితంగా విషయాన్ని పరిశీలించి సముచితమైన భాషలో పరిశోధనాంశాలను ప్రదర్శిస్తే శాస్త్రీయంగా ఉంటుంది. పరిశోధన బుద్ధి సంబంధి అనే విషయాన్ని విస్మరించ కూడదు. మనం గ్రహించిన విషయం హృదయ సంబంధి అయినా పరిశోధనకు వస్తువైనప్పుడు దాని విషయ వివరణ బుద్ధిగమ్యగానే ఉంటుంది. సిద్ధాంత వ్యాసాన్ని సాధారణంగా ఎవరూ ఆనందం కోసం చదవరు. విజ్ఞానం కోసం చదువుతారు. ఇది మనం గుర్తిస్తే దాని భాష, దాని ప్రదర్శన ఎలా ఉండాలో మనకే స్వయంవ్యక్తమవుతుంది.

విషయానికి సంబంధించిన మూలసూత్రాలలో మొదటిది యథార్థత. పరిశోధనకు ఇది ఆధారం. తాను చెప్పే విషయం యథార్థమైందా? కాదా? (తనకు లభించిన ఆధారాలనుబట్టి చూచినప్పుడు తెలిసే విషయం ఇది) అని సూక్ష్మంగా పరిశీలించి తనకు తృప్తి కలిగిన తరువాతనే దాన్ని ప్రదర్శించాలి. తానొక విషయాన్ని యథార్థ మని అనుకోవడానికి తావిచ్చే ఆధారాలను వివరించాలి. దీనివల్ల సిద్ధాంత వ్యాసానికి గౌరవం వస్తుంది. భావి పరిశోధకులకు ఉపయోగంగా ఉంటుంది.

